## మా శర్మ రచనలు

నవ రసగంగాధరము

ఆంధ్రప్రతాపరుద్రీయము

ధ్వ ని సా ర ము

కావ్యప్రకాశము

రసగంగాధరమణి

అలంకారసూత్రము

నా ట్య వే ద ము

వక్రోక్తిజీవితము

భావప్రకాశనము

శ్రీ భరతముని నాట్యశాస్త్రము

# నా ట్య వే ద ము

అభినవభారతీ వివృతి

అ భి న వ భా ష్య ము


తర్కవాచార్య మహోపాధ్యాయ లాక్షణికశిరోమణి సాహిత్యాచార్య

శాస్త్రవిశారద సాహిత్యవిద్యాభాషాప్రవీణ

జమ్మలమడక మాధవరామ శర్మ

ఏ. సి. కాలేజి : గుంటూరు

ఆంధ్రప్రదేశసాహిత్యఅకాడమి

ఆంధ్ర : అకడమికు కౌన్సిలు : సభ్యుడు

# స్వాయత్తాధికారము

శాలి : ౧౮౭౯

"సంకోచ్య కించిదిహ కించిదథ ప్రసార్య
ప్రక్షిప్య కించిదివ కించిదథాప్యపాస్య
విద్వాన్ జనో భవతు సంప్రతి శాస్త్రకృచ్ఛ
సమ్యక్ప్రచారణవిధిః స హి జన్మ తస్య"

"నాదాతుం న చ దాతుమేష సులభః కిం కృత్యమేతావతే
త్యేవం తర్కయతా జనేన శకలీకృత్యాథ యద్గృహ్యాసే
మాణిక్యాచల! చంద్రకీర్తిరచలా సా తే జగద్వ్యాపినీ
లోకస్యైవ మితోపయోగరసికస్యైషా పునః ఖండనా"

వెల్కం ప్రెస్ (ప్రైవేటు) లిమిటెడ్
గుంటూరు

# నా ట్యో ప హా రః

ప్రజ్ఞావైభవధర్మతత్వగహనం నాట్యం కలాలాలితం
సంవాదేన నవార్థసారమహితం రస్యం సచేతోజనైః
స్పందశ్రీకథయా సుధార్పితపదం మాధుర్యధుర్యం మహః
స్వాంతర్గాఢపరామృతం రసయతాం బ్రహ్మామృతం శ్రీఫలం

కలావిజ్ఞాన సర్వస్వం సంవిదుల్లాస సుందరం
మహార్థప్రత్యయోపేతం నాట్యవేదముపాస్మహే

*నాట్యాచార్య శ్రీబందా కనకలింగేశ్వరాయ*

యత్సత్వతత్వసౌందర్యం రంగోత్తేజప్రకాశనం
యదాంగిక కలా న్యాసో లోకాభినయదర్శనం
యద్వాచికవిధాశోభా స్వాంధ్రతాముద్రయాన్వితా
యదాహార్యవిధిజ్ఞానం నాట్యధర్మీయతి స్ఫుటం
సోఽయం వంపారు బందా శ్రీ వంశ ముక్తాఫలం ప్రధీః
లోకనాట్యకథావేదీ హేమ ప్రత్యుప్త భూషణం
పర్యుత్సుకమనా మిత్రం నాట్యవేదస్య వేదనే
నాట్యవేదోఽయమాత్మశ్రీ వినేయ వినయాకృతిః
యదీయం నాట్యసౌభాగ్యమాంధ్రాణామాత్మగౌరవం
తదీయ హార్దభావ శ్రీ సంవిల్లాలిత్య భావితః
సోహం కావ్యకలాభిజ్ఞ సచేతో మోదదాయినం
నాట్యవేద ముపారూఢనాట్యాచార్య శ్రియోజ్జ్వలం
బందా కనకలింగాఖ్య శ్రీశ్వరాయ స్వసంవిదే
భావోపహార సంపత్తి స్వాత్మశ్రీకం నివేదయే.

# నాట్యవేదము

## అనంతరభాగవిషయము

జ్యేష్ఠాభినయము - హావభావస్వరూపము - శోభావిలాసాదులు - నాట్యాయితము - ఆలాపాదికము - సామాన్యాభినయము - ఆత్మస్థపరస్థనిర్దేశము - స్త్రీలశీలములు - బాహ్యాభ్యంతర కామచర్య - దూతీకృత్యము - రాజోపచారము - కామినీకామతంత్రము - ఉపచారవిధి - స్త్రీపురుషప్రకృతి - పరివారప్రకృతి - అభినయసంపత్తి - చిత్రాభినయము - లోకప్రశంస - పరభావప్రవేశము - శిష్యాచార్యవిశేషములు - ప్రయోగసిద్ధి - ప్రాశ్నికాదులు - సమృద్ధి

అభినయనిర్వచనము - ఆంగికభేదములు - శిరోభినయము - రసదృష్టి - పుటకర్మ - వినియోగము - నృత్తహస్తములు - సంయుతాసంయుతవిధానములు - ఉరఃకర్మాదులు - చారీవిధానములు - భౌమాకాశవిశేషములు - మండలవికల్పనము - పాత్రలగతివిధి - స్త్రీగతులు - ఆసనవిధి - కక్ష్యావిభాగము - ద్వీపాంతరవాసికక్ష్యారీతి - ఆంగికప్రాధాన్యము - దృష్టిప్రతిష్ఠ - ప్రవృత్తిలక్షణము - లోకధర్మినాట్యధర్మి

వాగభినయము - సంస్కృతపాఠ్యము - అక్షరవిభాగము - ఛందఃప్రాధాన్యము - వృత్తగతి - ఆర్యాప్రస్తరము - లక్షణాలంకారములు - దోషగుణములు - భాషాలక్షణము - కాకుప్రక్రియ - పాఠ్యధర్మములు - ఆతోద్యవిధి - జాతిస్వరవిధానము - వంశవిశేషములు - తాలవ్యంజనము - ధ్రువావిధానము - వికల్పప్రకారములు - ధ్రువాప్రపంచము - వాద్యప్రక్రియ - ప్రకృతిపరిశీలనము - భూమికాపాత్రవికల్పము - నాట్యావతారము - నాట్యసంచారము - నాట్యవేదమహత్త్వము

# సచేతోహృదయ సంవాదము

## ౧ శ్రీ వేలూరి శివరామశాస్త్రి

నాట్యవేదరచనాకాలము - భరతుడు వ్యాఖ్యాతలు - అభినవ గుప్తపాదులు - గ్రంథములు - మాహేశ్వరుడు - అభినవుని అభినవత్వము నాట్యశాస్త్రము - భరతనాట్య శాస్త్రసంగ్రహము -

**నాట్య వేద రచనా కాలము:** లక్షణము పుట్టుటకు మున్న లక్ష్యము ఉండవలయు ననుట నాట్యవేదమువంటి సమగ్రమగు లక్షణగ్రంథము ఉదయించుటకుమున్నె నాటకసమృద్ధి ఉండితీరవలయును.

నాట్యశాస్త్రమున అచటవచట యాస్కుని నిరుక్తము పోలిక లున్నవి. మఱియు నిది ఐంద్రవ్యాకరణపు పొలిమేరలలో సొన సొన పొడచూపును.

రామాయణము భారతము ఈ రెండును నటులను నాటకములను గూడ నెరుగును. పడమటి విమర్శకు లివి యెరుగవని వ్రాసిరి కాని బాలయుద్ధ - కాండలను శాంతిపర్వమును చూచునది. వాత్స్యాయనుడు ప్రేక్షణీయకమును కుశీలవులను జెప్పుటయ కాక వారికిని ప్రేక్షకులకును గల సౌహార్దమును తెలిపెను.

అశ్వఘోషుడు సారిపుత్త్రమున భరతు ననుగమించిన జాడ కలదు. కాళిదాసు భరతుని మునిగా పేర్కొని అతని కింద్రునితో సంబంధమును విక్రమోర్వశీయమున వర్ణించెను. మఱియు నితని యుభయత్రయియు నాట్యవేదమును మన్నించును.

మఱి పాణిని నాట్యసంబంధమున వేదముతో తాకుగల శిలాలిని మఱియు కృశాశ్వునే చెప్పి గాని భరతుని చెప్పలేదు. భారతుల జెప్పలేదు. భారతీయుల నైన (భరతార్థమున) చెప్పలేదు.

భాసుడు పాణిని వరరుచి మొదలగు వారికి ముందు ఒక్క నాటకమేని మనకు కనబడదు. మనకు కాన వచ్చున వన్నియు భాసున కిటీవలివి. కావున సరియగు సాధన సామగ్రి దొరకనంత వఱకును నాట్యవేదరచనాకాలమును భాసునకును కాళిదాసునకును నడుమ నున్న కాలమునుగా చెప్పవలసి యున్నది. కాని యీ హేతువాదముచే హృదయమును నమ్మింపగలుగు టెటులు? భాసునకును కాళిదాసునకును నడుమ పట్టుమని పదుగురు కవులేని ఇపుడు మనకు కనబడరు. కనబడిన నాటకములే మహాశాస్త్రలక్షణములకు వటధానిక యేని కాగలుగునా? కానఎవరు ఏ హేతువాద మవలంబించి నాట్యరచనాకాలమును క్రీ. పె. ఐదవ శతి కంటించిరో వారు మరల ఆ హేతువాదమునె యవలంబించి అంతకు కడువెనుకనె ఎన్నో నాటకములు ఉండెననియు ఏ కారణముననో కాలగ్రస్తము లాయెననియు దాన నీ శాస్త్రము ప్రాచీనతరమనియు నిర్ణయించుట లెస్స. దొరికిన వ్రాతప్రతులు ౪౦ టిలో ఏ రెండును పోలమియు, కొన్నిట వందలాదిశ్లోకములు పెచ్చుగను [illegible] లొచ్చుగను నుండుటయు

దీనికి దోహదము. ఇది కాక ఈ శాస్త్రమునందే కల "కారిక అనువంశ్య సూత్రానుబద్ధ" మొదలగు పలుపదములు పూర్వాచార్యాది ప్రసక్తములు. వానికి నవరసనిర్ణేతగా జెప్పబడెను. మరియు భరతశిష్యులలో కోహలుడు కాక మరొక ప్రాచీన కోహలుడు వినబడుచున్నాడు. వీని నన్నిటిబట్టి దృష్టి సారించితి మేని అది హరిజమునకు దాకి వెనుకకు మరలదా?

భరతుడు : క్రీ. త. ఎనిమిదవశతాబ్ది కీవల నున్న పలువురాలంకారికులు-వీరిలో ముఖ్యముగా శారదాతనయుడు మొదలుగా ఇటీవలివారు ఇరువురు భరతులను పేరుకొనినారు. ఒక డాది లేక వృద్ధభరతుడు. ఆది భరతుడు ౧౨ వేల గ్రంథము నాట్యవేదమునకు కర్త. మరి ఉపపదము లేని భరతుడు దానికే సంగ్రహము ౬ వేల గ్రంథము ౩౬ అధ్యాయములును గల నాట్యశాస్త్రమునకును కర్త. శ్రీమదభినవగుప్తపాదాచార్యులవారు దీనిని షట్సాహస్రి అనియు షట్త్రింశి అనియు నాట్యవేద మనియు వ్యవహరించిరి. ఇతడు భరతుని మునిగా జెప్పెను. ఇటీవల వారును భరతుని మునిగను సూత్రకారుని గను వాడిరి.

ఈ గ్రంథము వలన గాని యితరుల వలన గాని భరతుని గురించి యేమియు తెలియరాదు. భ భరతములో ర రాగములో త తాళములో నితడు లయము చెందుటతో చెల్లు. నాట్యశాస్త్రమున భరతశిష్యుల చేయిగూడ కలదని కింవదంతి కలదనియు అది నాలుక బుజమున వేసికొని తిరుగు పండితంమన్యుల మాటయనియు అభినవుడనెను. ఇది యెటులున్నను ప్రకృతముపలబ్ధమైన ౩౬ అధ్యాయములును క్రీ. త. ఎనిమిదవ శతాబ్ది మొదలుకొని నేటివఱకును చెరగక ఉన్నటుల భామహుడు మొదలుగా శాకుంతలవ్యాఖ్యాత రాఘవభట్టు వరకు గల ఉదాహర్తలవల్ల తెల్లము.

ప్రథమాధ్యాయము భరతుని బ్రహ్మలోకమున కెత్తుకొని పోవుట చేతనో, మిగిలిన నాలు గధ్యాయములును అంతగా శాస్త్రీయములు కాకపోవుట చేతనో ప్రక్షిప్తములని మ. మ. శ్రీ కాణే గారు. ఏ హేతువులచే వీరిటులనిరో ఆ హేతువుల నేతనే మరికొన్ని అధ్యాయములును ప్రక్షిప్తములని అనవలసి యుండును. ప్రక్షిప్తములు లేవని నే ననను గాని "హేతు వేకదేశమందే వ్యాపించు"నని అనుగమ మొనరించుట న్యాయమునకు తలపోటు. మరియు నాట్యశాస్త్రము నందె నటార్థమున భరతశబ్దముపయుక్తము. చూ. ౧౩-౬౬ యాజ్ఞ్యవల్క్యస్మృతిగత మగు;

యథా హి భరతో వర్ణైర్వర్ణయత్యాత్మన స్తనుమ్
నానారూపాణి కుర్వాణ స్తథాత్మా కర్మజా స్తమాః (త్రృ. ౧౬౨)

ఈ శ్లోకమున వాడబడిన భరతపదము నటార్థకము. ఈ స్మృతి నాట్యశాస్త్రము కంటె ప్రాచీనతరము. బహురూపమిశ్రుడు రాఘవభట్టు మొదలగు ఇటీవలివారు వృద్ధభరత భరత సూత్రకృన్మూలభరతాదిపదములను భిన్నభిన్నభరతులందు వాడిరి. శాన భరతుని వీరినుండి విడబరచి చూప దుశ్శక మని మ. మ. శ్రీ కాణేగారు. ఇది

నిక్కమే. మరియు సదాశివ భరతము, బ్రహ్మభరతము వీని వ్రాతప్రతుల తాటి యాకులు కొన్నిదొరికినవున్నవి. ప్రకృతనాట్యశాస్త్రము ద్వాదశసహస్రికి సంగ్రహమని కొందఱయూహ:

ఇది యిటుండగా శ్రీ కాణేగారి వలెనే మొదటి ఐదధ్యాయములు "నంది భరత"మనికొందరూహించిరి. ఇంకను ఇట్టియూహలు ప్రాచీనవులవె కలవు, పై ఊహకు విరుద్ధముగ "రూపకనిరూపణీయమ్ భరతః, రసాధికారికం నందికేశ్వరః" భరతుడు నాటకములను, రసమును నందికేశ్వరుడును నిరూపించెనని రాజశేఖరుడు. ఇట్టి యూహ లన్నియు భరతుడు అతిప్రాచీనమని ఘోషింపవా ?

వ్యాఖ్యాతలు : వ్యాఖ్యానము లేనిచో నాట్యశాస్త్రముండియు మనకు ప్రయోజనములేదు. ఈ నాట్యశాస్త్ర మొక ప్రపంచము. ఈ గ్రంథము కాశ్మీరములందే పుట్టి అచటనే పూడిపోయి మరల నెటులెటులో క్రీ. శ. ఏడవశతిలో కవిత్వమును సాహిత్యమును కలకలలాడినపు డనేకవ్యాఖ్యలతో విస్తరించి ఆసేతుశీతాచలము వ్యాపించినటులు కనపడు చున్నది. దీనిమీద వ్యాఖ్యాతల యెడ —

వ్యాఖ్యాతరో భారతీయే లోల్లటో భట్టశంకుకః
భట్టాభినవగుప్తశ్చ శ్రీమత్కీర్తిధరోఽపరః

అను ఈ శ్లోకము కనబడుచున్నది. వీరే కాక దత్తిలాచార్యులు, రాహులుడు భట్టయంత్రుడు, నాన్యదేవుడు ౧౨ శతికి చెందినవాడును వార్తికకారుడును అగు హర్షుడు (కనోజాధిపతి) అనుమానముగా కోహలుడు, భట్టనాయకు డాదిగా పలువురు కనపడుచున్నారు. వీరిలో కొందరు నిండుగను, కొందరు పాతిక, పఱకగను, వ్యాఖ్యలొనరించియుందురని కొందరి అభిప్రాయము. వీరందరిలో శ్రీమదభినవగుప్తపాదాచార్యులవారి వ్యాఖ్య "అ భి న వ భా ర తి" నేటికిని అభినవము. ఇదియు సంపూర్ణము కాదు. కాని ఇపుడు ఉపలబ్ధమయినది సుబహుళము. ఇది మహాభాష్యమునకు దీటు.

ఈ వ్యాఖ్యాత లందరు నించుమించు ౯-౧౧ శతాబ్దుల నడిమివారు. దశరూపకము కావ్యానుశాసనము, సాహిత్యదర్పణము, నాట్యశాస్త్రము నందలి కొన్నిఘట్టములకు వ్యాఖ్యానప్రాయములు. నాట్యశాస్త్రము నందలి రససూత్రమె ధ్వనిప్రస్థానమునకు మార్గదర్శి. అనందవర్ధనుని వెలుగునె భట్టతోతు డభినవున కిచ్చెను. అతడు సహృదయలోకమునకు "లోచన" మిచ్చెను.

<u>అ భి న వ గు ప్త పా దు లు</u>:- వేయినోళ్ళతో చెప్పదగిన నితని నొకనోటనే చెప్పవలసి వచ్చెను. అత్రిగుప్తుడు మూలపురుషుడుగా గల ఇతని తండ్రి నరసింహగుప్తుడు. తల్లి విమలకల. తమ్ముడు మనోరథగుప్తుడు. బృహద్విమర్శిని మొదలగు నితని గ్రంథములబట్టి ఇతడు క్రీ.శ. ౯౫౦-౧౦౧౫ సంవత్సరముల నడుమ నుండెనని నిర్ణయింప వచ్చును.

మేడమీద ఒక పాఠశాలలో నితని చదువు. ఇతడు సహపాఠుల నోరుకట్టెడి వాడట. కాన ఒజ్జలితనికి "బాలవలభీభుజంగః" "ముంజూరు లేతపాము" చిన్న చూరుతాచు అని బిరుదు నిచ్చిరట; ఈ విషయమునే మమ్మటుడు "అభినవగోపానసీగుప్తపాదః" అని చమత్కరించినటులు వామనుడు కావ్యప్రకాశటీకలో వ్రాసెను. అభినవుడు మాత్రము తన తంత్రాలోకమున "అభినవస్య కృతిస్సేయం యస్యోదితా గురుభిరాఖ్యా" ఇది నా ఒజ్జలు పెట్టిన పేరు అని చెప్పుకొనెను. —"పిత్రా ష శబ్దగహనే కృతసంప్రవేశః" అని ఇతడందే చెప్పుకొనుటచే వ్యాకరణపాండిత్యమును జూచి "అభినవపతంజలి" అనునర్థమున ఈ నామకరణము జరిగియుండునని కొందరనిరి. ఈ బిరుద మితని అసలు పేరును మ్రింగి వైచెను.

బాల్యముననే అభినవగుప్తునకు మాతృవియోగ మొదవెను. "మాతా వ్యయూయుజదముం కిల బాల్య ఏవ" ఆదుఃఖానలము నితడు అమితమగు విద్యాతృష్ణచే మ్రింగ యత్నించెను. దాన గురువు లితనికి పెక్కురు - వ్యాకరణమున తండ్రి నరసింహగుప్త - ద్వైతాద్వైతమున వామనాథుడు - ధ్వనియందు - ఇందురాజు - నాట్యమున భట్టతోతుడు - బ్రహ్మవిద్యలో భూతిరాజు - ద్వైతశైవమున భూతిరాజతనయుడు. క్రమ త్రికమార్గముల లక్ష్మణగుప్త. ఇతడు మరి పదమువ్వురఁ బేర్కొనెను గాని వారేచదువులం దొజ్జలో చెప్పలేదు. మరియు ఆశ్చర్య మేమనగా ఇతడు జైనబౌద్ధముల గూడ నొజ్జలొద్ద జదివి—

> అహమప్యతఏవాధశ్శాస్త్రదృష్టికుతూహలాత్
> నాస్తికార్హతబౌద్ధాదీనుపాధ్యాయాన సేవిషమ్.

అని తన కళాతృష్ణను వెల్లడించెను.

గ్రంథములు:- అభినవుడు తంత్రమునం దారు గ్రంధములను అలంకారమున రెండింటిని (కావ్యకౌతుకవ్యాఖ్య దొరకలేదు) వేదాంతములం దెనిమిదింటిని చిన చిన్న స్తోత్రాదుల నెనిమిదింటిని, ఉరమరిక యిరువది నాలుగు రచించెను. అందరకు లోచనము అభినవభారతియె తెలియునుగాని, మిగిలిన వాని సంగతి తెలియదు. అభినవుని యీ యలంకారగ్రంధములే కాక తంత్రాలోకము, బృహద్విమర్శిని, లేక ప్రత్యభిజ్ఞావిమర్శిని, మాలినీవిజయవార్తికము, మొదలగు గొప్ప గ్రంధములు తప్పక చదువదగినవి. ఇతని ప్రతిపాదనవైచిత్రి చూచినచో మమ్మటు డనినటులుకాక "అభినవ పతంజలి" అనునర్థమునందే గురువు లితనికి అభినవగుప్తపాద బిరుద మిడియుందురని అనుకొనకమానము.

మహేశ్వరుడు:- ఇతడిన్ని శాస్త్రములం దాచార్యుడగుటయ కాదు. మరియొక విశేష మున్నది. మాతృవిషాద మితని వెన్నాడుచునే యుండెను. దాన మిగుల విరక్తి చెందెను. తల్లిబెంగ తన మెడకపలుపని తెలుసుకొనెను. "మాతా పరం బంధురితి ప్రవాదః స్నేహోऽతిగాఢీకురుతే హి పాశాన్" ఇంటిని చుట్టములను పెండ్లిని

విడనాడెను. —"దారాసుతప్రభృతిబంధుకథామనాప్తః" క్రమమార్గమున త్రికమున సాధన చేసి తృప్తిసనక తుదకు శంభునాథునికడ కులమార్గమున పరమశివు నెరిగి కొనెను. పోనుపోను మహామహిమమండితు డాయెను. తుట్టతుదకు పండ్రెండువందల మంది భక్తులతో భైరవగుహసొచ్చి మరల రాలేదు. ఈగుహ శ్రీనగరము గుల్మార్గ్ ల నడుమ మాగమ్ అనుపల్లెకు గవ్యూతిదూరమున నున్నదని కాశ్మీరములో కథా కోవిదులగు గ్రామవృద్ధులు చెప్పుదురు. కాశ్మీరముల జూడబోయిన వారీ గుహ చూడక మానరు.

అభినవుని అభినవత్వము:- బిడ్డలు లేమి శ్రీవిమలానరసింహగుప్తులు శైరవు నారాధింపగా నభినవుడు కలిగెనట! "క్రొత్తయ్య" యని మనము పేరు పెట్టుకొనుచో ఏ యర్థ మొదవునో ఆ యర్థమే యీ అభినవనామధేయమునకును ముమ్మొదట నొదవి యుండ నోపును గాని యితడన్ని విధముల నభినవుడుగా కానిపించును. కాశ్మీరములందు ౭ శతాబ్ది మొ॥ ౧౧ శ. వరకు వివిధశాస్త్రములం దవిచ్ఛిన్నముగా మహాతరంగములు నిట్టపాడిచెను. అభినవునిసమయమున బహుశాస్త్రములం దాచార్యులు కలరు. —"తస్య మే సర్వశిష్యస్య నోపదేశదరిద్రతా—" అందరకు శిష్యుడ నయిన నాకు ఉపదేశమున లేవడి లేదు.' అని యితడు తన సకలశాస్త్రాభిజ్ఞతి చెప్పుకొనును.

ఖండనలో పలువురాచార్యులు ప్రతిపక్షుల తూలనాడుదురు. పరాత్రీశికావివరణము నందితడు —"పదవాక్యసంస్కారము లేనివారితోడి గోష్ఠి లజ్జాకరము"ని ప్రతిపక్షి నెత్తిపొడిచినను పదపటి అభినవభారతీరచనలో "సత్పురుషుల మతముల దూషింపను గాని శోధింతును" అని యనెను. అభినవునకు గురువు దైవము. ఏ గురు వేయే విశేషముల జెప్పెనో ఆ యా విశేషముల ఆ యా గురువుల పేరుచెప్పి వ్రాయసము సాగించును. ఇది మూఢభక్తి కాదు. భట్టతోతుడును సోమానందనాథుడును ఇతనికి నెత్తిమీదివారు. ఇటులైనను తనకు సమ్మతిలేనిచో చెప్పకవిడువడు. —"సరియగు పాఠమును ఎత్తి విరోధములనుడిపి లక్ష్యము ననుసరించి ముళ్లను విడదీసి పునరుక్తుల కేకవాక్యత చూపి తేటతెల్లముగా వ్యాఖ్య వ్రాయుదు" నని చెప్పి అభినవు డటులే చేసెను.

ఇతని అభినవత కొక చిన్న ఉదాహరణము —విశ్వకర్మ "నాట్యమండపము నిర్మించితి" నని మనవిచేయగా బ్రహ్మ దేవతలతో తటాన అటకు జని కని "దేవతలారా! మీలో చంద్రు డీ మండపమును లోకపాలురు దిక్కులను మారుతులు విదిక్కులను మిత్రుడు నేపథ్యగృహమును వహ్ని వేదికను ఉపకరణములతోడి చర్మవాద్యముల సరంజామాను దివౌకసులు కాపాడుదురు గాక." అని నాట్యశాస్త్రమునందున్న కథకు =౧నాట్యగృహాధికారికి (General manager) సౌమ్యత వలయునని (నాట్యశాలాపతియగు. దివాకరుడను బ్రాహ్మణుని కడ నాట్య వేదమును చదువుకొంటి

వని భావప్రకాశకర్త శారదాతనయుడు) ౨. నాట్యశాలలో తగినంతగాలి ఉండవలె యునని, 3. నగనుర్రట మెరయునంత వెలుగుతో నేపథ్యగృహ మొప్పవలె ననియు, ౪. రంగవేదికాధ్యక్షుడు (Stage manager) కరకుగా నుండున దనియు, ౫. శబ్దము మంద్రముగను గంభీరముగను ఉండుటకు మేఘముల ఉనికి ఉండవలయునని అభినవుడర్థము చెప్పెను. విక్రమోర్వశీయమున కాళిదాసు, కుట్టనీమతమున దామోదర గుప్తమె. కవులద్భుతత్వఖ్యాపనకు బ్రహ్మభరతకథను యథాశ్రుతముగా గ్రహించి నను, తానును సంప్రదాయమును రక్షించుకొనినను, అభినవుడు భరతుని నూరుగురు పుత్రులకును, అచ్చరలుమె. వారికి నాట్యానుగుణమును హృదయంగమము నగు నర్థము చెప్పను. కొన్నికొన్ని విషయములు నవ్యులకును అతినవ్యముగ కనబడగల వగుటచే సర్వథా ఇత డ భి న వు డు.

మనువు నాట్యమును నిషేధించినను అభినవుడు యాజ్ఞవల్క్యుని స్వీకరించి నటులు స్వోచితధర్మమును వీడ నక్కర లేదనియు, వారి కృత్యాకృత్యములతో మన కేమి పని యనియు, పైగా నిది వారికి మోక్షప్రద మనియు ఉదారత వెల్లడించును. (నటులపతనము గురించి భరతుడు 3౬ అధ్యాయమున చెప్పెను)

ప్రత్యభిజ్ఞాబీజమును తమ కెంతయో కాలము ముందే అభిజ్ఞానశాకుంతలమున నాటెనని కాబోలు నభినవునకు కాళిదాసుపై ఇబ్బడి మోజు. కావుననే అభినవభార తిలో —రమ్యాణి వీక్ష్య”— ఇత్యాదికము వివరించును.

నా ట్య శా స్త్ర ము:- దీనియందు నృత్తము నృత్యము నాట్యము అనగా కావ్య ములు నాటకములు గానము, మొదలగు వానికి సంబంధించిన అశేషవిశేషములు కలవు. విషయము లివియకదా యని అనుకొందము. ఇందలి విషయసూచిక చదివినచో కనులు పెద్దవగును. భగవంతుని ఉదరము ప్రవేశించిన మార్కండేయుడే ఈ గ్రంథ మున ప్రవేశించిన చదువరి. ఇటీవల పరశ్శతములుగా రచితములగు నలంకారగ్రంథము లన్నియు దీని విభూతియే. వేయేల? ఇట్టి గ్రంథ మే భాష యందును ఏ ఖండము నందును లేదు.

దీని యారంభము చూడ పురాణ మనిపించును. ఈ మొదటి కట్టుకత యందం తట రసభావనాటసామాజికాదుల తత్త్వము గుప్తము చేయబడినది. మరియు వేదము బ్రహ్మముఖోద్భూతము. నాట్యమునకు వేదత్వకల్పనములో బ్రహ్మకర్తృతయు గుప్తమై యున్నది. దీని గూడ భరతుడే రచించి యుండ వచ్చుననియు, వృద్ధాచారా దుల ననుసరించి వృద్ధభరతున కీ భరతుడు బ్రహ్మలోకాది సంబంధము కల్పించె ననియు, నేలయూహింపరాదు? ఈ కథమాత్రము పిచ్చికథ కాదే! కాని యీ యూహ అభినవాది విరుద్ధము. ఇచట వరరుచి “ఉభయాభిసారిక” యందలి నిట వేశ్యాసంవాదములోని కుసుమపురమునగల ఇంద్రుని కోవెలను, అందు పురందర విజయమను నాటకపు పోటీని భావకులకు గుర్తొనరింతును. ఇది ఇటుండు గాక!

మనము ఈ నాట్యశాస్త్రమున ముందుముందులకు సాగుదుమేని ఒకానొక శాస్త్ర సముద్రతీరమున నిలుతుము. దాని మథింతుమేని నిస్సంశయముగా ఒకానొక వేదామృతము దొరకగలదు. వేదము చెప్పునది, తన్ను అన్నిటను, అన్నిటను తన్నును కనుగొను బ్రహ్మానందము లేక భూమ. నాట్యవేదము చెప్పునది స్వసంవిదానందము లేక ఆత్మానందము. మరియు శాంతరసపక్షమున తాత్కాలికమే యగు బ్రహ్మానందము. ఈ రెంటికిని గల పోలికలు నారయునది.

రసశాస్త్రము భరతోపజ్ఞముకాదు. భరతునకు మున్ను రసము నిరూపితము కాకపోదు. మరి దానియెడ మతభేదములు నెన్నియో దొరకక పోవు; కాని మనకే తెలసిన మేరలో భరతుడు రసప్రవక్త. ఇతడు రససూత్రముచెప్పి చక్కగా ఇటులు దృష్టాంతాదికముల వివరించెను. —

పలు సంబారువులతో సంస్కరించిన అన్నము, చక్కెర, పొంగలి, పులియోర మొదలగు వానిని నములుచు చవులూరగొనుచు హర్షాదుల ననుభవించు నటులు, సుమనస్కులగు ప్రేక్షకులు నానాభావములను, అభినయములను కనుచు, వినుచు, (దాన మెలకువ గొన్న) రత్యాదుల చవిగొనుచు హర్షాదుల ననుభవింతురు.

ఇచట నములుట దేహవ్యాపార మనియు చవులు గొనుట మనోవ్యాపార మనియు అభినవుడు నివేచించెను. (స్థాయిభావములు అనురసముల చవిగొందురు)

మరియు మరియొక దృష్టికోణము నుండి చూచి భరతుడు ప్రవచించిన రసస్వరూపమును అభినవుడు —"నటుడు నాటక మర్థము చేసుకొని నటించును. అతని వ్యాపారమునకు సాధారణీభూతమగు కవిసంవేదనము మూలము. కవిసంవిత్తే రసమని పరమార్థము. సామాజికుడు కవిసంవిద్వశుడై రసమును చవిగొనును" అనిచెప్పెను. (చూ. ౬,౩౮) ఈ రసవిషయ మంతయు శ్రీ మాధవ రామ శర్మగారు ౧౫౫-౧౯౮ పుటలలో వివరణ మొనరించిరి గాన నట నారయునది.

సాహిత్యశాస్త్రమున కంతకును రససూత్రమె హృదయము. ఈ సూత్రమును లొల్లటు, శంకుక, భట్టనాయకులు మూడురీతులుగా వ్యాకరించిరి. అభినవుడు మొదలుగా పలువురు వీరిని ఖండించిరి. వీని నన్నిటిని చక్కగా అవగతము చేసికొనుట మనసుకు పదను.

భరతు డెనిమిది రసములనే చెప్పెను. ౬-౧౬ చూ. అతనికి ముందున్న కవులాధికారికముగా శాంతరసమును-గాని వత్సలాదులనుగాని నాటకములందు నిరూపింపకుండదయే దీనికి కారణము కావచ్చును. సౌందరనందము, నాగానందము మొదలగు కావ్యములు భరతున కిటీవలవి. మరియు భరతుడు ఎనిమిది రసములకును జాతివృత్త్యాదులజెప్పి శాంతమునకు చెప్పలేదు. ఈ కారణములచే భరతు డెనిమిది రసములనే చెప్పెనని—ఒప్పెనని కాదు. పలువుర నిశ్చయము. భరతు డష్టరసములనే చెప్పెనను-చో భారతము నెరుగడని చెప్పవలెను. ఆనందుడు మొదలుగా ఈ వలివా

ర్ణించిరను భారతమున శాంత రస మొప్పిరి. కాని వీనికి విరుద్ధముగా కాళిదాసు వర రుచి అష్టరసములనే పేర్కొనిరి. కాగా భరతుడు నాట్యమున మాత్రమే ఒప్పలేదా? కాని భరతుడు శాంతము చెప్పకపోవుటయె ఎలుగెత్తి చెప్పుట అని అభినవు డనును. ఇది యిటుండగా నిర్ణయ సాగరముద్రిత మగు నాట్యశాస్త్రమున పాఠ్యగుణగణనమున వర్ణరసముల విషయమున "తత్రహాస్య శృంగారయోః స్వరితోదాత్తైః వీరరౌద్రాద్భుతేషూదాత్తకంపితైః, కరుణవాత్సల్యభయానకేష్వనుదాత్తస్వరితకంపితైర్వర్ణైః పాఠ్యముపపాదయతి" ఈ వాక్యమున వాత్సల్యము చెప్పబడినది. వత్సలరసమును భరత సమ్మతమని విశ్వనాధుడు 'సా. ద' "మునీంద్ర సమ్మతమతో వత్సలరసః" అని వ్రాసెను. ఇచట మునీంద్రపదము భరతార్థకము. అది యటుండె.

అభినవుడు శాంతరసమునకు భరతముద్ర యిచ్చి స్నేహకార్పణ్యశ్రద్ధాభక్తులను ఖండించి పదవరసమును వెలివేసెను. కాని నేటివరకు రసములు పెరుగుచునే యున్నవి. అభినవుడు శ్రద్ధారసమును భక్తిరసమును ఖండించినను రసరత్నహారమున శివరామ పండితుడు శ్రద్ధను, భక్తిరసాయనమున మధుసూదనుడును, ఉజ్జ్వలనీలమణియందు రూపగోస్వామియు లేవనెత్తిరి. రుద్రటుడు ప్రేయోరసమును ధనంజయుడు అక్షమృగయారసములను, భానుదత్తుడు మాయారసమును ఉద్భావనచేసిరి. భోజదేవుడు ఉదాత్తరసము లేక ఊర్జస్విని ఉద్ధతరసమును నిరూపించెను. మధురరసమును పలువురు స్థాపించిరి. అనుయోగద్వారసూత్రము వ్రీడనకరసమును చెప్పను. శ్రీచైతన్య దేవుని శిష్యుడు కవికర్ణపూరుడు ప్రేమరసమును ప్రతిపాదించెను.

భావము లన్నియు రసములుగావచ్చు నను నభిప్రాయము లొల్లటునితో మొదలై రుద్రటునితో పెరిగి భోజదేవుచే —"రత్యాదులు అతిప్రకర్ష కలుగుచో రసము లయినపుడు హర్షాదు లేమి యపరాధము చేసినవి? (శృంగారప్రకాశ") అని అనిపించెను.

ఇంకొకటి. రసమాత్ర మానందజనక మను ప్రాచీనుల యభిప్రాయముగూడ నిటీవలివారి గ్రంథములలో రసకలికా, శృంగారదర్పణ, నాట్యదర్పణ ములందు అంగీకరింప బడలేదు. మధుసూదనసరస్వతి భక్తిరసాయనమందు రెండవఉల్లాసమున సాంఖ్యము ననుసరించి వివిధరసానుభూతిలో తేడాగలదని అనెను.

భరత నాట్యశాస్త్ర సంగ్రహము:- సంస్కృతమునందలి నాట్యవేదమును శ్రీమాధవ రామశర్మగారు సంగ్రహించి శ్రీమదభినవగుప్తపాదుల మహాభాష్యముతో తెలిగించిరి. వీరిదివరకు రసగంగాధరమును, ప్రతాపరుద్రీయమును, ధ్వనిసారమును, కావ్యప్రకాశమును, అలంకారసూత్రమును, వక్రోక్తిజీవితమును, తెలుగున రచించుటజేసి ప్రకృతనాట్యవేదమును గూడ తెలిగింపదగినవారని వేరచెప్పవలసిన పనిలేదు. తెలుగుసేతలో దేనికష్టము దానిదేకాని, దీని తెలుగుసేత మాత్రము తెలిగించు వారికి మాత్రమె తెలియగలయది. శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారు దీనినెంతతొలచి అచ్చొ

ర్తించినను అచటనచట నింకను మసకగ సేయున్నది. దీని నవగాహన మొనరించుకొను టకు ముందు వెనుకలు కూర్చుకొని సమన్వితి చేయగల డేగచూపు కావలెను. ఇంతియ కాదు; శ్రీ మదభినవగుప్తపాదుల ప్రత్యభిజ్ఞాదివాదములనే స్తము ఉండవలె. ఈసామగ్రి కంటె ఎక్కుడే గల శ్రీమాధవరామశర్మగారు దీనిని మనకొసగి ఆంధ్రసరస్వతీశరీర మును బలిష్ఠమొనరించిరి.

చదువరు లలంకారశాస్త్రవ్యాఖ్యాతల నుండి కవుల భావనాశక్తినే గాక విషయమును విశదముగా విపులీకరించుశక్తిని గూడ కోరుకొందురు. వీరిలో భావనా శక్తిని మించిన విపులీకరణశక్తియు, విపులీకరణశక్తిని మించిన భావనాశక్తియు కలవు. "అందరు వత్సరాజులు కారని" శ్రీహర్షుడనినట్లును "అందరును.......కాళి దాసులు కారు" అని అభినవుడనినటులును, "అందరు అభినవులు కారు" అని శ్రీమాధవు లందురు. తాము అభినవులే అయిపోయినంతటిది వీరి భావన. ప్రాతిశాఖ్యము నందలి వీరి యీ వాక్యములు గమనింపగగినవి—"ఒకప్పుడొకపంక్తి భావము గోచ రము కాక దినము దినములు గడచినవి. ఏకదా భావాలోచనముతో నున్నప్పుడు.... .......వచ్చి తెలియజెప్పినట్లు భావించితిని. తెలిసినట్లుండ వ్రాసెడి వాడను......... ........ఏమి వ్రాయుదునో అభినవుడే యెరుంగును............అక్కడక్కడ అభినవుల భారతీపంక్తులు లేకపోయిన అభినవపంక్తులు వ్రాయుటకుత్సుకపడిన నా యభినవభావ భావితమయిన చిత్తరీతి యని నాకుగా నేనే వ్రాయుటయు నా కర్తవ్యముగ భావించితిని."

ఈపంక్తులలో కల్మషములేని వీరి తపస్య మనకు కనబడును. ఈ తపస్య ఇంకొకరు గుర్తింప గలయది కాదు. ప్రాతిశాఖ్యమునం దెల్లెడ నీవిషయమె ఒకభావన వెంట మరి యొక భావనగా సముద్రతరంగములవలె నిట్ట పొడుచుచున్నది.

వీరి బాస వేరు. కుంతకాభినవాదుల నిత్యమననము వలన నా కీ బాస యలవడిన దని వీరే వ్రాసికొనిరి. హేతువు కార్యము సరిగా నున్నవా యని తెలుసుకొనుట మనపని. మరియు చదువరు లా మబ్బులలో దూరి మిన్నులను మెరపులను చూడవలసి యుందురు. - 'శీహర్షా!' 'శ్రీకృష్ణరాయా!' తమరీ కొబ్బరికాయల కేల కృషి చేసితి రయ్యా! అని గొణిగికొనినను వానిలోని అమృతము గ్రోలని సహృదయు లుందురా? వీరిలో శ్రీహర్షుడు—పెట్టవలెననియె కొన్నిముళ్లు పెట్టితినని 'గ్రంథగ్రంధి రిహక్వచిత్' చెప్పనెచెప్పెను. ఇటులే శ్రీమాధవులుకూడ—నా ప్రయుక్త భాషను నే నారాధించుట నేర్చుకొంటిని. ఇది నా తపస్య-అని చెప్పుచున్నారు. ఇక మనకేదిదిక్కు? వీరిది మాత్రము నారికేళము కాదు. మరి ప్రబంధమును కాదు. ఇదియో శాస్త్రము. ఇది ఒకక్రొత్త సాహిత్య శైలి. మనము గుణలుబ్ధులమేని రచయిత మనస్సులో దూరుదము. దీని చదువను భావింపను మనమె అలవాటు పడినసరి!.

వీరుయేయే విషయములందు కౌశలముచూపిరో ఆ యా విషయములను మరియొక పోకగా ప్రాతిశాఖ్యము ౪౫౫ పుటలో ఉదాహరించియున్నారు. భావకులు వానిని పరిశీలింతురుగాక.

నాట్యగృహమునకు సంబంధించిన పెక్కు (పారిభాషికములవలె కానిపించు) పదముల కర్థము నిర్ణయించుటలో అభినవుడే బహువిధములుగా భావించెను. నాట్యగృహప్రతిమలను లోగడనే ఒకరు గీచి ముద్రింపించిరిగాని అవి సంతుష్టికరములుగా లేవు. రెండవసారి ముద్రించిన నేటి నాట్యశాస్త్రమున **Prof. D, Subba Rao. B. E. A. M; I. E. Dean, Faculty of Technology and Eugineering M. S. University of Baroda** గారి వ్యాఖ్యయు ప్రతిమలును, ఆరవ అనుబంధముగా పరిశిష్టమున చేర్పబడినవి. ఇందు మత్తవారణి మొదలగు క్లిష్టపదముల కర్థము విస్పష్టము. సదరు శ్రీసుబ్బారావుగారు తమవ్యాఖ్యాంతమున రచించిన;

"అభినవగుప్తోప్యనుభవలుప్తో హ్యానుమితమర్థం వితెరతి యత్ర
అభినవదృష్ట్యా సముదితమర్థం ప్రముదితబుద్ధ్యా విమృశత తత్ర"

అను శ్లోకము చదువ దగినది, ఆ యనుబంధమును వారి యనుజ్ఞతో ఇందు చేర్పతగియున్నది. మరియు ఈ ముద్రణమున అష్టోత్తరశతకరణములయు ప్రతిమలు కలవు. ఇవి చిదంబరమున నటరాజాలయము నందలివి. వీనిని గూడ యిందుజేర్పవలయును. దీనికెంతయో ధనము కావలయునని నేనెరుగకపోను. గాని, ఇది నా యభీష్టము.

వీరి శ్రమను నేను గుర్తించితిని. నేను లోటు వెడల శతముఖుడను. గుణముల యెడ వాచంయముడను.

నాట్యవేదము రెండవ సంపుటమునుగూడ కొలదినాళ్ళలో చూడగలమని ఆసింతము.

# *Sri, M. Anantasayanam Ayyangar*

## Speaker : LOKSABHA

*"Natyaveda is an interesting subject, but to write a treatise on that is rather difficult. The art is highly technical. You have tried to make it as easy as possible. I hope and trust that it will be extensively used by all lovers of art. The art of dancing is spreading in the country and every girl is expected to learn both singing and dancing, The edition that you have brought out is for scholars as well as for students. I hope that it will be found useful and will adorn the library of every cultural and educational institution."*

## కేరళ రాజ్యపాల

## శ్రీ బూర్గుల రామకృష్ణరావు

నాట్యవేదమును కేవలవిహంగమదృష్టితో చూడగలిగితిని. నాట్యము ప్రయోగాత్మకమయిన కళ. అది శాస్త్రీయసంప్రదాయవిలసితమయినచో పురుషార్థహేతువు. కళాసంప్రదాయము లతితీవ్రతతో మారుచున్న ఈ కాలములో శాస్త్రీయగ్రంథముల యావశ్యకత ఎంతేని కలదు. ముఖ్యముగా దక్షిణభారతమున భరతనాట్యము వివిధ రీతుల నభివృద్ధినొందుచున్న ఈ తరుణములో మీ నాట్యవేదము వంటి గ్రంథములు తత్కళోపాసకులకు ఎంతేని యుపకరింపగలవు. ఇందు "రససమీక్ష నాటక మీమాంస" వంటి ప్రకరణములు నాట్యరసపుష్టికి దోహదమిచ్చినవి.

శాస్త్రపరిభాషాజటిలములయిన గ్రంథముల ననువదించుట వాటిసారమునుదీసి సులభగ్రాహ్యముగా సంగ్రహించుట మిగుల క్లిష్టమయినపని. తామివ్విధమగు కృషి యందు సిద్ధహస్తులు. ఇందుకై తమకు హృదయపూర్వకముగా అభినందనలనందించుచు "కేంద్ర సంగీతనాటక అకాడమీ" వారు చూపించిన విజ్ఞతకూడా ప్రశంసనీయమని భావిస్తున్నాను.

తాము గావించిన పూర్వపరిచయస్మరణము మా ఉభయులను స్పందింప జేసినది. తమ నాట్యవేదము ఆంధ్రావళి ఆమోదమును పొందగలదని విశ్వసిస్తున్నాము.

## *Sri, Dr. V. Raghavan,* M. A., Ph. D.

*Professor of Sanskrit, Madras University.*

*Executive Member* : Sangita Nataka Akadami, D E L H I.

"Pandit J. Madhavarama Sarma, Guntur, who has already brought out in Telugu some standard Alankara works in Sanskrit, has brought to bear on the present undertaking of his — a Telugu exposition of Bharata's Natya Sastra his close acquaintance with Alankara Sastra. In this exposition he has taken the leading topics of Bharata's Natya Sastra and explained them, incorporating some of the ideas in Abhinava Gupta's commentary on the text. Some topics which are germane to drama have been left out or touched only briefly; also the treatment is although couched in a scholarly, style, it would have been of greater use to the general Telugu reader and those interested in drama if the approach and treatment had been from a broader background and in a more popular style, and with correlation to surviving examples and illustrations. But considering the pawcity of authoritative and informative books in Telugu, the author should be congratlated on the undertaking and its accomplishment."

## శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : యమ్. యల్. ఏ.

శ్రీ శర్మగారు రచించిన నాట్యవేదము చదివితిని. ఇది గొప్పగ్రంథము దీని గుణగణము వివరించుట గొప్పపండితులకును అసాధ్యము. భరతశాస్త్రముసామాన్యము కదా! శాస్త్రములలో నిది యున్నతస్థానమధివసించిన శాస్త్రము. దాని తెనిగించుటయే కాక వ్యాఖ్యానము గూడ చేర్చుట మహాపండితులకే సాధ్యము. శ్రీశర్మగారి ప్రతిభ విద్వత్త భాషాజ్ఞానము ఆంధ్రదేశమందే గాక సంస్కృత వాఙ్మయప్రపంచమున పేరెన్నిక గాంచినది. అట్టివారికార్యమున కెంతయు తగుదురు.

కట్టినవన్ని నాట్యశాలలనియు, వేషముకట్టిన వారందరు నటులనియు కట్టు దిట్టములు లేక విచ్చలవిడి చెలరేగు నీకాలమున ఈ శాస్త్రవిధులు తెలిసికొనుట యెంత అవసరమో నేచదివినంతలోనె బోధపడినది. స్త్రీపాత్రలు స్త్రీలె ధరింపవలెనన్నది నవీనసిద్ధాంతమనుకొను నీ కాలమున నది సృష్టియందే బ్రహ్మనిర్దేశ మని తెలిసికొనుట ముదావహము. శర్మగారి యీ శాస్త్రసేవ నెంతయు కొనియాడుదును.

## శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

మీ నాట్యవేదము చదివితిని. మూలగ్రంథములో ప్రాతకాలపురీతినిబట్టి అతి విస్తృతముగను, కొన్నికొన్నిచోట్ల మనకు సందర్భము గోచరించని తీరులోను ఉన్న విషయములన్నియు క్రమబద్ధముగ స్వీకరింపబడుట అత్యంతమావశ్యకమని చాలసంవత్సరముల నాడె నేను తలచి యుంటిని. ఆపని మీవంటి అభిజ్ఞతముల వలన నెరవేరినదనుట అన్నివిధములను సమంజసముగ నున్నది. అదియు మన తెనుగులో వచనరూపముననుండుట మన తెనుగుజాతికెంతయో యుపకారము. ఈ విషయములను ప్రకృతములో నాట్యాభిమానులందరును గ్రహించి యీ గ్రంథము తమ యుపయోగమునకు తీసికొనివచ్చుట అవశ్యకమై యున్నది.

భరతనాట్యశాస్త్రవ్యాఖ్యానములలో ప్రకృతము సమగ్రముగా దొరకుచున్నదియు ప్రామాణికమయినదియు అభినవగుప్తనివ్యాఖ్యానమె. దానిని మీరు చక్కగా గ్రహించి దానియభిప్రాయములను గూడ కూర్చుటవలన విశేషమును తెలియగోరువారు తమయాశయసిద్ధికెంతయు సంతసింతురు. కొన్నిపదములు, పదార్థములు, కొన్నింట నానాభావవికల్పములు ఇవి యన్నియు సావధానముగా తెనుగున వివరింపబడియున్నది. చాలఅవశ్యకము చాలమందికి దురవబోధము అవశ్యబోద్ధవ్యమయిన దీని మీరు బాగా గ్రహించి నేరవేర్చుటను నేనెంతయో అభినందింతును. అధ్యేతలకీ నాట్యవేదపు మార్గము నిష్కంటకముగను సుగమముగను చేయబడినది.

నాట్యవేదప్రవర్తకులలో పితామహమహేశ్వరులె యుండి మాధవుడు లేని కొరతను మీరు తీర్చితిరని నేను మనసార సంతృప్తిపడుదును.

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణః

వితరతు శివ శ్చరణయుగ
చలన జగచ్చాలనపటురాయుస్తే
మా ధ వ రా మ సు శర్మన్!
జమ్ములమడకాన్వవాయశీతాంశో!

అమలిన తారకా సముదయంబుల నెన్నను, సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్గజల గౌరవ నాట్యసరస్వతీ సము
ద్రము దరియంగ నీదను విధాత్మన కైనను నేరఁబోలు నే

మున్నొక డభినవగుప్తుం డెన్నగఁ దా నీఁదె మతము హేళు దధికుఁడై
నిన్నెన్న వలయు నేటికి నన్నా! తెలుగుల దెసన్ దయాపరు డౌచున్

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

అమరీ గానసుధాఝరీ పరిమళాహ్లాదానుసంధానవి
భ్రమమై, శాశ్వతచేతనాత్మకకళార్ద్రంబైన శ్రీనాట్యవే
దముతో మాధవరామశర్మ రసగుప్తబ్రహ్మమై తెల్గులో
కమునం దొక్క నవీనసృష్టి మెఱుఁగెక్కన్ జేసె సంతుష్టిగన్

## శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

ఉభయసంధ్యాతాండవోల్లాస శివపర బ్రహ్మచిత్తమున భావన మెలంగి
పరమనిష్ఠా వికస్వర దివ్యభరత సంవిన్మూర్తికరుణ నావిర్భవించి
అభినవగుప్త శైవాచార్య బహువిధవ్యాఖ్యాపరిష్కార మవఘళించి
సౌందర్యముగ్ధ ప్రసర్పదాశ్చర్య రసికశేఖరుల నమస్కృతుల నంది

అవని దిరుగాడు నాట్యవేదాప్సరఃప
యోజముఖి సర్వదర్శనయోగ్యతరుణ
మాధవానీతశృంగారమహిత యగుచు
చవులుగొని తెన్గుపాలముల సంచరించు

# శ్రీ కరుణ శ్రీ

భరత ప్రశంస

లీలాతాండవలోల ధూర్జటి జటాళిందోర్మిమాలా చల
ద్బాలేందూజ్జ్వల నాట్యశాస్త్రరచనా పారంగతప్రజ్ఞు స
ర్వాలంకారిక మార్గదర్శకు; ననుందానందమందాకినీ
శైలేంద్రుఁ, రసరాజ్యధుర్యు భరతాచార్యుఁ ప్రశంసించెదన్

నాట్యశాస్త్ర ప్రశంస

సరసోదాత్తము, భావపూర్ణము కళాసామ్రాజ్య, ముచ్చైర్గుణా
కర, మౌచిత్యనిధాన, మార్షము, నలంకారాఢ్యముఁ, దేవతా
పరిషచ్ఛ్రావ్యతపోవయజ్ఞ, ముల్లసిత సప్తత్రింశదధ్యాయమౌ,
పరమామ్నాయము భారతీయ మలరుఁ బ్రత్యక్షగ ధ్యేయమై

అభినవగుప్త ప్రశంస

శ్రీకాశ్మీరము పొంగి పొంగి పులకించెఁ నీదు పాదాబ్జముల్
సోకఁ; కుంకుమపూలతోటలు శిరస్సుల్ వంచె నీముందు, ని
న్నాకాంక్షించె రసాత్మ, నిన్ వలచె నాట్యంబున్ మహాశైవ; మీ
లోకం బంతయు లోచనంబయి సమాలోకించె నీ రూపమున్

అభినవభారతీ ప్రశంస

ధ్వన్యాలోకము కన్ను దెన్నుదుట గుప్తంబై తగన్ వైపుషీ
ధన్యం బుజ్జ్వలమైన దార్శనికమూర్ధన్యంబు మాన్యం బసా
మాన్యంబైన మహాస్వాకం దభినవంబై, నాట్యసద్వ్యాఖ్యకా
కన్యాలోకము నేలుకొన్నది జగత్కల్యాణకాశ్మీరమై

మాధవ ప్రశంస

యన్మహోపన్యాస తన్మయత్వమ్ములో పొంగిపోయినది త్రైలింగభూమి
యద్వ్యక్తిపీన దివ్యద్వ్యయద్గంగయై పర్వులెత్తినది సౌహిత్యవాణి
యత్కృతుల్ కళ్యాణసత్కృతుల్ గాను వేళ నృత్య మ్మొనర్చె సాహిత్యలక్ష్మి
యద్యశోలత సంసదుద్యానముల, బూచె కొల్ల కొల్లగ మంచి మల్లెపూలు

అతడు నవరసగంగాధ రాద్యనేక
సార సారస్వతాలోక చక్రవర్తి
"అభినవానందభరత" భావార్ద్రమూర్తి
రస పథ విహారి మాధవ రామ సూరి

# స్వసంవాదము

"సర్వత్ర భావపటలేన విజృమ్భమాణ
విచ్ఛేద శూన్యపరమార్థ చమత్కృతిర్యా
తాం పూర్ణవృత్త్యహమితి ప్రథనస్వభావాం
స్వాత్మస్థితిం స్వరసతః ప్రణమామి దేవీం"

శ్రీ భరతముని నాట్యశాస్త్రసంగ్రహమయిన ఈ నాట్యవేదమును ఆంధ్రములో నిరూపింపవలెనని నాకుగా నేనె చిరకాలముగా సంకల్పించితిని. విశిష్టసారస్వతేయులు కల యొక సమితిలో అచింతితప్రాయముగనె నేను నాట్యనాటకసమూరంభోపన్యాస మొనరించుట, బహుచింతితార్థముగ పూర్వమె హృదయసంక్లృప్తమయిన నాట్యవేదము వెలయింపజేయుటను నేనుగా పలుకుట సహృదయులకు సంతోషమె యయినది. నా నిరంతరచింతా తంతుస్యూత నాట్యార్థము గుర్తించి శ్రీబందా "ఓం" పలికెను. నేను 'శ్రీ' చుట్టితిని. భారతప్రభుతా సంగీతనాటక అకాడమీ పురస్కృతిని నాట్యవేదము పొందుట "కలాక్షేత్ర" వ్యవసాయఫలము. కలాలాలిత లలితహృదయుల భావనాట్యము సచేతోహృదయసంవాదసుందరిత నాకు నిత్యచేతన. బహుశ్రుతుల ఆమోదముద్ర వలయుట దేహలీసూక్తి కావున సహృదయబహుశ్రుతులు శ్రీరాఘవన్ నాట్యవేద ముపకారి కృతి యని భావించి అకాడమీసంభావనము సముచిత మనిరి. శ్రీసాంబమూర్తి ఔ ననిరి. అభిజ్ఞు లూరీకరించిన బహుజ్ఞవచో భాగములను నేను ఔదల వహింప గలను. అకాడమి అధ్యక్షులు ఆదరమున నన్నింత చేసిరి. సర్వము సంభావించు కొని ద్వితీయభాగము నివేదింతును.

శ్రీమదభినవుడు స్వాత్మప్రత్యయముకల కృతిసుకృతి. సర్వతోదిక్కయిన ఆతని విశేషమును అభినవదర్శనముగా నిరూపింపవలెనని స్వాప్త యున్నది. కాని యభినవుడు

పూర్ణవ్యాకరణావగాహనశుచిః సత్తర్కమూలోన్మిష
త్ప్రజ్ఞాకల్పలతావివేకకుసుమైరభ్యర్చ్య హృద్దేవతాం
పీయూషాసవసారసుందర మహాసాహిత్య సాహిత్యభాక్
విశ్రామ్యామ్యహమీశ్వరాద్వయకథాకాంతాసఖః సాంప్రతం

అని యనగలవాడు. నేనిట్టి విషయముల నెట్లు కలవాడను కాగలను? అయినను "యత్నః కృతః". షడర్థశాస్త్రశాస్త్రి అభినవుడు షట్ప్రజ్ఞావిలాసుడే. కాని ఆతడే లోకవిలోకనమున శాస్త్ర కాదలచ లేదు.

"యాతాయాతాః స్థితాః కేచిదజ్ఞా మత్సరిణః పరే
సందిగ్ధాః కేపి కిం బ్రూయాం? శ్రోతారో యదనాగతాః"

అనినాడు. అభినవబోధాదిత్యప్రసారము పొందిన సకలవిషయములను సకలములు. అభినవుని నేను అంతట వ్రాయలేకపోయితినో! అవికలముగా సకలముగా ననుట నా ఆస్థారసము. దుష్ప్రవేశము సుప్రవేశ మొనర్చికొనియు నింత కాగా నింతింత వ్రాయజాలనైతినని నా హృదయము నాకు తెలియ జెప్పును. శ్రీ జయరథు డనినట్లు;

"యోఽధీతీ నిఖిలాగమేషు పదవిద్యో యోగశాస్త్రశ్రమీ
యో వాక్యార్థ సమన్వయే కృతరతిః శ్రీ ప్రత్యభిజ్ఞామృతే
యస్తర్కాన్తర విశ్రుతి శ్రుతతయా ద్వైతాద్వయజ్ఞానవిత్
సోఽస్మిన్ స్యాదధికారవాన్ కలకలప్రాయం పరేషాం వచః"

అభినవాత్మప్రత్యయ మస్మాదృశుడు అందుకొనుటలో వామనుడు. "ఒకడవై యిది యిట్లు ఎట్లు వ్రాసితి" వని శ్రీయుతు లనిరి. సుహృదయుల భావ సన్నిధి నా నిధి. అందరు నాకు పెన్నిధి. స్వసంవాద స్వస్పంద సుందరులు నన్ను నాట్యవేదమును మన్నించుటను "శృణోతు లోకః" భరతాభినవవేదము ప్రకృతము వలయునని కావలయు వా రనిరి. నే ని ట్లు ప క్ర మిం చి తి ని. స్వసంవాదమోదము కల నేను శ్రీమదభినవసూక్తి నివేదింతును.

"సంతోఽనుగృహ్ణీత! కృతిం తదీయాం
గృహ్ణీత పూర్వం విధిరేష తావత్
తతోఽపి గృహ్ణాతు భవన్మతిం సా
సద్యోఽనుగృహ్ణాతు చ తత్త్వదృష్ట్యా"

మాధవరామ శర్మ

# నాట్యవేదప్రాతిశాఖ్యము



## ప్రాతిశాఖ్యము

ఈ నాట్యవేదమున కిది ప్రాతిశాఖ్యము. భరతముని నాట్యశాస్త్రము నాట్యవేదము. భరతసంహితము షట్సహస్రి యని ప్రసిద్ధి యున్నది. ఈ నాట్యవేదములో కంఠధారణయోగ్యము లయిన భరతుని శ్లోకము లున్నవి. కతిపయములు విశిష్టములని యనుసంహితము లయినవి. శిష్టముల తాత్పర్య మంతయు నవికలముగ నిందున్నది. ఈ నాట్యవేద మేవంప్రఖ్య మగుటలో, భరతగ్రంథ వివృతికర్త అభినవభారతీబ్రహ్మ శ్రీమదభినవగుప్తపాదుడు సర్వహేతువు. అభినవుడె నాట్యవేదవ్యాసుడై నాట్యవేదమును వేదాయిత మొనరించినాడు. అభినవభారతి నాట్యభాష్యము. అవికలముగా సకలముగా అభినవభారతి యీ నాట్యవేదములో నాంధ్రభాషాభాషితమయినది. ఇందు ప్రధానరూపధేయములతో సంకేతితము లయిన యవాంతరవిషయము లనేకము లున్నవి. అసంకేతితము లయినను స్వసంకేతసిద్ధములుగా పరశ్శతము లున్నవి. కృతప్రవేశు లకృతకబుద్ధివిభవు లాసారితచిత్తప్రసారులు కాగలరు.

## ౧. నాట్యవేద సముదయము

నాట్య మనునది రసస్వభావము. నాట్యమె వేదము. బ్రహ్మయె మొదట దీని ప్రవర్తింప జేసెను. నాట్యము వేదముల నుండి యావిష్కృత మయినది. పరమ పురుషార్థము నాట్యవేదప్రయోజనము. తదభిలాషు లంద రిందధికారులు. ఈ నాట్యవేదము భరతభావదర్పణము. అభినవభారతీప్రాణము. నాట్య నయ వినయ వినేయము. ఒకప్పు డాత్రేయాదిమునులు భరతుని సన్నిధిజేరి "నాట్యవేద మెవరి కెట్లుదయించిన" దని యడిగిరి. నాట్యము శిష్టప్రామాణికము. భరతు డాచార్యు డభిజ్ఞుడు. నాట్యవేదకథ చెప్పినాడు. వీరుపదేశయోగ్యులని భరతుడు భావించి స్వవిషయవిశ్వకోశ మయిన లలితవిజ్ఞానసర్వస్వ ముపదేశించినాడు.

స్వాయంభువ మన్వంతరమున కేడవది యయిన యీ వైవస్వతమన్వంతరమున త్రేతాయుగములో జంబూద్వీపమున లోకము సుఖితదుఃఖితమై గ్రామ్యధర్మముల ప్రవర్తించినది. గ్రామ్యధర్మ మనునది శాస్త్రవాదములు వినని జనుల దేశోచితధర్మము. అప్పు డింద్రాదులు బ్రహ్మసమీపమున కేగి బహుజనసాధారణ మయిన క్రీడనీయక మును నిర్మింపు మని కోరిరి. అది శ్రవ్యము దృశ్యము కావలె ననిరి. ప్రీతిపదముగ వ్యుత్పత్తిప్రదముగ నుండుట కోరిరి. శాస్త్రమతులును నాట్యమున సుఖముగ వినీతు లగుదురు. సార్వవర్ణిక నాట్యవేదము నిర్మింప వలెనని యింద్రుడు కోరెను. సర్వవర్ణ ముల వారు సరస సుకుమార నయమున కావ్యము స్వకర్తవ్య ముద్బోధించినప్పుడు సరసముగా సుకుమారముగా ననురక్తు లగుదురు. ఇట్టి యీ కాంక్షను బ్రహ్మ గుర్తించి "సర్వశ్రావ్య మయిదవ వేదము నిర్మింతు" ననెను. ఆ న వ వే ద ము సర్వ పురుషార్థసాధకము. కలారమ్యముగ సర్వశాస్త్రార్థముల నిది నిరూపించును. నాల్గు వేదము లందును నాల్గునాట్యాంగము లున్నవి. ఋక్సామయజురథర్వములనుండి పాఠ్యగీతాభినయరసముల సర్వవిదుడు బ్రహ్మ సంగ్రహించినాడు. పాఠ్యము నాట్య శరీరము. గీత ముపరంజకము ప్రయోగ ప్రాణము. అనంతర మభినయము పిమ్మట రసము చెప్పుట సముచితము. పాఠ్యాదులు రసప్రవణములు. నాట్యము ప్రీతిమయము. తద్విజ్ఞానమున వ్యుత్పత్తియు నున్నది. ఈ నాట్యవేదము శాసనప్రాణ మగు శాస్త్రము కన్న విలక్షణము. విజ్ఞానికి ప్రాణవేదము. ఇట్లు బ్రహ్మ నాట్యవేద మావిష్కరించి కుశలవిదగ్ధులచే దీని ప్రయోగింపుమనినాడు. దేవతలు సుఖాధికులు. ప్రయోగసమ ర్థులు కారు. వేదవిదులు ఋషులు సమర్థులు. బ్రహ్మ భరతుని జూచి "నీకు పుత్రశత మున్నది. ప్రయోగింపుము." అని యనగానె భరతు డానందియై నాట్యవేదము తెలిసి, ప్రయోగము గుర్తించి, ప్రయోగనిశ్చయము కలుగు వఱకు పుత్రుల కధ్యాపనము చేసి ప్రయోగము నేర్పినాడు.

భరతపుత్రుల నామము లన్నియు సార్థకములు. ఎవ రే విశేషమున సప్రజ్ఞులో వా రందు నియతు లయినారు. భరతుడు ప్రయోగ ముపక్రమించి ప్రయుక్తప్రయో గము బ్రహ్మకు నివేదించినాడు. ఆ ప్రయోగమున భారతి సాత్వతి యారభటి మూడు వృత్తులె యున్నవి. కైశికీవృత్తి లేదు. కైశికిలో నృత్తాంగహారములు రసభావ క్రియలు సుందర మృదుల సన్నివేశరమ్యతలు కలవు. స్త్రీ లున్న నె తత్ప్రయోగము శక్యము. "కైశికి ప్రయోగింపుము" అని బ్రహ్మ యని నాట్యాలంకారచతురలు ప్రయోగనిపుణ లయిన యప్సరోవనితల సృజించి భరతున కిచ్చినాడు. సకలప్రయో గమునకు కైశికి ప్రాణము. నాట్యములోని వాగంగసత్వముల చేష్టాసామాన్యము చతుర్విధము, ఇదియె వృత్తిచతుష్టయము, కైశికి లలితసుందరము. అది లేని రూపకము వైచిత్ర్యశూన్య మగును. వైచిత్ర్యము కలుగుటకు వికస్వరనిర్వారచమత్కార మపేక్షి తము. అది పవిత్రతానిదానము. పవిత్రత లేకున్న శిక్షాశత మున్నను విచిత్రత రాదు. వనిత లున్న నిజహృదయరసమున నిర్వారచమత్కార ముదయించును. కావున బ్రహ్మ

యప్సరఃకన్యాసృష్టి చేసెను. లీలావిలాసశోభాకాంతులు కల కాంతలె కమనీయత కూర్పగలరు, మునికన్య లెట్లు తగుదురు? భరతు డప్సరఃకన్యకలకు శిక్షణ మిచ్చి కైశికి ప్రయోగించినాడు. స్వాతి మునిని వాద్యవిధానమున నారద గంధర్వుని గానయోగ మున నియమించినాడు. వాదకులు గాయకులు నాట్యాచార్యాధీనులై యుండవలెను. భరత నాట్యము పూర్ణప్రాయ మయినది.

ఒకప్పుడు భరతుడు బ్రహ్మను చేరి "నాట్యము గ్రహించితిని" "ఏమి చేయుదును?" అని యడిగెను. "భాద్రపద శుద్ధ ద్వాదశినాడు మహేంద్రు డసురులపై విజయము పొందినాడు. అది ధ్వజమఖ మహోత్సవము, అప్పుడీ నాట్యప్రయోగ ముచితము" అని బ్రహ్మ సూచించెను. భరతు డప్పుడు మంగల మాచరించి దేవతలు దైత్యులను జయించుటను నాట్యముగా ప్రయోగించినాడు. బ్రహ్మాదులు సంతసించి బహుమతు లిచ్చిరి. ప్రయోగ మొకవిధమున సఫల మయినది. దేవత లప్పుడు పురాకల్పములోని దేవాసురచరితకీర్తనము భావించిరి. వర్తమానకాలచరితానుకారమున రాగద్వేషాదు లుదయించును గాని ప్రీతివ్యుత్పత్తులు కలుగవు. దానవులు వర్తమాన ధర్మ కర్మ సంబంధమున భ్రమ విప్రలబ్ధులై క్షోభపడి విఘ్నము లుత్పాదించిరి. అందరు లేచి పోయిరి. నటులకు వాక్చేష్టా స్మృతి స్తంభము కలిగినది. ఈ ప్రయోగవైషమ్య మును మహేంద్రుడు గుర్తించి తన ధ్వజము పట్టి విఘ్నము లసురులు జర్జరీకృతు లగు నట్లు చేసినాడు. ఆతని యా యాయుధము 'జర్జర' మయినది. భరతు డసుర కార్యము లాలోచించి రక్షావిధి నభిలషింప బ్రహ్మ విశ్వకర్మను రావించి "మహామతీ! నాట్యభవనము నిర్మింపుము" అనెను. భవనము సిద్ధ మయినది. వాస్తువిద్యా విదుడు నాట్యమండప నిర్మాణ స్థపతి కావలెను. బ్రహ్మ నాట్యమండపమును చూచి రక్షణవ్యవస్థ నేర్పఱచినాడు. సామమున విఘ్నముల దూరీకరింప దలచినాడు. "లోకపితామహులగు మీకు దేవత లెట్లో దైత్యులట్లె కావలయును. మమ్ము మీరు ఖలీకరించిరి. దేవతల యిచ్ఛానుసారమున నాట్యము నిర్మించితి రేల?" అని విరూపాక్షు దైత్యు డనెను. అది భావించి బ్రహ్మ యిట్లనెను. మీకు కోపవిషాదములు వలదు. మీరు భ్రాంతి పడినారు. నాట్యవేదము శుభ మశుభము వికల్పించునె గాని సాక్షికముగా దేశకాలపాత్రల నుపలక్షింపదు. మీ యనుభావనము కాని దేవుల యనుభావనము కాని నాట్యమున నుండదు. "త్రైలోక్యభావానుకీర్తనం నాట్యం" అంవరి యవస్థానుకరణమె నాట్యము. దేవాసురభావముల కిది యతీతము. నాట్యమున నియతలోకానుకార ముండదు. ద్రష్ట సాక్షికదృష్టి కల వాడయినచో రసాస్వాదము కలుగనె కలుగదు. కవియు నియత పక్షసంబంధి వర్ణన నిశ్చయము కల వాడయినచో నాతని కావ్యమునకు కావ్యత్వమె కలుగదు. సహృదయులు విభావాది సాధారణ్యమున సంభావింతురు. హృదయసంవాదమున తన్మయీభావము పొందుదురు. వారి విమలహృదయదర్పణమున దేశకాలవిశేషము లుండవు. లోకబుద్ధులు కలుగవు. స్వాత్మద్వారమున విశ్వము వారు దర్శింతురు. సర్వము వారలకు సంవిజ్జాతీయము. ఈ

యుపాయసంవేదనము లేక మీరు నాట్యానుభూతి దూరు లయినారు. నాట్యము మిమ్ము ఖలీకరించిన దని యుపహసించిన దని తలచితిరి. లోకము నందుండు ధర్మాదులు సంవేదనయోగ్యములు కావు. జగములో విషయము సుఖదుఃఖమయ మయినను కవికల్పనాప్రభావమున నంతయు హ్లాదైకమయ మానందపూర్ణ మగును. కొందరి నామ గ్రహణ మేల? అని తలంతురో! నిరాధారవృత్తము దర్శింప శక్యము కాదుకద! మీరిది మీకు ప్రత్యాదేశ మని భావింప దగదు. సుఖాదులు సంవిత్స్వభావములు. అవి యభినయోపేతములై ప్రతీతము లగును. అభినయములు రత్యాదుల యాభిముఖ్యము కలుగజేయును. సంవిద్దర్పణమున సంక్రాంతము లగును. మీకు విషాదము వలదు. ఇది హితోపదేశము. ఇది విశ్రాంతిజననము. ఇది లోకోపదేశము. ఇది వినోదకరణము. ఇది వినోదజననము.

## ౨. ప్రేక్షాగృహము

బ్రహ్మ సామము సఫల మయినది. విరూపాక్షాదులు సంతుష్టు లయినారు. విఘ్న మాపాదింప దలచ లేదు. బ్రహ్మ నాట్యమండప యజనము చేయించెను. నాట్యమందిరపూజ శుభార్థప్రాపకము. ఈ పూజలు సౌందర్యసంపాదకములు "శోభా ప్రధానం హి నాట్యే సర్వం" రంగదైవతపూజనము యజ్ఞసమ్మితము. నాట్యమందిర లక్షణ పూజన విజ్ఞానము దేవతలకు నుపకారి యగును. సంకల్పముకన్న నిర్మాణము జ్ఞానాపేక్షము. దివ్యుల కన్నియు మానస సృష్టితో నుపపన్నములు కాగలవు. మానవుల కన్నియు యత్నసంపాద్యములు. ధీమంతుడు విశ్వకర్మ శాస్త్రానుసారమున త్రివిధసన్నివేశము కల్పించినాడు. వికృష్టము, చతురస్రము, త్ర్యస్ర మని ప్రేక్షాగృహము త్రివిధము. ప్రమాణమును బట్టి యందు జ్యేష్ఠ మధ్యమావర భేదములున్నవి. మధ్యమము ప్రశస్తము. ఈ మండపములు హస్త- దండ ప్రమాణమున పదునెనిమిది యగును. మధ్యమ మండపములో నాట్యాభివ్యక్తి బాగుగా నుండును. పాఠ్యము విస్వరము కాదు. ముఖరాగము దృష్టివిశేషము సువ్యక్త మగును. వాద్యము గేయము శ్రవ్యతర మగును.

మానవుడు దేవవిధానములతో విస్పర్థింప గూడదు. భూ పరీక్ష యొనర్చి ముహూర్తము నిర్ణయించి సూత్రప్రసారము చేసి తగిన విభాగమున రంగశీర్షము రంగపీఠ మేర్పఱుప వలెను. సర్వవాద్యములతో సర్వమంగళములతో స్థాపనము చేయ వలయును. కలావినోద విధానముల నంగీకరింపని వారిని దరిజేరనీ రాదు. రమ్య దారు శిల్పము కూర్పవలెను. శైలగుహాకారముగా నాట్యమండప ముండవలెను. నివాత మండపమునందె గీతవాద్యములు గంభీరము లగును. అచట శబ్దము భ్రమించి పరస్పర ప్రతిశ్రుతి కలదై సమారంభసంపూర్ణ మగును. నాట్యమండపమును భిత్తికర్మ చిత్రకర్మ లేర్పఱచి లతాబంధముల కూర్చి కలాసుందర మొనర్పవలెను. కలాసౌందర్యమున ధర్మ తత్త్వము ధర్మకర్మకరణములందు కలారమ్యత నిరూపించు నాట్యగృహము భారతీయ సంప్రదాయ ముద్బోధించు చున్నది. శుభ నాట్యగృహము సర్వలక్షణ సంపన్నము

కాగా గో బ్రాహ్మణ నివాసపవిత్ర మొనరించి, దేవనతి చేసి, జర్జరము పూజించి, యుదకుంభము రంగమధ్యమున స్థాపించి, ప్రదీప్తశిఖాప్రకాశము చూచుకొని నాట్యాచార్యుడు రంగపూజన మొనరింప వలెను. కలాత్మకారంభము దైవసమారంభముతో నుండవలయుటను భరతు డనేక విధముల సూచించుచున్నాడు. ఈ సాంప్రదాయిక మయిన సమారంభము ననుసరించుటయె భారతీయసంస్కృతి మర్యాద.

## 3. అంగహారములు

భరతు డీ విధము సర్వ మొనరించి యనంతరకర్తవ్యమును బ్రహ్మ నడిగినాడు. "నీ వమృతమంథన మాయోజనము చేయుము" అని బ్రహ్మ యనెను. నాట్యవేద నిర్మాణావధిలో బ్రహ్మ యమృతమంథనము గ్రథించెను. అది సమవకార ప్రయోగము. సమ్యక్సాక్షాత్కారకల్పము. ఉత్సాహప్రభవ మయిన వీరరసాత్మకము. అందర కది రసనాత్మక చర్వణ మాపాదింప గలదు. భరతుడు ప్రయోగించినాడు. దేవదానవులు హర్ష ము పొందిరి. ప్రయోగ సమయమున నందరు కర్మభావదర్శనమున సుఖాతిశయము కలవా రగుదురు. ఏకరస వస్తువుసం దేకానుసంధానము శక్యము కాగలదు. కొంత కాల మయినది. "మహాదేవున కీ నాట్యము ప్రదర్శింతము" అని బ్రహ్మ యనెను. నాట్యప్రయోగమును మొదట తెలిసిన వానికె చూపింపవలెను. నాట్యవిదుడె నాట్యప్రయోగము దర్శించుటలో నౌచిత్య మున్నది. అందరు మహాదేవ నివాసము కైలాసము చేరిరి. దర్శనావధానము కోరిరి. రూపక కవి పరీక్షకునకు ముందుగా విన్పింప వలెను. పరీక్షకశ్రవణమున కవి కార్యము కొంత సిద్ధ మగును. పరమేశ్వరుడె పరీక్షకుడు పరితోష్యుడు. రసచర్వణాత్మక మహాభోగ ప్రదుడు. పరమేశ్వరచరిత ప్రధాన మయిన "త్రిపుర దాహము" కూడ భరతుడు ప్రయోగించినాడు. పరీక్షక పరితోషమునకు ప్రయోక్తలు ప్రయోగము నిర్వహింప వలెను. మహాదేవుడు సుప్రీతు డయినాడు. ఇట్లనినాడు. "నీ నాట్యము బాగుగా నున్నది. సంధ్యాసమయములందు నేనును నృత్య మొనరించితిని. ఈ నృత్య మనాది. నీ విప్పుడు వైచిత్ర్యరహితముగ ప్రయోగించితివి. నా నృత్తముతో కూడుకొనినచో నీ ప్రయోగము చిత్రము కాగలదు. అప్పుడు భరత మను ప్రసిద్ధియు గల్గును. నీ దాన రంజన ముండును గాని యదియ చాలదు. నీ ప్రయోగవిధిలో నుద్ధతత్వ మున్నది. దేవి యాచరించిన కరణాంగహారములను కూర్చి సౌకుమార్య మాపాదింపుము." శివుడు తండువనువాని బిలిచి "భరతునకు తెలియ జెప్పు" మనినాడు. తండువు కరణములు రేచకములు కూడిన యంగహారముల జెప్పినాడు. హారు ప్రయోగము హారము. అంగములచే నగు నది అంగహారము. అంగహారములు ముప్పది రెండన్న మాటయె కాని యవి యనంతములు. అవి కరణములచే నగును. కరణము లష్టోత్తరశత మున్నవి. ఇదియు సంఖ్యానము మాత్రమె. అవయవములలో హస్తపాదముల సమాయోగ రూప మయిన విలాసవిక్షేపము లుండును. తత్సాధనము లగు క్రియలు కరణములు. కరణమె నృత్తకరణము. నృత్తకరణములు రెండున్న నృత్తమాతృక. ఇట్టివి రెండు మూడు కూడు

కొనినచో నంగహారము నిష్పన్న మగును. కరణములు వాక్యార్థాభినయమున సుప్రయోగించు నట్లు పరిశీలింప వలెను. మునికాళ్ళపై నిలబడి కుసుమాంజలిక్షేప మొనరించుటకు వలయు నంత నృత్తము మాత్ర ముచితము కాదు. సాధారణముగా కరణముల నామములు సార్థకములుగనె యున్నవి. అంగహారముల ప్రయోగ మంతయు సామాన్యముగ నదృష్టార్థమె. అంగహారములను ప్రత్యేకదృష్టితో పరిశీలింపవలె నని భరతసంకేతమున్నది. స్వయంప్రయోగ కుశలులు గుర్తింపవలసినవి చాల గలవు. బాగుగా నవయవగతిని గుర్తించిననె యీ విషయమున సమ్యగ్విజ్ఞానము కలుగును. స్వరూపతత్త్వవిదులు కాని వా రెంత చెప్పినను ప్రయోగింప శక్తులు కారు. వారలకు నిరూపించుటయు శక్యక్రియ కాదు. ఒక్కొక యంగహారమున నియతముగా నిన్నియె కరణము లుండు నన్న వ్యవస్థ లేదు. ఎన్నియేని యుండవచ్చును. వేని ప్రయోగమున రమ్యత కలుగునో సమీక్షింప వలెను. ప్రయోగ మసంగతము కాకుండునట్లు పరిశీలింప వలెను. సర్వకరణాంగహారము లందును యోగసాధన మున్నది.

అంగహారముల కుపకరించు రేచకములు నాలుగు గలవు. రేచన మనునది యటునిటు కదలిక. అవయవముల చలన వలనములు విన్యాస విశేషములు రేచకము. నానావైచిత్ర్యములు కల యీ విధానము దేవతాపరితోషమును సంపాదింప గలదు. ఆ యా దేవతల ధ్వజప్రతికృతులుగా పిండీబంధముల నిష్పత్తి యున్నది. ఈ పిండీబంధావతరణ మొక రమణీయసన్నివేశము. ఒకప్పుడు శంకరుడు రేచకములతో నంగహారములతో నృత్త మొనరించుచున్నాడు. దేవి సాభిప్రాయముగ సాభిలాషముగ చూచినది. శంకరనృత్తము సుకుమారముగ లేదు. సుకుమార ప్రయోగమయినచో బాగుండును. దేవి సన్నద్ధయై సార్థముగా సుకుమారప్రయోగ మొనరించినది. అవియె యంగహారములు. అవియె రేచకములు. కాని సుకుమారములు. విశేషసంపత్తి సహితములు. మహాదేవుడు పరవశుడై యున్నాడు. దేవియు ప్రయోగ సమ్మోదిత. ఇద్దరు ప్రయోక్త లేకభావమున ప్రయోగించుట పిండీబంధ నిష్పత్తికి హేతు వయినది. దక్షయజ్ఞసమయమున ప్రహర్ష పరవశు లయిన ప్రమథులు దేవీదేవ ప్రయోగము భావించి వాద్యములు ప్రయోగించిరి. మహాదేవుడు లయతాలవశముగా నృత్త మొనరించినాడు. హృష్టపుష్టు లయిన నందిభద్రప్రముఖాదులు "నలుగు రయిదుగురును పిండీబంధ మేర్పఱుపవచ్చు" నని భావించిరి. పిండీబంధముల నిర్మాణించిరి. ఈ నాట్యవేదములో షోడశపిండీబంధముల సంకేతము లున్నవి. ఇంక నివి బహుప్రకారములగును. ప్రధానదేవతోద్దేశమున నున్న పిండీబంధము లిచట నున్నవి. పరశివుడె ప్రధానుడు పరితోషణీయుడు. ఆతడు నిర్విశేషరూపుడు. తత్సూచకమె శివలింగాకృతి. తదాకృతి పిండీబంధము తత్పరితోషార్థము. సమూహాత్మక మయిన యొకానొక ప్రయోగమున సవిశేషవిన్యాస విలాసము మన బుద్ధి యందు ప్రవేశించును అప్పటి యాస్వాదానుభవమున గోచరించు ఆకృతివిశేషమె పిండీబంధము. వీని యన్నిటి భావనావ్యూహములో మహామహేశ్వరుడె వ్యక్తస్వరూపుడై గోచరించును. వీని యందనంత

మవిశేషము లున్నవి. నాట్యాంగమభ్రంశము లేకుండ రక్షణము సూచించుట కీవస్మాత్ర ముగ సూచితము లయినవి. కేవల కరణప్రయోగమున గూడ దేవతాపరితోషణ మున్నది.

౪. నృత్తము : నాట్యము

శివ దత్త నృత్తమును తండు పతికుశలముగ గుర్తించి గానభాండయోజనముచేసి నృత్తప్రయోగము నేర్పుచినాడు. తండు సృష్టము తాండవ మయినది. మునుల కభినయములు తెలియవు. ఈ నృత్త మేమి? నాట్యము కన్న భిన్నమా? అభిన్నమా? నృత్తమున వేరుగా ప్రయోజన మున్నదా? దీని స్వభావ మేమి? లక్షణ మేమి? నాట్యనృత్తములకు భేద మేమి కలదు? నాట్యమున వలె నృత్తసంబంధి రాగకావ్యము లందును ప్రచ్ఛన్న రాగ పరమరహస్యముగా కామోపదేశ ముండనే యున్నది. ప్రచ్ఛన్నరాగము మన్మథదేవసర్వస్వము కదా! పుమర్థప్రాప్తికై కవులు రాగకావ్యాదుల నభినేయములుగా జేసిరి. నృత్తము లోకస్వభావ మపేక్షించునా? అలోకస్వభావ మపేక్షించునా? అది యయిన లోకధర్మి. ఇది యయిన నాట్యధర్మియగును. నృత్తము సుందరమై యుపరంజక భావానుప్రవేశము పొందునేని నాట్యగర్భమునను చేరును. పూర్వరంగ వైచిత్ర్యమునకు నృత్త మావశ్యక మేమి? అందు బ్రహ్మగీతి యున్నది. అది మహాగీతము. వానిలో సమ్యగభినయము కలదు. తదాభిముఖ్యమునకె నృత్త మగునేని నాట్యతుల్యమె యగును. నృత్త మని దీని వేరు చేయనేల? ఇట్టి యీ మహార్థసమాధి కభినవగుప్త భావధార యావశ్యక మయినది. నృత్తము నాట్యము వలె సాక్షాత్కారయోగ్యము. స్వస్పందమున సంక్రమణము చూచుకొని యేకవాక్యతను కూర్చుకొని సాక్షాత్కరింప జేయు నర్తకి లోకగతిక కాదు. సాక్షాత్కారప్రతిభ యున్న నాట్యమె కదా! ఒకప్పు డొక్కొక నృత్తము పోషకపాలక పరితోషార్థ కథావచన నిష్ఠమై రంజింప జేయును. "ఇది చౌర్యకాముక కేళీలాలస మానస. ఇది యిట్టిది. ఇది ప్రౌఢదూతి." అని హృదయానుప్రవేశమునకు తగిన విధమున ప్రేక్షకులు భావింప వచ్చును. ఆ నర్తకియు వారిని వారి ధనమును అనుగ్రహము నుద్దేశించి యాశించి యభిలషించి చేష్టిత మొనరించును. పలుకులు పలుకును. "ఇదిగో! ఈ నర్తకి నన్నె చూచినది. స్తుతించినది. కీర్తించినది." అని యన్యు లనుకొనునట్లు నర్తకి యుండ వచ్చును. కాని నర్తకి భావము హృదయగ్రాహి యగునట్లు చేయగలదు. రంజన మీయగలదు. ఆవర్జన మొనరింప గలదు. ఈ యంశమున నింతటి లౌకికమాత్రస్వభావ మున్నను అప్రయోజ్యప్రయోగ శంక తగదు. నర్తకీప్రయోగ మంతయు లోకసదృశ చేష్టిత మన నక్కఱ లేదు. కేవలము నృత్తమును నర్తకి సాభినయముగా ప్రదర్శించును. కాన నాట్యము నృత్తమునకు సంస్కారకము. నృత్తము నాట్యరూపము. "నా యీ నృత్తసంవేదనమును సామాజికు డాస్వాదింప వలెను. ఇందలి యుపదేశ సందేశము లందుకొన వలెను. ప్రబోధోదయము పొంద వలెను. సంతుష్టిపడి బహూకరింప వలెను" అని నృత్తప్రయోగములో నెట్టి యభిసంధియు నుండదు. అట్టి ప్రయోజన

సంపత్తి నాంతరీయకముగా గలిగిన గలుగ వచ్చును. నర్తకీప్రవృత్తి లౌకికముగ గోచరింప వచ్చును గాని యది యంతయు దేవతాపరితోషణ ఫలకము.

"యత్కించిల్లాస్య మేతేన దేవీ తుష్యతి నిత్యశః
యత్కించిత్తాండవం తేన సోమః సానుచరః శివః"

లాస్యమున దేవి సంతసించును. తాండవమున సానుచర సోమశివుడు సంతసించును. ఇది యంతయు నలౌకికరూపాంతరము పొందును. ఇది నాట్యసముచితభావము. ఇంతకతిరిక్తముగ నేమేని పలికిన నది యంతయు మానవ జీవికాపర్యవసితము, పురుషదౌరాత్మ్యము నగును. నృత్తనాట్యములకు ప్రయోజనభేదము లేదు. లక్షణభేదము లేదు. కాగా నృత్త మని యనుట వాచోయుక్తిచే ననుట. నాట్య మభినయమాణిక్యసూత్రము.

నృత్తము నాట్యమున శోభాసంపాదకము. నృత్తము కావ్య కావ్యావయవములను చేష్టావస్థాపనాత్మకము. రంజనాత్మకము. శోభానాంతరీయకముగా సచేతశ్చమత్కారకము. స్వాభావసిద్ధముగా నృత్తము సర్వాభీష్టము. వివాహ ప్రసవావాహ ప్రమోదాభ్యుదయములలో నిది వినోదకరణము. ఒకప్పుడు శివుని సంధ్యా నృత్తసమయమున నారదుడు శివచిత్తుడై గాన మొనరింప శివుడు సంప్రీతుడై అభినయసంపత్తితో తాండవ సమాయోజన మాదేశించినాడు. ఇట్లు నృత్తారంభముగా తాండవ మావిర్భవించినది. తాండవము రూపించు కావ్యము దేవస్తుతి నాశ్రయించును. నిర్భర పరిపూర్ణ శృంగారరసమున తాండవము మసృణ మగును. నృత్తము సప్తకృతి. నృత్త మొనరించు నర్తకి రంగము ప్రవేశించి విశిష్టముగా నభినయము భావించి స్వసంవాద సంపాదన సమాసక్త కావలెనె కాని సామాజిక సంతర్పణ సంతుష్ట యగుట సమంజసము కాదు. రంగమున నర్తన మొనరింప వలసిన వనితల సంఖ్యలో నియమ మున్నది. నృత్తమున గూడ పిండీబంధము లున్నవి. ఈ పిండీబంధప్రకారములు సంప్రదాయమున విచ్ఛిన్నప్రాయములుగ పొడగట్టును. అనేకములలో నివి సంకీర్ణములు వ్యాకీర్ణములు నయినవి. అనవధాను లశ్రద్ధాను లుద్ధరింపరు. సావధానులు సావధాను లగుట సమంజసము. వాద్యప్రాధాన్యమున నృత్త ముండునప్పుడు యథాసంభవముగా వైచిత్ర్యము ప్రదర్శింప వలెను. కాని వాద్యవైచిత్ర్యము కావ్యార్థమున నియతము కావలెను. కావ్యార్థ నియంత్రిత వాద్యవైచిత్ర్యమె శోభాసంపాదకము. గీతాచార్యులు వాద్యాచార్యుల కర్తల మెన్నడును కారు. ఈ నృత్త మంతయు దేవదేవ మహాదేవ స్తుతినిమిత్తము. తత్పరితోషమె తత్ప్రయోజనము. వ్యాపత్తి రహిత మయిన శృంగారము సుకుమారము. దేవీదేవ శృంగారము సుకుమారము. ప్రయోక్త లట్టి పట్టుల నృత్త మాయోజనము చేయుట యుక్తము. నృత్త ప్రయోగసమయ సమీక్షయు యుక్తము. కావ్యము దంపతుల కామసంశ్రయార్థాశ్రయముగా నుండునేని మదనాశ్రయ నృత్తప్రయోగ మావశ్యకము. దంపతులు దూతీవచన మాకర్ణించు నప్పటి ప్రహర్షమున నృత్త మున్నది. కాంతుని సన్నిధిలో స్వాధీనభర్తృక నృత్త మొనరిం

చును. వాసకసజ్జిక యభిసారికలు నృత్త మాచరింప వచ్చును. వసంత చంద్రోదయ శోభాభావనములో నృత్త మున్నది. ఇట్లౌచిత్యాపేక్ష మయిన నృత్తమె శోభా జనకము.

ఖండిత విప్రలబ్ధ కలహాంతరిత ప్రోషితభర్తృకల విషయమున నృత్తము తగదు. కాంతసమాగమ సముచితోపాయ పర్యాలోచన వ్యాపారమున నృత్త మచితము కాదు. నృత్తవ్యతిరేకములను వ్యుదాహరణముల గుర్తింప వచ్చును. స్వకంఠవచన మన పేక్షితము.

నాయిక ప్రసన్నహృదయ స్వాంగశోభ నుపలక్షించి సర్వాంగములందు నృత్త మనుగతము చేసికొన వచ్చును. ప్రియుడసన్నిహితు డయినను నాయిక యాస్థాబంధాతి రేకము కలదేని నృత్త మనుచితము కాదు. దేవస్తుత్యాశ్రయ విషయసిద్ధిలో నుద్ధతము లయిన మాహేశ్వరాంగహారములు, స్త్రీపురుషాశ్రయ శృంగారసంబద్ధ గాన మున్న ప్పుడు లలితములగు దేవీకృతాంగహారములు నృత్తసహితములు సముచితములు.

"మహేశ్వరస్య చరితం య ఇదం సంప్రయోజయేత్
సర్వపాపవిశుద్ధాత్మా శివలోకం స గచ్ఛతి"

శివప్రీతికై నృత్త మొనరించుట పాపవిశుద్ధి నిచ్చునని, శివలోక మందించు నని శివ భావము కూర్చునని నాట్యరహస్యము. నాట్యము చెప్పు మని మును లడుగ భరతుడు మహాఫలము నృత్తము నివేదించెను. నృత్తవివేకమున వారు నాట్యము గుర్తించిరి. గురు వుపదేశించిన విషయమును శిష్యుడు స్వహృదయసంవాదమున సామర్థ్యము కలిగి సంతుష్టు డగుట సముచిత మయిన శిష్యసంపత్తి.

## ౫. పూ ర్వ రం గ ము

మునులు తత్త్వాభినివేశము కల్వారై పూర్వరంగము తెలియ గోరిరి. మొదటనె ప్రయోగించు రంగప్రయోగము పూర్వరంగము. ఇది పారమార్థికము. ప్రయోగసంపత్తి కుపకరణము. ధూపవిలేపనాదికము వలె నిది దేవతాపరితోషణ ఫలకము. పూర్వ రంగాంగము లనేకములు కలవు. వాని యనుసరణ మావశ్యకము. ఎచటనో నిరూ పింప వలసిన వాని నిచటనె నిరూపించుట తంత్రభావానభిజ్ఞుల కామోద మీయను. రంజకవర్గమున గీత మావశ్యకము. పురుషుడు సలక్షణముగా గాన మొనరింపవచ్చును గాని వనితావిరహిత మయిన యా ప్రయోగము సుఖావహము కాదని సూక్తి. గాయనీగాయన సమావేశము సుందరము. అంగప్రయోగమున దృష్టప్రయోజనము పరిచూచుకొని యనంతర మదృష్టార్థముల ననుసరించుట యుక్తము. రమణీమణుల కుప కరణము లయిన శయన విరచనాదికములలో నంగరంగ భోగసామగ్రిలో నుచితము లయిన రమణీరమణుల యభిప్రాయములు విచిత్రాకృతి నుండుట యీ యంగసంగ ములో నున్నది. ఇట్టి వీని సుకుమార గీతపాఠ్యాభినయ యోగమున నొనరింప వల యును. మహాదేవునకు మహాదేవితో పరిచయాత్మక మయిన చరిత మంతయు శృంగార

ప్రధానము తచ్చరితవర్ణన పర కావ్యము స్తుతిప్రధాన మగును. తచ్చరిత మంగహార ములుగా చారీరూపముగా ప్రదర్శిత మగుట పూర్వరంగాంగములం దున్నది. హరదేవుని త్రిపురమర్దన సమయగీతము రౌద్రమయము. తన్నిరూపక కావ్యమున నుద్ధతము లగు మండలము లంగహారము లుండును. సుకుమారజనవిషయముగ నుండు ప్రయోగమున నలౌకికము లధికముగా నుండవు. నాట్యము వైచిత్ర్యము కలదై యదృష్టప్రయోజనక మగునట్లు సమీక్షింప వలెను. అంగసంక్లప్తి యిదె చెప్పను.

ఒక నాటి గీతకారంభములో స్పష్ట దేవస్తుతి దేవకార్య మభినందించునది కాగా నారదాదిగంధర్వుల గాన మది సుఖజనక మయినను దైత్యదానవులు మాత్సర్యమున క్షుభితులై "వాద్యములతో నున్న యీ నిర్గీతమును (శుష్కమనెడు వీణావాద్యము) మేమె తీసికొని సంతుష్టి పొందుదుము. ఈ గీతమున మా స్తుతికీర్తనము లేకున్నను మా కిం దాభిమానిక మయిన పరితోష మున్నది. ఇది మా యధీనము. మా కిది సిద్ధ మయినది." అని యనిరి. సాధన మొనరించిరి. దేవతలకు కోపము కలిగినది. "నారదా! ఈ నిర్గీత ప్రయోగము ప్రణష్ట మవుగావుత! మా కీర్తన ముండుటేమి ? వీరు దీని తమ యధీనము కావించు కొని సంతుష్టి పడుటేమి ?" అనిరి. "ఈ నిర్గీతము నశింపరాదు. దైత్య దానవ రాక్షసు లందరు తుష్టు లయినారు." అని నారదు డనెను. గంధర్వులు దీని బహిర్గీత మనిరి. నాట్యోపరంజనార్హ మయిన చిత్రవీణలో దీని ప్రయోగింప వచ్చును. నిర్గీతము గానోపరంజకము. నిర్గీతసంజ్ఞ చాల పురాణము. అర్థమును గోచ రింపజేయు పదము లం దుండవు. దేవతల యసూయచే నిది బహిర్గీత మయినది. ఒక్కొక విధానమున నొక్కొక దేవతాపరితోష మున్నది. దేనిచే నే దేవుడు సంత సించునో ఎవరి మనసున కేది ప్రియమో యది సర్వము పూర్వరంగమున నిర్ణీత మయినది. ఇది యంతయు దేవతాపూజన మయినందున ప్రేక్షాపతి ప్రయోక్తృప్రభృతుల కందరకు విశిష్ట ఫలప్రదాయి యగును.

"సర్వ దైవత పూజార్హం సర్వ దైవత పూజనం
ధన్యం యశస్య మాయుష్యం పూర్వరంగ ప్రవర్ధనం"

ఇది సర్వదైవతములకు పూజార్హము. ఇది సర్వదైవతపూజనము. యశ ఆయుర్ధన సాధకము. లోకాలోకాశ్రయము లయిన విద్యా శిల్ప గతి చేష్టితము లన్నియు నిందున్నవి.

పూర్వరంగవిధిలో వేరొక విశేష మున్నది. పుష్పాంజలిధారి రక్షామంగల సంస్కృతుడు సూత్రధారుడు జర్జర భృంగారముల ధరించిన యిద్దరి వెంట నిడికొని ప్రవేశించును. ప్రదక్షిణ మొనరించును. విష్ణు బ్రహ్మేశవందన మాచరించును. "రాష్ట్రం ప్రవర్ధతాం" "ప్రేక్షాకర్తుర్మహాన్ధర్మో భవతు" "కావ్యకర్తుర్యశ శ్చాస్తు" "ధర్మశ్చాపి ప్రవర్ధతాం ప్రీయంతాం దేవతాః" అని పలుకును. అప్పుడు పారిపార్శ్వకులు "ఏవ మస్తు" అందురు. ప్రేక్షాపతియు అభీష్టదేవత నారాధింప

వలెను. ఆతడు దేవతావిషయమున నుదాసీనుడేని బ్రాహ్మణ స్తవ మాచరింపవలెను. ఇది యంతయు రంగసిద్ధి నిదానము. అనంతరము కావ్యవస్తునిరూపణము సూత్రధార కార్యము. పూర్వరంగమె వనితానృత్త వైచిత్ర్యసముపేతమై చిత్రపూర్వరంగ మగును. నృత్తగీత విధానములం దతిప్రసంగము తగదు. ఒక్క యంగహారప్రయోగ మయినను చిత్రత నాపాదింప గలదు. అతి ప్రసంగము ప్రయోక్తలకు ఖేదము. ప్రేక్షకులకు విసువు. అప్పుడు రసభావముల స్పష్టత యుండదు. శిష్టప్రయోగము రాగజనకము కాజాలదు. సహృదయులకు నాట్యాధీ దూర మగును. రాగరక్తి రాదు. ప్రీతిప్రధాన మయిన నాట్యమె వ్యుత్పత్తి నీయగల దనుట మహార్ష్మహు రుక్తప్రాయము. నాట్యము లోకశాస్త్రముల రెండిటి ననుసరింపవలెను. కేవల శాస్త్రానుసరణము కాని, లోకానుసరణ కైవల్యము కాని తృప్తి నీయదు. దేవ రాజ రంగముల యాశీస్సుకల యాశ్రావణమును సూత్రధారుడు ప్రయోగించును. అందు కవి నామ గుణములు వస్తూల్లేఖ ముండును. నాందీప్రస్తావనా ప్రస్తావనముల కిదియె సమయము. సూత్రధారుడె ప్రయోక్త. సౌమనస్య మవిస్మయ మమ్భుతదృష్టి రక్షావిధి సూత్రధార గుణములు. సూత్రధారుడె స్థాపకుడై కార్యాంతరము ప్రయోగాంతరమున నాచరించును. దేవద్విజ స్తోత్రోద్దేశముగా నాతడు శ్లోకము పఠింప సామాజికుల హృదయము సముచితాస్వాదనయోగ్య మగును. సహృదయులు హృదయమున నిర్మలినత యావిర్భవింప రసాస్వాదోచిత సంస్కారమున గ్రహణయోగ్యతాధానము పొందుదురు. రమ్యమధుర శ్లోక పఠనమున రంగప్రసన్నత సమీక్షింప సామాజికసహృదయులు సంక్షేపమున సంస్కారములు కలవా రగుదురు. యథాశాస్త్రముగా పూర్వరంగవిధివిధాత కశుభము లేదు. దీని నన్యథాప్రయోగింప రాదని నాట్యశాసనము. ఈ పూర్వరంగప్రకరణము నానావిధ నృత్తప్రయోగ వినియోగ సంస్థానము. పద పదమున క్షణక్షణమున నాచరింప వలసిన విధులు కల పూర్వరంగ స్వరూపవిచార మంతయు నృత్తసంస్కృతి నిదానము. సూత్రధారాది సంవిధానము గ్రథన సుశ్లిష్టతాసూచకము. ఇందలి శృంగార వీర స్ఫోరకము లయిన యంగసంగము లన్నియు గౌరీశంకర గౌరవ గానపరములు. ఇది నాట్యపరమార్థము.

## ౬. ర స భా ర తి

మునులు మఱల భరతు నడిగిరి. "పూర్వరంగప్రసంగముగా రస మంటిరి. రస మన నేమి? రసత్వ మెట్లు సిద్ధము? ఆ ప్రసక్తిలో భావముల నేల సూచించినారు? అవి యెట్లుత్పన్నములు? వేని నవి భావింపజేయును? ఆధర్వణమున రసముల స్వీకరించితి మనుట విశదము కాలేదు. రసనాగ్రాహ్యము రస మని లోకప్రసిద్ధి కదా!" ముని భరతు డనెను. రసభావవికల్పన మిక వ్యాఖ్యానింతు ననెను. నాట్యాంతము తెలియ శక్యము కాదు. జ్ఞానశిల్పము లన్నియు ననంతములు. కాని లక్షణపరీక్షాద్వారమున సంగ్రహముగ దెలియ వచ్చును. లక్షణము సూత్రము. పరీక్ష భాష్యము. రసభావాభినయ ధర్మి వృత్తి ప్రవృత్తి స్వరాతోద్య గాన రంగముల యేకావళి నాట్య సంగ్ర

హము. ఉపచార మండపముల రెండిటిని కొందరు కలిపి పదమూ డనిరి. ఈ సంగ్రహ మును విస్తరించి సకారికముగా ససిరుక్తముగా ప్రతిపాదింతు నని భరతు డనినాడు. రసాత్మ శ్రీ సాక్షాత్కారము కల శ్రీమదభినవుల ప్రతిభాసమున్మేష మీ రసభా రతిలో నున్నది.

సహృదయ సామాజికులకు సాక్షాత్కారకల్ప మేకఘన మయిన మానసనిశ్చలత యావిర్భవించుటలో నాట్య ముపాయము. సహృదయ సంభావనములో జగజ్జడము సంవిద్రూప మగును. అది మహాభోక్తృభావమున పర్యవసించును. ఈ మహాభోక్తృ భావమునందు రసాశ్రయము కాదగిన స్థాయి చిత్తవృత్తియనుగతమై యున్నది. కావ్యార్థ మంతయు చిత్తవృత్తిస్వభావముగా భాసించును. ఈ చిత్తవృత్తిలో స్వ పర విశేష మేమియు నుండదు. ఇది యొక యలౌకిక మయిన చేతోరసము. ఇది యిట్లగుటలో నిది నిమిత్తము.

గుణాలంకార సుందర కావ్యమహిమ సహృదయుచిత్తమునకు విస్ఫార మిచ్చును. ఆతడు సంవిదాశ్రయు డగును. ఇట్టి స్పందసుందరతచే సాధారణ్యము కలుగును. అప్పు డాతడు స్వాత్మసంవిత్సమావేశము పొందును. సామాజికుని యీ యేకఘనచిత్తవృత్తి లౌకికచిత్తవృత్తికన్నను, యోగిచిత్తవృత్తికన్నను, విలక్షణము. నిరంతరఘన మయిన యీ చిత్తవృత్తి రూఢము కాగా నిర్విఘ్న మయిన స్వసంవేదనవిశ్రాంతి కలుగును. ఈ స్వసంవిద్విశ్రాంతియె రసము. రసమె నాట్యము. రస మొక్కటి. అది మహా రసము. మహాస్ఫోటలో పద వర్ణాది స్ఫోటలు కల్పితము లయినట్లు మహారసమున రసాంతరములు కల్పితములు. అసత్యములు. మహారస భాగ స్వరూపములు.

మహారసభాగకల్పము లయిన రసములు తొమ్మిది. శాంత మపలపించు వా రెనిమిది యందురు. శృంగారాదిశాంతాంతముగా రసక్రమము చెప్పుట సహేతుకము. శాంతము మోక్షఫలకము. ఇందే స్వాత్మసమావేశమున రసచర్వణ మున్నది. తత్త్వజ్ఞాన జన్య మయిన నిర్వేదము శాంతరసస్థాయి. కావుననె వ్యభిచారిభావగణనమున నమంగల ప్రాయ మయినను స్థాయి వ్యభిచారు లనెడు ఉభయధర్మోపజీవిత్వఖ్యాపనమునకై నిర్వేదము మొదటగా నిర్దిష్ట మయినది.

"న హి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే"

రసము లేక యే యర్థమును లేదు. రసము వినా విభావాద్యర్థ మేదియు బుద్ధిలో వ్యాఖ్యేయముగా ప్రవర్తింపదు. రసము వినా ప్రయోజన మేదియు లేదు. సామాజిక హృదయము రసాదృతము కాగా నాతని బుద్ధిలో భావాదికార్థ మేదియు ప్రవిభాగ ముగ నుండదు.

"విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రస నిష్పత్తిః" ఇది రసవిషయ లక్షణసూత్రము. రసద్రష్టలు భట్టలోల్లటప్రభృతులు దీని ననేకవిధముల వ్యాఖ్యా నించిరి. వారి భావసారము లిట్లున్నవి.

౧. లోల్లటుడు :- స్థాయిభావమునకు విభావాదులతో గలుగు సంయోగమున రసనిష్పత్తి యగును. స్థాయి యుపచిత మయిన రసము. కాకపోయినచో భావమె. అది రామాదులందె యుండును. తద్రూపానుసంధానబలమున నటునందు నుండును.

శ్రీశంకుకుడిది కాదనెను. స్థాయియె రసీభావము పొందునేని స్థాయిభావములనె మొదట నిరూపింప వలెను. భరతు డట్లు నిరూపింప లేదు. ఉపచితస్థాయి రసము. అనుపచితము భావ మనుటయు నయుక్తము. మంద, మందతర, మందతమ భేదములు స్థాయిలో నుండును కావున రసమునను తీవ్ర తీవ్రతర తీవ్రతమ భేదముల నంగీకరింప వలసి వచ్చును. ఉపచయకాష్ఠ పొందినదె రస మన్నచో హాస్యము స్మిత హసితాదిభేదమున నారు విధము లనుట కుదరనే కుదురదు. దశవిధ కామావస్థలలో నుత్తరోత్తరము ప్రకర్ష తారతమ్య మున్నది కావున లెక్కలేనన్ని శృంగార రతి భావాదులు ప్రసక్తములు కావలసి వచ్చును. స్థాయి యుపచయము పొంది రసమగు ననుటలో విపర్యయము కూడ కలదు. మొదట సముపచిత మయిన శోక ముపశాంత మగుట కలదు. రతి క్రోధోత్సాహము లపచయము పొందుట యున్నది. కాగా రసము భావపూర్వక మనుట కాక భావము రసపూర్వక మనవలసి యున్నది.”

“రసపూర్వకత్వం భావానాం
భావపూర్వకత్వం రసస్య”

అని నాట్యవేద మె యనును. రస మాస్వాదింప భావప్రతీతియు, భావము దర్శింప రసనిష్పత్తియు గోచరించుచున్నది. కాన రససూత్ర మట్లు వ్యాఖ్యానింపరాదు.

౨. శ్రీశంకుకుడు:- ఇట్లు వ్యాఖ్యానింపవలెను. విభావాదులు గమకములు. రసము గమ్యము. విభావాదులు కృత్రిమము లయిన నట్లనిపింపదు. వాని ప్రయోగదీక్షయె యట్టిది. రస మనుమీయమాన మయిన నితరానుమీయమానముల కన్న విలక్షణము. రసనీయము. స్థాయిగా సంభావిత మగు రత్యాదికము రామాదులందె యుండును. నటునం దుండదు. కాని నటు డనుకరణమున ప్రదర్శింపగా భావుకు లాస్వాదింతురు. అనుకరణ మగుట వలననె రస మను నవనామ సంకేతము కలిగినది. కావ్య మవగమనశక్తిచే రస మవగమింప జేయగలదు. అనుకరణ మొనర్పరతిస్థాయి శృంగారరస మగును. ఇదియే శ్రీముని మతము. చిత్రతురగము నందు వలె నటునందు విలక్షణ విజ్ఞాన ముదయించును. స్థాయ్యనుకరణమె రసమని శ్రీశంకుకవాద సారము.

భట్టతోతు డిది విమర్దక్షమము కాదనును. అంతస్తత్త్వశూన్య మనును. రస మనుకరణరూప మనుట యుక్తము కాదు. ముఖ్యమును చూచిన వారితరము చూచి యిది యనుకరణ మన వచ్చును. రామాదిరతి గుర్తించిన వారెవరు లేరు. ఇక అనుకరణ ప్రతిభాస మెట్లు? నటుడు రామానుకారి యనుట ప్రవాదమాత్రమె. నటు

నందు సాదృశ్యము గోచరింప వచ్చును. అంతమాత్రమున ననుకారము కలుగదు. నటుడు శిక్షావశమున సర్వము నేర్చి యుండును. వేషానుకరణ మాత్రమున చేష్టితానుకరణము రాదు. స్థాయ్యనుకరణము రస మని మునియేని యొకప్పుడేని యననే లేదు. ఈ యనుకరణవాదము జలలిపియె యయినది. రస మాంతర మని యనుటయు భరతగ్రంథవిరుద్ధము.

3. <u>భట్టనాయకుడు</u> :— ఇట్లనెను. రసము ప్రతీతము కాదు. ఉత్పన్నము కాదు. అభివ్యక్తమును కాదు. సీతాదు లెవరికిని విభావములు కారు. వారి యందు స్వకాంతాబుద్ధి కలుగనె కలుగదు. దివ్యవ్యక్తుల విషయమై సాధారణీకరణము కలుగనే కలుగదు. కావ్యనాట్యము లందు భావకత్వ వ్యాపార మొకటి యున్నది. దాని ప్రక్రియ స్వస్పంద రమణీయము. నిబిడ నిజమోహ సంకటము నది విడివడ జేయును. ఈ భావకత్వ వ్యాపారమున రసము భావ్యమాన మగును. భావ్యమానము భోగమున భుజ్యమాన మగును. భోగమను వ్యాపారము రసానుభూతి కనుకూల మగునది సుస్థమై యున్నది. రజస్తమోగుణముల యనువేధమున భోగ ముదయింపగా నా సమయమున ప్రకాశానందమయ సంవిద్విశ్రాంతి సాక్షాత్కరించును. ఇది యంతయు భోగభుక్తి ప్రభావము. భావకుడు భోగీకృత రూపమున సిద్ధి కలిగి రససంవేదనము పొందును.

ఇదియు పరిశీలనార్హము. భోగమని భట్టనాయకు డనును. భోగ మది యెట్టిది? రస రసనమునె యాతడు భోగమనునో? అదియు ప్రతిపత్తియె యగును. పేరు వేరు పెట్టుటేల? రసప్రతీతి భోగీకరణ మాత్రమె కాదు. రసము భావనాభావ్య మనుట బాగున్నది. ఈ భావనము చర్వణ మొకటియె యయిన మే మంగీకరింతుము.

౪. <u>అభినవ</u>గుప్తపాదుడు :— రసమీమాంసలో నిది పరిశుద్ధతత్త్వము. ఇందపూర్వముగ జెప్పునది లేదు. ముని చెప్పనె చెప్పెను. రస మసాధారణము. ప్రధానము. కావ్యార్థము. అశబ్దాభిధేయము. రసము నిష్పాదించు స్థాయివ్యభిచారులు భావములు. ఇవి రస మాస్వాద్యము చేయును. మొదట స్థాయి యవగతమై సమాస్వాద్య రసమునకు భావక మగును. వాక్యార్థము ప్రతీతము కాగా మానససాక్షాత్కార రూప మగు నొక ప్రతీతి యుదయించును. అప్పుడు దేశకాలాదివిభాగము లుండవు. భీత మృగపోత వర్ణనపర మయిన "గ్రీవాభంగాభిరామం" అను శాకుంతల శ్లోకము భావించినప్పుడు భయము భాసించును కాని మానసప్రతీతి కలుగగనె నిర్విశేష మృగపోతమె గోచరించును. అప్పటి బుద్ధిలో హానోపాదానాది నియమము లుండవు. ఈ నియమములు రసవిఘ్నములు. నిర్విఘ్నప్రతీతినిర్గ్రాహ్యమై మనోరసనిర్భరమై రస మవభాసించును. ఇందు స్వపరవిభాగ ముండదు. దేశకాలప్రమాత్రాదు లుండవు. సహృదయులు స్వసంవాదము పొందుదురు. సంస్కారోద్బోధనమున రసపరిపోష మనుభవింతురు. ఇదియె నిర్విఘ్నసంవిదనుభవము. జననాంతరసౌహృదములు

భావస్థిరము లగుటను కాళిదాసు సూచించి ప్రతిభాన మను సాక్షాత్కార స్వభావ మదయించుటను నిరూపించినాడు. అది యాస్వాదాత్మక మయిన ప్రతీతి. ఈ ప్రతీతిలో రతి భాసించును. అది యలౌకికము. మిథ్య కాదు. వీతవిఘ్నమయిన యీ ప్రతీతి రసము గోచరింప జేయును. విఘ్నవినిర్ముక్త మయిన యీ సంవిత్తియె చమత్కారము. రసన. సమాపత్తి. నిర్వేశము. ఆస్వాదనము.

౭. రస ప్ర తీ తి వి ఘ్న ము లు

సంభావనారాహిత్యము, స్వపరదేశకాలభావనము, స్వకీయసుఖదుఃఖపరవశత, ప్రతీత్యుపాయవికలత్వము, అస్ఫుటత్వము, అప్రధానత, సంశయ మను నీ సప్తకము విఘ్నములు. ఈ విఘ్నాపసారణ మావశ్యకము. తదుపాయము లున్నవి.

౧. ప్రయోగారంభములోని పూర్వరంగభావన రంగపరికరదృష్టి, ప్రస్తావనా పరిశీలనము ఆహార్యముల వివేకముల వలన సామాజికులకు మానస కాలుష్య ముండదు. అప్పుడు సంవేదనాంతర ముదయింపదు. విఘ్నము కలుగదు.

౨. లాస్యాంగములు నాట్యధర్మిసంభావనము సాధారణ్యసంపాదనముల వలన స్వపరాదివిశేషావేశ ముండదు. అహృదయుడును హృదయ వైమల్యము పొంది సహృదయీకృతు డగును. ప్రతీత్యుపాయములు భావకుడు సంపాదింప వలెను. ప్రమితిసర్వస్వ మంతయు ప్రత్యక్షపరాయణ మయినందున ఆగమానుమానముల వలన గలుగు విఘ్నముల విఘాతమునకు నాట్యాభినయముల భావింపవలెను. అభినయము ప్రత్యక్షవ్యాపారకల్పము. ప్రత్యక్షత్వప్రసిద్ధిచే స్ఫుటత్వము కలుగును. కావ్యనాట్య సమర్పితములందు ప్రధానతాదృష్టి యావశ్యకము. అప్పుడన్నియు పుమర్థనిష్ఠములు కాగలవు. సంవిదనుగృహీతము లయిన భావను లన్నియు సుఖ ప్రధానములు. ఏకఘనప్రకాశమున కివి యానందసారములు. శోకసంవిచ్చర్వణమున గూడ హృదయవిశ్రాంతి యున్నది. ఇట్టి విశ్రాంతి కలిగినచో నవిశ్రాంతిస్వరూప మయిన దుఃఖము కలుగదు. దుఃఖమునకు చాంచల్యము ప్రాణము. చంచలత యున్న దుఃఖము దుఃఖము కాదు. విభావాదు లనియతములు సర్వసాధారణము లనెడు భావము కలిగినచో నుదయించు సంశయ ముండరాదు. అందునకె విభావాది సంయోగ ముపాత్త మయినది. అన్నిటి సమాహారప్రత్యయములో శంకాకలంకము రాదు. అన్నియు నేకనియతము లగును. అప్పు డేకసంవేదన సామ్రాజ్యము సాక్షాత్కరించును. ఏవంప్రాయోపాయావలంబనము విఘ్నముల రానీయదు.

౮. ర స స్థి తి

లౌకికచిత్తవృత్తి ననుమానించుటలో రసత్వము లేదు. రసాస్వాద మలౌకికచమత్కారాత్మకము. రస విషయ రసనానిష్పత్తియె సూత్రము లోని నిష్పత్తి. విభావాది సంయోగమున రసన కలుగును. రసము రసనాగోచరము లోకోత్తరము. రసము రూపకముననె స్వరూపప్రతిష్ఠ పొందునని విశేషసాకల్య ముండుట హేతువని వామను డనెను. రూపకప్రబంధము భాషావేష ప్రవృత్త్యౌచిత్యాదుల

కల్పనమున రసనిదాన మగుచున్నది. తదుపజీవనమున ప్రవర్తించు ముక్తకమున గూడ ఈ భాగ్య మున్నది. సహృదయులు ముక్తకములలో పూర్వాపరము పరికల్పించుకొని పీఠబంధము కూర్పగా నసహృదయులును తదభ్యాసమున సహృదయు లగుదురు. అహృదయులకు నాట్యము నైర్మల్యాధాన మొనర్పగలదు. రస మననేమి? ఆస్వాద్యమాన మగుటచే రసము రస మగునని యుత్తరము. నానావ్యంజనసంస్కారము కలయన్నము భుజించువారు రసము లాస్వాదింతురు. భోక్త తదాస్వాదమున నేకాగ్రమానసు డగును. అన్యచిత్తమున భుజించువాని కాస్వాదము కలుగదు. సుమనసులన్నము భుజించుచు హర్షాదుల పొందుదురు. రసముల నాస్వాదింతురు. అట్లె బుధులు భావాభినయసంబద్ధము లయిన స్థాయిభావముల నాత్మసమావేశమున నాస్వాదింతురు. బుధు లిట్టి సంవిచ్చర్వణమున భావాస్వాద మొనరింతురని నాట్యరహస్యము. ఇది నాట్యరసాస్వాద ప్రక్రియ. సముదాయరూప మగు నాట్యమున రసము లిట్లుండును. నాట్యమె రసము. రససముదాయమె రసము.

అభినవుల యుపాధ్యాయులు కావ్యమున గూడ రసము లున్నవని యనిరి. వారు కావ్యకౌతుకములో.

"ప్రయోగత్వమనాపన్నే కావ్యే నాస్వాదసంభవః"

ప్రయోగపదవి నందుకొనని కావ్యమున నాస్వాదము లేదని యని కావ్యమున ప్రత్యక్షకల్పముగా సంవేదన ముదయించునని రసోదయ మగునని పలికిరి. వర్ణనాచమత్కార వైశద్యమున నుద్యాన కాంతా చంద్ర చందనాదులు ప్రత్యక్షాయమాణము లగునని వారి భావము.

శ్రీమదభినవు లిట్లనిరి. కావ్యము కూడ దశరూపకాత్మకమె. అందలి భాషావృత్తి కాక్వాదులు రసవత్త నాపాదింప గలవు. సర్గబంధకావ్యములో స్త్రీలును సంస్కృతవచన లగుట శక్తిగహితుని కావ్యక్రియ యనరాదు. సర్గబంధౌచిత్యమున నది యట్లు సంగతము. సంధిసంధ్యంగాదులను సర్గబంధానుగతముగ సంభావింపగా నాట్య ముల్లసించును. సహృదయులు కొందరు స్వభావముననె నిర్మలహృదయదర్పణులు. చర్వణ వారి సంపద. అంతట వారలకు రసము సాక్షాత్కరించును. ఇట్లు కాజాలనివారు ప్రత్యక్షోచిత చర్వణా లాభమునకై నటాదిప్రక్రియ నభిలషింతురు. రసము నాట్యముననె కాని లోకమున లేదు. కాని కావ్యమును నాట్యము. కావ్యమున రస మున్నది. ఆస్వాద మున్నది.

నటునందు రసము లేదు. అతడు కేవలము పాత్రము. పాత్రమునకు పాయసాస్వాద ముండదు. నటునకు రసభావయోగము లేదు. ఉన్నదని తలచుట భ్రమ. నటుడు పాత్రలీనుడై సామాజికులకు తాదాత్మ్యాభిమాన ముత్పాదించును. ఇట్లు నటోపయోగము భావించుట యుచితము.

## ౯. భావరసములు

రసముల వలన భావము లుదయించునా? భావములవలన రసము లుదయించునా? రసమున భావము, భావమున రసము నని యన్యోన్య జనకత సమ్మతమా? రసము భావహీనము కాదు. "న భావహీనోऽస్తి రసః" భావము రసవర్జితముగ నుండదు. "న భావో రసవర్జితః" రసభావముల సిద్ధి పరస్పరకృతము. భావమునకు భావత్వము రసాధీనము. రసమున రసత్వనిష్పత్తి భావాధారము. ఇందన్యోన్యాశ్రయ మున్న నది దోషము కాదు. ఏకక్రియలో నది దోషము. క్రియాభేదమున నది దోషము కాదు. ఇది భావ రస రహస్యము.

కావ్యము వృక్షము. నటవ్యాపారము పుష్పము. సామాజికరసాస్వాదము ఫలము. విశ్వము రసమయము. మూలము రసము. రసవివర్తమంతయు రసము.

నాట్యరసముల కుత్పత్తి వర్ణ దైవతము లున్నవి. ఇవి విశేష లక్షణాంశపూరకములు. వర్ణ దేవతా నిరూపణము రసాగమానువిద్ధత్వము సూచించును. శృంగార రౌద్ర వీర బీభత్సములు హాస్య కరుణాద్భుత భయానకముల కుత్పాదక రసములు. ఒక రసము యొక్క ఫలానంతరము ద్వితీయరస మవశ్యంభావి. రసవర్ణము పూజాధ్యానోపయోగి నటులకు ముఖరాగ యోజనోపయోగి. లోకచిత్తభావములకు యథాయోగము విభావముల నాహరించు కవినటులు వానికి రసత్వ మాపాదింతురు. రసరసనమునకు కవుల నవదృష్టి యొకటి సవ్యాపార మగును. విపశ్చిద్దృష్టి మరియొకటి యున్నది. ఈ దృష్టిద్వయమున రసమయవిశ్వ మనిశము నిర్వర్ణనము చేయుట యావశ్యకము. నటనోపజీవులగు నటులకు నవదృక్కు రాదు.

## ౧౦. శృంగారాదులు

శృంగార ముజ్జ్వలవేషాత్మకము. శృంగారాదినామములు శాస్త్రమర్యాదల ననుసరించి యున్నవి. వృద్ధవ్యవహారమున రూఢములై యున్నవి. కావ్యమందలి రతిస్థాయి ప్రారంభాది ఫలపర్యంత ముండును. ఆధారభేదమున రతిభేద ముండు ననుట రసతత్త్వానభిజ్ఞత. రతి యంతట నేకరూపము. శృంగారమున సంభోగమని విప్రలంభమని రెండధిష్ఠానము లున్నవి. ఈ దశాద్వయము నందును తదాస్థాబంధాత్మక మయిన రతి యనుగతముగనె యుండును. సంభోగమున విప్రలంభసంభావనా భీరుత్వ ముండును. విప్రలంభమున సంభోగ మనోరాజ్యానువేధ ముండును. ఉజ్జ్వలవేషము లేకున్న నుత్తమరతి కలుగు ననుట యతక్షభాషితము. సంభోగశృంగారమున హృద్యతమ మయిన విషయసంభార మంతయు పూర్ణముగ నున్నప్పు డుత్తమునకు రతి కలుగును. కావుననె రత్నావల్యాదులలో సర్వము సంగృహీత మయినది. సంభోగమున నిర్వేద సదృశములు వ్యభిచారులు కాజాలవు. విప్రలంభములో దుఃఖమయము లయిన వ్యభిచారు లున్నవి. సంభోగములో రతిశ్రమ కృత నిద్రాదు లుండవచ్చును గాని వాని నిరూపణము చిత్రత నాపాదింపదు. విప్రలంభములో నవి చిత్రతాపాదకములు. రతి

భావనచే నిద్రయు నిద్రాభావనచే రతిభావనయు పరస్పరము జాతపోషములై వైచిత్రి నాపాదింప గలవు. విరహమున శృంగారము పుష్ట మగును. విరహము వినా ప్రయోగ మున గాని కావ్యమున గాని శృంగారము హృద్యము కానేరదు. కావుననె కవులు సంభోగశృంగారమున కలహవిప్రలంభము హేతువుగా వైషమ్యమునో గోత్రస్ఖలిత స్పర్ధనో యితరమునో నిబంధింతురు. కామము వామ మని కామసూత్రము. విప్రలంభ మున విభావము కాని స్థాయి కాని సంభోగసమయ విభావస్థాయుల కన్న భిన్నము కాదు. శృంగారము పురుష ప్రమదా యుక్త మనుట యుక్తము. పురుషుడు భోక్త. భోక్తృత్వమున పురుషునకు ప్రాధాన్య మున్నది. ప్రమదకు భోగ్యత్వమె కలదు. ప్రాధాన్య ముండుట వలన పురుషుడు భోగ్యమున పరతంత్రుడు కాడు. అందుననె నాయికాంతర యోగ మున్నను పురుషునకు శృంగారహాని లేదు. ప్రమద భోగ్యపర తంత్ర. అన్యసంబంధసమ్మీలనములో శృంగారభంగ మున్నదని రసదర్శనము. ఇది శృంగారపద్ధతి

హాస్యము హాసస్థాయిభావాత్మకము. శృంగారమున రతిస్థాయి యాస్వాద మొదవించిన పిమ్మట రతిరూపముననె యుండదు. హాస్యములోని హాస మాస్వాద ముదయింప జేసియు హాసైకస్వభావముగనె యుండును. ఆత్మస్థము పరస్థమని హాస్యము ద్వివిధము. ఒక్కొకడు విభావముల గుర్తించియు గాంభీర్యమున నవ్వక పోవుట కలదు. అట్టి వారును పరకీయ హాస మవలోకించి హాసము కలవారగుట లోకప్రసిద్ధమె. హాసమున సంక్రమణ స్వభావ మున్నది. సంక్రమణ శీలు నం దది సంక్రమించును. స్త్రీలలో నీచప్రకృతులలో హాస్య మధికము. హాస్యములో నారు భేదము లున్నవి.

కరుణము శోకస్థాయిప్రభవము. క్రోధస్థాయిభావాత్మకము రౌద్రము. స్థాయి భావప్రభవత్వ మిందు లేదు. ప్రతీతి నుత్పాదించియు క్రోధము క్రోధముగనె యుండును. కరుణములో ప్రతీత్యుత్పాదక మయిన శోకము శోకముగ నుండదు. రక్షోదానవులందే రౌద్ర ముండు ననుట కాదు. ఇతరులకును రౌద్రము కలదు. కవి నిరూపితుల కందరకు గలదు. నటు డనుకరించు వారల కందరకును గలదు. ఉద్ధత మానవులు బహుబాహువులతో నుండరు. సంగ్రామసంప్రహారములతో నుందురు. పరశురామాశ్వత్థామాదులు వీరప్రధాను లయినను కారణాంతరమహిమచే రౌద్ర యోగ్యులు నగుదురు. తగిన కారణ మున్నచో గాత్మసాదులును క్రోధమును విడనాడి హాసశోకాదులు కలవా రగుదురు. ఆస్వాద మనునది హృదయసంవాదరూపము గాన తామసప్రకృతు లయిన సామాజికులకే క్రోధమున హృదయసంవాదము కలు గును. అట్టి సామాజికు లాకవిధముగ దానవ సదృశులు.

వీర ముత్తమప్రకృతిక ముత్సాహాత్మకము. భయానకము భయస్థాయిభావాత్మ కము. వీరము భీతాభయప్రదానసారము. కావున వీరానంతరము భయానకము క్రమ ప్రాప్తము. బీభత్సము జుగుప్సాస్థాయిభావాత్మకము. అద్భుతము విస్మయస్థాయి భావాత్మకము, రూపకాంతమున అద్భుతము ప్రయోగింప వలెనని నియమము కలదు.

వాక్యశృంగారము వేషశృంగారము క్రియాశృంగారమని శృంగారము మూడు విధములు. ఇట్లే రసము లందవాంతరభేదము లున్నవి. శుద్ధబీభత్సము సంసారనాట్య నాయకరాగములకు ప్రతిపక్షము గానుండి మోక్షసాధన మగును.

## ౧౧. శా ం త ర స ము

శమస్థాయి భావాత్మకము. శాంతమున దుఃఖము లేదు. మత్సరము లేదు. రత్యాదు లన్నియు వికారములు. శాంత మొక్కటి ప్రకృతి. స్వస్వ నిమిత్తము ననుసరించి శాంతము వలన భావము కలుగును. నిమిత్తము తొలగిపోగా భావము సర్వము శాంతము నందే విలీన మగును. కొందరు శాంతము లే దందురు. శాంత మితరము లం దంతర్భవించు నందురు. శాంతము శమస్థాయిభావాత్మకము. శమ శాంతములు పర్యాయములు. శాంతము రస మన్నచో "భావములు నలుబది తొమ్మిది" అను సంఖ్యానము కుదురదు. అధ్యయనాదులు శాంతవిభావములు కాజాలవు. కామాద్యభావ మనుభావమనుకాజాలదు. సర్వచేష్టల యుపరమ మెన్నడు ప్రయోగ యోగ్యము కాదు. ధృత్యాదులును వ్యభిచారులు కాజాలవు. శాంత మను రస మెట్లు సంభవించును? శాంతము లేదు.

ఈవిషయమున నిది సిద్ధాంతము. శాంతము రసము. మోక్ష మను పరమపురుషార్థ మునకు దగిన చిత్తవృత్తి హృదయసంవాద భాజను లయిన సహృదయుల కాస్వాద్య మానమై రస మగును. వ్యభిచారి భావ ప్రస్తావ ప్రారంభమున ముని నిర్వేదమును అమంగలమయినను మాంగలిక మని నిరూపించుట చూడ "నిర్వేద మొకప్పుడు స్థాయి భావ మగు" నని తలచి నట్లయినది. తత్త్వజ్ఞానజన్య మయిన నిర్వేదము తదన్యస్థాయి భావముల కుపమర్దకము. నిర్వేదము పరమ స్థాయి శీలము. ఈ నిర్వేదము తత్త్వజ్ఞాన జన్యము. దారిద్ర్యాదుల వలన గలుగు నిర్వేద మిందు స్థాయి కాదు. తత్త్వజ్ఞానజన్య నిర్వేదము స్థాయి యనుట కన్న తత్త్వజ్ఞాన మె స్థాయి యనుట యుక్తము. తత్త్వజ్ఞానము శమము. శమ మె స్థాయి. వైరాగ్య నిర్వేదములకు భేద మున్నది. శమశాంతములు పర్యాయములు కావు. హాసహాస్యములు పర్యాయములు కావు. అవి లౌకికాలౌకిక ములు. సాధారణాసాధారణములు. శమశాంతములు నిట్టివి. రత్యాదిచిత్తవృత్తులు తగిన విభావముల విశేషసంశ్రయమున విచిత్రము లగును గావున వాని యం దొకటి శాంతస్థాయి కావచ్చునని కొందరు భావించుట మునిమత విరుద్ధము. అలౌకికవిభావాది సంసర్గ విశేషమున రత్యాదు లపవర్గవిషయము లయిన కావచ్చును కాని వాని యందేదియు శాంతస్థాయికాజాలదు. వాని స్థాయిత సుదృఢము కాదు. శిథిలము. రత్యాదు లన్నియు కలిసి స్థాయి యగు ననుటయు మనోజ్ఞము కాదు. చిత్తవృత్తు లెప్పుడును సమకాలమున గలుగవు. తత్సమయములో తదన్యోదయ ముండదు. అవి భాగమున రత్యాదు లుండు ననుట భావతత్త్వము కాదు. తత్త్వజ్ఞాన మె స్థాయి. ఇది నిత్యసాయి. ఇది సిద్ధస్థాయి. సకలభావాంతరములకు తత్త్వజ్ఞానము భిత్తి. రత్యాదుల

నిది వ్యభిచారీకరించును. ఇది సిద్ధస్థాయి యగుటచే భరతుడు వేరుగా గణింప లేదు. పరిగణనము యుక్తమును గాదు. రసమునకు సంబంధించిన పర్యంతాస్వాదము సర్వము, శాంతస్వరూపముగనె యుండును. సర్వరసముల కిది ప్రకృతి. శ్రీమత్సిద్ధాంత శాస్త్రము;

"అష్టానా మిహ దేవానాం శృంగారాదీన్ ప్రదర్శయేత్
మధ్యే చ దేవదేవస్య శాంతం రూపం ప్రకల్పయేత్"

అష్టదేవుల కష్టరసములు, దేవదేవునకు శాంత మని వాకొనినది. రత్యుత్సాహాదు లుపరాగ సంపాదకములు. ఆత్మస్వరూపమునందు వానివలన నుపరంజనము కలుగును. ఉపరక్తాత్మయె వాని యం దనుభూత మగును. రత్యాదు లుపరంజకములుగా లేక పోయిన నాత్మభావము వలె శాంత మవభాసించును. శాంతము ప్రయోగప్రబంధ మహిమచే లోకోత్తరానంద మిచ్చి సంవిన్మయ మగును. ఇది దీని తత్త్వాస్వాదప్రక్రియ.

నవరసములె పుమర్థోపయోగులు. ఇవియె యుపదేశ్యములు. స్నేహము లౌల్యము భక్తి రస మనుట రసహృదయము కాదు.

## ౧౨. భావ చ క్ర ము

భావశబ్దమున చిత్తవృత్తి విశేషములె వివక్షితములు. వానికి యోగ్యతావశమున స్థాయిసంచారి విభావానురూపత సంభవించును. బాహ్యము లయిన విభావములనుభావములు భావవ్యవహార్యములు కావు. స్థాయి వ్యభిచారి సాత్త్వికములె భావములు. "భవతీతి భావః, భావయతీతి భావః" అని భావపద వ్యుత్పత్తి. భావ మని యనుట యేల? వేని నవి భావింప జేయును? వేని వ్యాపించును? ఏమి యాచరించును? ఇట్టివి భావవిషయమున గలుగు ప్రశ్నలు. వాగంగసత్త్వసముపేతము లయిన కావ్యార్థముల నివి భావింప జేయును కాన భావము లయినవి. ఇందు వాచికాదు లంతరంగములు. ఆహార్య మంతగా నిందు ముఖ్యము కాదు. వాచికాదులు మొదటి దశలో దేశకాలవిశేషగతములుగా నున్నను సాధారణీభావము పొంది సామాజికాత్మలను భావింపజేయ గలవు.

"కవేరంతర్గతం భావం భావయ న్భావ ఉచ్యతే" వర్ణనానిపుణు డయిన కవి యనాది ప్రాక్తన సంస్కార ప్రతిభానమయ మగు భావము కలవాడగును. ఆతని యా భావమును సమాస్వాదయోగ్యముగ జేయునదియె భావము.

విభావ మనునది విజ్ఞానార్థము. వాగంగసత్త్వాభినయము దీనిచే విభావిత మగును. అనుభావము వాగంగసత్త్వాభినయముల ననుభావితముల జేయును. భావముల జెప్పునప్పుడు విభావానుభావముల జెప్పవలసి యున్నది. ఇవి లోకస్వభావముననె సిద్ధములగును. భావములు స్థాయి వ్యభిచారి సాత్త్వికము లని మూడు విధములు. సహృదయుల హృదయసంవాదము పొందిన రసోద్భవభావము శరీరధాతువు లం దంతట ప్రసరించును. నరులలో నరపాలకుడు వలె, శిష్యులలో గురువు వలె, స్థాయి సర్వభావము

లందు మహత్తర మని సంభావింప వలెను. స్థాయి భావాభినయము స్పష్టసంకేతిత మయినది. తద్విజ్ఞానము స్థాయిసంవేదనమున కత్యంత ముపకరించును.

వ్యభిచారిభావములు రసములందు వివిధరీతులతో సంచరించును. ప్రయోగమున సంవాదము కలుగు విధమున రసములను సహృదయులకు చర్వణాస్పదములను జేయును. దృష్టశ్రుతము లగు జగజ్జడపదార్థములు భావసంభావితము లయినప్పుడు స్వస్పంద సుందర మయిన యనుభూతి ప్రారంభములో చిత్తవృత్తులందు స్పంద ముదయించును. కించిద్విషయముగా నున్న చిత్తస్పందము వృత్త్యాత్మకమై గూఢముగా నున్న సంస్కారాత్మక మయిన స్మృతి నందుకొనును. స్మృత్యాత్మక సంభావనముతో ప్రకృత స్పంద ధార సంవాదము పొందగా భావ మను సంకేతము కలుగును. ఈ భావములు తమ యంతట తా ముండుట స్వరూపప్రతిష్ఠ కాదు. రసాభిముఖముగనె యవి వ్యాపారము సారించి స్వప్రతిష్ఠము లగును. ఇది వీని తంత్రము. వ్యభిచారిభావములు ముప్పది మూ డున్నవి. వీని నభినయమున సాభిమానముగ సావధానముగ గుర్తించుటకై భరతుడు లక్షణపరిష్కార మొనరించినాడు. వీనిని దేశ కాలావస్థానుసారమున స్త్రీపురుషులు తమ తమ ప్రయోగవశమున నుపపాదించి సామాజికహృదయసంవాదము సంపాదింప వలసి యున్నది.

సాత్త్వికములు. సత్త్వము సర్వభావములకు మూలము. సత్త్వశాలియె భావముల నభినయింప గలడు. అంతట సత్త్వసామ్రాజ్య మున్నది. కాని సాత్త్వికములందె సత్త్వ మున్నది. మనస్సమాధిలో సత్త్వము జనించును. రోమాంచాదులు సత్త్వస్వభావములు. ప్రాణాత్మక మయిన వస్తుతత్త్వమె సత్త్వము. ప్రాణవస్తువె సత్త్వము. పృథ్వీభాగ ప్రధాన ప్రాణసంక్రాంత చిత్తవృత్తి స్తంభము. జలభాగ ప్రాధాన్య మున్న బాష్పము, తేజస్సంబంధమున స్వేద వైవర్ణ్యములు, ఆకాశానుగ్రహమున ప్రళయము, వాయుస్వాతంత్ర్యములో రోమాంచ వేపథు స్వరభేదములు కలుగును. ఇది సాత్త్వికభావస్థితి యని భరతవిదుల వేదనము. నానావిధాభినయములకు సంబంధించి రసోద్దీపన సమర్థము లయిన సాత్త్వికములను ప్రయోక్తలు రసమున ప్రయోగింప వలెను. రసమాత్రమున సాత్త్వికము లేకున్నను ప్రాధాన్య మున్నందున తత్పురస్కృత మయిన విశేషమె సాత్త్వికములకు సర్వరసము లందర్హస్థాన మిచ్చినది.

కావ్య మనేకరసముల నానాభావముల నిబంధించును. బుధుల కావ్యరసయోజనము సుశ్లిష్టబంధము. రసములు పుష్పావకీర్ణము లగునట్లు సమీక్షించు బోధ బుధాధీనము. సర్వ మిది తెలియుట సహృదయస్వాత్మసిద్ధి. ఇది రసభారతి.

౧3. నాటకమీమాంస

నాట్యసంగ్రహ నిరూపితార్థముల పరస్పర సంబంధ మున్నది. దశరూపవికల్పన మిందు ప్రసంగసంప్రాప్తము. రూప మర్థమును ప్రత్యక్షీకరించును. అర్థవాచక కావ్యము రూపము. ఇందు పదిభేదములు. ఇతరములు సంగతములు కావు. అభినయ

చతుష్టయములోని వాచికాభినయ సంభావనమున ఈ దశరూపవికల్పనము వాగ్భాగ
మునకే విస్తృతవర్ణన మని తేలును. పరస్పరసంబంధ సముచితమైన యోగము కలా
ప్రయోగముతో దీని వర్ణన మావశ్యకము. రూపవికల్పనము నాట్యశివుని తైజస
చక్షువు. నాటకాదిదశకము సంధ్యాదివ్యవస్థాసహిత మైన దగుట ఇతిహాసాది
విలక్షణ మని కొందరు తలచిరి. అది ఫల్గుప్రాయము. ఈ దశరూపకల్పము రసా
వేశము ప్రత్యక్షీకరించును. కేవల మిది పాఠఫలకము కాదు. ప్రయోగపర్యంత
ప్రసార మిం దున్నది. సర్వకావ్యములకు వృత్తులు మాతృకలు. విశ్వమంతయు వృత్తి
వ్యాప్తము. వృత్తులు, కవిహృదయమున వ్యవస్థితములై కావ్య ముత్పాదింపగలవు.
ప్రత్యక్షభావనాయోగ్యము లైన నాల్గువృత్తు లుండుట దశరూపసామాన్యలక్షణము.
జాతిశ్రుతులగూడి స్వరములు గ్రామరూపము పొందినట్లు వృత్తిభేదమున కావ్య
బంధము లుదయించును. షడ్జ మధ్యమ గ్రామములు రెండును పూర్ణస్వరములు. నాటక
ప్రకరణములు రెండును సర్వవృత్తినిష్పన్నములైన రమ్యప్రసిద్ధ కావ్యబంధములు.
వృత్తిన్యూనములైన రూపకములు కొన్ని యున్నవి. రూపకము లీ పదియే గాక నింక
నెన్నియేని సంభవింప వచ్చును. రెండును పూర్ణవృత్తికము లైనను కొంత మిథో భేద
మున్నది.

నా ట క ము: దశరూపకములలో నాటకము ముఖ్యము. పది యంశములు నాట
కతత్త్వమును ప్రకాశింప జేయుచున్నవి. రాజర్షి వంశచరిత మిందు వర్ణితము కావలెను.
సర్వథా దేవచరిత మవర్ణనీయము కాదు. పతాకా ప్రకరీరూపమున దానిగూర్ప
వచ్చును. దేవతాచరిత మముఖ్యముగ వర్ణించుటయే యుక్తము. మానుష చరితము
గనే దేవచరితమును నిబంధించినచో హృదయసంవాదము లభింపదు. నాటకము నం
దంతట గుణనిబంధనమే సముచితము. అప్రధాన చేష్టితములను వర్ణింపరాదు. ప్రతి
నాయక గుణములను వర్ణింప వచ్చును గాని, వానినప్రాయప్రధానములుగా వర్ణింప
వలెను. అంకప్రవేశకములతో నాటకరూపకమునకు రూప మాపాదింపవలెను.
అవాంతరవస్తుసమాప్తి విశ్రాంతికై యంకము లావశ్యకములు. ఇట్టి నాటకము హృద
యానుప్రవేశమున రంజన ముల్లాస మిచ్చి, హృదయశరీరములను నర్తింప జేయును.
ఉపాయవైచిత్ర్యము మొదలుగాగల బహుప్రకారములైన సుఖదుఃఖోత్పత్తులు మానవ
చరితము నందున్నట్లు, దేవచరితము నం దుండవు. అందుననే దేవచరితనిబంధనమున
ప్రతీతివిఘాతము కలుగును; వైరస్య ముదయించును. కావుననే వర్తమానచరితము
గూడ వర్ణనీయము కారాదు. నాటకార్థము వలె సర్వరూపకార్థము హృదయా
ప్రవిష్టమై వినేయులను వినీతులను జేయగలదు. అందుననే నాటకశబ్దము సర్వరూపక
సామాన్యవచన మైనది. పాలకప్రభువు లవశ్యవ్యుత్పాద్యులు. వారి వ్యుత్పత్తిద్వార
మున విశ్వ మంతయు వ్యుత్పన్న మగును.

అ ం క ము: ముఖ్యకథావస్తువును సంపన్నము చేయ దలచి నపుడు, నానావస్థ
లం దవభాసించును. కథావస్తువు, అవస్థాపంచకమున సంచరించునది కాగా, నా యా

యవస్థల పూర్ణత్వములో నంకనియమ మావశ్యకము. అయి దవస్థల కయి దంకము లుండవలెనని భాసించును. కాని, రూపకము పంచాంకాధికమును కావచ్చును. అంక సంకేతము సాభిప్రాయముగా నున్నది. నాట్యాత్మ రూపకమున కిది నానాత్వ మిచ్చును. భావరసగూఢార్థ మంక మైనది. నాటకీయ బీజార్థమునకు సంబంధించిన దశావిశేషములు కొన్ని కలవు. వానికి సంహార మని పేరు. ఉత్పత్తి, ఉద్ఘాటనము, ఉద్భేదము, గర్భనిర్భేదము, ఫలసమానయనము, అనునవి బీజదశావిశేషములు. ఇట్టి నాటకీయావస్థాప్రకాశము కల సన్నివేశరమ్యార్థములు, సంస్కృతనాటకములలో సుశ్లిష్టములై యున్నవి. ఇంక నంకములో "చూడ, అంకావతారము, అంకముఖము," అను విశేషములు సంభావనీయములు. అంకము లందు నాయకుల ప్రత్యక్ష చరిత సంభోగములు నిరూపితములు కావలెను. ఇవి యున్ననే ప్రేక్షకుల కుదయించు వైర స్యము నశించును. ప్రతినాయికగతము లైన అవస్థాచరితసంభోగము లుపాదేయములు కావు. అంక మనేకరసాంకిత మగును. రంజనాతిశయము కలదియు నగును. అంక ప్రయోగమున కాలపరిమితి యున్నది. ఏకదినవ్యాప్తి అంకపరిమితి. ఏకదిన మనుట పంచదశముహూర్తము లని గుర్తింపవలెను. ప్రేక్షకులకు ప్రయోక్తల కావశ్యకము లైన కార్యమున కవిరోధముననే యంకి ముండవలెను. బీజార్థయుక్తియుక్తమైన కార్యరసానుకూల కార్య మొనరించి రంగప్రవిష్టులు నిష్క్రమింపవలెను. ఏ కార్య మైనను సర్వవిధముల స్వాత్మపూర్ణమే యగును. అందుననే సర్వము విభాగమున ప్రద ర్శింపవలెను. అంకమున సర్వకార్యములు ప్రత్యక్షముగా ప్రదర్శనీయములు కావు. అట్టివి ప్రవేశకప్రదర్శనీయములు. అదృష్టార్థములను కూడ హృదయమున ప్రవేశపెట్ట గలవి కావున ప్రవేశకములు ప్రవేశకము లైనవి. ప్రవేశకప్రవేశకము పరిజనకథాను బంధముతో నుండును. అంకార్థసాధనమునకు సంధానమునకు ప్రవేశక ముపకారి. నాటకమున ప్రకరణమున పంచాద్యముగా దశావరముగా నంకము లుండవలెను. తదతిరేక మాశంకితము కారాదు. నాటకమున వలె నితరరూపకములందు కార్యోప దేశము విస్తృతము కాదు. అందు పరిమితము. అందుననే ప్రవేశకోపయోగ మంతగా నుండదు. ప్రవేశములందుండు కార్యము బహ్వాశ్రయ మైనను సంక్షిప్తము చేయు టయే సముచితము. సంధానమున నుపయోగించు నంతగా వాని నచ్చట చెప్పవలెను. ప్రయోగబహుమానమును ప్రయోక్త పరిశీలింపవలెను. అందుననే దివసకార్యము లందు సుందర ముపదేశకమే ప్రత్యక్షప్రదర్శిత మగును. రంగ నిషిద్ధములు కొన్ని యున్నవి. మరణము ప్రయోజ్యము కారాదు. మరణానుభావములు వర్ణింప వచ్చును. మరణమును వర్ణింపవచ్చును గాని, ప్రత్యాపత్తి శూన్యముగ వర్ణింపరాదు. వ్యాధి జన్యమరణము, అభిఘాతజన్యమరణము, రంగప్రయుక్తము కావచ్చును. మరణాఖ్యా నముగాని, తద్యత్నముగాని సర్వథా యనాఖ్యేయము. నాయకవధము చూపరాదు. వర్ణింపరాదు. ఇట్టివిషయము లన్నియు సమన్వయసూత్రములో సమీక్షింప దగి యున్నవి.

నాటకముగాని ప్రకరణముగాని మహాజనపరివారముగా నుండరాదు. అనేక జను లుండరాదు. మహాజనులకు చిత్తసంకోచ మిచ్చు కార్యము లుండరాదు. ప్రయోగ వశమున పురుషప్రకర్ష మావశ్యకమైనచో పదిమంది యుండవచ్చును. అంత కధికముగ నున్నచో నభినయ చతుష్టయ మవిభావనీయ మగును. దేవయాత్రలో జనులవలె నెవరును ఉపలక్షితులు కారు. గోపుచ్ఛాగ్రకల్పముగా నాటకరూపము నిరూపింప వలెనని నియమ మున్నది. సారరూపములైన యుదాత్తభావములను పర్యంతమున ప్రతిపాదింపవలెను. నిర్వహణమున నంతట నద్భుత మావశ్యక మగుటలో నిదియే తంత్రము. ప్రబంధార్థమున కేకవాక్యత ప్రాణము. అదిలేకున్న ప్రబంధమే యుండదు.

ప్రకరణము: కావ్యనిర్మాత కవి, ఆత్మశక్తి ననుసరించి సాధ్యఫలమును తదుపాయమును తద్వస్త్వాదికమును వర్ణించునేని అది ప్రకరణ మగును. కవిప్రతిభా సముత్పన్నవస్తు వుండవలెనని భావము. కతిపయ యువకవులు వస్తు వుత్పాద్య మొనరింపరు. ప్రకరణము నిర్మాణింప దలతురు. అట్టివారు అనార్ష వస్తువును పరిగ్రహింప దగును. పురాణాదివ్యతిరిక్తము లైన బృహత్కథాదులు అనార్షములు. వారందలి చరితముల స్వీకరింప వచ్చును. పూర్వకవి కావ్యములనుండి యేని వారు వస్తు వాహరించుకొన వచ్చును. వారట్లాహరించిన వస్తు వాహార్యము. ఆహార్యమున్నచో ప్రకరణ మగును. పూర్వప్రసిద్ధ కవి కావ్యాంతర గుణముల నిది ప్రకర్ష యుతము చేసినందున ప్రకరణ మగుచున్నది. విప్ర, వణిక్సచివ, పురోహితామాత్య సార్థవాహ చరితము ప్రకరణమున ముఖ్యము. ఇందు నాయకు డుదాత్తుడు కాగూడదు. దివ్యచరిత మిందుండరాదు. రాజసంభోగము ప్రకరణమున నుండనగదు. వారి భోగస్పర్శల కిం దవకాశము లేదు. విప్రవణిక్సచివాదుల భోగసంభోగములే ఇందు ముఖ్యములు. ప్రకరణము బాహ్యజనులతో నుండును. కంచుకి మొదలైన అంతఃపురజను లిందు నియుక్తులు కారాదు. దాస విట శ్రేష్ఠులిందుండ దగుదురు. వేశ్యస్త్రీల యుపచారము లిందుండ దగును. ప్రకరణము మంద కుల స్త్రీ చరితము కావలెను. కులస్త్రీ చేష్టితము మందముగనే యుండవలెను. కులస్త్రీయు మందకులయే కావలెను. ఇట్టి లక్షణాంశములను పరిశీలింపగా ప్రకరణము సప్తవిధముగ గోచరించును. ప్రకరణము వేశవనితా యుక్తమైనచో, కులస్త్రీసంగమ ముండరాదు. కులజానప్రయుక్త మగునేని, వేశయువతి యుండరాదు. కారణయుక్తి ననుసరించి, వేశవనితోపచారము కులవనితోపచార ముండవలసి వచ్చినచో, భాషాచార మవికృతముగనే నిరూపింప వలసి యున్నది. కులవేశ్యావనితాసంబంధమున కలుగు భేదములను గూడ పరిగణించినచో, ప్రకరణమున నిరువదియొక్క భేదములు కలుగుట ప్రసిద్ధము.

నాటిక. నాటకము రాజప్రాయజనులకును, ప్రకరణము మధ్యప్రాయజనులకును పురుషార్థవ్యుత్పాదక మైనది. భేదకథనమున ప్రకరణములో చిత్రవ్యుత్పత్తి సూచిత మగును. రూపకముల లక్షణసాంకర్యము బహుభేద సంభవహేతువు. నాటక, ప్రకరణసంబంధము సూచించినచో సర్వరూపకదర్శనము కలుగును. ఈ రెండిటి బంధ

యోగమున మఱొక భేద ముదయించును. నాటకయోగబాహుళ్య మున్నచో ప్రఖ్యాత మని, ఇతరసంబంధ మధికమగుచో నితరమని యనుట యుక్తము. అయిన నీ యుభయ యోగము నాటికా హేతువైనది. ఉత్పాద్యవస్తువు అంతఃపురసంగీత కన్యారాగము, స్త్రీప్రాయత, చతురంకత, కైశికీబంధరమ్యత నాటికాస్వభావము. నాటికయన్న స్త్రీత్వము సౌకుమార్యము సూచించును.

సమవకారము. వీథి క్రమప్రాప్త మైనను, సమవకారనిరూపణము సాభిప్రాయము. ఉద్దేశక్రమము పరిగణనీయము కాదు. అది నాటికావిచ్ఛిన్నమే అయినది. సమవకారము త్రివర్గోపాయమె సూచించును. వీథ్యాదు లిట్టివి కావు. త్రివర్గసాధకమై అనేకాంకము లున్నందున సమవకార సమీక్ష సముచిత మైనది. కపట విద్రవ శృంగారములు మూడు మూడుగా నిందుండును. ద్వాదశ నాయక బహుళమగు సమవకారమున వంక మంక మన్యార్థముగా నుండ వలెను. త్రివిధ శృంగార మిందున్నది. కామ మున్నంతమాత్రమున కైశికి రాదు.

ఈహామృగాదులు రూపకరూపములో విచిత్రత నాపాదింప గలవై ప్రసిద్ధములుగా నున్నవి. డిమమునందు సంధులు రసము లసమగ్రములుగా నుండును. కావ్యయోనియైన కావ్యవస్తు విందు దీప్తరసముగా నుండును. డిమమును నానాశ్రయభావసంపన్న మనవలయు ననుట సర్వభావయుక్తత వైచిత్ర్యము సూచిత మైనది. వ్యాయోగము డిమమునకే శేషభూతము. ఏకాంక మేకాహచరితవిషయ మైనందున, ఏకాంకతయు న్యాయప్రాప్తము. ఉత్సృష్టికాంకము కరుణప్రధానము. స్త్రీలపరిదేవన మిందు బహుళము. భారతియ యిందలి వృత్తి. దివ్యనాయకులు భారతవర్షావతీర్ణులై యుద్ధాదు లొనరించినట్లు ఇందు ప్రదర్శింపవలెను. దేవవిహితములైన యన్యవర్షము లుండగా భారతమే యిష్టమైన దేమి! అవి యన్నియుభోగభూములు. వారల కందు సంభోగమే సముచితము. ఈ వర్షమున వారలకు కర్మారంభమే. భారతమునవా రవతరింపగనే దుఃఖ ముదయించును. కాని యది పూర్ణము కాదు. అట్లేయైన దేవత్వ ముండదు. భారతవర్షమున నే వారలకు శోకదుఃఖములు వర్ణితములు కావలెను. విశోకులైన వారిసన్నిధానమున సశోకులకు శోకావసర ముండదు. గాఢదుఃఖాభిభూతు లేవంవిధ ప్రయోగదర్శనమున సుఖముగా వినేయులు కాగలరు.

ప్రహసనము హాస్యప్రాయము. రంజనప్రధానము. శుద్ధము, సంకీర్ణ మని ఇది రెండువిధములు. భగవత్తాపసవిప్రాదులు కుత్సితపురుషులై ఇందుందురు. కాపురుష సంప్రయోగము, వికలసంభాషణము, అసత్యాశ్లీలభాషలు ఇందుండును. ఒక దుష్టుని చరితమే ప్రహసితమైనచో శుద్ధము. వేశ్యాదియోగము అనుల్బణములైన యాకలాపదులు కూడుకొన్నచో సంకీర్ణము. భగవత్తాపసాదులు ప్రాకృతపురుషుల సంక్రాంతి దౌరాత్మ్యమున ప్రహసనీయు లగుదురు. సర్వభోగ్యవేశ్య, చేటవిటధూర్తాదులు సంకీర్ణమున నుందురు. "శాక్యులకు స్త్రీసంపర్కమే ప్రహసనీయము. చౌర్యము ప్రహసనీ

యము కాదు” అనునట్టి యంశము ప్రహసనీయ మెుకర్పవలెను. ప్రహసనీయ చరితావ లోకనమున లోక మెుకవిధముగ నుత్పాద్యమై సంస్కృతము కాగలదు. మరలనట్టి వంచకుల నుపసర్పింపదు. శుద్ధ మేకాంకము. సంకీర్ణము వేశ్యాదిచరితసంఖ్యాబల మున్నందున ననేకాంక మని ప్రహసనప్రియులు పల్కిరి. కాని, ఇది యేకాంకము తోడనే యుండవలెను.

భాణము ఏకపాత్రహరణీయము. అట్లే యది కావ్యార్థమును సామాజికహృద యమున ప్రవేశపెట్టును. భాణప్రవిష్టు డాత్మానుభూతము చెప్పి, పరగతము వర్ణించును. ఆకాశపురుషకథితములతో ప్రయోగించును. ఇందలి లోకవ్యవహారము సకల సామాన్య పృథగ్జనగతము.

మీ మాం స్యం: ఈ విషయము నిందు మీమాంసింపవలయును. అంకాది రూపకములు ఏకరసములుగ నున్నవి. నాటకాదులిట్లే. నాటికాదులు నిట్లే. నాటకప్రకరణములలో, సర్వరసయోగ్యత యున్నది. అందు సర్వనాయకభేదము లందును వీరత్వ మనుగతమై యుండును. సమవకారమున శృంగారమున్నను వీరమే ప్రధానము. రౌద్రమేని ముఖ్యము. వీరరౌద్రశృంగారములు పుమర్థత్రయమునకు ప్రాణభూతములు. శాంత బీభత్సములు చివరి పుమర్థమునకు సంబంధించినవి. మోక్ష మున సర్వజనుల కధికార ముండదు. అపశ్చిమజన్మునకే మోక్షాధికారమున్నది. పురుషార్థవిషయకములుగా నుండు రూపకము లన్నియు నిట్లు రసోద్దేశముగనే యున్నవి. అంక ప్రహసన భాణములు కరుణహాస్యవిస్మయప్రధానములై రంజక రసముఖ్యవిషయము లగుచున్నవి. అందుననే వీనిలో స్త్రీ, బాల, మూర్ఖాదు లధి కారులు.

అంకములో భారతియే యుండునని భరతు డనినాడు. కరుణమున చేష్ట ప్రధా నముగాదు. ప్రలాపములు, పరిదేవితములు ప్రధానములు. పరిదేవితాత్మకమైన భారతీ వృత్తి, కరుణమున కుపకరణము మాత్రమే యైనది. కాన, భారతియు నుండదనియే భావము కావలెను. అందుచే కొందరు, ఫ ల సం వి త్తి అనెడు వృత్తి యున్నదనిరి. అది యిందుండుననిరి. మూర్ఛామరణాదిభావములలో వాక్చేష్టలుండ నందున, నిర్వృత్తికతయే కలుగుననిరి. ఇందు భట్టోద్భటుని భావమొకటి భావనీయము. చేష్టా త్మకవృత్తి, వాగ్రూపకమైన వృత్తి, వాక్చేష్టాఫలమైన ఫలసంవిత్తి వృత్తి, ఇట్లాతడు వృత్తిత్రయ మభిమానించి, వాక్చేష్టావృత్తులను, పుమర్థసంబంధమున నెనిమిది విధము లని, న్యాయాన్యాయవృత్తిసంకలనమున పదునారువిధములని భావించినాడు. ఫల వృత్తి రసభేదమున ననేకభేదములు కల దగుననినాడు. కొందరు ఫలవృత్తి నంగీక రింపరు. అది వృత్తియెట్లగు నందురు. సూక్ష్మమైన వాక్చేష్టావ్యాపార మందును కల దందురు. మూర్ఛామరణాదులలోగూడ, ప్రాణాత్మకమైన, కాయికవ్యాపార మున్నదనిరి. కాన ఇట్టి పట్ల సాత్త్వతివృత్తి యనుట యుక్తమట. మూర్ఛామరణాదు లలో ఆ త్మ సం వి త్తి రూపమైన పంచమవృత్తి యున్నదని యుద్భటానుయాయు లనిరి. లోల్లటాదులు దీనిని పరాకరించిరి. ఔద్భటమతము, శాకలేయమతము శకలీ

గర్భమతము. శకలీగర్భ భావగర్భమును లోల్లటాదులు ఖండించిరి.

అభినవు లిట్లందురు. ఈ యస్థానసంత్రాస మక్కర కాదు. వ్యాపారము లంతట వర్ణితము లగును. వ్యాపారములే వృత్తులు. "వృత్తయః కావ్యమాతృకాః" మదమూర్ఛాదులలో గూడ మనోవ్యాపార మున్నది. కరుణమున మనోదేహవ్యాపారము కలదు. అందు వాగ్వ్యాపారమే బహుళమైనదని, భరతులు భారతీవృత్తి నభిధానించిరి. వృత్త్యంతరముల నిషేధించిరి. కాయవాఙ్మనస వ్యాపారము లేక ఏదియు సంభవింపదు. అనుల్బణచిత్తవృత్తి యున్న స్థలమున కైశికివృత్తి చెప్పవలెనని శోహలుని భావము. మూర్ఛాదులలో వ్యాపారమే లేకపోయినచో వృత్తియే యుండదు. నాట్యమంతయు వృత్తిబ్రహ్మముగా సమర్థనీయము కా నక్కర లేదు.

వీథిరూపకము సర్వరసమయము. ఇందు పదమూడంగము లున్నవి. వీథ్యంగము లన్నియు విచిత్రములు. వీథి యుక్తిప్రత్యుక్తిగర్భమై రమణీయ మైనది. ఇందలి నాయకు డధముడు కావచ్చును. అధముడు నాయకుడగుట కొందరంగీకరింపరు. ప్రహసనములో, భాణములో వా రేమందురో!

౧౪. దశరూపశరీరము

దశరూపశరీర మితివృత్తాత్మకము. దశరూపవిధానము స్వరూపపరూపప్రకారాత్మకము. ముఖప్రతిముఖాదులు దశరూపసంధులు. సంధ్యంగస్వభావములు దశరూపవిధులు. ఇతివృత్తము నాట్యశరీరము. సంధు లితివృత్తవిభాగ మాపాదింపగలవు. కావ్యమును కావ్యముగా జెప్పుట కుదురదు. శరీరాత్మలను జెప్పినగాని కావ్య మభిధేయము కాదు. వస్తువు రూపకశరీరము. రస మాత్మ. రసములు శరీరావిర్భావకములు. శబ్దములు శరీరప్రతిపాదకములు. శబ్దము లితివృత్తములతో సమానయోగక్షేమములు కలవగును. షట్ప్రజ్ఞావిలాసు లిందు కారణషట్క మభిధానింతురు. వాక్కితివృత్తము నిరూపించును. ఇతివృత్తార్థ తాదాత్మ్యము పొందును. అర్థరూపతాధ్యాసము పొందును. అర్థైకజ్ఞాననివేశము పొందును. అర్థోపరంజకత్వము పొందును. అర్థము నిష్పాదించి స్వరూపవైభవము నిలబెట్టుకొనును. ఇది యంతయు వాగాత్మశబ్దవిలాసము. కావున నె;

"వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషా తనుఃస్మృతా"

ఇతివృత్తాత్మక మయిన నాట్యశరీరము ప్రకారవైచిత్ర్యమున శోభించును. పంచసంధులు విచిత్రతాసంపాదకములు. అయి దవశ్యముగా నుండవలెనని యాదేశము కాదు. కొన్ని తగ్గినను హాని లేదు. సంధ్యంగము లన్నియు వలదు కాని సంధు లన్నియు కావలెనని సంధిప్రియసంభాష. కావ్యబంధగత మయిన యితివృత్త మున్నది యున్నట్లే యుండగా వివేచకబుధకవి ఆధికారికమని ప్రాసంగికమని ద్వైధాపరికల్పనము చేసికొనవలయును. కథారాశిని కవి ద్విధాకరించును. ఇతివృత్తము ద్విశాఖమని భావము. ఆధికారిక మంతట ననుగత మగును. హృదయానుయాయి

యగును. ప్రాసంగికము నందీ ధర్మము లంతర్లీనములు. ముఖ్యప్రయోజనానుకూల సామర్థ్య మీ ధర్మనిష్పాదకము. ఆదికవి కావ్యములో నిదియంతయు సుసంగతము. అందు శ్రీలంక నుండి శ్రీసీతను మరల దెచ్చుట ప్రధాన వివక్షితము. ప్రతిజ్ఞానిర్వహణము, జగత్కంటకరావణోద్ధరణము, శరణాగతవిభీషణరక్షణము మొదలగునవి యందవాంతరఘటితములు. సీతాప్రత్యానయన వ్యాపృతశక్తి ప్రసారమె వీని నన్నిటి సంపాదింపగలదు. పృథగ్యత్న మపేక్షితము కాదు. ప్రాసంగికనిష్పత్తికి వ్యాపారాంతర మావశ్యక మని యిట్టి ప్రాసంగికములును గలవని కొందరనుటను భరతభావభావితులు భట్టలోల్లటులు లంగీకరింపరు. ప్రాసంగిక మాధికారికమున కుపకరణార్థ మగును. కావుననె ప్రాసంగికము ప్రశంసాస్పదము. ఫలప్రాప్తి కిది రూపము. కవి కావ్యమున నొక ఫలమును సముత్కర్ష సమేత మగునట్లు వివక్షించును. అది ప్రధానఫలము. యుక్తసముచితనాయకవిధిలో ఫలనిరూపణ మావశ్యకము. నాయకుని వస్తుప్రయత్నము కవి యిచ్ఛను నియంత్రితము చేయును. కావ్యఫలము స్వాంశములో సముత్కర్ష కలదై కావ్యగౌరవ మధికము చేయగలదు. కవి ఫలసంధానయత్నము ముఖ్యవివక్షితమై ప్రధానఫల మగును. కాగా కవి వివక్షయే అంతట పరమావశ్యకము. కావ్యమున నిరూపింప వలసిన పురుషార్థవ్యుత్పత్తికి తగిన యోగ్యనాయకుని గ్రహించి కవి ప్రవర్తించినచో స్వేచ్ఛగా ప్రవర్తించినట్లు కాదు. ఫలప్రాప్తినిర్వచనము ఆధికారికము నిట్లు సప్రయోజనము చేయగలదు. ఫలయోగము సాధించునపుడు వాఙ్మనసగతమైన వ్యాపారస్పందములో నైదవస్థ లున్నవి. ప్రారంభ యత్న ప్రాప్తిసంభవ నియతఫలప్రాప్తి ఫలయోగము లను నివి అవస్థావిశేషములు. ఉద్దేశక్రమమున వీనిని నిరూపించుట పరమావశ్యకము. సంభారసమారంభముతో నున్న ప్రారంభ మన్యావస్థలకు ప్రసర మిచ్చును. ప్రారంభావస్థ నాయకునకు అమాత్యునకు నాయికకు ప్రతినాయకునకు నుండవచ్చును. ఒకచో దైవమునకే నిరూపితము కావచ్చును. అభీష్టమైన సమగ్రక్రియాఫలము కథావృత్తములో ప్రతిరూపముగ సంభవించినచో ఫలయోగము ప్రతిష్ఠిత మగును. నాయకు డనుసంధానించు క్రియల కిది సమనంతరఫలము. సచివామాత్యాదుల యవస్థలును నాయకునే పొందును. ఇట్టి భావమే రూపకములందు సముచ్ఛ్రితమై భాసించుచున్నది. పురుషకారమునే అభిమానించి దైవ మవజ్ఞ చేయువారి విశేషవృత్తములు వర్ణనాస్పదములు కావు. పురుషకారము దైవము సఫలముగా వర్ణిత మగుట యున్నది. దైవబహుమానవ్యుత్పత్తిసంపాదనమునకే పురుషకారము ను నిబంధింప వలెను. పురుషకారము లేకున్నను సఫలదైవవర్ణన మభీష్టము. రూపకవస్తువు దైవాయత్తముగా నున్నపుడు పంచావస్థాసంబంధము అత్యంత మావశ్యకము. "సర్వస్యైవ పంచావస్థాః" అని భరతోక్తి. ఆధికారికవస్తు వారంభాదిఫలాంతము ప్రసరింపవలెను. ఇట్టి వస్తువే అధికృత మగును. కావున ఆధికారిక మైనది.

రూపకమున పంచసంధు లుండవలెను. అప్పుడది పూర్ణసంధి. హీనసంధి యగుట పక్షాంతరము. అట్టిది సకారణకముగ నుండవలెను. అవస్థాపంచకము తగ్గింపరాదు.

కొన్ని సంధులు తగ్గుట రూపకనియతధర్మము కాదు. కొన్ని వస్తువు లంద పేక్షితము లైన సర్వాంగము లుండవు. కావున హీనసంధిత్వము కలుగును. పూర్ణసంధిగ నుండు టయే భరతుని వ్యపదేశము. ఏ రూపకేతివృత్తము నందయిన నుపక్రమోప సంహారము లావశ్యకములు. డిమాదినాయకు లుద్ధతులు. వినిపాత మాశంకింపరు. ప్రహసనాది నాయకు లధర్మప్రాయులు. ఉపక్రమోపసంహారములందు వారి కథ విశ్రాంత మగును. అవమర్శాదులు వారల కక్కరలేదు. ఆ కథ లపూర్ణములు హీనసంధులు. ప్రాసంగి కేతి వృత్తము పరార్థ మయినందున దాని యందు దీ నియమము లేదు. ప్రాసంగికకథ యాధికారికమున కవిరుద్ధముగ నుండవలెను. ఈ పంచావస్థ లున్నట్లు బీజాదు లయి యున్నవి. బీజ బిందు పతాకా ప్రకరీ కార్యము లర్థప్రకృతులు. ఫల హేతువులు. వీనిని యథావిధి తెలిసి యోజింపవలెనని భరతవచనము.

రూపకాంశములలో కొన్ని జడములు. కొన్ని చేతనములు. జడాంశము ముఖ్యమై బీజ మగును. గూఢమై కార్య మగును. చేతనాంశము ముఖ్యమై బిందు వగును. ఉపకరణమై పతాకాప్రకరీరూపము పొందును. ఈ పంచోపాయములచే పూర్ణఫలము నిష్పాదిత మగును. వీనిలో బీజము మొదట స్వల్పము. పిమ్మట బహుధా ప్రసర్పించి ఫలపర్యంత ముండును. చక్రములోని యాకుల నడుమ నిది కుండవలె నుండును. బహుముఖ ప్రసిద్ధ మయిన బీజము బహుధా భాసించుట బాగుగా సమీక్షా ర్హము. ప్రబంధసమాప్తి పర్యంతము బీజ ముండును. అట్లే బిందువు నుండును. కార్య వశమున కావ్యకార్యము స్తంభించి పోవునపుడు అది విలీనకల్పము కాకుండుటకై బిందు నిబంధన మావశ్యకము. కావ్యానుసంధానము ప్రబంధబంధములో సకలోపాయ ప్రతి జాగరణహేతువు. ఇట్టి యనుసంధానము లేకపోయినచో జడాజడరూపమైన సర్వ విధోపాయధర్మవర్గ మనుపాయకల్పమే యగును. బీజబిందువులు రెండు సమస్తేతివృత్త వ్యాపకములు. పతాక ప్రకరి పరార్థమై ప్రసరించును. చివరిదైన కార్యము చేతన వ్యక్తులచే నిష్పాదింప దగియున్నది. ఈ యర్థప్రకృతులలో ప్రయోజనగుణసంపదలను పరిశీలింప వలయును. పతాకావృత్తములు గర్భవిమర్శముల వరకు వ్యాపింప నక్కర లేదు. ఫలనిర్వహణము వరకు పతాకానాయకు డుండుట సముచితము కాదు.

పతాకాప్రసక్తిలో పతాకాస్థానకములు కొన్ని యున్నవి. నాల్గుపతాకాస్థాన ములు కలవు. హర్షాదులు తమ రూపకములలో వీనిని నిరూపించిరి. రూపకము చతు ష్పతాకాపరమైనను సంధులతో సంబంధము లేదు. కావ్యబంధాశ్రయమైన విశేషము వీనివలన గోచరించును. కార్యసంపత్తి పతాకాస్థానకములతో నుండుట నాట్య సంపత్తి.

సంధిపంచకము రూపకసౌష్ఠవమును నిరూపించును. ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ నిర్వహణములు సంధినామములు. నాటకీయార్థరాశి ప్రసక్తి ననుసరించి విచిత్రా స్వాదమున నెంతవరకు ప్రసరించునో అంతవరకు ముఖసంధి యగును. ముఖసంధినిరూపి

ర్థమే ప్రతిముఖములో నుద్ఘాటనము పొందును. బీజోద్ఘాటనము ఫలానుగుణమైన దశావిశేషము గర్భసంధి ఫలజననాభిముఖత్వము సంపాదించును. విమర్శ మవమర్శ మొకటి. దీనిని విఘ్నమని కొందరు తలచుట సంగతము కాదు. ఈ విమర్శవిమర్శములో ననేకరీతు లున్నవి. సర్వార్థముల సమాహారమున్నచో నిర్వహణ మగును. అన్నిటి సమానయనముతో ప్రయోక్తలు సంధులను సావధానముగా కూర్చుట సముచితము. ఈ సంధుల కన్నిటికిని అంగకల్ప మున్నది. అర్థభాగరాశి సంధి కాగా అందలి వృత్తఖండములు యుక్తియుక్తములై సంధ్యంగము లైనవి. సంధిసంధ్యంగ సంఘటనమున శాస్త్రదృష్ట మగు ప్రయోజన మారు విధముల కలదు. అంగహీనుడు కార్యసమర్థుడు కాడు. అనంగకార్యము ప్రయోగక్షమము కాదు. అంగసంగతమే సన్మనోరంజన మిచ్చును. కవి నట సామాజికులు అసంధిక మభినందింపరు. ప్రహసనాదులలో కూడ అంగయోగము రంజనాతిశయ మాధానింప గలదు. మొత్త మంగము లరువదినాలుగు. బీజార్థసంపాదనమున నివి సమ్యక్సిద్ధికరములు. కావ్యార్థములను సముచితముగ విభాజించుకొని కవులు నిరూపింపవలెను. వీనిని క్రమముగా నిబంధింపవలె నన్న నియమము లేదు. ఒక్కొక సంధికి కొన్ని నియతములైనను నితరములలో నవి యుండరానివి కావు. ఆ యా సంధులలో నవి యవశ్యంభావ్యములు. రసభావముల గుర్తించుకొనుచు కావ్యకుశలకవులు వీనిని నిబంధింతురు. ఏసంధి ఎందుచితమో కవి యనుసంధానించును. యోగ్యతను గుర్తించును. ఒక్కొక పద్యము చెప్ప నాతడు పదిపద్దెములల్లు ముక్తకకవి దీనిని గుర్తింపలేడు. ప్రబంధయోజన సమర్థుడే వీని యోగ్యత తెలియగలడు. కవికౌశలము రసభావాపేక్షము. రసమే ప్రీతి నాధానించి వ్యుత్పత్తి నిచ్చును. నాట్యవేద మిట్లు ప్రీతివ్యుత్పత్తిప్రదము. పుమర్థోపాయము హృదయానుప్రవేశము పొందునట్లు తదుచిత సుందరరస సంక్రమణమున కంతఃప్రవేశము కలదు. వినేయుడు వినీతుడు కాగలడు. వివక్షిత రసభావాదుల పూర్ణభావమున కివి ఉపకారకములు. కవి రసావహితమనస్కుడైనచో నీ యంగములు యత్నాంతరనిరపేక్షముగ అహమహమికతో సముచితముగ బంధశయ్య ననువర్తింప గలవు. విభావాది పరికరముగా నున్న ఈ యంగచక్ర మంతయు రసాంగమే యగును. సంధ్యంగములు సంధిపరతంత్రములు కావలెను కాని రసపరతంత్రము లగుట యేమి? ఇందిది హేతువు. సంధు లవస్థాపరతంత్రములు. ప్రారంభమున కుపయోగించు కథాఖండలకమే ముఖసంధియైనది. ఇతరములు నిట్టివే. కావ్యసర్వస్వము రసభావాపేక్షము ఈ యంగములకు సమ్మిశ్రణమును కలదు. అదియు రసభావాపేక్షము. ఇరువదియొకటి సంధ్యంతరము లున్నవి. ఇవి సంధ్యంగశేషరూపములు కావు. సంధిసంధ్యంగ సంధ్యంతరము లన్నియు విభావాదిస్వరూపములు. విభావాద్యతిరిక్తముగా జగములో నేదియు ప్రయోగమున నుండదు. ప్రయోగ ముజ్జ్వలము చేయు నీ సంధ్యంతరములు కవిమార్గము కమనీయ మొనర్ప గలవు. ఇవి రసోపయోగులె యయినను వస్తుశరీరమున సులగ్నములై యుండును.

౧౫. లాస్యాంగములు: ఇవి లాస్యము లోని యంగములు. నాటకాదు లన్నిటి యందివి సంగతము లగును. భాణమున వలె వీనిలో నేకపాత్రప్రయోగమె యుండును. లాస్యాంగములం దంతట భేదము స్ఫుటగోచరము కాకపోయినను లాస్యమునందు భేద మున్నది. నాటకలాస్యము వేరు. ఏకహార్యలాస్యము వేరు. ఏకహార్యమున నాట్యరూపత యుండదు. లాస్యమునందు గేయపదాది భేదదశక మున్నది. నాట్యోపయోగితానుకూలముగనె లక్షణము ప్రసిద్ధముగా నున్నది. వైచిత్ర్య మేదేని లోకగోచరము కాకపోయినను లాస్యాంగములనుండి కవులు గుర్తింతురు. ప్రయోక్తలు పరిగ్రహింతురు. అంతట లోకదృష్టమె గ్రాహ్యమను భావగ్రహ ముండరాదు. భావసారములు సుందరతాస్పదములు శాస్త్రపరిష్కృతములు కలాప్రచురములగు వైచిత్ర్యాంశముల నంతట గ్రహింప వచ్చును. ఇతరవ్యాపారముల వలె దేవతాపరితోషము కూడ నిరూపణార్హము. ఒకానొక గేయము జప్యసహస్రతుల్యము. గేయమిశ్ర మయిన జప్యము కోటిఫలసాధనము. కొన్ని గేయములు దేవీపరితోషార్థములె యగును గాని లాస్యార్థములు కావు. కొన్నిటిలో లాస్యాంగచ్ఛాయ యుండును. నాట్యమునం దుపయోగింపని వస్తువే యుండదు.

"న హి తాదృగ్వస్తుమాత్రమప్యస్తి యన్నాట్యే నోపయుజ్యతే"

కవిప్రయోగసమాయాత మయిన యావేశవిశేషమును జృంభింపజేయు గాన మావశ్యకము. ప్రయోగసంగత గేయపదము సామాజికరంజకము కాగలదు. స్థితపాఠ్యలాస్యాంగమున విచిత్రత యున్నది. ఆసీనము చింతాశోకసమన్వితమై రంజన మిచ్చును. ఇది కరుణాదులం దుపయోగి. ఆసీన మశబ్దమాత్రోద్యరహితము. ప్రచ్ఛేదకలాస్యాంగమున వెన్నెల కావలయును. ప్రసాధనలీలావిశేషములు వెన్నెలలో సుందరములు. లోకమున సర్వదా సంపూర్ణచంద్రోదయ ముండదు. ప్రయోగము లందు సార్వకాలిక సంపూర్ణచంద్రోదయము లభించును. ఇది సంభావనాగర్భము రసోపయోగి. అది యున్నచోట దాని వర్ణించుట కవి సంకల్పము కాదు. అది సంభవించ నప్పుడు దాని వర్ణించుట సౌమనస్య మిచ్చును. అది సర్వము కవిసంభావనావిషయము. త్రిమూఢకాంగములో రసోపయోగి గుణాలంకారస్వీకార మున్నది. రసోపయోగ్యంశము లేక గుణగణ మేదియు నుండదు. కేవల మాంశికచ్ఛాయ యుపయోగి కాదు. విశేషకృత వైచిత్ర్యమున నాట్యమునందు సౌందర్య మున్నది. గుణశోభ నాట్యసౌందర్యాధాయకము. లాస్యాంగములలో నొకచో దేశభాషాశ్రయము కూడ రంజనాధిక్య మిచ్చును. దశరూపకమున భాషాకృతవైచిత్ర్యమును భరతు డిందు సూచించినాడు. సైంధవకమను లాస్యాంగము దేశభాషాశ్రయము. శృంగారరసమున ప్రాకృతభాష చక్కగా నుపయోగించుట కర్పూరమంజరిలో నున్నది. పాఠ్యరహితనాట్యము సైంధవక మని నాట్యవిదు లనిరి. రూపకపాత్రలు ప్రాకృతవచనములతో నున్నచో సంకేతము సంగతముగ నుండదు. రసోచితసంకేత మనుదాత్త మగును. అయిన నది వీణావాద్యాద్యుపకరణక్రియల గూడి రసవ్యక్తి నిదాన మగును. రసాంకేతరాంగముగ నుండియు రసోప

యోగులగు సంగములు గలవు. ఈ త్తరోత్తమక మను నొక లాస్యాంగ మున్నది. అది యనేకరససంశ్రయము. హేలాహావాదిచిత్రము. కావ్యమునకు కావ్యభాగమున కుప రంజన మిచ్చు విధమున, వినేయులకు హృదయసంవాదమిచ్చు రీతిని ఈ వైచిత్ర్యాంశము లాస్యాంగముగా సిద్ధ మయినది. లాస్యాంగము లందిది యుత్తమము. సర్వ మిందు రసపర్యవసాయి. ఇది యనేకరససంశ్రయ మున్నను అసాధారణరసాశ్రయము. హేలాహావాదిచేష్టాలంకారముఖముగా లోకమున గలుగు చిత్తవృత్తిపరితోషము దీనిలో నుపజీవిత మగును.

శ్రీరామాయణాంశ మొకటి యిచట విచార్యము. కులకలత్రము నుపేక్షింప రాదు. పరపరాభవమును సహింపరాదు. లోకకంటకము పెకలింప వలసినది. ఇది శాస్త్రార్థపరిపాలనము. రాముడు రావణహృత సీతను మరల తీసికొనివచ్చుట యుచిత నిమిత్తకము కావచ్చును కాని రామునంతటివానికి ప్రతిరూపము కాదు. వాల్మీకియె చెప్పినను వేదమె చెప్పినను అ భి న వు డు భయపడడు. రసనిష్యంది కాజాలనిది అభినవస్వీకార్యము కాదు. అది యాతని సాహితీవ్రతము.

ఉక్తప్రత్యుక్త మొకి లాస్యాంగము. దీనిలో కోపప్రసాదములు సాధిక్షేపపద ములు వైచిత్ర్య మాపాదించును. భిన్నములుగా నుండు వాచ్యఖండలకములు రసావేశ మహిమాతిశయమున నేకార్థసమన్వయము పొందును. కావ్యార్థము రసావేశమున నభి నీయమానసుందరమై యభినయార్థసమావేశము పొందును. ఇట్టివి లోకాదృష్టములె కాని యుపరంజకములు. లోకమున సంభవింపవని నాట్యమున ప్రయోగగానముల నిషేధింపరాదు. ఒకప్పుడు శ్రోతకు కాకతాలీయవశమున నర్థసంవాద ముదయింప వచ్చును. అన్నియు లోకమున నత్యంత మసంభావితములు కావు. లోకమున లేనంత మాత్రమున నాట్యమున ప్రత్యక్షకల్పము కాకపోదు. ఇట్లు కాదన్న నాట్యరూపతయె నశించును. లోకసంభవాసంభవము లిం దకించిత్కరములు. చిత్రపద మని భావిక మని కొందరు మరి రెండంగముల భావించిరి. మదనానలసంతప్త యొకతె ప్రియాకృతి చూచి మానసము వినోదపెట్టుట, స్వప్నప్రియుని చూచి వివిధభావముల నుండుట వీని రూపము. దశాంగలాస్యములలో నీ యధికప్రసంగము తగదు.

అలౌకిక వైచిత్ర్యాంశము రసమున నుపయోగించు ననుట మునిసమ్మతము. నాట్యము రసాత్మక మనుట సమ్మతము.

"అలౌకికవైచిత్ర్యసారో హి రసః"

లక్షణగుణాలంకారప్రముఖసంరంభ మంతయు కవిసంభారము. కావ్యలక్షణాదు లన్యోన్యానుకూల్యమున సంగతసముల్లసితములయినచో రస మక్లిష్టముగ వ్యక్త మగును. భాషలోని సుప్రసిద్ధత యశ్లిష్టహృద్యఘటిత మయినచో నది యంతయు కావ్యమై రసభావానుభావక మగును. వస్తుజాతము కథార్పితరూపమై సముచిత సామగ్రీసంపత్పరిణామమున రసమున్మిషింప జేయును. నాట్యజగ మంతయు రసపోష

మొనక. అందు కవి వేనసుని ప్రగల్భప్రతిభాసర్వస్వము సాక్షాత్కరించును. ప్రగల్భ ప్రతిభ సంభావనాప్రాణనము. కవివాణి లోకోత్తరసంభార సంయుక్తమై రసమం యగును. ఇది భరత భట్టాభినవ భావము.

## ౧౬. అభినేయకావ్యము.

కవుల సుఖగ్రహణమునకై దశరూపకలక్షణము రాశీకరించి నిరూపించుటయు సముచితము. అదియు నిం దున్నది. రూపకములన్నియు మహారసముతో మహాభోగముతో నుండవలెను. ప్రయోక్తలు ప్రయోగసమయమున లోకసిద్ధస్వభావమును విడిచి ప్రయోగము నిర్వహింతురు. సర్వరసభావకర్మప్రవృత్త్యవస్థాసముపేతముగ నాటక నిర్మాణమున కవి యత్నించిన కవి యగును. చూచి చూచిగుర్తించి గుర్తించి తెలిసి తెలిసి నాటకము నిర్మింపవలెను. మానవు లబుధు లగుదురు. యత్నశ్రుతబుద్ధు లగుదురు. సర్వవిశేషములు నష్టప్రాయము లయినచో లోకమె నష్ట మగును. ఆ సమయమున కవి లోకభాషల బలాబలముల గుర్తించి నిర్మింపవలెననుట కవిపర మయిన యుపదేశము. కవి నిర్మింప నటులు ప్రయోగింతురు. సహృదయులాస్వాదింతురు. వైయాకరణ గ్రాహ్యశబ్దములతో కావ్యబంధము లుండరాదు. అట్లున్నచో కమండలువు ధరించిన ద్విజులతో వేశ్య లున్నట్లుండును. ఈ యుక్తసంవిధాన సమీక్ష కథావిస్తృతికి రసభావఘటనమున కుపయోగించు ననుట పునరుక్త మయిన నావశ్యకము.

## ౧౭. వృత్తివివేకము.

వృత్తిభేదమున కావ్యభేదము కలుగును. కాయవాఙ్మానసముల చేష్టలె వైచిత్ర్యసహితములై వృత్తు లగును. ఇవి చిరకాలముగా ప్రవాహరూపమున నున్నవి. విశిష్ట హృదయావేశమున నివి వృత్తు లయినవి. ఆవేశము లౌకిక మలౌకిక మని ద్వివిధము. లౌకికము రసాగమమున సమాస్వాద్యము కాదు. అలౌకికావేశము నావేశ మనరాదు. కవిసహృదయులకు వలె ననావేశ మయిన యావేశముగ నది యుండును. సముచితావసరమున హృదయసంవాద సరసముగునది సాధారణ్యస్థితిలో చమత్కారగోచర వ్యాపారవిశేషమై రసోపకరణ మగును. భగవద్వ్యాసుదేవు డావేశమయుడుగా భాసించుటయ కాని యాతడనావేశుడు. వృత్తివిషయమున పూర్వసృష్టిగతవ్యాపార మున్నది. ప్రలయమహారజనిలో ప్రపంచ మంతయు విలీన మయినది. బలమదమత్త మధుకైటభు లప్పుడు భూతభావనప్రభువుతో యుద్ధ మొనరించుచు పరుషవచనముల తూలనాడిరి. ఆ వాచాప్రవృత్తి భారతీవృత్తి తన్నిర్మాతవిష్ణుదేవుడు. లౌకికావేశపరు లయిన మధుకైటభులు వృత్తినిర్మాతలు కారు. వా రవిద్యామయులు. విద్యావకాశవశమున హృదయకమలము వికసింపగా ఆనందసారము పరిమళరూపమున నుండును. అది రసోపయోగి. అందు వ్యాపారావేశము లేదు. అనావేశదర్శనుడయిన భగవానుడే వృత్తిప్రవర్తయిత. ఈ వృత్తులకు సామాజికహృదయములందవిశ్రాంతి యున్నది:

శ్రీవిష్ణువాసుదేవుని నానాపదవిన్యాససమపమయమున వాగ్వ్యాపారరూప మయిన భారతీవృత్తి నిర్మిత మయినది. వల్గితములచే సాత్వతీవృత్తి కలిగినది. ఇందు మనోవ్యాపార మధికము. ఇం దప్రతితాన మయిన వైచిత్ర్య మున్నది. ఆ వాసుదేవుని లీలాసమంచితవిచిత్రాంగహారప్రయోగ శిఖాబంధసమయమున కైశికి వచ్చినది. దైత్యులతో నియుద్ధసమయమున విష్ణుదేవుని చిత్రవిచిత్రకరణప్రయోగమున చారీమండలగతి ప్రక్రమమున ఆరభటీవృత్తి యుదయించినది. క్రియాసర్వస్వ మంతయు వృత్తిచతుష్టయవ్యాప్త మగును. వాఙ్మనఃకాయచేష్టల కతిరిక్తముగ నే కర్మయు నుండదు. క్రియాశూన్య మయిన యంశ ముండదు. విష్ణుదైత్యుల మల్లయుద్ధరీతికి బ్రహ్మ "న్యాయము" అని పేరు పెట్టినాడు. భగవద్విశ్వచరితములు నాట్యగర్భాభేయము లయినవి. అభినేయకావ్యముల కనభినేయ కావ్యములకు వైలక్షణ్యము సంపాదించుట కివి పర్యాప్తములు. ఛందోమయ వాసుదేవస్వరూపము నుండి వృత్తిప్రకాశము కలిగినది.

వృత్తు లన్నియు నన్యోన్యసంయుతములు. వాక్ప్రధానము భారతీవృత్తి. ఇది నాల్గువిధములు. సాత్వతిలో సాత్వతగుణ మున్నది. సాత్వతము మానసవ్యాపారము. ప్రకాశస్వభావము. సాత్వతిలో నాల్గుభేదము లున్నవి. శృంగారప్రధానము లయిన తద్బహులము లయిన వ్యవహారములు కైశికిలో నధికముగా నుండును. ఇందును నాలుగంగములు కలవు. ఆరభటి యుద్ధతరసము. ఇదియు చతురంగము. ఈ నాలుగు వృత్తులు నాట్యసంశ్రయములై సముచితరసప్రయోగమున రమ్యములై యున్నవి. ఇది వృత్తికథ.

## ౧౮. ఆ హా ర్య ము.

వాగాద్యభినయముల కన్న నిది బహిరంగ మని కొంద రనుట యుక్తము కాదు. సర్వాభినయముల కిది యనుగ్రాహకము.

"ప్రయోగః సర్వోయమాహార్యాభినయే స్థితః"

అవస్థాప్రకృతు లన్నియు వేషసాధితము లయినప్పుడే స్పష్టాభివ్యక్తిని పొందగలవు. ఆహార్యము సర్వాభినయప్రయోగ చిత్రభిత్తి. రంగపాత్ర కవస్థలు మారు నప్పుడు ఆహార్యేతరాభినయము లందు మార్పుకలదు. ఆహార్యమున మార్పు లేదు. "అట్టి వానికీ యవస్థ కలిగిన" దని సామాజికులు భావింతురు. ఈ భావానుసరణ ప్రవణత్వమున కాహార్య ముపకారి కావున నిది యంతరంగము. నాట్యశుభకాము డాహార్యమున యత్న మొనరింప వలెను. నాట్యనైపథ్యము నాల్గు విధములు. ఇందవాంతరభేదములును గలవు. పురుషాశ్రయ భూషణము లిరువది యొకటి కలవు. వీనిని జాతివయోవస్థాభేదమున ధరింప వలెను. అరువదిరెండు వనితాలంకారము లున్నవి. అలక్తకరాగాంతాబలాలంకారములను యథారసముగా యథాభావముగా యథావస్థముగా యథాస్వభావముగా ధరించుట సముచితము. విశ్వకర్మమతానుసారమున స్వకీయనుబుద్ధి విశేషానుసరణమున ఆగమ ప్రమాణ రూపముల నిర్ణయించుటయు సముచితము. దేవ నాగ ముని

మానవాది వనితావేషములందు నియతవిధాన మున్నట్లు గణికల కొక వేషనియమము లేదు. స్నిగ్ధరసికస్నేహానుసారమున వారి యలంకార ముండును.

నాట్యప్రయోక్తలు పురుషులందలి యంగరచన వలె అంగనలకు కూర్ప నక్కఱ లేదు. వర్ణవర్తనాదివిశేషముల వలన పరభావసిద్ధి యున్నది. నటుడు స్వాత్మావష్టంభమును విడనాడకనే వర్తనాది వేషపరివర్తనమున తత్తదుచిత స్వభావాలింగితముగ స్వాత్మను సామాజికులకు సాక్షాత్కరింప జేయును. ఆహార్యము నందు జీవాజీవధర్మభేదమును గలదు. నాట్యధర్మము నం దజీవవ్యవహార మట్లే యుండదు. అందు సజీవరూపాపాదనము సిద్ధ మగును. అజీవము లజీవములుగా నాట్యమున నాస్వాద్యములు కావు. అజీవము లందు జీవధర్మారోపము కలుగును. చిత్తధర్మ మాపాదిత మగును. జడము చేతనీకృత మగుట నాట్యతంత్రము. నానావిధము లయిన చిత్తభావావస్థల ననుసరించియె యాహార్య ముండుట సముజ్జ్వలము. సముచితము. సుందరమును. అంతట బుద్ధియోగము ముఖ్యము. నాట్యాయత మయిన బుద్ధిస్పందము ననుసరించి సర్వరచన మొనర్పదగును. ఒకొకప్పుడొకొక్క విధముగా స్వస్పందసుందర మయిన బుద్ధ్యున్మేషము కలుగును. అందును సంస్కారసంయుత మయిన బలము నిదానము. నాట్యోపకరణముల నిశ్చయమున గూడ భావకు డూహాపోహముల ననుసరింప వలెను. ఆ యా ప్రకృతివిశేషము ననుసరించిన నాట్యోపకరణములును నాట్యయోగకృతములై యుండుట యావశ్యకము. ఎవ రే శిల్ప ముత్పాదించిన యది వారి సృష్టి. తత్ప్రమాణము తల్లక్షణము తదధీనము. నాట్యధర్మి యంతయు విభావాత్మకము. భావనామాత్రసారము. లోకగత మంతయు భావగత మయినచో సమాస్వాద్యమగు స్వాత్మసంవేదనములో విభావమై భాసించును. కావున నాట్యధర్మి యగును. నాట్యధర్మి స్వభావముతో నుండదగు నాట్యోపకరణములు లోకస్వభావానుసారులుగా నుండవలెనన్న గ్రహము తగదు. విభావితము సర్వము నాట్యమున నుపకరణము కాగలదు. నాట్యోపకరణమున నాట్యప్రయోగము నిర్వహించు ఆచార్యుని బుద్ధియె ప్రమాణము. సర్వమాచార్యుడు స్వబుద్ధితో నూహించి పరిశీలించును. రాను రాను పోను పోను మానవు లల్పబలు లగుదురు. వారి స్వభావావస్థల నాలోచించి యుపకరణముల నిశ్చయింప వలెను. ప్రాతిభము కల ప్రయోక్త లాహార్యమును రమ్యముగ గూర్పగలరు. అభినయచతుష్టయము పరస్పరసంబంధ శోభాస్పదము. సర్వవిషయవివేకము అఖండార్థ మహార్థముల సమన్వయగతికి సహకరింపగలదు.

## భరతాది సంభావనము

నాట్యవిషయసంపద చిరంతనము. పాణినిసమకాలముననె నటశిక్ష నటదీక్ష యున్నట్లు గోచరించును. శిలాలి, కృశాశ్వులు నటసూత్రములు నిర్మించిరట. మహాభాష్యము కంసవధము బలిబంధనము సంకేతించినది. చిరకాలముననె నాట్యసంపత్తి సాహితీసామగ్రీ సంవేదనమును గర్భీకరించుకొనినది. రానురాను సాహితీసామగ్రియె

నాట్యసంపదను తత్త్వప్రవిష్ట మొనరించుకొనినది. సాహిత్యశాస్త్రమున నాట్యశాస్త్ర
రచయిత భరతముని ప్రథమగణనీయుడు. నాట్యశాస్త్రమాదిమ గ్రంథము కాకపో
వచ్చును. కాని నాట్యశాస్త్ర మొక విశ్వకోశమయిన విజ్ఞాన సర్వస్వము. నాట్యో
దయము రంగమండపము ఛందోలంకారములు నృత్తకరణములు రసభావములు
అభినయసంగీతములు ప్రౌఢసుందరములై దీనిలో నున్నవి, ఇందుగలవి ఇతరములలో
లేవు. అన్యత్ర లేనివి దీనిలో కలవు. భరతునకు పూర్వమె సాహితీతంత్ర ముదయించి
యుండవలెను. కాని రసాదివిషయమున సర్వప్రథమ సమీక్షాచార్యుడు భరతుడు.
భరతుని ఈ యుద్గ్రంథము లలితకలానికేతనము. ఇదియే లేకున్న అభినయ మేమున్నది?
సంగీతకల యేమున్నది? సాహితీకోశ మేమున్నది? "యన్న భారతే తన్న భారతే"
భరతప్రోక్తములో లేనిది భరతదేశమున నే లేదు. భారతదేశమున లేనిది భరతోక్త
ములో లేనేలేదు. రూపకరూపనిరూపణాధికారము భరతునకే కలదని అవంతిసుందరీ
నాథుడు రాజశేఖరు డనినాడు. పూర్వాంగోత్తరాంగసహితముగా నాట్య మిం
దున్నది. సాహిత్యశాస్త్రీయ సంగీతశాస్త్రీయ ఛందశ్శాస్త్రీయ విషయవరణ వివరణ
ములు సర్వప్రాచీనములు సర్వప్రథమములుగా దీనిలోననే గోచరించును. భరతుడు
నాట్యాచార్యుడు సాహిత్యాచార్యుడు సంగీతాచార్యుడు నైనాడు. విలయము పొందిన
సర్వాచార్యతకు భరతుడు నిలయము. భరతు డెవరో ఎరికిని తెలియదు. భరతుడొక
ముని. నాట్యప్రయోక్త లయిన నటులును భరతసంకేతము పెట్టుకొనిరి. భరతముని దని
ప్రసిద్ధ మయిన నేటి నాట్యశాస్త్రము భరతుని సిద్ధాంతముల దిఙ్మాత్రముగ ద్యోతింప
జేయు సంగ్రహగ్రంథమే యగునా? మూలగ్రంథ మేదేని యుండెనా? భరతుని దేశ
మేమో భరతుని కాలమేదియో? ఏమి చెప్పుదుము.

భరతనాట్యశాస్త్ర మట నట నప్పటప్పట ప్రకటితమయినది. అభినవగుప్తుని అభి
నవభారతితో మన శ్రీ మానవల్లికవి ప్రకటము చేసినాడు. ముప్పదియారధ్యాయముల
గూడిన ఈ గ్రంథము అనుష్టుభ సంఖ్యానమున "షట్సహస్రీ"యని సర్వప్రసిద్ధి
యున్నది. అచటనచట క్వాచిత్కముగ గద్య మున్నను ఇది పద్య మయినది. భరతుడు
అనువంశ్యశ్లోకముల ననువదించినాడు. శిష్యపరంపరాసమనుగతము లయిన వానిని
సుఖసంగ్రహమునకై యథాస్థానమున ముని వినివేశింప జేసినాడు. అవి యేనాటివో!
తనసిద్ధాంతపుష్టి కాతడు తనవి చేసుకొనినాడు. ఈ నాట్యశాస్త్రము నియతసమయ
మున నొకని రచనయగునా! రచయిత లనేకులు నానాబ్దములు మననార్ణవము తరించి
పరిణామమున దీని వెలయించియుందురా! ఇది చిరకాల పరంపరా పరిపాకవికాసమా!
ఇట్లెన్నియేని బాహిరసమీక్షారేఖలు మనః ఫలకమున గజిబిజిగ నుండనే యున్నవి.
సూత్ర భాష్య కారికా రూపముగా వాని వాని యుదాహరణ రూపముగా నిది
యిట్లున్నది. ఇందలి కారికా లక్షణ పరీక్షలు నాట్యవిషయముల విపులముగా వివ
రించినవి.

పరశివుడు షట్త్రింశత్తత్త్వమయజగమును స్వసంవిదమున చుంబించుచున్నాడు. అట్లే భరతవేద మిది షట్త్రింశకమై వెలసినది, అని యభినవుడనుట నాట్యవేదాంతము. నాట్యశాస్త్రము స్వనామ ధన్యము. విస్తృతముగా నాట్యవివేచన మిందున్నది. ప్రాక్తనసర్వకలాకంచుక మయిన ఈ విశ్వమయవిశ్వకోశము విశ్వోత్తీర్ణత త్త్వ మవగ మింప జేయుచున్నది. ఇందలి ముప్పదియారధ్యాయములలో క్రమముగ విషయవివేచన మిట్లున్నది. నాట్యోత్పత్తి; నాట్యశాల, రంగదేవతాపూజ, నృత్తనాట్యకరణాంగ హారములు, పూర్వరంగవిధానము, రససమీక్ష, భావవివరణము, అభినయ నయ సంపత్తి, హస్తాభినయము, శరీరాభినయము, చారీపద్ధతులు, మండలవిధానములు, రసగీతిప్రచారములు, ప్రవృత్తిధర్మవ్యంజనములు, ఛందోనిభాగము, నృత్తవివేకము, కావ్యలక్షణాలంకార దోషగుణవర్ణనము, భాషాభేదాభినయ ప్రయోగములు, కాకు స్వరవ్యంజనరీతులు, దశరూపక నిరూపణము, సంధిసంధ్యంగ సంబంధము, వృత్తి వివేకము, ఆహార్యాభినయము, సామాన్యాభినయము, బాహ్యోపచారము, చిత్రాభి నయము, సిద్ధివ్యంజనము, సంగీతశాస్త్రసంపద, ఆతోద్యము, వీణావాదనము, సుషిర వాద్యవర్ణనము, తాలప్రకరణము, ధ్రువాగీతి, వాద్యవివేచనము, ప్రకృతిపాత్ర విచారము, భూమికారచన, భువిలోనాట్యావతరణవివరణ. ఇట్టివిధముననున్న విషయ వివేకము నాట్యశాస్త్రమున నున్నది.

భరతుని మొదటిరచనము సూత్రమె యయినచో నీనాటి ఈ కారికారూపమున నెప్పుడు పరిణమించి యుండును? ఈప్రశ్నకు సమాధానము చెప్పుటెట్లు? కోహలుడు దీని విస్తరించునని చివరి భాగములో నున్నది. కోహలు డెవడో! అనేకులు కోహలుని స్మరించిరి. కోహలుడు నాట్యగ్రంథ మేదేని రచించి యుండును. అది నేడెచట నున్నదో! ఈ భరతుడే ఇంతటి వాడు. ఇంక నొక్క ఆదిభరతుడని తాతయొకడు వృద్ధభరతుడని సోపపదముగా భరత సంజ్ఞ కలవారిని కొందరిని కొందరెన్నుదురు. ఒక నాటి నాట్యశాస్త్రము ద్వాదశసహస్రి. అదియె నేడు షట్సహస్రి యయినదట! భరతుడు షట్సహస్రీకారు డనియె నాట్యహృదయు లనిరి.

భరతుని కాలనిర్ణయమున ననేకులు నానాకాలజ్ఞు లయినారు. తౌర్యత్రిక సూత్రధారుడు భరతుడని భవభూతి భారతి. మహాకవివిక్రమోర్వశీయము అంతట భరతుని ప్రమాణీకరించుకొన్నది. శాలివాహనునకు పూర్వమె ఇది సుప్రసిద్ధమై యుండ వలయును.

భరతునిగ్రంథముపై ఉద్భట, లోల్లట, శ్రీశంకుక, భట్టనాయక, రాహుల, భట్టయంత్ర, అభినవగుప్త, కీర్తిధర, మాతృగుప్తాచార్యులు వ్యాఖ్యల రచించిరట! అవియన్నియు నేడు లేవు. హర్షవార్తిక మొకడుండెనట. అభినవ భారతీబ్రహ్మ శ్రీమదభినవగుప్తపాదాచార్యుడె భరతగ్రంథమునకు యేకైక వ్యాఖ్యాత. ఎవరేని టీకాకారు లున్నారన్న ప్రత్యయము వారివారి సిద్ధాంతముల పరిచయము అభినవ

భారతి వలననే కలిగిన కలంగవలయును. అభినవుని విద్వత్త భరతతంత్రరహస్యోద్ఘాటన పటీయసిరైయె ప్రాచీన దురూహనాట్యశాస్త్రీయభావములను వ్యక్తీకరించుచున్నది.

*            *            *

క్షణమాత్రసర్వేక్షణు లీ విధముగ గూడ భరతభావసంభావన మొనరించుచున్నారు. భరతుడె సాహిత్యశాస్త్రప్రథమాచార్యుడు. ఆతనిగ్రంథమె సముపలబ్ధసర్వగ్రంథప్రాథమ్యశోభ కలది. కావ్యమీమాంసలో అవంతిసుందరీనాథుడు రాజశేఖరుడు శాస్త్రసంగ్రహకథనావసరమున భరతు నుల్లేఖించినాడు. కావ్యవిద్యాస్నాతకు లనేకులు కావ్యవిద్యాప్రవర్తనకై కావ్యశిక్షాదీక్ష కలవారయినారు. రూపకనిరూపణీయము భరతాధీన మయినది. ఇట్టి రాజశేఖరసంభావనమును నవభావు లనాదరపాత్రము చేయుటకు యత్నించిరి. ఇది కవికల్పనామాత్రసార మనిరి. అధికృతశాస్త్రగౌరవసంపాదనమునకై దేవఋషిసంబంధస్థాపనము సంస్కృతముఖులకు స్వభావసిద్ధ మనిరి. ఇట్లిదియంతయు పాశ్చిమాత్యశిక్షాప్రభావితుల కపోలకల్పనమా. భారతీయఋషిసంబంధమున నిట్టి నిరాధారకల్పనము పాశ్చాత్యపరంపరాప్రవాహపతితవిశ్వాసమయినది. అప్రమాణకల్పనాప్రసవములను భారతీయశాస్త్రకారు లెన్నడు శిరసావహింప లేదు. రాజశేఖకోల్లిఖితుఖలో భరతుడున్నాడు. తద్గ్రంథమున్నది. ఇంక నున్నవి. అనశిష్టముల యస్తిత్వ మసంభవ మనుటలో నాధారమేమి? ఐతిహాసిక వ్యక్తుల స్వరూపసంకేతము లభింపనంతమాత్రమున వారి యస్తిత్వ మసిద్ధ మెట్లగును? రాజశేఖరుడు భరత సువర్ణనాభ కుచుమారుల గ్రంథముల చూచియె వారి నుల్లేఖించెను. ఇట్లె యన్యుల గ్రంథముల జూచి యన్యోల్లేఖ మొనరించెను.

నేటి నాట్యశాస్త్ర మొక్క భరతుని కృతికాదని యనేకుల కృతుల క్రోడీకార మనియు ననదలచిన వారనినారు. ఇది భిన్నభిన్నకాలకృతుల సంకలన మనియు ననినారు. గద్య మానువంశ్యకశ్లోకములు సూత్రభాష్యరచన యనుగతకారికారీతి విభిన్నములుగానున్నవట. ఇదియు పైయూహలో హేతువట. ఇంతటితో నీ నవ్యభావము లట్టె యాగుట లేదు. నేటి యీ రూపము కల నాట్యశాస్త్రము ఇప్పటికి పండ్రెండువందల వత్సరముల నాడు సంగ్రథనసంకలనములు పొంది యుండుననియు కతిపయభావుకులు భావించుటయ కాక యీ భావమును బహిఃప్రపంచమున ప్రసరింపజేయుటకు యత్నించిరి. అభినవగుప్తునకు పూర్వము రెండువందల సంవత్సరముల నాడిది యిట్టి దయినదని వారి యూహ. అభినవపూర్వతనము లనేకవ్యాఖ్యానము లున్నవి. అవియన్నియు నసమకాలికములె కావలయును. భవభూతి నాట్య మెఱుంగును. కాళిదాసు చాక్షుష యజ్ఞము చేసినాడు. ఇంకనిది పూర్వతనులకు పరిచితము. తత్పూర్వతనులకును సుపరిచితము. అభినవగుప్తుని తాతముత్తాతల నాటికిది యిట్లు సంక్లప్తమయినచో నాటికి పరివృఢమయిన సాహితీసామగ్రి యిం దనుప్రవిష్టమయ్యెడిది. అట్లు కాలేదు. ఇట్టిదియంతయు దీని యనర్వాచీనతకె నిదానము. అప్రాచీనార్వాచీనభావు లెంతగా దీని

-సన్నిహితము చేసికొనదలచిన నిది యటగుట లేదు.

* * *

నాట్యవేదసంభావన మేవంవిధమున గూడ సాహిత్యికలోకప్రచలిత మయినది. భరతముని నాట్యవేదము స్వవిషయమున అద్వితీయగ్రంథము. విశ్వసాహిత్యములో నేతాదృశవిషయమున నింతగా సర్వపరిపూర్ణమయిన ప్రాచీనగ్రంథ మన్యము లేదు. యవనదేశీయు డయిన భట్టశ్రీ అరిస్టోతలుని నాట్యవిషయగ్రంథ మొకటి పాశ్చాత్య సాహితీప్రియంభావులకు మానసమ్మానభాజన మయినది. కాని యందు త్రాసద (ట్రాజెడి) రూపకపరీక్షణము మాత్రము యున్నది. అదియు నల్పకాయరచన. ఏకాంగ రచన. సాహితీసృష్టి సమీక్షించు నొక పాశ్చాత్యసారస్వతేయుడు "అరిస్టోతలుం డొక్క త్రాసదరూపకమునె సమీక్షించెను. నాట్యమునకు సంబంధించిన వాస్తవరూపమును సమీక్షింపలేదు." అని చింతపడినాడు. అయిన అరిస్టోతలుని యా పుస్తిక యూరపుసాహిత్యతాపసులకు కంఠహారమయినది. నాట్యవిశ్వకోశము నాట్యవేదము మన భారతవర్షకృతి యయినది. భారతీయుల కిన్నాళ్లుగా నున్న స్వాత్మవిస్మృతి నాట్యవేదవిశిష్టతను వెలయింప జేయుటకవకాశ మీయలేదు. నాట్యవేదమున లేని దెందును లేదు. నాట్యవేదమున రంగశాల యున్నది. అభినయమున్నది. రసమున్నది. ఛందోలంకారములున్నవి. వేషభూషలున్నవి. సంగీతమున్నది. సర్వమున్నది. ఇందేమి లేదు? సాహిత్యశాస్త్రగ్రంథములలో నాట్యవేదము ప్రథమ గ్రంథము. కావుననె యిది నాట్యవేదము. ఈ పేరిందు సార్థకము. ఇందు కేవలము నాట్యసంబంధిజ్ఞానవిజ్ఞానములే కాక ప్రాచీనకాలపు భారతదేశీయ సామాజికావస్థావ్యవస్థల రూపస్వరూపములును గోచరము లగుచున్నవి. కలా మయసాంస్కృతిక రంగమున భారతీయుల సమున్నతి నాట్యవేదమున భాసించును. షట్త్రింశకము షట్సాహస్రీక మయిన భరతనాట్యవేదమున భరతభూచిత్రీకృతమధురజీవన మవభాసించుచున్నది. ఏతదర్వాచీనకాలమున వెలువడిన యలంకారశాస్త్రీయ గ్రంథములు నాట్యాభినయనిరూపకగ్రంథము లన్నియు దీని నీడలు క్రీనీడలు. ఈ విషయమున దీనితో స్పర్థపెట్టుకొనగలగ్రంథ మేదియు నితరదేశముల నవతరింప లేదు. నాట్యవేదము దేహళీదీపమై దీపక మయినది. ఏతత్తుల్యయోగిత కలదియు లేదు. పుట్టునని నాట్యవిదు లనలేదు. నవభారతనవభరతు లయిన నీ నవంనవభరత చరణచింతన మొనరించిననె స్వాత్మసంతుష్టులు కాగలరు. యావననాట్యప్రక్రియాలోపము పొందని వారప్పటిలో నాట్యవేద మీక్షించినచో నేమనగలిగెడివారో మనమూహింపగలము. అభినవభారతీభావసంభారముతో భరతభారతి యందర కందలేదు. అందినచో నాంగ్లిసమాలోచకులు మోదభరితులై యింకను సమధికముగ సమీక్షింతు రనుకొందము. కొందరు పాశ్చాత్యులు నాట్యశాస్త్రి లయినారు. ఆ తుష్టితో రసిసద్ధాంతమంతగా ప్రస్తరించినారు. భరతుని ప్రశంసయు చేసినారు. కతిపయసమీక్షలును

వెలసినవి. కాని పర్యాప్తపరిశీలనము జరుగ లేదు. నాట్యవేదమునకు రావలసిన ప్రశస్తి రాలేదు. భారతీయులకు నిర్వ్యారాత్మవిశ్వాసముదయించిన రావలసినది రాగలదు.

సహస్రాధికముగా సాహిత్యశాస్త్రగ్రంథము లున్నవి. అవి యన్నియు నాట్య వేదచ్ఛత్రచ్ఛాయలోనివి. కొన్ని పఠనపాఠనములలో నున్నవి. అంతట భరతుని పదముపట్టక తప్పదు. కాని భరతగ్రంథము బహుకాల మదృష్టవైభవ మయినది. కొందరు భరతుని పేరువినిరి. కాని, వేదదర్శనము కాలేదు. ఈ వేదము లుప్తమై యయిన దనిరి. ఒక పాశ్చాత్యమనీషి దశరూపకము పరిష్కరించి ప్రకటించుచు పరిశిష్టముగా తత్సంబంధి కతిపయాధ్యాయశ్లోకములను ప్రకాశింప జేసినాడు. ఏకైకత్రుటితాసంపూర్ణమాతృకాధారకముగా నాత డెంతయని చేయగలడు? కాని యాతని కాశ లుడుగ లేదు. భారతదేశభండారములలో భరతగ్రంథములు కొన్ని లభించినవి. భరతవిదులు కొందరుపలబ్ధముల సంవాదవిసంవాదసమీక్ష నారంభించిరి. శర్మణ్యులు కొందరాత్మసంవాదము చూచుకొని నాట్యవిషయ వివేచనమున కుద్యమించిరి. పరాశుదేశవిద్వాంసు డప్పటప్పట దొరికినంతగా ప్రకటించినాడు. తదంతేవాసి మరికొంత ప్రకటించినాడు. మరికొందరింతింతగా నేమేమో చేసినారు. పాశ్చాత్యుల పరిష్కరణ సంస్కరణముల గూడిన ప్రకాశనము ప్రకాశితము కాగా భారతీయాంతర్వాణులు భారతీయనాట్యవేదమును ప్రకాశింపజేసిరి. ఈ సంస్కరణ మంతటవ్యాపించినది. అప్పటిలో నది యంతగా నయినను విస్తృతవివేచన మంతగా సాగినది కాదు. భరతభావము దురవబోధ మయినది. గ్రంథగ్రంథి విశదీయుపీయు టీకయు నప్పటిలో గోచరింపలేదు. నాట్యవివృతి యున్నదని, దానిపేరు "అభినవభారతి" యని, యది శ్రీమదభినవగుప్తపాదాచార్యుని దని నాట్యద్రష్టలు గుర్తించిరి. శ్రీమాన్యసారస్వతేయులు మానవల్లిరామకృష్ణకవి వివృతిసహితనాట్యశాస్త్రప్రకాశనోద్యుక్తులై కొంత ప్రకటించిరి. భరతభావప్రకాశనమున కభినవభారతి సర్వసమర్థము. అయినను ముద్రితపాఠము నభినవుడయిన సాధూకరింప శక్తుడగునా? యని సాధుభావులు సంశయింపవలసి వచ్చినది. అభినవహృదయము తెలియుటకు భారతీమాత్రము చాలదు. లోచనమును చాలదు. స్పందము ప్రత్యభిజ్ఞ ఆలోకము విమర్శిని స్వచ్ఛందము దర్శనదర్శనము కావలెను. సర్వతంత్రస్వతంత్రులు శ్రీరాయడుశాస్త్రి లభినవు నిట్టె యిట్టె గుర్తించిరి. అయిన నప్రత్యభిజ్ఞేయమును స్వాత్మగుప్తము చేయుట శ్రీమదభినవగుప్తతంత్రము. పరిష్కృతపాఠము సుప్రకటమగువఱకు వేచియుండుటకు నిత్యవేగి స్వస్పందసందోహ మిచ్చగింపదు. నాట్యవేదవివృతి పర్యాలోచనము పర్యాప్తముగ లేనిచో నాట్యవేద మాత్మవేద మెట్లగునని కతిపయభావనమున భావ ముదయించుచు. సాభినవభారతీకము నాట్యవేద మాత్మవేద మగును.

* * *

ఏవంప్రకాశమాన మగు నాట్యవేదయశ్న మిప్పటిది కాదు. శ్రీమదభినగుప్త

పాదసిద్ధాంతిత మయిన రసమీమాంసకై యభినవభారతీ వ్యాసంగ మొనరించుట యావ శ్యక మయినది. శ్రీరాయడు శాస్త్రి గురుచరణులు గ్రంథగ్రంథివిభేదనచణులు పర్యా లోచనమున ప్రబోధ మిచ్చిరి. ఎప్పుడో దీని వ్రాయ సంకల్పించితిని. అప్పు డిది యిట్లగునా? ఇప్పు డప్పటి కన్న నధిక మేమేని గ్రథించితినా? పరిపాక మున్నదా? నేనె ట్లు చెప్పుదును. అప్పటినుండియు నాట్యవిషయముల రచనలలో వ్యాసము అలో కలియకలంపు కొనుచునె యున్నాను. అవియసంగతములని యిప్పుడును నేను తలచుట లేదు. ఆనాటిది పాకము. ఈనాటిది పరిపాకము నగునా? ఎట్లని నేను నిర్ధా రింతును? భరతగ్రంథ మెప్పుడో చదివితిని. కాని అప్పటికన్న నిప్పుడెన్నియో తెలిసి కొనవలసి యున్నట్లె తోచును. నారచనలో నాకు తత్తద్విషయ పరిజ్ఞానమున్నదా? అభినవపంక్తి సరిగా నర్థముచేసికొనగలిగితినా? విపులోపపాదనములో వివక్షితాంశ మును విశదముచేయగలిగితినా? అని పరభావాశ్రయమున సందిహానుడ నగుటయు కలదు. సుగమముగా నున్న నాట్యవిషయమును నేను దురవగాహము చేసితి నని మాటవరుసకు కొందరన వచ్చును. భరతమూలార్థ మభినవునకు దెలిసినట్లు ఇతరుల కెట్లు తెలియును? అభినవభారతిని చూడక భరతోక్తి తెలిసినదని యెట్లనగలము? నాట్య వివృతి భారతి చూచి దాని నుల్లేఖింపక యెట్లుందుము? అభినవుడు లేకున్న భరతు డేడీ? వీని నన్నిటిని నేటిప్రయోగములలో సమన్వయించి చూతునా? నాకు శక్యము కాదు. ఏరికి శక్యక్రియ యగునో? ఎన్నియే ననుట సుశకము. ఉపవేశనపఠనములో శయన పఠనములో నిది బుద్ధము కావచ్చును. సుబుద్ధము కాకపోవచ్చును. విశిష్టాభిజ్ఞుల సమక్షమున సమధీతసాహిత్యవిద్యు లట్లు ప్రబుద్ధులు కారనలేము. పఠనపాఠనములు, అధ్యయనాధ్యాపనము లావశ్యకము లనుట యభినవభాష్యభూష.

రసభారతీప్రఘట్టమును కావ్యహృదయు లధీతాలంకారశాస్త్రులు సావధాన మున సమీక్షింతురు. ఇది యభినవవచనము. దీని పట్టి పట్టి కావ్యరహస్యము గుర్తిం తురు. అని సాహితీలోకు లనుట స్వభిసంధి. రసమీమాంసలో నింతటి విషయ మున్న దని యిది చెప్పక విడుచు టెట్లు? ఈ విషయసద్భావవిస్తరణమున కీ వేదమె తగును. నాట్యవేదమున రస ముపనిషత్తు. నాట్యవేదములో నెన్నియో విషయము లెన్నియో చర్చ లన్నియు తలస్పర్శులు. అన్నియు మన తల దాటినవె. ఇంతటి లోకవిషయము, ఇంతటి శాస్త్రవిషయము సర్వత్ర సులభమగుట యెట్లు? రసాదుల స్వరూపసంకేత సమీక్షలో నింతటి యుపపాదన మితరగ్రంథములందు కానరాదు. అన్నిటి కిది యాకరము. ఇది యంతయు రసరత్నాకరము. అభినవపంక్తిభావము దురూహము అయినను తంత్రాలోకవివేకమున నూహింపవచ్చు ననుకొంటిని. ఇట్లొనర్చితిని. భావ భారము ప్రాణశక్తి కలిగి సదాగతిస్వీకారమున భుజంగరాడ్గమన మొనరించు గుప్తపాద పంక్తి వలనములు వర్తనములు చూచి తూచి యిట్లు వ్రాసితిని. స్వస్పందసుందర మయిన యీ వాణీవిలాస మట్లె యాస్వాద్యము కావలెననియు తలచితిని. తద్రూప సంభావన మె యిట్టిభాష. రచనలోని భాషావక్రతానిదానము అభినవరచనాశైలి

త్కారము. ఒక్కొకపంక్తిభావమును మనసు పట్టించుటకు సాలోచనలోచనవిస్ఫార మావశ్యక మయినట్లు ఒకప్పుడొక పద ముపయోగించుటకును సాలోచనత యావశ్యకము యయినది. ఒకప్పుడొక పంక్తిభావము గోచరము కాక దినము దినములు గడచినవి. ఏకదా భావాలోచనముతో నున్నప్పుడు ....వచ్చి తెలియజెప్పినట్లు భావించితిని. తెలిసినట్లుండ వ్రాసెడివాడను. భావలోకాలోకము సార్వదిక మెట్లు కాగలదు? పంక్తిభావము లెట్లో యనుకొంటరయె కాని స్వసంవిత్స్వందమంతట అభినవప్రసారము పొందగలదు. "అచట తోచదు. ఇచట తోచును" అని ఎచటనో తోచువఱకుండి వ్రాయుటలును గలవు. ఒకపంక్తి వ్రాసితిని. వేరొకటి వ్రాయులోపల నా మనసెట్లున్నదో నాకు తెలియదు. అభినవుడు బోధింపవలెను. నేను వ్రాయవలెను. అంతకుమించి నాకు మనసే లేదు. ఒకవాక్య మయినది. వేరొకవాక్యము వ్రాయవలెను. ఏమి వ్రాయుదునో యభినవుడె యెరుంగును. ఇట్లు నే నభినవభావుకుడ నయితిని. నాట్యవేద సంకేతితములయిన పదములనే నే నంతట వాడితినా? నే నట్లు వాడనిచో నేల వాడలేదు? నేటి చలితభాషలో నవి ప్రచలితములు కావా? అన్నిటి ప్రచలితములనె వాడితినా? వీని కన్నిటికి నా పక్షమున భావకభ్రాతలు సమత్తరములు సంభావింపగలరు. నే నె యన్నిటికి నుత్తరదానము చేసి సహృదయపాఠకుల యధికార మధీనము చేసికొనను. అభినవభారతి యంతట నుపలబ్ధము కాలేదట! హంత! అది లేనిచోట హస్తము సాగదు. అనుపలబ్ధ ముపలబ్ధ మయినప్పుడు మరల హస్తము సాగును. కావ్యానుశాసనపంక్తి చూచి అభినవభారతి ముద్రావ్యత్యయములు తిద్దికొంద మనుకొంటిని. అనుపలబ్ధాభినవభారతీకస్థలములందు హేమచంద్రసిద్ధపంక్తి చూచుట భారతీభావనమిచ్చు ననుకొంటిని. అట్లనుకొనుటయు ధైర్య మిచ్చినది. భావప్రస్తారములో సిద్ధభావము లున్నవి. అక్కడక్కడ అభినవుల భారతీపంక్తులు లేకపోయిన నభినవపంక్తులు వ్రాయుట కుత్సుకపడిన, నా యభినవభావభావిత మయిన చిత్తరీతి యనినాకుగా నేనె వ్రాయుటయు నా కర్తవ్యముగ భావించితిని. అది యేదో నవభావనివేదన మని నేను తలచ లేదు. అట్లు చేయుట నాకు తుష్టియై నా రచనకు పుష్టియయినది. ఇది యభినవునిపై నా వీరవ్రతమా? ఒకప్పుడు నా యీ నాట్యరచన రచనానాట్యముగా పాలరాతిపై పాలధారగా సరించియు నొకప్పుడు సుళ్లుతిరుగును. సాగనే సాగదు. ఏల సాగును? నా హృదయములోని శాంత్యశాంతులు నిదానమా? అశాంతిలో వ్రాసితినే! నిగ్రహ మనిగ్రహము నిదాన మయ్యెనా? నిగ్రహ మనిగ్రహము మనోధర్మములు. కాని నా మనమును ప్రగ్రహీకరించుకొనుట నాకు నవక్రియ కాదుకదా! ఈ ప్రసరము నిమిత్తసవ్యపేక్షము కాదా? ఈ రీతి బహిరుపాధిసంశ్రయము కాదు కాబోలును! దేవీపాదద్యుతి ప్రసార మంతట నిమిత్తము. తన్నిర్నిరోధ ప్రసారము ప్రసార మొనరించు గావుత మనియె రచనాప్రసరము చూచుకొంటిని.

ఇదివరలో నభినవుని భారతి నంతటిని సమీక్షించితినా? పూర్వరచితములందేమేని వ్యత్యయమున్న అభినవభావనము లేనితన మని యనుట యమాయరీతి." అస్తు.

అలంకారికులందఱభినవులు కారు. అభినవుని వలెనే యాలంకారికుడును గుప్తగాథ ములను గాఢప్రగాఢముగా మనన మొనరించి నట్లు భాసింపదనుట నాట్యమహాభాష. అంతకంత కాదర మభినవ పదముల గలుగును. ఏఘట్టము భావించిన నాతడు సాటిలేని స్వరూపముతో సాక్షాత్కరించును. ఇతరములపై నంతగా గలుగని యాదర మభినవ భావనమున గలుగుట సహజము "తద్భావనముతో నొనరించిన రచన లెంత సుశ్లిష్టము లగునో" యనిపించును. ఈనాట్యవేదభావములె సాహిత్యలక్షణగ్రంథములందు ప్రసక్త్యనుకూలముగ నిరూపితము లయినవి. కొన్నిట నవి బహుధా ఉపపాదితములై యుండవచ్చును. కొన్నిట నన్యథితములై యుండవచ్చును. ఉపపాదనబహులత యింకను గలదు. దీని ననుసరించి యన్యథితముల సమీక్షించుకొనుటయు సముచితము కాగలదు.

ఒక్కొక యుపపాదనము విస్తృతమై విప్రకీర్ణమై దురవబోధమై కీకసము ప్రవే శించినట్లయినదా? లోల్లట శంకుక నాయకోద్భట కోహలాదుల భావములని యుల్లే ఖించుట యున్నది. కొన్నిభావముల సముల్లేఖ మనామసంగ్రహముగ నున్నదేమి? వారి పేరులు తెలియవు. తెలిసియు నభినవు లుపేక్షించిరి. వారి పేరులు పలుక లేదు. తన కును సముల్లేఖ్యు లయిన వారుకూడ పేరులేని వారగుదురా? అనాదరమున వారిని పేరుపెట్టి పిలువలేదు. వారు గ్రంథగ్రథయితలయి యుందురా? సమకాలమున భావ ములను గాలిలో విడిచిరో? అట్టివారు ఖండనయోగ్యభావు లగుట అభిఖ్యలేనివారని ప్రఖ్యోపాఖ్యాచతురు లభినవు లట్లు చేసిరి. అభినవుడు ఖండించును. మండించును. ఆ రీతులు చిరకాలముగా లోకమున నశ్రుతదృష్టము లగుట నవములుగా నుండుటయ కాక అభినవములుగా గూడ నుండును. అభినవానుల్లిఖితులు "కేచిత్తులు కతిపయులు అన్యులు పరులు" అయినారు. కొందరకు నామ ముంచినాడు. వారుచ్ఛోటాదులు. వీర పరామృష్టభావులు కారు. వారి పేరుపెట్టి వారి భావవాదము లవికలముగ నిరూ పించి తన వివాద మసంవాదము ప్రదర్శించుచు నర్మగర్భముగ హాసకుశలముగ పరీహాస పేశలముగ నిశ్చితపదప్రయోగ మొనరించినాడు. శ్రీశంకుకాదు లప్పట ప్రాప్త యశులు. వారి పేరులుపలుకుట యావశ్యకమై యుండును. అనుల్లిఖితుల పేరు దూర ముంచుటయె సముచితము. వానిని వారె చిత్తమున హత్తలేదు. వారి యొత్తిడి మన కీయ దలచలేదు. ఉత్పల భట్టతోతులు సంవాదసంవిత్ప్రకాశులు. అభినవుడు భట్ట తోతగురువులతో సజీవుడయినాడు.

కావ్యభాషారమ్యపదబంధనమునకు యత్నించుటలో గూడ అభినవుడు మార్గ మిచ్చు మహర్షి. అయినను మొదట మొదట వానిసంకేతములను జెప్పియె యా పద ముల వాడితిని. అధీతపూర్వగ్రంథు లుత్తరగ్రంథాధికారు లగుట యంతట నందరు గుర్తించినదె కాని నాకె నవగ్రహము కాదు. కొన్ని పంక్తులు సుజ్ఞేయములు కాన ప్పుడు వాని వివరించుట సుకరము కాదు. ఆయావాద తత్త్వముల నట నట నిరూ పించి దీని నింతచేయగా నిందు పరస్పరవిరుద్ధములు దొర్లినవో? పొర్లినవో? నేను ప్రసమీక్షించుకొంటను పూర్వోత్తరవిదులు గుర్తింతురు. సూచింతురు. కొన్ని కొన్ని

పట్టులందు ముమ్ముందు నిరూపింతు మని, కొన్నితావులందు పూర్వమెనిరూపిత మని
రచనలో నుండుట పరస్పరాపేక్షము లని భావింపవలదు. అర్థమొకచో పూర్వార్థ
సాపేక్ష మన్నట్లు ప్రముఖమున నవభాసించినను సందర్భాపేక్ష మయిన భావమచట
సులక్షమె కాగలదు. పూర్వపశ్చాత్సమన్వయభాగభోగులకు మహార్థము నిత్యసిద్ధమె.
అందుననె పూర్వపశ్చాద్భావోల్లేఖ మేకాన్వయగతి సూచకముగా నిర్దిష్టమయిన దని,
భావకభావు లభ్యసూయింప వలదని యనుటయ నా మాట. కొన్నిటి యుపపాదన
ములో నందరివలె నేను పర్యనుయోగావసరము కల్పించుకొంటిని. నాప్రయుక్త
భాషను నేనారాధించుట నేర్చికొంటిని. ఇది నా తపస్య. ఈ తపోవనము చేరిన కతి
పయమును లిట్లనగలుగవచ్చును. కొందరు:- "మీరిట్టిభాష నేలవాడితిరి? ఇది క్లిష్టము
క్లిష్టమయినది. ప్రజకిట్టి దెట్లు తెలియును? తెలియవలెనని కదా! మీరిట్లు తెలుగు
వ్రాయుట. ఈ తెలుంగు తేలికగ లేదుకద! జనత కెట్లు సుగ్రహము?" —మరికొందరు:
"మీగ్రంథములు చూచితిమి. పత్రికల మీరచనలు చూచితిమి. చూచితిమనుటయె.
అంతగా భావింపలేక పోయితిమి. మీసభాభాషలు వింటిమి. వింటిమనుట సాదర
ముగ వింటిమి. బాగుండునని వింటిమి కాన వింటిమి. మేమును బాగున్నదనియె
భావించితిమి. కాని యర్థమయిన అర్థము కాలేదు. ఇదియు నట్టిదె యగునా?"
ఇంకను కొందరు:- "నలుదిశల నాత్మభాషాముద్రలతో నేడు గ్రంథముల వెలయించు
వారి భాష మాత్ర మిట్లు లేదా? పరసరపత్రపత్రికలభాష లీ బిగువుతోడనె యున్నవి
కదా! తనభాష తనదిగా నిర్మించుకొనిన విశిష్టుని శిష్టభాష భావించి భంగీభణితిసుంద
రతల సంభావింపవచ్చును గదా!" —ఇదితగును ఇదితగదనుటలో వ్యవస్థయనునది
యీ 'ఇదంత్వ'ము నందె యుండును. సాంకేతికపదసంపద్బహుల మయిన విషయ
ప్రతిపాదనము పరిచితపరిమితపదముల గుదురగనిది. కావ్యభాషాసముజ్జ్వల మయిన
సామగ్రి ననుసంధానించుటకు భరితాభినవు లంతస్సంజల్పస్వభావ రమ్యపద్ధతి ప్రదర్శిం
చిరి. తదారాధనము కావ్యామృతమై హృదయములకు మ్రదిమ కూర్చునని యందరివలె
నేను స్వీకరించితిని. నిత్యజీవనసాక్షాత్కారమునకు విశదవికాసమునకు సముజ్జ్వలతకును
ఈ సంవేదన మావశ్యకము. సర్వసాధారణముగా విశిష్టానుభూతిని సంపాదించి
సంస్కృతిపరసందేశ ముపదేశించుటకు శాస్త్రపరిష్కృతిపీఠప్రతిష్ఠావైభవము కల
కలామహత్వసూచనమునకు, బాహిరమయిన ప్రయోగపాటవమునకె కాక ఆంతర
మయిన రసభావసంవేదనసామర్థ్యమున కిది నిదాన మగునని యాత్మసంభృతసంవేదన
మును నివేదించుటయు సహృదయతర్పణము హృదయదర్పణము నగును. నాట్యము
విశ్వభాండసంభృతమై సాహిత్యవైభవగాన మొనరించినది. పరంపరాసమాగత సంప్ర
దాయప్రకారములు విచ్ఛిన్నప్రాయములు విలుప్తప్రాయములు నగుటచే నాట్య
మజ్ఞాతకల్ప మయినను కలాదేవతను యథాస్థానమున పునఃప్రతిష్ఠిత చేయవచ్చును.
పరంపరాప్రక్రియాప్రతిష్ఠాపనమునకు ముందుగా శాస్త్రీయజ్ఞానసంపత్ప్రతిష్ఠ యావశ్య
కము కాగా నీ యధ్యవసాయ మీ యావశ్యకసమారంభమున కుపయోగింపగలదని
సచేతశ్చేతోరీతి. కలావైవిధ్యమొక తాత్త్వికైకత్వమును సూచించు ననుట నాట్యమె
నివేదించినది. నివేదితనివేదన మాత్మనివేదనమని తలచితిని. నాట్యవేద మిట్లు సంభా
వించితిని. కంఠధారణయోగ్యములని తలచిన కతిపయశ్లోకముల నుట్టంకించి తత్తదను
సంధానవిధానము నుల్లేఖించుకొని నాట్యసంవేదనము సంపాదించుటను సచేతస్సాహితీ
తాపసులు హార్దముగ నభిమానింతురని నేను గుర్తింపగలుగుటయె నా కార్యచోదక
మయినది.

ఇందు నే ననుసరించిన విధానము లిట్లు భావించి యనుసంధానింప వచ్చును. ఇప్పటి కిది నేను ప్రకటింప దలచిన నాట్యవేదమున ప్రథమభాగము. భరతనాట్యశాస్త్రములోని ౧, ౨, ౩, ౫, ౬, ౭, ౨౦, ౨౧, ౨౨, ౨౩ అధ్యాయముల యభిమర్శన మిందున్నది. చతుర్థాధ్యాయము సూచనాసార మాత్రముగనె నిరూపితము. భరతప్రోక్త శ్లోకము లన్నియు నిందు లేవు. కాని సర్వ శ్లోకతాత్పర్య మిందున్నది. అభినవభారతీభావ మంతయు నిందు విస్తృత మయినది. అధ్యయనాధ్యాపనారంభక మయిన యానుభవికసంస్కారమును పరిష్కరించుకొని కలియకూర్చితిని. ఇట్టిది యిట్లయినది. ఇందున్న వాని కనుక్రమణిక యున్నది. అభినవుడు నన్ను తన పదచింతనమునకె మలచుకొని నట్లున్నది. వాని భారతిలో నీ నామసంకేతితములను సమీక్షించుటయె సముచిత మనిపించును.

# విషయసంగ్రహము

శ్రీః

# నాట్యవేదము

# భరతనాట్యశాస్త్రసంగ్రహము

## నాట్యవేదసముదయము

౧. ప్రణమ్య శిరసా దేవౌ పితామహమహేశ్వరౌ
నాట్యవేదం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతం.

## బ్రహ్మేశవందనము

నాట్యప్రవర్తకపితామహుడు బ్రహ్మకు, మహాదేవుడు మహేశ్వరునకును శిరసా నమస్కరించి బ్రహ్మ యుదాహరించిన నాట్యవేదము నుల్లేఖింతును. భగవానుడు మహాదేవు డానందనిర్భరుడై సంధ్యలందు నృత్యము చేయును. నాట్యమున నృత్తమున ఆ దేవుని ప్రవృత్తియె నిదానము. ప్రజాపతి బ్రహ్మ యా నాట్యమును ప్రవర్తింప జేసినాడు. గురుదేవులయిన పితామహ మహాదేవులు ముందుగా నమస్కార్యులు. వీరిద్దరె యిందు నమస్కార్యు లనుట ఇందు విశేషము. నాట్యవేదము నాట్యశాస్త్రము రెండును పర్యాయపదములు. నాట్యమను వేదము నిరూపింతును. నాట్య మనునది రసస్వభావము. నాట్యమె వేదము. అది యిందు కలదు. దీని ప్రథమమున బ్రహ్మయె ప్రవర్తింపజేసెను. వేదములనుండి నాట్య మావిష్కారము పొందినది. ఇది నాట్యవేదము. పరమపురుషార్థము నాట్యవేదప్రయోజనము. తదభిలాషు లందరిం దధికారులు.

భరతముని షట్సహస్రపరిమితముగా నాట్యశాస్త్రము రచించెను. ఈ నాట్యవేదము ఆ శాస్త్రసంగ్రహము. తద్భావదర్పణము. నాట్యవివృతి ప్రకాశము. అభినవభారతీ ప్రాణము. నాట్య నయవినయ వినేయము. భరతముని యొకప్పుడు జపముకావించి తన కుమారులతో కూడి యుండెను. భరతుడు నాట్యకోవిదుడని ఆత్రేయుడు మొదలగు మునులు గుర్తించిరి. చుట్టుచేరిరి. సనియమముగా భరతు నడిగిరి. నాట్యమన్నది యాత్రేయాదుల కిదివరలో తెలియదు.

ఇప్పుడు భరతాచార్యుని సమీపమున తెలియదలచిరి. ఇది యుక్తము. ఆచార్యుడు భరతు డభిజ్ఞుడు. నాట్యము శిష్టప్రామాణికము. ఊహాపోహసమర్థు లాతనిచో జేరిరి. ప్రథమప్రవృత్తి యిట్లుండుట సముచితము. ఆత్రేయాదులు భరతు నిట్లడిగిరి.

### మునిప్రశ్న

౨. యోయం భగవతా సమ్యక్ గ్రథితో వేదసమ్మితః
నాట్యవేదః కథం బ్రహ్మన్! ఉత్పన్నః? కస్య వా కృతే?

భరతాచార్యా! మీరు మహాభావులు. సుందరతమ మగు నాట్యవేద మావిష్కరించినారు. అది యపూర్వముగా నున్నది. మేము దాని ప్రయోగసమయమున చూచితిమి. అంతస్సారమంతగా తెలియలేదు. అందుచే ప్రత్యక్షమయ్యు నప్రత్యక్షప్రాయమె యయినది. మేమేమి పరీక్షింతుము? అది వేదసమ్మితము. ఆ నాట్యవేద మెట్లుదయించినది? దాని ప్రయోజనప్రకార మెద్ది? ఎవరి కొఱకిది యావిష్కృతము? ప్రయోజనసంపాదనమునకు వేదాధికృతులె యిఁ దధికారులా? ఇతరులు నిం దధికారు లగుదురా?

3. కత్యంగః? కింప్రమాణశ్చ? ప్రయోగశ్చాస్య కీదృశః?
సర్వమేతద్యథాతత్వం భగవన్! వక్తుమర్హసి!

ఈ నాట్యము నం దంగము లెన్ని యున్నవి? గీత మాతోద్య మభినయ మెన్నియో కలవు కదా! నాట్యమంగి యగునా? అంగ సముదాయమాత్ర మేనా? నాట్యము శ్రేయఃప్రాప్త్యుపాయముల గోచరింప జేయుననుట సరియె! ఈ నాట్యాంగముల నే ప్రమాణమున గుర్తింప వలెను? ఇందంగాంగిభావనియమ మెట్టిది? ఈ నాట్యము లోని పాఠ్యము అభినయము రసము గీత మనువాని నియమ మెట్టిది? ఈ నాట్యము నెట్లు ప్రయోగింప వలెను? అంగముల నెన్నిటినో ప్రయోగింతురు కదా! అన్నిటి కలియ గలుపుకొని గుర్తింప శక్యమా? ఇవి యన్నియు కలదియె కదా! నాట్యము! ఇట్టి నాట్యము ప్రయోగించు టెట్లయ్యా! అంగాంగిభావమున ప్రయోగ మనునది నియమము తోడనె యుండును కదా? మీరు దీని నంతను యథాతత్వముగా నిరూపింప వలసి యున్నది.

ఆత్రేయాదుల ప్రశ్న లన్నిటి నయిదు విధములుగా గుర్తింప వచ్చును.

౧. ఎట్లావిర్భవించినది ?
౨. అధికారు లెవరు ?
3. అంగాంగిభావ మేమి ?
౪. నిశ్చయ మిచ్చునది యేమి ?
౫. నాట్యప్రయోగనియమము లెవ్వి ?

ఈ ప్రశ్నపంచకమున నీ నాట్యవేదము కవికి ప్రయోక్తకు నుప దేశ మిచ్చున దని విశదము. సహృదయున కిది యుపదేశక మనుట యిచట వివక్షితము కాదు. సహృదయుడును దీని పఠించిన ఉపకా రము పొందగలడు. పై ప్రశ్నల క్రమ మిందు ముఖ్యముకాదు. ఈ ప్రశ్న లన్నియు నుపేయపరములు. ఉపాయమాత్రము మును లడిగిరి. ఇందడుగనివి యుండవచ్చును. వాని గూడ కలుపు కొని తత్త్వయోగ్య మగు తత్త్వము నిరూపింపవలయు ననియె ప్రశ్నభావము.

## భరతవాణి

ఆత్రేయాదుల వచనముల నన్నిటిని భరతుడు సావధానముగా విని నాట్యవేదకథ నారంభించెను. వీరుపదేశయోగ్యు లని భావించి యథాతత్త్వ మంతయు నిరూపించెను. ప్రయోగవిషయమున ప్రశ్నింప ప్రయోగమునె చూపుట కాక విషయమును విశదముగ చెప్పెను. సదాశివుని తత్త్వమునె బ్రహ్మ గుర్తించెను. దానినె భరతుడు గ్రహిం చెను. ఆ విషయము నాత్రేయాదు లడిగిరి. ఒకక్రమ ముద్దేశించి వారు ప్రశ్నింప లేదు. విషయము తెలియని వా రెట్లో యడుగుదురు. ఉపదేశకు డన్నియు గుర్తించి యుపదేశించును. నాట్యవేద మిది ప్రశ్నపంచక నిరూపణపరము. ఇందు తత్త్వనిర్ణయ మున్నది. స్వవిష యమున నిది విశ్వకోశము. లలిత విజ్ఞానసర్వస్వము.

## మన్వంతరకథ

బ్రహ్మ నిర్మించిన నాట్యవేదసంభవమును మీరు పవిత్రముగా సావధానముగా వినుడు! స్వాయంభువమన్వంతరము మొదటిది. ఇప్పటి దిది వైవస్వతమన్వంతరము. మన మీ మన్వంతరమున

సున్నాము. ఆ మన్వంతరమున కీ మన్వంతర మేడవది. మొదటి స్వాయంభువ మన్వంతరమున కృతయుగము ప్రశాంతముగా గడచి నది. ప్రకృతము వైవస్వతమన్వంతరమున త్రేతాయుగము రాగా నిట్లయినది.

## త్రేతా ప్రవృత్తి

౪. గ్రామ్యధర్మప్రవృత్తే తు కామలోభవశం గతే
ఈర్ష్యాక్రోధాదిసమ్మూఢే లోకే సుఖితదుఃఖితే

౫. మహేంద్రప్రముఖైర్దేవైః ఉక్తః కిల పితామహః
క్రీడనీయకమిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్భవేత్.

కర్మభూమిస్థాన మయిన జంబూద్వీపమున లోకము సుఖితము దుఃఖితము నయినది. గ్రామ్యధర్మమున ప్రవర్తించినది. కామవశ మయినది. లోభము పొందినది. ఈర్ష్యాక్రోధాదులచే సమ్మూఢ మయి నది. జంబూద్వీపమును దేవత లాక్రమించినారు. దేవ దానవ గంధర్వ యక్ష రక్షో మహోరగు లాక్రమించిరి. రాజసతామసహృద యులు కల్పించు సపర్యలను పొంది దానవు లీ ద్వీపమును స్వవశము చేసికొనినారు. లోకపాలుర యంశముల నుదయించిన భూపాలురు స్వధర్మసాధనమునకు లోకమును నియమించిరి. కాని దేవదానవులె కాక గంధర్వులు యక్షులు రాక్షసులు మహోరగులు ద్వీప మాక్ర మించిరి. అప్పుడిదంతయు చూచి యింద్రాది దేవతలు బ్రహ్మసమీప మున కేగి యిట్లడిగిరి. "బహుసాధారణమగు 'క్రీడనీయకము' నిర్మిం పుము. అది దృశ్యము శ్రవ్యముగా నుండవలెను. అట్టిదియె సర్వ సాధారణ మగును. కొందరికె యగునది యీర్ష్యాక్రోధాదుల కలుగ జేయును గదా!" ఇట్లు దేవేంద్రు డడుగగా బ్రహ్మ 'సరియె' యని నాడు. తత్త్వవిదు డాతడు యోగ మవలంబించి నాలుగు వేదముల స్మరించినాడు.

## క్రీడనీయకాభిలాష

కృతయుగము సత్త్వప్రధాన మగుట లోకము స్వధర్మపరా యణమె యగును. పూర్ణసుఖము కలదగును. త్రేతలో నట్లు కాదు. అప్పుడు లోకము రాజసము. దుఃఖము విడువ వలెనని సుఖమె పొంద

వలయునని తలచును. అందుచే సుఖితము దుఃఖిత మయిన లోకము నకు రాజనియంత్రణ మావశ్యక మగును. కాలము దేశ మేకాంత సుఖితముగ నున్నచో క్రీడనీయక మక్కఱ లేదు. ఏకాంతదుఃఖిత మయినను క్రీడాఫలము లభింపదు. సత్యయుగమున క్రీడనీయకాపేక్ష లేదు. నారకబాధలు పడువాని కిది కా బట్టదు. యుగహ్రాసములో గ్రామ్యధర్మము కలుగును. గ్రామ్యధర్మ మనునది శాస్త్రవాదములు వినని జనులు వ్యాపించిన దేశమున తగిన ధర్మము. అది స్వధర్మమును పాలింప నీయదు. అట్టి లోకమున క్రీడనీయక మావశ్యకము. అది దృశ్యము శ్రవ్య మనుట ప్రీతివ్యుత్పత్తిప్రద మనినట్లయినది. దృశ్యము =హృద్యము. శ్రవ్యము=వ్యుత్పత్తిప్రదము. ఈదృశము లోకమున గా వలయు నని దేవేంద్రాదుల కోరిక. దీన నింద్రాదుల కేమి స్వార్థము? లోకము తమ ధర్మమున నున్నచో నాకమునకును రాక చేయుదురు. దైవమానుషసర్గములు పరస్పరోపకారముతో నుండునవి కా గలవు. సుఖిత దుఃఖితు లయిన మానవులు స్వర్గమునకు రాగా వారల జూచి దేవులును సరజసీకృత హృదయులై క్రీడనీయక మభిల షింతురు. కాన నిది కావలె నని యింద్రుని కాంక్ష. శాస్త్రమతు లును నాట్యమున సుఖముగ వినీతు లగుదురని భావము.

## వి శి ష్ట త

వేదవ్యవహార మందర కందరాదు కదా! 'ఇది తమ కుపదిష్ట' మని యంద రేకకంఠమున నంగీకరింపక పో వచ్చును. కావున సార్వ వర్ణికవేదము నాట్యవేదము నిర్మింపు మని యింద్రుడు కోరెను. ఏ వర్ణమువారు కానీ! సరససుకుమారనయమున కావ్యము స్వకర్తవ్య ముద్బోధించి నప్పుడు సరసముగా సుకుమారముగా ననునక్తులై క్షీరము లోని యౌషధము వలె కర్తవ్య మకర్తవ్యము గుర్తింతురు. కావున నాట్యవేద మనునది సుకుమారమతులకును వ్యుత్పత్తిదాయి. శాస్త్రా ధ్యేతల సంవాద ముండును గాన కార్యాకార్యవివేకసిద్ధియు నుండును. ఇట్టి కాంక్షను బ్రహ్మ గుర్తించి నాడు. బ్రహ్మ సమస్తలోకవేదజ్ఞుడు. సర్వవేదముల యుగపదవభాసము కలవాడు. సర్వశ్రావ్య మయిదవ వేదము నిర్మింతు ననినాడు.

## స్వరూప ఫలము

౬. ధర్మ్యమర్థ్యం యశస్యం చ సోపదేశం ససంగ్రహం
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మాను దర్శకం.
౭. సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్పప్రదర్శకం
నాట్యసంజ్ఞమిమం వేదం సేతిహాసం కరోమ్యహం.

ఈ నాట్య మనెడు వేదము నిర్మింతును. ఎట్టిదది ? ఈ యుగ
లమున నా యంశ మున్నది. బ్రహ్మ సంకల్ప మిది నాట్యోత్పత్తి
గర్భాధాన కల్పము. ధర్మ్యం=సర్వపురుషార్థములకు సాధుసాధకము.
ఉపదిశ్యమానము లగు ఉపాయములతో నుండుటచే చతుర్వర్గోపాయ
ప్రవర్తకము. ఇందలి ప్రతీతి నిర్విశంకము. సాక్షాత్కారమె చాలును.
వేరొక ప్రమాణ మక్కఱ లేదు. రాగల లోకమున కుపదేశకము.
లోక మెట్లు ప్రవర్తింప గలదు ? ఇట్లు ప్రవర్తింప గలదు. అర్థ్యం=
హృద్యము సర్వజనుల కభిలషణీయము. యశస్యం = అంతట నిది
హృద్య మని ప్రఖ్యాతము కదా ! కేవలము పురుషార్థముల యుపా
యముల జెప్పుటయ కాదు. కలాముఖ్యము లయిన సర్వశాస్త్రార్థము
లం దున్నవి. గీతనృత్తవాద్యాదులు శాస్త్రార్థములె. సర్వశిల్పము
లున్నవి. ఏకయత్నమున సమస్తవస్తుసిద్ధి యన్నమాట. నాట్యము
భేదప్రభేదములతో నితిహాస ముపదేశించును. "ఇతిః = ఏవమర్థే
ప్రత్యక్షనిర్దేశం ద్యోతయతి. హాః = ఇహాశబ్ద ఆగమః. ఆసన
మాసః. ఏవం ప్రకారాః ప్రత్యక్షపరిదృశ్యమానా ఆగమికార్థాః
కర్మఫలసంబంధస్వభావా యత్ర ఆసతే — ఇతిః = జ్ఞానం, తస్యహాసః-
హర్ష పూర్వకో వికాసః" కర్మఫలసంబంధము కల సర్వార్థములు ప్రత్య
క్షములై యిందుండును. ఇది పంచమవేదము. ఒకటియె యయ్యు
నాల్గింటి నతిశయించును. సర్వలోక కార్యము వహించుటయె బ్రహ్మ
కార్యము. ఇట్లు సంకల్పవ్యాపారముకల బ్రహ్మ, వేదాంగముల యేకీ
కారము చూచుకొని నాట్యవేద ముత్పాదింతుననెను. ఇట్లు సంక
ల్పించి వేదపారము స్మరించుచు చతుర్వేదాంగ సంభవ మయిన
నాట్యవేదము నిర్మించెను. నాల్గువేదములందును నాల్గు నాట్యాం
గము లున్నందున వెంటనే వేదముల స్మరించెను.

## వేద సంభూతి

౮. జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్సామభ్యో గీతమేవ చ
యజుర్వేదా దభినయా న్రసా నాథర్వణా దపి

౯. వేదోపవేదైస్సంబద్ధో నాట్యవేదో మహాత్మనా
ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా సర్వవేదినా

సర్వవేది యగు బ్రహ్మ వేదము లుపవేదములు సంబంధించిన నాట్యవేద మిట్లు నిర్మించెను. పాఠ్యము, గీతము, అభినయము, రసము నాట్యాంగములు నాలుగు. ఋగ్వేదము నుండి పాఠ్యము, సామవేదము నుండి గీతము, యజుర్వేదము నుండి యభినయము, అథర్వవేదము నుండి రసము గ్రహించెను. బ్రహ్మ మహాత్ముడు. సర్వవిదుడు. అట్లు సృష్టిశక్తుడు.

పాఠ్యము వ్యక్తవాక్కు. తలచిన యర్థము చెప్పుటకు సమర్థమగునది. స్వరాలంకారాది యోజనమున నది యుపస్కృతము కాగలదు. నాట్యమున పాఠ్యము ప్రధాన మని మొదట చెప్పుట. పాఠ్యము నాట్యశరీరము. ఇది వాచికము. వాచికమున యత్న మావశ్యకము. ఆంగికాహార్యసాత్త్వికములు వాక్యార్థమును సూచించును. వాచిక మభినయాంతర్గతమె యయినను ప్రధాన మగుట ప్రథమోపాత్తము. ఋఙ్మంత్రము వలె పాఠ్యము స్వరత్రయ సహితము. స్వర ప్రసంగమున పాఠ్యానంతరము గీత ముపాత్త మయినది. గీత ముపరంజకము. "గీతం ప్రాణాః ప్రయోగస్య." రసచర్వణము గీతాయత్తము కదా! పిమ్మట అభినయగ్రహణ ముచితము. అథర్వణవేదమున నానాకర్మలలో నటునకు వలె ఋత్విజునకు లోహితోష్ణీషాది (ఎఱ్ఱపాగా) వేషభూషాది నేపథ్య మావశ్యకము. ఆ యా కర్మలలో విశిష్టప్రయత్నమున అవష్టంభ ముండుట సత్త్వము సంభవించును. దానికై రసము కన్న ముందుగా నభినయము చెప్పుట. ఈ విభావాది సామగ్రి యున్ననె రసాస్వాద ముండుట రసకథనము సముచిత మయినది. కావున నిట్లు నాట్యము పరప్రీతిమయము. తద్విజ్ఞానమున వ్యుత్పత్తి యున్నది. కాన నాట్యమె వేద మనినట్లయినది. నాట్య

వేదము శాసనప్రాణ మగు శాస్త్రము కన్న విలక్షణము. నాట్య మపారూఢ విజ్ఞానికి ప్రాణవేద మయినది.

ఇప్పటికి నాట్యప్రయోజనము, నాట్యాధికారి, నాట్యాంగ ముల యంగాంగిభావము నిర్ణీతప్రాయము. మొదటి మూడు ప్రశ్నల కిది యుత్తరము.

సమాధానసారము

౧. కవి, బ్రహ్మసదృశుడై నాట్యవేదశరీర మగు రూపకము రచింప వలెను.

౨. విభవయుక్తుడు విధేయనటజనులు కల రాజు నాట్యము ప్రయో గింప యత్నము స్వీకరింప వలెను.

౩. భరతమునిసదృశుడు సంపన్నపరివారము కలవాడు సర్వవిదుడు ప్రయోక్త కావలెను.

౪. ప్రయోగ మేర్పాటు చేయు ప్రయోజయితల మహోత్సవసమ యము వంటిది నాట్యప్రయోగ కాలము.

౫. రాగద్వేషములు లేనివారు, నిర్మలహృదయముకురము కలవారు, తన్మయీభవన యోగ్యత కలవారు, రసాస్వాద సమాహిత చిత్తులు సహృదయులు నాట్యప్రయోగమున సామాజికులుగా నుండవలెను. —అను సారాంశ మిచట సూచిత మగుచున్నది.

బ్రహ్మ నాట్యవేదము నిట్లు నిర్మించి దేవేంద్రుతో నిట్లనెను. "నే నితిహాసము సృజించితిని. దీని సురులలో నియోగింపుము." సురులు సుఖాధికులు. స్వామి యాదేశమున నెట్లో ప్రవర్తింతురు. పూర్ణపర్యవసానము దుర్లభమె కా వచ్చును. సురు లయినంత మాత్రమున సమర్థు లగుదురా? నాట్య మనుసరింపదగు వారిట్లుం దురు. బ్రహ్మ యనెను.

నటుల అర్హత

౧౦. కుశలా యే విదగ్ధాశ్చ ప్రగల్భాశ్చ జితశ్రమాః
తేష్వయం నాట్యసంజ్ఞో హి వేదః సంక్రామ్యతాం త్వయా.

గ్రహించినదాని ధారణము చేయువారు కుశలులు. ఊహా పోహాసమర్థులు విదగ్ధులు. పరిషత్తులలో భీ పొందని వారు ప్రగల్భులు. యోగ్యులు తగినదేహము కలవారు డస్సిపోనివారు జితశ్రములు. ఇట్టి సురులందు నాట్యమను వేదము సంక్రమింప జేయుము! ముందుగా గురుముఖమున గ్రహింప వలెను. పిమ్మట విస్మృతి లేక ధరింప వలెను. అనంతర మూహాపోహ విచారణము చేయవలెను. అప్పుడు పరిషత్తులో ప్రకటింప వచ్చును. దీని కంతకు తగినట్లుగా వ్యాయామ మభ్యాసము మొదలగునది యుపయోగించు గుణనిక. ఈ చెప్పిన బ్రహ్మవచనముల నింద్రుడు విని ప్రాంజలియై నమస్కరించి యిట్లనెను. ఈ నాట్యవేదమును సురు లెట్లు గుర్తింతురు? గ్రహణమున, ధారణమున, జ్ఞానమున, ప్రయోగమున దేవతలకు శక్తి లేదు. నాట్యకర్మలో వీ రయోగ్యులు. ఎట్లనుసరింతురు?

౧౧. య ఇమే వేదగుహ్యజ్ఞా ఋషయః సంశితవ్రతాః
ఏతేఽస్య గ్రహణే శక్తాః ప్రయోగే ధారణే తథా

వేదమర్మ మెఱిగిన యీ ఋషులు సమర్థులు. అభ్యాస మొనరింప గలరు. గ్రహణ ధారణ ప్రయోగము లందు ఋషులె శక్తి కలవారు. వా రనుసరింతురు గావుత! అని యింద్రు డనెను. వేదవాదముల నుపనిషదర్థముల గుర్తించి ధారణ మొనర్ప గల మేధావులు రస భావములకు తగిన సత్వసంపత్తి కలవా రగుదురు. కాగా ధారణాది వశమున నటునకును పరమపురుషార్థలాభ మున్నదన్న ట్లయినది.

## పు త్ర శ త ము

దేవేంద్రు డిట్లన విని బ్రహ్మ భరతమునిని చూచెను. ఇట్లనెను. నీకు పుత్రశతము కలదు. నీ నీ నాట్యము ప్రయోగింపుము! స్వయముగ బ్రహ్మయె యిట్లనుట భరతు నం దాదరాతిశయ మున్న దనుటకు నిదర్శనము. భరతుడు బ్రహ్మనుండి నాట్యవేదము తెలిసికొనినాడు. చక్కగా ప్రయోగము గుర్తించినాడు. ప్రయోగనిశ్చయము కలుగువఱకు పుత్రులకు నాట్యవేద మధ్యాపనము చేసినాడు. ప్రయోగము నేర్పినాడు. ఇట్లీ విషయమును భరతుడు సానందముగా నాత్రేయాది మునులకు చెప్పెను.

భరతపుత్రులు శత మున్నారు. వారినామము లిట్లున్నవి.

౧ శాండిల్యుడు
వాత్స్యుడు
కోహలుడు
దత్తిలుడు
౫ జటిలుడు
అంబష్ఠుడు
తండువు
అగ్నిశిఖుడు
సైంధవుడు
౧౦ పులోముడు
శాద్వలి
విపులుడు
కపింజలుడు
బాదిరుడు
౧౫ యముడు
ధూమ్రాయణుడు
జంబుధ్వజుడు
కాకజంఘుడు
స్వర్ణకుడు
౨౦ తాపసుడు
కైదారి
శాలికర్ణ
దీర్ఘమాత్ర
శాలిక
౨౫ కౌత్స
తాండాయని
పింగల
చిత్రక
బంధుల
౩౦ భల్లాక
ముష్టిక
సైంధవాయన
తైతిల
భార్గవ
౩౫ శుచి
బహుల
అబుధ
బుధసేన
పాండుకర్ణ
౪౦ కేరల
ఋజుక
మండక
శంబర
వంజుల
౪౫ మాగధ
సరల
కర్తా
ఉగ్ర
తుషార
౫౦ పార్షద
గౌతమ
బాదరాయణ
విశాల
శకల
౫౫ సునాభ
మేష
కాలియ
భ్రమర
పీఠముఖ
౬౦ ముని
నఖకుట్ట
అశ్మకుట్ట
షట్పద
ఉత్తమ
౬౫ పాదుక
ఉపానత్
శ్రుతి
చాషస్వర
అగ్నికుండ
౭౦ ఆజ్యకుండ
వితండ్య
తాండ్య
కర్తరాక్ష
హిరణ్యాక్ష
౭౫ కుశల
దుస్సహ
లాజ
భయానక
బీభత్స
౮౦ విచక్షణ
పుండ్రాక్ష
పుండ్రనాస
అసితుడు
సితుడు
౮౫ విద్యుజ్జిహ్వ
మహాజిహ్వ
శాలంకాయన
శ్యామాయన
మాఠర
౯౦ లోహితాంగ
సంవర్తక
పంచశిఖ
త్రిశిఖ
శిఖుడు
౯౫ శంఖవర్ణముఖ
షండ

| | | |
|---|---|---|
| శంకుకర్ణ | ౧౦౦ అంశుమాలి | శతజంఘ |
| శక్రనేమి | శఠుడు | రౌద్ర |
| గభస్తి | విద్యుత్ | వీరుడు |

వీ రందరు భరతపుత్రులు. ప్రసిద్ధు లగుట నటుల కాదర పాత్రులు. కావుననె పేరులు చెప్పెను. ఇందు వేరొక భావమున్నది. కొన్ని నామముల నిర్వచనము సార్థకముగా నుండి యా యా భూమికా విశేషమున కుపయోగించును. వీరు శత మున్నారు. చెప్పబోవు పంచాశద్భావముల నాయకప్రతినాయక విషయమున శతసిద్ధి యుండును. అది యిది సంగతమనియు కొందరందురట. ఈ భావముల కేమిలె. ఇట్టి వన్నియు నసహృదయాభినివేశములు. ఈ శతపుత్రులలో నామభేదము కొన్నిట కన్పడు చున్నది. కొన్నిట సంఖ్య శతము దాటినది.

## యథాయోగ ప్రయోగము

౧౨. పితామహాజ్ఞయాస్మాభిర్లోకస్య చ గుణేప్సయా
ప్రయోజితం పుత్రశతం యథాభూమి విభాగశః

ఇట్లు బ్రహ్మ యాజ్ఞానుసారమున, లోకమున గుణలాభము కలుగ వలెనని పుత్రశతమును భరతుడు ప్రయోగపరులను చేసినాడు. వారివారి విశేషమునకు దగిన విభాగ మనుసరించి యట్లు ప్రయోజించినాడు. సర్వరసములకు సర్వభావములకు తగినట్లుగా వారలను భరతముని చక్క బఱచినాడు. వారందఱు నృత్యములో నభినయములో సంగీతములో సమర్థు లయినారు. అనంతరకాలమున వారి వారి పేరిట నానావిషయములందు నానాగ్రంథములు వెలువడినవి. ఆ సమయమున నాట్యసంబంధి మహాసారస్వత మావిర్భవించి యుండును.

"యో యస్మిన్కర్మణి యథాయోగ్యస్తస్మిన్ స యోజితః"

ఏ శిష్యుడే కర్మలో నభినివేశము కలిగి యర్హత సంపాదించెనో భరతుడు బాగుగ గుర్తించి వాని నా కర్మలో నియమించెను. ఈ విధానము సముచితముగ నున్నది. ఒక డుత్తమ ప్రకృతి యగును. వాని విచేష్టిత మట్లనుకూలముగ నుండును. వాని నుత్తమభూమిక యందే కూర్పవలెను. ఒక్కొ-క డొక్కొక భూమికలో తన సామర్థ్యము

ననుసరించి తన హృదయహర్షము ప్రదర్శించును. ఆ ప్రకారమున నాత డందు యోగ్యుడు. మరియొకడు శోక ప్రకటన చతురు డగును. వా డం దర్హుడు. అట్టి వాని కట్టి భూమిక తగును. ఇట్లెవని కేది తగునో భరతుడు సావధానముగ సమీక్షించెను.

## భారత్యాది వృత్తులు

౧౩. భారతీం సాత్త్వతీం చైవ వృత్తిమారభటీం తథా
సమాశ్రితః ప్రయోగస్తు ప్రయుక్తో వై మహాద్విజాః.

ఇదియు భరతు డనిన వచనము. భారతీవృత్తి, సాత్త్వతీవృత్తి, ఆరభటీవృత్తి నాశ్రయించిన ప్రయోగము నంతట ఉపక్రమించితిని. బ్రహ్మకీ ప్రయుక్త ప్రయోగము నివేదించితిని. నా నమస్కారము లందికొని నా విజ్ఞాపన మాలించి "భారత్యాదివృత్తులతో బాటు కైశికీవృత్తిని గూడ యోజనము చేయుము!" అనినాడు. దానికి వలయు సామగ్రి యెట్టి దని నే నడిగితిని. కైశికీప్రయోగము సామా న్యము కాదు. దాని సామగ్రి యిమ్మంటిని. కైశికిలో నృత్తాంగ హారముల సంపద యుండును. రసభావక్రియ లుండును. సుందర మృదుల వస్త్రముల యావశ్యకత కలదు. కైశికి శృంగారరసమున గలుగునది కదా! ఒకప్పుడు భగవానుడు నీలకంఠుడు నృత్యసమయ మున కైశికి ప్రయోగింపగా దర్శించితిని. మృద్వంగహారము లిందు న్నవి కదా! స్త్రీజనులు లేక కేవలము పురుషులు దీనిని చక్కగా ప్రయోగింప జాలరు కదా! అప్పుడు బ్రహ్మ మనఃప్రభావమున అప్స రసల సృజించినాడు. "నేనును చూచితిని. నృత్య మొనరించు నీల కంఠుడు కైశికి ప్రయోగింప చూచితిని. నీ విక కైశికి ప్రయోగిం పుము!" అని బ్రహ్మ భరతు ననెను. నాట్యాలంకార చతుర లయిన ప్రయోగనిపుణ లయిన అప్సరసలను భరతున కిచ్చినాడు. కైశికీ విధ్యాన మొనరించు బ్రహ్మ కైశికీప్రయోగనిపుణల నిర్మించినాడు.

## కైశికీవృత్తి

౧౪. మృద్వంగహారసంపన్నా రసభావక్రియాత్మికా
కైశికీ శ్లక్ష్ణనైపథ్యా శృంగారరస సంభవా

ఇది కైశికీ సామాన్యస్వరూపము. నృత్తాంగహారము లుండుట, రసభావక్రియ లుండుట, సుకుమార వేషభూష లుండుట శృంగారసంభవ మగు కైశికీ స్వరూపము. దీని తత్వ మిట్లు తెలియ వలయును. సకలప్రయోగమునకు కైశికి ప్రాణము. భారతి సాత్వతి యారభటి వృత్తుల కుపయోగించు నుపకరణములు కాక ఉపకరణాంతర సంభరణ మావశ్యకము.

పురుషార్థముల సాధింపవలసి యున్నప్పుడు నాట్యములోని వాగంగసత్వముల చేష్టాసామాన్య మంతయు నాల్గువిధముల నుండును. ఏ కర్మ నారంభించినను వాఙ్మనఃకాయకర్మ లుండి తీరును. అందొకని కొక లాలిత్యక్రమ మొక వైచిత్ర్యక్రమ ముండును. ఉత్తమప్రకృతుల కంతట వ్యాపారము సౌష్ఠవముగనె యుండును. ఇదియె వృత్తిచతుష్టయ మగుచున్నది. వాగ్వ్యాపారము భారతీవృత్తి యగును. మనోవ్యాపారరూప మగు సాత్వికవ్యాపారము సాత్వతీవృత్తి యగును. అనలసులు సోత్సాహులగు వీరభటుల కాయవ్యాపార మారభటీవృత్తి యగును.

కైశికీవృత్తి నాల్గవది. ఇది యపూర్వరమణీయము. తలనున్న కేశము లే యర్థక్రియ నొనర్పవు. అవి దేహశోభ నాపాదించును. అట్లే సౌందర్యమున కుపయోగించు వ్యాపారము కైశికీవృత్తి. ఇట్టి యీ నిర్వచనార్థ మొక ముఖ్యక్రమము. లాలిత్య మెద్ది యెచ్చట నున్న నది సర్వము కైశికీవిజృంభితము. మగవారు కైశికి ప్రయోగింప జాలరు. అదిలేని రూపకము వైచిత్ర్యశూన్య మగును. కైశికి సౌందర్యప్రాణ యయినందున సుందర ద్రవ్య ప్రయోగ మావశ్యక మగును. భరతుని బుద్ధికౌశలము తెలియుటకు బ్రహ్మ మొదట "కైశికి ప్రయోగింపుము" అనెను. భరతుడు ప్రత్యుత్పన్న ప్రతిభానుడు. వెంటనె నీలకంఠనృత్యము స్మరించి యుపకరణమడిగినాడు. నాట్యాచార్యుడు కవి హృదయ గ్రహణ యోగ్యు డగుట గొప్ప గుణము. ఎన్నడు చూడని దాని యుపకరణ మూహించు టెట్లు? నృత్తాంగహారసంపన్న మన్నది రసభావక్రియాత్మక మన్నది కైశికీ సాక్షాత్కరణము. నర్తనమె నృత్తము. అవయవముల విలాసవిక్షే

పము నర్తనము. ఊరక విలాసమున త్రిప్పుటలె కాని యేమో చేయు వలయునన్న కర్తవ్యాంశమున త్రిప్పుటకాదు. అంగముల హారణ మంగహారము. తెగతెంపులుగ గాక సముచితస్థానము పొంది యుండుట. శంకరుడు నృత్తాంగహారముల ప్రయోగించెనట! ఏల? అం దుద్దిష్ట మేమియు లేదు. కర్తవ్యాంతరము లేనందున శంకరు డానందనృత్త మొనరించినాడు. శంకరదేహ మప్పటి దది పరిపూర్ణా నంద నిర్భరము. అది నిర్వ్యాజసుందరాకారము. ఆనాడు శంకరు డొనర్చినది కైశికి. అది శ్లక్ష్ణనైపథ్యమున నున్నందున నాట్యోప యోగిని యయినది. అప్పుడె శృంగార ముదయించును. శృంగారాభి వ్యక్తికి తగిన సుకుమారాభినయము కూర్చినను మధురవలనములు మంథరావర్తనములు భ్రూక్షేప కటాక్షాదులు లేకున్న శృంగారరసా స్వాదము పేరయిన నుండదు. అందుననె కైశికి రసభావక్రియాత్మిక కావలె ననుట. రసముల భావ మన్నది భావన. కవి నట సామాజిక హృదయవ్యాప్తియె భావన. రసభావనమె కైశికీస్వభావము. రౌద్ర మభివ్యక్తము చేయవలసి యున్నను తదభినయమునకు వలసిన యను ప్రాసవలనావర్తనములు దుఃశ్లిష్టము లయినచో నశ్లిష్టములె యగును. అప్పుడు రసాభివ్యక్తి యెట్లు? కావుననె యంతట కైశికి ప్రాణ మనుట. కైశికి లేకున్న శృంగారరసము పేరేని రాదు. కైశికి యింత టిది. దీని వనితలు లేక ప్రయోగింప శక్యమె కాదుట!

## వనితా వైచిత్ర్యము

"అయం భావః!" వైచిత్ర్యము కలుగుటకు వికస్వర నిర్వ్యాజ చమత్కారము కావలెను. అదియె పవిత్రత నాపాదించును. ఇట్టి పవిత్రత రానంతవఱకు శిక్షాశత మున్నను వైచిత్ర్యము కుదురు కొనదు. నిర్వ్యాజచమత్కార మనునది నిజహృదయ రసమున విల సింప వలెను. మునులకు నిర్వృతిచమత్కార మెట్లు కలుగును? వారి చిత్తములు విషయవిముఖములు కదా! ఒకప్పుడు సమాధిలో నట్టి చమత్కార ముదయింప వచ్చును. కాని యది దేహపర్యంతము రాదు. వనిత లున్నచో మునులును వారి సంపర్కమున సమార్ద్రీ భావము పొందగలరు. నిర్వ్యాజచమత్కార మనుభవింప గలరు.

అప్పుడు వైచిత్ర్య మాపాద్య మగును. కావుననె స్త్రీలు కావలయు ననుట. అందుననె బ్రహ్మ యప్సరః కన్యల సృజించెను. వా రిరువది నలుగురు. వారి పేర్లివిగో!

| | | |
|---|---|---|
| మంజుకేశి | సుకేశి | మిశ్రకేశి |
| సులోచన | సౌదామని | దేవదత్త |
| దేవసేన | మనోరమ | సుదతి |
| సుందరి | విదగ్ధ | విపుల |
| సుమాల | సంతతి | సునంద |
| సుముఖి | మాగధి | అర్జుని |
| సరళ | కేరళ | ధృతి |
| నంద | సపుష్కళ | కలభ |

వీర లందరు నాట్యాలంకారచతురలు. లీలావిలాసాదులు కలవారు. శోభాకాంతులు కూడిన వారు. ఇట్టి విశేషము లుండవు కావున మునికన్యక లిందు తగరు. వీరి నామములును సాభిప్రాయములు. తగిన యాహార్యాది సంపత్తి సూచకములు. ఉపకరణసంభారము బాగుగా లభించిన దని భరతు డానందించెను. అప్సరసలకును యథోచితముగ శిక్షణ మిచ్చి పరిగ్రహించి కైశికివృత్తిని కూడ ప్రయోగించెను.

## స్వా తి నా ర ద ని య మ న ము

౧౫. స్వాతిర్భాండనియుక్తస్తు సహశిష్యైః స్వయంభువా
నారదాద్యాశ్చ గంధర్వా గానయోగే నియోజితాః

బ్రహ్మ శిష్యులతో గూడిన స్వాతి యను మునిని వాద్యయంత్రముల విధానమునకై నియమించినాడు. నారదుడు మొదలగు గంధర్వులను గానక్రియకై నియమించినాడు. గీతము వాద్యము నాట్యమున నుపరంజకములు. అవియు నిప్పుడు పూర్ణము లయినవి. స్వాతిఋషి యొకప్పుడు వర్షాసమయమున పడు వర్షధారల వైచిత్ర్యము భావించి వాద్యములు భావించెను. వర్షధారలు పద్మదళములందు విచిత్రవిలసితములు కలవి. కాగా విచిత్రవర్ణవిధుల నాతడు యోజనము చేసినాడు. వాని వానికి తగినట్లు వృత్తుల నియమించుకొని యాతడు వాద్యముల నిర్మించెనని ముస్ముందు విశదమగును. నారదగంధర్వుడు

గానయోగమున నియుక్తు డయినా డనుట గాంధర్వ మిం దుపకారి కా దనినట్లయినది. వాదకులు గాయనులును నాట్యాచార్యాధీనము-గనె యుండవలయు నని భావము.

## ధ్వజమఖము

భరతు డిట్లు సర్వసుతులతో నాట్యము చక్కగా గుర్తించి నాడు. ఒకప్పుడు స్వాతి నారదులతో గూడి ప్రయోగ మొనరింప వలెనని బ్రహ్మను చేరినాడు. "నాట్యము గ్రహించితిని ఇక నే నేమి చేయుదును ? " అని యడుగ బ్రహ్మ యిట్లు పలికెను.

౧౬. మహానయం ప్రయోగస్య సమయః సముపస్థితః
అత్రేవానీమయం వేదో నాట్యసంజ్ఞః ప్రయుజ్యతాం

ఇదిగో! గొప్ప ప్రయోగసమయ మేతెంచినది. ఇది దేవేం ద్రుని పతాకోత్సవ సమయము. ఇప్పు డీ నాట్యవేదము ప్రయోగింపుడు! ఈ పతాకోత్సవము "ధ్వజమఖము, ధ్వజమహము" అను పేరులతో నున్నది. ఇంద్రధ్వజము, ధ్వజోత్థానము – అనియు నీ మహోత్సవము నకు పేరులు. భాద్రపద శుక్ల ద్వాదశి నాడు దేవేంద్రు డసురులపై విజయము పొందెనట. —నాట్యమునందు నృత్తము, గీతము, ఆతో ద్యము, అభినయ మను నాలుగు సమముగా సమ్మేలనము పొందవలెను. ఈ మేలనికలో నాట్యమిది ఏకబుద్ధి –నిగ్రాహ్యము కావలెను. అట్లయి నప్పుడే ప్రయోగదక్షత కలుగును. అదియె సమ్యక్సంపత్తి. భరతుడు సంతుష్టు డయినాడు. పుత్రులతో స్వాతినారదులతో వెంటనే బ్రహ్మను చేరుట, తన నాట్యము ప్రేక్షణ యోగ్య మని భావించుట భరత సంతుష్టి చిహ్నము. బ్రహ్మయు వెంటనే భరతు నను గ్రహించెను. — ధ్వజమహము మహేంద్రవిజయోత్సవము. అసురులు దానవులు నోడి పోయిరి. దేవతలు ప్రహృష్టులై యందు చేరిరి. అప్పుడు భరతుడు నాట్యప్రయోగ ముపక్రమించెను.

౧౭. పూర్వం కృతా మయా నాందీ హ్యాశీర్వచనసంయుతా
అష్టాంగపదసంయుక్తా విచిత్రా వేదనిర్మితా.

ఆత్రేయాదులతో భరతు డిట్లనుచున్నాడు. మొదట నాందీ మంగల మాచరించితిని. నాంది యాశీర్వచనసహితము. అష్టపదసహి

తము. విచిత్రము. వేదనిర్మితము. ఈ నాందీప్రయోగము కేవల మాశీస్స్వభావము. నాందీస్వరూపము ముందు విశద మగును.

౧౮. తదంతేఽనుకృతిర్బద్ధా యథా దైత్యాః సురైర్జితాః
సంఫేట విద్రవ కృతా ఛేద్య ఛేద్యాహవాత్మికా

నాందీపరిసమాప్తిలో దేవతలు దైత్యులను జయించుటను నాట్యముగా ప్రయోగించితిని. ఆ నాట్యమున సంఫేటము=రోష యుక్త వాక్య మున్నది. విద్రవము= శంకాభయత్రాసము లున్నవి. శస్త్రయుద్ధ మున్నది. మల్లయుద్ధ మున్నది. ఇట్టి ప్రయోగము కూర్పగా బ్రహ్మాదిదేవత లందరు సంతుష్టు లయినారు. భరతపుత్రు లకు బహుమతు లిచ్చినారు. ఇంద్రుడు తన ధ్వజ మిచ్చెను. బ్రహ్మ విదూషకున కుపయోగించు వక్రదండ మిచ్చెను. వరుణుడు పారి పార్శ్వకున కుపకరించు భృంగార మిచ్చెను. సూర్యుడు ఛత్రమును, శివుడు సిద్ధిని, వాయువు వ్యజనమును, విష్ణువు సింహాసనమును, కుబే రుడు మకుటమును, ఇచ్చినారు. ఈ ప్రేక్షణీయకము శ్రావ్య మగునని సరస్వతి యనుగ్రహించినది.

## ప్ర యో గ సా ఫ ల్య ము

౧౯. తస్మిన్ సదస్యభిప్రేతాన్ నానాజాతిగుణాశ్రయాన్
అంశాంశైర్భాషితాన్ భావాన్ రసాన్ రూపం క్రియా బలం
౨౦. దత్తవంతః ప్రహృష్టాస్తే మత్సుతేభ్యో దివౌకసః

మిగిలిన గంధర్వాదులు దేవతలు యక్ష రాక్షస పన్నగులు నాట్యతత్వ మెరిగినవారు తమ యంశాంశములతో కూడిన వాని నెన్నిటినో యిచ్చిరి. నానాజాతిగుణాశ్రయము లయిన భావరసరూప క్రియాబలముల హర్షించి యిచ్చిరి. వీరందరు ప్రయోగమున పరి తోషము పొంది బహూకృతు లిచ్చిరి. స్వచరితవర్ణన మీ ప్రయోగ మున కలదని వారు సంతుష్టు లగుట కాదు. ఆ ప్రయోగపరిషత్తులో వారి వారి కభీష్టసన్నివేశము లున్నవి. కొందరకు ముఖరాగములు, కొందర కభినయములు, కొందర కందలి సంభారములు, మరి కొందరకు భావరసాదికము లభీష్టము లయినవి. వారు సంతుష్టు లయిరి. ఇది యంతయు భరత ప్రయోగ సాఫల్యము.

ప్రభుపరితోషమునకు ప్రభుచరితము నొకప్పుడు నాట్యమున వర్ణింప వచ్చును. "దైత్యులు సురనిర్జితు ల"న్నది యిందే ప్రయుక్తమయినట్లు కన్పడు చున్నది కదా! యని కొంద ఱందురు. అది యుక్తము కాదు. దశరూపక లక్షణయుక్తి కది విరుద్ధము. ప్రసిద్ధచరిత మేని యుత్పాద్యచరిత మేని రూపకములం దుండదగు నని మున్ముందు చెప్ప గలము. వర్తమానకాల మందలి చరితానుకార మెన్నడును యుక్తము కాదు. వర్తమాన మాస్వాదించు వారలకు రాగద్వేషాదులు కలుగును. మధ్యస్థత్వమె కలుగును. తన్మయీభావ ముదయింపదు. అది లేనందున ప్రీతి కలుగదు. ప్రీతిలేమి వ్యుత్పత్తియు గలుగదు. వర్తమానచరిత మందు ధర్మ కర్మల ఫల సంబంధము ప్రత్యక్షమె యగునేని యిక ప్రయోగప్రదర్శనము నిష్ఫలము. భవిష్యత్కాలములో నిట్లగునన్న ప్రమాణ మేమని ప్రేక్షకులు భావింప వచ్చును. ఇంతటి మాత్రపు వ్యుత్పత్తియె వర్తమానచరితమున గలుగును. ఇతోధిక మేమియు దాన రాదు.

దేవత లిందు వర్తమానములోని తమ చరితవిజయమునె దర్శించినా రనుట కాదు. అప్పటి దేవతల కప్పటిలో ప్రసిద్ధవర్ణనీయ మేదియు లేదు. పూర్వకల్పము లోని మన్వంతరము లోని దేవాసురచరిత కీర్తనము వారు భావించినా రనవచ్చును. అందుననె వారు ప్రయోగపరితోషు లయినారు. దానవు లట్లు కాలేదు. వారు చరిత్ర భ్రమ విప్రలబ్ధు లయినారు. క్షోభము పడినారు. ఈ విషయము విశదము కాగలదు.

## దైత్యసంక్షోభము

ఏవం ప్రయోగే ప్రారబ్ధే దైత్య దానవ నాశనే
౨౧. అభవన్ క్షుభితాః సర్వే దైత్యా యే తత్ర సంగతాః

దైత్య దానవ నాశరూప మయిన నాట్యప్రయోగ మట్లు సాగినది. అచటికి వచ్చిన దైత్యు లందరు క్షోభము పొందిరి. విరూపాక్షుడు మొదలగు వారు విఘ్నములు కలుగ జేసిరి. క్షుభితు లెంత పని చేయరు. "నేత్థమిచ్ఛామహే నాట్యం" నాట్యమేమో బాగుండు ననుకొంటిమి. ఇట్టి దయినది. నాట్య మీ విధముగా నుండుట మే

మంగీకరింపము. గుర్తింపుడు! అందరు కలసి లేచి రండు! అసురు
లంద రల్లరి చేసిరి. అదృశ్యరూపులై విఘ్నము లాపాదించిరి.
నర్తన మొనరించు వారల వాక్కును చేష్టను స్మృతిని స్తంభింప
చేసిరి. ప్రస్తావనా ప్రయోగ మధ్యము నందే యీ విఘ్నము కలిగి
నది. సపరివారముగా సూత్రధారు డట్లు విధ్వంసనము పొందుటను
దేవేంద్రుడు గుర్తించి నాడు. చింతించినాడు. "కస్మాత్ప్రయోగ
వైషమ్యం?" ఈ ప్రయోగ మిట్లు విషమ మయినదేమి? యని
మాయ జొరబడని ధ్యాన మవలంబించి సర్వము గుర్తించి నాడు.
నాట్యప్రయోగశాల యంతయు విఘ్నములతో కూడి యున్నట్లు
తెలిసికొనినాడు. అంతట కలయ జూచినాడు. సూత్రధారుడు సంజ్ఞా
రహితు డయ్యెనె! వాని పరివార మంతయు నట్లె నష్టమయినదే!
వెంటనె యింద్రుడు లేచి తన ధ్వజము పట్టి రంగవిఘ్నములను అసుర
లను జర్జరము లగునట్లు చేసినాడు. సర్వవిఘ్నములు సర్వదానవులతో
జర్జరీకృతము లయినవి. దేవత లందరు సంతసము పంపిరి. ఇట్లనిరి.

## జర్జర ప్రయోగము

అహో! ప్రహరణం దివ్యం ఇదమాసాదితం త్వయా
౭౨. జర్జరీకృతసర్వాంగా యేనైతే దానవాః కృతాః

యస్మాదనేన తే విఘ్నాః సాసురా జర్జరీకృతాః
౭౩. తస్మాత్ జర్జర ఏవేతి నామతోఽయం భవిష్యతి.

ఓహో! ఇది దివ్యాయుధము. ఇంద్రా! నీవు దీని సంపాదించి
తివి. దానవు లందరు జర్జరీకృత సర్వాంగు లయినారు. విఘ్నము
లసురులు జర్జరీకృతు లయినారు. కావున నిక మీదట నీ యాయు
ధము 'జర్జర' మను పేరున ప్రసిద్ధ మవుగావుత! ఇంక నెవరెవరు
హింసచేయువారు హింసార్థమేగుదెంతురో వారంద రీ జర్జరము
చూడగనె పలాయనము చేయుదురు. దేవత లందరిట్లు పలుకగా
దేవేంద్రుడు "ఏవమస్తు" అట్లే యగుగావుత! అనినాడు.

రక్షాభూతశ్చ సర్వేషాం భవిష్యత్యేవ జర్జరః
౭౪. ప్రయోగే ప్రస్తుతే హ్యేవం స్ఫీతే శక్రమహే పునః

మఱల నెప్పుడేని యింద్రమఖ సమయమున నాట్యప్రయోగము

జరుగునేని యందరకు ఈ జర్జరము రక్షకము కా గలదు. ఇంద్రు డట్లు జర్జరమున విఘ్నముల బో గొట్టినాడు. కాని యింకను గొన్ని విఘ్నము లుండుటచే నృత్త్య మొనరించు వారలకు భయ మావేశించి నది. విఘ్నాసురు లింకను త్రాసము కలుగ జేయుచున్నారని భరతు డాలోచించెను. విఘ్నాసురుల కార్యము లిట్లున్నవి. నా వలన గదా! యిది యంతయు గలిగినది! ఇట్లు తలచి సుతు లందరితో గూడి బ్రహ్మసమీపమున కేగెను. ఇట్లనెను.

### ర క్షా వి ధి

నిశ్చితా భగవన్! విఘ్నాః నాట్యస్యాస్య వినాశనే
౭౫. అస్య రక్షావిధిం సమ్యగాజ్ఞాపయ! పితామహ!

ఈ నాట్యము నశింప జేయుట కెన్నియో విఘ్నము లుప్ప తిల్లినవి. అప్పుడు జర్జరీకరణ సమయములో నివి లేవు. ఇక నాట్య రక్షావిధిని మాకు సెలవిమ్ము! అప్పుడు బ్రహ్మ విశ్వకర్మను పిలిచి "మహామతీ! కురు! లక్షణసంపన్నం నాట్యవేశ్మ" మంచి లక్షణ ములు కల నాట్యభవనము నిర్మింపుము! అనెను. విశ్వకర్మ యచిర కాలమున సర్వలక్షణసంపన్న మగు నాట్యమందిరము నిర్మించెను. బ్రహ్మకడకు వచ్చెను. సభలో నమస్కరించెను. "సజ్జం నాట్య గృహం దేవ!" "దేవా! నాట్యగృహము సిద్ధ మయినది. మీరు దర్శింపగోరుదును" అనెను. అప్పుడు బ్రహ్మ వేగముగా నాట్య మండపము చూచుట కింద్రాదులతో నేగెను. వాస్తువిద్యా తత్త్వ విదుడు నాట్యమండపము నిర్మించుటలో స్థపతి కావలెను.

### నా ట్య గృ హ ము

దృష్ట్వా నాట్యగృహం బ్రహ్మ ప్రాహ సర్వాన్ సురాం స్తతః
౭౬. అంశభాగై ర్భవద్భిస్తు రక్ష్యోఽయం నాట్యమండపః

బ్రహ్మ నాట్యగృహము చూచి దేవతలతో నిట్లనెను. "మీ రందరు మీ యంశభాగములతో నీ నాట్యమండపమును రక్షింపుడు!" అప్పుడు సౌమ్యప్రకృతి సోమప్రధాను డయిన చంద్రుడు మండప రక్షణమున నియుక్తు డయినాడు. దిక్కులందు లోకపాలురు నియుక్తు లయినారు. విదిక్కులలో వాయువులు నియుక్తు లగుట సముచితముగా

నున్నది. మూలలలో ఘర్మదోష ముండును కదా! వాయువులు నియుక్త లయినారనుట అచట గవాక్షము లుండుట సూచితము. నేపథ్యభూమిలో సూర్యుడు, ఆకాశమున వరుణుడు, వేదికారక్షణమున వహ్ని, వాద్యమున మేఘదేవతలు నియుక్త లయినారు. ఏ యే స్థలమున నెవరెవరు రక్షణ మొనరించుట యుక్తమో యట్లే నియమము జరిగినది. నాలుగు స్తంభములందు నాలుగువర్ణముల యధిష్ఠాన దేవతలు నియమము కలవారయినారు. స్తంభాంతర (స్తంభముల మధ్య) ములం దాదిత్యులు రుద్రు లుపస్థితు లయినారు. ధారణములో భూతములు, మధ్యశాలలలో నప్సరసలు, సర్వభాగములలో యక్షిణీ దేవతలు, మహీపృష్ఠమున మహోదధియు నియుక్త లయినారు. ద్వారశాల దగ్గర కృతాంతుడు, కాలుడు నున్నారు. కవాటము లందు మహానాగులు, మండిగమున యమదండము, ద్వారముపై శూలము నున్నది. నియతి, మృత్యు లిద్దరు ద్వారపాలురయినారు. రంగపీఠ పార్శ్వమున మహేంద్రుడె స్వయముగా రక్షకు డయినాడు. మత్త వారణిలో విద్యుద్దేవత యున్నది. భూత యక్ష పిశాచ గుహ్యకులు, నాట్యతత్త్వవిదులు మత్తవారణీ స్తంభముల పరిపాలమునకై నియుక్త లయినారు. దైత్యవినాశ మొనరించు వజ్రము జర్జరమున కూడుకొని నది. జర్జరపర్వములందు దేవత లుండిరి. బ్రహ్మ, శంకరుడు, విష్ణువు, కుమారస్వామి, శేష వాసుకి తక్షక మహానాగులు జర్జరమున ప్రతిష్ఠితు లయినారు.

ఏవం విఘ్నవినాశాయ స్థాపితా జర్జరే సురాః<br>
౨౭. రంగపీఠస్య మధ్యే తు స్వయం బ్రహ్మ ప్రతిష్ఠితః

విఘ్నముల వినాశ మొనర్చుట కై జర్జరమున నిట్లు దేవతలు స్థాపితు లయినారు. రంగపీఠమధ్యము నందు స్వయముగా బ్రహ్మ స్వాత్మప్రతిష్ఠ చేసికొనెను. రంగపీఠమున బ్రహ్మ యున్నందున నె పుష్పముల ప్రస్తరింప వలెను. అది బ్రహ్మపూజ. పాతాలనివాసు లయిన యక్ష గుహ్యక పన్నగులు రంగపీఠమునకు దిగువగా క్రింది భాగమున రక్షణమునకు వినియోజింప బడిరి.

నాయకం రక్షతీంద్రస్తు నాయికాం తు సరస్వతీ<br>
౨౮. విదూషకమథోంకారః శేషాస్తు ప్రకృతీశ్వరః

నాయకు నింద్రుడు రక్షించును. నాయికను సరస్వతి రక్షించును. విదూషకు నోంకారము రక్షించును. మిగిలినవారల నందర శివుడు రక్షించును.

యాన్యేతాని నియుక్తాని దైవతానీహ రక్షణే
౨౯. ఏతాన్యేవాధిదైవాని భవిష్యంతీత్యువాచ సః

ఈ నాట్యమండప రక్షణమున నియమింప బడిన దైవతము లాయా స్థానము లం దధిదైవతములుగా నుందురు గావుత! యని బ్రహ్మ యనెను రక్షణవ్యవస్థలో నొక్కొక చోట ఒక్కొక దేవత యుండుటయె కాక ఒక్కొక దేవత రెండు రెండు స్థానము లందుండుటయు నిరూపిత మయినది. అందుననె యా యా దేవత లధిదేవతారూపముగా నుండుటను బ్రహ్మ నిర్దేశించినాడు.

సామ ప్రయోగము

ఈ సమయముననె దేవత లందరు బ్రహ్మతో నిట్లు మనవిచేసిరి.

సామ్నా తావదిమే విఘ్నాః స్థాప్యంతాం వచసా త్వయా
౩౦. పూర్వం సామ ప్రయోక్తవ్యం ద్వితీయం దానమేవ చ
తయోరుపరిభేదస్తు తతో దండః ప్రయుజ్యతే

ఈ విఘ్నకారుల నందరిని మీరు సామవచనముతో కుదురుకొనునట్లు చేయుడు. మొదట సామవచనము, పిమ్మట దానము, వానిపై భేదము, ఆపిమ్మట దండము ప్రయోగించుట యుక్తము కదా! బ్రహ్మ యీ మాట విని విఘ్నకారుల జూచి "కస్మాద్భవంతో నాట్యస్య వినాశాయ సముత్థితాః ?" మీరేల నాట్యవినాశమున కుద్యమించినా రనెను. బ్రహ్మవచనమును విని విరూపాక్షుడు దైత్యు లందరి ననుసరించి సామపూర్వకముగా నిట్లనెను.

౩౧. యోఽయం భగవతా సృష్టో నాట్యవేదః సురేచ్ఛయా
ప్రత్యాదేశోఽయమస్మాకం సురార్థం భవతా కృతః
౩౨. తన్నైతదేవం కర్తవ్యం త్వయా లోకపితామహ
యథా దేవాస్తథా దైత్యాస్త్వత్తః సర్వే వినిర్గతాః

మీ రీ నాట్యవేదమును సురుల యిచ్ఛానుసారము సృజించినారు. కేవలము దేవతలకె మీరు నిర్మించుట మాకు ప్రత్యాదేశ

ముగా నున్నది. మమ్ము మీరు నిరాకరించినారు. అనాదరముగ జూచినారు. మాకది ఖలీకారముగ నున్నది. మీరిట్లు చేయగూడదు. మీరు లోకపితామహులు. దేవతలెట్లో దైత్యులట్లె మీనుండి యావిర్భవించిరి కదా! మీరు పాక్షికదృష్టి కలవారగుట యనుచిత ముగ నున్నది.

## నా ట్య తా త్ప ర్య ము

విరూపాక్షుని వచనమును విని బ్రహ్మ యిది సుపరిహారమె యని భావించి యిట్లనినాడు.

33. అలం వో మన్యునా దైత్యా! విషాదం త్యజతానఘాః!
భవతాం దేవతానాం తు శుభాశుభవికల్పకః
3౪. కర్మభావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః

దైత్యులారా! మీకు కోపము వలదు. కోప మిక వ్యర్థము. చాలును. మానుడు! మీరు విషాదము విడువుడు! మీ యీ కోప మంతయు భ్రాంతిమాత్రకృతము. అంతయు మిథ్యాసర్పము భావించి భయపడిన విధమున నున్నది. "దైత్యు లశుభకారులు. వారి రంగము వేరు. వారి చేష్టితము వేరు. దేవత లట్లు చేయరాదు. తద్విపర్యయముగా నుండవలయును." అని నాట్యతాత్పర్యము కాదు. మీకు కోపమేల? "శుభకారులకు శుభఫలము కలదు. అశుభ కారుల కశుభ ఫల ముండును." అనియే మేము నాట్యమున ప్రద ర్శింప దలచినది. మా దృష్టిలో నాట్యమిట్లే సాక్షాత్కరించును. మాకు దేవతలని, దైత్యులని ప్రత్యేక భావభర మేమియు లేదు. కావున ధర్మాదులలో మీకును గల సదుపాయము శుభవిపాకముగనె దర్శిత మయినది. మీకు గాని దేవతలకు గాని యీ నాట్యవేదము శుభాశుభ వికల్పకము. శుభము ధర్మము సుఖఫలము. అశుభ మధర్మ మసుఖఫలము. నాట్యవేద మీ నిశ్చయమునె సూచించును. చూడుడు! నాట్యవేదము కర్మ- భావ- అన్వయములను అపేక్షిక ముగా నిరూపించునదియె కదా! ధర్మము దానము స్నానము, అధ ర్మము, హింస, స్తేయము ఇత్యాదికము కర్మ. భావ మనునది యాశ యము. స్త్రీప్రసంగమున గలుగు స్వార్థత పరార్థతల లోని పట్టుదల

మొదలగునది భావము. అన్వయ మనునది యభిజనము. ఈ దేశ మా దేశ మని వ్యవస్థ. నాట్యవేదము వీనిని సహకారులుగా నుండు ననియె స్వీకరించును. అంతియెకాని— ఈ దేశములో నీ కాలములో నీ కర్మచె నీ శుభ మార్జించు వా డీ ఫలము పొందును. ఈ యశుభ మాచరించు వా డీ ఫలభాజను డగునని— యిందలి యుపదేశము కాదు. ప్రత్యేకముగా పాక్షికముగా దేశకాలపాత్రలను నాట్యవేద ముపలక్షింపదు. వానిని సహకారులుగా నుండుటనే గుర్తించును. ఇట్టి నాట్యవేదమును నేను నిర్మించితిని. మీ రేల కోపపడియెదరు! వినుడు!

భా వా ను కీ ర్త న ము

నైకాంతతోఽత్ర భవతాం దేవానాం చానుభావనం
౩౫. త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనం

మా మీదనే దీని నేల యోజనము చేసితి రని యందురు కాబోలు! మీ మీదనే దీని నెవరును యోజనము చేయలేదు. దీనిలో కేవలము మీ దైత్యుల భావనమె కల్పనాద్వారమున ననుకృత మయినదని తలచ వలదు. నాట్యము నందు కేవలము దేవుల భావనము నుండదు. ఏమందురా? ఈ సమస్త త్రైలోక్య భావముల యనుకీర్తనమె నాట్యమున నుండును. అందరి యవస్థానుకరణమె నాట్యము. దేవాసురభావముల కిది యతీతము. దేవాసురుల యను భావన మిందు నియతముగా నుండదు. ఏదో విధమున నిది యను భావితము కాదు. లోకమున నొక యంశము నొక రనుకరించు నప్పుడు ఈ క్రింది యంశము లుండును.

౧. వారు వారుగనె యుందు రనెడి బుద్ధి
౨. వీరు వారికి సదృశముగ నున్నా రనుట
౩. వీరు వారె యనెడు భ్రమాత్మకబుద్ధి
౪. వారి ధర్మములు వీరి యందున్న వనెడు ఆరోపజ్ఞానము
౫. వీరు వారి కభిన్ను లనెడు అధ్యవసాయబుద్ధి
౬. వీరు వారుగా నున్నా రనెడు ఊహాబుద్ధి
౭. వీరు వారి ప్రతికృతిగా నున్నా రనెడు చిత్రబుద్ధి

౮. వీరు వారి ననుకరించు చున్నా రనెడు అనుకరణాత్మక
    మయిన గురుశిష్యవ్యాఖ్యా హేవాక బుద్ధి
౯. ఇంద్రజాలము వలె తత్కాలనిర్మాణ మనెడు విస్మయబుద్ధి
౧౦. హస్తలాఘువాదిమాయ వలె యుక్తివిరచిత మయిన
    'వీరు వారి యాభాస' మనెడు ఆభాసబుద్ధి

నాట్యవిషయమున నివియేవియు నుండవు. ద్రష్టయగు సామాజికు డీ నిరూపించిన పక్షములలో దేని యందయిన నసాధారణ మగు నభి నివేశము కలవాడే యగుచో రసాస్వాదము కలుగనే కలుగదు. ద్రష్ట యప్పుడుదాసీను డగును. ఆత్మీయత ననుభవింప లేడు. కవియు నియత ముగా నొక పక్షమునకు సంబంధించిన వర్ణనలో నిశ్చయము కల వా డగునేని యాతని కావ్యమునకు కావ్యత్వమె కలుగదు. అప్పుడు కవి విధాన మంతయు ననుచిత మగును. లౌకికమిథునము చూచినప్పుడు లోకజనులకు రాగద్వేషాసూయాదులు కలుగునే కాని రసప్రతీతి కలుగదు. ఈ నాట్య మట్టిది కాదు. ఇది త్రైలోక్యభావానుకీర్త నము.

## నాట్యనిశ్చయము

ఇది నిశ్చితార్థము. నాట్యములో సీతారామాదుల చరితము నిబంధించి నా రనుకొందము. ఆ నిబంధించిన వారల కెన్నడేని రామాదులు ప్రత్యక్షముగ గోచరించిరా? లేదు. రామాయణము వంటి మహాకావ్యమున రామాదిచరితమును రచయితలు గోచరింప చేసికొందురు. మఱల భావభావనా బలమున నిబంధింతురు. అందు వర్తమానతా బుద్ధి యుండనే యుండదు. కావ్యము లందు నిట్టి సంపత్తియె యుండును. సహృదయుల హృదయములందు విభావాదు లకు సాధారణ్య ముదయించును. విభావాదులె సాధారణీకృతము లగుట కాదు. కథ యంతయు సాధారణీభావము పొందును. "ఇట్లొన రించిన వారల కిట్లగును" అనెడు చిత్తవృత్తి కలుగవచ్చును గాని యందు రంజనాతిశయ మేమియు లేదు. గుణాలంకార మనోహర మయిన కావ్యములో హృదయసంవాద వశమున చిత్తవృత్తి నిమగ్నా కారమగును. కావ్యము లోకోత్తర రసప్రాణకము కదా! కాని

కావ్యమున గూడ ప్రత్యక్ష సాక్షాత్కార కల్ప మయిన ధీవృత్తి యందర కుదయింపదు.

## హృదయ సంవాదము

నాట్యమున నొకవిశేష మున్నది. ప్రతిసామాజికుడును హృదయసంవాదమున తన్మయీభావము పొందును. సర్వసాధారణ మయిన ప్రమోదము పొందును. లోకోత్తర దర్శన శ్రవణ యోగి కాగల ననుకొనును. సముచితము లయిన గీతాతోద్యముల నాస్వా దించును. ప్రాపంచికభావముల నన్నిటిని విస్మరించును. ఆతని హృదయ మప్పుడు విమలదర్పణము. అభినయ మవలోకింపగా ప్రమోదాదు లుల్లసిల్లును గావున తన్మయీభావము పొందును. పాఠ్యము విని విని దేశ కాల విశేషముల నన్నిటిని మఱచి పోవును. రామరావణాదుల విషయమై లోకబుద్ధు లేవియు నాతనికి గలుగవు. గీతవాద్యముల ప్రమోద మనుభవించి యనుభవించి యప్పటి సంస్కార మునె బలీయము చేసికొనును. స్వరూపమును, స్వచిత్తమును, స్వాత్మను సచమత్కార చరితముననె చేర్చి కొనును. అప్పుడు విశ్వమును స్వాత్మద్వారముననె దర్శించు వా డగును. సర్వము సంవిజ్జాతీయము గనె సంభావించును. ప్రాణవల్లభా సదృశముగా రస మాస్వాదించును. రస సహచరము లయిన రమ్యగీతాదుల యనుభవసంస్కార మాతని హృదయాభ్యంతరమున పాదుకొని యున్న సంవేదన మందించును. అప్పటి యాతని సంవేదన మే మాత్రము మ్లాని పొందినది కాదు. ఇది సహృదయుని సంవాదసరణి. శుభము పొంద గోరిక, అశుభము విడువ గోరిక సంతత మాతనిలో ననుగతమె కావున శుభమె యాచ రించును. అశుభము విడుచును. ఇది నాట్యవిశేషము.

ఇట్టి యుపాయ సంవేదనము లే నప్పుడు పరచేష్టానుకరణమె యనుకొనును. అప్పుడు నాట్యానుభూతి లేదు. అప్పుడు 'నాట్యము పరిహాసించుటకే' యనిపించును. 'నాట్యమున దేవతలు మమ్మపహ సించి' రని మీరు భావించిరి. 'మే ముపహాస భాజనుల మయితిమి' అని మీ రుపహాస్యతా భీరువులై నాట్య పరాఙ్ముఖు లయినారు. హృదయక్షోభము పొందినారు. మీరిక నాట్యపరమార్థము గుర్తించి

నారు కదా! "త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనం" "అలం వోమన్యునా!" "విషాదం త్యజత."

"నాట్యము త్రైలోక్యభావానుకీర్తనమె యయినచో నొక రూపకముననె యొక యంకముననె సర్వము గోచరింపవలయును గదా!" అని యందురేమో! వినుడు! నాట్యము నానాభావసంపన్నము. భావములు దేశ- కాల- ప్రవృత్తి- అవస్థాదులచే భిన్న స్వభావములు. కావుననె నాట్యము నానావస్థాత్మక మగును. ఉత్తమాధమమధ్యమ వ్యాపారాత్మక మగును. ఇట్టి నాట్యము భవిష్యత్కాలమున విశ్రాంతిజననము హితోపదేశజననము కాగలదు. ఇట్టిదిది పూర్వప్రయోజనముననె స్వప్రయోజనము.

నా ట్య ఫ ల ము

క్వచిద్ధర్మః, క్వచిత్క్రీడా, క్వచిదర్థః, క్వచిచ్ఛమః
౩౬. క్వచిద్ధాస్యం, క్వచిద్యుద్ధం, క్వచిత్కామః, క్వచిద్వధః
ధర్మో ధర్మప్రవృత్తానాం, కామః కామోపసేవినాం

౩౭. నిగ్రహో దుర్వినీతానాం, వినీతానాం దమక్రియా
క్లీబానాం ధార్ష్ట్యజననం, ఉత్సాహః శూరమానినాం

౩౮. అబుధానాం విబోధశ్చ, వైదుష్యం విదుషామపి
ఈశ్వరాణాం విలాసశ్చ, స్థైర్యం దుఃఖార్దితస్య చ

౩౯. అర్థోపజీవినామర్థో, ధృతిరుద్విగ్నచేతసాం
నానాభావోపసంపన్నం, నానావస్థాంతరాత్మకం

౪౦. లోకవృత్తానుకరణం నాట్యమేతన్మయా కృతం
ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయం

౪౧. హితోపదేశజననం, ధృతి క్రీడా సుఖాది కృత్
దుఃఖార్తానాం, శ్రమార్తానాం, శోకార్తానాం, తపస్వినాం

౪౨. విశ్రాంతిజననం కాలే నాట్యమేతద్భవిష్యతి
ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధివివర్ధనం
౪౩. లోకోపదేశజననం నాట్యమేతద్భవిష్యతి

నాట్యమున నొకచో ధర్మము, ఒకచో క్రీడ, ఒకచో నర్థము, ఒకచో శమము, ఒకచో హాస్యము, ఒకచో యుద్ధము, ఒకచో

కామము, వేరొకచో వధ యుండును. ఇవి యన్నియు నానాప్రకార భావములు. ఇచట నున్న ధర్మాదిశబ్దములు తగిన విధమున స్థాయి-వ్యభిచార్యనుభావములను సూచించును. ధర్మ మర్థ మనుట ఉత్సాహాది సూచకము. క్రీడ యనుట విస్మయాదికమును, శమ మనుట నిర్వేదాదికమును, హాస్య మనుట హాసాదికమును, యుద్ధ మనుట రౌద్రాదికమును, కామ మనుట రత్యాదికమును, వధ యనుట క్రోధ భయ జుగుప్సా శోకాదికమును సూచించును. వీనినే చెప్పినను వాని వానికి తగిన వ్యభిచారుల ననుభావముల విభావముల స్వీకరింప వలెను. ఇవి యన్నియు నా యా రూపకము లం దుండు విశేషములు. ఒక్కొక రూపకమున నొక్కొక విశేషముండుటయె కాక, ఒకే నాటకమున గొన్ని విశేషము లుండును.

నాట్యమున ధర్మప్రవృత్తులకు ధర్మ మున్నది. కామ సేవనులకు కామము, దుర్వినీతులై యనీతిగా నుండు వారలకు నిగ్రహము, జితేంద్రియు లగువారలకు శమ దమ క్రియ, అసమర్థులై పరిహాసభాజనులగు వారికి ధార్ష్ట్యము కలుగ జేయుట, శూరభావుల కుత్సాహము, అపండితులకు విజ్ఞానము, విద్వాంసులకు వైదగ్ధ్యము, ప్రభువులకు విలాసము, దుఃఖబాధితులకు స్థిరత్వము, అర్థనీతి ననుసరించు వారల కర్థము, ఉద్వేగముపడిన వారలకు ధైర్యము నాట్య మాపాదించును. ఈ నాట్యక్రీడ యంతయు లోకవృత్తానుసారముననె యుండును గావున లోకగతము లగు నివి యన్నియు నున్నవి. కాని యొక విశేష మున్నది. లోకము నందుండు ధర్మాదులు సంవేదన యోగ్యములు కావు. అవి యాశ్రయములు కావు. నాట్యము ధర్మాది విషయమున ప్రసిద్ధులయిన రామాదులను శబ్దసారముగనె స్వీకరించును. ఇట్టి యీ నాట్య మా యా భావములు కల ప్రేక్షకులకు యథోచితముగా విశ్రాంతి కలుగ జేయును.

నానాభావములు కల నానావస్థాంతరములు కల నాట్యము లోకవృత్తానుకరణముగా నిరూపించితి నని బ్రహ్మ యనుచున్నాడు. ఉత్తములు అధములు మధ్యములుగా నున్న మానవుల కర్మల నాశ్ర

యించి నాట్య ముండును. నాట్యము ధృతి—క్రీడా—సుఖాదులు కలుగ జేయును. హిత ముపదేశించును. ప్రేక్షకులలో గొందరు వ్యాధ్యాదుల వలన గలిగిన దుఃఖముతో నుందురు. కొందరు మార్గ ఖేదము వలని శ్రమతో నుందురు. కొంద రిష్టవియోగ కృత శోక ముతో నుందురు. ఇట్లు దుఃఖాదులచే పీడితులగు వారల కందరకు నాట్యము విశ్రాంతిజననము కాగలదు. నిరంతరము కృచ్ఛ్రచాం ద్రాయణాది వ్రతము లాచరించి దౌర్బల్యమున పరిఖిన్న హృదయు లగు తాపసులకు నిది విశ్రాంతిజనన మగును. వారి వారి దుఃఖప్రస రణమును నాట్యము నశింపజేయును. దుఃఖము పోగా వారలకు తగిన విధమున ధృత్యాదు లుదయించును. కేవల మిది యింతమాత్రమె కాదు. కాలాంతరమున గూడ పరిపాకమున సుఖముగా నుపదేశిం చును. దుఃఖితులకు దుఃఖశాంతి, సుఖసంపాదనము, కాలాంతర సుఖ లాభము ప్రయోజనము. అదుఃఖితులు సుఖాతిశయము కల వా రుందురు కదా! వారలకు లోకవృత్తమును ధర్మాద్యుపాయవర్గమును నాట్య ముపదేశించును. నాట్యము గురువు వలె నుపదేశింపదు. బుద్ధివృద్ధి కలుగ జేయును. యోగ్యప్రతిభ నందించును. దుష్టప్రతిభ కలుగదు. నాట్యము హితప్రతిభనె కూర్చును.

నాట్యము ధర్మ్యము. ధర్మము నెన్నడు విడనాడదు. నాట్యము యశస్కరము. ఆయుష్కరము. ఆయుర్వృద్ధి హేతువు లయిన యాచా రములకు ఆయు వని వ్యవహారము. అందిది సాధుకారి కావున దుఃఖి తుల కదుఃఖితుల కిది యుపాదేయము. దుఃఖము శారీరము మానసము నగును. శారీరదుఃఖమును దైవకృతము స్వయంకృతము నగును. ఇట్టి వన్నియు నాట్యమున పరాస్తము లగును. నాట్య మన్నివిధముల లోకోపదేశజననము. నాట్య మిట్లె కాగలదు.

### నాట్యమహార్థము

న తచ్ఛాస్త్రం, న తచ్ఛిల్పం, న సా విద్యా, న సా కలా
౪౪. న స యోగో, న తత్కర్మ నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే

నాట్యము సప్తద్వీపగత భావానుకీర్తనము. ఇందు హృదయ గోచరము గాని దెందును లేదు. నాట్యమున శాస్త్ర మున్నది. శిల్ప

మున్నది. విద్య యున్నది. కల యున్నది. యోగ మున్నది. కర్మ యున్నది. సర్వ మున్నది. కావున మీ రేమియు నమరుల విషయమై కోపింప వలదు. ఈ నాట్యము సప్తద్వీపానుకరణము కా గలదు. అమరులను కోపింతురే! వారందేరి? నాట్యము సప్తద్వీపానుకరణము కదా! తదనుకరణక్రియ మాత్రమె రంగమున నుండును. రంగమున సాగరద్వీపాదు లేవియు నుండవు కదా! నాట్య మనుకరణము కావు నని యట్లు నిర్మించితిని.

దేవానామసురాణాం చ రాజ్ఞామథ కుటుంబినాం
౪౫. బ్రహ్మర్షీణాం చ విజ్ఞేయుం నాట్యం వృత్తాంతదర్శకం

నాట్యమున ప్రియకార్యము గాని యప్రియకార్యము గాని సర్వ మనుకరణసారమె. జగత్తులో సుఖదుఃఖమయ మయినను కవి కల్పనా ప్రభావమున నంతయు హ్లాదైకమయ మానందపూర్ణ మగును. అట్లయి నచో గొందరి నామగ్రహణ మేల? యని తలంతురేమో? నిరాధార వృత్తము దర్శింప శక్యము కాదు కదా! గృహీతనాము లా వస్తువు నం దధికారిపురుషు లని సూచించుటయే తద్భావము. అందునను నిర్వ్యాజ సహజౌదార్య ధర్మాది విషయమున అసురుల (బలి—ప్రహ్లా దాదుల) వృత్తాంతమును నిబద్ధ మగును. దేవు లసురులు రాజులు కుటుంబులు బ్రహ్మర్షులును ఆశ్రయముగ నుందురు. నాట్యము వారి యందరి వృత్తాంతదర్శక మగునని తెలియ వలయును. కేవలము మీ శత్రువులె యిందు వర్ణితు లగుట లేదు. బ్రహ్మర్షులు వర్ణితు లగు చున్నారు. మీ రిది మీకు ప్రత్యాదేశమని భావింప దగదు.

యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖ సమన్వితః
౪౬. సోఽంగాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే

సుఖదుఃఖానుగత మయిన యీ లోకస్వభావ మంతయు ఆంగి కాద్యభినయ సముపేతమై నాట్య మను పేరు కలదగుచున్నది. సుఖము. దుఃఖ మేది యయినను, ప్రత్యక్షముగ నవభాసించినను, నాట్యమున లోకవిలక్షణముగనె గోచరించును. సర్వసాధారణముగ భాసించును. స్వాత్మీయముగ భావ్యమానమగును. విచిత్ర సుఖరూపముగ నుండును. సుఖాదు లన్నియు సంవిత్స్వభావములు కదా! ఆ సుఖాదు లన్నియు

అంగాద్యభినయోపేతములై ప్రతీతి గోచరము లగును. అంగాభినయము లనుట ఆంగికాభినయ మని భావము. ఆంగికాభినయములు కేవల మంగసంకేతరూపములు కావు. అదియొక చేష్టాభాష. అవి భావరూపములు. రత్యాదుల విలక్షణాస్వాద మనెడు ప్రతీతిలో నుపయోగించునవి. రత్యాదుల యాభిముఖ్యము కలుగ జేయునవి. అందుననె యభినయము లని వాని పేరు. వీనిచే నాట్యార్థము సముపస్థితమగును. సంవిద్దర్పణమున సంక్రాంత మగును. ఏతాదృశార్థమె నాట్యము. నటనీయము; నర్తనీయము. నర్తనము. ఇది హృదయప్రవేశము పొందదగినది. హేయోపాదేయ వ్యుత్పత్తి ఫల మనునది యనంతరభావి. ఈ యంశము మరల విస్తృతము కాగలదు. ఇట్టి నాట్యమున వైముఖ్యము వైమత్య మేమాత్రము యుక్తము కాదు.

> ౪౭. వేదవిద్యేతిహాసానా మాఖ్యాన పరికల్పనం
> వినోదకరణం లోకే నాట్యమేతద్భవిష్యతి
>
> ౪౮. శ్రుతి స్మృతి సదాచార పరిశేషార్థ కల్పనం
> వినోదజననం లోకే నాట్యమేతద్భవిష్యతి

వేదములు, విద్యలు, ఇతిహాసములు, ఆఖ్యానములు నాట్యమున పరికల్పితము లగును. నాట్య మట్లు నిర్మించి విశ్వమున వినోదము కూర్చునది కా గలదు. వేదములు, స్మృతులు, సదాచారములు, ఇంకను పరిశిష్టము లగు విశేషముల నన్నిటిని నాట్యము నిబంధించును. ఇట్టి యీ నాట్యము లోకమున వినోద మాధానింపగలదు.

## మండపయజనము

ఇట్లు బ్రహ్మ సామముతో విఘ్నముల దూరీకరించి నాడు. విరూపాక్షాదు లిక విఘ్న మాపాదింప దలచ లేదు. విఘ్నములుత్పాదితము లయినవి. అయినను దివ్యనిదేశ మమోఘము కావున, నాట్యమండపము నందు నియుక్తము లయిన దేవతాంశము లచట సన్నిధానముతో నున్నందున యజన మొనరించుట యావశ్యక మని బ్రహ్మ భావించెను. ఆ సమయమున దేవతల నందరను పిలిచి బ్రహ్మ యిట్లనెను.

"క్రియతామద్య విధివద్యజనం నాట్యమండపే"

ఇప్పుడు యథావిధిగా నాట్యమండపమున యజన మొనరింపుడు. మంత్రములతో నోషధులతో బలులిండు! బలి=విచిత్రవర్ణములు కల తండులాదుల రచనావిశేషము. హోమము లాచరింపుడు! భక్ష్య భోజ్య పానీయములతో పూజ లాచరింపుడు! ఇవి యన్నియు సౌందర్య సంపాదకములు. "శోభాప్రధానం హి నాట్యే సర్వం."

౪౯. మర్త్యలోకేఽప్యయం వేదః శుభాం పూజామవాప్స్యతే
అపూజయిత్వా రంగం తు నైవ ప్రేక్షా ప్రవర్తతే

మానవలోకమున గూడ నీ నాట్యవేదము శుభపూజ పొందగలదు. రంగము పూజింపక నాట్యప్రయోగము ప్రవర్తితము కారాదు. నాట్యమండపము భూలోకమున ప్రతిష్ఠితము కాగా స్వాంశములతో దేవత లవతరింతురు. పూజలు పొందుదురు. దేవతలు దేవపూజ చేయుటలో నిదియె ఫలము. శ్రేష్ఠు లాచరించు దాని నితర జను డాచరించును. దేవానుష్ఠితాచారమును లోక మనువర్తించును. లోకము సదాచార మనువర్తింపక పోవుట యుక్తము కాదు. రంగము పూజింపక ఎవరేని నాట్యప్రయోగ మాచరించిన వారి జ్ఞానము నిష్ఫల మగును. వారు పశుజన్మ పొందుదురు. లౌకికపారలౌకిక ప్రత్యవాయములు వారలకు గలుగును.

౫౦. యజ్ఞేన సమ్మితం హ్యేతద్రంగ దైవత పూజనం
తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యం నాట్యయోక్తృభిః

ఈ రంగదైవత పూజన మనునది యజ్ఞసమ్మితము. కాన నాట్యప్రయోక్త లగువా రవశ్యముగా సర్వవిధముల రంగపూజన మొనర్ప వలెను. నర్తకుడు కాని అర్థపతి కాని రంగపూజ చేయకున్నను, ఇతరులచే చేయింప కున్నను అభ్యుదయము పొందజాలడు. యథావిధి రంగపూజనము కావించినచో ప్రత్యవాయము పోవుటయె కాక ఐహలౌకిక ధన మాన ప్రసిద్ధి లాభము కల్గును. పారలౌకిక ప్రయోజనమును గలుగును.

## పూ జా ఫ ల ము

౫౧. యథావిధి యథాదృష్టం యస్తు పూజాం కరిష్యతి
స లప్స్యతే శుభానర్థాన్ స్వర్గలోకం చ యాస్యతి

యథావిధిగా శాస్త్రములందు గోచరించు విధానమున నాట్య మందిరపూజ సల్పు నాతడు శుభార్థముల పొందును. దేహాంతమున స్వర్గ మనుభవించును. – బ్రహ్మ యిట్లు పలికి, భరతమునితో – "నీవు సర్వదేవతలతో రంగపూజ యొనర్పు" మని చెప్పెను. నాట్యాచార్యుడు సర్వకర్త. ఆతనికె దేవయజనమున నధికార మున్నది. ఆతనికె ఫలలాభ మున్నది. అర్థపతి యగు ప్రవర్తయితకు (ప్రవర్తింపజేయువానికి) ప్రయోక్తృత్వము లభించును.

పరశివుడు మహానటుడు. నాట్యస్రష్ట. బ్రహ్మ నాట్యవేదప్రవర్తకు డయిన యాదిగురువు. నాట్యావిర్భావసమయము త్రేతాయుగము. నాట్యావసరము గుర్తించిన వా డింద్రుడు. భరతముని నాట్యాచార్యుడు. అప్సరసలు, భరతపుత్రులు నాట్యప్రయోగ మొనరించినవారు. విరూపాక్షాదులు విఘ్నవిధాతలు. జర్జరప్రయోక్త దేవేంద్రుడు. విశ్వకర్మ నాట్యవేశ్మ నిర్మాత. త్రైలోక్యభావానుకీర్తనము నాట్యము. నాట్యఫలము రససిద్ధి.

## నాట్యయోగము

"కవి బ్రహ్మ వలె, ప్రయోజయిత దేవేంద్రుని వలె, నాట్యాచార్యుడు భరతుని వలె, నటులు కోహలాదుల వలె, సుకుమారోపకరణ మప్సరసల వలె, వాద్యవిదుడు స్వాతి వలె, గీతజ్ఞుడు నారదుని వలె, నుండవలె" నని యాత్రేయాది మునులు గుర్తించిరి. "నాట్యమండపము సురక్షితముగా నుండవలెను. ప్రయోగకాల మింద్రోత్సవ సదృశము కావలెను. సామాజికులు ప్రశాంతరాగద్వేషులు కావలెను. నాట్యప్రయోగము దేవతా పూజన పూర్వకముగా నుండవలెను." ఈ సంగ్రహార్థము మునుల కవగత మయినది. రంగపూజ యెట్టిదో? నాట్యశాలలోని క్రియల స్వరూప మేమో? దేవత లెట్లని మనస్సుతో సంపన్నము చేసికొన గలరు. భవిష్యత్కాలమున మానవులు నాట్యశాలలో నాచరింప వలసిన విధు లేవియో? అతీతములం దుపదేశ మట్లుండనీ!

## నాట్యమండపము

౫౨. ఇహాదిర్నాట్యయోగస్య నాట్యమండప ఏవ హి
తస్మాత్తస్యైవ తావత్త్వం లక్షణం వక్తుమర్హసి

"నాట్యయోగమునకు నాట్యమండపము మొదటిది. దానిలక్షణము మీరు చెప్పవలయును. అది మేము వినదలచితిమి. రాబోవువారు నాట్యవేశ్మ నెట్లు నిర్మింప వలయును? అందలి క్రియ లెట్టివి? లక్షణ మెద్ది? పూజన మెట్టిది?" ఇట్లా తేయాదు లడిగిరి. భరతుడు వారి ప్రశ్న యుక్త మని భావించెను. "నాట్యభవనలక్షణము పూజనము చెప్పెదన్ను. లక్షణ పూజన విజ్ఞానము దేవతలకు నుపకారి యగును. సంకల్పము కన్న నిర్మాణము జ్ఞానాపేక్షము.

౫౩. దివ్యానాం మానసీ సృష్టిః గృహేషూపవనేషు చ
నరాణాం యత్నతః కార్యా లక్షణాభిహితాః క్రియాః

గృహము, లుపవనము లన్నియు దివ్యులకు మానసస్సృష్టితో సంపన్నము లగును. మానవుల కన్నియు యత్నసాధ్యములు. మానవులు నియమానుసారమున శ్రమింపక తప్పదు. మానవులకె శాస్త్రములు లక్షణములు చెప్పినవి. అంకురము, కుసుమము, ఫల మన్న జన్మక్రమము నియత మయినను బహు విచిత్రతర తరు లతా స్థలీ సరోవరాక్రీడమయములు మానసోపవనములు దేవతలకు సిద్ధము లగును. ఇక గృహములు మానససంపన్నము లనుట వారి కేటిపాటి?

## విశ్వకర్మనిర్మాణము

౫౪. ఇహ ప్రేక్షాగృహం దృష్ట్వా ధీమతా విశ్వకర్మణా
త్రివిధః సన్నివేశశ్చ శాస్త్రతః పరికల్పితః

విశ్వకర్మ ధీమంతుడు. చక్కగా ప్రేక్షాగృహము భావించినాడు. శాస్త్రానుసారమున త్రివిధసన్నివేశము కల్పించినాడు. వికృష్టమండపము, చతురస్రమండపము, త్ర్యస్రమండపము నని నాట్యమండపము మూడు విధములు. ఇవి ప్రమాణానుసారమున జ్యేష్ఠము, మధ్యము, అవరము నని మూడువిధములు.

౧. నూటయెనిమిది హస్తముల ప్రమాణ మున్నచో జ్యేష్ఠ ప్రమాణక మయిన నాట్య మండపము.

౨. అరువది నాలుగు హస్తముల ప్రమాణ మున్నచో మధ్యమ నాట్యమండప మగును.

3. ముప్పది రెండు హస్తముల ప్రమాణ మున్నచో అవర మగు నాట్యమండప మగును.

ఈ నాట్యమండప విధాన మిట్లున్నది కావున అనువాదముగా గుర్తింప వలెను. ఇవియె యుపయోగు లని కాదు. ఇంకను శాస్త్రము లం దష్టాదశభేదములు గోచరించును. అవి యీ నా[illegible]గించునో! అయిన సంప్రదాయావిచ్ఛేదమునకు గు[illegible]. ఒకప్పు డొక డుపయోగము పొందును. దేవతలకు జ్యేష్ఠ[illegible]డపము, [illegible]లకు మధ్యమము, ఇతరుల కితరమును విహితము[illegible].

మ ధ్య మ ము ప్ర శ స్త ము

౫౫. ప్రేక్షాగృహాణాం సర్వేషాం ప్రశస్తం మధ్యమం స్మృతమ్
తత్ర పాఠ్యం చ గేయం చ సుఖశ్రావ్యతరం భవేత్

ప్రేక్షాగృహము లన్నిటిలో మధ్యమము ప్రశస్తము. అందే పాఠ్యము గేయము. సుఖముగా వినుటకు శక్య మగును. బాగుగా వినబడును. ప్రేక్షాగృహము లన్నియు వికృష్టములు చతురస్రములు త్ర్యస్రము లని మూడువిధములు. ప్రేక్షాగృహముల కన్నిటికి విశ్వకర్మ ప్రమాణ లక్షణములను విశదము చేసినాడు. నాయక ప్రతి నాయకులు దేవాసురప్రాయులె. డిమ మనెడు రూపకములో నార భటీ ప్రయోగ ముండును గావున రంగపీఠము విస్తీర్ణముగా నుండుట యావశ్యకము. డిమములోని వ్యక్తుల పరిక్రమణములు దీర్ఘకాల తాల ప్రమాణములతో నుండును.

నాట్యగృహ మాకారమును బట్టి వికృష్ట– చతురస్ర– త్ర్యస్ర ములుగా నుండును. ప్రమాణమును బట్టి జ్యేష్ఠమధ్యావరములుగా నుండును. ఒక్కొక్కటి మూడువిధము లగునని భావము. ప్రమాణ మునందు హస్తప్రమాణ మని దండప్రమాణ మని ప్రమాణములు రెండు విధములు గావున; ప్రమాణానుసారమున నాట్యగృహమును మరల రెండువిధములుగా భావింప వచ్చును. కాగా మొత్తము పదు నెనిమిది నాట్యగృహము లూహింప దగియున్నవి.

| | | | |
|---|---|---|---|
| ౧. వికృష్టము | జ్యేష్ఠము | హస్తప్రమాణ | రూపము |
| ౨. చతురస్రము | ,, | ,, | ,, |
| ౩. త్ర్యస్రము | ,, | ,, | ,, |
| ౪. వికృష్టము | ,, | దండ ప్రమాణ | ,, |
| ౫. చతురస్రము | ,, | ,, | ,, |
| ౬. త్ర్యస్రము | ,, | ,, | ,, |
| ౭. వికృష్టము | మధ్యమము | హస్తప్రమాణ | ,, |
| ౮. చతురస్రము | ,, | ,, | ,, |
| ౯. త్ర్యస్రము | ,, | ,, | ,, |
| ౧౦. వికృష్టము | ,, | దండ ప్రమాణ | ,, |
| ౧౧. చతురస్రము | ,, | ,, | ,, |
| ౧౨. త్ర్యస్రము | ,, | ,, | ,, |
| ౧౩. వికృష్టము | అవరము | హస్తప్రమాణ | రూపము |
| ౧౪. చతురస్రము | ,, | ,, | ,, |
| ౧౫. త్ర్యస్రము | ,, | ,, | ,, |
| ౧౬. వికృష్టము | ,, | దండ ప్రమాణ | ,, |
| ౧౭. చతురస్రము | ,, | ,, | ,, |
| ౧౮. త్ర్యస్రము | ,, | ,, | ,, |

హస్తప్రమాణ మధ్యమము లయిన వికృష్ట చతురస్ర త్ర్యస్రముల స్వరూపమె స్పష్టముగా తెలియ దగియున్నది. అణు -రజ - బాల - లిక్షా- యూకా- యవ- అంగుల- హస్త- దండములు ప్రమాణము లందలి విభాగములు.

| | |
|---|---|
| ౮ అణువులు | ౧ రజము |
| ౮ రజములు | ౧ బాలము |
| ౮ బాలములు | ౧ లిక్ష |
| ౮ లిక్షలు | ౧ యూక |
| ౮ యూకలు | ౧ యవము |
| ౮ యవములు | ౧ అంగులము |

౨౪ అంగులములు ౧ హ స్తము
౪ హ స్తములు ౧ దండము.

ఈ ప్రమాణముల ననుసరించి నిర్ణయము తెలియ నగును.

౫౬. చతుష్షష్టిం కరాన్ కుర్యాత్ దీర్ఘత్వేన తు మండపం
ద్వాత్రింశతం చ విస్తారాన్మర్త్యానాం యోజయేదిహ

ఈ చెప్పిన ప్రమాణవిధి ననుసరించి నాట్యమండపాకారమును నిర్ణయించు కొనవలయును. మానవుల నాట్యమండపము పొడవు ౬౪ హ స్తములు. వెడల్పు ౩౨ హ స్తములు. జ్యేష్ఠమానము కల నాట్యమండపమున మానవులకు నాట్యప్రయోగ సౌకర్య ముండదు. మండపనిర్మాత లింత కతిరిక్తముగా నాట్యమండపము నిర్మింప రాదు. ప్రమాణాతిరిక్తముగా నిర్మించి నందున ప్రయాసమె కాని ప్రయోజనము లేదు.

## నా ట్యా భి వ్య క్తి

౫౭. యస్మాదప్యక్తభావం హి తత్ర నాట్యం వ్రజేదితి
మండపే విప్రకృష్టే తు పాఠ్యముచ్చరితస్వరం
అనభివ్యక్తవర్ణత్వాద్విస్వరత్వం వ్రజేదితి

నాట్యమండపమున నాట్యాభివ్యక్తిని ముఖ్యముగా పరిశీలింప వలెను. అధికప్రమాణమునందు నాట్య మవ్యక్త మగును. అత్యంత న్యూన ప్రమాణముునను సముచితముగా నుండదు. మధ్యమ మన్నిటి కనుకూలము. ఇతరము లేల? (ప్రకర్షః=ప్రకృష్టం. తదతిక్రాంతో విప్రకృష్టః) విప్రకృష్టమండపములో నుచ్చరిత మయిన పాఠ్యము వర్ణములు విశదముగా విన్పింప నందున విస్వరత్వము పొందును. నాట్యమున పాఠ్యమనునది శరీరము. దగ్గరగా నున్నవారి కా పాఠ్యము విశేషముగా నుపతాపక మగుటయె విస్వరత. ఉచ్చరితము: "ఉచ్చం కృత్వా చరితః అతిక్లేశేన సంపాదితః స్వరః" ఎంత బిగ్గరగా నున్నను దూరాన నున్న సామాజికులకును విస్వరముగనె యుండును. అందలి వర్ణములు వ్యక్తములుగా నుండవు. అది యనాకర్ణనీయ మగును. పాఠ్య మనిస్సరణధర్మ మగును. అడ్డులేని యా ప్రదేశమున నితరశబ్ద ముండనందున పాఠ్యము విస్వరమె యగును. అల్పమండపమున

నుచ్చరిత మయిన పాఠ్య మనురణనరూప మయిన మధురశబ్దము కలుగదు గావున స్వరమాధుర్యము లేని దగును. అనురణన మనునది స్వరమునకు రూపము. కేవలము పాఠ్యమె విస్వర మగుట కాదు. గేయము వాద్య మన్నియు నిట్లె విస్వరము లగును.

> ౫౮. యశ్చాప్యాస్యగతో భావో నానావృష్టి సమన్వితః
> స వేశ్మనః ప్రకృష్టత్వాద్వ్రజేదవ్యక్తతాం పరాం
>
> ౫౯. ప్రేక్షాగృహాణాం సర్వేషాం తస్మాన్మధ్యమ మిష్యతే
> యస్మాద్వాద్యం చ గేయం చ తత్ర శ్రవ్యతరం భవేత్

విప్రకృష్టరంగము నం దభినయము కూడ సులక్షము కాదు. అభినయవర్గ మంతయు నిట్లె యగును. నాట్యమండప మతివిస్తీర్ణ మయినచో నానాదృష్టుల సంబంధము కల ముఖగత భావ మత్యంత మవ్యక్త మగును. ముఖగత మయిన భావ మనునది యనుభావ రూపము. నానాదృష్టులు ముఖగతము లయిన యనుభావములు. అట్లె బాష్పము స్వేదము వైవర్ణ్య మిట్టి వన్నియు నవ్యక్తము లగును. మకుట ప్రతిశీర్షకాదులు కూడ స్పష్టగోచరములు కావు. ఇది యంతయు విప్రకృష్టమంటప మందలి స్థితి. చిన్న నాట్యమండపమున గూడ ముఖభావము "పరాం ద్వితీయామవ్యక్తతాం అతిసామీప్య కృతాం భజేత్" అతిసామీప్యమున వేరొక యవ్యక్తతను పొందును. కావున ప్రేక్షాగృహము లన్నిటిలో మధ్యమ మంటపమె సముచితము. మధ్యమ మంటపమునందు ప్రధాన మగు పాఠ్యము శ్రవ్యతరముగా నుండును. తదనురూపప్రాణము ఉపరంజక మయిన గీతము వాద్యమును మధ్యమము నందే శ్రవ్యతరముగ నుండును.

ప్రయోగక్రమ మంతయు నిట్లున్నది. హస్తప్రమాణ మనుసరించి యీ విధి నిరూపింప దగును. అదియు బాగుగా నుపకారి కాకున్న దండసమాశ్రయమును చూడ దగును. ఒకప్పుడు ప్రేక్షకులు దివ్యప్రకృతు లుందురు. వారి భావానుసారమున పరిశీలించు నప్పుడు కొన్ని విభేదము లుండవచ్చును. వీని నన్నిటిని పరిశీలింప ప్రేక్షాగృహము— విప్రకృష్టము, చతురస్రము, త్ర్యస్రము— అని మూడు విధము లగుటను ప్రయోక్తలు గుర్తింప వలసి యున్నది.

## మానససృష్టి

౬౦. దేవానాం మానసీ సృష్టిః గృహేషూపవనేషు చ
యత్నభావాద్వినిష్పన్నాః సర్వే భావా హి మానుషాః
తస్మాద్దేవకృతైర్భావైః న విస్పర్ధేత మానుషః

గృహములు కాని యుపవనములు కాని దేవతలకు సర్వము మానససృష్టిగా నిష్పన్న మగును. వారి మనస్సు సత్త్వబహుళము. సృష్టివ్యాపారములందా మనస్సు సర్వరూపవ్యాపి. పరిమిత విభాగములు కల గృహములు కాని వివిక్తములు వితతములు లయిన యుద్యానములు కాని మనస్సత్త్వముననె వారు నిర్మింప గలరు. వారలకు మండపనిర్మాణ మేమి కథ? మానుషులు రాజసప్రకృతులు. వారి సత్త్వ మట్టిది. వా రన్నిటిని యత్నమున సాధింప వలసి యున్నది. దేవవిధానములతో మానవు డెన్నడు విస్పర్ధింప గూడదు.

## మానవమండపము

మానవుల ప్రేక్షాగేహ లక్షణ మిట్లుండును. నాట్యప్రయోజకుడగు విచక్షణుడు ముందుగా భూ విభాగమును పరీక్షింప వలెను. హేయ మెట్టిదో? ఉపాదేయ మెట్టిదో పరిశీలింప వలెను. పిమ్మట వాస్తుప్రమాణము ననుసరించి ప్రారంభింప వలెను. స్వభావసిద్ధముగా గోతులతో దిబ్బలతో నున్న భూమి యుక్తముగా నుండదు. స్థిరముగా చలింపనిదిగా నుండ వలెను. చవుడు లేనిది కృష్ణగౌర మగు మన్ను కలది యగు భూమి నాట్యమండపమునకు తగి యుండును. ఇట్టి భూమిని ప్రథమమున శోధనము చేయవలెను. శోధన మనునది భూమిపై నుండు అశుచిపదార్థములను తొలగించుట కుండపెంకులు చిల్లపెంకులు లేకుండ చేయుట. పిమ్మట బాగుగా నాగలితో దున్ని ఎముకలు మేకులు కపాలములు తృణగుల్మములు బండరాళ్లు తీసివేయ వలెను. ఇది యంతయు బాహ్యాభ్యంతర భూమి శుద్ధి.

## సూత్రగ్రహణము

పుష్యనక్షత్ర యోగమును సరిచూచు కొని పిష్టరంజనము కల శుక్లసూత్రమును పట్ట వలెను. చర్మకృత మయిన మానసూత్రము

(కొలత్రాడు) తగదు. గ్రంథులు లేకుండునట్లు సూత్రము చాచిపట్టి తెగిపోకుండు నట్లు శ్రద్ధ వహింప వలెను.

౬౨. అర్ధచ్ఛిన్నే భవేత్ సూత్రే స్వామినో మరణం ధ్రువం
త్రిభాగచ్ఛిన్నయా రజ్జ్వా రాష్ట్రకోపో విధీయతే

౬౩. ఛిన్నాయాం తు చతుర్భాగే ప్రయోక్తుర్నాశ ఉచ్యతే
హస్తాత్ ప్రభ్రష్టయా వాపి కశ్చిత్త్వపచయో భవేత్

సూత్రము సావధానముగా పట్టవలెను. దారము జార కూడదు. సప్రయత్నముగా సూత్రము పట్టుకొన వలెను. ఈ నియమము కేవలము ప్రారంభముననె కాదు. సర్వసమయములందు నిట్టి సావధానత యావశ్యకము. సూత్రపట్టు త్రాడు మధ్యలో తెగిపోవునేని స్వామి యగు ప్రేక్షాపతికి మృత్యువు కల్గును. మూడవ వంతు త్రాడు తెగినచో రాష్ట్రమున కనర్థము కలుగును. నాల్గవ భాగము ఛిన్న మయినచో ప్రయోక్త యగు నాట్యాచార్యునకు నాశము కల్గును. చేతి నుండి జారిన ననర్థము కలుగును. కావున రజ్జుగ్రహణము సావధానముగ సప్రయత్నముగ నుండవలెను. నాట్యగృహము కొలతను సావధానముగా నేర్పఱచుట భద్రవిధి. ముహూర్తము తిథి వార నక్షత్ర కరణములను సావధానముగా సమీక్షింప వలెను. బ్రాహ్మణతర్పణ మొనరించి పుణ్యాహ మాచరించి శాంతిజలము నంతట ప్రోక్షించి సూత్రమును ప్రసారము చేయవలెను.

## రం గ శీ ర్ష ము

౬౪. చతుష్షష్టికరాన్ కృత్వా ద్విధాభూతాన్ పునస్తతః
పృష్ఠతో యో భవేద్భాగో ద్విధాభూతస్య తస్య తు
సమమర్ధవిభాగేన "రంగశీర్షం" ప్రకల్పయేత్

సూత్రప్రసారణమున నొనర్పవలసిన విధాన మిదిగో! అరువది నాలుగు హస్తముల పరిమితమైన భూమిని రజ్జువుతో కొలుచుట మొదట కర్తవ్యము. పిమ్మట చతుష్షష్టి హస్త పరిమిత మయిన భూమిని రెండుగా విభాగింప వలెను. అప్పుడు ముప్పదిరెండు హస్తముల పరిమితి కల భాగములు రెండు కలుగును. అందు పృష్ఠభాగమును రెండుగా విభాగించునది. సామాజికుల కభిముఖుడై యుండు

ప్రయోక్తృ పృష్ఠభాగమునకు 'పృష్ఠము' అని పేరు. అందు షోడశ హస్త పరిమితము లయిన రెండు భాగములలో పృష్ఠగత మయిన భాగమును మఱల సగముగా విభజించునది. అప్పు డష్టహస్త పరిమిత మగు భాగము లభించును. ఈ భాగమును ప్రేక్షాగృహమున 'రంగశీర్షము' అని నిశ్చయించునది. రంగశీర్షమె రంగశిరస్సు. ప్రవేశించు పాత్రల కిది యంతఃస్థానము. నాట్యమండప ముత్తానసుప్తుని వలె (వెల్లకిల పరుండు వాడు) నుండును. ఇందు శిరోభాగము అష్టహస్తము. దాని వెనుక షోడశ హస్త పరిమిత మయిన నేపథ్యగృహమును నిర్మించి కొనునది. నేపథ్యగృహము దైర్ఘ్యమున షోడశ హస్తము, విస్తారమున ద్వాత్రింశత్కరముగా నుండును. రంగపీఠ నిర్మాణములో భావభేదము లున్నవి. కాని రంగపీఠము కూడ వికృష్టముగా నుండవలయు ననియే భరతుని భావము. ప్రేక్షాగృహమునకు పృష్ఠభాగమున నేపథ్యగృహ ముండును. ఇది నటీనటుల వేష భూషా సజ్జీకరణమునకు సముచిత మయిన స్థానము. ఇందు జరుగు వేష భూషా వ్యవహారములు సామాజికులకు గోచరములు కావు. ఒకప్పుడు నేపథ్యము నందలి వార్తాలాపము గోచర మగుట కలదు.

## మండపనివేశము

ఇట్లు యథావిధిగా విభాగముల నిర్ణయించిన పిమ్మట, శుభ నక్షత్రమున మండపనివేశనము చేయ వలెను. సర్వవాద్యములతో సర్వమంగళములతో స్థాపనము చేయవలయును. అనిష్టముల దూరీకరింప వలెను. కలావినోద విధానముల నంగీకరింపని వారిని దరి జేర నీయ రాదు. జైనసాధువులను సన్యాసులను వికలాంగులను బౌద్ధపరివ్రాజకులను అటు రానీ రాదు. ఆ రాత్రి నానాభోజన పదార్థములతో బలి జరుప వలెను. తూర్పున శుక్లాన్నము, దక్షిణమున నీలాన్నము, పశ్చిమమున పీతాన్నము, ఉత్తరమున అరుణాన్నములతో పూజ నిర్వహింప వలయును. ఈ పూజావిధానము ఇటుకలు కూర్చుటకు పూర్వము జరుగును. మానవిధి యనంతరము ఇష్టకాస్థాపనమున నిది నియత మయిన విధానము.

## బలివిధానము

౬౫. యాదృశం దిశి యస్యాం తు దైవతం పరికల్పితం
తాదృశస్తత్ర దాతవ్యో బలిర్మంత్రపురస్కృతః

ఏదిక్కులో నే దేవత పరికల్పిత మయినదో గుర్తించుకొని యా దేవతానుకూల మయిన పూజావిధానమును మంత్రపురస్కృత ముగా నిర్వహింప వలెను. ఈ చెప్పిన దంతయు వ్యాపక మయిన విధి. రంగపూజావిధానము లోని మంత్రములనే యిచట నుపయో గించుట యున్నది. స్థాపన సమయమున బ్రాహ్మణులకు ఘృతపాయ సము నర్పింప వలెను. బ్రాహ్మణతర్పణ మనునది కేవల ముపక్ర మమునందే కాదు. స్థాపనము నందును విహితము. రాజునకు మధు పర్క మీయ వలెను. కర్మకరులకు బెల్లపన్న మిష్టముగ నర్పింప వలెను. మూలా నక్షత్రమున స్థాపనము, అనుకూల ముహూర్తమున స్థాపన మొనరించి యనంతరము భిత్తికర్మ ప్రారంభింప వలెను. భిత్తి కర్మ— స్తంభస్థాపనము. క్రమముగా నాచరింప దగినవి. నాట్యా చార్యుడు త్రిరాత్ర ముపోషితుడై యుండి నియమములు నిర్వహించి శుభ సూర్యోదయమున స్తంభముల స్థాపింప వలెను. స్థాపన మనునది యుచ్ఛ్రయణము పై కెత్తుట. మొదటిది బ్రాహ్మణస్తంభము. ఆగ్నేయకోణమున ప్రతిష్ఠిత మగును. రెండవది క్షత్రియస్తంభము. మూడవది వైశ్యస్తంభము. నాల్గవది శూద్రస్తంభము. కనక తామ్ర రజతాయసము లను నాలుగు స్తంభముల మూలము లందుంచ వలెను. స్వస్తిపుణ్యాహఘోషములతో జయశబ్దములతో పుష్పమాలా పురస్కృతముగా స్తంభస్థాపన మొనర్ప వలెను. గోరత్న వస్త్ర దానము లొనర్చి బ్రాహ్మణ తర్పణము చేయ వలెను. స్తంభోత్థాపన సమయమున దోషములు లేకుండు నట్లు సమీక్షింప వలెను. అచల మకంప్య మచలితముగా నుండునట్లు స్తంభస్థాపనము చేయుట యుక్తము.

## స్తంభస్థాపనము

౬౬. అవృష్టిరుక్తా చలనే వలనే మృతితో భయం
కంపనే పరచక్రాత్తు భయం భవతి దారుణం
దోషైరేతైర్విహీనం తు స్తంభముత్థాపయేచ్ఛివం

చలనము వలనము కంపన మని స్తంభస్థాపనమున మూడు దోషములు. స్థాపన సమయమున స్తంభము చలించు నేని దేశమున వర్షము లుండవు. వలనము (తిరుగుడు) ఉన్నచో మరణభయ మున్నది. కంపన మున్న నితరుల వలని దారుణభయ ముప్పతిల్లును. ఈ దోషములు లేకుండు నట్లు స్తంభస్థాపనము చేయ వలయును. ఒక నియతస్థానములో నుండవలసిన స్తంభము స్థానాంతరమున నుండ కుండు నట్లు పరిశీలించుట, కూర్చిన స్థానమున శిథిలము కా కుండు నట్లు చూచుట, యావశ్యక మగు చున్నది. ఏ దోషము లేకుండు నట్లుగా స్తంభ సముత్థాపనము శుభముగా నొనర్ప వలసి యున్నది.

బ్రాహ్మణ స్తంభ స్థాపనసమయమున బ్రాహ్మణునకు గోదాన మొనర్ప వలెను. ఇతర స్తంభస్థాపనమున కర్మకరుల కందరకు భోజన సమారాధనము చేయవలెను. నాట్యాచార్యుడు మంత్రపూతముగా నన్ని యొనర్చి, సర్వవిధ మంగళవాద్య సహితముగా యథాన్యాయము స్తంభప్రతిష్ఠ చేయవలెను. అట్లొనర్చి ప్రణవ నమస్కార మధ్యవర్తి యగునట్లుగా దీని పలుక వలయును.

౬౮. "యథాచలో గిరిర్మేరుః హిమవాంశ్చ మహాబలః
జయావహో నరేంద్రస్య తథా త్వమచలో భవ !"

మహామేరువు వలె హిమవంతుని వలె నీ వచలముగా నుండి నరేంద్రునకు జయము కూర్పుము! "త్వమచలో భవ!" ఇట్లు పలికి స్తంభద్వారమును భిత్తిని (గోడ) నేపథ్యగృహమును యథావిధిగా సిద్ధము చేయవలెను. వాస్తువిద్యావిదులు నిర్దేశించు విధానముల సావధానముగ సమీక్షింప వలెను.

## మత్తవారణి

౬౯. రంగపీఠస్య పార్శ్వే తు కర్తవ్యా మత్తవారణీ
చతుస్తంభసమాయుక్తా రంగపీఠప్రమాణతః

౭౦. అధ్యర్ధహస్తోత్సేధేన కర్తవ్యా మత్తవారణీ
ఉత్సేధేన తయోస్తుల్యం కర్తవ్యం రంగమండపం

రంగపీఠ పార్శ్వము నందు మత్తవారణిని కూర్పవలెను. పార్శ్వమునం దనుట రెండు పార్శ్వములందును మత్తవారణి

యుండవలెనని భావము. రంగపీఠ ప్రమాణానుసారమున మత్తవారణి నాలుగు స్తంభములతో నుండవలెను. మత్తవారణి సార్ధహస్తము ఎత్తుగా కూర్పవలెను. మత్తవారణీ ద్వయోత్సేధమునకు సమానముగా రంగమండప ముండవలెను. మత్తవారణియందు ధూపగంధ మాల్యాదు లర్పించి పూజింప వలెను. ఇట్టి పూజను నిర్మాణకాలము నందె చేయవలెను. ఆ యా భాగము లం దధివసించి యున్న భూతాదుల యుపచారవిధి యావశ్యకము కదా! కర్మకౌశలము కలవారు *స్తంభములకు లోహము కూర్పవలెను. ఇట్లా యా విధిపురస్కారములతో మత్తవారణి నిర్మాణింప వలెను.

నాట్య మండపము లోని మత్తవారణీ భావము విస్పష్ట మగుట లేదు. రంగపీఠమునకు రెండు పార్శ్వములందును నాలుగు స్తంభములతో మత్తవారణి యుండునని అందలి సన్నివేశము సార్ధహస్తముండునని యచటి నిరూపణము చెప్పుచున్నది. కాగా రంగపీఠమున కటు నిటు రెం డట్టాలికములు (పంచలు) మత్తవారణీ పద సంకేతమున నుండునని గుర్తింప వచ్చును. ఈ మత్తవారణీ విషయమున భావభేదము లున్న ట్లభినవుడె సూచించినాడు.

## రంగపీఠము

౮౧. రంగపీఠం తతః కార్యం విధిదృష్టేన కర్మణా
రంగశీర్షం తు కర్తవ్యం షడ్దారుక సమన్వితం

వాస్తువిద్యా శాస్త్రములందు చెప్పిన విధమున రంగపీఠము నిర్మింప వలెను. రంగపీఠము రంగశీర్షము పరస్పరము సంబంధించి యుండును గాన రంగశీర్షము నారు స్తంభములతో నిర్మించునది. నేపథ్యగృహము నందలి భిత్తి నాధారించుకొనిన స్తంభములు వీనిలో గణింప దగియున్నవి. ఇట్లు స్తంభరచనమున విచిత్రరచన సిద్ధమగును.

౮౨. కార్యం ద్వారద్వయం చాత్ర నేపథ్యగృహకస్య తు
ఏవంవిధం ప్రకర్తవ్యం రంగశీర్షం ప్రయత్నతః

౮౩. కూర్మపృష్ఠం స కర్తవ్యం మత్స్యపృష్ఠం తథైవచ
శుద్ధాదర్శతలాకారం రంగశీర్షం ప్రశస్యతే

నేపథ్యగృహమున నొకటి దక్షిణముగ మరియొకటి యుత్తరముగ రెండు ద్వారము లుండవలెను. ఈ ద్వారద్వయము పాత్రల విశ్రాంతికి తగి యుండును. వచ్చువారు కనపడ కుండుట కుపయోగించును. రంగమునకు శోభ నిచ్చును. మంచి నల్లని మన్ను తెచ్చి పూరణము చేయవలయును. చక్కగా దున్ని లోష్ట తృణ శర్కరములు లేకుండ చేసి యంగవైకల్యము లేని బలముకల వారిచే మన్ను తెప్పింప వలయును. నాగలికి పూన్చు వృషభములును శుద్ధవర్ణములు కలవి కావలయును. ఇట్లు సావధానముగ రంగశీర్షము నిర్మాణింప వలెను. రంగశీర్షము కూర్మపృష్ఠముగా మత్స్యపృష్ఠముగా నుండ రాదు. చుట్టు పల్లముగా నుండి మధ్యలో గుండ్రముగా మందముగా నెత్తుగా నుండుట కూర్మపృష్ఠము. చుట్టు పల్లముగానుండి మధ్యలో దీర్ఘరూపముగా నుండుట మత్స్యపృష్ఠము. శుద్ధదర్పణ తలమువలె సమముగా నుండ వలెను. అట్టి రంగశీర్షమునె ప్రశంసింతురు. వజ్ర వైడూర్య స్ఫటిక ప్రవాల రత్నముల కూర్పవలెను. సువర్ణము యోజింప వలెను. ఇట్లింతగా రంగశీర్ష మేర్పఱచి దారుకర్మ కూర్ప వలసి యున్నది. వాస్తుశాస్త్ర నియమానుసారముగా స్తంభముల మూలములందు రత్నాదుల నుంచుట భారతదేశమున ప్రసిద్ధముగా నున్నది. ఇట్లుంచుటకు రత్నాధివాస మని పేరు.

## కాష్ఠవిధి

౭౪. ఊహ ప్రత్యూహ సంయుక్త నానా శిల్ప ప్రయోజితం
నానా సంజవనోపేతం బహు వ్యాలోపశోభితం

౭౫. భవేయుశ్చాత్ర విస్పష్టా వివిధాః సాలభంజికాః
నిర్వ్యూహ కుహరోపేతం నానాగ్రథిత వేదికం

౭౬. నానా విన్యాస సంయుక్తం యంత్రజాల గవాక్షకం
సుపీఠ ధారణీ యుక్తం కపోతాలి సమాకులం

౭౭. నానా కుట్టిమ విన్యస్తైః స్తంభైశ్చాప్యుపశోభితం
ఏవం కాష్ఠవిధిం కృత్వా భిత్తికర్మ ప్రయోజయేత్

దారుకర్మ, కాష్ఠవిధి. ఇది సమీక్షాపరీక్షలతో గుర్తింప దగినది. ఈ దారుకర్మలో శిల్పము లుండును. నానావిధము లయిన సాలభంజిక లుండును. కాష్ఠ మధ్యభాగము లందు కాంతల

యాకారములు కల బొమ్మలు, నలుముఖముల నుండు యంత్రచిత్ర ములు, హస్తిచిత్రములు, సర్పచిత్రములు కూడిన సాలభంజికలను నిర్మాణింప వలయును. అనేక నిర్వ్యూహ కుహరములు – నియమ యుతముగా కూర్చిన రంధ్రము లుండవలెను. ఇవి చతురశ్రచ్ఛిద్ర ములు, అష్టాశ్రచ్ఛిద్రములు, వర్తులచ్ఛిద్రములుగా నుండవలెను. స్తంభోపరి భాగము లందు నానాకృతులు కలవయిన నాలుగంచుల వేదికలు కూర్పవలెను. నానావిన్యాసములు కల యంత్రజాల గవాక్షము లుండవలెను. కపోతవిటంకము లుండవలెను. (పావురాల చూరు) స్తంభము లందంతట నానా కుట్టిమ విన్యాసములు రమ్య ముగా నుండ వలెను. ఇవి యన్నియు ఊహప్రత్యూహములకు తగిన ట్లుండ వలెను. ఇట్లీకాష్ఠవిధి సిద్ధ మయిన పిమ్మట భిత్తికర్మ నాచ రింప వలెను.

౭౮. స్తంభం వా నాగదంతం వా వాతాయనమథాపి వా
కోణం వా న ప్రతిద్వారం ద్వారవిద్ధం న కారయేత్

స్తంభము కాని నాగదంతము కాని గవాక్షము కోణము కాని ద్వారమున కభిముఖముగా ద్వారవిద్ధ మగున ట్లొనర్ప రాదు. నాగ దంత మనునది స్తంభములపై సాలభంజికలను ధరించుట కేర్పఱచు గజముఖము.

## శై ల గు హా కా ర ము

౭౯. కార్యః శైలగుహాకారో ద్విభూమిర్నాట్యమండపః
మందవాతాయనోపేతో నిర్వాతో ధీరశబ్దవాన్

నాట్యమండపము రెండువిభాగములుగా నుండవలెను. శైల గుహాకారముగా దాని నిర్మాణింపవ లెను. మెల్లని గాలి వచ్చు కిటికీ లను కూర్ప వలెను. వేగముగా గాలి వీచునట్లుండ రాదు. ధీర శబ్దము కలది కావలెను. నాట్యమండపము ద్విభూమిగా నుండవలె ననుట సాభిప్రాయము. నేపథ్యము రంగశీర్షము సమతలముగా నుండుట కాక కొంత ఎత్తు పల్లములతో నుండవలెను. అట్లె రంగ పీఠము మత్తవారణి కూడ సమతలముగా నుండరాదు. నేపథ్యము పల్లముగా నుండుట, రంగశీర్ష మంతకు కొంత ఎత్తుగా నుండుట, అంత

కన్న రంగపీఠము కొంత సమున్నత మగుట, అంతకన్నను మత్త వారణి సార్ధహస్త ముండుట సముచిత మని కొందరి యూహ. రంగ మున కవతరించుట యను భావమును బట్టి నేపథ్యమెత్తుగా నుండు టను మరికొండ రభిమానింతురు. కాగా నంతయు సమతలముగా నుండదని ద్విభూమిగా నుండునని గుర్తింప వచ్చును.

## ని వా త రీ తి

౮౦. తస్మాన్నివాతః కర్తవ్యః కర్మభిర్నాట్యమండపః
గంభీరస్వరతా యేన కుతపస్య భవిష్యతి

నాట్యమండపము నివాతముగా నుండవలెను. అప్పుడే గీతము వాద్యము గంభీరముగా నుండును. సుస్వరముతో నుండును. కుత పము గంభీరస్వరముగా నుండును. కుతప మనగా సంఘేటక- గాయన- వాదక సమూహము. (కుః నాట్యభూమిః తాం తపతి ఉజ్వలయతి కుతపః) నాట్యభూమి నుజ్జ్వలముగా చేయునది కుతపము. గీత వాద్య విధానము లన్నియు గంభీరము లగుట నివాతప్రదేశముననె సంగత మగును. అచట శబ్దము భ్రమించి పరస్పర ప్రతిశ్రుతి కలదై సమా రంభ సంపూర్ణ మగును. ఇట్లు యథావిధి నాట్యమండప విధాన మయిన పిమ్మట భిత్తికర్మ చేయించి భిత్తిలేపన మొనరింప వలెను. వెలుపల నంతట సుధాకర్మ యొనరింప వలెను. సుధాకర్మ- సున్నము వేయించుట. గోడలన్నియు విలిప్తములై పరిమృష్టములై శోభా సంపన్నములయిన పిమ్మట చిత్రకర్మ నేర్పఱుప వలయును.

## చి త్ర క ర్మ

౮౧. చిత్రకర్మణి చాలేఖ్యాః పురుషాః స్త్రీజనాస్తథా
లతాబంధాశ్చ కర్తవ్యాః చరితం చాత్మభోగజం

చిత్రకర్మలో స్త్రీపురుషుల యాలేఖ్యములు సుందరముగా చిత్రితములు కావలెను. లతాబంధములు కూర్పవలెను. లతాబంధ ములు నానావిధములుగా నున్నవి. స్త్రీపురుషుల సంబంధములోని కొన్ని విశేషములు అభినయ సన్నివేశములు లతాబంధములె. మాలతి మొదలగు లత లల్లిబిల్లిగ నల్లికొనుట లోని వేష్టన వైచిత్ర్య ప్రకా రములును లతాబంధములె. ఇంకను పిండీబంధము మొదలగు విశేష

ములు లతాబంధములై. పిండీబంధాదులు మున్ముందు నిరూపితములగును. ఇంకను చిత్రకర్మలో నాత్మభోగవిశేషముల సూచించు చరితమును చిత్రింప చేయవలెను. స్త్రీపురుషుల విలాసక్రీడలను చిత్రింప వలెనని భావము. ఈ చెప్పిన విధముగా వికృష్ట మనెడు నాట్యమండపమును నిర్మాణించునది. దీని ననుసరించి సమచతురస్ర మంటపము నూహింప వచ్చును. అయినను కొంతగా విశేష మున్నది.

## చతురస్ర మండపము

౮౨. సమంతతశ్చ కర్తవ్యా హస్తా ద్వాత్రింశదేవ తు
శుభ భూమి విభాగస్థో నాట్యజ్ఞై ర్నాట్యమండపః

౮౩. యో విధిః పూర్వముక్తస్తు లక్షణం మంగలాని చ
వికృష్టే తాన్యశేషాణి చతురశ్రేఽపి కారయేత్

యోగ్యమగు భూ విభాగము నందు ముప్పది రెండు హస్తముల ప్రమాణమును నలువైపుల నిశ్చయించునది. పొడవు ౩౨ హస్తములు. వెడల్పు ౩౨ హస్తములు. ఈ విధముగా చతురశ్ర మండపమును నిర్మింప వలెను. వికృష్ట నాట్యమండప విషయమున పూర్వము నిరూపించిన లక్షణము మంగళములు విధానములు సర్వమును చతురస్రమున గూడ యోజనము చేయునది. నాట్యక్షేత్రమును ఎనిమిది భాగములుగా విభజించినచో నది యంతట చతురంగ ఫలకము వలె నరువదినాలుగు కోష్టములు కలదగును. సర్వమధ్యగతముగా నున్న కోష్టచతుష్కమున రంగపీఠము నేర్పరుప వలెను. దాని పృష్ఠమున రంగపీఠము నానుకొని యుండు విధమున రంగశీర్షమును సిద్ధము చేయవలెను. దాని పృష్ఠమున నేపథ్యగృహముండును. రంగపీఠము గుర్తించుకొని పది స్తంభములను కూర్చి వాని వెలుపలగా సామాజికుల కాసనముల నేర్పరచ వలెను. మిక్కిలి సమీపమున నున్నచో దృష్టివిఘాతము కల్గును. సామాజికపీఠములు సోపానాకృతిగా నుండవలెను. ఒక హస్తప్రమాణ మెత్తుగా నుండున ట్లిటుకలతో కొయ్యలతో ప్రేక్షకనివేశనము సిద్ధము చేయువలయును. ఆసనముల విధానము లన్నియు రంగపీఠముఖములుగా నుండవలెను.

మధ్యలో మండప ధారణమునకు సమర్థము లయిన ఆరు స్తంభము లను కూర్పవలెను. ప్రేక్షామండపము- అధోభూమి, రంగపీఠము, రంగము:- నని త్రిధాకల్పనమున నుండును గావున వాని కనుకూల ముగ స్తంభయోజనము చేయవలయును. వికృష్టమండపమున నింకను స్తంభము లావశ్యకము లగునని యూహింప వచ్చును. స్తంభము లందు ధారణపీఠము లుంచి వాని యందు సుశ్లిష్టములుగా నుండు నట్లు సాలభంజికా ప్రతిమలు నిర్మింపవలెను. సాలభంజిక కాష్ఠమయ మయిన కాంతాప్రతికృతి. ఈ ప్రతికృతులకు వృక్షవేష్టన ముండును. ఉపవనమందు వృక్ష మవలంబించి నిరీక్షించు కాంతాప్రతికృతి చిత్రి తము కావలె ననెడు భావము గుర్తింప వచ్చును. సాలభంజిక వేశ్యా చిత్ర మనియు నందురు.

## నేపథ్య నిర్మాణము

౮౪. నేపథ్యగృహకం చైవ తతః కార్యం ప్రయత్నతః
ద్వారం చైకం భవేత్తత్ర రంగపీఠ ప్రవేశనం

౮౫. జనప్రవేశనం చైవ మాభిముఖ్యేన కారయేత్
రంగస్యాభిముఖం కార్యం ద్వితీయం ద్వారమేవ తు

నిరూపించిన విధమున నేపథ్యగృహమును సిద్ధముచేసి రంగపీఠ ప్రవేశనమునకై ద్వార మేర్పరుప వలెను. అభిముఖముగా జన ప్రవేశన ముండవలయును. రంగాభిముఖముగా రెండవ ద్వారము కూర్ప వలెను. నేపథ్యగృహమున రెండు ద్వారము లుండవలయునని యిచట గుర్తింప వలసి యున్నది. నేపథ్య కక్ష్యా విభాగము ననుస రించి రెండు ద్వారము లుండును. సామాన్యముగా పాత్రప్రవేశో పాయన మొకటి. స్త్రీ పరివార ప్రవేశమునకు రెండవది. సామాజిక జన ప్రవేశమునకు మూడవ ద్వారము రంగాభిముఖముగా నుండును. నేపథ్యమున రెండు ద్వారములు. భాండద్వార మొకటి, సామాజిక ప్రవేశమునకు మరియొకటి. మొత్తము నాల్గు ద్వారములు నాట్య గృహమునకు నియతములై యుండుటను గుర్తింప వలసి యున్నది. కావుననే "చతుర్ద్వారం నాట్యగృహం" అనిరి. నాట్యభవనమున నాలోక మనుకూలముగ నుండుటకై మరిరెండు ద్వారములు కూడ

కూర్ప వలెనని అందుననె "షడ్ద్వారం నాట్యగృహం" అని కొంద రనుచున్నారు.

రంగపీఠమును ప్రమాణనియమమున నెనిమిది హస్తములుగా నిర్మింప వలెను. అది వేదికా సమలంకృతమై సమతలముగా నుండ వలెను. పూర్వము చెప్పిన విధముననె చతురస్ర మంటపమున మత్త వారణి నిర్మాణింప వలెను. రంగపీఠము కన్న రంగశీర్షము కొంత సమున్నతముగా నుండ వలెను. ఈ సమున్నతరీతి వికృష్టమంట పమునం దుండును. చతురస్రమునందు సమతలముగ నిర్మాణించు టయె సుందరము. ఇట్లు చతురస్ర గృహ మూహించునది.

త్ర్య స్ర భ వ న ము

౭౬. త్ర్యస్రం త్రికోణం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః
మధ్యే త్రికోణమేవాస్య రంగపీఠం తు కారయేత్

ఇక మూడవ ప్రేక్షాగృహ మున్నది. అది త్రికోణాకృతి. ఆ మహాత్రికోణముగా నుండు మంటపమున రంగపీఠమును గూడ త్రికోణముగనె సిద్ధము చేయ వలయును. రంగశీర్షము నేపథ్యగృహము కూడ త్రికోణముగనె యుండును. కోణమున నున్న ద్వారముననె ప్రవేశసౌకర్యము కూర్ప వలయును. రంగపీఠమునకు పృష్ఠమున ద్వార మేర్పఱచునది. భిత్తిస్తంభముల విషయమున చతురస్రమున నిరూపించిన విధానమె త్ర్యస్రమున గూడ నాట్యప్రయోక్తలు అనుస రింప వలెను. ఈ విధముగా నాట్యగృహములను విధివిధానమున నిర్మాణింప వలెను. పూర్వము నిరూపించిన పదునెనిమిది విధములగు ప్రేక్షాగృహములె కాక ఇంక ననేకవిధముల నాట్యగృహముల నూహాబలమున భావించి నిర్మింప వచ్చును.

నా ట్య క లా పీ ఠ ము

ఇప్పటి కిది ప్రేక్షాగృహలక్షణము. ఇది మండపవిధానము. వికృష్టము, చతురస్రము, త్ర్యస్ర మని నాట్యమండపము మూడు విధ ములు. జ్యేష్ఠము మధ్యమము కనీయము నని యందు మూడు ప్రమా ణములు. హస్తమానమున నిర్ణయము మానవగేహములకు తగి

యుండును. వికృష్టగేహము నిర్మించునప్పుడు భూవిభాగము చూచి వాస్తుప్రమాణము పట్టి, త్రాడుతో కొలతలు తీసి రంగగృహము విభాగించు కొనవలయును. మండపనివేశన స్థాపనములు సరిచూచు కొని స్తంభప్రతిష్ఠ చేయవలయును. ఇక నేపథ్యము, రంగశీర్షము, రంగపీఠము, మత్తవారణము ఏర్పరుప వలెను. అనంతరము దారు భిత్తి చిత్ర కర్మ లావశ్యకములు. సామాన్యముగా నీ నిరూపించిన వికృష్టమండపవిశేషములు చతురస్రగృహమునకును త్ర్యస్రగృహము నకును సంబంధించును. ఈ చెప్పినవె కాక నాట్యమంటపము లింక నెన్నియో భావింపవచ్చును. దేవతల కన్నిటను భావనామాత్ర మున సిద్ధి యున్నది. మానవుల కట్లుగాదు. వారన్నియు యత్నమున కూర్చుకొనవలయును. నాట్యమండపమున ప్రత్యంశము దేవసంబంధ మున నుండును. అందుచే నన్నిట సమంత్రకమయిన పూజామర్యా దల ననుసరింప వలసియున్నది. యథావిధి జరుగు పూజాసంప్రదాయ ములు దేశమానవాభ్యుదయములకు నిదానము లగును. నాట్యాచా ర్యుడు సావధానముగ వీని పాలింపవలయుసు. నాట్యగృహనిర్మాణ మున నంతట కలాసౌందర్యభావనము ముఖ్యముగ నున్నది. పాఠ్యము గీతము వాద్యము ముఖరాగము ఆంగికము సర్వమును సామాజికులకు బాగుగ గోచరించుట కనుకూలముగ నిర్మాణవైభవమును సమీ క్షింపవలెను. ఇట్లిది యంతయు కలాసౌందర్యమున ధర్మతత్త్వమును ప్రబోధించునదై ధర్మకర్మకరణములందు కలారమ్యత నిచ్చునదై భారతదేశీయసంప్రదాయము నుద్బోధించు చున్నది. దేవభావిత మయిన నాట్యగృహము కలాపీఠము.

## గో ని వా స ము

౭౨. సర్వలక్షణసంపన్నే కృతే నాట్యగృహే శుభే
గావో వసేయుః సప్తాహం సహ జప్యపరైః ద్విజైః

మండపము సిద్ధ మయినది. ఇక పూజ చేయవలయును. పూజ మండపవిధానశేషము. శుభనాట్యగృహము సర్వలక్షణసంప న్నముగా సిద్ధము కాగా నా నాట్యగృహమున నేడు దినములు జప శీలు రయిన బ్రాహ్మణులతో గోవులు నివాసము చేయవలయును

రక్షోఘ్నము లయిన మంత్రముల జపించు బ్రాహ్మణులు కావలయును.
ఇట్లు సప్తాహదీక్ష యయిన తరువాత నాట్యాచార్యుడు నవవస్త్ర
ములు ధరించి మూడు దినము లుపవసించి యుండి దీక్షితుడై ప్రయ
తుడై నియతుడై శుచియై మంత్రోదకముల సంప్రోక్షితుడై నిశాసమ
యమున రంగపీఠ దేవతల నధివసింప జేయవలయును.

మహాదేవునకు మొదట నమస్కరింప వలెను. మహాదేవుడు
సర్వలోకేశ్వరుడు భవుడు శివుడు శివంకరుడు శంకరుడు. పిమ్మట
బ్రహ్మ, బృహస్పతి, విష్ణువు, ఇంద్రుడు, కుమారస్వామి, సరస్వతి,
లక్ష్మి, సిద్ధి, మేధ, ధృతి, మతి, చంద్రుడు, సూర్యుడు, వాయువు,
లోకపాలకులు, అశ్వినులు, అగ్ని, రుద్రులు, కాలము, మృత్యువు,
నియతి, కాలదండము, విష్ణుచక్రము, నాగరాజు, వాసుకి, వజ్రము,
విద్యుత్తు, సముద్రములు, గంధర్వులు, అప్సరసలు, మునులు, నాట్య
కుమారికలు, మహాగ్రామణి గణపతి, యక్ష గుహ్యక భూత పిశాచ
మహోరగులు, అసురులు, ఇంక నితరదేవవర్గులు వీరి నందరిని అంజలి
పట్టి నమస్కరింప వలెను. వా రందరు వారి వారి స్థానముల కావా
హితులయిన పిమ్మట నిట్లు పలుక వలెను.

దేవనతి

౮౮. భగవద్భిః నిశాయాం సః కర్తవ్యః సంపరిగ్రహః
సాహాయ్యం చైవ దాతవ్యం అస్మిన్నాట్యే సహానుగైః

"పూజ్యులు మీ రంద రీ రాత్రి రక్షణ మొనగింపుడు.
మీరు మీ పరివారములతో గూడి కొని యీ నాట్యమున సాహాయ్య
మొనరింప వలెను." వీ రందరి నొకచో పూజించి కుతపమును
ప్రయోగించునది. చతుర్విధాతోద్యముల నొకచో గూర్చుట కుత
పము. పూజకై జర్జరము నుంచి నాట్యప్రసిద్ధికై పూజ యొనర్ప
వలెను. ఇట్లు ప్రార్థింప వలెను.

౮౯. "త్వం మహేంద్రప్రహరణ! సర్వ దానవ సూదన!
నిర్మిత స్త్వం సర్వదేవైః సర్వవిఘ్ననిబర్హణ!
౯౦. నృపస్య విజయం శంస! రిపూణాం చ పరాజయం
గో బ్రాహ్మణ శివం చైవ నాట్యస్య చ వివర్ధనం"

జర్జరమా! నీవు మహేంద్రుని యాయుధము. సర్వదానవుల నణచి వేతువు. సర్వవిఘ్నముల నిగ్రహింతువు. సర్వదేవతలు నిన్ను నిర్మించిరి. మా నాట్యప్రయోజయిత రాజునకు విజయము కూర్పుము! శత్రువులకు పరాజయ మాపాదింపుము! గోబ్రాహ్మణులకు శివము సంధానింపుము! నాట్యము వృద్ధి పొందింపుము!

ఇట్లు యథాన్యాయము నాట్యమండపమున నుపాసించునది. ఆ రాత్రి గడువగానే ప్రభాతమున పూజన ముపక్రమింప వలెను. ఆర్ద్రి, మఖ, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వభాద్రపద, ఆశ్లేష, మూల, నక్షత్రములందు రంగపూజనము చేయవలయును. శుచి, నియతుడు, దీక్షితుడు నాట్యాచార్యుడు రంగమును దీపములచే ప్రకాశింపచేసి దేవతాపూజనము చేయవలయును. భూతదేవతాక మయిన దినాంతములోని దారుణ ఘోర ముహూర్తమున జ్వలిత దర్భోల్మకమున స్పర్శనము చేసి యథాన్యాయముగా దేవతా నివేశ మొనర్చునది. సూత్రనిర్మితములు గ్రంథియుక్తము లయిన కంకణములు ప్రతిసరములు. రక్తప్రతిసరములు, రక్తగంధములు, రక్తపుష్పములు, రక్తఫలము–అన్నియు నెఱ్ఱగా నుండు పూజాసామగ్రి కూర్పవలయును. యవలు, తెల్లఆవాలు, పేలాలు, అక్షతలు, శాలితండులములు, నాగపుష్పములు మొదలగు పూజాద్రవ్యములతో దేవతానివేశన మొనర్ప వలెను.

షోడశ హస్త పరిమితముగా మండలము నిర్మించి, నలుదిక్కుల ద్వారము లేర్పఱచి నియమానుసారమున దైవతముల నివేశనము కూర్పవలెను. కక్ష్యావిభాగము గుర్తింప వలెను.

౬౧. పద్మోపవిష్టం బ్రహ్మాణం తస్య మధ్యే నివేశయేత్
ఆదౌ నివేశ్యో భగవాన్ సార్ధం భూతగణైర్భవః

పద్మోపవిష్టుడయిన బ్రహ్మను మండపమధ్యమున నివేశింప చేయవలెను. మొదట భూతగణములతో గూడుకొనిన భవదేవుని భగవానుని నివేశము చేయవలయును. నారాయణుడు, మహేంద్రుడు, స్కందుడు, సూర్యుడు, అశ్వినులు, చంద్రుడు, సరస్వతి, లక్ష్మి, శ్రద్ధ, మేధ– పూర్వానుసారమున కూర్పవలెను. పూర్వదక్షిణముగా

స్వాహాదేవితో కూడుకొనిన యగ్నిదేవు నర్చింప వలెను. విశ్వేదేవులు గంధర్వులు యముడు పితృ-పిశాచోరగ గుహ్యకులు రాక్షసులు వరుణుడు సప్తవాయువులు, పక్షులగూడిన గరుడుడు, కుబేరుడు, నాట్యమాతృకలు, యక్షులు, నంది, గణేశ్వరుడు, బ్రహ్మర్షి భూత సంఘములు యథాభాగముగా నివేశము పొంద దగియున్నారు. పూజార్థమై స్తంభమున సనత్కుమారుని దక్షుని గణపతిని సన్నివేశింప చేయవలయును.

౯౨. అనేనైవ విధానేన యథాస్థానం యథావిధి
సుప్రసాదాని సర్వాణి దైవతాని నివేశయేత్

ఇదేవిధముగా యథాస్థానమున యథావిధిగా సుప్రసన్నులయిన దేవుల నందరిని కూర్పవలెను. ఆ యా యాగమములందు నిరూపించిన విధమున దేవతా సన్నివేశ మొనర్పవలెను. ఆ యా స్థానములందు యథాన్యాయముగా దేవతావాహనము చేసి వారి కందరకు యథార్హముగా పూజ నాచరింప వలయును.

దేవతలకు సితమాల్యానులేపనము, గంధర్వ వహ్ని సూర్యులకు రక్తమాల్యానులేపనము సమర్పింపవలెను. మధుపర్కమున బ్రహ్మను, పాయసమున సరస్వతిని, మోదకములతో శివ విష్ణు మహేంద్రాదులను, ఘృతాన్నముతో నగ్నిని, గుడాన్నములతో చంద్ర సూర్యులను, మధుపాయసములతో విశ్వేదేవులను గంధర్వులను మునులను తృప్తి పొందింప వలెను. అపూప మోదకములతో యమమిత్రుల నర్చించునది. పితృపిశాచోరగుల నాజ్యక్షీరములతో, పక్వాన్నములతో, మద్య మాంస ఫలాసవములతో భూతసంఘముల నర్చ చేయవలెను. ఇట్లె మత్తవారణి పూజ చేయవలయును. రక్షోగణములను మత్స్యాన్నములతో నారాధింప వలెను. సురా మాంస ప్రదానములతో దానవులను పూజింపవలెను. మిగులు దేవగణముల నన్నిటిని అపూపాదులతో నర్చింప వలెను. మత్స్యములతో పిష్ట భక్ష్యములతో సరిత్సాగరముల పూజించి వరుణుని ఘృతపాయసమున నారాధింప వలెను. నానా మూలఫలములతో మునుల నారాధింప వలెను. విచిత్ర భక్ష్యభోజనములతో వాయువులను, పక్షులను, నాట్య

మాతృకలను, కుబేరుని పూజింప వలెను. ఇట్లు నానాభోజనములు కల పూజ నాచరింప వలెను.

మంత్రవిధానము ననుసరించియు పూజావిధుల నిర్వహింప వలెను.

౯౩. దేవదేవ! మహాదేవ! సర్వ లోక పితామహ!
మంత్రపూతమిదం సర్వం ప్రతిగృహ్ణష్వ మే బలిం

మహాదేవా! పితామహా! మంత్రపవిత్ర మయిన యీ పూజా బలి స్వీకరింపు డని యర్థింపవలెను. ఇట్లె యా యా స్థాననియతు లయిన వారి నందరి నర్థింప వలసి యున్నది. వారి వారి నామసంకేత పురస్సరముగ వారి నందరి నారాధింప వలయును. దేవతలు పితరులు పన్నగులు భూతసంఘములు మునులు సరిత్సాగరములు గరుడులు అందరారాధింప దగినవారుగా నున్నారు.

౯౪. నమోఽస్తు నాట్యమాతృభ్యో బ్రాహ్మ్యాద్యాభ్యో నమోనమః
సుముఖీభిః ప్రసన్నాభిః బలిస్సంప్రతిగృహ్యతాం!

బాహ్మి మాహేశ్వరి మొదలగు నాట్యమాతృకలకు నమస్కారము. వారందరు సౌముఖ్యము కలవారై ప్రసన్నచిత్తలై సమర్పించిన పూజాబలిని స్వీకరింతురు గావుత! విష్ణుప్రహరణము రుద్రప్రహరణము బలిస్వీకరింత్రు గావుత! మత్తవారణి నాశ్రయించిన వాస్తుదేవత లీ మంత్రపూత మనుగ్రహింతురు గావుత! దశదిశల నాశ్రయించి యున్న దేవగంధర్వులు, దివ్యాంతరిక్ష భౌమ ప్రాణు లంద రీ బలి స్వీకరింపుడు! అని యర్థింప వలెను.

## ఉ ద కుం భ ము

౯౫. కుంభం సలిలసంపూర్ణం పుష్పమాలా పురస్కృతం
స్థాపయేద్రంగమధ్యే తు సువర్ణం చాత్ర దాపయేత్

ఉదక సంభరిత మయిన కుంభమును పుష్పమాలలచే నలంకరించి అందు సువర్ణ ముంచి రంగమధ్యమున స్థాపింప వలెను. సర్వ వాద్యములను వస్త్రోత్తరముల నొనర్చి గంధ మాల్య ధూప భక్ష్య భోజ్యములతో పూజింప వలెను. సర్వదేవతల పూజించిన యనంతరము విఘ్నజర్జర మయిన జర్జరమును పూజింప వలెను. జర్జగ శిర

మున తెల్లని వస్త్రమును, రౌద్రపర్వమున నీలమును, విష్ణుపర్వమున పీతమును, స్కందపర్వమున రక్తవస్త్రమును, మూలపర్వమున చిత్ర వస్త్రమును హితార్థియగు నాట్యాచార్యు డర్పింప వలెను. సర్వ వాద్యములను వస్త్రములతో నవగుంఠన మొనర్ప వలయును. ఇట్లు విధుల నిర్వర్తించి విఘ్నజర్జరణ మునకై జర్జరము ని ట్లభిమంత్రింప వలెను.

జర్జర మంత్రణము

౯౬. అత్ర విఘ్నవినాశార్థం పితామహముఖైస్సురైః
నిర్మితస్త్వం మహావీర్యో వజ్రసారో మహాతనుః

౯౭. శిరస్తే రక్షతు బ్రహ్మా సర్వైర్దేవగణైస్సహ
ద్వితీయం తు హరః పాతు తృతీయం చ జనార్దనః

౯౮. చతుర్థం చ కుమారశ్చ పంచమం పన్నగోత్తమాః
నిత్యం సర్వేఽపి పాంతు త్వాం పునస్త్వం చ శివో భవ!

౯౯. నక్షత్రేఽభిజితి శ్రేష్ఠే జాతస్త్వమరిసూదనః
జయం చాభ్యుదయం చైవ పార్థివస్య సమావహ!

"జర్జరమా! విఘ్నముల వినాశమునకై బ్రహ్మాదిదేవులు నిన్ను నిర్మించినారు. నీ వీర్యము గొప్పది. నీకు వజ్రసార మున్నది. సర్వదేవగణములతో బ్రహ్మ నీ శిరమును రక్షించు గావుత! శివుడు విష్ణువు కుమారుడు పన్నగులు నీ పర్వములను నిత్యము రక్షింతురు గావుత! నీవు శివరూపవు కమ్ము! శ్రేష్ఠమయిన యభిజిత్తులో నీవు జన్మించితివి. శత్రువుల నశింపజేయుదువు. మా ప్రభువునకు జయ మభ్యుదయము కూర్పుము!" ఇట్లు జర్జరము పూజించి, బలి నివేదించి, మంత్రాహుతి పురస్సరముగా నగ్నిలో హోమ మాచరింప వలెను. అప్పుడు ప్రదీప్తము లయిన వహ్నిజ్వాలలతో రాజునకు నర్తకీ సమూహమునకు దీప్త్యభివర్ధన మొనరింప వలెను. నర్తకీ నృపతుల ని ట్లభిద్యోతింప జేసి మంత్రపూతజలమున వారల నభ్యుక్షణము చేసి (ఉదకముచల్లి) యిట్లనవలెను.

౧౦౦. మహాకులే ప్రసూతాః స్థ! గుణౌఘైశ్చాప్యలంకృతాః
యద్వో జన్మగుణోపేతం తద్వో భవతు నిత్యశః

"మీరందరు మహాకులమున జన్మించినారు. గుణసమూహము లచే నలంకృతు లయినారు. మీ మీ జన్మగుణసహిత మగు విశేషము మీకు నిత్య మతిశయించు గావుత!" ఇట్లు పలికి నాట్యాచార్యుడు భూపతివిభూత్యై నాట్యయోగ ప్రసిద్ధ్యై యాశీస్సుల పలుక వలెను.

౧౦౧. సరస్వతీ ధృతిర్మేధా హ్రీః శ్రీః లక్ష్మీః స్మృతిః మతిః
పాంతు! వో మాతరః సౌమ్యాః సిద్ధిదాశ్చ భవంతు వః

సరస్వతి, ధృతి, మేధ, హ్రీ, శ్రీ, లక్ష్మి, స్మృతి, మతి యనెడు మాతృకలు మిమ్ము నిత్యము రక్షింత్రు గావుత! అందరు మీకు సౌమ్యస్వభావమున సిద్ధిని ప్రసాదింతురు గావుత!

ప్ర దీ ప్త శి ఖ

పిమ్మట యథాన్యాయము హోమ మొనరించి హవిస్సును మంత్రపురస్కృత మొనరించునది. అనంతరము నాట్యాచార్యుడు ప్రయత్నపూర్వకముగా కుంభమును భిన్నము చేయవలయును. కుంభము భిన్నము కాక పోయినచో స్వామికి శత్రుభయము కలుగును. భిన్నమయినచో శత్రునాశము కలుగును. కుంభము భిన్నమయిన పిమ్మట నాట్యాచార్యుడు ప్రయత్నపూర్వకముగా ప్రదీప్త ప్రదీపికను స్వీకరించి రంగ మంతట ప్రకాశింప జేయవలయును. రంగమధ్యమునం దా ప్రదీప్తశిఖను క్ష్వేడితములచే, స్ఫోటితములచే, వల్గితములచే, ప్రధావితములచే ససంభ్రమముగా ప్రసరింప జేయవలయును. శంఖ దుందుభి ధ్వనులను, మృదంగ పణవ ధ్వనులను, నానా విధాతోద్య ధ్వనులను విస్తరింపజేయుచు రంగయుద్ధముల నొనరింప వలయును.

౧౦౨. తత్ర చ్ఛిన్నం చ భిన్నం చ దారితం చ సశోణితం
క్షతం ప్రదీప్తమాయస్తం నిమిత్తం సిద్ధిలక్షణం

అప్పటి రంగవిధానమున ఛిన్నమగుట భిన్నమగుట రక్తము కూడుకొనిన గాయమగుట కాలుట యను నిమిత్తములు సిద్ధిలక్షణము లని గుర్తింపవలెను. చక్కగా రంగమున నిట్లు జరుగుట స్వామికి శుభమును సంపాదించును. బాలవృద్ధులతో నిండిన జనపదమునకును శుభమును కూర్చును. ఇట్లనుట రంగపూజా విధాన మావశ్యక మని నిశ్చిత మగును.

౧౦౩. దురిష్టస్తు తథా రంగో దేవతైర్దురధిష్ఠితః
నాట్యవిధ్వంసనం కుర్యాత్ నృపస్య చ తథాశుభం

రంగపూజ యథావిధి చక్కగా జరుపక పోయినచో దేవతలచే నది దురధిష్ఠిత మగును. అట్లు దురధిష్ఠిత మయిన రంగము నాట్య విధ్వంసన మాపాదించును. రాజున కశుభ మాపాదించును. ఇట్టి రంగపూజా విధానమును విడిచి పెట్టి యథేష్టముగా నాట్యప్రయోగము చేయుట యుక్తము కాదు. అప్పుడు నాట్యాచార్యు డపచయము పొందును. హాని పొందును. శీఘ్రముగా తిర్యగ్యోనిలో జన్మించును.

౧౦౪. యజ్ఞేన సంమతం హ్యేతద్రంగదైవత పూజనం
అపూజయిత్వా రంగం తు నైవ ప్రేక్షాం ప్రయోజయేత్

౧౦౫. పూజితాః పూజయంత్యేతే మానితా మానయంతి చ
తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యం రంగపూజనం

ఈ రంగదైవతపూజన మనునది యజ్ఞము వంటిది. యజ్ఞము వలె పవిత్రము. రంగము పూజింపక నాట్యము ప్రయోగింప రాదు. దేవతల పూజించిన వారు పూజ సంపాదింతురు. మనకు పూజ గలుగును. దేవతల గౌరవించిన మనకును గౌరవము కలుగును. కాన నన్నివిధముల రంగపూజన మొనర్ప వలయును. అప్రయోగము ప్రదర్శించిన నది క్షణములో దహించును. అనర్థము తెచ్చి పెట్టును. ఆ విధముగా నగ్ని వాయు సహకార ప్రేరణ మున్నను దహింప లేదు. దుష్టప్రయోగ మెన్నడు నుచితము కాదు.

## నా ట్యా చా ర్యు డు

౧౦౬. శాస్త్రజ్ఞేన వినీతేన శుచినా దీక్షితేన చ
నాట్యాచార్యేణ శాంతేన కర్తవ్యం రంగపూజనం

నాట్యవిద్యాచార్యుడు వినీతుడై శాంతుడై శుచియై దీక్షితుడై శాంతుడై రంగపూజన మొనరింప వలయును. ఒకప్పు డుద్విగ్న మానసుడై పూజావిధానము స్థానభ్రష్టము చేయునేని, మంత్రహీనముగ జేయునేని యాతడు ప్రాయశ్చిత్తము చేసికొన వలయును. రంగదైవత పూజావిధానమున నీ నిరూపితవిధానమును నవనాట్య

గృహమున నాట్యప్రయోగావసరమున నాట్యప్రయోక్త లవశ్యముగా నాచరింప వలయును. నవనాట్య ప్రయోగమున పూజ నాచరింప వలెను. నవ నాట్యగృహమునను పూజ కావింపవలెను. ప్రేక్షారంభ మున నంతట పూజ యవశ్యకర్తవ్యము. దివ్యనాట్యగృహమున భోజన- దాన- లాంగలోత్కర్షణాదు లేవియు సంభవింపవు. అట్లె సిద్ధమై యున్న నాట్యగృహమున నివి యుండవు. అయినను ప్రేక్షా రంభమున నవశ్యముగా రంగదైవత పూజన మాచరింప వలయునని పరమతాత్పర్యముగా సంభావింప వలసి యున్నది.

నాట్యాచార్య నాయకు డుపవసించి దేవతాధివాస మేర్ప ఱచుట సర్వము దేవతాస్తుతి యందు పర్యవసానము పొందును. సమంత్రకముగా దేవతల పూజా బలి సంప్రదాయము లనుసరించుట సర్వశుభము. జర్జరపూజన మాత్మరక్ష వంటిది. హోమాంతము మొదట నెలకొల్పిన కుంభమును భద్ర పఱచి దాని వినియోగమును పరిశీలింప వలయును. ఆ పరిశీలనమె కుంభభేదనము. అది సూచించు నిమిత్తము నాట్యప్రయోగ మెట్టిదో తెలుపును. హోమ మొనర్చి రంగప్రదీపన మొనరించుట నర్తక నర్తకీ నృపుల కుత్తేజనము సంపా దించు నది యగును. రంగపూజనము సర్వథా కర్తవ్యము. నాట్య గృహారంభమున వలె ప్రేక్షారంభమున గూడ దైవతపూజన మావశ్య కము. నవనాట్య సమారంభమునను పూజనము విహిత మగుచున్నది. ఇట్లావశ్యక మయిన రంగదైవత పూజావిధాన సంప్రదాయము నాక స్మికముగా విడువరాదు. అన్యథా కరణమును సముచితము కాదు. కలాత్మకారంభము దైవసమారంభముతో నుండవలయుటను భరతు డనేకవిధముల సూచించు చున్నాడు. ఈ సాంప్రదాయిక మయిన సమారంభము ననుసరించుటయె భారతీయ సంస్కృతి మర్యాద. దీని నుల్లంఘించుట ప్రమాదహేతువు. శాంతుడు వినీతుడు దక్షుడు దీక్షితు డయిన నాట్యాచార్యుడు భవిష్యల్లోకోపదేశముగా రంగ దైవతపూజనము యథావిధి నాచరించుట పరమకర్తవ్య మనెడి సముచితాశయ మిచటిసారార్థము.

## అమృతమంథనము

భరతు డీ విధముగా పూజన మొనరించి పితామహు నిట్లడిగి నాడు. "ప్రభూ! ఆజ్ఞాపింపుడు! నాట్యభవనపూజ యయినది. శీఘ్ర ముగా నే నేమి యొనర్పవలెనో సెలవిండు!" "నీ వమృతమంథన మాయోజనము చేయుము!" అని బ్రహ్మ యనినాడు. అమృత మంథనము 'సమవకార' మనెడు రూపకభేదము. రంగమున పూజ యొనర్చిన పిమ్మట నాలస్య మొనరింపరాదు. వెంటనే ప్రయోగ మారంభింప వలెను. భరతు డాలసింపక ప్రయోగము ప్రయోజింప వలెనని బ్రహ్మభావము. భరతుడు తన శిష్యులకందర కమృతమంథన ప్రయోగకౌశల మలవరచ వలయు నని బ్రహ్మ నిర్దేశించెను. ధర్మ కామార్థోపాయముల నుపదేశించు నదిగా నాట్యవేద నిర్మాణావ ధిలో బ్రహ్మ యమృతమంథనము గ్రథించెను. అమృతమంథనము సమవకారప్రయోగము. అది సమ్యక్ సాక్షాత్కారకల్పముగా నుండును. నయనయోగ్యముగా నుండును. అది యుత్సాహప్రభవ మయిన వీరరసాత్మకము. సర్వదేవతల కది రసనాత్మక మయిన చర్వణము (ప్రీతి) కలుగ జేయగలదు. ప్రీతిప్రకారమున త్రివర్గో పాయవిషయ మయిన ఉత్సాహ మాపాదింప గలదు. అందుచే నది దృశ్యము శ్రవ్యము నగును. సమవకారమున ప్రఖ్యాతు డుదాత్తుడు నాయకు డగుట దేవాసురబీజముగా నుండుట యున్నది. "సమవ కీర్యతేఽర్థో యత్ర స సమవకారః." ప్రయోజనము సుఘటిత మగును గావున సమవకార మనుట సార్థకము. భరతుడు బ్రహ్మ యాదేశ మనుసరించి యమృతమంథనము ప్రయోగించినాడు. ఆ సమవ కారము ప్రయుక్తము కాగా దేవదానవు లందరు హర్షము పొందిరి. ప్రయోగసమయమున నందరు కర్మభావ దర్శనమున సుఖాతిశయము కలవా రగుదురు. ఏకరస మయిన వస్తువు నందు దుద్వేగము కలవారు కూడ ఏకానుసంధాన మొనరింతురు. అంతట హర్ష ముదయించును. అట్లా ప్రయోగ మవిఘ్నముగా గడచినది. కొంతకాల మయినది.

అంబుజసంభవుడు బ్రహ్మ భరతుని పిలిచి యిట్లనినాడు:— "నాట్యం సందర్శయామోఽద్య త్రినేత్రాయ మహాత్మనే" మహా

త్మ్నము మహాదేవున కీ నాట్యము ప్రదర్శింతము. ఇది యంతయు నృత్తప్రయోగ ప్రస్తావము తెల్పుట కితిహాసము. నృత్తప్రయోగము కైశికీ సర్వస్వము. సకలప్రయోగప్రాణము. దాని నిరూపింప వలెను. అదియు గాక నాట్యప్రయోగమును మొదట దాని తెలిసిన వానికి చూపింప వలె గదా! అట్టి నాట్యవిదుడె నాట్యప్రయోగము దర్శించుటలో నౌచిత్య మున్నది. అటు పిమ్మట పితామహుడు నాట్య ప్రయోక్తలను దేవతలను వెంట బెట్టుకొని మహాదేవుని నివాసము చేరెను. చక్కగా పూజించెను. ఇట్లనెను.

## శి వ ద ర్శ న ము

౧౦౭. మయా సమవకారస్తు యోఽయం సృష్టః సురోత్తమ!
శ్రవణే దర్శనే చాస్యప్రసాదం కర్తు మర్హసి

"దేవోత్తమా! మహాదేవా! నేను సమవకారము నిర్మించితిని. దాని వినుటకు చూచుటకు మీ రనుగ్రహింప వలెను." ఇది విని శివుడు "పశ్యామః" చూచెద మని బ్రహ్మతో ననెను. అప్పుడు బ్రహ్మ "సజ్జో భవ! మహామతే!" బుద్ధిశాలీ! సిద్ధము కమ్ము! అని భరతు ననెను. రూపకము రచన చేసిన కవి పరీక్షకునకు ముందుగా విన్పింప వలెను. సామాజికులకు విన్పించుట యనునది యంతగా సమంజసము కాదు. పరీక్షకు లయిన పెద్దలు వినుట వలననె కవి కార్యము కొంత సిద్ధ మగును. పరమేశ్వరుడె పరీక్షకుడు పరితోష్యుడును. రసచర్వణాత్మక మయిన మహాభోగ మిచ్చువాడును.

అంతట నానా నగ సమాకుల మయిన హిమవత్పర్వత పృష్ఠమున, లే మామిళ్ళు కల స్థానమున, రమ్య కందరములు నిర్ఝరములు కల ప్రదేశమున పూర్వరంగము నిర్వహించి అమృతమంథన మను సమవకారము, త్రిపురదాహ మను డిమము (రూపకభేదము) భరతుడు ప్రయోగించి నాడు. తాము మొదట తలచిన యమృతమంథనమె కాక పరమేశ్వరచరిత ప్రధాన మయిన త్రిపురదాహమును గూడ భరతుడు ప్రయోగించినాడు. పరీక్షక పరితోషమునకై ప్రయోక్తలు ప్రయోగమును నిర్వహించుటయు నిందు సూచిత మగుచున్నది. ఆ ప్రదర్శనానంతరము కర్మభావానుకీర్తనమున భూతగణముల

వారందరు హర్షము పొందినారు. మహాదేవుడును సుప్రీతు డయి నాడు. పితామహు నుద్దేశించి యిట్లనినాడు.

### శి వ ప్రీ తి - స్మృ తి

౧౦౮. అహో! నాట్యమిదం సమ్యక్ త్వయా సృష్టం మహామతే!
యశస్యం చ శుభార్థం చ పుణ్యం బుద్ధివివర్ధనం

౧౦౯. మయాపీదం స్మృతం నృత్త్యం సంధ్యాకాలేషు నృత్యతా
నానా కరణ సంయుక్తైః అంగహారై ర్విభూషితం

౧౧౦. పూర్వరంగవిధావస్మిన్ త్వయా సమ్యక్ప్రయోజ్యతాం
మహాగీతేషు చైవార్థాన్ సమ్యగేవాభినేష్యసి

౧౧౧. యశ్చాయం పూర్వరంగస్తు త్వయా శుద్ధః ప్రయోజితః
ఏతద్విమిశ్రితశ్చాయం చిత్రో నామ భవిష్యతి

మహామతీ! బ్రహ్మ! నీవు నిర్మించిన యీ నాట్యము బాగుగా నున్నది. అహో! చక్కగా సృజించితివి. ఇది యశ మిచ్చును. శుభము కూర్చును. పుణ్య మిచ్చును. బుద్ధి వృద్ధి చేయును. పూర్వము సంధ్యాకాలములందు నేనును నృత్య మొనర్చితిని. అది యిప్పుడు స్మృతికి వచ్చుచున్నది. నా ప్రయోగ మనుసరించి నీవు కొంత ప్రయో జితము చేసితివి. సమ్యగుపదేశము లే నందున నిది యంతగా స్పష్టము కాదు. ఈ నృత్య మనాది కదా! నాకు గుర్తు వచ్చుచున్నది. నా కిది చాల సమాదరపాత్రము. నానావిధకరణములతో నంగహార ములతో నిది విభూషితము. కరణాదులు నృత్తకర్మములు చాల ప్రధానములు. పూర్వరంగవిధానములో నీవు నా నృత్యమును సమ్యక్ ప్రయోగింపుము! నీ విప్పుడు నాట్యప్రయోగమున పూర్వభాగమును శుద్ధముగా వైచిత్ర్య రహితముగా ప్రయోగించితివి. ఈ నృత్తముతో నిది కూడుకొనినచో నీవు ప్రయోగించినది చిత్రము కాగలదు. అప్పుడు దీనికి భ ర త మను ప్రసిద్ధి కలుగును. ప్రస్తుతము ప్రదర్శింపవలె నని నృత్తరహితముగ అంగదశకము ప్రదర్శించితివి. దృష్టాదృష్టోభయ ప్రయోజనము దీనివలన రాదు. రంజకత్వ ముండును గాని యదియె చాలదు. కాన విచిత్రము, విమిశ్రము, దృష్టాదృష్టోభయ ప్రయోజన కము కా గలదు. నీ ప్రయోగమునకు సముచిత మగునట్లుగా కూర్చిన

పూర్వరంగ ప్రయోగవిధిలో నుద్ధతభావమె యున్నది. సుకుమార పూర్వరంగమున దేవి యాచరించిన కరణాంగహారములను కూర్చి యనుద్ధతత్వ మాపాదింపుము! వాక్యార్థాభినయమునందు మహా గీతములందు అంగహార పిండీబంధ విశేషముల ననుసరించిన చక్కగా నీ వభినయింప జేయగలవు. నేను చెప్పినది నీవు మిశ్రితము చేసినచో నిది చిత్రమను పేరు కలది యగును.

## అంగహారములు

మహేశ్వరుడు పలికినది యంతయు విని తన ప్రయోగము పరమేశ్వర ప్రసాద పాత్ర మయినది కదా! యని బ్రహ్మ సంతస పడెను. "ప్రయోగ మంగహారాణా మాచక్ష్వ! సురసత్తమ!" దేవోత్తమా! అంగహారముల ప్రయోగమును భరతునకు విశదముగా సెలవిమ్మ! అనెను. అప్పుడు భువనేశ్వరుడు శివుడు 'తండు' వనువాని పిలిచి — "భరతున కంగహారములు ప్రయోగము తెలియ జెప్పుము!" —అని యాజ్ఞాపించెను. అప్పుడు మహాబుద్ధి తండువు నానాకరణములు రేచకములతో కూడిన యంగహారములను నిరూపించెను. అంగహారములె ప్రధానములు. కరణము లంగహారముల నిష్పాదించును.

"ద్వాత్రింశదేతే సంప్రోక్తా అంగహారాస్తు నామతః"

అంగహారములు ముప్పది రెండున్నవి. నూటయెనిమిది కరణములు తెలిసికొని యితరముల నాయోజనము చేయగా నంగహారములనేకములు సిద్ధము లగును. అయినను స్పష్టగోచరము లగువాని యందలి సమాదరమున నంగహారములు ముప్పదిరెండని యనవలసి వచ్చినది. ద్వాత్రింశన్నామ నిర్దేశము పరిగణనము కాదు. "అంగానాం దేశాంతరే సముచితే ప్రాపణప్రకారః అంగహారః" పూర్వమున్న స్థానము కన్న సముచితమగు స్థానాంతరమున నంగముల ప్రాపణప్రకారమున కంగహార మనిపేరు. "హరస్య చాయం హారః = ప్రయోగః, అంగనిర్వర్త్యో హారః = అంగహారః." హరుడు శివుడు. హరునకు సంబంధించిన ప్రయోగము హారము. అంగములచే నిర్వర్తింప బడునది యంగహారము. ఇది మహేశ్వరచరిత మని ప్రసిద్ధి గదా!

## అంగహారముల పేర్లు

౧ స్థిరహస్తము
పర్యస్తకము
సూచీవిద్ధము
అపవిద్ధము
౫ ఆక్షిప్తకము
ఉద్ఘట్టితము
విష్కంభము
అపరాజితము
విష్కంభాపసృతము
౧౦ మత్తాక్రీడము
స్వస్తికరేచితము
పార్శ్వస్వస్తికము
వృశ్చికము
భ్రమరము
౧౫ మత్తస్ఖలితకము
మదవిలసితము
గీతమండలము
పరిచ్ఛిన్నము
పరివృత్తరేచితము
౨౦ వైశాఖరేచితము
పరావృత్తము
అలాతకము
పార్శ్వచ్ఛేదము
విద్యుద్భ్రాంతము
౨౫ ఊరూద్వృత్తము
ఆలీఢము
రేచితము
ఆచ్ఛురితము
ఆక్షిప్తరేచితము
౩౦ సంభ్రాంతము
అపసర్పము
అర్ధనికుట్టకము

## కరణాశ్రయము

ఈ యంగహారముల ప్రయోగము కరణాశ్రయముగా నుండును. కరణముల గుర్తించిన నంగహారముల లక్షణము గుర్తింప శక్య మగును. కరణక్రమపాఠమె వాని లక్షణము కాజాలదు. ప్రయోక్తలు హస్తపాదముల నంగహారము లం దెట్లు ప్రచరింప జేయవలెనో? కరణము లం దెట్లు హస్తపాదప్రచారము యోజనము చేయవలెనో ? తెలియ వలసి యుండును.

"సర్వేషా మంగహారాణాం నిష్పత్తిః కరణై ర్మతః"

అంగహారము లన్నియు కరణములచే నిష్పన్నము లగుననియె నియమము. అంగహారప్రయోగ మొనరింప వలసి యున్నప్పుడు కరణములు సాధనములు. కరణమునుండి వేరొక కరణసంచారమున హస్తపాదాద్యవయవముల చేర్పులు కూర్పులు మార్పులు స్పష్టముగా దెలియ వలసి యున్నది.

## నృత్తకరణము

౧౧౩. హస్త పాద సమాయోగో నృత్తస్య కరణం భవేత్
ద్వే నృత్తకరణే చైవ భవతో నృత్తమాతృకా

౧౧౪. ద్వాభ్యాం త్రిభిః చతుర్భిర్వాప్యంగహారస్తు మాతృభిః
త్రిభిః కలాపకం చైవ చతుర్భిర్మండకం భవేత్

౧౧౫. పంచైవ కరణాని స్యుః సంఘాతక ఇతి స్మృతః
షడ్భిర్వా సప్తభిర్వాపి అష్టభి ర్నవభి స్తథా
కరణైరిహ సంయుక్తా అంగహారాః ప్రకీర్తితాః

నృత్తమునకు సంబంధించిన హస్తపాద సమాయోగమునకు "కరణ" మని పేరు. కరణ మనునది యొకానొక విశిష్టక్రియ. అవయవములలో హస్తపాదముల సమాయోగ రూపమయిన నొక విశిష్టమగు విలాసనిక్షేప ముండును గదా! సామాన్యముగా హస్తపాద క్రియలలో గొన్ని క్రియ లుపాదేయములు. కొన్ని హేయములు. వీనికన్న నతిరిక్తము లగు క్రియలు కొన్ని విలాసవిన్యాసములతో నుండును. అట్టి విలాసక్షేపములకు సాధనములగు క్రియలు కరణము లగునని తాత్పర్యము. హస్త పాద సమాయోగ మను పద మా క్రియాస్వరూపమును రూపించును. హస్త మను పదము పూర్వకాయమున నుండు అంగోపాంగముల కుపలక్షణము. పాదమను పద మధశ్శరీరమున నుండు పార్శ్వ- కటి- ఊరు- జంఘా- చరణాదుల కుపలక్షణము. పూర్వాపర శరీరము లందున్న యా యా యవయవములు కూడుకొనుట విడిపోవుటలు మఱల మఱల కలుగునపుడు పూర్వస్థానము విడుచుట సముచిత మయిన స్థానాంతరము స్వీకరించుట పర్యంత మొకక్రియ పరిగణింతురు కదా! అట్టి క్రియకె కరణ మని పేరు. కర్మ యనునది యుత్తరసంయోగ పర్యంత ముండును. సౌందర్య మాపాదించు నీ క్రియ సవిలాసక్రియ యగును. కాగా కరణము నృత్తకరణ మనియె పిలువ దగియున్నను ఏకదేశము చెప్పినను సర్వము చెప్పినట్లే యగునని కరణ మనునామమున వ్యపదేశించు చున్నారు. భీమసేనుని భీమ ప్రయోగమున పలుకుచున్నారు కదా! అట్లె నృత్తకరణము కరణ మయినది.

## నృత్తమాతృక

నృత్తకరణములు రెండున్నచో నృత్తమాతృక యని పేరు. నృత్తము యొక్క మాతృక నృత్తమాతృక. అంగహార స్వరూప మయిన నృత్తమున కిది యుత్పత్తి కారణము. నృత్తమాతృక కరణ మాతృక కన్న భిన్నము. రెండు నృత్తమాతృకలు గాని మూడు గాని నాలుగు గాని కూడుకొనినచో సంగహారము నిష్పన్న మగును. రెండు కరణములు ప్రయోగించినంత మాత్రమున సుప్రయోగము రాదు. కరణద్వయ ముపయోగించుటయె కాక ఇంక "నీతడు నృత్త మొన రించు" నను భావ ముదయించి నప్పుడె నృత్తమాతృక చెప్పుటచే సంగహార సామాన్య లక్షణము సూచించి నట్లగును. మూడు నృత్త మాతృక లున్న 'కలాపక' మని నాలు గున్న 'మండక' మని యయి దున్న 'సంఘాతక' మని యనుచున్నారు. ఆరు కాని యేడు కాని యెనిమిది కాని తొమ్మిది కాని కరణము లున్నచో సంగహారము లుత్పన్నము లగును. హస్తపాదాది వికల్పన రూప మయిన కరణము వివేచించుట యంతయు సంగహారములకు సంబంధించుటచే నని తెలియవచ్చును. 'చారి' మొదలగునవి నాట్యజ్ఞానమున విదితము లగును. నృత్తహస్తములు నట్లె గోచరము లగును. అందుననె వాని నిరూపించుట కన్న కరణములను నిరూపించుట సముచిత మగును.

కరణముల ష్టోత్తరశతమున్నవి. వాని నామములు.

౧ తలపుష్పపుటము
వర్తితము
వలితోరువు
అపవిద్ధము
౫ సమనఖము
లీనము
స్వస్తికరేచితకము
మండలస్వస్తికము
నికుట్టకము
౧౦ అర్ధనికుట్టకము
కటిచ్ఛిన్నము
అర్ధరేచితము
వక్షఃస్వస్తికము
ఉన్మత్తము
౧౫ స్వస్తికము
పృష్ఠస్వస్తికము
దిక్స్వస్తికము
అలాతకము
కటీసమము
౨౦ ఆక్షిప్తరేచితము
విక్షిప్తాక్షిప్తకము
అర్ధస్వస్తికము
అంచితము
భుజంగత్రాసితము
౨౫ ఊర్ధ్వజానువు
నికుంచితము
మత్తల్లి
అర్ధమత్తల్లి
రేచకనికుట్టితము
౩౦ పాదాపవిద్ధకము
వలితము
ఘూర్ణితము
లలితము
దండపక్షము
౩౫ భుజంగత్రస్తరేచితము
నూపురము
వైశాఖరేచితము
భ్రమరకము
చతురము

౪౦ భుజంగాంచితము
దండరేచితము
వృశ్చికకుట్టితము
కటిభ్రాంతము
లతావృశ్చికము
౪౫ ఛిన్నము
వృశ్చికరేచితము
వృశ్చికము
వ్యంసితము
పార్శ్వనికుట్టకము
౫౦ లలాటతిలకము
క్రాంతకము
కుంచితము
చక్రమండలము
ఉరోమండలకము
౫౫ ఆక్షిప్తము
తలవిలాసితము
అర్గలము
విక్షిప్తము
ఆవర్తము
౬౦ డోలాపాదము
నివృత్తము
వినివృత్తము
పార్శ్వాక్రాంతము
నిశుంభితము
౬౫ విద్యుద్భ్రాంతము
అతిక్రాంతము
వివర్తితకము
గజక్రీడితకము
తలసంస్ఫోటితము
౭౦ గరుడప్లుతకము
గండసూచి
పరివృత్తము
పార్శ్వజాను
గృధ్రావలీనకము
౭౫ సంనతము
సూచి
అర్ధసూచి
సూచీవిద్ధము
అపక్రాంతము
౮౦ మయూరలలితము
సర్పితము
దండపాదము
హరిణప్లుతము
ప్రేంఖోలితము
౮౫ నితంబము
స్ఖలితము
కరిహస్తకము
ప్రసర్పితకము
సింహవిక్రీడితము
౯౦ సింహాకర్షితకము
ఉద్వృత్తము
ఉపసృతము
తలసంఘట్టితము
జనితము
౯౫ అవహిత్థము
నివేశము
ఏలకాక్రీడితము
ఊరూద్వృత్తము
మదస్ఖలితకము
౧౦౦ విష్ణుక్రాంతము
సంభ్రాంతము
విష్కంభము
ఉద్ఘట్టితము
వృషభక్రీడితము
౧౦౫ లోలితము
నాగాపసర్పితము
శకటాస్యము
౧౦౮ గంగావతరణము

ఈ కరణము లష్టాధిక శత మనుట యంగహారోపయోగమును భావించుటచే గలిగినది. కరణము లిన్నియే యనుట దీని తాత్పర్యము కాదు. కరణము లెన్నియో కలవు. వానిలో అష్టోత్తరశతము మాత్ర మిచట నిర్దిష్ట మయిన దని తాత్పర్యము. కొన్నిగతులలో నీ యష్టోత్తరశతమె యుపయోగించు నను రీతి లేదు. ఇంక నితరము లపేక్షితము లగుచున్నవి. ఈ యష్టోత్తరశత విభాగ మంగహారోద్దేశమున నిరూపిత మయిన దని గుర్తించుట యుచితము.

౧౧౬. నృత్తే యుద్ధే నియుద్ధే చ తథా గతిపరిక్రమే
గతిచారే ప్రవక్ష్యామి యుద్ధచారీవికల్పనం
యత్ర తత్రాపి సంయోజ్య మాచార్యై ర్నాట్య శక్తితః

అభినయమం దొకవిధ మగు నృత్తము ప్రయోగించుట కలదు. అప్పు డభినయమున కభినయమున కంతరాలములో పూరణ మునకై కరణప్రయోగ ముపకరించును. శస్త్రాదులచే నొనర్పు యుద్ధములో కరణము లుపయోగించును. బాహుయుద్ధమున నంగ ప్రయోగ సౌష్ఠవ మునకును కరణ ముపయోగించును. వేరుగా గత్యధ్యాయములో నిరూపితములగు గతులు చాలకలవు. ఆ గతులలో గొన్ని పరిక్రమణము లున్నవి. వానిలో నివి యుపయోగించును. ఈ చెప్పిన కరణము లా గతి పరిక్రమములలో గొన్నిట గోచరింపవు. అన్యవిధములగు కరణము లచట భాసించును. కొన్ని గతివిధానములు ముందు నిరూపితము లగును. వానిలోయుద్ధగతుల విశేషము లుండును. ఈ చెప్పిన వాని యం దన్నిటను ప్రస్తుతము నిరూపించిన కరణము లుపయోగింప గలవు. నాట్యాచార్యులు నాట్యశక్తి ననుసరించి వీనిలో కరణముల ప్రయోగింప వచ్చును.

### సామాన్యరూపము

౧౧౮. ప్రాయేణ కరణే కార్యో వామో వక్షఃస్థితః కరః
చరణస్యానుగశ్చాపి దక్షిణస్తు భవేత్కరః

కరణము లందు సామాన్యముగా వామకరమును వక్షఃస్థలముపై నుంచవలెను. దక్షిణ హస్తమును చరణసంచారమున కనుకూలముగ నుంచవలెను. హస్త పాదప్రచారము ననుసరించి కటి పార్శ్వోరూరః పృష్ఠోదరము లెట్లెట్లు సంగతములు సుసంగతము లగునో తెలియ వచ్చును. అంగోపాంగముల సహాకారమున హస్త పాద ప్రచారము గుర్తించిన కరణములు గోచరము లగును. కరణములకు సంబంధించిన మహాసామాన్య రూప మిదిగో!

౧౧౯. యాని స్థానాని యాశ్చార్యో నృత్తహస్తాస్తథైవ చ
సా మాతృకేతి విజ్ఞేయా తద్యోగాత్కరణం భవేత్

కరణ ప్రయోగము నం దవస్థానము గతి యను రెండు ముఖ్యముగా నిర్వర్తింప దగినవి. అవస్థానము= స్థితి. అం దవస్థానమున "స్థానకము" కరణమున కుపయోగించును. గతిలో చారీవిధానము లుపయోగించును. దేహములోని పూర్వకాయమున గతిలో నృత్త

హస్తములు దృష్టులు నుపయోగించును. స్థితిలో పతాకాది హస్తము లుపయోగించును. తను- గతి- స్థితి- సంమేలనమున సాధన మగు కరణ మనంతరూప మగును. అయినను అంగహారముల కుపయోగించు నంతగ ప్రకృతము కరణములు పరిగణితము లయినవి. కరణములలో ప్రధానముగా నొక్కొ-కచోట వాక్యార్థాభినయముండును. వాక్యార్థాభినయము ప్రదర్శించు నప్పుడు కరణములకు ప్రాధాన్యముండును. వేరొకచో పదార్థాభినయము ప్రదర్శింప వలసి యున్నప్పుడు ఏకవాక్యతా సంపాదనమున ముఖ్యవాక్యార్థాను ప్రవేశమునకు ప్రాధాన్యము నిరూపించుటకును ఆది మధ్యావసానము లందవసరానుకూలముగా కరణముల ప్రయోగింప వలెను. ఇట్టి యీ యంశము ఇం "దుపనిషత్తు". కరణముల ప్రయోగించు నప్పు డొక సావధానత యపేక్షితము. ఒక కరణములోని హస్త పాద విన్యాసములను విడిచి వేరొక కరణములోని హస్త పాద విన్యాసములను స్వీకరించు నపుడు వర్తన క్రమమునవిడుచుట కాని స్వీకరించుట కాని విడివడి పోకుండునట్లు పరిశీలింపవలయును. ఇట్టి యీ యంశములు నృత్తాచార్య గోపితములు. కరణములు వాక్యార్థాభినయమున నుపయోగించు నట్లు చూడవలెను. అంతియె కాని; మునికాళ్ళపై నిలబడి కుసుమాంజలి క్షేప మొనరించుటకు వలయు నంత నృత్తము మాత్ర ముచితము కాదు. పుష్పముల వెదజల్లుట కుపయోగించు నృత్తకరణము కూడ ముఖ్యవాక్యార్థమున కుపకరించు నట్లు సమీక్షించుట ముఖ్యకర్తవ్యము. హస్తా చిత్యానుసారముగా పాదయోగ ముండ వలె ననియు నృత్తాచార్యులందురు. రోష వాక్యార్థాభినయమున వర్తితకరణ ముపయోగించును. ముగ్ధా విషయమున వలితోరుక ముపకారి. అసూయా కోపవాక్యార్థమున నపవిద్ధ కరణ ముద్దిష్టము. కొంద రిది మునివిషయము కా వచ్చు ననిరి. లీన మను కరణము ప్రియప్రార్థనా వాక్యార్థము నభినయించుట కుపకారి. మండలస్వస్తిక కరణము తిరస్కారవాక్యార్థమున సహకరించును. నికుట్టన మనునది మాటిమాటి కాత్మగౌరవము భావించు కొను వాని సంభావనా ముఖ్య మయిన వాక్యార్థ మభినయింప వలసి యున్నప్పుడు ప్రయోగింప వలెను. అర్ధనికుట్టకము కూడ స్వాత్మసంభావనా విషయమున

నుపకారి. విస్మయప్రధాన వాక్యార్థాభినయమున కటిచ్ఛిన్న కరణముపకరించును. అసమంజస చేష్టా ప్రధాన వాక్యార్థమున అర్థరేచితకము వక్షః స్వస్తిక మను కరణ మందు హస్త పాద స్వస్తిక విధానము సౌష్ఠవముతో నుండును గావున నృత్తయోగ ముండుటను బట్టి సౌష్ఠవ ప్రాధాన్య మూహింప వలెను. ఉన్మత్తక కరణమునకు అతిసౌభాగ్యాదుల వలన జనించిన గర్వము విషయముగా ప్రయోగ ముండును. కరణార్థు లగువారు స్వస్తికమును చక్కగా సమీక్షింప వలెను. సాధారణముగా కరణక్రియ వాక్యార్థాభినయ లక్షణ మని నృత్తాంగహార రూప మని విశదమె. గతి పరిక్రమాది స్వభావముగా నుండు దీనిగుర్తించు వారె కరణప్రయోజనము గాంచ గలరు. సర్వకరణముల కిదియె ప్రయోజనము. ద్వేషణము నిషేధము రాహస్య రూపమయిన వాక్యార్థము నభినయించు నప్పుడు స్వస్తిక కరణము సహకరించును. పృష్ఠస్వస్తికము కూడ స్వస్తికము వలెనె ప్రయోగింప దగినది. పృష్ఠమున హస్తముల స్వస్తిక మిష్టపడుట వలన యుద్ధవిషయ పరిక్రమమున దీని ప్రయోగము కొందర రాకాంక్షింతురు. దిక్స్వస్తిక కరణము గీతపరివర్తములలో నుపయోగింతురు. గాన మొనరించు నప్పుడు గీతివశమున శరీరము మాటిమాటికి పరావర్తనము పొందును కదా! అప్పు డీ కరణ ముండును. లలితనృత్త విషయమున అలాతక కరణ ముపకారి. సూత్రధారుడు జర్జరము నభిమంత్రించు సమయములో కటీసమ మను కరణము ప్రయోగింప వలెను. ఆక్షిప్తరేచితమును త్యాగోపాదానముల పరస్పరసంబంధ స్వరూపములు కల వాక్యార్థ మభినయింప వలసి యున్నప్పు డాక్షిప్తరేచిత మనుసరింప వలెను. విక్షిప్తాక్షిప్తక కరణము ప్రధానవాక్యార్థమున ప్రయోగింప దగినది. కరణము లం దంతట నభినయహస్తములు ప్రధానములు. అభినయ హస్తము లున్ననె కరణములు సిద్ధము లగును. ఈ కరణమును వాక్యార్థాభినయము నందె ప్రయోగింప వలెను. మరికొందరిట్లును భావింతురు. "ఒకప్పుడు కొన్ని యంగములు (అప్రధానములు) మోద మిచ్చునవి కా గలవు. వాని మోదరక్షణ మావశ్యకము. కావున తత్తదనుకూలముగ నభినయముల యంతరాలములందు ప్రయోగింప వచ్చును. అట్లే గతిపరిక్రమములో తాలాంతర

సంధానములో యుద్ధ నియుద్ధ చారీ స్థానకము లందు గతిసంచారము లందు ప్రయోగింప వచ్చును'' అని. కాని కేవలము వర్తనమె ప్రధానముగా నున్న కరణమును, నృత్తహస్తమె ముఖ్యముగా నున్న కరణమును ప్రధానముగా నృత్తమున ప్రయోగించుటలో నౌచిత్యముండదు. ఈ విషయము నంతట ననుసరింప వలెను.

అర్ధస్వస్తిక కరణములలో నభినయహస్త ముండదు. పాదములె స్వస్తికాకృతి కల వగును. అంచితకరణమును స్వాతిశయకరణములో ప్రయోగింప వలెను. నిర్వాణముఖ్య మయిన వాక్యార్థమున ప్రయోగింప వలెను. భుజంగత్రాసిత కరణము గతి సంవర్తములో నుపయోగించును. నృత్త మిదంపూర్వమె కాదు. అనిదంసిద్ధము. అనాది సిద్ధము. దీని నామమె యీ భావము సూచించును. దీనిలో సశంకిత దృష్టి కలదు. సమీపములోని సర్పము వలని త్రాసావేశము కల వాని గతివలనములో నిది యుండును. పాదవశమున హస్తములు వ్యావర్తితములు పరివర్తితము లగును. ఒక హస్తము దోలాహస్తము. మరి యొకటి ఖటకాస్యము. ఇది భుజంగత్రాసితము. దీని నామసాదృశ్యమున భుజంగత్రాసిత మను చారి (గతివిశేషము) నుందు నిరూపిత మగును. ఇట్లే కరణ నామ తుల్యనామములు కల సర్వచారీ విధానము లందు నిది చెప్ప కొనవచ్చును. నికుంచిత కరణ మాకాశగమనమున కున్ముఖమై వితర్కము ప్రణిధానము ప్రధానముగా నున్న వాక్యార్థాభినయములో నుపకారి. ''ఇదిగో! నే నాకాశమున విలంబము లేక వేగమున సంచరింతును'' అను హనుమద్వాక్యము నభినయించు నప్పుడు నికుంచిత ముండ వలయును. మత్తల్లికరణము మదన మత్తు లయిన వారి విషయమున నుండును. ''మదనం మత్తం తనోతీతి మత్తల్లి.'' మత్తల్లి చారియు నున్నది. దమ మదన మత్తుల ఘూర్ణన ముపసర్పణ మీ కరణము సూచించును. అర్ధమత్తల్లి తరుణమదవిషయమున ప్రయోగార్హము. సవిలాసనృత్తములో లలితకరణ ముపకారము. ఉద్ధత పరిభ్రమణములో భ్రమరకము కలదు. విదూషకుని విస్మయముతో సూచించు నభినయాదులలో చతుర కరణ ముండును. దీనిలో సన్నివేశాధిక్య మున్నది. ప్రమోదనృత్తములో ఉద్ధతవిధా

నములో దండరేచిత కరణ మున్నది. వృశ్చికకుట్టిత కరణము విస్మయ మాకాశగమనేచ్ఛ ప్రధాన మయిన వాక్యార్థ విషయమున ప్రయోగించుట కుపయోగించును. గతి పరిక్రమములో కటిభ్రాంత కరణ ముపకారి. లతావృశ్చికము గగనము నుండి భూమిపై పడుటలో నుపయుక్త మగును. ఛిన్న మన్న కరణము అంగప్రతిసారణములో తాలగతి చెదురచేయుటలో నుపకరించును. ఆకాశయానకమున వృశ్చిక రేచిత కరణము, ఐరావణ మాకాశగతి నొనర్చుటలో వృశ్చికకరణ ముపయుక్త మగును. వృశ్చిక పుచ్ఛముగా చరణము ప్రయోగించుటలో నిది కల్గును. వ్యంసిత మను కరణము విభ్రమాది పరిక్రమ విషయముగా నుండును. ప్రకాశనము సంచరణము ముఖ్య మయిన వాక్యార్థమున పార్శ్వనికుట్టక మనే కరణ ముపకారి. విద్యాధర గతి విషయమున లలాటతిలక కరణము, ఉద్ధత పరిక్రమములో క్రాంతక కరణము, నిర్భరానంద పూర్ణ దైవతాభినయ విషయమున కుంచిత కరణము, ఉద్ధతపరిక్రమ పరిష్కరణాది విషయమున చక్రమండలము విదూషకుని గతివిషయమున ఆక్షిప్త కరణము నుపయోగించుట యున్నది. తలవిలాసిత కరణమును సూత్రధారాది విషయమున నాట్యాచార్యులు యోజనము చేయుదురు. అంగదుడు మొదలగు వానరుల నొన రించు దేహ నియంత్రణము కల పరిక్రమణములో నర్గల కరణ ముప యుక్త మగును. విక్షిప్త మను కరణ ముద్ధత గతి పరిక్రమ సూచ నమున నుపకారి. ఆవర్త మనెడు కరణము నాయకుడు నాయికను సమీపించుటలో నుండును. వివృత్తము నుద్ధతగతి పరిక్రమమున నుప యోగింతురు. వినివృత్తము కూడ తాదృశమె. పార్శ్వక్రాంత మను కరణము రౌద్రప్రధాన మయిన భీమసేనాదుల పరిక్రమములో నుప యోగి యగును. నిశుంభితము పాదముచే నేల ఘట్టించుట యుండును గావున మహేశ్వరాభినయ విషయము. విద్యుద్భ్రాంత ముద్ధత గతి పరిక్రమాది విషయముగా నుండును. అతిక్రాంతము కూడ గతి పరి క్రమాదివిషయమె. సాధారణముగా కరణముల నామములు సార్థ కములు గనె యున్నవి. వాని పేరుల బట్టియే వాని వినియోగము గుర్తింప వచ్చును. గజక్రీడిత మను కరణము నామోచిత విషయ మున ప్రయోగార్హము. గరుడప్లుతక మిట్టిదె. గండసూచీ కరణమును

గండస్థల మందలి ప్రధాన భూషణాభినయమున ప్రయోగింతురు. పార్శ్వజాను వనుకరణము యుద్ధనియుద్ధము లం దుపకారి. సూచీ విద్ధము చింతావిషయము. మయూర లలిత కరణము మయూర నృత్తానుకారి. సర్పిత కరణ మను నామమె పాదముచే గలిగిన మదోపసర్పణ విషయ మని సూచించును. సాటోప పరిక్రమములో దండపాద ముండ వలెను. ఖేచర సంచార విషయములో ప్రసర్పితక మనే కరణము కావలెను. సింహవిక్రీడితము రౌద్రగతివిషయము. సింహాద్యభినయ విషయముగా సింహాకర్షితక మున్నది. వినయముగా సమీపమున కుపసర్పించుటలో నుపసృతక కరణ మున్నది. అనుకంపా ప్రధాన మయిన వాక్యార్థ మభినయించు నప్పుడు తలసంఘట్టితము కావలెను. గోపన ప్రధాన మయిన వాక్యార్థమున నవహిత్థ ముప యుక్త మగును. ఇదియె చింతా దౌర్బల్య విషయ మనియు నందురు. ఏలకాక్రీడిత మను కరణమున పతనకాలమున శరీరము వంగును. వల నము పొందును. ఈ పేరుతో చారి కూడ కలదు. అధమప్రకృతి కల వారి గతి విషయమున నీ కరణము సంగత మగును. ప్రణయ కోపేర్ష్యా ప్రార్థనాది విషయముగా ఊరూద్వృత్త మను కరణము ప్రయోగిం తురు. మద్య మద విషయకముగా మదస్ఖలిత కరణ మున్నది. విష్ణు క్రాంత మను కరణము విష్ణువున కిట్టి క్రమణ మున్నదని సూచించును. తద్విషయమున దీని ప్రయోగింతురు. సంభ్రాంత కరణము సంభ్రమ పరిక్రమ విషయము. ఉద్ఘట్టిత కరణము ప్రమోదవిషయకముగా నుం డును. నాగాపసర్పితము పర్యాయశః పార్శ్వములలో కుటిలగతితో నుండును. ఇది తరుణమద విషయము. శకటాస్యము శకటానుకూల మయిన బాలక్రీడాది విషయమున ప్రయుక్త మగును. గంగాదేవి యవతరణము గంగావతరణములో గోచరించును. తన్నామమే తత్కరణ విషయము సూచించు చున్నది. ఇట్లు నూటయెనిమిది కర ణములలో గొన్నిటి కిచట యథాసంభవముగా విషయము సూచిత మయినది. వీని లక్షణములు విపులముగా వ్యాఖ్యేయములు. సంగ్ర హాత్మక నాట్యవేదమున నవి చేర లేదు.

౧౨౦. యాని స్థానాని యాశ్చార్యః వ్యాయామే గదితాని తు
పదప్రచారస్తేషాం తు కరణానామయం భవేత్

౧౨౧. యే చాపి నృత్తహస్తాస్తు గదితా నృత్తకర్మణి
తేషాం సమాసతో యోగః కరణేషు విభావ్యతే

౧౨౨. చార్యశ్చైవ తు యాః ప్రోక్తా నృత్తహస్తా స్తథైవ చ
సా మాతృకేతి విజ్ఞేయా తద్భేదాత్కరణాని తు

వ్యాయామమున నిరూపించిన స్థానములు చారీవిధానములు సదప్రచారము సర్వము నీ కరణములకు సంబంధించును. నృత్త కర్మలో నిరూపితము లయిన నృత్తహస్తముల సంబంధము ఈ కర ణము లందు విస్పష్టముగనె యవభాసించును. సాధారణముగా కర ణము నందు వామహస్తము వక్షమున నుండ వలెనని దక్షహస్తము చరణానుగతముగా నుండ వలెనని యిది వరలో నిరూపితమె. చారీ విధానములు నృత్తహస్తములు మాతృక యని చెప్ప దగినవి. ఆ మాతృకా విశేషములె కరణము లని గుర్తింప వలెను. కరణము లనంతము లగును. వానిలో గొన్నిమాత్రమె యిం దుద్దిష్టము లయినవి. ఆ యుద్దేశ నిర్దేశము లన్నియు నంగహారానుకూలత్వము ననుసరించిన వని విశదమె. ఆ యీ కరణము లష్టోత్తరశతము. కర ణము లష్టోత్తరశత ముద్దిష్టము లయి నందున తదనుసారముగ అంగ హార వికల్పనము సంభావనీయము.

## అంగహారము

స్థిరహస్తము ఈ యంగహారము హరప్రియము. అన్నియు హర ప్రియములె. హస్తపాదాదుల యౌచిత్య యుక్త మయిన వర్తనము వలన మున్నందున నంగహార మవిచ్ఛిన్నము శుభము నగును. నానా కరణముల సమాహార మిందున్నను ఏకబుద్ధి కలుగుట యంగహారము లం దావశ్యకము. వీని యనుసంధాన మొక యోగముగా సమాధిగా నగును గావున నివి భగవానునకు ప్రీతి నాపాదింప గలవు. కరణ సమూహముల సమ్యగ్యోజనమున నంగహారము నిష్పన్న మగును. కరణము లం దుపయోగించు సర్వేంద్రియములు సర్వదిక్కులలో ప్రయోగింప వలెనని నాట్యాచార్యులు సంభావింతురు. అంగహార ముల ప్రయోగ మంతయు సామాన్యముగ నదృష్టార్థమె. యుద్ధము నియుద్ధము నివి యొకప్పుడు విషయముగా జేసికొన వచ్చును. అంగ

హారములను ప్రయోగించు నప్పుడు వెంటనె వాని ప్రయోగఫలము విశదము కాదు. "ఈ విక్షేప భావ మిది, ఈ వర్తన తాత్పర్య మిది." అని గోచరము కాదు. దాని ఫలము దూరముగా భావింప దగినదిగా నుండును. మొత్తముపై మహావాక్యార్థమున కవి శోభా సంపాదకము లగును. అందుకనె వాని ప్రయోజన మదృష్టరూప మనుట. వీని పూర్వాంగోత్తరాంగముల స్వరూపవివేకముతో ప్రయో జనము గుర్తింప వచ్చును. మొదటనె "స్థిరహస్తమున కేమి ప్రయో జనము? అది యిది." యనునట్లు చెప్పబూనుట వృథా నిర్దేశనా యాసము. సాధారణముగా నంగహారములలో సర్వసామాన్యము లయినవి ప్రసారణాసారణము లుండును. అంగహార ప్రయోగము లందు వానిని ప్రయోగించ వలెనని కొందరందురు. కాని యా యా యంగహారములకు సముచితము లయిన వాని నూహించి ప్రయో గింప వలెను. కొన్ని యంగహారములకు కొన్ని కరణము లవశ్య ముగా నుండవలెనని నియమ మున్నది. ఆ నియతము లయిన కరణ ములను ముఖ్యముగా ప్రయోగింప వలెను. వాని నతిక్రమించుట తగదు. "శ్రుతహానౌ కో గుణః." అంగహారములను ప్రత్యేక దృష్టితో ప్రయోక్తలు పరిశీలింప వలెనని భరత సంకేత మున్నది. స్వయము ప్రయోగ కుశలు రగువారు గమనింప దగిన విశేషము లున్నవి. బాగుగా నవయవగతిని గుర్తించిననె యీ విషయమున సమ్యగ్విజ్ఞానము కలుగును. కాకున్న దీని తత్త్వము తెలియ శక్యము కాదట! సాధారణముగా నాట్యస్వరూప తత్త్వవిదులు కరణములలో మధ్యవర్తనము (నడుముకదలుట) కలదని శిరో భ్రూ నేత్రాది కర్మలు కలవని యంశాంతముగా నొకయోజనము చేయగలరు. ఇట్టివి వీని యం దున్నట్లు వారు నంగీకరింప గలరు. అట్టి కుశలురె వీని నుపదేశమున గుర్తింప నర్హులు. గుర్తించి ప్రయోగించుటకు శక్తు లగుదురు. స్వరూప తత్త్వవిదులు కానివారు ఎంత చెప్పినను ప్రయోగింప శక్తులు కారు. వారలకు నిరూపించుటయు శక్యక్రియ కాదు. ఒకవిధముగా మాత్రము దీని విషయము కొంత గుర్తింప వచ్చును. గీతము వాద్యము లయ యతి మొదలగు వాని వివేకమున వాక్యార్థము భావించి యోజన చేయ వచ్చును. యోజన మనునది

కూడ ఒకవిధమున లేదు. అనంతముగా నున్నది. సుశిక్షితు డయిన లక్షణకారుడు కూడ ప్రతిపదము లక్షణ మొనరింప శక్తుడు కాడు. కాని యట్టిపా డొకటి చేయ వచ్చును. "ఈతడీ యంగహారముల నిట్లు ప్రయోగించినాడు. దీనిలో నీ కరణము లున్నవి. దీని తరు వాత దీని ప్రయోగించినాడు. ఇట్లు దీని యనంతరము దీని ప్రయో గింప వలయును." అని స్మృతిశక్తితో నంతయు భావించి స్వాత్మ యోజనములో కొంత సంధానము సంభావింప గలడు. ఇది యిందలి ప్రక్రియావివేకము. దీని యందు కూడ కొంత నియమన ముండును. దాని సావధానముగా గుర్తింప వచ్చును. ఒక్కొక యంగహారమున నియతముగా నిన్నియే కరణము లుండు నన్న వ్యవస్థ లేదు. వాని వాని రీత్యనుసారమున నాలు గయి దా రెనిమిది పది పండ్రెం డెన్ని యేని యుండును. కొన్నిటిలో ప్రయోగించిన కరణములనె మఱల మఱల నావృత్తము చేసి ప్రయోగించుటయు నున్నది. అప్పు డొక విధమయిన చిత్రగుంభనము కుదురు కొనును. మదవిలసిత మనే యంగహారములో కరణసప్తకము మూడు పర్యాయము లభ్యాసము (ఆవృత్తి) పొందును. అప్పు డిరువది యొకటి కరణముల ప్రయోగ ముల "మదవిలసితము" పూర్ణ మగుచున్నది. పరివృత్తరేచిత మను నంగహారమున "పరాఙ్ముఖవిధి ర్భూయ ఏవమేవ భవేదిహ" యని యనుట సాభిప్రాయముగ నున్నది. పరాఙ్ముఖ మగు విధానము మఱల మఱల నట్లె యట్లె యుండవలయు నట! సాధారణముగా నంగహారము లన్నిటిలో నానాకరణము లుండును గావున చివరి రెండుకరణములను విడిచి మిగిలిన కరణములను నలుదిశలందు ప్రయో గింప వలెను. ఆ యా కరణము లం దా యా వర్తనముల నిర్వర్తింప వచ్చును. తుది రెండు కరణములను మాత్రము చివరికి సమ్ముఖమున ప్రయోగించి యా యంగహారమును సంపూర్ణము చేసి ముగింప వలెను. ఇది సాధారణముగా నంగహారముల విధివిధానము.

## రే చి త ము

ఇరువది యేడ వకరణము. రేచితము హస్తరేచనములు దీనిలో నన్నియు సంగృహీతము లగును. కరణములలో హస్తరేచనము కలవి,

కొన్ని యున్నవి. వాని నిందు చక్కగా పట్టవలయును. సుశ్లిష్టాంగము లయిన యితర కరణములను చిత్రముగా రమ్యముగా యోజనము చేయవలయును. స్వయముగా తన పనిని తాను నిర్వహించు కొను నప్పుడు స్వబుద్ధి సమాలోచనమున స్వకార్యసిద్ధి నెట్లు సమీక్షించు కొనునో యట్లే యంగహారమును యోజనమున చిత్రముగా నిష్ప న్నముచేయవలసి యున్నది. నానాకరణముల నంగహారములందు ప్రయోగింప వలెనని నిరూపించిన స్థలములం దౌచిత్యము ననుసరించి యీ భావమును గుర్తించ వచ్చును. ఎన్నియోకరణములను ప్రయో గింప వలసిన దాని లక్షణము నిర్దేశించినను వేని ప్రయోగమున రమ్యత కలుగునో సమీక్షించుట యావశ్యకము. అట్టి సమీక్షానుసా రముగ నా యీ కతిపయ కరణములనే ప్రయోగించునది. కాని ప్రయోగమునందు వెలితి లే కుండునట్లు అసంగతము కాకుండునట్లు సరిచూచు కొన వలయును. ఇదియే యుక్తి సంధిసంధ్యంగములందు స్పష్టము కా గలదు. రేచితాంగహారము విచిత్రభేద సంకీర్ణ మని కీర్తించి నారు. ఒక శివభావన కవి

> "పంచవింశతి విచిత్ర మాతృకా
> ప్రక్రమేణ వివిధం వ్యరీరిచత్
> రేచితాంగహరణం మహేశ్వరో
> యోగమార్గమివ సప్తభిః స్వరైః"

యనినాడు. వర్ణామ్నాయములో నొక కల్యాణాత్మక మయిన భావ మున్నది. అది యీ శ్లోకమున నున్నది. అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ అను సప్తస్వరములు మిగిలిన సర్వవర్ణములకు మూల హేతువులు. ఆ యేడు వర్ణముల ననుసరించియే "క, చ, ట, త, ప" పంచ వర్గముల లోని యిరువది యయిదు వర్ణము లావిర్భావము పొందును. యకా రాదుల యుత్పత్తియు నిట్లే సంగత మగును. పంచవింశతి విచిత్ర మాతృకల క్రమమున వివిధ వర్ణముల విశ్వము వచ్చుచున్నది. రేచి తాంగహారము విచిత్ర భేద సంకీర్ణము కదా! యోగప్రక్రియాను సారమున నిది కలుగును. మహేశ్వరుడు రేచితాంగహరణము రచ నము చేసినాడట! ఇందలి శివాత్మక మయిన శివ భావభార మాత్మ

సంవాద మున గుర్తింప వలసి యున్నది. ఇట్లనుట సర్వకరణాంగ హారము లందు యోగసాధన మున్నదనుట.

ఈ నిర్దిష్టము లయిన యంగహారము లన్నియు కరణాశ్రితములు కదా! వీని పరిమాణము కొంత సంకేత సిద్ధముగా నున్నది. కరణ ముల ప్రయోగముల లోని యంశాంశముల కాలక్రమమును సరిగా నిర్వహించినచో తగిన వర్తనా క్రమమున కరణముల సమ్యక్కర ణము సంగత మగును. కరణ ప్రయోగము చక్కగా నుండును. కొన్ని యంగహారములలో నారు కరణము లున్నవి. కొన్నిటిలో పంద్రెండున్నవి. మరి కొన్నిటిలో నిరువది నాలుగున్నవి. ఈ కర ణము లొకటి రెండావృత్తములతో కూడి యున్నపుడు వాని కాల పరిమాణ మొకవిధముగా నుండును. తాళ వాద్య గతుల కాలమును గూడ నందు గణింప వలసి యుండును. ఈ తాల కాలాదులను గూడ కలియ కలుపు కోగా త్ర్యశ్ర గతి మానమున నుండునవి పదునారును, చతురశ్ర తాలవిషయములు పదునారును సిద్ధము లగును. మొత్తమీ విధముగా నంగహారములు ముప్పది రెండు. ఒక కరణములో కాల క్రమము కొంత తక్కువ యయినను అదే యంగహారము లోని మరొక కరణ క్రియలోని తాళవిధానమున నిది యంతయు సమ ముగా సర్దుకొనును.

౧౭౩. ద్వాత్రింశదేతే సంప్రోక్తా హ్యంగహారా ద్విజోత్తమాః
చతురో రేచకాంశ్చాపి గదతో మే నిబోధత!

భరతు డనుచున్నాడు. ద్విజోత్తములారా! అంగహారములు ముప్పది రెండు సంకీర్తితము లయినవి. వీని కుపకరించు రేచకము లున్నవి. వాని నిక నిరూపింప వలెను. వాని గుర్తింపుడు! పాద రేచక మొకటి. రెండవది కటిరేచకము. మూడవది కరరేచకము. నాల్గవది కంఠరేచకము. పాదముల రేచనమె కాని పార్శ్వభాగముల రేచనము కాదు. రేచన మనునది యటు నిటు కదలిక. అంగుష్ఠా గ్రము అంతః బహిః సన్నతమై నమన మున్నమనము కలిగి గమనము కలదగుటయు నిందు పరిగ్రాహ్యము. కర రేచన మనుట హస్తముల చలనము. పర్యాయముగా ద్రుత భ్రమణ ముద్దిష్ట మగును. కంఠ

రేచకము. గ్రీవా రేచకము. మెడ కదలుట. కటిరేచకము = కటి చాలనము. నడుము కదలుట. ఇట్టి వివి "వైశాఖరేచిత" మను కరణమున సంగృహీతములు. కేవల మటు కరణములలో నంగహార ములలో కలసి యుండుటయు కాక వీనికి దృష్టార్థత యున్న దనియు విశదము చేయుటకె యిచట వేరుగా చెప్పవలసి యున్నది. ఈ రేచ కము లందు సుకుమారము లయిన గీతములు వాద్యములు ప్రధా నముగా నుండు ప్రయోగముననె వీనిని ప్రయోగింప వలెను. ఈ కర ణాంగహార రేచకములు పూర్వరంగములకు వైచిత్ర్యమును సంపా దించునవిగానె యుపయుక్తము లగునా ? అను ప్రశ్నకు సమాధాన మిట ప్రస్తుతింపము.

౧౨౪. రేచితాఖ్యః పృథగ్భావే వలనే చాభిధీయతే
ఉత్సాహనా త్పృథగ్భావా చ్చలనా చ్చాపి రేచకః

౧౨౫. పార్శ్వే పార్శ్వే తు గమనం స్ఖలితైః చలితైః పదైః
వివిధైశ్చైవ పాదస్య పాదరేచక ఉచ్యతే

౧౨౬. త్రికస్యోద్వర్తనం చైవ కటివలన మేవ చ
తథాపసర్పణం చైవ కటిరేచక ఉచ్యతే

౧౨౭. ఉద్వర్తనః పరిక్షేపో విక్షేపః పరివర్తనం
విసర్పణం చ హస్తస్య హస్తరేచక ఉచ్యతే

౧౨౮. ఉద్వాహనం సన్నమనం తథా పార్శ్వం చ సన్నతిః
భ్రమణం చాపి విజ్ఞేయో గ్రీవాయా రేచకో బుధైః

వేరుగా నుండుటలో (పృథగ్భావము) చుట్టుకొనుటలో (వల నము) రేచిత పదము నుపయోగింతురు. ఉత్సాహము కూడి యుండు టను, పృథక్స్థితి కలదగుటను, చలన వలనములు కలిగి యుండుటను అవయవముల విన్యాస విక్షేపమును రేచక మనుట యుక్తముగనె యున్నది. పాదరేచకములో పాదముల వివిధములగు సంచలనము లుండును. స్ఖలిత చలిత పదములతో ప్రక్క ప్రక్కలకు గమనము చేయుట పాదరేచక మగును. వివిధములగు పదవిన్యాసములు చిత్ర విచిత్రములుగ నుండును. అందు కొన్ని విన్యాసములు స్ఖలితములు. పదముల తొట్రుపాటందు గోచరించును. కొన్ని విన్యాసములు చలి తములు కదలికలు. ఇట్టి విన్యాసములతో పార్శ్వ పార్శ్వములకు

జరుగుట గమించుట పాదరేచకమని పరిభాషిత మయినది.

కటిరేచకము మరి యొకటి. ఇందు త్రిక ముద్వర్తిత మగును-త్రిక మన్నది పృష్ఠమున పిఱుదు భాగపార్శ్వము. పృష్ఠపీఠము తిరుగుళ్లు పడుట యందుండును. కటి వలిత మగుట యుండును. కటి వలన మనునది నియత మయిన మెలికగా నడుము వంపు సొంపు. పిఱుదుల త్రిపుటలతో కటి సంచలనములతో జరుగుళ్లుండుట కటిరేచక మగును.

హస్తరేచకము మూడవది. హస్తాగ్రముగా చెప్పదగిన హస్తము నిచట హస్తపదమున గుర్తింప వచ్చును. హస్తమునకు సంబంధించిన యయిదు విక్షేపము లిచట ముఖ్యములు. మొదటిది యుద్వర్తనము. హస్తమును బోర్లించుట వెల్లకిల వేయుట లనునవి వరుసలతో గూడిన వర్తనములతో నుండవలెను. పరిక్షేపము రెండవది. హస్తము నటు నిటు విదల్చుట, విసరుట దీని స్వరూపము. మూడవది విక్షేపము. వేగక్రియతో దూరము విదల్చుట. నాల్గవది పరివర్తనము. నానాస్థితికము లయిన హస్తవిన్యాసముల మార్పు. అయిదవది విసర్పణము. విసర్పణము ప్రసర్పణ మొకటి. ఏకస్థానమున నుండుట గాక స్థానాంతరమునకు జరుగుట. ఇట్లు హస్తము నానావిన్యాసములు కలదగుట హస్తరేచకము.

గ్రీవారేచకము నాల్గవది. ఇదియె కంఠరేచకము. గ్రీవారేచనమున ఉద్వాహన మనునది యొకటి యున్నది. ఇది కంఠధారణ స్థితిని సూచించు క్రియ. మరియొకటి సన్నమనము; వంగి యుండుట. మెడవంపులో నిది యున్నది. మెడవంపు లనేకవిధములు. ముందు వెనుకలకు సన్నత మగుట; పార్శ్వములకు సన్నత మగుట. ఇంకను సవ్య మసవ్యముగా మెడను త్రిప్పుట, ఇట్టివి గ్రీవాక్రియలు. ఈక్రియ లుండుట గ్రీవారేచకము. ఈ విన్యాస విలాసముల ననుసరించి నాల్గు రేచకములను గుర్తింప వలెను.

## పిండీబంధము

ఇట్టి విధానములు దేవతా పరితోష మిచ్చును. నానా వైచిత్ర్యము లిందుండుటయె దేవతా తోష కారణము. నానా

విచిత్రతయు పిండీబంధముల నిర్మాణమున సిద్ధ మగును. ఆ యా దేవతల ధ్వజప్రతికృతులుగా పిండీబంధముల నిష్పత్తి యున్నది. ఈ పిండీబంధము లవతరించుటయు నొక రమణీయ సన్నివేశము. ఒకప్పుడు శంకరుడు రేచకములతో నంగహారములతో నృత్త మొనరించు చున్నాడు. అప్పుడు పార్వతీ దేవి సాభిప్రాయముగ చూచినది. దినాంతమునందు సంధ్యా కాల సమయమున ప్రమోద వికాసమయము లయిన యా పుణ్యాత్మక సమయములందు నిత్యము శంకరు డట్లు నిరతిశయముగ నృత్త్య మొనరించుటను పార్వతి భావించినది. శంకర నృత్త్య మది సుకుమారముగ లేదు. సుకుమారప్రయోగ మయినచో బాగుండునని పార్వతి భావనము. అప్పుడిక పార్వతి గజ్జె కట్టినది. అర్థసహితముగా సుకుమార ప్రయోగ మాచరించినది. ఆ యంగ హారములనె యా రేచకములనె పార్వతియు ప్రయోగించినది. శంకరు డెన్నిటి ప్రయోగించినాడో తానును వాని నన్నిటి ప్రయోగించినది. ఆ యంగహార ప్రయోజనమె యీ యంగహార ప్రయోజనమును. అంతయు నొకటిమె. సర్వము సమానమె. కాని యాకార విశేష సంపత్తి యున్నది. శంకరుడు ప్రయోగ పరవశుడై యున్నాడు. పార్వతియు ప్రయోగ సమ్మోదితమై యున్నది. ఇద్దరు ప్రయోక్తలు, ఏకభావమున ప్రయోగించుట — పిండీబంధ — నిష్పత్తికి హేతు వయినది.

దక్షయజ్ఞ సమయమున ప్రహర్ష పరవశు లయిన ప్రమథులు పార్వతీ శంకరుల ప్రయోగము భావించి నానా వాద్యములు ప్రమోగించి నారు. నంది, భద్రముఖ, వీరభద్రాదులు నందిభద్ర దేవతా గణము. వారు మృదంగము, భేరి, పటహము, ఝుంఝు, డిండిమము, గోము ఖము, పణవము, దర్దురము మొదలగు వాద్యములు కూర్చినారు. అప్పుడును మహేశ్వరుడు లయతాల వశముగా నానాంగహారము లతో నృత్య మొనరించినాడు. ఇక నది చూచి హృష్ట పుష్టు లయిన నందిభద్రముఖాదులు "ఒక రిద్దరె కాక నలుగు రయిదుగురును పిండీ బంధ మేర్పఱుప వచ్చు" నని భావించి సలక్షణముగా పిండీబంధముల నిర్మాణించిరి.

| | | |
|---|---|---|
| ఈశ్వర పిండి | — | ఈశ్వరుడు |
| పట్టస పిండి | — | నంది |
| సింహవాహన పిండి | — | చండిక |
| తార్క్ష్య పిండి | — | విష్ణువు |
| పద్మ పిండి | — | బ్రహ్మ |
| ఐరావత పిండి | — | ఇంద్రుడు |
| ఝష పిండి | — | మన్మథుడు |
| శిఖి పిండి | — | కుమారస్వామి |
| రూపపిండి | — | శ్రీదేవి |
| ధారాపిండి | — | గంగ |
| పాశపిండి | — | యముడు |
| నదీపిండి | — | వరుణుడు |
| యక్షపిండి | — | కుబేరుడు |
| హలపిండి | — | బలదేవుడు |
| సర్పపిండి | — | నాగులు |
| గాణేశ్వర పిండి | — | గణపతి |

ఇట్లే యెన్నియో పిండీబంధ విశేషములు నిర్మితము లయినవి. ఆ యా దేవతల క్రమానుసారముగా ధ్వజ వాహనాయుధ రూపముల శోభించు పిండీబంధముల నిర్మాణించిరి. ఈ పిండీబంధములు బహుప్రకారము లగును. ఆధారభేదము, అంగభేదము, ప్రయోగభేదము, ఇట్టి భేదములచే నానాత్వము కలుగును.

భూమి, నాలుగు దిక్కులు, ఆకాశ ద్వయ మని యాధార స్థానము లే డున్నవి. రెండు హస్తములు, రెండు పాదములు, రెండు నేత్రములు, శిరము నని యంగభేదము లేడు. ఒక డగుట యనేకు లగుట యనునది ప్రయోక్తల ననుసరించిన భేదము. అందును సమ ప్రయోగము విషమప్రయోగ మని భేద మున్నది. ఈ ప్రయోగ ములను కరణములతో నిర్వహించుట, అంగహారములతో నిర్వహించుట అనుభేదమున పారమేశ్వర పిండీబంధము లనేక రూపము లగుచున్నవి. ఆ యా దేవతల యా యా ప్రకృతులను తదంతర్భాగ

ములను సూచనము చేయుటకై కేవలము కరణముల ప్రయోగించుట గూడ హర్షదాయి కా గలదు. ప్రధానదేవతోద్దేశమున ప్రవృత్తము లయిన పిండీబంధములు మాత్రమే యిచట నిర్దిష్టము లయినవి. మహాదేవుడు పరశివుడే ప్రధాను డగుట, యాతడు ముఖ్యముగా పరితోషణీయు డగుట ఈశ్వరపిండి నిర్దేశము సముచితముగ నున్నది. శివు డీశ్వర శబ్దవాచ్యుడు. నిర్విశేషరూపుడు. తత్సూచకమె శివలింగాకృతి. తదాకృతి పిండీబంధము శివ పరితోషార్థము.

"పింణ్యా బధ్యతే = బుద్ధౌ ప్రవేశ్యతే ఆధారాంగాది సంఘాతః పిండీబంధఃఆకృతి విశేషః—"

సమూహాత్మక మయిన యొకానొక ప్రయోగ ప్రదర్శనమున ఆధారాంగ ప్రయోగ సాధకుల సవిశేష మయిన విన్యాస విలాసము మన బుద్ధియందు ప్రవేశించును. అట్లు సిద్ధమైన మన యాస్వాదానుభవమున గోచరించు ఆకృతివిశేషమును పిండీబంధ మందురు. కరణాంగహారము లన్నియు పిండీవిశిష్టములుగా గోచరించుట బట్టి యనియే పిండీబంధము లనియు పరిగణితము లగుచున్నవి. వీని యన్నిటి భావనా వ్యూహములో తుదకు మహామహేశ్వరుడె వ్యక్త స్వరూపుడై గోచరించుటను పిండీ బంధ వ్యవహారము కలుగును.

పరమేశ్వర పిండీబంధ మీశ్వరపిండి. మహేశ్వరుని యాయుధ విశేషమయిన త్రిశూలము యొక్క యాకృతి యిం దుండును. నంది బంధము పట్టసపిండి. ఆతడు పిండీబంధ లక్షణ విధాత. నంది పిండియు త్రిశూలాకృతి నుండును. దేవీపిండి సింహాకృతి కలది. ఐరావత పిండి గజాకృతి. రూపపిండి పద్మాకారమున నుండును. ధారాపిండిని మఱల మఱల ప్రయోగించి నపుడు నదీపిండి నామము కలుగును. కుబేరుని పిండి ముద్గరాకృతి నుండు నట! పిండీవిధానము లిన్నియే కా ద నియంటిమి. "త్రిశూలాకృతి సంస్థానా రౌద్రీ స్యాదంధక ద్విషః" రౌద్రీపిండి త్రిశూలాకృతి నుండు ననుటచే నాయా చిహ్నాలు కల యా యా దేవతల కర్మాది సూచక రూపమున నితర పిండీ విధానములు గూడ నుపలక్షించునది. దేవత నారాధించు నపుడు నృత్తమున దేవతా పరితోషణ మావశ్యక మగుచున్నది. ఆ నృత్తమధ్య

మునందా దేవత యొక్క యాయుధ వాహన కర్మ భావాదుల నను కరించు నంగ ప్రయోగ మొనరింపవలసియున్నది. కావుననే రత్నా వల్యాది రూపకములలో తలపుష్పపుట మను కరణమున దేవీ కర్మ భావము సూచిత మయినది. అది దేవీపరితోషార్థ ముపాత్తము. అశ్లే నికుట్టిత మను తొమ్మిదవ కరణమున త్రిశూలాకృతిక మగు సంపత్తి యున్నది. గరుడప్లుతక (౭౦) మను కరణములో గరుడుని యాకార గతి సూచన మున్నది. గంగావతరణ కరణములో ధారాపిండి సూచిత మయినది. నాగాపసర్పితకములో భోగపిండి యున్నది. రేచిత మాక్షిప్తరేచిత మను నంగహారములలో నానావిధములయిన యాధారాద్యనంత భేదముల నిష్పత్తి యున్నది. కావుననే - రేచితాంగ హారమున సర్వదేవతలు సంతుష్టి పొందుదు రని తాండవమున రేచి తము ప్రయోగింప వలెనని నందిమతముగా ప్రసిద్ధి యున్నది. ఇట్టి విశేషముల వలన నంతగా నుపయోగము లేదు. అయినను "అగమ భ్రంశే రక్షనాయ తు దిజ్ నిరూపితా" నాట్యాగమమునకు భ్రంశము లేకుండ రక్షణము సూచించుట కీషన్మాత్రముగా సూచింప వలసి వచ్చినది.

౨౫౯ రేచకా అంగహారాశ్చ పిండీబంధాస్తథైవ చ
సృష్ట్వా భగవతా దత్తాస్తణ్డవే మునయే తథా

పరశివుడు రేచకములను అంగహారములను పిండీబంధములను నిర్మించి తండు వను ముని కప్పగించి నాడు. ఇందు పిండీబంధ మని చెప్పుటచే శిఖిపిండి మొదలగు వానిలో నుపాయములగు మయూర లలితము మొదలగు కరణములను సూచించినట్లె యయినది. అందు ననే కేవల కరణ ప్రయోగమున గూడ దేవతా పరితోషణ మున్న దని, దాని ప్రయోగ మదృష్టప్రయోజనక మని చెప్పినట్లె భావింప వలయును. అంగహారప్రయోగము లం దపరిహార్యముగా పిండీబంధ సంబంధ మున్నది. అంగహారములె పిండీబంధము లన్నమాట. కరణ ముల సమూహరూపముగా నిరూపించిన యంగహారములు పిండీబంధ ముల నిష్పత్తిలో నుపాయము లనుట భద్రముగా గుర్తింప వలెను. ఇంక నిట్టి వాని నభ్యూహించి ప్రయోగింప వచ్చు ననియె యీ వచన

మున ప్రయోగ ప్రత్యనుజ్ఞానము నిశ్చయించునది. శివుడు సంధ్యా కాలము లందు నృత్తము స్మరించెనని పూర్వము నిరూపితము. ఇచట నిర్మించుట యున్నదని పూర్వవిరోధము శంకింప నక్కఱ లేదు. పద ములలోని వర్ణములు ప్రవాహరూపమున ననాదులు. అట్లె యిందలి స్థానకములు, చారీరీతులు, నృత్తహస్తములు, భ్రూ తారక కర్మలును ప్రవాహానాదులు. అయిన నవి ప్రతిప్రాణి యందలి స్థానకరణముల సంపత్తులచే నొక పౌర్వాపర్య మభివ్యక్తము చేసికొనును. ఇట్టి పౌర్వాపర్య నిబంధన ముండుటచే కృతక మెయగును. కల్పిత మయినను పూర్వాపూర్వరచనల సజాతీయత్వ ప్రవాహమున నిత్యమె యన వచ్చును. ప్రకృత నృత్తము నిట్లె సంభావించిన పూర్వవిరోధ మేమియు నుండదు. తండువు కిచ్చినా డనుటలో నొక భావ మున్నది. తండువు ముని. ఊహాపోహాది కుశలుడు. శోభాప్రధానముగా వైచిత్ర్య మనుసంధింప గలడు. తన బుద్ధిచే నాలోచించిన రమ్యత లను గూర్చగలడు. లక్ష్య మిది విరూపము కాక శోభాప్రాధాన్యమున సుందరమె యగును అని,

నృత్తనాట్యములు

౧౩౦ తేనాపి హి తతః సమ్యక్ గానభాండ సమన్వితః
నృత్తప్రయోగః సృష్టో యః స తాండవ ఇతి స్మృతః.

శివదత్త మయిన నృత్తమును తండు వతికుశలముగ గుర్తించి, గానములతో భాండములతో గూడుకొన జేసి నృత్త ప్రయోగము సృజించినాడు. అది తండుసృష్ట మగుట తాండవ మయినది. నృత్త ప్రయోగమును సమ్యక్ వైచిత్ర్యమున తండువు సృజించినాడు. అతి సమంచితము లయిన తాలముల సామ్యము సంగత మగునట్లు చేసి నాడు. గీతము వాద్యము సమ్యగంచిత మగునట్లు చేసినాడు. సుసం గతములగు నట్లొనగించినాడు.

"మునుల కభినయములు తెలియవు. వారి కందభిజ్ఞానము లేదు. వైదుష్యము లేదు. గీత ప్రసాగములలో వారల కర్థభావన మెక్కడిది ?" అని కొందరాశంకింప వచ్చును. ఇది భావింపుడు ! నృత్తము నాట్యముకన్న భిన్నమా ? అభిన్నమా ? నాట్యభిన్న మయినచో

దానికి ప్రయోజనము కలదా? లేదా? నృత్తము నాట్యభిన్నము కాదు. అంగవిక్షేపము నృత్తము గీత మన్నియు దానిలో దీనిలో సమానమె. పాటలోని పదార్థ వాక్యార్థములను విషయము చేసికొనిన యభినయ మందిం దున్నది. ఏకపాత్ర ప్రయోగము నృత్తముననె కాదు, నాట్యమున గూడ గలదు. అసన్నిహిత ప్రియుని తోడి ఉక్తిప్రత్యుక్తుల ప్రయోగమున భాణరూపకము లోని యాకాశ భాషిత ప్రయోగమున నేకపాత్ర విధానమే యున్నది. "పరోక్షేఽపి హి వక్తవ్యో నార్యా ప్రత్యక్షవ త్ప్రియః" నారి ప్రత్యక్షముగ నున్నట్లే పరోక్షమున నున్న ప్రియుని పలుక దగునని రాసాలు డనెను కదా! అభినయము వాచ్య మనుసరించి యున్నది. అర్థము గాత్ర విక్షేప ములచే ప్రతిపాద్య మగుచున్నది. నృత్యనాట్యముల రెండింటిలో నిది యంతయు సమానము. వీనికి భేద మేమి? అని వార్తికకారు డనెను. "నృత్తములో సాక్షాత్కారబుద్ధి యున్నది. నాట్యములో సాక్షాత్కార బుద్ధి యుండదు." అనుట యుక్తము కాదు. "అదిగో ప్రియతముని గుణముల కీర్తించు చున్నది. ఇదిగో! ఖండిత. అల్ల దిగో! కలహాంతరిత నృత్య మొనరించు చున్నది." అని యంద రందురు గదా! పాట లాట లన్నిట వేరు వేరుగా నుండక తప్పదు. ఉపరంజనమా! నాట్యమున నది తక్కువేమి? ఆసీన పాఠ్య ప్రయో గములలో వాచిక మభినయమున్నది. భాణరూపకములో ముఖ్య ముగా నాహార్య మొక్కటే. అది క్షణక్షణ మేమియు మారదు. సాత్త్విక మంగీకృతమే. ఆంగికము స్ఫుటమె. దేవతాస్తుతి నృత్త నాట్యములలో నేకవిధము. స్త్రీ పుం భావాశ్రయ మయిన శృంగార మంతట సరిగా నుండును కదా! లక్షణ మంతయు సమముగా నున్నది కావున నృత్తము నాట్య భిన్నము కా దనుట సముచితముగా నున్నది. ఇక నీ యంశమునె సూక్ష్మము చేయవలసి యున్నది.

## నృ త్త మే ల?

౧౩౧ యదా ప్రాప్త్యర్థ మర్థానాం తద్జైరభినయః కృతః
తస్మా న్నృత్తం కృతం హ్యేతత్కం స్వభావ మపేక్షతే.

౧౩౭ న గీతకార్థసంబద్ధం న చాప్యర్థస్య భావకం
కస్మాన్నృత్తం కృతం హ్యేతద్గీతేష్వాసారితేషు చ?

నాట్యతత్త్వజ్ఞు లయిన ప్రయోక్తలు కావ్యార్థములను సాక్షాత్కారబుద్ధితో స్వీకరించుటకై యాంగికాద్యభినయము నిర్మిత మయినది కదా! ఈ నృత్తశబ్దమున చెప్పదగిన దిది యేల నిర్మిత మయినది? దీనిని నాట్య మని యనక నృత్త శబ్దమున వ్యపదేశింప నేల? పోనీ? నాట్యము కన్న నృత్తము వేరె యనుకొని యీ వ్యపదేశము చేసి రనుకొందము? ఇది యెట్టి స్వభావ మపేక్షించును? దీని స్వాత్మగత మయిన లక్షణ మేమి? దాని నెట్లంగీకరించిరి? దీని స్వరూపమున లౌకికత్వమున్నదా? లోకోత్తరత్వమున్నదా? లౌకికత్వమె యున్న దన్న ఘటపటాదుల వలె నిది తుల్యాకృతి యగును. తదనుకార మేని యగును. ప్రతిబింబరూప మేని యగును. అంత కన్న నేమి యగును? అది యెట్లయిన దాని యందంతట నాట్యచ్ఛాయ యుండక తప్పదు. చిత్రపుత్రికలు పుస్తములు కథాపర్యంతము సర్వము సాక్షాత్కార సమాన మయిన సంవేదన సంపద యుండును గావున నాట్యభాగ నిష్యందములు కాక మానవు. నృత్త లక్షణము లోకోత్తర మన్నచో నది నాట్యమున కవాంతర భేద మాత్రమె యగును. అది యంతమాత్రమె యయినచో ప్రయోజన మేమియు నుండదు. నృత్తమునకు స్వరూప గత మయిన స్వభావ మున్న నది యవశ్య ముపలక్షణీయము. అదియె లేదు కదా!

## రా గ కా వ్య ము లు

ప్రయోజన భేద మున్న దని నాట్య నృత్తములకు భేదము చెప్పుటయు సంగతము కాదు. రాగకావ్యము లందును చతుర్వర్గోపదేశ మున్నది. డోంబిక మొదలగు నుపరూపకములలో ప్రచ్ఛన్న రాగ పరమ రహస్యముగా కామోపదేశ ముండనే యున్నది. కొన్ని కొన్ని సామాన్యాభినయము లందు ప్రచ్ఛన్నరాగము మన్మథదేవ సారసర్వస్వ మని యనినారు. సింహ సూకర భల్లూక కాసరాది వర్ణనమున గూడ అప్రస్తుతప్రశంస అర్థాంతరన్యాసము దృష్టాంతములచే పురుషార్థ ముపదేశింప బడుచున్నది. ఇట్లు ధర్మాది ప్రయో

జన ప్రాప్తికై కవులు రాగకావ్యాదులను అభినేయములుగా చేసిరి. కాగా నీ నృత్తము నాట్య మేల కాదు? నాట్యమె నృత్తము కా కూడదా? కా కూడ దన్న భేదక స్వభావము చెప్ప వలెను. భిన్న స్వభావ మేమియు లేదు. స్వభావాభేదమున ప్రయోజనాభేదమున నృత్తము నాట్యాభిన్నమని స్పష్ట మగు చున్నది.

"వేరొక విధమున నీ శ్లోకార్థము భావింతము. అభినయ ముండుటచే గొన్ని రాగ కావ్యములు నాట్య మవుగావుత. కొన్నిట నభినయ ముండదు. అచట నాట్యశంక రానే రాదు కదా! కేవలము వలనము ఆవర్తనము భ్రూక్షేపము తారాచలనము చరణధారణము కంపము స్ఫురితము రేచకము మొదలగు వానిలో నభినయము లేదు. ఇవి నృత్తము కావచ్చును గదా!" అని భేదవాదు లన వచ్చును. నృత్తమును నాట్యము నుండి విమోచింప జేసినందున ప్రయోజన మేమున్నది? మొదట నాట్యము లక్షిత మయినది. అభినయముల కం దుపయోగ ముండుట స్పష్టము. గీతవాద్యాదుల వలె నృత్త ముపరంజకమె యగును. గీతము నానా ప్రకృతులను చిత్తవృత్తులను కథావస్థలను సూచించునదై యుపయోగించును. వాద్యము గీత సామ్యమున భాసించు తాలమున కుద్దీపకమై యుపయోగించును. వీనిలో నృత్త మే స్వభావము నపేక్షించుచున్నది? యుద్ధ నియుద్ధ గతిపరాక్రమాదులలో నుపయోగించు నందురా? అందును లోక స్వభావ మపేక్షించునా? అలోకస్వభావ మపేక్షించునా? లోక స్వభావమె యయిన లోకధర్మిని సంగ్రహించి నట్లగును. అప్పుడు నాట్యాంగముగనె నిరూపణ ముచిత మగును. అలోకస్వభావమె యయినచో నాట్యధర్మ్యనుప్రవేశము కలుగును. సుందరమై యుపరంజక భాగానుప్రవేశము పొంది నాట్యగర్భముననె నృత్తము ప్రవేశము పొందును.

పూర్వరంగమున వైచిత్ర్యసిద్ధికై నృత్త మావశ్యక మని యందురు కాబోలు. పూర్వరంగములో బ్రహ్మగీతి ప్రయోగింతురు కదా! బ్రహ్మగీతియు నృత్తమును అంగాంగి భావము పొందు నందుమా? ఇది సమంజసము కాదు. "మహాగీతేషు చైవార్థాన్

సమ్యగేవాభినేష్యసి'' అనినట్లు మహాగీతములలో సమ్యగభినయము ప్రసిద్ధము. మహాగీతార్థముల ప్రాప్తికై వాని నభిముఖము చేయుటకై విహితమగు నిదియు నభినయ ముండుటచే నాట్యతుల్యమె కదా! 'ఇది నాట్యము కాదు నృత్త' మని యేల యనవలయును? నృత్త మని వేరుగా ననిరి పో! గీతకార్థాభినయ మొనరింప వలసి యున్నప్పుడు ఆంగిక హస్త కార్యాద్యభినయ వ్యతిరిక్తమగు నే స్వభావ మిందున్నది? అది యేదియు గోచరింపదు కదా! వేరుగా తలచబడిన యీ నృత్తస్వభావము గీతకార్థ సంబద్ధము కాదు. అర్థ భావకమును గాదు. గీతము లాసారితములు కాగా దీని నృత్త మని నవనామమున నేల యనవలెను? గీతకార్థములు వస్త్వంగ ప్రభృతులున్నవి. వానితో నృత్తము సంబద్ధము కాదు. వాని మధ్యలో నిది పరిగణితము కా లేదు. సుషిరాది వాద్యము లోకపథమున నుపయోగించుట యున్నది. గీతకాదుల స్వరూపమునకో పదమునకో తాలమునకో సుషిరాదికము భావకము తదర్థ ప్రాపక మగును. ఈ నృత్తమా విధమున స్వరూప పద తాల భావకముగ గూడ గోచరింపదు కదా! నృత్త మని దీని వేరుచేయుటలోని భావ మేమి?

స్తుత మాపూరిత మయిన సుషిరము స్వరాత్మక భాగములో లగ్నస్వరమై స్థాన ప్రదాయిగా నుండి స్వరపరమార్థము నందించును. అవనద్ధ వాద్యము కూడ తాలాంశమున ప్రమాపకమై పదార్థాభినయమున నుపయోగించును. రేచకాంగహారముల నిబంధరూప మయిన నృత్తముచే నే యర్థ మభినీతము కాదు కదా! కాగా పృథఙ్నిబద్ధములగు నృత్త రాగ కావ్యములలో గూడ నాట్యరూపమే యవభాసించుచున్నందున నృత్త తాల గీతకాద్యుపయోగము దుర్ఘటమె యగుచున్నదె!

## పక్షత్రయము

ఇంతటి యీ వ్యవసాయములో నిది నృత్తము నాట్యమె కాదా? ఇది యేటి నృత్తము? అను వాదసంక్షేమ మునకై మూడు పక్షములు సంక్షిప్తముగా నుపక్షిప్తము లయినవి. అవి యివి.

౧. నృత్తము నాట్యమె. కావ్యార్థ ప్రాప్తికై ప్రయోక్త

లోనరించు నభినయమె యది. నృత్తము పురుషార్థముల నిరూపిం చును. కవులు రాగకావ్యము లట్లె నిరూపించిరి. గాత్రవిక్షేప రూపాభినయము నాట్యములో వలె దీని యందును గలదు. ఇక నృత్త మేమి?

౨. లోక స్వభావానుకార రూపముగా లక్షిత మయిన నాట్య మున నృత్త మెట్లుపకారి? గీతవాద్యాదుల వలె నిది యుపకారి యగుట లేదు. నృత్తము లోకధర్మి యయినను నాట్యధర్మి యయి నను నాట్యాభిన్నమె. ఇక నృత్త మేమి ?

3. గీతకార్థముల యాభిముఖ్య మాపాదించుటలో నెందు నాట్యాతిరిక్తాభినయ మే మున్నది? పూర్వరంగాంగము గా నిది యుప యోగి యుపరంజక మన్న నదియు గానరాదు. స్వర తాల ప్రక్రియ లలో సుషిరము వాద్య ముపకారి యగు నట్లిది యగుట లేదు. ఇక నృత్త మిది యేమి?

## నృత్తధర్మము

౧౩౩ అత్రోచ్యతే; న ఖల్వర్థం కంచిన్నృత్త మపేక్షతే
కిం తు శోభాం జనయతీత్యతో నృత్తం ప్రవర్తితం

౧౩౪ ప్రాయేణ సర్వలోకస్య నృత్తమిష్టం స్వభావతః
మంగల్యమితి కృత్వా చ నృత్తమేతత్ప్రకీర్తితం

౧౩౫ వివాహ ప్రసవావాహ ప్రమోదాభ్యుదయాదిషు
వినోదకారణం చేతి నృత్త మేతత్ప్రవర్తితం

౧౩౬ అతశ్చైవ ప్రతిక్షేపాద్భూతసంఘైః ప్రవర్తితాః
యే గీతకాదౌ యుజ్యంతే సమ్యక్ నృత్త విభాగకాః

౧౩౭ దేవేన చాపి సంప్రోక్తః తండుస్తాండవ పూర్వకం
గీతప్రయోగ మాశ్రిత్య నృత్తమేతత్ప్రవర్త్యతాం

౧౩౮ ప్రాయేణ తాండవవిధిః దేవస్తుత్యాశ్రయో భవేత్
సుకుమారప్రయోగశ్చ శృంగార రస సంభవః

ఇక నిది వక్తవ్యము. నృత్త మే యర్థము నపేక్షింపదు. కేవల మది శోభ సంపాదించును. అందులకే దాని ప్రవర్తింప జేసితిమి. సర్వలోకమునకు స్వభావసిద్ధముగ నృత్త మిష్టము. నృత్తము మంగ ల్యము. అందుకని యా నృత్తము చెప్పితిమి. వివాహ ప్రసవ

ప్రమోదాభ్యుదయాదులలో నృత్తము వినోదకరముగా నుండు నని ప్రసరింప జేసితిమి. నృత్తము వినోదహేతు వగు ననియే గీతకాదులలో నృత్తవిభావకము లయిన కొన్ని శబ్దములు దేవతలచే ప్రతిక్షిప్తము లయినను వినోద ప్రీతి కల భూతసంఘములు ప్రవర్తింప జేసినవి. మహాదేవుడును తాండవ మొనరించి తండుమునితో నిట్లని నాడు. "గీతప్రయోగ మాశ్రయించి నృత్త మిది ప్రయోగింపుము!" అని. సాధారణముగా తాండవవిధి దేవస్తుత్యాశ్రయముగా నుండును. అది సుకుమార ప్రయోగము. శృంగార రస సంభవమును. మహేశ్వర దేవుడె సంతోష పూర్వకముగా నిట్లనినాడు కదా! ఇది పై పై భావముల తేటు.

## గీతరంజనము

పూర్వ ముపక్షిప్త పూర్వపక్ష విక్షేపమున కిట్లు భావభారము నిందుండి పిండ వలసి యున్నది. ఇది యభినవగుప్త భావధార. నాట్యము నృత్త గీత మయము. అం దంగవిక్షేప మున్నది. రాగ కావ్యాది నృత్తము కూడ తాదృశమె. లౌకిక నృత్తమున గూడ నిది యున్నది. నాట్యలక్షణముననె యది గోపిత మగును. గాత్రవిక్షేపణ మున్నది కదా! పదపాత మున్నది కదా! పదజాత మభినీయమాన మగుచున్నది కదా! అర్థ మభినీత మగునని యేల అనుసంధాన మొనర్పము? అది మాత్రము నాట్యము వలె సాక్షాత్కార యోగ్య మగుట లేదా? అంగోపాంగముల పరిక్షేపము వాక్యమున జెప్పినట్లె. కన్పడునె! పదార్థసంవాద మనుసంధించు కొనియె గాన మొనరింతురు. తన్మయీభావ స్పృహాబంధ ముండి తీరును. సాత్త్విక సంపత్తి స్ఫుటమె యగును. నృత్తకావ్యము లందును వర్ణభంగము కలిగిన నభినయ కథయె యుండదు. కేవలనృత్త భావ మొకచో నున్నను కావ్యార్థముల లోని యర్థతత్త్వముల సౌకుమార్యమునె యది సూచించును. నృత్తములో ధారాపరిక్రమ రూపముగా లయవిశేషము ప్రయోగించు నప్పుడు చేయు గాన మెవరి దందుము? నర్తించుటకె తెంచిన లోకనర్తకియె యిప్పు డీ విధమున లోకవచనమె పలుకుచున్న దనుకొన్న నది యెట్లు సంగతము? పాటలో స్వస్పందమున

సంక్రమణము చూచుకొని యేకవాక్యతను కూర్చుకొని సాక్షాత్కరింప జేయు నర్తకి లోకగతిక యందుమా? సాక్షాత్కారప్రతిభ యున్న నాట్యమె కదా! ఒకడొకడు నృత్య మొనరించి గాన మొనరించి యన్యాపదేశగానముగా వస్తూద్బోధనమున భావప్రవేశనమున వేరొకని మనస్సమావర్జన మొనరించుట సుప్రసిద్ధమె. ఒక్కొక గీతము కాని నృత్తము కాని మరి యితరము కాని పాలకప్రభువుల పరితోషమున కైన కథావచన నిష్ఠమై వారిని రంజింపజేయును. గీతనృత్తాదుల యారంభములో ప్రయోక్త లెట్లుగా గోచరించినను మధ్యలో –"ఇది చౌర్య కాముక కేలీ లాలస మానస. ఇది ఇట్టిది. ఈ తడి ట్టి కాముకులతో నిట్టి వా డయినాడు. ఇదిగో! యీ ప్రౌఢదూతి యిట్లయినది" అను విధమున పాలకపుత్రుల హృదయానుప్రవేశమునకు తగినట్లు గోచరించును. వారి ప్రసాదమునకై ధనార్జనమునకై యేమేని పలుకును. ఆ పాలకపుత్రునె యా ధనమునె యుద్దేశించి చేష్టిత మొనరించును. పలుకు పలుకును. అట్లె ప్రయోక్తలు ప్రయోగము సాగింతురు. ముగింతురు. ఒకతె నృత్య మారభించి యుపరంజక గీతముల పాడి, చిత్రవిచిత్ర పటముల ధరించి, చేటీ చేటక పరివృతయై, రంగమున నవతరింపగనె "ఇదిగో! నిన్నె యిది స్తుతించినది. నిన్నె కీర్తించినది" అని తలంచుట కవకాశము కలుగును. అప్పుడా రంగనర్తకియు నటనున్న వాని ముఖమున తన మాటల సంక్రమింప జేయును. లయతాలములు సరి చూచుకొనుచునె నృత్య మొనరించును. గీయమాన పదముల భావము పాలకప్రభువుల హృదయప్రవేశము పొందునట్లు సమతిశయితముగ నావర్జనము చేయును. లోకవ్యవహారము లందున్న హస్త భ్రూ కర్మలను రోమాంచములను అక్షివికారములను తుల్యయోగక్షేమముగనె ప్రదర్శించును. గానించును.

## నాట్యము నృత్తసంస్కారకము

ఇట్లు గీతమున ప్రధానముగా రంజన మాపాదించి దానికి తగిన యంగవ్యాపారము కూడ ప్రదర్శించును. మరల నృత్తమున చిత్తహరణము చేయునదై నృత్తము ప్రధానము చేయును. గీతము తదంగము గావించును. అటుపై నృత్తాదరము తగ్గించి పాడునట్టి పాటకు తగిన

యాంగికములు చూపును. తదనుకూలముగ నంగవిక్షేపము చేయును. లయలగ్నము లయిన కరణాదు లాచరించును. ఈ యంశమున నింతటి లౌకికమాత్ర స్వభావ మున్నను అప్రయోజ్య ప్రయోజకభావ శంక తగదు. గీతనృత్తాదులను నర్తకి ప్రయోగించుట యంతయు లోక సదృశ చేష్టిత మన నక్కఱ లేదు. అన్నిటిని సాక్షాత్కారకల్పముగా నామె చూపదు. ఆమె యాహార్య మామె రూపము నంతగా ప్రచ్ఛాదింపదు గదా! కేవలము నృత్తమును సాభినయముగా నర్తకి ప్రదర్శించును. కావున నాట్యము నృత్తమునకు సంస్కారక మన వచ్చును. కావుననె నాట్యములోని ప్రస్తావనయె ప్రాణముగా నృత్త ముండు ననియు ప్రసిద్ధి కలిగినది. నృత్తము నాట్యరూపము. ఇందు పాత్రోద్దేశమున నున్న భాషానియమము కూడ సాక్షాత్కార సంపత్తి కుపయోగించును. నృత్తము నాట్యాయిత మనియె తలచుట కేవల మస్థానభ్రాంతి. లయతాలాదులకు తగినట్లు అర్థసూచనమునకు యుక్త మగునట్లు రసానుసారమున సముచితార్థ పూరణమునకై ధ్రువాగీతము కూడు కొనవచ్చును. సామాజికు డాస్వాదింప వలెనని, యిందలి యుపదేశ సందేశము లందుకొన వలెనని, దీనిచే వారలకు ప్రబోధ ముదయింప వలె నని, వారు సంతుష్టి పడి బహూకరింప వలె నని నృత్తప్రయోగములో నెట్టి యభిసంధియు నుండదు. అట్టి ప్రయోజన సంపత్తి నాంతరీయకముగా కలిగిన కలుగ వచ్చును. సర్వత్ర విషయోద్దేశముననే నృత్తప్రయోగ ముండును. నర్తకీ ప్రవృత్తి లౌకికముగా గోచరింప వచ్చును. కాని "నర్తక్యాః ప్రవృత్తిః ప్రవర్తనా వా దేవతా పరితోషణఫలైవ." నర్తకి ప్రవర్తించుట ప్రవర్తింప జేయుట యంతయు దేవతా పరితోషణ మునకె యగును. "యత్కించిల్లాస్య మేతేన దేవీ తుష్యతి నిత్యశః." లాస్యమున దేవి నిత్యము సంతసించు ననినారు. "యత్కించి త్తాండవం తేన సోమః సానుచరః శివః." తాండవమున దేవీసహితు డయిన సపరివార శివుడు సంతసించు ననినారు. రస మం దంతర్లగ్నము లయిన విషయవిశేషముల యోజనము చేసి ప్రీతి సాధింప వచ్చును. ఇది యంతయు నలౌకిక రూపాంతరము పొందక తప్పదు. ఈ మధ్యలో వ్యుత్పత్త్యభిసంధాన మనునది సముచిత సంభావనము కాదు. వంటకములు తినువాడు

పాకపాండిత్యము సంపాదించు నన్నట్లుండును. గేయములో నాట్యములో కూడ నిదియె ముఖ్యము. ఇది నాట్య సముచితభావము. ఇంతకతిరిక్తముగా నేమేని పలికిన నది యంతయు మానవునకు జీవికా పర్యవసితమై పురుష దౌరాత్మ్యముగా మారును. పుస్తకవాచకులు పురాకల్పము లోని ధర్మోపదేశములు చెప్పి నట్లుండును. నృత్త నాట్యములకు ప్రయోజనభేదము లేదు. లక్షణ భేదమును లేదు. సామాజికులకు నాట్య మందించు ప్రయోజనమును నృత్తము సందించును. నృత్తము వేరుగా ధర్మాద్యుపాయములం దొకదాని నపేక్షింపదు. నృత్త మొక యర్థసాక్షాత్కార మాపాదించుట కుద్యమించినదై నాట్యము నపేక్షించుట లేదు. కాగా నృత్తమని యనుట వాచోయుక్తిచే ననుటయె.

## నృత్తము నాట్య శోభ

నాట్యములో నృత్తమున కెట్లుపయోగమున్నదో? యని శంక కలుగును. గీతకమునకు నాట్యమున నెట్లుపయోగ మున్నదని ప్రశ్నించుకొందము. వాక్యముల జెప్పని భావములు కావ్యమున నిరూపింపని భావములు గీతకమున భాసించు నని భావింతుము. ప్రకృతమున నిట్లు భావింతము. “రామరావణచరితములలో నొకటి యగ్రామ్యచరిత మందుము. మరియొకటి త్యాజ్యచరిత మందుము. అట్టి యర్థసంభావనము హృదయానుప్రవేశమునకు ద్వార మగుచున్నది. హృదయ సంవాదము కలుగుచున్నది. అట్టిదె నృత్తమున కూడ గలదు. నృత్తము లోని వలనావర్తనాదులు నాట్యమున నంతరంగములుగా నుపయోగించును. హృదయానుప్రవేశ ద్వారభూతము లగును. కాగా నాట్య మనునది విమలాభినయ మాణిక్యముల చేర్పు కూర్పులకు సూత్రస్థానీయము. వలనాది రూప నృత్త సజాతీయము. నృత్తసన్నిహితము. అంతరంగము లగు గీతాదులందు వ్యాపిగా నుండునది” అని గుర్తించుట సర్వ శుభంకర భావము.

## ప్రయోగ సమయము

అందుననె నృత్తము నాట్యమున శోభ గలుగ చేయునని

ప్రవర్తిత మయినది. ప్రకృష్టముగా వర్ణిత మయినది. వర్ణనము విలాసము వలనము కల నృత్తము కావ్యావయవములకు కావ్యమునకును విలాస చేష్టావస్థాపనాత్మకముగా నుండును. నృత్తము రంజనాత్మక మగు శోభ నిచ్చునదియె కాక శోభానాంతరీయకముగా గానాది ప్రకర్ష వైలక్షణ్యమున సచేతశ్చమత్కార మాపాదించును. భోజనాదులు కూడ రంజకములె కా వచ్చును గాని నృత్తము తావన్మాత్రము కాదు. స్వభావసిద్ధముగా నిది సర్వాభీష్టము. వివాహ ప్రసవావాహాదులలో నిది సర్వలోక సంసిద్ధము. ప్రతిమానవు డొక్కొక విధమున నృత్తము చేయును. హాద్య మొనరించుచు నృత్తము చేయును. వివాహము = వధువు నింటికి దీసికొని వచ్చుట. సర్వ ముత్సవము తత్పూర్వకముగా నుండును. ప్రసవము= పుత్రజన్మ. ఆవాహము=భార్యను వెంట బెట్టుకొని శ్వశురభవనము ప్రవేశించుట. ప్రమోదము=పాలకప్రభువు లిచ్చు ద్రవ్యసత్కారాదులు. అభ్యుదయము=మనోరథప్రాప్తి, యభిలషిత సిద్ధి. ఇంక ననేకము లయిన యనభిలషిత శుభ ప్రాప్తి సమయము లందును నృత్తము వినోదకరణ మగును. ఇంతటి ప్రతిపాదనమున నృత్తము నాట్యాంగ మని గీతాదుల వలె నుపయోగి యని సారము తేలినది. ఈ నృత్తమును గీత ప్రయోగము నాశ్రయించి ప్రవర్తింప జేయవలయు నని మహాదేవు డాదరమున జెప్పినాడు. 'గీయతే ఇతి గీతం కావ్యం' గీతప్రయోగము కావ్యప్రయోగము. ప్రయోగ మనుటచే కేవల చ్ఛాయ నాశ్రయించుట కా దని యర్థానుప్రవేశరూప మగు సంబంధము నాశ్రయించి యని యర్థము భావింప వలెను. ఒకప్పుడు సంధ్యాసమయమున శివుడు నృత్త మొనరించు చుండగా నారదుడు శివచిత్తుడై త్రిపురోన్మథమును గానము చేసినాడు. శివుడు సంప్రీతుడై తండువును బిలిచి 'అభినయసంపత్తితో తాండవమును సమాయోజింపుము' అనినాడు. ఇట్లు నృత్తారంభముగా తాండవ మావిర్భవించినది.

తాండవమును విధించు కావ్యము వర్ణనీయముగా దేవస్తుతి నాశ్రయించును. నిర్భర పరిపూర్ణ మగు శృంగారరసమున తాండవము మసృణ ప్రయోగము కల దగును. నాట్యమున కన్న నన్య

మున రస మభివ్యక్తము కాదు. కాని కావ్యమున నాట్యము నిష్పన్న మగును. రసానుప్రవేశ ముండును. నృత్త మెల్లప్పుడు సుకుమార ప్రయోగమె యని భావించ నక్కఱ లేదు. మసృణము కూడ నుద్ధత మిశ్రము కావచ్చును. ఉద్ధతమును మసృణ మిశ్రము కావచ్చును. నరపతి చాటుక ప్రధానముగా నుండు వానిలో సుకుమారమె శుద్ధరూపము. నరసింహాది చరిత వర్ణనములో నుద్ధతమె. మసృణోద్ధతముల కలయికలో నానా భేదము లున్నవి. డోంబికా ప్రస్థాన షిద్గక హల్లీసక రసకాదు లివియె. ఇవి యన్నియు నృత్తాత్మకము లయిన ప్రబంధములు. నాట్యాత్మక నాటకాదుల కన్న విలక్షణము లని భావింప నక్కఱ లేదు.

## నృ త్త ము స ప్త కృ తి

ఇట్లీ నృత్తము భగవన్మహాదేవుని సప్తకృతి ప్రకారముల ప్రసరించినది.

౧. ప్రథమమున నృత్తము శుద్ధము. కేవలము రేచకాంగహార స్వరూపమున నావిష్కృత మయినది.

౨. రేచకాంగహార స్వరూపముగా నున్న నృత్తము గీతకాదుల యభినయోన్ముఖ మయినది.

౩. పిమ్మట గానప్రియా మాత్రము ననుసరించి వాద్యతాలాను సారి యయినది. తండువు వాద్యభాండముల కూర్చినాడు. బాహుప్రేంఖణము, ఉరఃకంపము, పార్శ్వ నమనోన్నమన ములు, చరణసరణము, స్ఫురితము, కంపితప్రభువు, తారా పరిస్పందము, కటిచ్ఛేదము, అంగవలనము నను రూప మెత్తినది.

౪. మసృణ నృత్తము

౫. ఉద్ధత నృత్తము

౬. మసృణోద్ధతము

౭. ఉద్ధత మసృణము

సప్తకృత్యములు మూలముగా సప్తనృత్తము లావిర్భావము పొందినవి. వీనిలో మొదటిది లౌకిక స్వతంత్ర నృత్తమున నుండును. దేవతా

తోషణమున నుండును. రెండవది పూర్వరంగవిధిలో కూడు కొన్నది. విశ్వము వ్యాపించినది. ఇంతగా నిది యిచట ప్రసక్తానుప్రసక్తముగ నృత్తస్వరూపము ప్రదర్శిత మయినది. ఇక దీని ప్రయోగము పరిశీలింప వలయును. తండుప్రయుక్త మయిన తాండవవిధి క్రియను వర్ధమానక మనుసరించి తెలియ వలయును. ఇదివరలో తాండవ విధి క్రియ కరణాంగహార విషయముగా నిరూపిత మయినది గాని గీత తాల సమ్మిశ్రముగా నిరూపితము కాలేదు. ఇక నట్టి విశేషమున తెలియ వలయును. గీత్యాధారముగా నొక వాక్యసమూహమును మొదట స్వీకరింప వలెను. అది యభినయించుటకు తగియున్నట్లు నిశ్చయింప వలెను. తదనుకూల మయిన గీతవిశేషము నెన్నుకొన వలెను. వలనా వర్తనాదులలో ధ్రువాతారాది నియమ మవలంబింప వలెను. గీతతాలాది సంబంధమున తాండవ విధాన మే రీతి కలదగునో యిక తెలియ దగి యున్నది.

౧౩౯. కలానాం వృద్ధిమాసాద్య హ్యక్షరాణాం చ వర్ధనాత్
వర్ధనా న్నర్తకీనాం చ వర్ధమానక ముచ్యతే.

కలావృద్ధి ననుసరించి యక్షరముల వర్ధన ముండును. నర్తకీ వర్ధనము నుండును. కలాక్షర నర్తకీ వృద్ధి యుండుటను వర్ధమానక మని వ్యవహారము కలిగినది. కల యనునది తాల ప్రాణము. కాల పరిమాణము లోని యొక నియత విభాగమునకు కల యని పేరు. నేటి గడియారముల లోని సెకండు కాలములో నాల్గవ వంతు కాలము "కల" యని తలచ వచ్చును. కలలకు లయద్వారమున సంఖ్యాద్వారమున వృద్ధి కలుగును. కలావృద్ధి ననుసరించి యక్షరవృద్ధి. కలానుసారమునసె నర్తకీవృద్ధియు సిద్ధ మగును. మొదటి యాసారితములో నృత్తప్రయోక్త్రి నర్తకి యొక్కతెయె యుండును. రెండవ యాసారితమున నిద్దరు. ఇట్లు క్రమవృద్ధి యుండును. ఇట్లు వృద్ధియోగమున వర్ధమానక మగును. "యస్మా న్నృత్యాచ్చ వర్ణాచ్చ వాద్యాత్తాలాత్ లయాదిభిః వర్ధతేఽభినయా చ్చైవ ప్రయోగో వర్ధమానకః" —నృత్యమున వర్ణమున వాద్యమున తాలమున అభినయమున లయాదులచే ప్రయోగ మభివృద్ధి పొంది నప్పుడు వర్ధమానక

మగునని యితరులును తెలియజెప్పిరి. ఇట్లు ప్రయోగములో నభివృద్ధి యున్నందున నీ వర్ధమానక మందు అంగహార ప్రయోగము పరిపూర్ణ మగు పిండీబంధ విధానము సమ్యక్ నిష్పన్న మగునని తాత్పర్యము.

## కుతపము

యథావిధిగా కుతప విన్యాసము చేయవలయును. చతుర్విధా తోద్యమునకు కుతప మని పేరు. వాని వాని స్థలము లందా యా వాద్యముల నుంచి స్వర తాల లయ కలాదులను చక్కగా కూర్చుకొని యన్నిటిని భద్రముగా సిద్ధముగా నుంచుట కుతప విన్యాసము. ప్రయోక్తలు కుతప విన్యాసానంతరము ఆసారిత ప్రయోగ మొనరింప వలెను. ఆసారిత మనునది గీతము. ఇది నాల్గు విధములు. తాల-మాన- కలా- తాన- మూర్ఛనా- స్థాన కర్మలలో నంతట చక్కగ ప్రసారము సరిచూచుట నాసారిత మందురు. మొదట నంతర్యవనికలో శుష్కాక్షరముగనె పలుకునది. అనంతర మాతోద్యములతో లగించు నది. ప్రయోగప్రస్తావము ప్రథమఫలము. అందరు సంతసించుటతో విఘ్నశమనము శాస్త్రీయ మయిన ఫలము. అంగకలాప మిట్లు ప్రయుక్త మయినప్పుడు ప్రయోగవిధి కలుగును.

## స్వరసంధానము

౧౪౦. తత్ర తూపోహనం కృత్వా తంత్రీగాన సమన్వితం
కార్యః ప్రవేశో నర్తక్యా భాండ వాద్య సమన్వితః

ఇకనిది ప్రయోగ క్రమము. తంత్రీగాన సమన్వితముగా ప్రథ మమున ఉపోహన మొనరింప వలెను. పిమ్మట భాండవాద్యములతో నర్తకి ప్రవేశింప వలయును. "ఉపోహ్యంతే స్వరా యస్మిన్నంగే= ఉపోహనం" స్వరము లే యంగమున సన్నిహితములై కూడు కొనునో యది యుపోహనము. ఉపోహనము గీతాంగము, గీతప్రవర్తక మయిన స్వరసంధాన మన్నమాట. భాండవాద్యముల నాశ్రయించిన గీతము వెలువడగానే స్తుత్యాదిరూప మయిన ప్రయోగ మారంభ మగును. అట్టి యారంభక విధానమే యుపోహనము. ఉపోహన మందు తంత్రీ గాన ముండును. సుషిరాతోద్య ముండును. ఘనావనద్ధము లాతో ద్యము లిం దుం డ వు. ఉపోహనము సమాప్తము కాగానే నర్తకి

ప్రవేశించును. అందు పుష్కరవాద్య ముండును. వాద్య మను కూలముగ ప్రయోగింప వలెను. వాద్యానుసారముగా గతి గీతి నియత మగును. గతి నియత మగు ననుట కరణాంగహారములు ప్రయోగింప వలెననుటయె. ఇది ప్రథమ ప్రయోగము.

## నర్తకి రంగ ప్రవేశము

౧౪౧. వైశాఖ స్థానకేనేహ సర్వ రేచక చారిణీ
పుష్పాంజలిధరా భూత్వా ప్రవిశేద్రంగమండలం

౧౪౨. పుష్పాంజలిం విసృజ్యాథ రంగపీఠం పరీత్య చ
ప్రణమ్య దేవతాభ్యశ్చ తతోఽభినయ మాచరేత్

యథావిధము నర్తకి రంగప్రవేశ మొనరింప వలసిన రీతి యిం దున్నది. నర్తకి వైశాఖస్థానకమున నున్నదై హస్త పాద కటి గ్రీవా రేచితముల నాచరించుచు పుష్పాంజలి ధరించి రంగమండపము ప్రవే శింప వలెను. ఆ పుష్పాంజలిని విడువ వలయును. పుష్పముల విడు చుట యనునది యంగభంగీ ప్రక్రమమున ప్రదర్శించుటగా నుండ వలెను. పిమ్మట రంగపీఠ మటు నిటు పరిక్రమింప వలెను. ఇందు సావ ధానముగా క్రమము పాటింప వలసి యున్నది. రంగదేవతలకు నమ స్కరించి పిమ్మట అభినయ మారంభింప వలెను. ఇది పరిపాటి. పుష్పాంజలి పట్టుట విడుచుట రంగ పరిక్రమణము దేవప్రణామ మన్నియు నొకసమయముననె యాచరించుట తగదు. ఇందలి క్రమా నుసరణములో నర్తకి భక్తి విశద మగును. ఆమెకు తదర్థభావన ముండును. విశిష్టముగా నభినయము భావించి యా నర్తకి స్వాత్మాభి ముఖ్య మాపాదించు కొనుట కవకాశ ముండును. పదార్థ వాక్యా ర్థాభినయములో నామె కూడ స్వసంవాదము సంపాదింప వలెను గాని సామాజికోద్దేశమున ప్రవర్తించుట సమంజసము కాదు.

## భాండ వాద్యము

౧౪౩. యత్రాభినేయం గీతం స్యాత్ తత్ర వాద్యం న యోజయేత్
అంగహార ప్రయోగే తు భాండ వాద్యం విధీయతే

౧౪౪. సమం రక్తం విభక్తం చ స్ఫుటం శుద్ధ ప్రహారజం
నృత్తాంగగ్రాహి వాద్యజ్ఞైర్వాద్యం యోజ్యం తు తాండవే

౧౪౫. ప్రయుజ్య గీతవాద్యే తు నిష్క్రామేన్నర్తకీతతః
అనేనైవ విధానేన ప్రవిశంత్యపరాః పృథక్.

గీత మభినేయ మగు నపుడు వాద్యము యోజనము చేయ రాదు. అంగహార ప్రయోగమున భాండవాద్య ముండ వచ్చును, గానముతో గూడిన వాక్య మభినయించు నపుడు గానము స్వాత్మాభిముఖ్యము సంపాదించును. గాన మట్లాభిముఖ్యము సంపాదింప వలసి యుండగా గానమె ప్రధానముగా నుండవలయును గాని దాని నాచ్ఛాదనము చేయు వాద్యము స్వతంత్రముగా నతిశయించు నది కారాదు. అభినయశూన్య మగు శుద్ధాంగహారము ప్రయోగించు నప్పుడు మాత్రము నృత్తప్రాధాన్య ముండును గావున తదనుసారి వాద్య ముండ వచ్చును. అది దాని ప్రయోగసమయము.

## తాండవ భాండ వాద్య ము

తాండవ మం దుపయోగించు భాండవాద్యమును సమముగా నుండ వలెను. కాల దేశ సమతాత్మక మయిన సామ్యము కూడినది కావలయును. రక్తి నిచ్చునది కావలెను. రక్తభావ మనునది స్వరోచ్చారణ స్థాన దేశ కృతముగా కల్గును. అప్పటి శబ్దము హృద్య మగును. అట్టి వాద్యము విభక్తము స్ఫుటము కావలెను. విడి విడి గా వాద్యస్పష్టత కలదై భాసింప వలెను. వాదనము లోని ప్రహారములు విశదముగా నుండ వలెను. నృత్తములోని యంగహారములను కరణములను గీతాంగములను సంగ్రహించు నదిగా నుండ వలెను. వాద్యస్వరూపము వ్యాఖ్యానించు నప్పు డీ యంశము మున్ముందు విశద మగును. అయినను ప్రకృతోపయోగము ననుసరించి యిట్లు నిరూపితము. గీతవాద్యము లిట్లు ప్రయుక్తములు కాగా నిక నర్తకి నిష్క్రమింప వలెను. ఇట్లె వేరొక నర్తకి మరొక నర్తకి రా వలెను. గీతవాద్యములు ప్రధానముగా నుండగా నర్తకి నృత్తమును ప్రయోగింప వలెను. స్వర రాగ నృత్త ప్రధానముగా నున్న యీ సమయమున సముచితముగా గీత వాద్య ప్రయోగము కూడుకొనగా నర్తకి వానిని త న్ననుసరించు వానిగా జేసికొని నిష్క్రమింప వలెను. ఇతర నర్తకీ వనిత లందరు వెంటనే రా గూడదు.

ఒకరొకరుగా రావలెను. క్రమముగా నిట్లు ప్రయోగము ప్రసరింప వలెను,

## నర్తకీప్రవేశము

ఆ విధముగా రంగమున ప్రవేశించు వనిత లెందరుండ వలయునో సంఖ్యానియమ మున్నది. నాల్గాసారితములలో నల్గురు నల్గురుండ వచ్చునట. ఇట్లు నర్తకీ వనితలు ప్రవేశించి పిండీబంధముల కూర్చుదురు. పర్యస్తక మను ప్రయోగ మాచరింపక పూర్వము పిండీబంధము కూర్చరాదు. పర్యస్తకానంతరమె పిండి యాచరింప వలయును. పూర్వము ప్రవేశించిన నర్తకి తరువాత ప్రవేశించు నర్తకీ సంబంధమున నుండదు. ఒకరు వెడలుట మరొకరు వచ్చుటలతో మహావాక్యానుసారమున నేకఘన మభిన్న మగు నంగవిక్షేపము భాసింప వలెను. ఇట్లు భాసింప జేయు ప్రయోగమును నృత్తాచార్య భాషలో "పర్యస్తక" మందురు. పిండీబంధోపయోగి నృత్తము రానంత వఱకు మొదట వచ్చిన నర్తకియె తా నొక్కతయె యయినను ఆసాంతము నభినయింప వలయును. ఇట్టి వన్నియు పారిభాషిక విశేషములు.

## పిండీబంధము

౧౪౬. పిండీం బద్ధ్వా తతః సర్వాః నిష్క్రామేయుః ప్రయుక్తితః
పిండీబంధేషు వాద్యం తు కర్తవ్యమిహ వాదకైః

పిండీబంధములను నిబంధించి రంగప్రవిష్ట లందరు నిష్క్రమింప వలెను. పిండీబంధములలో వాదకులు వాద్యముల సమంజసముగా కూర్ప వలెను. పిండీబంధములలో నంగహారములు చిత్రముగా విచిత్రముగా నానాప్రకారములుగా నుండును గాన తత్తదనుకూలముగా వాద్యయోజనము చేయవలయును. ఆసారితముల నన్నిటిని ప్రయోగించుట యావశ్యకము. ఈ లోపుగనె పిండీబంధముల కూర్చుట యుక్తము. పిమ్మట ఆసారిత ప్రయోగము లందలి విశిష్ట విశేషములను చతురముగా నాయోజనము చేయుట రమ్యముగా నుండును. ఒక్కొక యాసారితము పూర్తికాగా తదనంతర కార్యములను పూర్వము వలెనె గుర్తించునది.

౧౪౩. పిండీనాం వివిధా యోనిః యంత్రం భద్రాసనం తథా
శిక్షాయోగస్తథా చైవ ప్రయోక్తవ్యః ప్రయోక్తృభిః

పిండీబంధ ప్రకారముల ననుక్రమమున నాసారితములందు ప్రయోగింప వలెనని చెప్పి నట్లయినది. ఒకరే ప్రయోగించునది విశేషాంతరములచే హృద్య మగునది పిండీబంధస్వరూపము. పిండరూపముగా నుండుటచే పిండీబంధ మని సంజ్ఞ. పిండీబంధములో నాల్గు రీతులు కలవు. పిండీబంధము, శృంఖలిక, లతాబంధము, భేద్యము నని. నర్తకీయోజ్య మగు పరస్పర సంబంధము దీనిలో నుండును. ఒకదానిలో నన్నియు సజాతీయములై యుండును. ఒకే నాలమున కూడి యున్న రెండు కమలముల వలె గోచరించును. మరొక దానిలో విజాతీయసంబంధము కలిసి కన్పడును. హంస వదనముచే గ్రహించిన నాలము నందలి నలిన మిం దుపమానముగా గుర్తింప వలెను. నర్తకీత్రయము దీని ప్రయోగింప దగును. ఇంతకన్న విచిత్రత సహించునదియు కలదు. వల వలె విచిత్రమై సజాతీయ విజాతీయముల కలిపికొనును. నర్తకీ చతుష్టయము దీని ప్రయోగింప జనును. వేరొక దానిలో నవాంతర భేదము భాసింపదు. మహావాక్యార్థముగా నేకయోజనములో విలీనమై యుండును. సామాన్యముగా సర్వపిండీబంధముల నిష్పత్తిప్రకారము ఆధారాది విధానముల ననుసరించి యుండును.

## పిండీరచన

పిండీరచనలకు నిష్పత్తివిధానము వివిధము. యంత్రము, భద్రాసనము, శిక్షాయోగము అనువానిని ప్రయోక్తలు ప్రయోగింప వలెను. భూమి దేహ మాకాశము మొదలగు నాధారముల యనుసంధాన ముండుట యంత్రము. ఇం దనేక రీతుల సంభవము కలదు. భద్రాసన మనునది ప్రసిద్ధమె. భూమ్యాదులం దునికి దీనిచే నిగ్రాహ్యము. శిక్షాయోగ మనునది కరణాంగహార విశేషము లందు అంగ విశేష విక్షేపముల వైచిత్ర్యాభ్యాసము. ఇది చాల ముఖ్య మయినది. చక్కగా నందరు సర్వప్రకారముల వీని యోజింప వలెను.

ఇట్లు నాట్యములో నుండు గీతము, అంగకము, వాద్యము,

ర్తకీపిండీబంధాదులు నృత్తమున గూడ నుండుట నుపదేశించుటచే నాట్యము నృత్త మభిన్నమని సూచిత మగుచున్నది. ఈ పిండీబంధ ప్రకారములు సంప్రదాయమున లక్ష్యప్రదర్శనమున విచ్ఛిన్న ప్రాయ ములుగా నున్నట్లు పొడగట్టును. నానా విధానములలో నివి సంకీర్ణ ములు వ్యాకీర్ణములు నయినవి. పుల్లా పుడకలలో పడిపోయిన మహా షధి వలె నయినవి. అనవధాను లశ్రద్ధధాను లుద్ధరించుట శక్య మగుట లేదు. సావధానత యున్న శక్యము కావచ్చును. ఇందాలస్య ముండరాదు. ఇది భావింపుడు! ఒక నర్తకి ముందుగా రంగమునకు వచ్చి, మొదటి యాసారితమున నభినయించును. ఇక రెండవ యాసా రితము ప్రయోగించును. ఆసమయమునందు మొదటి నర్తకి కేవల మంగహార మాచరించును. పిమ్మట తృతీయనర్తకి వచ్చును. మూడవ యాసారితమున కభినయించును. అప్పుడు మొదటి యిద రంగహారములు ప్రయోగింతురు. చతుర్థనర్తకి నాల్గవాసారితమున నభినయించు నప్పుడు మొదటి ముగ్గురు నంగహార ప్రయోగమున రంజింప జేయుదురు. అభినయములందును మొదటి వారు కూడి యుండుటను కొందరభిలషింతురు. శృంఖలికాది పిండీబంధములో నర్తకీ బాహు బంధముల వైచిత్ర్య రచనమును కొందరు నిరూపింతురు. ఈ చెప్పిన విధానములను గుర్తించు కొనుచు వర్థమానమున ప్రయోగ మాచరించుట సముచితము.

## గీ త క ము లు — ఛ ం ద క ము లు

ఇక గీతకములయు ఛందకములయు విధానములను గుర్తించి నృత్త వాద్యములలో వాని ప్రయోగము తెలియ వలయును. సర్వ గీతముల యంతమున ఛందకము ప్రయోగింప వలెనట! ఛందకములు నృత్త తాల రూపముగా నర్తకీ లయ చరణాది రూపముగా లోక మున ప్రసిద్ధములై యున్నవి.

> ౧౪౮. తత్రావతరణం కార్యం నర్తక్యాః సర్వభాండికం
> క్షేప ప్రతిక్షేపకృతం తంత్రీగాన సమన్వితం

మొదట సర్వవిధ వాద్యభాండముల గూడి నర్తకి యవతరింప వలయును. ఆ యవతరణమున క్షేప ప్రతిక్షేపములు తంత్రీ గానములు

కూడు కొనవలయును. మొదటగా నాక్షిప్తిక యుపోహనము ప్రయోగించి నర్తకి ప్రవేశింప వలయును. పిమ్మట ఉపోహన మాచరించునది. తంత్రీగాన సమన్వితముగా పదయోజనము చేసి క్షేప ప్రతిక్షేపము లాచరించునది. గీతము నందుపనిబద్ధమై యుండు సర్వ వస్తువును మొదట చక్కగా నభినయింప వలెను. దానినె మఱల నృత్తమున యోజింప వలెను. ఆసారిత విధానములందు నిరూపించిన వానినె యిచట గూడ కూర్చు కొనవలయును. ఆసారితములలో వలె నర్తకీ వృద్ధి ననుసరించి నృత్త ప్రయోగ మాచరించునది.

> ౧౩౯. య ఏష వస్తుషు విధిః నృత్తాభినయ వాదితే
> తమేవాంగనిబద్ధేషు చ్ఛందకేష్వపి యోజయేత్

వస్తునిబంధనముల కల గీతకముల విధియు నిట్లే యున్నది. అంగనిబంధనము కల గీతలక్షణ మేవంవిధముగనె యుండును. ఒక నర్తకి యభినయ ప్రయోగము మొదట. అనంతరము నృత్తము. అందు భాండవాద్యాది ప్రయోగమునియతము. అది గుర్తించి నృత్తాభినయ వాదితము లందలి విధానమునె యంగ నిబంధనకము లయిన ఛందకము లందును ప్రయోగించునది. వాద్య వాదనములందు గుర్వాక్షరములను గాని లఘ్వక్షరములను గాని యథా ప్రయత్నముగా నుచ్చరించునది. గుర్వక్షరముల విశేషముల ననుసరించి వాదనములందు విశేష మేర్పడ వచ్చును.

> ౧౪౦. యదా గీతివశాదంగం భూయో భూయో నివర్తతే
> తత్రాద్యమభినేయం స్యా చ్ఛేషం నృత్తేన యోజయేత్

గానసమయమున ముఖాద్యవయవములు మాటిమాటి కావర్తనము పొందుట కలదు. నివర్తనము పొందుటయు నున్నది. అందు మొదట అభినేయము కూర్పవలెను. వెంట నృత్తము యోజింప వలెను. వస్త్వంగాదుల సమాప్తులందే నృత్త మొనరించుట కాక మధ్యసమయము లందును పరివర్తము లందొకప్పుడు నృత్త ముండు నని దర్శనము. అభినయమునందు పునరుక్తి యుండగూడ దనుట సత్యము. ఇట్టి విధానములం దపునరుక్తి సురక్షిత మగును. వాద్య ప్రాధాన్యమున నృత్త ముండునప్పుడు యథా సంభవముగా వాద్య

వైచిత్ర్యమును ప్రదర్శింప వలెను. వాద్య వైచిత్ర్యము కావ్యార్థమున కొంత నియతము కాక తప్పదు. కావ్యార్థ నియంత్రిత మయిన వాద్య వైచిత్ర్యమె శోభించును. ప్రకృతము "యథాసంభవ మయిన వాద్య వైచిత్ర్య"మనుట సంకోచ ప్రదర్శన మేమాత్రమును కాదు. గీతాచార్యులు వాద్యాచార్య వైచిత్ర్యమున కర్గలముగా నెన్నడుండరు.

పాణిత్రయ లయ యుతముగా వాద్యప్రయోగ ముండును. సమపాణి, ఉపరిపాణి, అర్ధపాణి యని పాణి ప్రయోగము త్రివిధము. లయానుసారమున వాద్య ముండుటను వాదకులనుమోదించి యనుసరింతురు. వాద్య వాదనమున మొదటి యావర్తములో కావ్యార్థాభినయ వశమున సంగమున గలుగు లయరీతి ననుసరించి వాద్యమొనర్ప వలెను. వాద్య లయ విధి గీతలయవిధి యెన్నడు వ్యతిక్రమణము పొందరాదు. తత్త్వము, అనుగతము, ఓఘము అను విధానములు వాద్య గతములు. నియతమయిన వీని ప్రయోగ విధానము రమ్యముగ నుండును. ఈ నృత్త మంతయు దేవదేవ మహాదేవుని స్తుతి నిమిత్తము. తత్పరితోషణమె దీని ప్రయోజనము. గీతకాసారితములలో ఛందకములలో నియమ విధానము లన్నియు నొక యదృష్ట సంపత్తి కగును. పాణికవిధానము పరిమిత శరీరమగుట స్వయముగా తాండవ భాజనము కానేరదు. అది పూర్వ రంగములో సుకుమారమగు లాస్య ప్రయోగమున కొంతగా సంగతమగును. ఆ లాస్య సత్తా వైదగ్ధ్యమున కీ పాణికవిధాన ముపకారిగా నుండును. పై చెప్పినవిధానమునె గీతములందాసారితములం దనుసరింప వలెను.

లాస్యము సుకుమారము. దేవస్తుత్యాశ్రయము. కామ సంభవ మయిన స్త్రీ పురుషుల సంలాపము శృంగార రీతికి హేతువు. అది సుకుమారము. లాస్యము సుకుమారము. అది కరుణ హాస్యాది మయమెన్నడు కాదు. స్త్రీ పురుషుల కొక కామముండును కదా! స్త్రీ పురుషుని కామించును. పురుషుడు స్త్రీని కామించును. ఇట్టి భావన కవి హృదయమున నుండును. అప్పుడు కవి పరస్పర హేతుక

ముగా స్త్రీ పురుషావస్థా నిబంధన మొనర్చును. శృంగార రసమునకు వ్యాపత్తి లేకుండునట్లు కవి నిబంధించును. పరమేశ్వరుడు తప మొనరించు చున్నాడు. భగవతి దేవి యేక హృదయగా విచ్చేసినది. మొదట పరస్పరావస్థా బంధముగా రతి లేదు. కామావస్థగనె యున్నది. అనంతరము వారర్థార్థ శరీరు లయిరి. ఇట్లు పరమేశ్వర చరితమున శృంగారమె సుకుమార మయినది. అట్లు భగవద్విషయమున కరుణము లేని శృంగారమె తత్త్వము. ఆ యవస్థలో ప్రయోక్తలు నృత్త మాయోజనము చేయుదురు. అది యుక్తము.

## నృత్త ప్రయోగము

౧౫౧. యత్తు సదృశ్యతే కించి ద్దంపత్యో ర్మదనాశ్రయం
నృత్తం తత్ర ప్రయోక్తవ్యం ప్రహర్షార్థ గుణోద్భవం

౧౫౨. యత్ర సన్నిహితే కాంతే ఋతుకాలాభిదర్శనం
గీతకార్థాభిసంబంధం నృత్తం తత్రాపి చేష్యతే

ప్రయోక్తలగు వారు నృత్త మెప్పు డెప్పుడు ప్రయోగింపవలెనో గుర్తించుట యావశ్యకము. సుకుమారమగు కావ్యము నాశ్రయించిన గానము సుకుమారము. తదంతర్లగ్న మగు నృత్తము నట్టిదే. ఒక యభినయ ప్రయోగానంతరము వేరొకటి యారంభింప బోవు నప్పుడు, గీతక్రియలకు విస్తార మాపాదించు స్థాయ్యాది వర్ణనివృత్తి సమయములందు, అభ్యుదయ స్థానమునందును నృత్తము ప్రయోగింపవలెను. పరావర్తాది విధానములలో వాద్య వైచిత్ర్యముతో కూడిన నృత్తము నధ్యాయాభ్యుదయ స్థానభేద భావజ్ఞుడయిన నృత్తాచార్యుడు ప్రయోగింప వలెను. అఖండమగు కావ్యమొక్కటి దంపతులయిన స్త్రీ పురుషుల కామ సంశ్రయ మయిన యర్థమును వాచ్యముగ నాశ్రయించి యుండును. అప్పుడు మదనాశ్రయ నృత్తప్రయోగ మావశ్యకము. అట్లె దంపతుల యాస్థానబంధ గుణము ప్రహర్ష ప్రయోజనముగా నున్నప్పుడు నృత్తము ప్రయోగించునది. ఇది యర్థము. దంపతులు దూతీవచనము నాకర్ణించు నంశమున ప్రహర్ష గుణారంభము ననుసరించి నృత్తము ప్రయోగింపవలెను. నానా కామావస్థలలో నృత్తయోజన మున్నది. ఈ విధానములు చూడగా నాయిక లందరి

వాసకసజ్జిక యభిసారికలకు సంబంధించిన నృత్తము భాసించును. అట్లె స్వాధీనభర్తృక విషయమున గూడ నృత్త మున్నది. కాంతుడు సన్నిహితుడై యున్నప్పుడు వసంతాది ఋతువుల యభిమర్శనమునను చంద్రోదయాది కాలముల యవమర్శనమునను నృత్తముండును. వసంత శోభావలోకనములో, చంద్రోదయ సమయ శోభా భావనములో నృత్త ముండును. అట్టి నృత్తము గీతకార్థముల సంబంధించియె యుండును. ఇ ట్లౌచిత్యాపేక్షమయిన నృత్తమె శోభా జనకము.

౧౫౩. ఖండితా విప్రలబ్ధావా కలహాంతరితాపి వా
యస్మిన్సంగేతు యువతి ర్న నృత్తం తత్ర యోజయేత్

౧౫౪. సఖీప్రవృత్తే సంలాపే తథా సన్నిహితే ప్రియే
నహి నృత్తం ప్రయోక్తవ్యం యస్యావా ప్రోషితః ప్రియః

౧౫౫. దూత్యాశ్రయుం యువాతుస్యా దృతుకాలాది దర్శనం
ఔత్సుక్య చింతాసంబంధంన నృత్తం తత్రయోజయేత్

ఖండిత, విప్రలబ్ధ, కలహాంతరిత, ప్రోషితభర్తృక లయిన నాయికల విషయమున నృత్తము తగదు. గీయమాన గీతము కావ్యార్థముతో స్పష్టముగా సంబంధించి యున్నప్పుడు ఖండిత యయిన నాయిక నృత్తము ప్రయోగింపరాదు. అట్లె విప్రలబ్ధ కలహాంతరిత నృత్తము ప్రయోగింప జనదు. ప్రియుడు సన్నిధానమున లేనప్పుడు సఖి యొక్కెత సంలాప మారాభింప వచ్చును. ఆ నాయిక ప్రోషిత పతిక, అప్పుడు నృత్త ప్రయోగముచితము కాదు. నాయక విషయమై సంలాప మారంభించి తత్సమాగమమునకు సముచిత మయిన యుపాయ పర్యాలోచన వ్యాపారములో నృత్త ప్రయోగ ముచితము కాదు. విరహోత్కంఠితా విషయమున కూడ నిట్లె భావనము. ప్రియుడింటికి రాకున్న సమయమున వాసక సజ్జికయు నృత్త మొనరింపరాదు. కామావస్థలలో గూడ నాయకుడు మంచివాడు కాకున్న దుర్లభుడయిన భ్రష్టుడయిన నాయిక యాతని హృదయమున భావింపదు. అప్పుడేమి నృత్తము? ఋతుకాలాది దర్శనము దూత్యాశ్రయముగా నున్నప్పుడు ఔత్సుక్యము చింత సంబంధించి యుండును గావున నృత్త ప్రయోగ ముండదు. అట్టి సమయములందు యథాక్షర మభినయమె. అది ద్విసంఖ్యాతము త్రిసంఖ్యాతము కాదు. నృత్త వ్యతి

రేకములను వ్యుదాహరణముల గుర్తింప వచ్చును. వాని విషయమై యంతగా స్వకంఠవచన మపేక్షితము కాదు.

౧౫౬. యస్మిన్నంగే ప్రసాదంతు గృహ్ణీయా న్నాయికా క్రమాత్
తతః ప్రభృతి నృత్తంతు శేషేష్వంగేషు యోజయేత్
౧౫౭. దేవస్తుత్యాశ్రయకృతం యదంగంతు భవేదథ
మాహేశ్వరై రంగహారై రుద్ధతైః తత్ప్రయోజయేత్
౧౫౮. యత్తు శృంగార సంబద్ధం గానం స్త్రీ పురుషాశ్రయం
దేవీకృతై రంగహారైః లలితైః తత్ప్రయోజయేత్

నాయిక ప్రస్పందితమై ప్రసన్న హృదయ యగునేని నృత్త మారంభింప వచ్చును. అంగశోభ నుపలక్షించుకొని సర్వాంగములందు నృత్త మనుగతము చేసికొనవచ్చును. ఇట్టి యీ విశేషము ఖండితా విషయమె. అయినను సర్వయునతి విషయముగా భావింప వచ్చును. ప్రియుడసన్నిహితు డయినను నాయిక యాస్థాబంధము కలదగునేని నృత్తయోజన మావశ్యకమె యగును. ఖండిత నాయికా విషయమున వలనావర్తనాది రూపనృత్త యోజన ముచితము కాద నుట యుక్తము కాదు. సామాన్యాభినయములో నాంగికాభినయములో నిది విశద మగును. దేవస్తుత్యాశ్రయముగా విషయము సిద్ధమయినప్పు డుద్ధతములయిన మాహేశ్వరాంగహారముల ప్రయోగింప వలెను. అట్టి నృత్త మప్పుడుచితము. స్త్రీ పురుషాశ్రయ మగు శృంగార సంబద్ధ గాన మున్నప్పుడు లలితములగు దేవీకృతాంగహారములతో నృత్త ప్రయోగ ముచితము. విద్యుద్భ్రాంతము గరుడప్లుతకము మొదలగునవి మహేశ్వర ప్రయుక్తములు. తలపుష్పపుటము లీననితంబము మొదలగునవి దేవీకృతములు.

౧౫౯. కృత్వైకం పరివర్తంతు గానస్యాభినయన్యచ
పునః పాదనివృత్తింతు భాండవాద్యై ర్నియోజయేత్

నర్తకి రంగమున ప్రవేశించినదే మొదలుగా నభినయ మారంభింపదు మొదలుగా గీతమును శుద్ధ విభాగముగా గానింపవలెను. దానిని మరల పరావర్తింప జేసి యభినయింప వలెను. భాండవాద్యముతో నభినయించుట విధి కదా! పాద నివృత్తి నుపలక్షించుకొనుచు నర్తకి ప్రవర్తించును. అంగవస్తు నివృత్తిలో వర్ణాంతర

ఘనివృత్తులలో భాండవాద్యము వైచిత్ర్య యుక్త మగును. తదనుసార మున నృత్తాంగహార యోజన మాచరించును.

## ప్రయోగ ఫలము

౧౬౦. మహేశ్వరస్యచరితం యఇదం సంప్రయోజయేత్
సర్వపాప విశుద్ధాత్మా శివలోకం స గచ్ఛతి

ఇంతటి ప్రయోగమున కిది ఫలము. పూర్వరంగ గత ప్రధాన ఫలముననె యిది ఫలవత్తయగుట కాదు. దీనికి పృథక్ఫలమున్నది. స్వతంత్రముగా దీని ప్రయోగింప వచ్చును. మహేశ్వరచరితమిది మహేశ్వర చేష్టితము. ఈచేష్టిత సంప్రయోగము సర్వపాప విశుద్ధి సంపాదకము. శివలోక ప్రాపకము. ప్రయోక్త యీ ఫలభాజను డగును. ఇట్టి ఫలసంపత్తి ప్రేక్షాప్రవర్తకు డయిన యర్థపతికిని గలదు. సామాజిక వర్గమునకును గలదు. పాపవిశుద్ధి యున్నగాని శివలోక గతానంత ఫలము లభింపదు. నృత్తము సర్వ మిచ్చును.

ఇప్పటి కిది యంతయు తాండవ విధి సృష్టి. నాట్యాత్మక ప్రయోగము కన్న విలక్షణ స్వభావము. సాక్షాత్కార కల్ప మయిన నాట్య రూపత యిందుండక పోయినను సామాజికులకు వలె ప్రయోక్తలకు తన్మయీ భావ సంపత్తి యుండును. నాట్య సంస్కారా పేక్ష మయిన యభినయ పుష్టి యుండును. కాని చతుర్విధా భినయము లిందు యోగము పొందవు. రస భావములు ప్రధానములు కావు. గీత వాద్య నృత్తములకు యథేష్ట ప్రాధాన్య ముండును. నర్తకీ వృద్ధి యుండును. కావ్యము నందలి వస్తువు నిది యపేక్షించు నది యగును. నాట్య ప్రస్తావనా ప్రాణ మగుట నిది ప్రతిబింబాత్మకము. ఇందలి మద మూర్ఛ్నాములలో తత్ప్రాప్తి రాదు. ఇందుండు గీతకాదు లదృష్ట ప్రయోగము లగును. గీతాది ప్రాధాన్యముననె నృత్త ప్రయోగ ముండు ననుట బహూక్తమె కదా! అచ్ఛేద్యాత్మక మయిన కావ్యము గీత్యాధార మయినను పిండీబంధ ప్రకారములోని వైచిత్ర్యము తుదిలో నృత్త మాత్రముననె విశ్రాంత మగును. ఇట్లు నృత్తము నాట్య విలక్షణ మనుట యొక భావుక సమ్మతము. నాట్య నృత్తములు తుల్యాను కారము లయినను కొంత భేద మున్నదట.

రసభావములు నాట్యమందుండును. నాట్యము పూర్ణము. నృత్తములో హస్త శిరము లున్నవి. నృత్త మపూర్ణము. ఇది హర్ష వార్త్తిక మతము. నృత్తము కతిపయ నాట్యాంగములు కలది. నృత్త మభ్యాస-ఫలమని భట్ట యంత్రు డనినాడు. వివాహాదులలో నాదిమ మంగలము వలె నృత్తముండు నని లోల్లటు డనును. లాస్య తాండవములును నాట్య భేదములు పూర్ణానుకార స్వరూపములని యొకరి మతము. స్వస్వ మతముల ననుసరించి యనేకు లనేకము లనిరి. అందరును ప్రసంగాంగముగా నివి యన్నియు పలుకుదురు. ప్రసక్తాను ప్రసక్తములు నృత్త గతము లుండును. అవి నాట్య గతములకు విచ్ఛేద మీయరాదు. ఇది నాట్యవేద విధి. ఇది నాట్యము. ఇది వేదము. ఈ విధి ప్రయోగము. ఇది శివము.

## నాట్యరహస్యము

అమృతమంథన మనెడు సమవకారమును బ్రహ్మ వచనానుసారమున ప్రయోగించిరి. త్రిపుర దాహమను డిమమును ప్రయోగించిరి. శివుడు సుప్రసన్ను డయినాడు. కరణాంగహారముల ప్రయోగముచే పూర్వరంగ ప్రసాదన విధానము నాతడు సూచించినాడు. భరతునకు వాని తత్త్వము నిరూపించుటకై శివాజ్ఞ ననుసరించి తండు వారంభించి చెప్పెను. తండు ప్రోక్తములకు తాండవ మను వ్యవహారము కలిగినది. అంగహారములు శివ ప్రీతి కరములు. అంగహారములు ముప్పదిరెండు. అవి యింక నెన్నియేని కావచ్చును. అవి యన్నియు కరణములచే నిష్పన్నము లగును. కరణ పరిజ్ఞాన మున్నగాని యంగహారము తెలియదు. కరణములు నూట యెనిమిది. వీని-నామములం దౌచిత్య మున్నది. భావానుసారిత యున్నది. పాద కటీ హస్త గ్రీవా రేచకములు నాలుగు నానా విధములగు పిండీ-బంధములు నృత్తమునకు స్వరూపసంపదను కూర్చునవిగా నున్నవి.

నృత్త మెప్పు డెప్పు డాచరింప వలయు నన్నది యుత్తర మధుర మయిన సుందర ప్రశ్న. దేవీ దేవుల నృత్త ప్రయోగము లాస్య తాండవ రూప సంపాదక మయినది. పూర్వ రంగాంగములగు నాసారితముల విధానములు చూచుకొని యొనరించు నృత్త

ప్రయోగము రమ్యమయినది. వర్ధమాన రీతి నున్న నర్తకీ కర్మ, నర్తకీ వృద్ధి, గీత చ్ఛందకముల లక్షణ స్వభావములు, వస్త్వంగ నిబద్ధములగు గీతములు నృత్త ప్రాణములుగా ప్రతిష్ఠితములు.

నృత్తమున వాద్య భాండ ప్రయోగము గంభీరత నాపాదించి సంపూర్ణత నిచ్చునదై యున్నది. నృత్త యోజనములోని వాద్య విధి సుకుమార నృత్త విధానము సావధానముగా సంభావింప దగి యున్నది. నాయికా భేదమున భావ భేదమున నృత్త ప్రయోగ నియమము నృత్త గౌరవమునకు నిదానము. రేచకములు కరణము లంగహారములకు రూప వైభవము నిచ్చి హరదేవు ప్రీతి కొఱకగుట యిందలి సంప్రదాయము. ఇవి యన్నియు పూర్వ రంగాంగములుగా ప్రయుక్తములు కావలయు ననియె నియమముకాని దీని విషయమున ప్రత్యేక ప్రయోగా భ్యనుజ్ఞయు కలదు. నృత్తమునకు నాట్య ఫలము ననె ఫల మున్నది. అయినను వేరొక ఫలము నున్నది. అది దేవతా తోషణము. అది శివ ప్రీతి. శివ ప్రీతికై నృత్త మొనరించుట పాప విశుద్ధి నిచ్చునని శివలోక మందించునని శివ భావము కూర్చునని నాట్య రహస్యము.

నృత్త ప్రయోగములో నర్తకి సామాజిక సంతోషము నభినం దనమునె భావించునది కారాదు. ప్రయోగ వైకల్యము లేకుండు నట్లు స్వాత్మాను సంధాన మొనరించునది కావలెను. నాట్యమేమి? నృత్తమేమి? వీని సంబంధమేమి? ఇవి భిన్నములా? అభిన్నములా? వీని వివేకమెట్టిది? అనునవి సమాధి గహనము లయిన సులభ ప్రశ్నలు. వీని గ్రంథి విమోచనమున కభినవుడె కావలయును. ఆతని భారతి నాట్య భారతి. అది శివభావ భారతి. భరత భారతి కది నవ భారతి. అభినవ భారతి.

## ఋ షు ల ప్ర శ్న

భరతుని వచనము నాట్య సంతాన కారణము. ఋషులు సావధానముగ వినిరి. హృష్ట మానసు లయిరి. నాట్యము చెప్పుమని మునులు భరతు నడిగిరి. దైవ వశమున మహాఫలము నృత్తమును భరతుడు నివేదించెను. నృత్త వివేకమున వారు నాట్యము గుర్తించిరి.

నృత్తము తెలియగా తద్వివేకమున నాట్యము సుష్ఠు విజ్ఞాత మయి-
నది. తదనురక్త మయిన నాట్యము హృదయావర్జన మొనరించును
గదా? వారందరు హృష్ట మానసు లయిరి. గురు వుపదేశించిన విష
యమును శిష్యుడు సరిగా గ్రహించి, స్వహృదయ సంవాదమున
ధరించి సామర్థ్యము కలవాడగుట సముచిత మయిన శిష్య సంపత్తి.
దాని జూచిన గురువున కుత్సాహము కల్గును. పూజా మధ్యమున నె
నృత్తము ప్రవేశించినది. ఈ చతుర నిరూపణ సార మట్టిది. త-
త్తాత్పర్యమును భావించి ఋషు లిట్లు పలికిరి.

౧౬౧. యథా నాట్యస్య జన్మేదం జర్జరస్యచ సంభవః
విఘ్నానాం శమనం చైవ దేవతానాంచ పూజనం
౧౬౨. తదస్మాభిః శ్రుతం సర్వం గృహీత్వా చావధారితం
నిఖిలేన యథా తత్త్వ మిచ్ఛామో వేదితుం పునః
౧౬౩. పూర్వరంగం మహాతేజః! సర్వలక్షణ సంయుతం
యథా బుధ్యామహే బ్రహ్మన్! తథా వ్యాఖ్యాతు మర్హసి

బ్రహ్మన్! నాట్యజన్మ నిరూపించితివి. జర్జరోత్పత్తి చెప్పితివి.
విఘ్న శాంతి దేవతా పూజ నిరూపించితివి. సర్వము వినినాము.
గుర్తించినాము. నిశ్చయించినాము, మాకు తత్త్వాభి నివేశనము
కలుగు చున్నది. సర్వము మఱల ప్రబోధింపుడు. "పూర్వరంగము"
గుఱించి తెలియ వలె నని యున్నది. పూర్వరంగము సర్వ లక్షణ
సంయుక్తముగా మేము తెలిసి కొనునట్లు వ్యాఖ్యానింపుడు. వ్యాఖ్యా
ప్రకార విషయమున గూడ ఆచార్యాన్వేక్షణ మపేక్షితము కదా!
మునుల వచనమును విని భరతుడు పూర్వరంగ విధి ప్రక్రమించెను.
"మీరు భావుకులు. మహాభాగులు "పూర్వరంగం గదతో మే
నిబోధత" వాక్యానుసారముగా పూర్వరంగము చెప్పుదును. నేను చెప్పు
నదియె కాక బాగుగ భావించి మీరు గుర్తింపుడు! చెప్పుటలో వఱుస
అటు నిటు నుండ వచ్చును. శబ్దక్రమ మేమిటె! అర్థ క్రమ మాద
రింపుడు!

## పూర్వరంగము

౧౨౪. యస్మా ద్రంగ ప్రయోగోయం పూర్వమేవ ప్రయుజ్యతే
తస్మాదయం పూర్వరంగో విజ్ఞేయో ద్విజసత్తమాః !

ఈ రంగ ప్రయోగము పూర్వమే ప్రయుక్త మగును గాపున పూర్వరంగ మందురు. బహి ర్యవని కాంగములు పూర్వరంగము. విశిష్ట గతి గతము లయిన గీతకములు ఉత్థాపనములు ధ్రువా రూప ములు పూర్వరంగమని వ్యవహారము. "గీత తాల వాద్య నృత్త పాఠ్యం వ్యస్త సమస్తతయా ప్రయుజ్యమానం యన్నాట్యాంగ భూతం స పూర్వరంగః" గీతములు వాద్యములు నృత్తములు పాఠ్య ములు వ్యస్తముగ గాని సమస్తముగ గాని నాట్యాంగముగా ప్రయోగించుట పూర్వరంగ మని తాత్పర్యము. "పూర్వః రంగే పూర్వరంగః" రంగమున పూర్వమె యుండునది పూర్వరంగ మయి నది. రంగమంటపములో ప్రత్యాహారాది కాంగములు లేక గాయ నాది సామగ్రి సంపన్నము కానందున నాట్య ప్రయోగము కుదరదు. పూర్వ రంగ పదమునకు 'రంగమునకు పూర్వభాగ' మని యర్థము చెప్పుటయసత్. యుక్తము కాదు. ఇది మండపైకదేశము కాదు. నాట్యైకదేశము కాదు. ఉత్త భావానుకీర్తన మొనరించు వ్యాఖ్యా నానుకారమును గాదు. శిక్షాదికము వలె నిది పారమార్థికము. ప్రయోగ సంపత్తి కుపకరణము. ఇందు నృత్తము వైచిత్ర్య కారిగా ప్రవేశించును. "నాట్యరూపగతం నృత్తం" అనిన విధమున నృత్త మనుకార ధురారోహి యగు చున్నది. ఇంక నిది దేవతా పరితో షణ ఫలకము. ధూప విలేపనాదికము వలె దేవతల తోష పెట్టును.

## అంగములు

౧౬౫. అస్యాంగాని తు కార్యాణి యథావదనుపూర్వశః
తంత్రీ భాండ సమాయోగైః పాఠ్యయోగ కృతైస్తథా

పూర్వ రంగాంగము లనేకము లున్నవి. వాని ననుపూర్వముగా నాచ రింప వలెను. పాఠ్యములతో కూడు కొనిన తంత్రీ వాద్యములతో భాండ వాద్యములతో సంగముల ఘటింప వలెను. ప్రత్యాహారము మొదలుగా ఆసారితాంతము లయిన తొమ్మిది యంత ర్యవనికాంగ ములు బహి ర్యవని కాంగములు పదియున్నవి. గీతక ప్రయోగము మొదలుగా ప్రరోచనాంతము లయిన దశాంగములను యథా స్థానము ప్రయోగింప వలెను. అంగముల న్యూనాధిక భావమున పూర్వరంగ

భేదము లనేకములు కలుగును. ఎచ్చటనో నిరూపింప వలసిన వాని నిచటనె నిరూపించుట తంత్ర భావా నభిజ్ఞులకు సమ్మోహ మాపాదించును.

౧ ప్రత్యాహారము ౨ అవతరణము
౩ ఆరంభము ౪ ఆశ్రావణము
౫ వక్త్రపాణి ౬ పరిఘట్టనము
౭ సంఘోటనము ౮ మార్గాసారితము
౯ ఆసారితము.

ఈ తొమ్మిది యంగములు బహిర్గీతములు. యవనిక లోపలి భాగమున నున్న ప్రయోక్తలు తంత్రీ భాండ యోజనముతో ప్రయోగింప వలెను. పిమ్మట సర్వ కుతప ములతొ సంబంధింప జేసి ప్రయోగించునది. ఇక యవనిక తొలగించి నృత్త పాఠ్యములను కుతప సంయుక్తముగా ప్రయోగింప వలెను. ఒక గీతకము యోజనము చేయవలెను. తాండవము ప్రయోగించు నపుడు వర్ధమానమును గూడ కూర్ప వలెను.

౧౦ ఉత్థాపనము ౧౧ పరివర్తనము
౧౨ నాంది ౧౩ శుష్క
౧౪ అవకృష్ట ౧౫ రంగద్వారము
౧౬ చారి ౧౭ మహాచారి
౧౮ త్రికము ౧౯ ప్రరోచన

ఈ యంగముల నన్నిటిని పూర్వరంగ విధానములో ప్రయోగింప వలెను. వీని స్వరూప పరిచయ మొక కొంత యావశ్యకము.

౧. ప్ర త్యా హా ర ము. కుతప విన్యాసమునకు ప్రత్యాహార మని పేరు. నేపథ్య గృహ ద్వారముల మధ్యగా మార్దంగికుడు పూర్వాభిముఖుడై యుండవలెను. పాణవికు లాతనికి వామ భాగమున నుందురు. రంగ పీఠమునకు దక్షిణముగా నుత్తరాభి ముఖుడై గాయను డుండును. ఆతని యెదుట నుత్తరమున దక్షిణాభిముఖముగా గాయనీ స్త్రీ లుపవిష్టలగుదురు. వామమున వైణికుడుండును. వేరొక ప్రక్కగా వంశ కారికు లుందురు. ఇది యంతయు కుతప సన్నివే

శము. ప్రత్యాహార మొక విచిత్ర విన్యాసము. శబ్దవిశేషము ననుసంధానించుచు నాట్య భూమికచే నుజ్జ్వలత నాధానించు వర్గ మిందుండును. విప్రకీర్ణములుగా నుండు విశేషముల ధౌకనము చేయుట ప్రత్యాహార మగుచున్నది.

౨. అ వ త ర ణ ము. గాయకుల నివేశనమున కవతరణ మని పేరు. గాయకున కభిముఖముగా నాసీనలై రంగపీఠమున నుత్తరముగా గాయనీ గణముండుట కుతప విన్యాసములో మధ్యలో నుండును. గాయకుల నివేశన విన్యాసమునె యవతరణ మని గుర్తింప వలెను. రంజక వర్గమున గీత మవశ్య ముండవలయు ననుట నాట్యా చార్యులు నిర్దేశింతురు. పురుషుడు లక్షణోపేతముగా గీత విధానము ననుసరించి గాన మొనరించును గాని స్త్రీ విరహిత మయిన యీ ప్రయోగము సుఖావహముగా నుండదని సూక్తి కలదు. కాని కేవలము పురుషులె గాత లగుటయు నిట సూచిత మగును. గాయనీ గాయక సమావేశము సుందరమని యందరు సంభావింతురు. ఈ యవ తరణ కోటిలో ఛందోక్షర సమముగా బహిర్గీత మనుసరించు, స్త్రీ బాల మూర్ఖాది కుతూహల జనన మయిన వాద్యము ప్రయోగింప వలెను. గాయక నివేశన మనునది స్థాన స్వర సన్నివేశనమె కాని యుపవేశనము కాదని కొందరు భావింతురు. ఇట్టి యంశ విశేషము లను పరిశీలించెదము గాత.

3. ఆ ర ం భ ము. పరిగీత క్రియారంభమున కారంభ మని పేరు. అసలీ గీతారంభము కాకున్న నే యారంభము నుండదు. అయిన నీ ప్రయోగ క్రమ మొకందుకని యవధరింప వలసి యున్నది. సామాన్యముగా నీ పూర్వరంగాంగము లన్నియు దృష్ట ప్రయోజన ములు. ''తథాహి'' మొదట రంజక వర్గ ధౌకన ముండును. పిమ్మట నుపరంజక మగు గీతమె ప్రధానమగుట గేయమె యుండును. గీత గేయమునకు శారీరము బింబము. శారీర స్వరములె యన్నిట మూల భూతములు కదా! ఆ శారీర స్వరాను సంధానమునకై యాలాప మను నారంభ మావశ్యకము. పరిగీత క్రియాలాప మాలాప మని పట్లయినది.

౪. ఆశ్రావణము. ఆతోద్యముల రంజనమున కాశ్రావణా విధి సమర్థము. సర్వవిధాతోద్యములు తాల ప్రధానములై యుండును గదా! పూర్వరంగ మాతోద్య గర్భముగ నున్నదని యంతట విశదము చేయు విధాన మాశ్రవణా విధాన మగుచున్నది. క్వాణ నిక్వాణ సుభగము లయిన సర్వాతోద్యములు సముచిత స్వర సంధానము కలవై యున్నప్పు డుపరంజనము స్వతస్సిద్ధముగ భాసించును. అది యాశ్రావణావిధి యని గుర్తింపవచ్చును.

౫. వక్త్రపాణి. వాద్యముల వృత్తి విభాగమునకై వక్త్ర పాణి విధాన మావశ్యక మగుచున్నది. వాద్య వక్త్రమున పాణి యుండుట వక్త్రపాణి యని భావము. శారీర స్వరమును బింబభూత స్వరముగా భావించినప్పుడు వేణు స్వరమును ప్రతిబింబ భూత స్వర ముగా భావింతుము. ఈ వైణవ స్వర స్వరూపాను సంధానమునకు దక్షిణ వృత్తి వామవృత్తి మొదలగు వృత్తుల విభాగాను సంధాన రూపముగా నుండు ఆసారణము వక్త్రపాణి యగును. వక్త్రము ప్రారం భము. వక్త్రమున హస్తాంగులి వ్యాపారము వక్త్రపాణి యయినది.

౬. పరిఘట్టన. పరిఘట్టనము పరిచలనము. ఇది తంత్రిని మీటుట మద్దెల సాటుట యనవచ్చును. తంత్రుల ఓజః కరణమునకు పరిఘట్టన మావశ్యకము. వృత్తి విభాగములోని శుష్క ప్రయో గాను సంధానమునకు పరిఘట్టన మావశ్యకము.

౭. సంఘోటనము. పాణి విభాగమునకై సంఘోటనా విధి యావశ్యకము. వాద్యములతో చర్మావనద్ధము లయిన వాద్య ములు వీణా వాద్యముల కుపజీవకములు. ఆ యవనద్ధ వాద్యముల యనుసంధానమునకు సంవాది ధ్వనుల సరిచూచు కొనుచు నయిదు ప్రహారములు వేయుట సంఘోటన మగును. శరీరము నుండి దారు వులో ప్రవేశించి మర్దలమున గూడుకొని ధ్వని మనోహర మగును గదా! సంఘోటనము సమ్యక్ పరివర్తన మగును.

౮. మార్గాసారితము. "తంత్రీభాండ సమాయోగా న్మార్గాసారిత మిష్యతే" తంత్రీ వాద్యములయు భాండ వాద్యము లయు సమాయోగమున మార్గాసారితము కలుగును. ఒకదాని ధ్వని

వేరొక దానిలో సంక్రమించుటయె కాక అనుహార్యానుహర్తృ రూపమున నుండు వైణవ పౌష్కర శబ్దములకు పరస్పరము సమ్మేళ నము సంపాదింపవలెను. ఆ సమ్మేళనమె మార్గాసారితము. మార్గ మున సమ్యక్ సారణము గమన ముండుట మార్గాసారిత మగును. నానా ప్రకృతి నానా లక్షణ గోచరమగు మార్గము నందు వికృతి రూపముగా నుండు పుష్కర వాద్యమున కాసమంతాత్ గమనము సారణ ముండుటను బట్టి యీ పేరు సంగత మగు చున్నది.

౯. ఆ సా రి త ము. కలాపాత విభాగములకై యాసారిత క్రియ ననుసరింతురు. రాగ వాద్యకాల క్రియల స్వరూప సంధానమున గేయవస్తు గత తాల స్వరూపము నుపక్షేపించుట యాసారితము. గీత నియమాను సారులయిన ఆవాపాది కలలకు శమ్యాది పాతముల కనుసంధాన మాసారితము. అంతర్యవనికాంగము లన్నియు దృష్ట ప్రయోజనములుగనె యున్నవి. ఈ దృష్ట ప్రయోజనము లేక వీని ప్రయోగమె యుపపన్నము కాదు. ఇది యంతయు దేవతా కీర్తన రూప మయిన గీతవిధి. దృష్టార్థ ప్రయోగముల ముందుగ నాచరిం చుట సముచితము. అనంతర మదృష్టార్థముల ననుసరించుట యుక్తము.

౧౦ ఉ త్థా ప న ము. ఇటుపై యుత్థాపన విధి క్రియా పరిజ్ఞానము సముచితము. ఇది ప్రయోగ ముత్థాపింప జేయును.

౧౬౬. యస్మా దుత్థాపయంత్యాదౌ ప్రయోగం నాందిపాఠకాః
పూర్వమేవతు రంగేఽస్మిన్ తస్మా దుత్థాపనం స్మృతం.

నాంది పాఠకు లందరు ప్రారంభమున ప్రయోగము నుత్థాప నము చేయుదురు. ఈ నాట్య రంగారంభముననె యిది ప్రయుక్త మగును. అందువలన నిది యుత్థాపన మగును. రంగమున ప్రయో గించిన ప్రత్యాహారాదికము సర్వము నిది యుత్థాపనము చేయును. వాని వాని కన్నిటికి ఫలస్వరూపము నిరూపించి తగిన పాఠ్యమును సముచితా భినయమును స్ఫుటీకరించుట యీ యుత్థాపనము నందె యున్నది. పాఠ్యమున కవకాశ మిచ్చి దేవతా నుకూల్య మాపాదించి ఫల విశేష ముద్బోధించును. అపసారిత విధానమునందె వైచిత్ర్యా

ర్థమై కావ్యపాఠము కూడ సముచితము కావచ్చును. అందుననె పాఠ్యప్ర-
యోగ మన్నది సముచితము. రమణీమణుల కుపకరణము లగు
శయన విరచనాదికములలో ధూప దీపాంగ రంగ భోగ సామగ్రిలో
సుచితము లయిన రమణీ రమణుల యభిప్రాయములు విచిత్రాకృతు
లుండును గదా! యుద్ధోచిత వ్యవహారముల పట్ల కాతర జనుల
భయభావము లుండును. నృసింహ రచనా గరుడాకృతి యోగ
ముండును. అతి రమణీయ నాట్యము నం దివి యానుషంగికము లావ
శ్యకములును. ఇవి యన్నియు నుపరంజక వర్గ శ్లోకనాదికములం
దున్నవి. ఇట్టి వివి యన్నియు సుకుమార గీత పాఠ్యా భినయ యోగ
ముననె సిద్ధము చేయ వలయును. యవనిక తొలగగనె యుత్థాప
నాంగ మధ్యముననె పాఠ్య సహితముగా దీని ప్రయోగ ముండు
ననుట రంగ రహస్యము.

౧౧. పరివర్తనము. ప్రత్యాహారాది కాంగములను
పూర్వరంగముననె ప్రయోగింప వలెననుట క్రమసిద్ధ మయిన
యంశమె. అహరహమివి ప్రయోగ ప్రయోజ్యములు. నిత్యమివి
యిట్లుండ వలెను.

౧౬౭. యస్మాచ్చ లోకపాలానాం పరివృత్య చతుర్దిశం
వందనాని ప్రకుర్వంతి తస్మాచ్చ పరివర్తితం

రంగమునందలి నర్తకీ నర్తకులు నలుదిక్కులు పరావర్తనమున
తిరిగి లోక పాలురకు వందన మాచరింతురు. అది పరివర్తనము. రంగ
విఘ్న శాంతి కొనరింప వలసిన దేవీ దేవ నమస్క్రియ లిందు చతుర్ది
శము పరివర్తనమున గోచరించుటచే నిది పరివర్తన మన్న పూర్వరంగ
మయినది.

౧౨. నాంది. ఇది నిత్య పాఠ్యము. ఉత్థాపనా ద్యన్య
పాఠ్యములు ప్రయోగ వశమున నన్యథా యుపపత్తి కలవి కా
వచ్చును. నాందీ పాఠము నిత్య పాఠము. కావుననె పురాణ పాఠకులు
"నాంద్యంతే సూత్రధారః" యనిరి. ఈ నాందియె భారత్యంగ
నిరూపణమున "ప్రరోచన" యన్న పేరు కలదగును. నాంది జయా
భ్యుదయిని. నాంది మంగల్య.

౧౬౮. ఆశీర్వచనసంయుక్తా నిత్యం యస్మా త్ప్రయుజ్యతే
దేవ ద్విజ నృపాదీనాం తస్మా న్నాందీతి సంజ్ఞితా

దేవ- ద్విజ- నృపాదుల యాశీర్వచనముల కూడిన పాఠ్యము నిత్య ప్రయోజ్య మాన మంగల్యము నాంది యగును. నాంది పాద ముల యంతరము లందు వర్ధమానము ప్రయోగింప వలెను. గీతకు విధి మొదటి యంగము తరువాత కూడ నుండును. అంగ మధ్యమున నుండును. పూర్వరంగము శుద్ధము చిత్రమని రెండు విధము లగును. శుద్ధమున గాని చిత్రమున గాని గీతక ప్రయోగా నంతరము వర్ధమాన ప్రయోగ మభీష్టముగ భావింతురు.

౧౩, ౧౪, శు ష్కా వ కృ ష్ట : ఇది ధ్రువాపదము. అర్థము లేని "ఝంటుం ఝంటుం" అను శుష్కాక్షరములతో నుండును. ధ్రువ యొక్కటియే శుష్కావకృష్టత్వ ధర్మ ద్వయ విషయముగా నుండి శుష్కధ్రువ యవకృష్టధ్రువ యని వ్యవహారము పొందును. ఈ శుష్కావకృష్ట ధ్రువారీతి జర్జర శ్లోకమును ప్రదర్శించును. నాంది ప్రయోగించిన పిమ్మట నిట్టిదియే శుష్కాక్షరములచే ప్రయోగింప దగి యున్నది. ఇది శుష్కావకృష్ట ధ్రువ.

౧౫. ర ం గ ద్వా ర ము.

౧౬౯. యస్మా దభినయ స్త్వత్ర ప్రథమం హ్యవతార్యతే
రంగద్వార మతేజ్ఞేయం వాగంగాభినయాత్మకం.

రంగద్వార మను పూర్వ రంగాంగము వాగంగాభి నయాత్మ కముగా నుండును. ఇం దభినయము ప్రథమముగా నవతరించును గాన నిది రంగద్వారము. అభినయింపబడునది యభినయము రూపక విశేషము. ప్రదర్శింప బడబోవు రూపకమున కిది ద్వారముగ నుండును. ఈ రంగద్వారములో నా రూపకము సంక్షేపముగా నవత రించును. దాని కర్మక్రియలు అర్థ ప్రయోజనము లిందు కూడు కొనును. నిరూపితము లగును. త న్నిరూపణమునకు పాఠ్య ముపకరిం చును. పాఠ్య ద్వారమున రూపకార్థ మభినీయమాన మగును. ఈ రంగ ద్వారమున సామాన్యముగా నాట్య ముత్థాపిత మగుటయ కాదు. రూపక విశేషమున సముత్థాపిత మగునని వివేకము.

౧౬. చారి, శృంగార ప్రచారణ ముండుటచే "చారి" యని పరికీర్తిత మయినది. మహాదేవునకు మహాదేవితో పరిచయాత్మక మయిన చరిత మంతయు శృంగార ప్రధానము. అట్టి యాచరితమును కావ్యమున వర్ణించి నప్పుడు కావ్యమది స్తుతి ప్రధాన మగును. ఆ చరిత మంతయు అంగహారములుగా చారీ రూపముగా ప్రదర్శిత మగును. అదియె చారి. "శృంగారస్య ప్రచరణా చ్చారీ సం పరి కీర్తితా".

౧౭. మహాచారి. హరదేవుని త్రిపుర మర్దన మిందు భావనీయము. అప్పటి గీతము రౌద్ర రస భూయిష్ఠము. దానిని కావ్యమున స్తుతి రూపముగా వర్ణించి నప్పుడు త త్తదుచితము లయిన యుద్ధతములగు మండలములతో నంగహారములతో ప్రయోగింపవలెను. అది మహాచారి. "రౌద్ర ప్రచరణాచ్చాపి మహాచారీతి కీర్తితా".

౧౮. త్రిగతము. విదూషక సూత్రధార పారిపార్శ్వకులు మూవురు సంజల్ప మాచరించుట త్రిగత మని సంకేతము, రాబోవు నాటకములోని విశేషమును వా రాలాపము చేయుట.

౧౬౦. విదూషకః సూత్రధారః తథా వై పారిపార్శ్వకః
యత్ర కుర్వంతి సంజల్పం తచ్చాపి త్రిగతం మతం.

సూత్రధారున కిరుప్రక్కల నుండు పారిపార్శ్వకులలో నొకడు విదూషకుని వేష భాషలను అనుకరించు వాడగుట యాతడె విదూషకుడు. వారి సంలాపములో భవిష్య న్నాటకాంశము కూడి యుండును. ఈ మూవురిలో నది భద్రాయితమై యుండుట నిది "త్రిగత" మయినది. మాటలలో మాటగా వారు మాటలాడు కొనుచు కావ్యార్థము సూచింతురు.

౧౯. ప్రరోచన. కావ్యోపక్షేపము హేతువుగా కావ్యార్థ విషయమున సామాజికులకు సిద్ధ ప్రాయముగ నామంత్రణము సూచించుట ప్రరోచన యగును.

౧౬౧. ఉపక్షేపేణ కావ్యస్య హేతుయుక్తి సమాశ్రయా
సిద్ధేనా మంత్రణాయాతు విజ్ఞేయా సా ప్రరోచనా

"ఇదిగో! యీ ప్రయోగమున ప్రీతి కలుగును. వ్యుత్పత్తి కలుగును. దీని సంభావింపుడు. దర్శింపుడు." అని యెచ్చరిక చేయుట ప్రకృష్ట రుచి హేతు వగును. కేవల మట్టి వచనమున ప్రవృత్తి కలుగదు. వచన మది హేతు యుక్తమై యుండ వలెను. యుక్తి యుక్తమై యుండ వలెను. హేతు యుక్తి సమాశ్రయణ మనునది సంక్షేపముగా కథనము. ఇట్టి యీ కథనమున సామాజికులకు కావ్యార్థము నందాభిముఖ్య ముదయించును. అట్టి దిది ప్రరోచన యగుచున్నది.

ఈ పది యంగములు బహిర్యవనికాంగములు. దృష్ట ఫలములు. గీతక వర్థమానకముల ననుసరించి ధ్రువాగాన మున్నది. నాట్యము సర్వోప జీవ్యము. అవశ్యమది బుద్ధి ప్రవేశ్యము. సర్వ ప్రథమముగా నాట్యము బుద్ధి నివేశము పొందగా, ననంతరము సదాచార పాలనమునకై దేవతా వందన ముండును. పిమ్మట పరమాశీర్వాదన మభిముఖీ కరణార్థ ముపయోగించును. ఆ పిమ్మట నేవేని విఘ్నములు కలుగునేమో యను శంకచే శాంత్యుప కరణముగా నుత్తేజన మావశ్యకము. పిమ్మట పురాకల్ప ప్రక్రియా నుసరణమున ప్రయోక్తము ననుసంధానము చేయుట యుక్తము. పిమ్మట లోకమున నంతట శృంగార వీరములు రంజకములై పరమ పుమర్థతా ప్రకర్ష కలవిగా ప్రసిద్ధము లయినందున వాని యుక్తముగా గూర్చుట యావశ్యకము. ఇది యంతయు నాట్యమున సుశిక్షితులై విజ్ఞానులు కావలసిన సుకుమార జనులకు స్వాచ్ఛందత నీయ గలదు. సర్వ రంజక హాస్య ప్రాధాన్యమున కావ్య విశేష ముపస్థాపించి యందలి యభిధేయము ననుసంధానము చేయుట కవకాశ మిచ్చును. ఇట్లిది యంతయు సప్రయోజనముగ గ్రథనము పొందినది. దీని నీ విధముగా యథా శాస్త్ర మాచరించిన నాది వాక్యము పరిగ్రహించి నట్లగును. లౌకిక కర్తవ్య విషయ మనుసంధానించి నట్లగును. కావుననె నాట్యా రంభమున గీతకాదులు లౌకికాను సారులుగనె యున్నవి. ఈ ప్రయోగ మంతయు సుకుమార జన విషయ మయినందున నలౌకికములు లేవు. నాట్యము కేవలము రచనా ప్రధానము వైచిత్ర్యమున కూడి యుండదగినది. అదృష్ట ప్రయోజనకము నగును.

## నిర్గీత విధానము

ఒకప్పుడు చిత్ర దక్షిణము లయిన వృత్తి మార్గముల ననుసరించి యుపోహన ప్రత్యుపోహనములతో గూడు కొనిన గీతక మారంభ మయినది. అది దేవస్తుతి కలదై వాచ్యముగా దేవ కార్యము లభినందించు నది యయినది. నారదాది గంధర్వు లాగీతకము విన్పించు చున్నారు. అప్పటి సభలో దేవదానవు లున్నారు. గీయ మానమగు నా గాన మప్పుడు సుఖజనకము గనె యున్నది. సమ్యక్ లయ తాల సమన్వితమై యున్నను నిర్గీత మది విని దైత్యులు క్షుభితు లయినారు. సుఖ గానము వినియు దైత్య దానవులు మాత్సర్యమున క్షుభితులై యొక కర్తవ్య నిశ్చయ మూహించి యన్యోన్య మవష్టంభము కలిగి యిట్లనిరి.

> ౧౭౨. నిర్గీతంతు సవాదిత్ర మిదం గృష్ణా మహే వయం
> సప్తరూపేణ సంతుష్టాః దేవాః కర్మాను కీర్తనాత్
> వయం గృష్ణామనిర్గీతం తుష్యామోఽత్రైవ సర్వదా

వాద్యములతో నున్న యీ నిర్గీతమును మేము తీసికొందుము. తమ తమ కర్మ కీర్తన మున్నదని దేవత లన్ని విధముల సంతుష్టు లయినారు కదా! మే మీ నిర్గీతమును (శుష్క—మనెడు వీణావాద్యము) తీసికొని సంతుష్టి పొందుదుము. ఈ గీతమున మా స్తుతి కీర్తనము లేదు. అయిన నిందా భిమానిక మయిన పరితోషణ మున్నదని దైత్య దానవులు భావించిరి. దైత్యులట్లు నిర్గీతము స్వీకరించి "ఇది మాయధీనము. మాకీసాధనము సిద్ధ మయినది" యని మాటిమాటి కన జొచ్చిరి. దానవులట్లు సంతుష్టులై పునఃపునః సాధన మొనరించుట దేవతల కన్నెఱ్ఱ యయినది. దేవతలు కోపించి నారద గంధర్వు నిట్లనిరి.

## నిర్గీత ప్రయోగము

> ౧౭౩. ఏతే తుష్యంతి నిర్గీతే దానవాః సహ రాక్షసైః
> ప్రణశ్యతు ప్రయోగోయం కథంవై మన్యతే భవాన్?

"రాక్షసులు దానవు లందరు నీ నిర్గీతమున తుష్టు లగుచున్నారు. ఈ ప్రయోగము ప్రణష్ట మవుగావుత! మే మిష్టపడము. మా కర్మ

కీర్తన ముందులేమి? వీరు దాని తమ యధీనము కావించు కొని సంతుష్టి పడులేమి? నారదా! నీవేమి భావించుచుంటివో?" ఇట్లు దేవతలు పలుక నారదుడీ రీతి పలికెను. – "ధాతు వాద్యాశ్రయ కృతమయిన యీ నిర్గీతము నశింప రాదు. ఇది యుపోహనముతో కూడినదై ధాతు వాద్య విభూషితమై చక్కగా నుండగలదు. ఈ నిర్గీతా వనద్ధులయిన దైత్య దానవ రాక్షసు లెవ్వరును క్షోభము విఘాత మేమియు నాపాదింపరు. వారందరు తోషితు లయి నారు" నిర్గీతమున తంత్రీ విశేషాంగులి విశేష సంయోగ జన్యము లయిన స్వరధాతువులు కూడుకొని యున్నవి. అదృష్ట విశేషమున నిది రంజన మాపాదించును. విస్తార వ్యంజనాది సప్త భేద లక్షణము లన్నియు నిందున్నవి.

దైత్యులతో స్పర్థపడి దేవత లీ నిర్గీత విషయమున తగవు లాడిరి. దేవులకు నిది బహుమాన పాత్ర మయినది. ఆ నిర్గీతము బహిర్గీత మని యిక లోకప్రసిద్ధ మయినది. నిర్గీత మనునది వాద్యము పేరు. నిరర్థక మయిన గీతము కల దయిన దన్న యర్థము కూడ దాననె వచ్చినది. గంధర్వు లందరు దీని బహిర్గీత మని యనిరి. దానవుల కంటె దేవతలనె గంధర్వు లధికముగ మానింతురు. బాహ్య గీత మందు గానము చేసిరి. దీని నంతను దానవులు గుర్తింప వలెనని యు వారి సంకల్పము.

## చిత్రవీణ

౧౭౪. ధాతుభి శ్చిత్రవీణాయాం గురు లఘ్వక్షరాన్వితం
వర్ణా లంకార సంయుక్తం ప్రయోక్తవ్యం బుధై రథ.

౧౭౫. నిర్గీతం గీయతే యస్మా దుపదం వర్ణ యోజనాత్
అసూయ యాచ దేవానాం బహిర్గీత మిదం స్మృతం.

ఈ నిర్గీతము నెల్లప్పుడు సప్త రూపకముననె ప్రయోగింప వలె నని లేదు. నాట్యోప రంజనార్థ మయిన చిత్రవీణలో దీని ప్రయో గింప వచ్చును. కరతల నిష్కోటితములతో ప్రయోగింప వచ్చును. భాండ వాద్యమున గురు లఘ్వక్ష రాన్వితము చేసి ప్రయోగించునది. అప్పుడిది భాండవాద్యోప రంజకము నగును. అట్లే ధ్రువాగానము

లానంద పడుదురు. ఆరంభ ప్రయోగమున గంధర్వు లానందింతురు.

పూ ర్వ రం గ ప్ర వ ర్త న ము

౧౭౬. యేన తుష్యతి యో దేవో యస్య యస్మనసః ప్రియం
తత్త దాపూర్వరంగేతు మయా ప్రోక్తం ద్విజోత్తమాః

ఆశ్రావణాది చార్యంత మీ దైవత పుంజన మిట్లున్నది. పూర్వరంగము నందలి యాయా యంగముల వికల్పన మీరీతి నుండ దేవతా తుష్టియు సంకీర్తిత మయినది కదా! వారు వారు వాని వాని పరిగ్రహించి బహుమానించిరి. వారు పరితోషము పడిరి. ఇది యాదృచ్ఛిక సంప్రధారణమె యయినను దేవతా తోష నిమిత్తమై నది. దైవత పూజన మయినది. దేనిచే నే దేవుడు సంతసించునో? ఎవరి మనసున కేది ప్రియమో? యిది యంతయు పూర్వ రంగమున నిర్ణీత మయినది. ఇది యంతయు దేవతా పూజన మయినందున ప్రేక్షాపతి ప్రయోక్త్ర ప్రభృతుల కందరకు విశిష్ట ఫలదాయి యగును.

౧౭౭. సర్వ దైవత పూజార్హం సర్వదైవత పూజనం
ధన్యం యశస్య మాయుష్యం పూర్వరంగ ప్రవర్తనం
౧౭౮. యా విద్యా యాని శిల్పాని యా గతి ర్యచ్చ చేష్టితం
లోకాలోకస్య జగతః తదస్మిన్ నాట కాశ్రయే.

పూర్వరంగ ప్రవర్తనమను నిది సర్వదైవత పూజార్హము సర్వ దైవతముల పూజనము కలది. సర్వదేవతలు దీని ప్రశంస చేయుదురు. ఇది ధన సాధువు యశో వర్ధకము ఆయుష్యము. ఇది ధనాది సర్వ కారి యగుట నిం దేమియు విరక్తి లేదు. దైత్య దానవ దేవ సంతుష్టికై నిర్ణీతములు సగీతము లీపూర్వరంగమున నిరూపితము లయినవి. లోకాలోక జగమునకు సంబంధించిన విద్యా శిల్ప గతి చేష్టితము లన్నియు నాటకాశ్రయ మయిన యీ పూర్వరంగమున నున్నవి. ఈ పూర్వరంగమునందు ధ్రువాగాన ముపరంజక జ్యేష్ఠము. ఆ గాన ములో గాంధర్వము ప్రకృతిగా నున్నది.

గీ త క వి ధి

గీతక విధిని వర్ధమానమును ప్రయోగించి గీత కాంతమున

సందలి స్థాయ్యాది వర్ణములను ప్రసన్నాద్యలంకారములను బాగుగా కూడి యుండునట్లు సంనద్ధము చేసి యోజనా కుశలు రగు బుద్ధులు నిర్గీతమును ప్రయోగింప వచ్చును. ఇట్టి నిర్గీతము గానోప రంజకము నగును. నిర్గీత మను సంజ్ఞ చాల పురాణము. అది యేల కలిగినది? ఇట్లు కలిగినది. "అపదం వర్ణ యోజనాత్" అర్థమును గోచరింప జేయు పదములు లేక ఝుంటుం అను వర్ణముల యోజనమున నిది నిర్గీత మయినది. దేవతల యసూయచే బహిర్గీత మయినది. అసూయపడి బలమున బహుమాన మావిష్కరించుటచే తదీయ హృదయ గ్రహణమునకు నిర్గీతమును బహిర్గీతముగా వ్యాహరించిరి. ఇట్లు బహిర్గీతమనుట కేవలము నిర్నిబంధనము కాదు. ఇట్లు అన్వర్థతయు గలదు. గీయమాన పదముల కంటె, సార్థక పదముల కంటె వెలుపల (బహిః) గీతమగుట నిది బహిర్గీత మయినది. నిర్గీతము వినష్టము కాకుండు నట్లు గంధర్వులు చూచిరి. ఇట్లు సంజ్ఞా నియోజనమున నిమిత్తము విశదమ యినది.

## దైత్యసంతోషము

సప్త రూప సమన్విత మయిన నిర్గీతమునం దుత్థాపనాదికము కారణము. ఆశ్రావణము కూడి యున్నచో నిత్యము దైత్యులు తుష్టులగుదురు. వక్త్రపాణి యాచరించిన దానవులకు తుష్టి కలుగును. పరిఘట్టనమున రక్షోగణములు, సంఘోటన క్రియలో గుహ్యకులు, మార్గాసారితము పొంది యక్షులు సుప్రీతు లగుదురు. గీతక ప్రయోగములందు దేవతలకు సంతుష్టి యున్నది. వర్ధమాన ప్రయోగమున సానందుడై సానుచరుడై రుద్రుడు సంతసించును, ఉత్థాపనమున బ్రహ్మ, పరివర్తనమున లోకపాలురు, నాంది ప్రయోగమున చంద్రుడు ప్రీతుడగును. నాగు లవకృష్టమున తుష్టులగుదురు. శుష్కావకృష్టమున పితృగణము ప్రీతమగును. రంగ ద్వారమున విష్ణు ప్రీతి కలుగును. జర్జర ప్రయోగమున విఘ్న వినాయకులు సంతసింతురు. చారీ ప్రయోగమున శ్రీ ఉమాదేవి సంతుష్టి పొందును. మహాచారీ ప్రయోగమున భూతగణము సంతసంపడును. ప్రత్యాహారమున పన్నగులతో యాతుధాను లానందింతురు. అవతరణమున నప్సరః కన్య,

ఉత్థాపని ధ్రువ నిర్వహింప వలెను. ఇచట ఛందో నిబద్ధ స్వరూపము గుర్తింప వచ్చును.

౧౮౯. ఆదౌ ద్వేచ చతుర్థం చా ప్యష్ట మైకాదశే తథా
గుర్వక్షరాణి జానీయా త్పాదే హ్యేకాదాశా క్షరే

ఈ ఛందము విశ్లోక మనెడు వృత్త జాతి లోనిది. ఇందు పాదమునకు పదునొకండక్షరము లుండును. ఒకటి రెండు నాలుగు ఎనిమిది పదకొండు సంఖ్య కల యక్షరములు గురువులుగా నుండ వలెను. ఇట్లె నాలుగు పాదము లుండును. చతురశ్ర గతిలో నిది గమించును. ఇది యంగులి నియమ సూచకము. నాల్గుసన్నిపాత ములు మూడు లయలు మూడు యతులు నాలుగు పరివర్తములు మూడు పాణులు నుండును. ఇది ధ్రువాగీతి. తాల యోజనమున రమ్యము చేయ వలెను. ఒక పరివర్తమై వేరొక పరివర్తము వచ్చు నప్పటికి మధ్య లయ గతిలో సూత్రధార ప్రవేశ మొనరింప వలెను.

౧౯౦. పుష్పాంజలి సమాదాయ రక్షామంగలసంస్కృతాః
శుద్ధవస్త్రాః సుమనస స్తథా చాద్భుత దృష్టయః
౧౯౧. స్థానంతు వైష్ణవం కృత్వా సౌష్ఠవాంగ పురస్కృతం
దీక్షితాః శుచయ శ్చైవ ప్రవిశేయు స్త్రిమంత్రయః
౧౯౨. భృంగార జర్జరధరౌ భవేతాం పారిపార్శ్వకా
మధ్యేతు సూత్రభృత్తాభ్యాం వృతః పంచపదీం వ్రజేత్

## సూత్రధార ప్రవేశము

ఒక సూత్రధారు డిద్దరు పారిపార్శ్వకులు మొత్తము ముగ్గురు ప్రవేశింతురు. సూత్రధారుడు పుష్పాంజలి పట్టి వచ్చును. పారిపార్శ్వకులు భృంగారము జర్జరము పట్టి ప్రవేశింతురు. ఇట్లు మూవురు రక్షా మంగల సంస్కార సహితులగుదురు. పరిశుద్ధ వస్త్రిలు సుమనస్కులు అద్భుత దృష్టికలవారునై ప్రవేశింతురు. సౌష్ఠవాంగముల గూడుకొని వైష్ణవ స్థానకమున వత్తురు. దీక్షితులు శుచికల వారునై మూవురు రాగా వారి మధ్యలో సూత్రధారు డుండును. వారితో గూడి యాత్ర డయిదు పదములు నేయును. పంచ పదగమనము చేసి బ్రహ్మ యజన మాచరింప వలయును. పంచపద విక్షేపమున పుష్పాంజలి

విమోక్షము కర్తవ్యముగ సూచిత మగుచున్నది. ఈ మూవు రుప వాసముండి దీక్షితులు కావలెను. శౌచమునకు భృంగార మావశ్య కము. విఘ్నశాంతికై జర్జర మావశ్యకము. సూత్రధారుడె కాక పారి పార్శ్వకులును పంచపద విక్షేప మొనర్పవలెను.

సూ త్ర ధా ర కా ర్య ము

౧౮౩. రంగపీఠస్య మధ్యేతు స్వయం బ్రహ్మా ప్రతిష్ఠితః
తతః సలలితై ర్హస్తైః అభివంద్యః పితామహః

రంగపీఠ మధ్యమునందు స్వయముగా బ్రహ్మ ప్రతిష్ఠితుడై యున్నాడు. సలలిత హస్త విన్యాసములచే నా పితామహు నభివాద నము చేయవలెను. ఈ యభివాదన విధిలో నృత్తహస్తములు కరణ ములు యథోచితముగా ప్రయోగింప దగి యున్నవి. అనంతరము హస్తముచే భూతలమున మూడు వందనము లాచరింప వలెను. పాద ప్రవిభాగము ననుసరించి త దుపలక్షితము లయిన కలా ప్రవిభాగమును కాల పరిమాణాంతరము ననుసరించి వందనము విహిత మగుచున్నది. సూత్రధార ప్రవేశమున వందనాభినయము ననుసరించి యుండు మధ్య లయాశ్రిత మయిన రెండవ పరివర్తన మాచరింప వలయును. అనంతరము తృతీయ పరివర్తనములో మండల ప్రదక్షిణ మొనరించి భృంగారము నుండి యాచమన మాచరింప వలెను. అనంతరము జర్జరము గ్రహింప వలెను. మండల సంచారములో దక్ష పాదోద్ధా రము వామపాద విక్షేపము నియతముగా నాచరింప దగినవి కలవు. యథానియమము మాచరించి ప్రదక్షిణము కావింప వలెను.

౧౮౪. భృంగారభృత మాహూయ శౌచంచాపి సమాచరేత్
యథా న్యాయంతు కర్తవ్యా తేన హ్యాచమన క్రియా
౧౮౫. ఆత్మ ప్రోక్షణ మేవాద్భిః కర్తవ్యంతు యథాక్రమం
ప్రయత్న కృత శౌచేన సూత్రధారేణ యత్నతః
౧౮౬. సన్నిపాతే సమంత్రాహ్యో జర్జరో విఘ్నజర్జరః

ప్రదక్షిణానంతరము భృంగార ధారకుని పిలిచి యందలి యుద కముతో శౌచమాచరింపవలెను. యథా విధిగా నాచమన క్రియ నిర్వర్తించి యథా క్రమముగా నా యుదకములచే నాత్మ ప్రోక్షణము

కావింప వలెను. సూత్రధారు డిట్లు సప్రయత్నముగా శౌచ మాచరించు కొని విఘ్న జర్జరమగు జర్జరమును స్వీకరింప వలెను. ఇవి యన్నియు సూత్రధార క్రియలు. ప్రదక్షిణ భ్రమణ సమయములందు భృంగారధారి తూష్ణీంభావమున నుండవలె నని గుర్తించునది. అభివాద నాచమనాది క్రియలందు సాముదాయకా చారములను గుర్తింప వలెను.

జర్జరము చేతపట్టి ద్రుతలయమున మూడవ పరివర్తనము నిర్వహింప వలెను. "విఘ్న వినాశమునకై నీ వవతరించితి" వను భావము కల జర్జర జప్యము జపింప వలెను. పిమ్మట దక్షపాద వామపాద ప్రక్షేపములు సరిచూచు కొనుచు కుతపా భిముఖముగా నయిదడుగులు నడువ వలెను. చతుర్థ పరివర్తన మాచరింప వలెను. మఱల భూతలమున మూడు వందనము లాచరించి యుదకములచే నాత్మ ప్రోక్షణము కావింప వలెను. "లలితైః పదవిన్యాసైః వంద్యాత్ దేవాన్యథా దిశం" ఆ యా ది గ్విభాగము ననుసరించి లలితపద విన్యాసములచే దేవతల నమస్కరింప వలెను.

౧౮౭. తతః పంచపదీం గచ్ఛే దతిక్రాంతైః పదై రథ
తతో ఽభివాదనం కుర్యా ద్దేవతానాం యథాదిశం.

బ్రహ్మాభివాదనము జర్జరాభిమంత్రణ మాత్రమున ఉత్థాపితము సంపూర్ణ మయినట్లు కాదు, సూత్రధారుడు మొదట గమించి వచ్చిన యయిదడుగులు వెనుకకు వెళ్లి ది గనుసారముగా దిగ్దేవతల కభివాదన మొనర్ప వలయును. మొదట శక్రాధి దైవతాక మయిన ప్రాగ్దిశ నభివందింప వలెను. పిమ్మట యమ దైవత మయిన దక్షిణ దిశను పిమ్మట వరుణ దైవత మయిన పశ్చిమాశను అనంతరము ధనదాశ్రయ మయిన యుత్తర దిశను నమస్కరింప వలెను. దిశావందన మయిన పిమ్మట వామవేధ నాచరించునది. దక్షపాదముం విక్షేప పరివర్తన మాచరింప వలెను. ఉత్తరాభి ముఖముగా నుపదీ పరివర్తనమున పూర్వాభిముఖుడై యాచరింప వలసిన రమ్య త్రిపదీ విధాన మొకటున్నది. అది యిది.

## త్రిపదీరీతి

౧౮౮. ప్రాఙ్ముఖస్తు తతః కుర్యాత్ పురుష స్త్రీ నపుంసకైః
త్రిపదీం సూత్రభృ ద్రుద్ర బ్రహ్మో పేంద్రా భివందనం

౧౮౯. దక్షిణంతు పదం పుంసో వామం స్త్రీణాం ప్రకీర్తితం
పున ర్దక్షిణమేవస్యాత్ నాభ్యుత్క్షిప్తం నపుంసకం

౧౯౦. వందేత పౌరుషేణేశం స్త్రీపదేన జనార్దనం
నపుంసక పదేనాపి తథైవాంబుజ సంభవం.

సూత్రధారుడు ప్రాఙ్ముఖుడుగా నుండి పుంలింగ స్త్రీలింగ నపుంసకలింగ పదముల విన్యాసము చేసి రుద్రునకు బ్రహ్మకు విష్ణువున కభివాదన మాచరింప వలెను. దక్షపదము పుం పదము. వామ పదము స్త్రీ సంబంధి. దక్షిణ మధికముగా నెత్తకున్న నపుంసకమని వ్యవహారము. పురుష పదమున శివవందన మాచరింప వలెను. స్త్రీ పదమున విష్ణు వందనము నపుంసక పదమున బ్రహ్మ వందనము విహిత మగుచున్నది. ఇట్లు వందనానంతరము పరివర్తన మాచరింపగానె చతుర్థ కారుడొకడు విధిపూర్వకముగా పుష్పముల తీసికొని ప్రవేశింప వలెను. ఆతడు యథావిధి జర్జరమునకు కుతపమునకు సూత్రధారునకు పూజన మాచరింప వలెను. చతుర్థ కార పూజ నాచరించి యాతడు నిష్క్రమింప వలెను.

## సూత్రధారవాక్యము

౧౯౧. సూత్రధారః పఠేత్తత్ర మధ్యమం స్వరమాశ్రితః
నాందీం పదైర్ద్వాదశభిః అష్టభిర్వా ప్యలంకృతాం

౧౯౨. నమోస్తు సర్వదేవేభ్యో ద్విజాతిభ్యః శుభం తథా
జితం సోమేన వైరాజ్ఞా శివం గో బ్రాహ్మణాయచ

౧౯3. బ్రహ్మోత్తరం తథైవాస్తు హతా బ్రహ్మద్విష స్తథా
ప్రశాస్త్విమాం మహారాజః పృథివీం చ స సాగరాం

౧౯౪. రాష్ట్రం ప్రవర్ధతాం చైవ రంగస్యాశాసమృద్ధ్యతు
ప్రేక్షాకర్తు ర్మహాన్ధర్మో భవతు బ్రహ్మభావితః

౧౯౫. కావ్యకర్తు ర్యశశ్చాస్తు ధర్మశ్చాపి ప్రవర్ధతాం
ఇజ్యయా చానయా నిత్యం ప్రీయంతాం దేవతా ఇతి.

ఇక సూత్రధారుడు మధ్యమ స్వరము నాశ్రయించి ద్వాదశ పదములతో గాని పదాష్టకమున గాని యలంకృత మయిన నాందిని పఠింపవలెను. "సర్వ దేవతలకు నమస్కారము. ద్విజులకు శుభము కలుగు గావుత! చంద్రుడు "జయతి" గో బ్రాహ్మణులకు శివ మవుగావుత ! బ్రహ్మాభ్యుదయము కలుగు గావుత! బ్రహ్మద్విషులు గతించిరి. మహారాజు ససాగర మహాభూమిని చక్కగా నేలుగావుత! రాష్ట్రమున కభ్యుదయము గలుగు గావుత! రంగమునందున్న నట కుశీలవ వర్గము వారి యాశలు ఫలించు గావుత! ప్రేక్షాపతికి బ్రహ్మ భావితమగు మహాధర్మము కలుగు గావుత! కావ్య రచయితకు యశము విస్తరించు గావుత! ధర్మ మభివృద్ధ మగుగావుత! ఈ రంగ యాగమున దేవతలందరు నిత్యము సుప్రీతు లగుదురు గావుత!" సూత్ర ధారు డిట్లు పలుకు చుండగా మధ్యమధ్యలో పాదాంతములందు పారి పార్శ్వకులు నమస్కరించుచు "ఏవమస్తు". అట్లే యగుగావుత మని పలుక వలయును. యథా లక్షణముగా నిట్లు నాంది విధానింప వలెను. ఈ నాందీ ప్రయోగా నంతరము సూత్రధారుడు జర్జర స్తుతి శ్లోకము పఠింప వలెను. గంభీర స్వర సంయుతముగా పఠింప వలెను. విష్ణు దేవు స్తుతి నాచరించి ప్రకృతోత్సవ దేవతా స్తోత్ర మాచరింప వలెను. ఏ దేవతోద్దేశమున ప్రకృత నాట్యము ప్రవర్తిత మగుచున్నదో యా దేవత స్తుతి యావశ్యకము. అట్లె ప్రేక్షా ప్రవర్తకు డయిన ప్రేక్షా పతి యభీష్టారాధ్య దేవత నారాధింప వలెను. ఆ ప్రేక్షాపతి యిట్టి యభీష్ట దేవతా విషయమున నుదాసీనుడేని బ్రాహ్మణ స్తవ మాచ రింప వలెను. జర్జర శ్లోకమును రంగద్వార శ్లోకమును పఠించి జర్జర నమన పూర్వకముగా చారీ విధానమును ప్రయోగింప వలెను. అప్పు డిక పారిపార్శ్వకులు ప్రాఙ్ముఖముగనె యుండి వెనుక కడుగులు వేయుచు నిష్క్రమింప వలెను. కాగా చారీ మహాచారీ రీతులు సూత్రధారుడే ప్రయోగింప వలెనని విశద మగుచున్నది.

## ధ్రు వా ప ద ము

ఈ ప్రదేశముననె మధ్య లయాన్విత మగు అడ్డిత యను ధ్రువా ప్రయోగ ముచితము. నాలుగు సన్నిపాతములతో నది

యుండ వలెను. ఇదియు ఛందో విశేషముగా నిచట లక్షిత మగును. రాగతాలములు నిందు నియతములు.

౧౯౬. ఆద్య మంత్యం చతుర్థంచ పంచమంచ తథా గురు
యస్యాం హ్రస్వాని శేషాణి సాజ్ఞేయా త్వడ్డితా బుధైః

మొదటిది చివరిది నాల్గవది యయిదవది గురువుగా నుండుటయు శేషాక్షరము లన్నియు హ్రస్వములుగా నుండుటయు నడ్డితా ధ్రువా లక్షణము. పూర్వము మహేశ్వరుడు నానా భావ విచేష్టితములతో గూడుకొని యుమా దేవితో స్త్రీ చేష్టితమున క్రీడించి నాడు. దీని ప్రయోగమున "శృంగార రస సంయుక్తాం పఠేదార్యాం విచక్షణః" కుశలుడయిన సూత్రధారుడు శృంగార రససంయుక్తమగు నార్యా వృత్తము పఠింప వలెను. పార్వతీ ప్రియుడు పార్వతితో సంచరించుచు ప్రణయ కోపమున నున్నరీతి నీశ్లోకమున చూపవలయును. అందుల కార్య యుచిత యని భావము. చారీ శ్లోకము పఠించి పరివర్తన మాచరించి పశ్చిమముగా నపసర్పింప వలయును. ఇప్పటి కిది శృంగార లలిత మయిన చారీ ప్రయోగము. ఇక మహాచారి

౧౯౭. పారిపార్శ్వక హస్తేతు స్యస్య జర్ఝర ముత్తమం
మహాచారీం తతశ్చైవ ప్రయుంజీత యథావిధి

జర్ఝరమును సూత్రధారుడు పారిపార్శ్వక హస్తమున నుంచి యథావిధిగా మహాచారీ ప్రయోగ మారంభింప వలెను. ఇందలి ధ్రువాపద మిట్లుండును.

"పాద తలాహతి పాతిత శైలం
క్షోభిత భూతసమగ్ర సముద్రం
తాండవ నృత్తమిదం ప్రలయాంతే
పాతు జగత్సుఖదాయి హరస్య"

"పాద తలాహతిచే పర్వతములు పడిపోయినవి. సర్వ సముద్రములు భూతములు క్షోభించినవి. హరుడు ప్రలయాంతమున నొనరించిన యీ జగ త్సుఖద మగు తాండవ నృత్తము రక్షించు గావుత" — ఈ ధ్రువా గానానుకూలముగా ప్రయోక్త భాండోన్ముఖ

ముగా నుండి పాద విక్షేప మొనరింప వలెను. పశ్చిమాభిముఖముగా నుండి మహేశ్వరత్వ మాత్మ స్వరూపమున న్యాసము చేసికొని యారంభించుట యనునది నృత్త రహస్యము. ఆ పిమ్మట విక్షేపములు పరివర్తనములు నాచరించునది. ద్రుత లయాన్వితములగు సలలిత పాదములతో పంచపదీ గమనము యథావిధిగా నాచరింప వలెను. పిమ్మట రౌద్రరస ప్రాయమయిన శ్లోకమును పాద సంహారముతో పఠింప వలెను. సమాస యోజనముచే శ్లోక మంతయు నొకటిగా నుండునట్లు పఠింప వలయు ననుట ఓజః ప్రధానత్వము సూచిత మగు చున్నది. ఈ శ్లోక పఠనానంతరము పారిపార్శ్వకులు త్రిపది వ్యాహ రింతురు. ఆ పిమ్మట;

## విదూషకుడు

౧౯౮. విదూషక స్త్వేకపదాం సూత్రధార స్మితావహాం
అసంబద్ధ కథాప్రాయాం కుర్యా త్కథనికాంతతః

విదూషకుడు సూత్రధారునకు హాసము కలుగునట్లు అసంబద్ధ కథ కల వాక్యము పలుక వలెను. "ఎవడున్నాడు ? ఎవ రేమి చేసిరి ?" అని యాతడాక్షేపించినట్లు పలుకగా తత్సమాధానమునకై కావ్య రూపము వెలువడును.

౧౯౯. పారిపార్శ్వక సంజల్పః విదూషక విదూషితః
స్థాపితః సూత్రధారేణ త్రిగతం సంప్రయుజ్యతే

పారిపార్శ్వకుని సంభాషణము విదూషకుని విదూషణము సూత్రధారుని స్థాపనము మూడును త్రిగత మగును. ఈ త్రిగత ప్రయోగము సుందరముగా నుండును. పిమ్మట సిద్ధోపనిమంత్రణ ముగా ప్రరోచన పలుక వలయును. "ఇది సిద్ధ రసమయిన తత్వము. మీరు సహృదయులు. ఆస్వాదింపుడు." అని సూచించుట సిద్ధ నిమంత్రణము. "రంగసిద్ధౌ పునః కార్యం కావ్యవస్తు నిరూపణం" రంగసిద్ధి యయిన పిమ్మట మఱల కావ్యవస్తువు నిరూపించుట సహృ దయుల కుత్సాహ కరముగా నుండును. ఇవి యన్నియు నయిన పిమ్మట వారు మువ్వురును అనావిద్ధ గతములతో నిష్క్రమింప వలెను. ఇట్లు యథావిధి పూర్వరంగ విధాన మాచరింప వలెను.

ఈ విధముగా నిర్వహించిన పూర్వరంగమునకు శుద్ధ పూర్వరంగ మని పేరు. ఇది భారతీ వృత్త్యంగము. ఇక చిత్ర పూర్వరంగము నిరూపింప వలసి యున్నది.

## పూర్వరంగవివేకము

పూర్వరంగము నాల్గు విధములు, త్ర్యశ్రము చతురశ్రము శుద్ధము చిత్రము నని. వీనిలో చిత్రమె విశేషాన్వితము. ఉత్థాపనము పరివర్తనము కాగా చతుర్థ కారుడు పుష్పములచే నలంకరింపగా, ఉదాత్తగానము కల గంధర్వులు వచ్చి ప్రమాణానుసారముగా పరిగీత మొనర్పగా, మనోహరముగా దేవదుందుభులు మ్రోగగా కుసుమ మాలల నంతట ప్రసరింప జేసి నర్తకీ వనిత లంగహారములతో నర్తన మొనరింప వలెను. రేచకము లుపయోగింప వలెను.

> ౨౦౦. నాందీపదానాం మధ్యేతు ఏకైకస్మిన్ పృథక్ పృథక్
> ప్రయోక్తవ్యో విధిః సమ్యక్ చిత్రభావ మభీప్సుభిః

నాందీ పదముల మధ్యలో వేరువేరుగా చిత్రభావ మభిలషించు వారు న్యాసోపన్యాసముల కూడు కొనిన తాండవ విధానమును ప్రయోగింప వలెను. నాందీ పద విచిత్రతకై వనితలు ప్రవేశించి నృత్త ప్రయోగ మొనరించి నిష్క్రమింతురు. నల్గురు వనితలు వచ్చి గాన మొనరింప నది చిత్రముగా నుండును. అంగహారము లనేకములు ప్రయోగింప రాదు. ఒక యంగహార ప్రయోగము రమ్యముగా నుండును. యథాన్యాయ మిట్లొనరించి సప్రయత్నముగ దీని చిత్ర మొనరించి యనంతరము లక్షణాన్వితముగా నాటకము ప్రయోగింప వలెను. అప్పుడు దివ్యాకార లయిన నర్తకీ వనిత లందరు నిష్క్రమింపగా పూర్వరంగమున నంగజాతము ప్రయోగించునది. ఇట్లాచరింప శుద్ధ పూర్వరంగమె చిత్రపూర్వరంగ మగును.

> ౨౦౧. కార్యో నాతిప్రసంగోత్ర నృత్త గీత విధింప్రతి
> గీతవాద్యేచ నృత్తేచ ప్రవృత్తేఽ తిప్రసంగతః

> ౨౦౨. ఖేదో భవే త్ప్రయోక్తృణాం ప్రేక్షకాణాం తథైవచ
> ఖిన్నానాం రసభావేషు స్పష్టతా నోపజాయతే

౨౦౩. తతః శేషప్రయోగస్తు న రాగజనకో భవేత్
లక్షణేన వినా బాహ్యలక్షణా ద్విస్తృతం భవేత్
లోకశాస్త్రానుసారేణ తస్మాత్ నాట్యం ప్రవర్తతే.

నృత్త గీత విధానమునం దెప్పుడు నతిప్రసంగము తగదు. ఒక్క యంగహార ప్రయోగమేని చిత్రత నాపాదింప గలదు. ఒక్క చిత్ర తంతువయినను పటమున చిత్రత కూర్ప గలదు. గీతము వాద్యము నృత్త మతి ప్రసంగమున ప్రవర్తించెనేని ప్రయోక్తలకు ఖేదము కలుగును. అలసి పోదురు. అనంతర ప్రయోగము సౌష్ఠవముగా నొనరింప లేరు. ప్రేక్షకులకును విసువు కలుగును. ఖిన్ను లగుదురు. అప్పుడు రసభావము లందు స్పష్టత కలుగదు. మిగిలిన ప్రయోగము రాగ జనకముగ నుండదు. పూర్వ రంగ ప్రయోగ మారంభము కాగా సహృదయ సామాజికులకు నటవృత్తియె యవభాసించును. ఆ సంస్కార సంస్కృతులయిన యా సహృదయులకు నాట్యాగ్నీ దూరము కాకుండు నట్లు యత్నింప వలెను. నాట్య బుద్ధియె వారలలో ముఖ్యముగా నుపాదింప వలసి యున్నప్పుడు పూర్వరంగ ప్రస్తావనాదికము వారి విషయమున గోపనము చేయుటయె యుక్తము. కరణాది ప్రయోగము లాచరించి ప్రయోక్తలు ఖిన్ను లయినచో ప్రేక్షకులు నట్టివా రయినప్పుడు శేష ప్రయోగ మేమి రక్తి కట్టును. ఎట్టి ప్రీతి నిచ్చును? ప్రీతి ప్రధానమయిన నాట్యమె వ్యుత్పత్తి నీయగల దనుట ముహుర్ముహు రుక్తప్రాయము. సరియగు లక్షణము లేక కేవల బాహ్య లక్షణ మాత్రమున విషయము మాత్రము విస్తర మగును. అధిక ఫల ముండదు. నాట్యము లోకశాస్త్రము లుభయ మనుసరించి ప్రవర్తిత మగుచున్నది. కేవల శాస్త్రానుసరణము మనసు పట్టదు. కేవల లోకానుసరణము తృప్తి నీయదు. ఉభయ మనుసరించిననే నాట్యము ప్రీతివ్యుత్పత్తు లిచ్చును. సర్వవిధముల పూర్వరంగము నిర్వహించి సూత్రధారుడు రంగమునుంచి నిష్క్రమింప వలెను. అతని యనుచరులును నిష్క్రమింపవలెను. ఇది పూర్వరంగ విధానము.

ఆశ్రావణ - స్థాపకుడు

౨౦౪. దేవపార్థివ రంగాణా మాశీర్వచన సంయుతాం
కవేర్నామ గుణోపేతాం వస్తూపక్షేప రూపికాం

## పూ ర్వ రం గ ము



> ౨౦౫. లఘువర్ణ పదోపేతాం వృత్తైః చిత్రై రలంకృతాం
> అంతర్యవనికా సంస్థః కుర్యా దాశ్రావణాం తతః
> ౨౦౬. ఆశ్రావణావసానేచ నాందీం కృత్వా స సూత్రభృత్
> పునః ప్రవిశ్య రంగంతు కుర్యా త్ప్రస్తావనాం తతః

దేవ రాజ రంగముల యాశీస్సులు కల యాశ్రావణమును సూత్రధారుడు ప్రయోగింప వలెను. అందు కవి నామ గుణము లుండును. అది వస్తు శ్లేషించును. లఘు వర్ణ పదములు కల దగును. విచిత్ర వృత్తాలంకృత మగును. ఇట్టి యాశ్రావణమును యవనికాభ్యంతరమున నుండి సూత్రధారుడు ప్రయోగింప వలెను. ఆశ్రావణావసానమున సూత్రధారుడు నాంది నాచరించి మరల రంగము ప్రవేశించి ప్రస్తావన మాచరింప వలయును. యథావిధి నిట్లు ప్రయోగమున పూర్వరంగము ప్రయోగించి సూత్రధార గుణాకృతి యగు స్థాపకుడు ప్రవేశింప వలెను. సౌమనస్యము అవిస్మయము అద్భుతదృష్టి, గతావిధి యనునవి సూత్రధార గుణములు. ఆకృతి సముజ్జ్వలము. స్థాపక భూమికలో నుండు నాతడు నిట్లు సూత్రధార గుణాకృతి కావలెను. సూత్రధారుడె స్థాపకుడు. సూత్రధారుడు గా పూర్వరంగము ప్రయోగించి స్థాపకుడుగా మరల ప్రవేశింప వలయు ననియె భావము. ఆతడీతడు వేరని భిన్న కర్తృకత్వ సంభావనము వలదు. సూత్రధార స్థాపకుడు సౌష్ఠవాంగ పురస్కృతముగ వైష్ణవ స్థానమున ప్రవేశించి సూత్రధారు డొనరించిన విధముననె రంగగమ నము చేయునది. స్థాపక ప్రవేశమున నర్థాను గుణమగు ధ్రువ ప్రయో గింప వలెను. అనంతరము దేవ బ్రాహ్మణ ప్రశంసా పరమగు చారీ ప్రయోగ మాచరింప వలెను. శృంగార రస ప్రధానముగ గాని వీర రస ప్రధానముగ గాని దేవ ద్విజ స్తోత్రోద్దేశముగా శ్లోకమును పఠింప వలెను. ఇట్లొనరింపగా సామాజికుల హృదయము సముచితా స్వాదన యోగ్య మగును. వారి హృదయమున నిర్మలినత యావిర్భ వించును. రసాస్వాదోచిత సంస్కారమున వారి హృదయము గ్రహణ యోగ్యతాధానము పొందును.

## కవి నామ కీర్తనము

౨౦౭. సువాక్య మధురైః శ్లోకైః నానాతాల లయాన్వితైః
ప్రసాద్య రంగం విధివత్ కవేర్నామచ కీర్తయేత్

రమ్య వాక్యములు కల మధుర శ్లోకములను నానా తాల లయాన్వితముగా పఠించి విధి విధానమున రంగప్రసన్నత సమీక్షించుచు. కవి నామ కీర్తనమును చేయవలయును. కవి గుణాదికము కీర్తింప వలెను. అప్పుడు కవి ప్రసిద్ధి భాసించును. ఆదరణీయత కలుగును. అనంతరము రూపక విశేషము ఖ్యాపించి తత్ప్రఖ్యాపన వ్యాజమున భావి రూపకార్థమునకు సంబంధించిన యుపక్రమోపక్షేప పర్యాయ మయిన ప్రస్తావన మారంభింప వలెను. ఇట్లాచరించినచో ప్రారంభము నుండియు సామాజికులు సంక్షేపరూపమున సంస్కారము కలవా రగుదురు.

౨౦౮. దివ్యే దివ్యాశ్రయో భూత్వా మానుషే మానుషాశ్రయః
దివ్య మానుష సంయోగే దివ్యోవా మానుషోపివా

వస్తు స్థాపన మందలి విశేషమును గుర్తించుచు సూత్రధారు డుపక్షేపము చేయుట సముచితము. కావ్యార్థము దివ్యము, మానుషము, దివ్యమానుషముగా నుండును. దివ్యమున దివ్యాశ్రయుడై సూచించు నది. మానుషమున మానుషాశ్రయుడై సూచింప వలెను. దివ్య మానుష సంబంధమున దివ్యమానుష స్వరూపముగనె వస్తుస్థాపనము చేయునది.

## కావ్యోపక్షేపము

౨౦౯. ముఖబీజానుసదృశం నానామార్గ సమాశ్రయం
నానావిధై రుపక్షేపైః కావ్యోపక్షేపణం భవేత్

ప్రస్తావనలో నొనరించు కావ్యోపక్షేపము ముఖసంధిలోని బీజార్థమునకు తగినట్లుండ వలెను. నానా మార్గముల నాశ్రయించి నది కావలెను. నానా విధములగు నుపక్షేపములతో కూడి యుండ వలెను. నటీ విదూషక పారిపార్శ్వకులు చిత్ర విచిత్రముగ పలుకుచు స్వకార్యమునె నిరూపించుకొను చుందురు. కాని యా నిరూపణ వ్యాజమున నానా విధోప క్షేపములు వెలువడును. వానిలో రూప

కార్థ మిమిడి యుండును. అట్లు పాంశు చ్ఛన్నమయిన రూప కార్థ బీజము సామాజికుల హృదయభూమిలో కావ్యప్రస్తావ మొనర్ప గలదు. ఇదియె కావ్యోపక్షేపము. ఇట్లు కావ్యార్థ ప్రస్తావ మొనర్చి ప్రస్తావక స్థాపకులు నిష్క్రమింతురు.

## ప్ర స్తా వ న

ప్రస్తావన రెండు విధముల నుండును. పూర్వ రంగమున కంగ మగునది యొకటి అన్యమున కంగమగునది రెండవది. ఇందు పూర్వ రంగాంగ ప్రస్తావనలో కవి యుదాసీనుడుగా నుండును. అచట స్థాప కుడె స్వతంత్రుడు కర్తృత. అన్యుడేని ధ్రువా గానాదులందు పద మనుసరించును. శాస్త్రోక్తిక్రమ మొనరింపక యథావిధి పూర్వరంగ మాచరింప వలెను. ఈ పూర్వరంగమును విధి విధానమున ప్రయో గించు నాతడు అశుభము పొందడు. స్వర్గలోకము పొందును. విధి విడిచి యథేష్టము ప్రయోగ మాచరించువా డపచయము పొందును. ఘోరమగు తిర్యగ్యోని పొందును. ఇట్లపప్రయోక్తకు దృష్ట ప్రత్య వాయ మదృష్ట ప్రత్యవాయము కలుగును. లోకము సామాన్యముగా దృష్ట ప్రత్యవాయ భీరువగును. అదృష్ట ప్రత్యవాయ మంతగా భావింపదు.

## అ ప ప్ర యో గ ము

౨౧౦. న తథాగ్నిః ప్రదహతి ప్రభంజన సమీరితః
యథా హ్యపప్రయోగస్తు ప్రయుక్తో దహతి క్షణాత్.

అప ప్రయోగము క్షణములో సర్వము దహించును. అట్లు గాలి తోడు గలిగిన యగ్నియు దహింప జాలదు. దృష్టాదృష్ట ప్రత్య వాయము లున్నందున యథావిధి పూర్వరంగ ప్రయోగ మొనర్ప వలెనె గాని యన్యథా ప్రయోగింప రాదని నాట్య శాసనము.

## పూ ర్వ ర ం గ రీ తి

౨౧౧. ఇత్యేష వంతి పాంచాల దాక్షిణాత్యాంధ్ర మాగధైః
కర్తవ్యః పూర్వరంగస్తు ద్వి ప్రమాణ వినిర్మితః.

రూపక నాయకుని ప్రవృత్తి విశేషమును నియతిని గుర్తించి యా యా ప్రవృత్తి సముచితము లయిన వేషభాషాచారా భినయా

దికములను సూత్రధారాది స్థాపకాంతు లంద రనువర్తింప వలసి యున్నది. పాఠ్యాది యోజనము వేషాచార యోజనము భిన్న విభిన్న ముగా నున్నను అవంతి— పాంచాల— దాక్షిణాత్య- ఆంధ్ర- మాగధు లందరు ద్వి ప్రమాణముగా వినిర్మిత మయిన యీ పూర్వరంగము నాచరింప వలెను.

పూర్వరంగ ప్రకరణమిది నానా విధ నృత్త ప్రయోగ విని యోగము సూచించు సంస్థానము. రంగమున పూర్వ మాచరింప వలసిన వన్నియు నిందున్నవి. దీని సక్రమ నిర్వహణమె ప్రయోక్త కౌశలము. పద పదమున క్షణ క్షణమున నాచరింప వలసిన విధు లున్నవి. ఇంతగా దీని స్వరూప విచారము నృత్త సంస్కృతి నిదా నము. పూర్వరంగాంగములు పది తొమ్మిది సర్వ ప్రకృతులకు సంతోష సంపాదకములు. గీత వాద్య నృత్తముల సమాహారము సామరస్య మీ పూర్వరంగమున పరినిష్ఠిత మగును. పూర్వరంగము చతురశ్రము త్ర్యశ్రము శుద్ధము చిత్రమని నాల్గువిధములై ప్రయోగ సర్వస్వము సూచించు చున్నది. సూత్రధార పారిపార్శ్వక విదూష కుల సంలాపమున కావ్యార్థ సూచన మన్నది గ్రథనములోని సుశ్లిష్ట తకు సూచకము. శృంగార రౌద్ర రస స్ఫోరకము లయిన చారి మహా చారీ విధానములు గౌరీ శంకర గౌరవ గాన పరములై నాట్య పర మార్థ ముద్బోధించు చున్నవి. చిత్ర సన్నివేశములలో నర్తకీ ప్రవే శము సభ్య ప్రీతికగు సుందర సంధానము. స్థాపకుడు వచ్చి కావ్యా ర్థము స్థాపనము చేసి పూర్వ రంగము ముగించును.

### రసభారతి

మహాత్ములు మహర్షులు పూర్వరంగ విధానము సమాదర ముతో వినిరి. మరల భరతు నడిగిరి. పూర్వరంగ ప్రసంగముగా రసమని యంటిరి. వచన మాత్రమున నేమియు దెలిసినట్లు కాదు. అంతయు నాట్య గతముగా నిర్ణీతము కావలయును. "భవిష్యతియుగే ప్రాయో భవిష్యంత్యబుధా నరాః" భవిష్యత్కాలమున సామాన్య ముగా నరు లబుధు లయ్యెదరు. వారల కిది సుగోచర మగుటకై

నాట్య సంగతముగా మీరీ యంశముల విశద పఱుప వలెను. మేము కొన్ని ప్రశ్న లడుగుదుము. వాని సమాధానము మీరు సెలవిండు !

ఋ షు ల ప్ర శ్న

౨౧౨. యే రసా ఇతి పఠ్యంతే నాట్యే నాట్య విచక్షణైః
రసత్వం కేనవై తేషా మేత దాఖ్యాతు మర్హసి
౨౧౩. భావాశ్చైవ కథం, ప్రోక్తాః కింవా తే భావయంత్యపి
సంగ్రహం కారికాం చైవ నిరుక్తం చైవ తత్త్వతః

నాట్య విచక్షణులు నాట్యమున రసములని పఠింతురు. రసమన నేమి ? వానికి రసత్వ మెట్లు సిద్ధమయినది ? ఆయా ప్రసక్తిలో భావముల సూచించినారు గదా ! వాని నేల సూచించినారు ? వాని నెట్లు చెప్పినారు ? ఏల చెప్పినారు ? భావము లెట్లుత్పన్నము లగును ? అవి భావింపజేయునవె యగునేని వేనినవి భావింప జేయును ? ఈ విషయ ప్రఘట్టమున సంగ్రహ ముపదేశింపుడు. కారిక నిరూపింపుడు. నిరుక్తము ప్రతిపాదింపుడు. యథాతత్త్వ మీ సర్వస్వ మాదేశింపుడని మహర్షుల వచన సార సంగ్రహము.

దీని త త్త్వ మి ది. మొదట నాల్గు వేదముల నుండి నాలు గంశములు స్వీకరించినట్లు స్పష్టమయినది. అందు పాఠ్యగీతమ్ములు సుప్రసిద్ధ స్వరూపములు. అభినయము కూడ — మహాగీతములం దర్థ ముల సమ్యక్ అభినయము నిర్దేశించుట బట్టి అర్థప్రాప్తి కభినయము నిర్ణీత మయిన దనుట బట్టి — యొకవిధముగా వచన బలమున హృద యంగమ మయిన రూపము సూచితమయినట్లె. ఆథర్వణమున రసముల స్వీకరించితి మనుట విశదము కాలేదు. లోకమున మధు రామ్ల లవణాదికము లయిన యారు రసములు ప్రసిద్ధములు. వానికి ప్రకృతిలో గాని వికృతిలో గాని సంబంధ మున్నట్లు తెలియదు. శృంగార రస సంభవమని, రౌద్ర రస శ్లోకమని, రస శబ్దమున కూర్చి పలికిన పలుకు లున్నవి. శృంగారము మొదలగు నవి రసము లెట్లగును ? వానికి రసమను నామమెట్లు సిద్ధ మయినది ? రసనేంద్రి యముచే గ్రాహ్యమగు దాని విషయమున రసశబ్దము ప్రయోగించుట లోకమున ప్రసిద్ధముగా నున్నది. ఈ యర్థ మనాదర స్థానమని

యెట్లందుము ? అవిచారితముగా దీనినె ట్లుపేక్షింతుము ! లోక ఖిన్నులు రసభావములం దఖిన్నులగుదురని యాదరాతిశయ ప్రతీతి యున్నది కదా ! రసమని యంటిరే ! రస శబ్ద మెట్లు ప్రాదుర్భ వించినది ?



## భా వ ప్ర శ్న

భావమేమి? పూర్వము భావశబ్ద మపఠితము. అపఠిత భావము లేల సూచితము లయినవి? పాఠ్యాదులె భావము లగునా? అట్లయిన నాదరింప దగినవే యగునను కొందము. వాని రూప మేమి? మాకిది విస్మయముగ నున్నది. "ఖిన్నులయిన" యని యనిన స్థలమున రస సహ భావమున గొన్ని భావముల జెప్పినారు గదా! వాని నే విధ మున జెప్పినారు? "జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్" యనుచోట భావ నామమేని వినలేదు గదా! కొన్నిట వీనిలో భావ శబ్దమును ప్రవర్తింప జేసితిరి. ఆ భావశబ్ద మెట్టిది? "భవతీతి భావః" "భావయ తీతి భావః" ఈ రెంటిలో భావవ్యుత్పత్తి యేది? భావము లుత్పాదించునవియే యగునా? అవి వ్యాపించునవి యగునా? వేని నుత్పాదించును? వేని వ్యాపించును? ఆ యుత్పాదన వ్యాపనము లందలి కర్మయేమి? ఇట్లనేక విధముల ప్రశ్నలు కలుగు చున్నవి. వీనిని క్రోడీకరించిన యయిదు ప్రశ్నలగును. ఈ పంచ ప్రశ్ని మొదటి నుండి యుండనే యున్నది. ఇప్పుడు విస్ఫారించితిమి. మీరు సంగ్రహముగా నేని సమాధానింపుడు! అనిముని కాంక్ష. ఆ ప్రశ్న పంచకము నీ విధముగా నుల్లేఖింప వచ్చును. రస విషయమున నొక ప్రశ్న. భావ విషయమున నాలుగు ప్రశ్నలు. మొత్త మయిదు.

౧. రసములని వ్యవహారము పొందిన రసములకు రసత్వ మెట్లు సిద్ధ మగు చున్నది?

౨. కొన్ని స్థలములందు భావములుగా సూచితము లయిన భానములన నెట్టివి?

3. వానిని భావములని యనుటలో నుపపత్తి యేమి?

౪. "భవంతీతి, భావయంతీతి భావాః" ఇం దేవ్యుత్పత్తి యిష్టము?

౫. "ఉత్పాదింప జేయును, వ్యాపించును" అనుటలో కర్మ యేది?

మునివచనముల భావించి భరతర్షి యిట్లనెను. రస భావ వికల్పనము వ్యాఖ్యానించెను. "మీరు తపోధనులు. మీ కిది నిఖిలము నిరూపింతును. సంగ్రహము, కారిక, నిరుక్తము సర్వము యథాక్రమము చెప్పెదను. నాట్య విషయ మెంతయో సంగ్రాహ్యము. అది సముచితముగా లక్షణీయము. నాట్యాంశములు నిర్వచనీయములు. ఈ విధముగా నుపలక్షితము లయిన సంగ్రహ కారికా నిరుక్త త్రయము వ్యాఖ్యానింతును. నాట్య విషయము మూడు సముదాయములుగా నున్నది. ఈ ప్రకార త్రయము నుండి విశదముగా విషయము వివేచింతును. "రసభావ వికల్పనం. రసభావా వికల్ప్యంతే నిశ్చీయంతేఽనేనేతి" రసభావముల నిశ్చయించు వాక్యము నిరూపింతును. రసాది విషయము వివేచించిన నిక చెప్పవలసినది మిగులదు. మీరడిగినది సముచితముగ నున్నది.

## నా ట్యా ర్థ సం గ్ర హ ము

౨౧౪. న శక్య మస్య నాట్యస్య గంతు మంతం కథంచన
కస్మా ద్బహుత్వాత్ జ్ఞానానాం శిల్పానాం వా ప్యసంతతః.

౨౧౫. ఏకస్యాపి న వై శక్యమంతం జ్ఞానార్ణవస్య హి
గంతుం కిం పున రన్యేషాం జ్ఞానానా మర్థతత్త్వతః

౨౧౬. కింత్వల్పసూత్రగ్రంథార్థ మనుమానప్రసాధకం
నాట్యస్యాస్య ప్రవక్ష్యామి రసభావాది సంగ్రహం

ఎంత కష్టపడిన నీ నాట్యమంతము తెలియుట యేరికి శక్యము కాదు. నాట్య నిశ్చయ మేదో విధమున సంగ్రహముగ తెలియవలయునే గాని ప్రతిపద నిరూపణమున తెలియ లేము. ప్రతిపద నిరూపణమున తెలియ శక్యముకాని దానిని లక్షణ ద్వారముననె తెలియ నగును. స్వరూప ముద్దేశించుట. స్వరూప పరీక్ష యొనర్చుట యనునవి లక్షణాంగములు. విషయ పరిశుద్ధి ప్రదర్శన పరిశుద్ధి లక్షణ వ్యాపారమున విశద మగును. ఇది యొక గహన మార్గము. అయినను పరిజ్ఞానమున కిదియె గతి. ప్రతిపదము ప్రత్యంశము నిరూపణ మేమాత్రము శక్య క్రియ కాదు. వ్యాకరణాది శాస్త్రము లనేకము లున్నవి. చిత్ర పుస్తాది కర్మ నిరూపకము లయిన శిల్పముల కంతమె గోచ

రింపదు. నాట్యాంగమే యొక్కటేని జ్ఞానార్ణవము. తన్నిశ్చయ మేమాత్రము శక్యము కాదు. ఒక నాట్యాంగమునకె యెన్నియో యంగము లున్నవి. వాని భావ తత్త్వ విస్తరణ మశక్యము. ఒక్కొక్కటి తెలియుటయే సముద్ర మీదుట. అన్నిటి యధిగమన మేరికి నశక్యము. కాని యొకటి కలదు. నైరాశ్య మక్కఱ లేదు. సంగ్రహాదికము తద్విజ్ఞానమున సదుపాయము. ఇదిగో! నాట్య విషయార్థ సంగ్రహము నిరూపింతును. సంక్షిప్తముగా గ్రహించి యుద్దేశింతును. రసభావాదికము నాట్యమున ప్రాధాన్యము వహించు చున్నది. కాన రస భావాది సంగ్రహము నిరూపింతును. అది యనుమాన ప్రసాధక మగును. చక్కగా నన్యార్థముల నభ్యూహించుటకు శక్తి నిచ్చును. ఆశ్రయా సిద్ధ మనిపించదు. పక్షధర్మత నందించి యంగపోషక మగును. అల్ప సూత్ర గ్రంథార్థముగా ప్రవచనము చేయుదును. సూత్రముగా భాష్య గ్రంథముగా నర్థము వివేచనము చేయుదును. లక్ష్యము పరీక్షించి యన్వేషింప వలసి యున్నట్లు నిరూపించుట యల్ప సూత్ర రచన. అది సంకుచితము. నామ మాత్రముననె యది యుద్దిష్ట మగును. ఇట్లు నిరూపించినను తపోధనులు మీరు గుర్తింతురు. సంగ్రహ మిట్టిదని నేనె యనుట కాదు. అన్యులు ననిరి.

## నా ట్య సం గ్ర హ ము

౨౧౭. విస్తరేణోపదిష్టానా మర్థానాం సూత్రభాష్యయోః
నిబంధో యః సమాసేన సంగ్రహం తం విదు ర్బుధాః (18)

౨౧౮. రసా భావా హ్యభినయా ధర్మీ వృత్తి ప్రవృత్తయః
సిద్ధిః స్వరా స్తథా తోద్యం గానం రంగశ్చ సంగ్రహః

సూత్ర మనునది లక్షణము. భాష్యము తద్వ్యాక్తీకరణ రూప మయిన పరీక్ష. ఇట్టి సూత్ర భాష్యము లందు విస్తరముగ నుపదిష్టము లయిన యర్థముల నిశ్చిత దృష్టితో సంగ్రహముగ నిబంధించుటను సంగ్రహమని బుధు లనినారు. నేను నట్లె చెప్పుదును. అందుననె యల్ప సూత్రగ్రంథార్థ మంటిని. అల్పములగు సూత్రగ్రంథము లీయర్థమున నున్నవి. ఆయర్థ మిందున్నది. ఇట్లు ప్రాక్తన సంవాద మున్నది. రసము, భావము, అభినయము, ధర్మి, వృత్తి, ప్రవృత్తి-

సిద్ధి, స్వరము, ఆతోద్యము, గానము, రంగము అనునివి సంగ్రహము.

రసము : నాట్యమున రసము లెనిమిది యనిరి.

శృంగారము    హాస్యము    కరుణము
రౌద్రము    వీరము    భయానకము
బీభత్సము    అద్భుతము—

భావము : స్థాయిభావము లెనిమిది

రతి    హాసము    శోకము
క్రోధము    ఉత్సాహము    భయము
జుగుప్స    విస్మయము—

సంచారిభావములు ముప్పది మూడు

నిర్వేదము    గ్లాని    శంక
అసూయ    మదము    శ్రమము
ఆలస్యము    దైన్యము    చింత
మోహము    స్మృతి    ధృతి
వ్రీడ    చపలత    హర్షము
ఆవేగము    జడత    గర్వము
విషాదము    ఔత్సుక్యము    నిద్ర
అపస్మారము    సుప్తము    విబోధము
అమర్షము    అవహిత్థ    ఉగ్రత
మతి    వ్యాధి    ఉన్మాదము
మరణము    త్రాసము    వితర్కము

సాత్త్వికభావము లెనిమిది విధములు.

స్తంభము    స్వేదము    రోమాంచము
స్వరభంగము    వేపథువు    వైవర్ణ్యము
అశ్రువు    ప్రలయము.

అభినయములు నాలుగు రీతులు

ఆంగికము    వాచికము
ఆహార్యము    సాత్త్వికము

ధర్మి రెండు విధములు.

లోకధర్మి    నాట్యధర్మి

వృత్తులు నాలుగు విధములు

| | |
|---|---|
| భారతి | సాత్వతి |
| కైశికి | ఆరభటి |

ప్రవృత్తులు: నాట్య ప్రవృత్తు లనునవి యారు కలవు

| | |
|---|---|
| ఆవంతి | దాక్షిణాత్య |
| ఆంధ్రి | మాగధి |
| పాంచాలి | మధ్యమ |

సిద్ధి రెండు విధములు

| | |
|---|---|
| దైవీసిద్ధి | మానుషీసిద్ధి |

స్వరములు శారీరములు వైణము యేడు విధములు.

| | |
|---|---|
| నిషాదము | ఋషభము |
| గాంధారము | షడ్జము |
| మధ్యమము | ధైవతము |
| పంచమము— | |

ఆతోద్యము నాలుగు విధములు.

| | |
|---|---|
| తతము | అవనద్ధము |
| ఘనము | సుషిరము |

గాన మయిదు విధములు.

| | |
|---|---|
| ప్రవేశము | ఆక్షేపము |
| నిష్క్రామము | ప్రాసాదికము |
| అంతరము— | |

రంగము మూడు విధములు.

| | |
|---|---|
| చతురశ్రము | వికృష్టము |
| త్ర్యశ్రము— | |

రసము, భావము, అభినయము, గీతము, ఆతోద్యమ మను నయిదు- పంచాంగము నాట్యమని కొందరి నిర్ణయము. పై శ్లోకమున రసాది రంగాంతము పదు నొకండంగము లున్నవి. ఉపచారము మండపము నను రెండు కలియగా పదమూడంగములు నాట్య సంగ్రహమని మరి కొందరి భావము.

## కారికా నిరుక్తములు

౨౧౯. అల్పాభిధానేనా ర్థోయః సమాసే నోచ్యతే బుధైః
　　సూత్రతః సాతు విజ్ఞేయా కారికార్థ ప్రపర్శిని　　11

౨౨౦. నానా నామాశ్రయోత్పన్నం నిఘంటు నిగమాన్వితం
　　ధాత్వర్థహేతుసంయుక్తం నానా సిద్ధాంత సాధితం　　12

౨౨౧. స్థాపితార్థో భవేద్యత్ర సమాసే నార్థ సూచకః
　　ధాత్వర్థ వచనేనేహ నిరుక్తం తత్ప్రచక్షతే　　13

కారికా నిరుక్తముల స్వరూప పరిచయము దీనిలో గలదు. లక్షణ రూప మయిన వాక్యము రెండు విధములు. సంక్షిప్తార్థ వివరణాత్మక మయిన వాచకముగా నుండు సూత్రరూప వాచకశ్లోక మొకవిధము. సంక్షిప్తార్థా త్మకముగా నుండునది రెండవ విధము. నానా రూప లక్ష్యములను సంక్షిప్తముగా సంగ్రహించు అల్ప శబ్దములు వాచకము లయిన సూత్రము. దాని నాశ్రయించి యొక యర్థము నిరూపిత మగును. ఆ యర్థము కారిక. అది జ్ఞప్తి సాధక మగును. నానా విధములగు లక్ష్యములను స్ఫురింప జేయును. ఇట్టి యర్థములను సూత్రముగ సూత్రించును గాన సూత్రము కూడ కారిక యగును. ఆ సూత్ర మనుసరించి పఠిత మగు శ్లోక రూపము కూడ కారికయె. సూత్రము సూచనాత్మకము. దాని వలన లక్షణాత్మక మయిన యర్థము లభించును. ఆ యర్థ మల్ప శబ్దములచే నిరూపిత మగును. లక్షణీయ మగు నా యర్థమె యసాధారణ ధర్మముగా ధర్మ్యంతర వ్యవచ్ఛేదము సూచించునదై కారిక యని వ్యవహారము పొందును. "క్రియతేఽ నేన జ్ఞప్తిరితి కారికా, లక్షణ మితి యావత్" దీనిచే జ్ఞప్తి యొసరింప బడును గాన నిది కారిక. లక్షణ మని నిశ్చితార్థము. ఆ యర్థము నంతటిని ప్రకాశింప జేయును గావున శ్లోకము కూడ నుపచారమున కారిక యని వ్యవహరింప బడును. దీనిసార మిది. తా నుద్దేశించి చెప్ప దలచిన దానికి ధర్మ్యంతర వ్యవచ్ఛేదము సూచించు లక్షణము చెప్పవలెను. ఆక్షేప రహిత మయిన సమాధానమున వివరణ రూపముగా సుఖగ్రాహ్య మగునట్లుగా శ్లోకమున లక్షణము ప్రతిపాదింప వలెను. దానిని కారిక యందురు. కాగా కారికా శబ్దార్థ మిట్లు నిశ్చిత మగుచున్నది.

౧. లక్షణ రూప మయిన యర్థము కారిక.

౨. లక్షణ రూప మయిన యర్థమునకు వాచకమగు సూత్రము కారిక.

3. ఆ సూత్రోద్దేశమున ననుపఠిత మగు శ్లోకము కారిక.

౪. లక్షణీయార్థ ప్రకర్షమును ధర్మ్యంతర వ్యవచ్ఛేదమును ప్రవర్తించు ధర్మము కారిక.

౫. జ్ఞప్తి సాధకము కారిక యని పిండి తార్థము.

నానా నామాశ్రయోత్పన్న మిత్యాదికము నిరుక్త లక్షణము. శ్లోకద్వయము నిరుక్త స్వరూపమును జెప్పును. అనేక వ్యక్తి భేద భిన్నమయిన యర్థము లక్షణీయము. దాని సూచించు నర్థము లక్షణాత్మక మని నిశ్చితము కదా! అందు కొన్ని యాక్షేపములు తత్ప్రతి సమాధానములు నుండును. తన్నిరూపణ పురస్సరముగా తత్వము స్థాపిత మయినచో నది తత్పరీక్షా రూపమయిన నిరుక్త మగును లక్షణ మనునది కేవల పరిభాషా మాత్రము కాక విచారణాత్మకమని వివేచించి యాక్షేప సమాధానముల ద్వారమున చెప్పవలెను.

నానా నామాశ్రయోత్పన్నం = లక్షణ వాక్యమునందు అర్థ ప్రతిపాదకము లయిన సుబంత శబ్దము లుండును. అవి నానా ప్రకారము లయిన నామ శబ్దములు. ఆ నామ శబ్దముల ననుసరించి యాక్షేప ప్రతి సమాధానముల సముత్పాదన ముండవలెను. నామ పదములం దాక్షేప ప్రతిసమాధానములు నిఘంటు నియమాన్వితములై యుండును. నిఘంటు వభిధాన కోశము. అభిధాన ( శబ్ద ) కోశములందు కొన్ని రూఢిశబ్దములు కొన్ని యితరములు నుండును. ఆక్షేప ప్రతి సమాధానముల యుత్పాదము కొన్నిట రూఢిశబ్దములందన్విత మగును. కొన్నిట ప్రకృతి ప్రత్యయ విభాగ నిగమనముతో నన్వితమగును. ఇదియె నిఘంటు నిగమాన్విత పదమున నిరూపిత మగును. ధాత్వర్థ హేతు సంయుక్తం = లక్షణ వాక్యము నందుండు తిజంత పదముల విషయమై కల రీతి నిది చెప్పును. ధాత్వర్థము క్రియ హేతువు క్రియా నిమిత్త మగు కారకము. ఇట్టి ధాత్వర్థ హేతువుల సంయోజనము నిశ్చయ స్థాపనము నందలి విచారము. క్రియా

కారకముల స్థాపన విచారము కలది యని తాత్పర్యము. ఈ శ్లోకము నందలి మూడు విశేషణములు లక్షణ వాక్యములో మొదట యొనర్ప వలసిన శబ్ద పరీక్షను సూచించు చున్నవి. "ఈ శబ్ద మీ యర్థమున నేల ప్రవర్తించినది ?" యనునది యాక్షేపము. "ఇదిగో! ఈ విధ మున ప్రవర్తించినది." యని చెప్పుట ప్రతి సమాధానము. ఇది యంతయు ప్రదర్శించిన వస్తుప్రాణితము.

నానా సిద్ధాంత సాధితం =ఇది యర్థ పరీక్షా దర్శకము. సర్వ తంత్ర ప్రతి తంత్రాదులు నానాప్రకారము లగు ప్రమాణమూలకము లయిన యర్థముల నిరూపించును. వానిని సిద్ధాంతము లందురు. అట్టి నానాసిద్ధాంతములచే సాధిత మగునది. విషయ స్థాపనమున నాక్షేపోత్తరముల సాధనము కలది యని భావము. ఇది యంతయు పరీక్ష. నానా తంత్రము లెన్నియో సిద్ధాంతముల జెప్పును. నామ, ధాతు, సమయ విశేషముల యాశ్రయమున నర్థ సిద్ధి యగును.
౧. "ఉలూఖలః, ఊర్ధ్వఖమస్య" దీని కూర్ధ్వమున నాకాశమున్నది కావున నిది యులూఖలము. అనుచోట నామ శక్తి నిర్ణయ మిచ్చు నదిగా నున్నది.

౨. "రసః" "రస్యత ఇతి రసః" ఆస్వాదింప బడును గావున రసమని వ్యవహారము. ఇందు ధాతు శక్తి నిరూపకము.

3. "పిశాచః" పిశిత మశ్నాతి" మాంసము భక్షించు నది." ఇందు నామ ధాతువులు రెండును నిరూపకములు.

సమయ విశేషములు మూడు విధములు. లౌకికము వైదికము ప్రతిశాస్త్ర పార్షదము అని. ఇట్టి సాంకేతికము లయిన విశేషములను వేరువేరుగా గుర్తించునది. సంక్షేపముగా నర్థావధారణము నిరుక్త ప్రయోజనము. ధాత్వర్థవచనమున సంగ్రహముగా నర్థ సూచక మగు అర్థము స్థాపిత మగునేని దాని నిరుక్తమని యందురు.

ఈ నిరూపించిన విధమున సంగ్రహమును విస్తరించి స నిరుక్త ముగా స కారికముగా ప్రతిపాదింతు నని భరతు డనుచున్నాడు. సంగ్రహమె విస్తారితమై విభాగము పొందును. పరీక్షా పర్యంత మది విశదము కాదు. కేవలము వచన మాత్రమున సర్వము సంపన్నము

కాదు. అందుననె పరీక్షార్థమై నిరుక్తము. అలక్షిత పరీక్షయు కుదు రదు కావున లక్షణార్థమై కారిక. ఇక నాట్య సంగ్రహము వివేచనము చేయవలయును.

రస ప్రకాశము - మహారసము

౨౨౨. శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః
బీభత్సా ద్భుత శాంతాశ్చ నవనాట్యే రసా స్మృతాః 15

నాట్య సంగ్రహము నందు రసము మొదటిది. ఆ రస విభాగ మిందున్నది. శృంగార హాస్య కరుణములు రౌద్ర వీర భయానక ములు బీభత్సా ద్భుత శాంతములు నని. నాట్యమున నవరసములు విఖ్యాతము లయినవి. నాట్య మనునది సర్వ విధములగు నాటకము లలో విశిష్ట విశేషమున ప్రకాశింప దగిన యర్థము. నటుని యందలి యభినయ ప్రభావముచే సహృదయ సామాజికులకు సాక్షాత్కార కల్పము ఏక ఘనమయిన మానస నిశ్చలత యావిర్భవించును. ఆ యేక మానసాధ్యవసేయ మీ నాట్యము. ఇట్లు ప్రకాశింప దగిన నాట్యార్థ మనంత విభావాత్మక మయినను స్థాయిస్వభావము. భావుక సహృదయుని సంభావనములో జగద్గతములయిన జడము లన్నియు సంవిద్రూపములై స్వాత్మ సంవిల్లగ్నము లగును. ఆ సంవిత్తు కూడ భోక్తృ స్వభావమున పర్యవసానము పొందును. నానా విధమయిన భోక్తృ వర్గ మంతయు మహాభోక్తలో పర్యవసించును. ఆ మహా భోక్తృ భావమునందే రసాశ్రయము కాదగిన స్థాయిరూపమగు చిత్తవృత్తి స్వభావ మనుగతమై యున్నది. కావ్య విశేషమున ద్యోత నీయమగు మహార్థ మంతయు చిత్తవృత్తి స్వభావముగా నిర్భాసిం చును. ఈ యేకఘన మగు చిత్తవృత్తి స్వరూపము సవిశేషముగ గుర్తింప వలసి యున్నది. దీనిలో స్వకీయము పరకీయ మను భేద మాపాదించు విశేష మేమాత్ర ముండదు. ఏది స్వకీయము? ఏది పరకీయము? కొన్ని ప్రమాణములను బట్టి యిదిగో! యిది స్వకీయ మని నిశ్చయింతుము. మఱి కొన్ని మానము లనుసరించి యిది పరకీ యమని నిశ్చయింతుము. ఈ నిర్ణయము లిచ్చు మానము లనంత ములు. మేయములును మానాధీనము లగుట అనంతములుగనే యుండును. ఇట్టి చిత్తవృత్త్యంతర శత సహస్రములు ఈ యేకఘన

చిత్తవృత్తిలో నేమియు తమ ప్రభావ మాపాదింప జాలవు. అవి
యన్నియు దీని నుండి దిగజారి పోవును. ఇది యొక యలౌకిక మయిన
చేతోరసము. ఇదియిట్లగుటలో నొక నిమిత్త మున్నది. నాట్య
కావ్యములం దుపాత్తము లయిన గేయ పదములు లాస్యాంగములు
సంపాదించు నట్టి సౌందర్యమున కావ్యములందలి గుణాలంకారములు
శోభా సంస్కార పరిష్కారములు కలవై విలక్షణ సంపదచే లక్షణ
రమ్యత సంపాదించు కొనును. గుణాలంకారముల కుపజీవన మిచ్చు
టలో నివి యిట్లు నిదానములు కాగా, గీత మాతోద్యము మొదలగు
నవి కావ్యమును సమ్యక్సుందరముగా నొనర్చును. అట్లు సుందరీ
భూత మయిన కావ్యమహిమ సహృదయ చిత్త విస్ఫారమునకు
సహకరించును. అప్పుడు సహృదయుడు నాట్య ప్రయోగానుకార
ములో మగ్నోన్మగ్న చేతస్కుడై విశిష్ట సంవిదాశ్రయు డగును.
ఇంతటి స్పంద సుందరతచే నాతని చిత్తవృత్తి యేకఘన మగు
చున్నది. కావుననే సాధారణ్య మొకటి సిద్ధ మగును. అప్పుడు
సామాజికుడు స్వాత్మ సద్భావమున సంవి త్సమావేశము పొందును.
ఇంతటి స్వాత్మ సంవి త్సమావేశము నాతడు పొందుట కీ యేకఘన
చిత్తవృత్తియే నిదాన మగుచున్నది. ఈ చిత్తవృత్తి సర్వవిధ చిత్త
వృత్తుల కన్న విలక్షణము. ప్రమాణ ప్రమేయముల ననుసరించి వస్తు
విజ్ఞానము సంపాదించు చిత్తవృత్తి యొక డున్నది. అది లౌకిక చిత్త
వృత్తి. ఈ చిత్తవృత్తి లౌకిక చిత్తవృత్తి కన్న విలక్షణము.
ప్రమాణ ప్రమేయముల పదవి దూరముంచి తటస్థముగా నుండి పదా
ర్థముల నవగతము చేసికొను నట్టి పరిమిత యోగిచిత్తవృత్తి యొకటి
కలదు. ఈ యేక ఘనము దీని కన్నను విలక్షణము. సర్వ విధ చిత్త
వృత్తి విలక్షణమగు నీ చిత్తవృత్తి తాదాత్మ్యము వలన సిద్ధమగును.
పరిమితమగు స్వాత్మాశ్రయత్వ మనునది దీనిలో నిర్భాసింపదు.
ఇతర చిత్తవృత్తులేవియు దీని వెంట జనింపవు. నిరంతర ఘనమయిన
యిట్టి చిత్తవృత్తి రూపము కాగానే నిర్విఘ్నమగు స్వ సంవేదన
విశ్రాంతి కలుగును. ఇట్టి స్వ సంవిద్విశ్రాంతినె రసనము రసము అని
యందుము. రసమిది రసనమను వ్యాపారముననె సంగృహీత మగును.
రస వ్యాపార గృహ్యమాణ మగుట రస శబ్దమున వ్యవహరింప

వచ్చును. రస వికల్పమింకను విస్తరింప నున్నాము. కావున రసమో నాట్యము. తత్ఫలము వ్యుత్పత్తి. రస మొక్కటి. అందు విభాగము లేదు. కాని భాగాభినివేశమున రసాంతరములు రూపితము లగు చున్నవి. అవి కావ్యార్థమును భావింప జేయును. అట్లు రసములు తొమ్మిది. శాంత మపలపించు వారు రసము లెనిమిది యందురు. మహా రస మొక్కటి ముఖ్యము. దీని నుండి యితరములు రూపితములగుట యిట్లు సంగతముకావచ్చును. మహాస్ఫోటమొక్కటియె. పదవర్ణ స్ఫోటా దులన్నియు కల్పితములు. అసత్యములును. మహారసమొక్కటి. రసాంత రములు కల్పితములు. మహారసమునందు రసాంతరములు భాగాభినివేశ మున సంభావితములగుచో భాగస్వరూపములనియు గుర్తింపవచ్చును.

## రసక్రమము

రసములను శృంగార హాస్యాది క్రమమున నిరూపించుటలో నొక విశిష్టమగు రమ్య భావ మున్నది. కామము సకల జాతి సుల భము. అత్యంత పరిచితము. నిఖిల జనులకు హృద్యము. కాన మొదట శృంగారము నిర్దిష్ట మయినది. హాస్యము తదనుగామి. అందుచే రెండవది యయినది. నిరపేక్ష భావమగుట కరుణము శృంగార విపరీతము కావున మూడవదిగా నిర్దిష్టము. పిమ్మట కరుణ నిమిత్త మయిన రౌద్ర ముచితము. అది యర్థ ప్రధానము. కామార్థ ములు ధర్మమూలము లగుట ధర్మ ప్రధాన మయిన వీర మనంత రము నిరూపిత మయినది. ఆ వీరముకూడ భీతాభయ ప్రదాన సార మయినందున దాని పిమ్మట భయానక ముపాత్త మయినది. భయా నక విభావములు బీభత్స విభావములు దాదాపు సమానములుగా నుండును. ఇట్టి సాధారణ్య సంభావనముననె భయానకానంతరము బీభత్స మున్నది. వీరముచే నింతయయిన దని వీర ఫల మిది యని నిరూపించుటకే వీర పర్యంతమున నద్భుతమును జెప్పుట సంగత మగును. "నిత్యము పర్యంతమున నద్భుతము నిరూపింప వలె" నని నియమ మున్నది. కదా! వీని యనంతరము శాంతము సముచితము. ధర్మార్థ కామములు త్రివర్గము. త్రివర్గాత్మకము ప్రవృత్తి ధర్మము. తద్విపరీతము నివృత్తి ధర్మము. శాంతము నివృత్తి ధర్మాత్మకము

మోక్షఫలకము. ఈ శాంతమునందే స్వాత్మ సమావేశమున రస చర్వణ యున్నది. ఇట్లే నాట్య రసములు నవ సంఖ్య కలవె సుప్రసిద్ధములుగా నున్నవి.

## స్థా యి క థ న ము

౨౨౩. రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధో త్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శమాః స్థాయిభావాః ప్రకీర్తితాః. 17

రసము విభావాది బలముననె కలుగును గావున రసానంతరము భావకథన ముచిత మగుచున్నది. లౌకికములగు రత్యాది చిత్తవృత్తులను తెలియక పోయినచో కవిగాని నటుడుగాని తద్విషయములగు విశిష్ట విభావాదుల నాహరింప లేడు. రత్యాదులను గుర్తించునేని కవి నటులు శక్తి కలవా రగుదురు. రతి, హాసము, శోకము, క్రోధోత్సాహములు, భయము, జుగుప్స, విస్మయము, శమము నని స్థాయి భావములు ప్రకీర్తితము లయినవి. శాంతమున నుత్సాహము స్థాయి యని కొందరనిరి. జుగుప్స స్థాయి యని కొందరనిరి. అన్నియు శాంత స్థాయులని కొందరు. తత్త్వజ్ఞాన జన్యమయిన నిర్వేదము శాంతస్థాయి. కావుననె వ్యభిచారిభావ గణనమున నమంగల రూపమయినను స్థాయి వ్యభిచారు లనె డుభయధర్మోప జీవిత్వ ఖ్యాపనము నకై నిర్వేదము మొదటగా నిర్దిష్ట మయినది. స్థాయి భావముల నిర్దేశించు నీ కారికలో సంఖ్య నిరూపితము కాలేదు. కావుననె యీ స్థాయిభావములు వ్యభిచారులు నగును. ఈ యంశమింకను విశదము కాగలదు. నిర్వేదాదులు పూర్వ నిరుక్తములు ముప్పది మూడు వ్యభిచారిభావములు. వాని కారికలివి.

## వ్య భి చా రి భా వ ము

౨౨౪. నిర్వేద గ్లాని శంకాఖ్యా స్తథాసూయా మద శ్రమాః
ఆలస్యం చైవ దైన్యంచ చింతా మోహః స్మృతిః ధృతిః 18

౨౨౫. వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రా పస్మార ఏవ చ

౨౨౬. సుప్తం విబోధో ఽమర్షశ్చా ప్యవహిత్థ ముథోగ్రతా
మతి ర్వ్యాధి స్తథో న్మాద స్తథా మరణ మేవచ

౨౨౭. త్రాస శ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః

ఈ వ్యభిచారి భావ పరిగణనమున సంఖ్యా నిర్దేశ మున్నది. వ్యభిచారులివి మాత్రమె యని యుభయతో నియమున్నకై సంఖ్యో పాదాన మున్నది.

## సా త్త్వి క ము

౨౨౮. స్తంభః స్వేద ఽథ రోమాంచః స్వరభంగోఽథ వేపథుః
వైవర్ణ్య మశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః

స్తంభాదు లెనిమిది సాత్త్విక భావములు వ్యభిచారివృత్తము నభినయ వృత్తము నుపజీవింప జేయునవి యగుట వేరుగా పరిగణితము లయినవి.

## అ భి న య ము లు

౨౨౯. ఆంగికో వాచికశ్చైవ హ్యాహార్యః సాత్త్విక స్తథా
చత్వారోఽభినయాహ్యేతే విజ్ఞేయా నాట్య సంశ్రయాః

నాట్య సంశ్రయములయిన యభినయములు నాలుగు. ధనుః ప్రతిశీర్షిక మకుటాదుల వలన నాహార్యము ప్రత్యక్ష బుద్ధిలో నంత రంగముగా నుపయోగించును. ఈ నాలుగు లోకమున నొకప్పు డుండవచ్చును. ఉండక పోవచ్చును. నాట్యమున నుండి తీరును. నాట్యమున నభినయమె జీవితము. కావుననె రసభావానంతర మభి నయము లుద్దిష్టము లయినవి. అభినయములు లౌకిక ధర్మము నను వర్తించును. లోకధర్మము మూలముగా తదుపయోగి సామయిక ధర్మము ననువర్తించును. కావున వీని యనంతరము ధర్మి నిర్దేశము సముచితము.

## లో క ధ ర్మి : నా ట్య ధ ర్మి

౨౩౦. "లోకధర్మీ నాట్యధర్మీ ధర్మీతి ద్వివిధః స్మృతః"
భారతీ సాత్త్వతీ చైవ కైశిక్యా రభటీ తథా
చతస్రో వృత్తయో హ్యేతా యాసునాట్యం ప్రతిష్ఠితం

ధర్మి రెండు విధములు. లోకధర్మి నాట్యధర్మి యని. అభి నయ మనునది యభినేతవ్యము విడిచి వేరుగా నుండదు. దశరూపక సంబంధ ద్వారమున వృత్తులు తదుపకార మొనర్చునవిగా లోకమున ప్రసిద్ధములు. వృత్తులు రెండని మూడని యయిదని భావింప రాదను

టకె "చతస్రో వృత్తయః" నాలుగు వృత్తులని స్పష్టముగ ననుట. ఈ వృత్తులందె నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. ఈ భారత్యాది వృత్తులును దేశ వశమున నానా విధము లగును. అందుననె యనంతరము ప్రవృత్తులను జెప్ప వలసియున్నది.

## ప్రవృత్తులు

౨౩౧. అవంతీ దాక్షిణాత్యాచ తథాచై వాంధ్ర మాగధీ
పాంచాల మధ్య మా చేతి విజ్ఞేయా స్తు ప్రవృత్తయః

ఆవంతి, దాక్షిణాత్య, ఆంధ్రి, మాగధి, పాంచాలి, మధ్యమ యిట్లు ప్రవృత్తులు తెలియ దగి యున్నవి. ఈ ప్రవృత్తులు నాట్య ప్రవృత్తులు. ఇవి యెన్నియేని కావచ్చును. ఓఢ్ర ప్రవృత్తి, వంగ ప్రవృత్తి, కర్ణాట ప్రవృత్తి యిట్లు దేశభేదమున ప్రవృత్తు లుండ వచ్చును. ఈ సర్వము సిద్ధి పర్యవసాయి కావున సిద్ధి చెప్ప వలయును. సిద్ధి దైవికీ సిద్ధి, మానుషీ సిద్ధి యని రెండు విధములు. శారీరములు వైణములు నయిన స్వరములు షడ్జాదు లేడు కలవు. స్వరములు పాఠ్య గాన సంగృహీతము లగును. అయినను పృథగుపాత్తములు కావలసి యున్నవి. కేవల స్వరములును ప్రయోగోపరంజకములుగా నుండుట లక్ష్యమున గోచరించు చున్నది. అంతరాలాపమున నిది యంతయు ప్రసిద్ధము. ఇది లక్షణాన్వితము కావలయుట సమ్మతము. కేవలము లౌకికము బాధితము. సంగ్రాహ్యము కాదు. లక్షణాన్వితమె నాట్య పరిగ్రాహ్యము.

## ఆతోద్యము

౨౩౨. తతంచై వావనద్ధం చ ఘనం సుషిర మేవచ
చతుర్విధంచ విజ్ఞేయ మాతోద్యం లక్షణాన్వితం

లక్షణాన్వితమగు నాతోద్యము నాల్గు విధములు. తతమ వనద్ధము ఘనము సుషిరము నని. ఈ చతుర్విధమె సర్వము కాదు. బహుల చర్మకారాది వాద్యము కూడ సంగృహీతము కావలెను. "ఆతుద్యతే= అభిహన్యతే ఇత్యాతోద్యం" చక్కగా ప్రయోగింపబడుట నాతోద్య మను వ్యవహారము సంగతము. తత మను వాద్యము తంత్రీ గతము. అవనద్ధ వాద్యమునకు పౌష్కర మనిపేరు. పుష్కర

మావర్తక మను దేవతాధిష్ఠిత మగుట పౌష్కర మయినది. పుష్కరము= మేఘము, పుష్కర శబ్ద శ్రవణము ననుసరించి యిది సమాగత మయినది. ఇది పద్మ పత్రాకారమున చర్మపుట భాషముగా నుండును. "హన్యతే కలాసామ్యార్థ మితి ఘనః" కలా సామ్యము నకై ప్రయోగింప బడుట "ఘనము" అగును. ఘనము తాల రూపము. కాంస్య తాలాదికము ఘనము. ఇది తాలమె ముఖ్య ప్రమాణముగా నుండును. తాలము స్వరవర్ణ సంభవము.

## పంచవిధ గానము

౨33. ప్రవేశాక్షేప నిష్క్రామ ప్రాసాదిక మథాంతరం
గానం పంచవిధం జ్ఞేయం ధ్రువా యోగ సమన్వితం.

గాన మయిదు విధములు. ఇది ధ్రువా సంబంధమున నుండును. రంగమున పాత్ర ప్రవేశ సమయమున భావ ప్రకృత్యవస్థాది సూచకముగా గాన మొనరింతురు. అది ప్రావేశికీ ధ్రువాగానము. రసాంతరములను తెలియ జెప్పుటకై యాక్షేప గానముండును. అది యాక్షిప్తికి ధ్రువ. పాత్ర నిష్క్రమణ సమయమున నొనర్చునది నిష్క్రామ గానము. వేరొకటి ప్రాసాదికము. రంగము ప్రవేశించిన పాత్రయొక్క యంతర్గత మయిన చిత్తవృత్తిని సామాజికుల కందించుటకై విశదము చేయుటకై ప్రసాద గానము నియతము. ప్రవేశాదులు కేవలము గానోపచారములు. ప్రసాదమె గాన ప్రయోజన మగుట నిది ప్రాసాదిక మగును. వీని యందంతటను ధ్రువా గీత్యాధారముగా నియతమయిన పద సమూహము తగిన సంబంధమున నచట సమన్వితమై యుండును. తదర్థ ప్రాధాన్యమున నియత రూపముగా నుండును. రంగమండపము మూడు విధములని మొదటనె నిరూపితము. కక్ష్యావిభాగము ననుసరించి గతివిధానములకు సర్వాభినయములకు సర్వాను భావములకు గానముల కాతోద్యములకు పకరించునది మండపమె. రంగముననె కక్ష్యావిభాగము సంగృహీతమగును. ఇప్పటికిది యంతయు నల్పసూత్రార్థ మయిన నాట్య సంగ్రహము.

## రససమీక్ష

ఇంతవఱకు సంగ్రహ కథన మయినది. ఇక లక్షణ పరీక్షల

నిరూపింప వలయును. ఇటుపై సూత్ర గ్రంథ వికల్పన మావశ్యకము. సూత్రకము లక్షణము చెప్పెదము. దీనిచే కారికయు సంగృహీత మగును. గ్రంథ మనునది భాష్యము. అది వికల్పనములతో నాక్షే పములతో ప్రతి సమాధానములతో గూడి యుండును. పరీక్ష యను నది నిరుక్తశబ్ద వాచ్యమని పూర్వమె ప్రతిజ్ఞాతము. సూత్రవివరణ స్వభావమగు కారిక సూత్రమును గూడ ప్రకాశింపజేయుచు బహుత రాక్షేప సమాధానములచే వ్యాకులపాటు పొందిన శిష్యపాఠక జనులకు స్థిత పక్షము నిరూపించి యుపకరించును. కావుననె సూత్రము భాష్యము పరీక్ష ప్రవచింతుమని ప్రతిజ్ఞాత మయినది. రసవిషయమె ముందుగా నిరూపింప వలయును. ఇక దానికై పరికర బంధము ఘటింతుము. ఈ చెప్పిన రసాదులలో రసములనె సూత్ర గ్రంథ పరీక్షా క్రమమున విభజించి వ్యాఖ్యానింతుము. సచేతస్కు లవధా నము వహింపుడు.

## రసవ్యాఖ్య

౨౩౪. "తత్ర రసానేవ తావత్ ఆదా వభివ్యాఖ్యాస్యామః"
"నహి రసాదృతే కశ్చి దర్థః ప్రవర్తతే
"తత్ర విభావా నుభావ వ్యభిచారి సంయోగాత్ రస నిష్పత్తిః"

ఉద్దేశ క్రమమె పర్యనుయోజ్య మనుకొందురు. రసవిష యమున మరి యొకటి యున్నది. ఇచటి క్రమ మిది. ఇది క్రమ హేతువు. రసము వ్యాఖ్యానింతుము. రసము లేక ఏ యర్థమును లేదు. రసము వినా విభావాద్యర్థ మేదియు బుద్ధిలో వ్యాఖ్యేయముగా ప్రవర్తింపదు. రసము వినా ప్రయోజన మేదియు ప్రవర్తింపదు. ప్రీతి పురస్సరముగా వ్యుత్పత్తి మయమేదియు ప్రసరింపదు. సామాజిక లోకము రసాదృతము కాగా రసనాత్మక ప్రతీతి యుదయింపగా నేక ఘన మగు విశ్రాంతి పొందును. అప్పుడితరమగు భావాది కార్థ మేదియు సామాజిక బుద్ధిలో ప్రవిభాగమున నుండదు. సర్వజడము ప్రధాన స్థాయి చిత్తవృత్తిలో మగ్నమగును. ఆ స్థాయి చిత్తవృత్తి చిత్తవృత్త్యంతరములచే నుపకృతమై ప్రధాన మగుచున్నది. అందు జడము మగ్నమై విభావానుభావాది వర్గముగ నవభాసించును. అప్పుడు వ్యాఖ్యాతృ నట సామాజికాభిప్రాయమున జూడ స్థాయి

వృత్తికే ప్రాధాన్య మవభాసించును. కాన రసమె పూర్వ ముద్దిష్ట మగుచున్నది. రసమునకె లక్షణాదిక మొసర్చ వలసి యున్నది. పూర్వము "రసములు" అని బహువచనము పల్కితిమి. ఇప్పుడు "రసము" అని యేకవచనమునె ప్రయోగించు చుంటిమి. ఇందలి యాశయ మిది. పరమార్థముగ రస మొక్కటి. అది సూత్రస్థానీయ ముగ రూపకమున నవభాసించును, ఆ రసమున భాగదృక్కుతో జూడ విభాగమున్నది. ఆ విభాగమును తదేక ముఖ ప్రేక్షిత నతి క్రమింపదు. పరమార్థ రసమునె యది ప్రతీక్షించును. ఈ యంశము నుద్దేశముననె చెప్పితిని. ఇప్పుడును చెప్పుచున్నాము. ఇకగూడ చెప్పుదుము.

## రస సూత్రము — భట్టలోల్లటుడు

ఈ చెప్పినది రస క్రమహేతువు. రస విషయ లక్షణసూత్ర మిదిగో! "విభావా నుభావ వ్యభిచారి సంయోగాత్ రస నిష్పత్తిః" రసద్రష్టులు భట్టలోల్లట ప్రభృతు లిట్లు వ్యాఖ్యా నించిరి. స్థాయిభావమునకు విభావాదులతో గలుగు సంయోగమున రస నిష్పత్తి యగును. అందు విభావము స్థాయి రూప చిత్తవృత్తి యుత్పత్తిలో కారణము. ఇచట ననుభావములన రసజన్యము లగు ననుభావములు వివక్షితములు కావు. రసకారణములు కాని యవి గణనార్హములు కావు గదా! వ్యభిచారులు చిత్తవృత్త్యాత్మకములు. ఇవి స్థాయి సహభావులు కాకపోయినను వాసనా (సంస్కారా) త్మకముగా నుండుటయె యిచట వివక్షితము. వక్ష్యమాణ దృష్టాంత మున గూడ వ్యంజనాదులలో నొకటి స్థాయివలె సంస్కార రూప ముగా నుండుటయు నితరము వ్యభిచారి వలె నుద్భూతముగా నుండు టయు సంగత మగును. కాన స్థాయియె విభావా నుభావాదులచే నుపచితమై రస మగునని భావము. స్థాయి యుపచితము కాక పోయినచో సహజముగా ననుకార్య రామాదు లందుండునని రామాది రూపతానుసంధాన బలమున ననుకర్త యగు నటునందుండు నని నిశ్చయింప దగును. చిరంతన సాహిత్యికుల కీపక్షమె యభీష్టము. కావుననె దండి — "రతి శృంగారత్వము పొందును. కోపము రౌద్రా

-త్మతను పొందును.” అని కావ్యాదర్శమున ననినాడు. స్థాయి పరి-పుష్టమై రసమగు నని భావము.

## శ్రీ శంకుకాక్షేపము

శ్రీ శంకుకుడు ఇది కాదనును. విభావాదులు లేకున్న స్థాయి యవగతము కాదు. అవగమ కరణము లేక యవగమ మెట్లు? ధూమము వినా ధరాధరాంతర్గత మయిన వహ్ని యవగతము కాదు గదా! అవగమకములు విభావాదు లుండవలెను. అపిచ; స్థాయి భావములె స్వయముగా విభావములచే నుత్పాదితములై, అనుభావములచే సూచితములై, వ్యభిచారులచే పోషము పొందినవై సంయోగమున రసీభావము పొందునేని స్థాయిభావములనె మొదట చెప్ప వలెను. ఉద్దేశింపవలెను. వానికె మొదట లక్షణము చెప్ప వలెను. అదియె యుక్తము. అట్లొనర్ప లే దేమి? మొదట రసములకె యుద్దేశ మున్నది. లక్షణ మున్నది. రసములకె విభావాను భావముల జెప్పి వానినె స్థాయి భావములకును విభావానుభావములనుగ నిరూపించెను గదా! రసముల ననుపదమె లక్షించుచు మునియె యనును.—“వీరమన్నది యుత్తమ ప్రకృతి ఉత్సాహాత్మకము. అది యసంమోహాధ్యవసాయ నయ వినయ బల పరాక్రమ శక్తి ప్రతాప ప్రభావాది విభావాదులచే నుత్పన్న మగును.” అని యని మఱల స్థాయి భావానువాద సమయమున “ఉత్సాహ ముత్తమ ప్రకృతి. అది యవిషాద శక్తి శౌర్యాది విభావాదులచే నుత్పన్న మగును.” అని ముని నిరూపించి నాడు. ఇట్లు రసభావము లభిన్నార్థములని తేలినది. రసలక్షణమున విభావాదులు విస్తరముగ నిరూపితము లయినవి. భావానువాదమున లేశముగ ప్రదర్శితము లయినవి. పదార్థముల యుత్పత్తిలో కారణము చెప్పిన పిమ్మట పోషము పొందిన వానికె మఱల యుత్పత్తి కారణము చెప్పవలసిన యవసరము లేదు. అట్లు చెప్పుట వ్యర్థము. ఇంకను; స్థాయి యుపచితము కాదేని భావమగునని ఉపచితావస్థ మగునేని రస మగుననుటయు యుక్తముగ లేదు. అట్లే యన్నచో నొక్కొక స్థాయి భావమునకు మందతమమని, మందతరమని, మందమని, ఒక విధమున నున్నదని అట్ల నేక విశేషము లుండుట

బట్టి యనంత భేదములు కలుగ వలసి యుండును. అప్పుడు రసమున కును తీవ్ర తీవ్రతర తీవ్రతమాది భేదములచే ననంఖ్యాత్వము సిద్ధమగును. ఉపచయ కాష్ఠ పొందినదె రసమని యన్నప్పుడు హాస్య రస మారు విధము లనుట కుదురదె కుదురదు. స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితము అను భేదమున ఆహాస్యము షడ్విధమనిరి కదా! వేరొక యాపత్తి యున్నది. కామమునం దుత్తరోత్తరము ప్రకర్ష తారతమ్య మున్నదని పది యవస్థల పరిగణించిరి. అభిలాషము, అర్థచింతనము, అనుస్మృతి, గుణకీర్తనము, ఉద్వేగము, విలాపము, ఉన్మాదము, వ్యాధి, జడత, మరణ మనునవి యీ దశవిధ కామావస్థలు. వీనిలో ప్రత్యవస్థ ముత్తరోత్తర ప్రకర్ష తారతమ్యము సంభవింప వచ్చును. అందువలన పది కామావస్థలలో లెక్క లేనన్ని శృంగార రస రతి భావాదులు ప్రసక్తములు కావలసి వచ్చును. మరి యొకటి పర్యాలోచనీయము. పరిపోషము పొందని ప్రాగవస్థలో భావముగా నున్న స్థాయి క్రమముగా నుపచయము పొంది రసీభవించు ననుటలో గూడ విపర్యయ మున్నది. చూడుడు! ఇష్టజన వియోగము విభావముగా నుత్పన్న మయిన శోకము పెద్దదయినను క్రమముగా నుపశాంత మగును. కాని దార్ఢ్యము పొందదు. ఇక నది యుపచయము పొందుట యేమున్నది? క్రోధ ముత్సాహము రతి యనునవి నిజ నిజ కారణ బలమున సముద్భూతము లయినను కాల వశమున మారి పోవుటయు గలదు. క్రోధములో నమర్ష మట్టె యుండదు. ఉత్సాహమున స్థైర్య మలవడదు. రతిలో సేవనము స్థిరము కాదు. వీని యం దన్నిట విపర్యయము గోచర మగుచున్నది. ఇట్లుపచయ ముండుటచే రసము భావపూర్వక మనరాదు. భావమె రసపూర్వక మనవలసి యుండును. "రసపూర్వకత్వం భావానాం, భావపూర్వకత్వం రసస్య" అని నాట్యవేదమె యనునె! ప్రయోక్త విషయ విశేషము ననుసరించి ప్రయోగించు నపుడు రసముల నాస్వాదించు సహృదయుల కనుకార్యునందు భావ ప్రతీతి కలుగుట యున్నది కదా! రస మాస్వాదింపగా భావ ముదయించుట వలన ప్రథమ-

పక్షమె యుత్థానము పొందు చున్నది. ఇదియు భావింపుడు! లోక మున భావము దర్శింపగా తత్స్వరూపముగా రసనిష్పత్తియు గోచ రించు చున్నది. కాన రససూత్ర మట్లు వ్యాఖ్యానింపరాదు. అన్యథా వ్యాఖ్యానింప వలెను. ఇదిగో! ఇట్లు వ్యాఖ్యానింతుము.

## శ్రీ శంకుకరసతత్త్వము.

విభావములు హేతువులు. అనుభావములు కార్యములు. వ్యభి చారులు సహచారి రూపములు. ఇవి యన్నియు కృత్రిమములె. కాని యవి కృత్రిమములని యనిపించదు. వాని ప్రదర్శనమున నంతటి ప్రయోగ దీక్ష యున్నది. అవి విశిష్ట ప్రయత్నార్జితములు. గమ్య గమక భావ మనునది వీని సంయోగము. ఈ విభావాదులు గమ్య మును గోచరింప జేయుట కవగమింప జేయుటకు సమర్థములయిన గమకములు. వీనిచే రస మనుమీయమాన మగును. అట్లయినను వస్తు సౌందర్య బలమున నితరానుమీయ మానముల కన్న విలక్ష ణము. రసనీయ స్వరూపమున నుండును. స్థాయిగా సంభావిత మగు రత్యాది భావము నటుని యందేమాత్ర ముండదు. అయినను సామా జిక జనత యాస్వాదింప గలదు. ఇది ముఖ్యమగు రామాది నాయకు లందుండు స్థాయి యనుకరణ రూపము. అనుకరణ రూపమగుట వల ననె నామాంతరమున వ్యపదేశము పొందు చున్నది. అదియె రసము. విభావముల నన్నిటిని కావ్య బలమున ననుసంధాన మొనర్ప వలసి యున్నది. అనుభావములను శిక్షాబలమున గుర్తింపవలెను. స్థాయి భావమన్ననో కావ్యబలమున గూడ ననుసంధేయము కాదు. కావ్యమున రతి యని శోకమని యుత్సాహమని శబ్దము లుండ వచ్చును. అవి కేవల మభిధాన రూపములుగనె యుండి రతి శోకాదు లభిధేయములుగ జేయ జాలునె గాని వాచికాభినయ రూపముగ నవగమింప జేయ జాలవు. వాక్కు మాత్రమె వాచికము కాదు. వాచికము వాక్కుచే నిర్వహింప బడును. అంగములచే నిర్వృత్త మగునది యాంగిక మగునట్లు వాక్కుచే నది నిర్వహింప బడును. శ్లోక వాక్యమున కేవలము స్వార్థము నిరూపిత మగును. అందలి సుఖాత్మ రతిస్థాయి యభినీత మగునె కాని యభినేయ మానము

కాదు. అవగమనమును నది యవగమింప జేయుశక్తి. అది వాచకత్వ శక్తికన్న వేరు. అందువలననె భరత సూత్రము నందు స్థాయిపదము భిన్న విభక్తికముగ గూడ నుపాత్తము కాలేదు. దానిని సూత్రమున జేర్చి చెప్పుట మునికి సమ్మతమె కాదు. అనుకరణమొనర్పు రతి శృంగార మగుననియె శ్రీ ముని మతము. లేకున్ననున్నట్లనుకరించుట వలన నర్థక్రియ యున్నది. ఇట్టిది లోక సిద్ధమె. మిథ్యా జ్ఞానమున నర్థక్రియ లోక దృష్టమె. మణి చూచి దీపప్రభ చూచియు మణియని తలచుట కలదు. మణి బుద్ధి కలిగి యన్వేషించుట కలదు. అభిధావన మిద్దరిలో నుండును. మిథ్యాజ్ఞాన మవిశేషముగనె యుండును. కాని యర్థ క్రియ బట్టి విశేష ముండును. ఇట్లె లోకమంతట గలదు.

ఇట్లే విషయమున గలుగు విలక్షణ ప్రతిపత్తిలో "నర్తకుడె సుఖి" యను ప్రతిపత్తి కలుగదు. ఈతడె రాముడనియు ప్రత్యయము కలుగదు. ఈతడు సుఖి కాడనియు ప్రత్యయ ముదయింపదు. ఈతడు రాముడగునా? కాడా? అనియు జ్ఞానము కలుగదు. ఈతడు రామసదృశుడను జ్ఞానము నుదయింపదు. లోకమున గలుగు సమ్యక్ జ్ఞానము, మిథ్యా జ్ఞానము, సంశయ జ్ఞానము, సాదృశ్య జ్ఞాన మిచట కలుగదు. ఈ నాలుగు ప్రతీతుల కన్న విలక్షణమగు ప్రతీతి కలుగును. అదియె చిత్ర తురగ న్యాయమున గలుగు ప్రతీతి. చిత్రమున తురగము గోచరింపగా "ఇది తురగము, ఇది తురగము కాదు. ఇది తురగ మగునా? కాదా? ఇది తురగ సదృశము", అను చతుర్విధ జ్ఞానములలో నేజ్ఞానమును గలుగదు. ఆ నాల్గింటి కన్న విలక్షణ జ్ఞాన ముదయించును. ఇట్లె నాట్యమున నటునందును విలక్షణ జ్ఞాన ముదయించును. "సుఖి యగు రాముడిదిగో! యితడు" అనునట్టి ప్రతీతి కలుగును. ఇట్టి విజ్ఞానమిచటి తంత్రము. ఇది యిచటి రస వివేకము.

## భట్టతోత భావము

భట్టతోతుడిది యంతయు విమర్శ క్షమము కాదనును. ఇది యంత స్తత్వ శూన్యమని యనును. వినుడు! రస మనుకరణ రూపమా?

అది యెట్లు? రస మనుకరణ రూప మనుట సామాజిక ప్రతీతి ననుస రించియేనా? నటాభిప్రాయమున రస మనుకరణ స్వభావ మందురా? కాక వస్తువృత్తము వివేచన మొనరించు వ్యాఖ్యాతల బుద్ధుల నవ లంబించి రస మనుకరణ మంటిరా? "వ్యాఖ్యాత లీవిధమున వివే చింతు"రని కొందర రందురులె! ఈ వికల్పముల నిక పర్యాలోచి తము. భరతముని వచనానుసారమున సమీక్షింప మొదటి ... మసంగతముగ దోచును. ఏదియే నొక ప్రమాణ సముపలబ్ధ మను కరణ మనవచ్చును. "ఇదిగో! ఇట్లు వాడు సుర త్రాగునని సురా పానానుకరణముగా పయః పాన మనునది ప్రత్యక్ష గోచరమై ప్రతి భాసించు చున్నది. ఆ పయః పానము సురాపానమున కనుకరణ మగును. నాట్యములో నట్టిదేమి లభించినది? అట్టి దేమేని యున్న నది రత్యనుకరణ మనవచ్చును. అది యేదియు లేదు గదా! ఆ రామాదుల శరీరము, తన్నిష్ఠమయిన ప్రతిశీర్షకాదికము, రోమాంచ గద్గదికాదికము, భుజాక్షేప చలనాదికము, భ్రూక్షేప కటాక్షాదిక మెంత యున్నను అది యేదియు చిత్తవృత్తి రూపమగు రతి కనుకార ముగ నేమియు నేరికిని ప్రతిభాసించుట లేదు. ఈ ప్రతిశీర్షకాదులు జడములు. చిత్తవృత్త్యనుకారము లెట్లగును? ఇవి యన్నియు భిన్నేంద్రియ గ్రాహ్యములు. భిన్నాధికరణములు. వానికి వీనికి నేమి సంబంధము? పరస్పర మివి విలక్షణములు. అసలు ముఖ్యమును చూచి యున్న నితరము చూచినప్పుడిది యనుకరణ మని యన వచ్చును. అప్పుడె యనుకరణ ప్రతిభాస మున్నది. రామునందున్న రతి గుర్తించిన వారెవరును లేరుగదా! ఇక అనుకరణ ప్రతిభాస మెట్లు? "నటుడు రామానుకారి యనునదియు నుత్త ప్రవాదము. అదియు నిక నిరస్తము.

## అనుకరణవాదఖండనము

స్వపక్ష సాధనమున కిట్లందురు గాబోలు. "నటగత చిత్త వృత్తినె సుప్రతిపన్నము చేసి కొన్నప్పుడు శృంగారము రత్యనుకార మగును" అని. ఆ నటుని చిత్తవృత్తి యే రూపమున భాసించునో? విచారింప వలయును గదా! అది రత్యనుకరణముగ గోచరించునా?

ప్రమదాది కారణములచే, కటాక్షాది కార్యములచే, ధృత్యాది సహ చారులచే లౌకికము కార్యరూపమునగు చిత్తవృత్తి గోచరించి తదా త్మకముగా నట చిత్తవృత్తి ప్రతిభాసించుటను భావించుకొని యిది రత్యనుకార మనుకొందురు. కాని యది రత్యనుకారము కాదు. ఆ చిత్తవృత్తి రత్యాకారముననె ప్రతిపన్న మగుచున్నది. కావున రత్యనుకరణ మన్న వాచోయుక్తి దూర ముంచుడు. అది యిట సంగతము కాదు.

ఆ విభావాదు లనుకార్యునందు పారమార్థికములు. అనుకర్త యగు నటునిలో నట్లు కాదు. ఇదియె యిచటి విశేష మందురు కాబోలు. అనుడు! అట్లె యనుడు! ఇది ప్రశ్నింతుము. ఆ విభా వము లతత్కారణములు. ఆ యనుభావము లతత్కార్యములు. ఆ వ్యభిచారు లతత్సహచర రూపములు. ఇట్లయి కూడ కావ్య శిక్షాది బలోపకల్పితములై కృత్రిమములగును గదా! సామాజికులు వానిని కృత్రిమములుగనె గుర్తింతురా? కృత్రిమములని భావింపరా? అవి కృత్రిమములని వారు భావించినచో రతి యవగతి యెట్లు గలుగును? కావుననె ముగ్ధబుద్ధి కది రత్యనుకరణము కావచ్చును. కార్యము కారణాంతరమున కలిగి నప్పుడు సుశిక్షితుడగు వాడు దాని గుర్తించి వస్త్వంతరము నూహించుట యుక్తము. అసుశిక్షితుడు ప్రసిద్ధ కార ణమునే గుర్తించును. వృశ్చిక విశేషమును చూచి యొకడు వృశ్చి కమును హేతువయిన గోమయము నూహించును. కేవలము వృశ్చి కమునె మఱి యొకడు కారణముగ నూహించును. ఇట్లు కాకున్న నది మిథ్యా జ్ఞాన మగును. ఈ యంశమున కిది ప్రకృత లగ్న మయిన సారము. ప్రసిద్ధ మయిన రతి కారణము. దాని వలననే యనుభావ ములు కలుగును. రత్యనుకరణ మన్నది కారణాంతరము. విశేష విదుడగు వాడు వీని నిట్లు గుర్తించును. రత్యనుకరణ రూపమగు వస్త్వంతరము నూహించుట విశేషవిదునకు సమంజసము కావచ్చును. ప్రకృతములో నిట్లు లేదు. కాగా రత్యనుకరణ మెట్లు ప్రతీతము కా గలదు? విశేషముల గుర్తింప లేని వాడు అట్టి యనుభావముల జూచి నప్పుడు రతినే యనుమానించును. అదియె కారణ మని తలచును.

అది మిథ్యాజ్ఞానమె యగును. కారణజ్ఞానము మిథ్య యయిన చోట తదాభాస యనుమానము యుక్తము కాదు. బాష్పమును చూచి ధూమమని తలచినను యగ్ని యనుమితము కాదు. ధూమానుకారముగ గోచరించిన హేతువు సాధ్యము నూహింప జేయలేదు. నీహారమును జూచి ధూమానుకార మనుకొన వచ్చును. దాని వలన నగ్ని యనుకార మగు జపాపుష్పము ప్రతీత మగుట లోకమున కానము.

నటవిషయమున భావనము

"నటుడు కోపము లేకున్నను కోపము కలవాని వలె గోచరించును గదా! ఈ యనుకార మంగీకరించితిమి. ఇట్లై సర్వము కాకూడదో!" —ఇది సత్యము. నటుడు కేవలము క్రుద్ధుడు కాడు. క్రుద్ధ సదృశుడు. భ్రుకుటీ బంధాదుల వలన సాదృశ్యము గోచరించుచున్నది. గవయ మృగమును చూచి ముఖాది సాదృశ్య ముండుటచే గోవు నూహించు చున్నాము. ఇంత మాత్రమున నొక యనుకారమేదియు రాదు. నటునందు సామాజికులకు సాదృశ్యమతి లేనే లేదు. నర్తకునందు సామాజికుల ప్రతిపత్తి కేవలము భావ శూన్యముగా నుండు ననుటయు సుశ్లిష్టము కాదు. అనుకార ప్రతిభాస ముండుననుట వ్యర్థమగు వాచోయుక్తి. "ఈతడు రాముడె" అని ప్రతిపత్తి కలుగు నంటిరి. ఆ బుద్ధి కేవల మప్పటిదె యగును. తదనంతర సమయములో "ఈతడు రాముడు కాడు" అని బాధక బుద్ధి యుదయించునేని దాని వలన నీ బుద్ధికి వైధుర్యము లేక పోయినచో నిది తత్త్వ జ్ఞానమె కావలయును. కాని యట్లనుట లేదు కదా! అదియు గాక, బాధక మున్నప్పు డది మిథ్యాజ్ఞాన మేల కాదు? వాస్తవముగ పరిశీలించినచో "ఈతడు రాముడు" అను బుద్ధి బాధక జ్ఞాన ముదయింప కున్నను మిథ్యా జ్ఞానమె యగును. వేరొక నర్తకుని చూచి నప్పుడును "ఈతడు రాముడు" అను జ్ఞానము కలుగుచున్నది. ఏ నర్తకుని చూచినను రామ ప్రతిపత్తి కలుగ వచ్చును. ఇక నీ "రామత్వము" సామాన్య ప్రత్యాసత్తి రూప మనవలెను. భావించిన స్థలములందెల్ల కూడి యుండునది కావలెను. అది యుక్తము కాదు. విభావములు కావ్యమున ననుసంధింప వచ్చునంటిరి.

అదియు మనసునకు పట్టినది కాదు. నటున కెవనికిని "ఈ సీత నాది" యని స్వాత్మీయముగా పరిజ్ఞానము కలుగదు. "సామాజికుల కావిధముగా భాసింప జేయుటయె నటుల యనుసంధాన" మందురేని, యా యనుసంధానము స్థాయి భావమునందే యుండుట యుక్తము. అదియె ముఖ్యము కదా! ఆ ముఖ్యస్థాయి నిట్లనుసంధాన మొనరించి నప్పుడు సామాజికు లది భావించి "ఈతనియం దీ స్థాయి యున్నది" అని గుర్తించు వారు కాగలరు కదా! ఇంతకు సర్వము పరిశీలింపగా సామాజిక ప్రతీతి ననుసరించి స్థాయి యనుకరణము రస మనుట సంగతమయిన వాదముగ గోచరింపదు.

"రాముని నేననుకరించు చున్నాను. ఆతని చిత్తవృత్తి నే ననుకరించు చున్నాను" అని నటున కేమాత్రము ప్రతిపత్తి యుండదు. అనుకరణ మనునది సదృశ కరణము. ప్రకృతి స్వభావము తెలియని వాడు సదృశ కరణ మేమాత్ర మొనరింప లేడు. పశ్చాత్కరణ మను కరణ మని యనవలదు. అట్లయిన లోకమునం దంతట ననుకరణాత్మత యతిప్రసక్త మగును. "నియతముగా నెల్లప్పు డొకనినే యనుకరించుట లేదు. ఉత్తమ ప్రకృతి యగు వాని శోకమునె యనుకరింతుము." అని యందురు కాబోలు! ఎవర ట్లనుకరించునది? విచారింపుడు! నట శోకము రామ శోకము ననుకరించునా? నటుని కేమియు శోకము లేదే! శోకమున శోకానుకార మెట్టిది? అశ్రుపాతాదులచే శోకము ననుకరింతురా? ఇది మాత్ర మెట్లు కుదురును? ఆ శోకము వలని యశ్రుపాతములు వేరు. ఈ యశ్రుపాతములు వేరు. అవి యివి యేమాత్రము సంబంధము కలవి కావు. రెండిటికి వైలక్షణ్య మున్నది. ఇచ్చట నింతమాత్ర మిది సంగతము కావచ్చును. "ఉత్తమ ప్రకృతికి సంబంధించిన శోకానుభావముల నే ననుకరించు చున్నాను" అని భావించిన భావించును. ఇందు కూడ నిది విచార్యము.

### శోకానుకార మెట్టిది?

ఏ యుత్తమ ప్రకృతి శోకాను భావముల ననుకరించు చున్నాడు ? ఎవరో యొకని శోకానుభావానుకార మనుట యుక్త

వచనము కాదు. ఆ "యెవరో యొకరును" ఏదేని విశిష్టత్వము లేక బుద్ధిలోని కెక్కనే యెక్కరు. ఈ సంభావనములో నటుడు తన యాత్మను కూడ నందనుప్రవేశము చేసిన వాడగుటచే ననుకార్యానుకర్తృభావ మంతయు గలితమై పోవుచున్నది. మఱియు నిది భావనీయము. శిక్షా వశమున నటుడు సర్వము నేర్చి యుండును. విభావములను మాన్మథ వృత్తులను సాధారణీ భావమున హృదయ సంవాద బలమున ననుభావములను బ్రదర్శించుచుండును. కావ్యవస్తులను సముచితము లయిన కాకు విన్యాసముల యుపస్కారములతో కలయ కలుపుకొని పఠించుచు చేష్టించును. నటు డొనరించునది యింతమాత్రము. ఏతావన్మాత్ర ప్రతీతి యనుకారమని యెవ్వరనరు. వేషానుకరణ మొనరించినంత మాత్రమున రామ చేష్టితానుకార ముండు ననము. కేవలము కథా వస్తు వృత్త మనుసరించినంత మాత్రమున రామానుకరణ మున్న దనము. ఏమియు తెలియని దానిని వస్తువృత్త విధమున నొకడనుకరించు ననుట యెన్నడును కుదురనిది. స్థాయ్యనుకరణము రసమని మునియేని యొకప్పుడేని యననే యనలేదు. ఈ యనుకరణ వాదమంతయు జలలిపి మాత్రమె యగుచున్నది.

అనుకరణ వాదుల పట్టుదలలు వేరు. హరితాలాదుల వర్ణకములు కూర్చుకొని యేమేమియో చేయుదురు. రంగులు పొదిపి పొదిపి "ఇదిగో! యిది గోవు" అని యన వచ్చును. ఏది గోవు? వర్ణకములచే వ్యజ్యమానము గోవగునా? సిందూరాది వర్ణముల కూడికచే పారమార్థిక మగు గో నభివ్యజ్యమాన మగుట లేదు. చీకటిలో నున్న గోవు ప్రదీప ప్రభచే నభివ్యక్త మయినది. అట్లు వర్ణకములచే సత్య గోవభివ్యక్తము కాదు. తత్సదృశ మేదేని సమూహా విశేషము వర్ణకములచే గోచరింప వచ్చును. అచట కూర్చిన సిందూరాదులు గవావయవ సన్నివేశమునకు తగినట్లు సన్నివేశ విశేషములతో కూడినవై గోసదృశ మన్న జ్ఞానమును కలుగ జేయునవి కావచ్చును. అంతమాత్రమె వాని బలము. ఇట్లు ప్రకృత మేమియు కుదుగదు. ప్రకృతములోని విభావాది సమూహమును రతి సాదృశ్య విజ్ఞానముతో గుర్తించుట కవకాశము లేదు. భావానుకరణము

రసమనుట కుదురుట లేదు. ఎవరేని యిట్లన వచ్చును. "సుఖ దుఃఖ
జనన శక్తి కల విషయ సామగ్రి యంతయు బాహ్యముగా నుండును.
సాంఖ్యుల తత్త్వ మనుసరించి చూడగా "రసము సుఖ దుఃఖ స్వభా
వము" అని తెలును. ఇట్లు పరిశీలింపగా విభావము లా సామగ్రిలో
దళ స్థానీయములు. అనుభావములు వ్యభిచారి భావములు సంస్కార
ములుగ నుండును. స్థాయిభావములు మాత్ర మా సామగ్రీ జన్యము
లగు నాంతరము లయిన సుఖదుఃఖ స్వభావములు." ఇట్లు రస
మాంతర మని కొందరన వచ్చును. ఇది యంతయు భరత గ్రంథ
విరుద్ధము. "స్థాయి భావములను రస మొనరింతు" మనుట వీరి పక్ష
మున కుదురదు. ఇట్లు గ్రంథ విరోధ మున్నదని తెలిసియు నట్లం
దురు. ప్రామాణిక జనులు దూషణా విష్కరణ ముఖరత్వము లేక
పరిరక్షితు లగుదురు గావుత! ఈ వాదము నేమందుము? ఇందలి
ప్రతీతి వైషమ్య ప్రసంగముల నెట్లెంతని చెప్పుదుము?

## భట్టనాయక వాదము

భట్టనాయకు డిట్లనెను. "రసము ప్రతీతముకాదు. ఉత్ప
న్నము కాదు. అభివ్యక్తమును కాదు. స్వగతముగా రసము ప్రతీత
మగునందుమేని కరుణములో దుఃఖమె కలుగ వలసి యుండును.
సీతాదు లెవరికిని విభావములు కారు. సీతా విషయమున రతి ప్రతీతి
యెట్లు కలుగును? సీతాదులందు స్వకాంతా బుద్ధి కలుగనే కలుగదు.
సీతాదులు ప్రయోగమున గోచరింతురు. స్వకాంతా స్మృతి సంవేద
నములో నచట గోచరింపదు. దేవతల విషయమై సాధారణీ కరణము
కలుగదు. అట్టి యోగ్యత దేవతాదులందు రాదు. కొందరకు
సముద్రోల్లంఘనాదు లున్నవి. అవి సర్వ సాధారణములు కావు.
అసాధారణములగు నవి మనకెట్లు గోచరము లగును. రంగ ప్రయో
గములో యథార్థముగా రామస్మృతి కలుగదు. అట్టి స్మృతిని
సంపాదించునది యేదియు లేదు. కేవలము శబ్దమున ననుమానమున
నట్టి ప్రతీతి యున్నదన్నచో లోక సరసత రాదు. నాయక యుగ
లము ప్రత్యక్షముగనె యవభాసించిన లజ్జా జుగుప్సా స్పృహాదులు
కలుగును. ఎవ రెయ్యది తగునను కొందురో యట్టి వృత్తి వారల

కుదయించును. భావించు వారల కిట్టి భావ వ్యగ్రత యున్నప్పుడు సరసత్వ కథ కలుగుట కవకాశము లేదు. పరగతముగా రసము ప్రతీత మగునందురేమో! అట్లే యయిన తాటస్థ్యమె కలుగును. అనుభూతి రాదు. స్మృతి రూపముగా రస ప్రతీతి యుండు ననుట యుక్తము కాదు. రస ముత్పన్న మగునని యనుటలో గూడ ఈ చెప్పిన దూషణ మున్నది. అభివ్యక్తమగు ననుటయు నట్లనె యున్నది. పూర్వ మున్నదియె యభివ్యక్తము కావలయును కదా! స్వగతముగా నది వ్యక్తమయినను, పరగతముగ నభివ్యక్త మయినను చెప్పిన దూషణము తప్పనె తప్పదు. కాన వేరు విధమున వ్యాఖ్యా నింప వలసి యున్నది. ఇదిగో! వ్యాఖ్యానింతుము!

## ర స స మా లో చ న ము

దోషములు లేక గుణాలంకారములు కలిగి సుఘటిత మయిన కావ్యమునను, చతుర్విధాభినయసంపత్తి కల నాట్యమునను భావకత్వ వ్యాపార మొకటి కలదు. దాని ప్రక్రియా సర్వస్వము స్వస్పంద రమ ణీయము. నిబిడమగు నిజమోహ సంకటము నుండి నివారించి విడివడ జేయును. విభావాదుల నన్నింటిని సాధారణీకరించును. కేవలము శబ్దమున నర్థ మర్పించు నభిధా వ్యాపారమున కన్న నిది వేరు. ఇది కావ్యములోని ద్వితీయాంశము. భావకత్వ వ్యాపారమని దీని పేరు. రస మీ వ్యాపారమున భావ్యమాన మగును. ఇట్లు భావ్య మాన మగు రసము భోగమున భుజ్యమాన మగుట యున్నది. భోగీకర ణముగా జెప్పదగిన "భోగము" అన్న వ్యాపార మొకటి రసాను భూతి కనుకూల మగునది సుస్థమై యున్నది. అది యనుభవ రూపము కాదు. స్మృతి స్వరూపమును కాదు. వీని కన్న విలక్షణము. రజ స్తమో గుణముల యనువేధము వలని వైచిత్ర్య బలమున ద్రుతి విస్తర వికాసాత్మకముగ భోగ ముదయించును. అప్పుడు సర్వ గుణోద్రేకము కలుగును. ఆ సమయమున ప్రకాశానందమయ మయిన నిజ సంవిద్విశ్రాంతి పరబ్రహ్మా స్వాదరూపమున సాక్షాత్క రించును. ఇది యంతయు భోగభుక్తి ప్రభావము. కావుననె పెద్ద లనిరి. "అభిధ, భావన, భోగీకృతి" అను మూడు వ్యాపారములు

రస కావ్యమున నున్నవి. శబ్దార్థాలంకారము లన్నియు నభిధా భావము పొంది యుండును. ఈ శృంగారాది గణము భావనా భావ్యమానమై భాసించును. మానవుడు భోగీకృత రూపమున సిద్ధికలిగి రససంవేదనము పొందును. ఇది భట్టనాయకుని భావసారము.

## ప రి శీ ల న ము

దీని పరిశీలింపక విడుచుటెట్లు? భట్టలోల్లట పక్ష మంగీకరింప మైతిమి. ఇదియు నంగీకృతము కాదు. దానిని కాదంటిమి. దీని నట్లె యనవలయును. అనినదె యనుట యేమి రమ్యత? భోగమని భట్టనాయకు డనుచున్నాడు. ప్రతీతి, యుత్పత్తి యిత్యాదుల కన్న నతిరిక్తమగు భోగమది యెట్టిదో తెలిసినది కాదు. రస రసనమునె నాయకుడు భోగమనెనా? అదియు ప్రతిపత్తియె యగును కదా! ఉపాయములందు వైలక్షణ్య మున్నదని వేరు పేరు పెట్ట వలెనా? మూలమొక్కటి. నామము భిన్నము. నామాంతర కథనమున గలుగునదేమి? నాయకుడు నిష్పాదన మొప్పడు. అభివ్యక్తి నంగీకరింపడు. నిష్పాదన మొప్పనిచో రస మాతనికి నిత్యము కావలెను. అభివ్యక్తి నంగీకరింప కున్న రస మసత్తు కావలెను. అంతియె కాని యాతనికి మూడవ గతి లేదు. అప్రతీత వస్తువును "అస్తి" వ్యవహారమున నెవరును కూర్పరు. రస ప్రతీతి భోగీకరణమని, యది ద్రుత్యాది స్వరూపమని నాయకు డనును కాబోలును. అట్లే యననిండు! కాని రస ప్రతీతి తావన్మాత్రము కాదు. దానిని ద్రుతి విస్తర వికాసములన్న త్రిత్వమున నియమించుట సంగతము కాదు. రసము లెన్ని యున్నవో యన్ని రసాత్మ ప్రతీతులును కలవు. అవి యన్నియు భోగీకరణ స్వభావములె కదా? అప్పుడు సత్త్వాది గుణముల కంగాంగి భావ వైచిత్ర్యము, ననంతముగా కల్పింప వలసి యుండును. ఈ మాటి వలననేమి లాభము?

శృంగారాదికము భావనాభావ్య మనినాడు. రసములు కావ్యమున భావ్యమానములు కాగల వనినాడు. బాగున్నది. ఈ భావన మెట్టిదగునో? మా సమ్మతముగా విభావాది సమ్మిత మయిన "చర్వణ" యొకటి యున్నది. చర్వణాత్మక మయిన యీ యాస్వాద

మును కావ్యవిదు లొప్పుదురు. ఆస్వాదరూపమగు ప్రత్యయములో గోచరత్వ మాపాదించుట రసజ్ఞులకు తెలియును. అట్లు గోచరతా పాదనమె భావన మైనచో నందరంగీకరింతురు. మేమంగీకరింతుము.

## రసము కావ్యార్థము

రస మీమాంసలో నిన్ని వాదములు కాదంటిరి. పరిశుద్ధ తత్వమేదో చెప్పుడు! ఇదిగో! చెప్పుదుము! ఇప్పుడు మేము చెప్పుట యేమి? ముని చెప్పనే చెప్పెను. మేమపూర్వముగ జెప్పునది లేదు. మునియె యిట్లనెను. "కావ్యార్థాన్ భావయంతీతి భావాః" దీని యర్థమిది. పదార్థ వాక్యార్థములు రసములందే పర్యవసానము పొందగలవు. వానికి వేరుగా స్వరూప ప్రతిష్ఠ లేదు. అందుచే రసము లసాధారణ్యము కలవి ప్రాధాన్యము కలవి యగుటను కావ్యార్థము లగుచున్నవి. రస మెన్నడును స్వశబ్దాభిధేయముకాదు. కావుననె రసము కావ్యార్థము. "అర్థ్యంతే ప్రాధాన్యేన ఇత్యర్థాః" ప్రధానముగా నర్థింపబడు నవి యగుట యని యర్థము. కావ్యమున ప్రధానముగా రసములె యర్థింప బడును. కాన రసము కావ్యార్థ మయినది. ఆ రసములను నిష్పాదించు స్థాయి వ్యభిచారులు భావము లగును. స్థాయి వ్యభిచారి కలాపముననె యలౌకికార్థ మాస్వాద్య మగుచున్నది. మొదటగా స్థాయి యవగత మగును. ప్రథమావగతిలో భాసించిన స్థాయి యనంతర భూమికను పొంది సమాస్వాద్యమగు రసమునకు భావకము నిష్పాదకము నగును. అందుననే రసము కావ్యార్థ మయినది.

## భయానకానుభూతి

కావ్యాత్మక శబ్దమున గూడ సహృదయున కత్యధికమగు ప్రతిపత్తి యుదయించును. కావ్యగత వాక్యముల వలన మొదట వాక్యార్థము భాసించును. ఆ వాక్యార్థ ప్రతిపత్తి యనంతరము మానస సాక్షాత్కార రూపమగు నొక ప్రతీతి వాక్యమునందు పాత్తము లయిన కాలాది విభాగముల నన్నిటిని త్రోసిపుచ్చును. "గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః" శాకుంతలము లోని కాళిదాస పద్యమును భావించినపుడు దుష్యంతు

డనుగమింప భయపడి వనమున పరుగులెత్తు కురంగము యొక్క భయము భాసించును గదా! కాని మానస ప్రతీతి కలుగగనె యేదో యొక మృగపోతకము భాసించును. అందే విశేష మేమాత్ర ముండదు. అది భీతమన్న భానమున్నను భయపెట్టిన వాడు భాసిం పడు. పారమార్థికముగా భాసింపడు. కాని భయ మొక్కటియె దేశ కాలా ద్యనాలింగితమై భాసించును. కావుననే "నేను భీతుడను. ఈతడు భయపడినాడు. శత్రువు భయపడినాడు. మిత్రుడు భయపడి నాడు. మధ్యస్థుడు భయపడినాడు" ఈ మొదలగు ప్రత్యయము లందేమియు భాసింపవు. దుఃఖ కృతముగా హానము గాని, సుఖకృత ముగా నుపాదానము గాని యప్పటి బుద్ధిలో నుండదు. హానో పాదాన నియమములు గోచరింపవు. ఇట్టి నియమములు గల ప్రతీతిలో విఘ్న ప్రాయములు. విఘ్నబహుళము లయిన యీ ప్రతీతుల కన్న విలక్షణముగా నొకానొక ప్రతీతి కలుగును. అది నిర్విఘ్న ప్రతీతి. అట్టి ప్రతీతి నిర్గ్రాహ్యమును, సాక్షాత్తుగా హృదయములో ప్రవేశించు నదియు, కండ్లకు సాక్షాత్కరించి విపరివర్తమానము నగునదియు, మనోరసము నిండినదియునై భయానకరసము సాక్షాత్కరించు చున్నది. ఈ విధమయిన భయస్థాయిలో స్వాత్మ తిరస్కృతము కాదు. విశేషమును సముల్లిఖితము కాదు. అట్లె పరాత్మయు తిరస్కార పురస్కారము లేమాత్రము పొందదు. స్వ పరాది విభాగ మిందే మాత్ర ముండదు. ఈ సాధారణ్యము పరిమితము కాదు. ఇది విత తము. ఇందిట్టి సాక్షాత్కార విధానమునకు నటాదిసామగ్రి పరి పోషము సంపాదించును. కావ్య నాట్య సమర్పితములై వస్తుసత్త కలిగి యవభాసించు దేశకాల ప్రమాత్రాదులు నియమహేతువులతో కూడుకొనిన వయినను అన్యోన్య ప్రతిబంధ బలమున నత్యంత మపసర ణము పొందునవి యగును. ఇప్పటి యీ నటసామగ్రిలో దేశ కాల పాత్ర ప్రమాత్రాదు లేవియు గోచరింపవు. కేవలము సాధారణీ భావ మొక్కటియే యత్యంతము పరిపోషము పొందును. అందువలన సామాజికుల కేకఘనమయిన ప్రతిపత్తి యుండునని చెప్పితిమి. కేవల మది యంతయు ననాది వాసనా చిత్రీకృత చేతస్కులగు సర్వ సహృద యులును స్వ సంవాదము పొంది సంస్కారోద్బోధమున రస పరిపోష

మనుభవింతురు. ఇదియె నిర్విఘ్న సంవిదనుభవము. చమత్కార ఘన మయిన రస సంవేదనము. ఇట్టి చమత్కార పరిమితి నేమాత్రము నియమింపలేము. అత్యద్భుత భోగాత్మకమయిన స్పందావేశ రూప ముగా చమత్కార మావిర్భవించును. అప్పటి యీ సాక్షాత్కార స్వభావము మానసాధ్యవసాయ మగును. సంకల్పమగును. ఏదేని యగును. కాని యట్టి సాక్షాత్కార ముదయించును.

## సాక్షాత్కారము

శాకుంతలములో కాళిదాసు రస సాక్షాత్కార స్వభావము నీ విధముగా సూచించినాడు.

> "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
> పర్యుత్సుకీ భవతి య త్సుఖితోపి జంతుః
> తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
> భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

సుఖిత ప్రాణియు రమ్యములను చూచి మధుర శబ్దములను విని, పర్యుత్సుకు డగుట యబోధ పూర్వమును చేతస్సుచే స్మరించు చున్నాడని యర్థము. జన్మాంతర సౌహృదము లన్నియు భావగత ములై యుండును గదా!" దీని భావింపుడు. ఈ పద్యములో స్మరతి యని యొక స్మృతి నిదర్శిత మయినది. అది తార్కిక ప్రసిద్ధ స్మృతి కాదు. పూర్వ మట్టిదేమాత్ర మనుభూతము కాదుకదా! ఈ స్మృతి "ప్రతిభాన" మన్న పేరు కలది. సాక్షాత్కార స్వభావము, ఆస్వా దాత్మకము నయిన ప్రతీతి యొక్కటియె నిత్యమందు గోచరించును. ఆ ప్రతీతి యందే రతి యవభాసించు చున్నది. ఇది యిట్టిది కావు నని యే విశేష మిందు కూడి యుండదు. ఇది రసనీయమై యను భూతిలో సాక్షాత్కరించును. ఈ రతి లౌకికము కాదు. మిథ్య కాదు. అనిర్వాచ్యము కాదు. లౌకిక తుల్యము కాదు. తదారోపాది రూపమును కాదు. దేశకాలాది నియంత్రణ మేమాత్రము లేనందున రతికి సంబంధించిన యొకానొక యుపచయావస్థ కావచ్చును. అను గామిగా నున్నదని యనుకారమనియు నసుడు. విజ్ఞాన వాద మవ లంబించి విషయ సామగ్రిని గూడ చెప్పుడు. ఎన్నివిధముల నెట్లన్నను

రసనాత్మక మయిన వీతవిఘ్న ప్రతీతి దీని గ్రహించు చున్నది. ఇట్లు నిర్గ్రాహ్య భావమె రసము. ఇందు విభావ ప్రభృతు లన్నియు విఘ్నా పసారకములు. లోకమున కూడ, సకల విఘ్న వినిర్ముక్త మయిన సంవిత్తియె చమత్కారమని, నిర్వేశమని, రసనయని, ఆస్వాదనమని, భోగమని, సమాపత్తియని, లయమని, విశ్రాంతియని, ఏవమాది శబ్ద ములు నిరూపిత మగుచున్నది.

## వీత విఘ్న ప్రతీతి

రస ప్రతీతిలో విఘ్నము లేకున్నవి. విఘ్నము లన్నియు నశిం చిననె రస సంవిత్తి కలుగును.

౧. సంభావన సరిగా లేకపోవుట, ఈ సంభావనా విరహము ప్రతి పత్తిలో యోగ్యత నాపాదింపదు.
౨. స్వగతమని, పరగతమని నియమమున దేశ కాల విశేషావేశము పొందుట
3. స్వకీయము లయిన సుఖ దుఃఖాదులకు పరవశ మగుట
౪. ప్రతీతికి సముచితము లయిన యోగ్యోపాయముల వైకల్యము.
౫. సరిగా స్ఫుటత్వము లేకుండుట
౬. అప్రధానతా దృష్టి
౭. సంశయ యోగము.

ఈ విఘ్నముల వివరణము నిట్లు గుర్తింప వచ్చును.

౧. సంవేద్యమును సరిగా సంభావింప నేరని వాడు సంవేద్య తత్త్వము నందు స్వకీయ సంవేదమును స్వాత్మ సంవిత్తిని తగినట్లు నివేశింప చేయ జాలడు. కావున నాతనికి సంవిద్విశ్రాంతి దుర్లభము. విశ్రాంతికి సముచిత మయిన యోగ్యత యాతనిలో లేదన్నమాట. తెలియ దగిన దానిని తగిన విధమున తెలియ నందున ఆతని తెలివి డిలో సామర్థ్య ముదయింపదు. ఇది ప్రథమ విఘ్నము. ఈ విఘ్నము తొలగినచో లోక సామాన్య వస్తు విషయముగ నొక హృదయ సంవాదము కలుగును. అలోక సామాన్యము లయిన చేష్టితము లందు ప్రఖ్యాతులయిన రామాదుల నామధేయముల పరిగ్రహించు

టయు నీ విఘ్నములోని విశేషమె. అఖండిత మయిన ప్రసిద్ధిచే గాఢముగా రూఢముగా నొకానొక ప్రత్యయము కలుగును. ఆ ప్రత్యయ ప్రసరముచే రామాది నామముల విడనాడ లేరు. అందు వలననె నిస్సామాన్య మయిన యుత్కర్ష కలిగి యుపదేశమును వ్యుత్పత్తిని గలుగ జేయు నాటకాదులలో వస్తువు ప్రఖ్యాతముగా నుండవలెనని నియమముగా నిరూపించినారు. ప్రహసనాదు లందింతటి నియమము లేదు. అఖండిత ప్రసిద్ధికము లయిన చరితములను కూర్చి నప్పుడు సంవేద్య సంభావనము చక్కగా నుండును.

౨. ద్వితీయ విఘ్న విధానము నిట్లు గుర్తింప వచ్చును. సుఖ దుఃఖ సంవేదనములు స్వగతములై యున్నప్పుడు వాని సమాస్వాదములో నిరాటంకమయిన యేకాగ్రత కావలయును. అట్లు కాక సంవేదనాంతర మచట నుదయించినచో ద్వితీయ విఘ్నము కలుగును. సంవేదనాంతర సముద్గమములో ననేక విధానములున్నవి. ఒక్కొకటి యొక్కొకచో నుండవచ్చును.

1. తన యందున్న సుఖ దుఃఖ సంవేదనములు తొలగి పోవునేమో యన్న భీతి యున్నప్పుడు సంవేదనాంతరము కలుగ వచ్చును.

2. తనయందలి సంవేదనములను పరిరక్షింప వలయునన్న వ్యగ్రత భావుకునకుండగా త దుపాయాన్వేషణములో సంవేదనాంతర ముదయించును.

3. స్వసంవేదన సదృశములగు వానిని సంభావించి సంపాదించి యనుభవింప వలెనన్న కాంక్ష ప్రబలము కాగా నప్పటి వ్యాకీర్ణ బుద్ధిలో సంవేదనాంతరము కలుగును.

4. తనలోని సుఖదుఃఖముల స్వదాంఘాతముల కోర్వలేక వానిని విడిచిపెట్టు కొనవలయునన్న కాంక్ష యుదయింపగనె యితర సంవేదన ముదయించు చున్నది.

5. స్వసంవేదన రీతులను బాగుగ ప్రకటన మొనర్చి ప్రఖ్యాపితముల చేయవలయు ననెడి కాంక్ష భావకున కున్నప్పుడు సంవేదనాంతరము కలుగును.

6. స్వకీయ సుఖ దుఃఖాది భావములకు లొంగిన భావకుడు

స్వయము లజ్జాపితుడై వానిని గోపనము చేయవలెనను కొనును. అట్టి సమయమున గూడ సంవేదనాంతరము కలుగును.

## సంవేదనాంతరములు

ఈ చెప్పిన విధములనే కాక ప్రకారాంతరమున గూడ నన్య సంవేదనము లావిర్భవించును. వాని నన్నింటిని స్వయముగ నిపుణముగ సంభావించుట విఘ్నాన్వేషణ సముచిత ప్రక్రియ. ఇన్నిన్ని విధముల స్వసంవేదనములో కలయిక నాపాదించు సంవేదనాంతర సంబంధము పరమ విఘ్నముగా నున్నది. ఈ చెప్పిన సంవేదనాంతర సముద్భూతిలో నిరూపితము లయిన కారణము లీ క్రిందివిధమున వేర్వేరున దగి యున్నవి.

౧. తదపగమ భీరుత్వము
౨. పరిరక్షా వ్యగ్రత
౩. సదృశార్జిజీష
౪. జిహాస
౫. ప్రఖ్యాపనేచ్ఛ
౬. గోపనేచ్ఛ.

సుఖ దుఃఖ సంవేదనములు పరగతము లన్న నియమము ననుసరించి సంవేదనమున సమాకర్షించు కొనినప్పుడును భావకునకు స్వాత్మలో నియమముగా నీ విఘ్న మవశ్యంభావియె యగుచున్నది. అట్లు కలుగుటలో కూడ సుఖదుఃఖ మోహ మాధ్యస్థ్యాది సంవిదంతరములు ప్రాదుర్భవించునన్న సంభావన ముండుటయె హేతువు. సుఖ దుఃఖాదులను పరగతముగా భావించు వాడు సుఖమును సుఖముగను దుఃఖమును దుఃఖముగను భావింప నేరడు. ఒకని సుఖము వేరొకనికి సుఖ మాపాదింపక పోవచ్చును. అది దుఃఖమునే కలుగ జేయ వచ్చును. అట్లే వేరొక్కని దుఃఖము మరి యొకనికి సుఖమగును. ఇట్లన్యోన్య భావము లుదయించును. ఇట్లుదయించునన్న ప్రత్యయ నిశ్చయము కూడుకొనును. కావునన యీ విఘ్న మవశ్యంభావి యంటిమి.

ఈ విఘ్నాపసారణమున నతి ప్రసంగ మక్కరలేదు. చేయ దగిన యుపాయ మున్నది. ప్రయోగారంభములో పూర్వరంగ ముపక్రమింతురు. పూర్వరంగ విధిలోని నానా విధములగు ప్రతీతులను భావించి మొదట సామాజికు డొకభావము కలవాడు కావలెను. రంగ పరికరములను రంగ విశేషములను విస్మరింపక నటీ నట విదూషకు లాసూత్రించు ప్రస్తావనము చక్కగా పరిశీలింప వలెను. ఇట్లు పలక్షితమైన ప్రస్తావనా పరిశీలనమున ప్రయోగ మొనరించు వారి యందున్న నట స్వభావమును తెలిసికొనవచ్చును. అట్టి శిక్షా కౌశలమున పూర్వరంగాంగములలో భావకుని మనసు లగ్నమై భావనా సక్తమగును. వారి వారి యాహార్యముల ననుసరించిన మకుట ప్రతిశీర్షకాదులును మానస కాలుష్యమును పోగొట్ట గలవు. ఈ రీతి ననుసరించి సంవేదనాంతరము కలుగు నప్పుడు కలుగ కుండు నట్లుగా ప్రచ్ఛాదన మొనరింపవచ్చును. ఈ ప్రచ్ఛాదన ప్రకారమె యీ విఘ్నమును బోగొట్టుటలో నుపాయము. ఈ యుపాయము నం దలౌకికమగు భాషాభేద మున్నది. లాస్యాంగముల విలాసమున్నది. రంగపీఠ రంగమంటప గతము లయిన కక్షా పరిగ్రహములతో నాట్యధర్మి సుశ్లిష్టమై యున్నది. ఈ నాట్యధర్మి సహితమయిన యభ్యుపాయము కూడుకొనగా ఈ సుఖ మీతనిదే. ఈ దుఃఖమాతనిదే. ఇది యిచ్చటిదే. ఇది యింతటిదే అను ప్రతీతికలుగదు. వాని స్వభావగత మయిన స్వరూపము నిహ్నవము పొందినది. రూపాంతరముకాని యారోపిత స్వరూపముకాని, ప్రతిభాన వికలము విశ్రాంతి వికలము నయినందున స్వరూప ప్రతిష్ఠితము కాదు. స్వ స్వభావమున విశ్రాంతి పొందదు. "ఇది తదీయ రూపము కాదు" అను నంతమాత్రముననే యది పర్యవసించును. ఈ సర్వార్థమును సాధారణీ భావసిద్ధిచే రసదర్పణమున కుపయోగించు నట్లుగా ముని పరికర బంధము సర్వ మాశ్రయించినాడు. స్వగత పరగతత్వనియమమున దేశకాల విశేషావేశ మీ యభ్యుపాయము నాశ్రయింపదా ? ఏమియు నుండదు.

నిజసుఖాది వివశీభావ రూపమయిన తృతీయ విఘ్నము నిట్లు భావింప వచ్చును. భావకుడగు వాడు స్వకీయ సుఖ దుఃఖాదులచే

వివశుడగునేని వ_స్త్వంతరమునందు స్వ సంవి_త్తిని వి|శమింప జేయ జాలడు. ఒకచో |ప్రసృతమయిన సంవి_త్తి వేరొకచో నెట్లు వి|శమింప గలదు? స్వకీయ సుఖదుఃఖముల వలన వివశత్వము పొందుట యొక మహా |ప్రత్యూహము. ఈ |ప్రత్యూహ వ్యపోహనమున కీచెప్పనట్టి యుపరంజన మా|శితము కావలయును. నాట్య రంగమున |ప్రసరించు నట్టి యాతోద్యము గానము విచి|త్రమండపము విదగ్ధ గణికా లాస్యము చక్క-ని యుపరంజనము సంపాదించును. ఈ యాతో ద్యాదు లన్నియు శబ్దాది విషయ మయములై సకల విధముల భోగ్యము లగుటను సహించునవియై యుండును. ఇవి |ప్రతిపదార్థ నిష్ఠము లయినను సాధారణ్య మహిమచే నుపరంజన మాపాదించునవి కాగలవు. అందుననె యహృదయుడు కూడ హృదయ నైమల్యము కలుగుటచే సహృదయీకృతు డగుచున్నాడు.

|ప్రతీత్యుపాయములు లేనప్పుడు |ప్రతీతి కలుగనే కలుగదు. |ప్రతీత్యుపాయ సంపాదనమునకు భావకుని సాధన మెంతయో కలదు. ఈ యుపాయ వి_స్తరణ మవలంబించి నప్పుడు నిర్విఘ్నమయిన ప్రతీతి యుదయింప గలదు.

స్ఫుటత్వము లేకపోవుట యొక విఘ్న మంటిమి. అప్పట |ప్రతీతిని కలుగజేయు శబ్దలక్షణ చిహ్నము లున్నప్పుడు |ప్రతీతి వి|శా మము కుదరదు. |ప్రతీతి వి|శాంతి యనునది స్ఫుట |ప్రతీతి రూపమగు |ప్రత్యక్షమునకు సముచితము లయిన |ప్రత్యయముల నాకాంక్షించు చుండును. |ప్రమితి సర్వస్వ మంతయు |ప్రత్యక్ష పరాయణముగ నుండునని పెద్దలనిరి. స్వ |ప్రత్యక్ష సాక్షాత్కృత మయిన యంశమున నాగమ శతములు కాని యనుమాన సహ|సములు కాని యన్యథా భావ మాపాదింప జాలవు. ఆగమానుమానముల వలన గలిగిన విఘ్న ద్వయమును విఘాత పఱచుటకు నాట్యాభినయములు సమర్థ ములు. ఈ యభినయములందు లోక ధర్మానువృ_త్తి |ప్రవృత్తు లున్నవి. ఉన్న నవి యన్నియు నుపస్కృతములై సంవి_త్తిచే నభిషించితము లగును. అభినయనము |ప్రత్యక్ష వ్యాపారకల్పము. |ప్రత్యక్షత్వ |ప్రసిద్ధిచే స్ఫుటత్వము కలుగుచున్నది.

అప్రధానత వేరొక విధమయిన విఘ్నము. కావ్య నాట్య సమర్పితములందు ప్రధానభావము కలుగ వలయును. అప్రధానతా దృష్టి యున్నచో నట్టి వస్తువునందు సంవిద్విశ్రాంతి రాదు. అప్రధానమసి యనుకొనగనె ప్రధానమును గుర్తించుటకు సంవిత్తి యనుధావన మొనర్చును. అది స్వాత్మ విశ్రాంతి పొందదు. ఈ యప్రధానత్వ మన్నది జడమయిన విభావానుభావ వర్గమున కలుగ వచ్చును. సంవిదాత్మకమయిన వ్యభిచారి నిచయ మందుదయింప వచ్చును. ప్రాప్తసుఖముకన్న నితర సుఖాపేక్ష నియతమగును గావున ప్రాప్త సంప్రాప్తము లందు ప్రధానత భాసింపదు. కావున వీనికన్న నతిరిక్తముగ స్థాయిభావమె చర్వణ పాత్రము. పురుషార్థ నిష్ఠము లయిన సంవిత్తులన్నియు నందు సులగ్నము లయినవి. కావున నది ప్రధానము. పరిశీలింపుడు! రతి స్థాయి కామ పురుషార్థమున సమాసక్తి నిచ్చును. తదనుషంగి ధర్మార్థములందును నిష్ఠ నాపాదించును. క్రోధస్థాయి యర్థ పురుషార్థనిష్ఠమై ప్రధానభావము కలుగ జేయును. ఉత్సాహస్థాయి ధర్మ కామములందు పర్యవసిత మగును. సమస్త ధర్మాదులందును పర్యవసించును. శమస్థాయి మోక్షోపాయము. ఇట్లె యితరములును పుమర్థ నిష్ఠములు కాగలవు. కావుననె స్థాయి చర్వణాస్పదమై ప్రాధాన్యము పొందుచున్నది. ఈ రత్యాదులందు నొకొక్కప్పు డన్యోన్యము గుణభావముండుట కలదు. అయినను తత్ప్రధాన మయిన రూపకమున నది ప్రధానము కాగలదు. రతి ప్రధానకమయిన శాకుంతలమునందు రతి ప్రధానతను స్పష్టముగనె గుర్తింతుము. అట్లె రూపక భేదముల ననుసరించి యాయా భావముల కన్నిటికి ప్రాధాన్య ముపలక్షితము కాగలదు. ఒకే రూపకమున గూడ నంగాంగి భావ సమన్వయము సమీక్షింపక దూర భాగాభినివేశమును దూరముంచి పరిశీలించినచో వేరు వేరు ప్రాధాన్యము నూహింప వచ్చును.

ఈ భావములన్నియు సుఖ ప్రధానములు. స్వ సంవిచ్చర్వణ రూపమగు నేకఘన ప్రకాశమునకివి యానంద సారములు. ఏకఘన శోక సంవిచ్చర్వణములో కూడ లోకమున హృదయ విశ్రాంతి

యున్నది. అంతరాయ శూన్యముగు విశ్రాంతిని స్త్రీలోక మచట గుర్తింప గలదు. దుఃఖ మనునది యవిశ్రాంతి స్వరూపము. ఎల్లని క్షణకాలమేని హృదయ విశ్రాంతి యున్నప్పుడు దుఃఖము లేదు. కావుననె కాపిల సాంఖ్యులు దుఃఖమునకు చాంచల్యమె ప్రాణమనిరి. దుఃఖము రజోవృత్తియని వారన్నను చాంచల్య ప్రాణక మయి నందున చంచలత కలుగగనె దుఃఖము దుఃఖము కాదు. సర్వ రస ముల కానంద రూపత్వము నిశ్చితము కాగలదు. కాని యొకటి యున్నది. ఉపరంజక విషయవశమున సుఖమయ సంవిత్తిలో కటు కిమ స్పర్శ కలుగ వచ్చును. అప్పుడట్టి స్పర్శవేధ వీరరసమునందు వలె కేవల మానంద సారముగ నుండక పోవచ్చును. అయిన నట్టి యితర స్పర్శ మయినను క్లేశ సహిష్ణుత్వము తోడనె యుండును. కాగా నా యా స్థలగతి ననుసరించి రత్యాదులకు ప్రాధాన్య మున్న దని నిశ్చయింప వలెను. హాసాదులకును సాతిశయ ప్రాధాన్య మున్నది. సకల లోక సులభములయిన విభావము లుండుటచే నుప రంజన మయత్న సులభముగ నచట భాసించును. అట్టి యప్పుడు హాసాదుల ప్రాధాన్యము కుంటుపడదు. కావుననె యనుత్తమ ప్రకృతు లలో హాసాదులు బహుళముగా గలుగు చున్నవి. పామర ప్రాయు లెల్ల వారును హసింతురు. శోకింతురు. భీతిల్లుదురు. పరనింద నాద రింతురు. స్వల్ప సుభాషితమున్నను సర్వత్ర విస్మయ పడుదురు. రత్యా దుల కంగములై యవి పుమర్థోపయోగులగును. వానికిట్టి స్థాయి త్వము పోదు. నిరపాయ స్థాయిత్వమున ప్రధానత కుదురు కొనును. ఈ భావ సంభావనముతో నప్రధానత్వము నిరసింప వచ్చును. స్థాయి నిరూపణ మొనర్చి స్థాయి భావములకు రసత్వ మాపాదింతుమని సామాన్య లక్షణ కథనానంతరము విశేష లక్షణ నిష్ఠముగ నిరూపణ మొనర్చిన మునియు దీని నాభాషించినాడు.

సంశయ యోగ మేడవది. అనుభావములు విభావములు వ్యభిచారి భావములు స్థాయి భావ విషయమున నియతముగ లేవు. ఒక్కొక స్థాయికి నివియె విభావాను భావ వ్యభిచారులని నియమము కానరాదు. బాష్పాను భావము ఆనందమున గలుగును. ఆర్తి వలన

జనించును. రోగాదుల వలన పుట్టును. ఇట్లంతట గోచర మగు చున్నది. వ్యాఘ్రము క్రోధ విభావ మగును. భయాదులకును హేతువగును. శ్రమ చింతాది వ్యభిచారు లుత్సాహ భయాదులలో ననేక సహచరులుగా నుండుట కన్పడు చున్నది. వీనిలో నియమము లేదు. ఇవి యటు నిటు నున్నవి. బంధు వినాశము విభావముగా నున్న స్థలమున, పరిదేవన మశ్రుపాతము మొదలగు ననుభావములు, చింతా దైన్యాది వ్యభిచారులు నచట గోచరించును. ఇది శోకమె యగును. కాని విభావానుభావము లనియతముగ నుండుటను బట్టి సంశయ ముదయించును, ఈ సంశయోదయ రూపమయిన విఘ్నము సంవిద్విశ్రాంతిని సంపాదింపదు. ఈ శంకాత్మక విఘ్న ప్రశమన మునకై విభావానుభావ వ్యభిచారి సంయోగ ముపాత్తమయినది. అన్నిటి సమాహార ప్రత్యయములో శంకా కళంకము రాదు. అవి యన్నియు నేకనియతములై ప్రతిభాసించును. అప్పుడేక సంవేదనము నకు సామ్రాజ్య మున్నది.

## విభావాదిసంజ్ఞ

లోక వ్యవహారమునందు కార్యములని కారణములని సహ చరాత్మకములని సంకేతము గోచర మగుచున్నది. వీని నాధారము చేసికొని స్థాయ్యాత్మక మయిన పరచిత్తవృత్తి ననుమానింప వచ్చును. ఎవరేని యిట్టి కార్య కారణ సహకారులు కలవారుగ కన్పడిన వారి యందు స్థాయి యున్నదని యూహింప వచ్చును. ఇట్లభ్యూహించు టలో నభ్యాస పాటవము కల బాలకుడు కావ్య నాట్యము లందు వేరు విధమయిన భావభావనము చేయగలడు. లోకములో నుద్యానములు కారణములని, కటాక్షములు కార్యములని, ధృత్యాదులు సహకారు లని నిశ్చయించి నప్పుడు అవి యన్నియు లౌకికమగు కారణ కార్య సహకారిత్వ భూమిలో నున్నట్లు ప్రసిద్ధము. కావ్య నాట్యములలో నా యుద్యానాదులు లౌకిక భూమి నతిక్రమించు నవి యగును. విభావన మనుభావనములచే సముపరంజితము లగును. అవి తన్మాత్ర ప్రాణములుగా నుండును. కావుననె లౌకికము లయిన కార్య కారణ వ్యపదేశములు పోగా నలౌకిక విభావాది వ్యపదేశమును పొందగలవు.

కారణము లయిన యుద్యానములు విభావము లగును, కార్యము లయిన కటాక్షాదు లనుభావము లగును. సహకారులయిన ధృత్యాదులు వ్యభిచారులగును. ఇట్టి నవ వ్యపదేశ భాజనములై యయినను ప్రాచీనమగు కారణాది రూప సంస్కారోపజీవనము నవి ఖ్యాపనము చేయుచునే యుండును. విభావాది నానా నామధేయ వ్యపదేశము పొంది వానిలోనవి పర్యాయ భేదమున ప్రధానము లప్రధానములు నగుచుండును. ఇట్టి స్వరూపముతో సామాజిక మనస్సు లందు సమ్యగ్యోగము పొందును. చక్కని సంబంధము సంపాదించును. బాగుగా నైకాగ్ర్యము కూర్చును. ఇట్టి సంబంధము కలవై యవి యలౌకికము నిర్విఘ్నము నయిన సంవేదనాత్మక చర్వణమును సంపాదించుచున్నవి. ఈ చర్వణమునందే రసము గోచరమగును. ఇట్లు చర్వణాగోచరత్వమును పొందిన యర్థమునె "రసము" అందుము.

## చర్వణము

ఇది చర్వ్యమాణతైకసారము. చర్వణ మున్నంతవరకిది సాక్షాత్కరించును. చర్వణము లేకున్నది గోచరింపదు. చర్వణాసారమగుటను బట్టియే రసము సిద్ధ స్వభావము కాదని తాత్కాలిక మని యనవచ్చును. చర్వణా తిరిక్తమగు కాలము నిది యేమాత్ర మవలంబింపదు. రసమిది స్థాయి విలక్షణము. శ్రీశంకు కాదు లను కొనినట్లు స్థాయియె రసము కాదు. "విభావాదులచే స్థాయియె ప్రతీయమానమై రస్యమాన మగుటను బట్టి రసమగుచున్నదని" శంకు కాదు లనిరి. అట్లై యయిన లోకమున గూడ రస ముండవచ్చును. అసద్రూపముగూడ నాట్యమున మీకు రసనీయ మగుచున్నప్పుడు లోకమున సద్రూప మగునది రసనీయ మేల కాజాలదు? వారలకు స్థాయి ప్రతీతి యనుమితి రూపమని యనవలసిన యవసరమున్నది. అది రసము కాదు. కావుననె రససూత్రమున ముని స్థాయిగ్రహణ ముంచినాడు కాడు. అట్లు స్థాయి నుంచుట శల్య భూతమయ్యెడిది. స్థాయి రసమయిన దని యనుట కేవల ముపచార వచనము. అది యొక యౌచిత్యానుసారి వచనము. స్థాయి గతముగ కారణాది రూపమున ప్రసిద్ధము లగునవి ప్రకృతము చర్వణోపయోగులై విభావాదిత్వ

మవలంబించిన వగుటచే నేదో వచనమాత్రముగ స్థాయి రసీభూతము”
అని యనుట. లౌకిక చిత్తవృత్తి ననుమానించుటలో రసత్వ మేమి
యున్నది? రసాస్వాదమెప్పుడు నలౌకిక చమత్కారాత్మకమె కావల
యును. ఆ యలౌకిక రసాస్వాదము స్మృతి కన్న అనుమానము కన్న
లౌకిక స్వసంవేదనమున కన్నను విలక్షణము.

## సంవేదనవిలక్షణత

ఈ వైలక్షణ్యా మిట్లు భావించవచ్చును. లౌకికానుమాన
మున సంస్కృతమయిన ప్రమదాదికము భావకునకు సంబంధించని
యట్లు తటస్థముగా భాసింపదు. తన్మయీ భావసముచిత మయిన
చర్వణా ప్రాణముగనే భాసించును. అనుమానము స్మృతి మొదలగు
సోపానముల నిది యేమాత్ర మారోహింపదు. హృదయ సంవాదా
త్మక మయిన సహృదయత్వ బలమున సంపూర్ణము కాబోవు రసా
స్వాదాంకురముగనె చర్వణా ప్రాణముగ గోచరించును. ఈ చర్వణ
యనునది యప్పటిదే కాని ప్రాచీనముకాదు. ప్రాచీనము కానందుననే
యిందు స్మృతిలేదు. దీనిలో లౌకికము లయిన ప్రత్యక్షాది ప్రమాణ
ముల వ్యాపార మేమియు లేదు. ఈ చర్వణ యలౌకిక విభావాది
సంయోగ బలముననె సంప్రాప్తమగుచున్నది. ఈ చర్వణ ప్రత్యక్షాను
మానా గమోపమానాది లౌకిక ప్రమాణముల వలన గలిగిన రత్యా
దుల యవబోధము కన్న విలక్షణము. యోగుల ప్రత్యక్ష జన్యమగు
పరసంవిత్తి జ్ఞానముకన్న విలక్షణము. ఏవిధమయినవిషయోప రాగము
లేని పరిశుద్ధ పరయోగి యందున్న స్వానందైక ఘనానుమానము
కన్నను విలక్షణము. ఈ చెప్పిన వానిలో విఘ్నోదయము లున్నవి.
తాటస్థ్యము కారణముగా నస్ఫుటత్వ మున్నది. విషయావేశ వివ
శత్వమున వివశత్వ మున్నది. కావున దానిలో సౌందర్యము లేదు.
ఈ చర్వణలో స్వాత్మైకగతమె యను నియమము లేనందున విషయా
వేశ వివశత్వము లేదు. స్వాత్మానుప్రవేశమున్నందున పరగతత్వ
నియమమును లేనందున నిందు తాటస్థ్యమువలని యస్ఫుటత్వమును
లేదు. విభావాదుల సాధారణ్యము వలన స్వకీయ రత్యాది సంస్కార
ములు సంప్రబుద్ధము లగును గావున విఘ్నాంతరము లేవియు నిందు

సంక్రమింపవు. కావుననె విభావాదులు రసమునకు నిష్పత్తి హేతువులు కావు. నిష్పత్తి హేతువులె యయినచో విభావాదుల బోధ తొలగి పోయినను రసముండ వలసివచ్చును. చర్వణా సమయమునందె రసముండును గాని యితర సమయమున నుండదు. విభావాదులు జ్ఞప్తిహేతువులును గావు. అట్లేయయినచో నవి జ్ఞాపకరూపమున ప్రమాణముల మధ్యలో చేరవలసి వచ్చెడిది. ప్రమేయరూపముగా సిద్ధమగు రసమిచట లేనే లేదు. సిద్ధ ప్రాయముగా ప్రమేయభూత రసమున్నప్పుడె విభావాదులు జ్ఞాపకము లనవలెను. ఇచ్చట నట్లు రసము సిద్ధమై లేదు. "కారకములు కాక జ్ఞాపకములును కాక యీ విభావాదులిక యేమి ?" యందురు కాబోలు. చర్వణోపయోగి యీ విభావాది వ్యవహారమంతయు నలౌకికమని మా యుత్తర వచనము. ఇట్టి విధాన మెచ్చటను కనపడకపోవచ్చును. ఇచ్చటనే యది కనపడుచున్నది. ఇది మా కలౌకికత్వ సిద్ధిలో భూషణమెకాని దూషణము కాదు.

ఇంత చెప్పగా రస మప్రమేయ మందురు కాబోలు! మేము నిరూపించిన యీ రసము ప్రమేయాది స్వభావము కాదనియే యంటిమి. ఇది రస్యతైక ప్రాణమనియె పల్కితిమి. ఈ దృష్టితో నప్రమేయమందురో! యనుడు! రససూత్రమున నిష్పత్తియని యున్నది. నిజమె. నిష్పత్తి యది రసనిష్పత్తి కాదు. రస విషయ రసనా నిష్పత్తియె సూత్రములోని నిష్పత్తి. రసనా నిష్పత్తి ననుసరించి రసనానిష్పత్త్యేకాయత్త జీవిత మయిన రసమునకు నిష్పత్తి పలుకు దురేని పలుకవచ్చును. మేము చెప్పిన యీ రసన ప్రమాణ వ్యాపారము కాదు. కారక వ్యాపారమును కాదు. స్వసంవేదన సిద్ధ మయినందున నిది యప్రామాణికమును గాదు. ఈ రసన బోధ రూపమె. ఇది బోధ రూపమయినను లౌకిక బోధాంతరములకన్న విలక్షణము. ఉపాయము లేని విభావాదులన్నియు లౌకిక విలక్షణములె కదా! కావున నిది నిర్గలితార్థము. విభావాది సంయోగమున రసన నిష్పన్నమగుచున్నది. అట్టి రసనా గోచరము లోకోత్తరము నగు నర్థమె రసము. ఇది సూత్ర తాత్పర్యము.

## రససంవిదున్మేషము

ఇక నిది సంక్షేపార్థము. మకుట ప్రతిశీర్షకాదులచే నట బుద్ధి యాచ్ఛాదితమగును. గాఢమగు ప్రాక్తన సంవిత్సంస్కారము వలన నటునందు కావ్యబల సమానీత మయినను రాముడన్న ధీవృత్తి విశ్రాంతి పొందదు. రంగమున కన్పడు నటుడు లోకవ్యక్తి కాడన్న దృష్టి కలిగినను "ఈతడు రాముడు" అన్న బుద్ధి మాత్రమె యచట సువిశ్రాంతము కాదు. కావుననె యుభయుల దేశకాలములు పరిత్యక్తములు, "రామ దేశము వేరు రామ కాలము వేరు. తన దేశము వేరు తన కాలము వేరు." అనునట్టి దృష్టి యేమాత్ర ముండదు. రతి ప్రతీతిని గలుగ జేయునట్టి రోమాంచాదులును స్పష్టముగా గోచరించిననై దేశకాల నియమము లేకుండగనె రతి ప్రతీతి నాపాదింప గలవు. ఆ రతిలో తత్సంస్కారము కలిగి యుండుటచే స్వాత్మ కూడ ప్రవేశించును. స్వాత్మానుప్రవేశ మున్నందున రతి తటస్థముగా భాసింపదు. ఏదేని కారణ యుతముగ గోచరించినచో నా కారణమేమో? తత్సంబంధ మేమో? యను సంభావనాన్వేషణ ముండవచ్చును. ఇప్పుడట్టిది లేదు. "నియతముగ నీ రతి పరునకు సంబంధించి నదియె" అను దృష్టియు గలుగదు. అట్లై కలిగిన దుఃఖ ద్వేషాదు లుదయించునని యంటిమి కదా! కావున సాధారణీభూతమై నిరంతర సంతాన సంతతి ప్రవృత్తమగు నొక సంపత్తికి మాత్రమె గోచరించు నదియై రతి యవభాసించును. ఆ రత్యాస్వాదమున శృంగారము సాక్షాత్కరించును. విభావాదులచే సాధారణీభావము కలుగుట సుప్రసిద్ధము. ఒక్కొకచో విభావ ప్రాధాన్యమున సాధారణీ భావముండును. విభావ కృతమయిన సాధారణ్య మున్నచోట సముదయము పొందిన సౌందర్యానుగతముగ ననుభావ వర్గము, విభావ వర్గ మవభాసించును. ఇట్లవభాస మున్నందుననె యస్ఫుటత్వాశంక రాదు. రత్యాశ్రయమయిన శృంగారము నిర్విఘ్నముగ ప్రతీత మగును. ఒక్కొకచోట ననుభావ ప్రాధాన్యమున సాధారణీభావము కలుగును. శుద్ధ సారస్వత ప్రభావమున సకల వాఙ్మయ మహార్ణవము పవిత్రము కాగా పూర్ణ భావ సంవేదనము

కల ప్రముఖులు తమ నిరూపణమున స్వాత్మ సమాప్తికి స్థానము కల్పించినారు. అట్టి స్థలములందు వ్యభిచారులు భావములు గుణములై భాసించును. వ్యభిచారి ప్రాధాన్యమున గూడ సాధారణ్యము సంపన్న మగుట కలదు. ఇట్లే ద్వయ ప్రాధాన్యమున సమప్రాధాన్యమున రసాస్వాద సముత్కర్ష కలుగును.

ఇది యంతయు ప్రబంధముననే ప్రకాశించును. దశరూపకమున స్వరూప ప్రతిష్ఠ పొందును. సందర్భములందు దశరూపకము ప్రశంసించి విశేష సాకల్య ముండుటను చెప్పి వామనుడు మార్గము చూపినాడు. ప్రబంధము రస సమర్పణ మొనరించుచు భాషా వేష ప్రవృత్తివైచిత్ర్యాదుల కల్పనమున రస నిదాన మగుచున్నది. తదుపజీవనమున ప్రవర్తించు ముక్తకమున గూడ నీ భాగ్యమున్నది. కావుననె ముక్తకములందు సహృదయులు పూర్వాపర ముచితముగ పరికల్పించుకొని బహుతర పీఠబంధమున నవతరణము కూర్చుచున్నారు. అ సహృదయులు కావ్యాభ్యాసమున ప్రాక్తన పుణ్యబలమున సహృదయు లగుచున్నారు. సాక్షాత్కారమునకు సముచితముగ విభావాద్యున్మీలన మొనర్చుకొని భావించు చున్నారు. వారలకు కావ్యార్థము సాక్షాత్కార ఘనమై స్ఫురించును. కావుననె వారలకు కావ్యమె ప్రీతిప్రదము వ్యుత్పత్తి ప్రదము నగుచున్నది. వారి హృదయము నాట్యాపేక్ష లేకున్నను నిర్మల మగును. అహృదయులకు నాట్యము నైర్మల్యాధానము చేయును. నైర్మల్యాధానమున ప్రతీతి ప్రసార మనుభవించు వారలకు గీత వాద్య గణికాదులు వ్యసనిత నాపాదింప జాలవు. నటుడును నిత్యోపకరణ స్వీకారమున ధ్యాతలకు ధ్యాన పదముగా గోచరించును. నటుడె వాసుదేవుడన్న ప్రతిపత్తి కలుగదు కాని, సంకల్ప మొక్కటి సదుపాయ ద్వారమున నతిస్ఫుటము కాగా "ఈత డొక్క దేవతా విశేషము" అని గోచరించును. అట్లె నట ప్రక్రియయు నుండును. వాగాది విధానములకు దేశ కాలాది సంబంధము లేని ఫల మిట్లుండునని వ్యుత్పత్తియు స్వీకృతమగును. చిత్తవృత్తి యిట్లు సుప్రసన్నమై నాట్య ప్రవణమైనప్పుడు బాధక ముదయింపదు. సమ్యక్ జ్ఞానమె యొకటి కలుగును. ఇట్టిది యిచ్చట నాట్యరస సంవిద్మనేష విధానము.

## లోకదృష్టాంతము

ఈ రసతత్త్వార్థ మంతయు నలౌకికము. దృష్టాంతము లేక యిది హృదయంగమము కాదు. ఇందు దృష్టాంతమేమి ? బహుపదార్థముల సంయోగమున రస ముత్పన్న మగుట లోకములో నెచట నున్నది ? ఈ ప్రశ్నకిది యందుము. ఇట్లు ప్రతివచన ముట్టంకింతుము.

౨౩౫. యథాహి; నానావ్యంజనౌషధి ద్రవ్య సంయోగాత్
రస నిష్పత్తి ర్భవతి- యథాహి; గుడాదిభిః
ద్రవ్యైః వ్యంజనౌషధిభిశ్చ షాడబాదయో రసా
నిర్వర్తంతే, తథా నానా భావోపగతా
అపి స్థాయినో భావా రసత్వ మాప్నువంతీతి.

నానా విధములగు వ్యంజనౌషధి ద్రవ్యముల సంయోగమున రసము నిష్పన్న మగును. చూడుడు! గుడాది ద్రవ్యములతో వ్యంజనౌషధులతో షాడబాది రసములు సిద్ధము లగును. అట్లె నానా భావముల కూడుకొని స్థాయి భావములు రసత్వము పొందును. వ్యంజన మనునది యుపసేచన ద్రవ్యము. అది తిక్తముగా మధురముగా నుండును. గోధుమ పసుపు చింతపండు జీలకర్ర మొదలగునవి యోషధులు. గుడాదులు ద్రవ్యములు. వీని పాకక్రమమున సమ్యక్సంయోజన మొనర్పగా కుశల సంపాద్య మొక సంయోగము కలుగును. అప్పుడు విలక్షణమగు రస ముదయించును. అది పరస్పరము వేరు వేరు గా నుండు లోక ప్రసిద్ధము లయిన మధుర తిక్తామ్ల లవణ కటు కషాయముల కన్న వేరుగా నుండును. మిశ్ర రసములకన్నను విలక్షణముగ నుండును. అట్టి రసమును షాడబ మందురు. అది ముఖ్యముగా బహుతరములగు రసన యోగ్యములయిన పదార్థముల నిర్మింతురు. అట్లె నానా విధములగు విభావాదులచే స్థాయిభావములు ప్రత్యక్షకల్పములై లోకస్థితికన్న స్థాయిగానుండు స్థాయిభావములు రస్యమానతయె యేకజీవనముగా రసత్వము పొందునవి యగును. ఈ నిరూపణమున నిది చెప్పినట్లయినది. పాకప్రధానముగా లోకమున జలము రసాభివ్యంజకముగ నున్నది. కావున వ్యంజనము విభావస్థానీయము. చించ హరిద్ర మొదలగునవి యనుభావ ప్రాయములు.

గుడాది ద్రవ్యములు వాని చుక్రాదికమును రస విలక్షణమయిన మధు రాది యోగమున వ్యభిచారి కల్పముగా నుండును. ఈ గుడాదికము స్వరూప లాభమున రసోపజీవన మిచ్చును. స్వరసము నితరమున సంక్రమింప జేయును. ఇట్లు వైచిత్ర్య మాధానించును. వాని మిశ్రణా సమయమున గలుగు రసవిశేషము స్థాయిభావ కల్పము. అది విభావ కల్పమయిన వ్యంజన జనితమని భావింప వలెను. ఇది లౌకిక మయిన రసము. కుశలురగువారు నిర్వర్తింతురు. రసవిదులగు రస ప్రియులకిది రసనీయ మగును. ఇచట అన్నమన్న పద మధ్యాహ రించు కొనుట యుక్తము కాదు. దార్ష్టాంతిక సూత్రములో స్థాయి గ్రహణము శల్యకల్పమని విభావాది త్రయమె యుపాత్త మయినది. అట్లె దృష్టాంతమున గూడ త్రయోపాదానమె యుక్తము.

## లక్షణ పద పరీక్ష

సూత్ర వ్యాఖ్యాన మయినది. ఇక లక్షణ పదము పరీక్షింప వలెను. దాని కిది యొక సమీక్ష.

౨౩౬. "రస ఇతి కః పదార్థః? ఉచ్యతే— అస్వాద్యత్వాత్
కథ మాస్వాద్యతే రసః? యథాహి;
నానావ్యంజన సంస్కృతమన్నం భుంజానా రసాన్
అస్వాదయంతి సుమనసః పురుషాః హర్షాదీంశ్చ
అధిగచ్ఛంతి— తథా,
నానా భావాభినయ వ్యంజితాన్ వాగంగ సత్త్వోపేతాన్
స్థాయిభావా నాస్వాదయంతి సుమనసః ప్రేక్షకాః
హర్షాదీంశ్చాధిగచ్ఛంతి తస్మా న్నాట్యరసాః—"

రసమనగానేమి? మధురాదులు రసములని లోకమున ప్రసిద్ధి యున్నది. పారదము రసమందురు. సారాంశము రసము. జల సంస్కా రము రసము. అభినివేశ మొక రసము. వండినది రసము. దేహధాతు నిర్యాసము రసము. రస పద మీయర్థములలో ప్రసిద్ధము. ఇతరములందు రస ప్రసిద్ధిలేదు. రసపదమును శృంగారాదులందు ప్రవర్తింప జేసితిరి కదా! దాని యర్థమేమి? ఆ రసపద ప్రవృత్తి నిమిత్తమేమి? అభి ధేయ నియమమునకు దాని నిర్వచనము చేయవలయును. ఆ పద ప్రయోక్తలు తమ భావము విశదము చేయవలసి యున్నది. ఇంత

వరకిది ప్రశ్నార్థము. "ఆస్వాద్యత్వాత్" అనునది యుత్తరము. ఆస్వాదింప బడుటను రసము రసమగునని యుత్తర వచనము. ఆస్వాద్యత్వాత్ అనునది హేత్వర్థమున పంచమి విభక్తి. ఇది యుత్తరమిచ్చినది. రసపదమిట ప్రవర్తింప జేయుటలో నాస్వాద్య మానతయె నిమిత్తము. ఇది కుదురునా? ఆస్వాదన మనునది రసనేంద్రియ జన్యమగు జ్ఞానమని ప్రసిద్ధము కదా! అవును. కాని యుపచరిత క్రియాశ్రయమున దీని సరిపెట్టు కొనవలయును. నానా వ్యంజన సంస్కృతమయిన యన్నము భుజించువారు రసముల నాస్వాదింతురు. ఆ శోభన మనస్కులగు పురుషులు హర్షాదుల గూడ పొందుదురు. అట్లె ప్రకృతమును నానాభినయములచే వ్యంజితములయిన వాగంగ సత్వసముపేతములగు స్థాయిభావములను సచేతసులగు ప్రేక్షకు లాస్వాదింతురు. కావుననె యివి నాట్యరసములు. ఇందు ప్రదర్శించిన దృష్టాంత దార్ష్టాంతికములలో భోక్తృ సామ్యమున్నది. ఇదిగో భావింపుడు! వ్యంజన సంస్కృతాన్న మాహారించు భోక్త తదాస్వాదనమునన యేకాగ్ర మనస్కుడై యాస్వాదయిత యగును. అన్య చిత్తుడై భుజించు నాతడు ఆస్వాదాభిమానము కలవాడు కానే కాజాలడు. భోక్త యాస్వాదైక చిత్తుడై యాస్వాదింపవలెను. అప్పుడాతని ఫలము ప్రహర్షము. ఆప్యాయము. జీవనపుష్టి. బల మారోగ్యము. ఇట్లాస్వాద ఫలముండుట భావనీయము. అట్లె యభినయ వ్యంజితమయిన స్థాయి శబ్దమున వ్యపదేశింపబడు రసమున నచింత్యమయిన యాస్వాద్యత యున్నది. సామాజికు డేకాగ్రుడుకాగా తన్మయీభావము పొందిన వాడు కాగా సమర్థమయిన యాస్వాదయితృత సిద్ధ మగుచున్నది. హర్ష ప్రధానములయిన ధర్మాది వ్యుత్పత్తులు వైదగ్ధ్యము మొదలగునవి యాస్వాద ఫలము లగుచున్నవి. ఇట్లు కర్మ కర్తృ ఫల సాదృశ్యమున్నది. కావుననె విభావాది జన్యమయిన ప్రతీతి విశేషము రసనాక్రియ యని వ్యపదేశము పొందినది. "సుమనసు లన్నము భుజించుచు హర్షాదుల పొందుదురు. రసముల నాస్వాదింతురు." అని చెప్పుటచే నన్యభోక్తృ విలక్షణముగా వారుందురని స్పష్టమయినది. అట్లె ప్రేక్షకులు స్థాయిభావముల నాస్వాదింతురనుట సాదృశ్యము ననుసరించిన కథనము. "సామాజికులు హర్షాదులు పొందుదురనుట శోకాదులును

సంగృహీతములె. కాని శోకకథనము యుక్తముకాదు. నాట్యము సామాజికులకు హార్దైకఫలమె కాని శోకాది ఫలముకాదు.” అనియు కొందరి భావము. ఈ చెప్పిన సమగ్రార్థమిట్లు శ్లోకీకృత మయినది.

### నా ట్య ర స ము

౨౩౭. యథా బహుద్రవ్యయుతై ర్వ్యంజనై ర్బహుభిర్యుతం
ఆస్వాదయంతి భుంజానా భక్తం భక్తవిదో జనాః
౨౩౮. భావాభినయ సంబద్ధాన్ స్థాయిభావాం స్తథా బుధాః
ఆస్వాదయంతి మనసా తస్మా న్నాట్య రసాః స్మృతాః.

ఈ రెండు ననువంశ్యము లయిన శ్లోకములు. శిష్యాచార్య పరంపరలో నివి ప్రసిద్ధములు. సూత్రార్థమును సంక్షేపముగా ప్రకటించు వీనిని కారిక లనవచ్చును. మధురాది భేదమున వివిధములగు గుడాది ద్రవ్యముల గూడి దధి కాంజికాది సంబంధమున బహువిధములగు వ్యంజనముల సంయుత మయిన యన్నమును అన్న రసజ్ఞులయిన జనులు భుజించుచు నాస్వాదింతురు. అట్లె బుధులు భావాభినయ సంబద్ధములయిన స్థాయిభావముల నాత్మ సమావేశమున నాస్వాదింతురు. కావున నివి నాట్యరసములని ప్రఖ్యాతము లయినవి. ఇది సామాన్య రూపమయిన కారికార్థము. విభావ భేదము రసభేదమున హేతువు. అన్నాస్వాదమున గలుగు నాస్వాదములోగూడ బహుద్రవ్య సమ్మిశ్రన విశేషమున భేద భానముండును. రసనా వ్యాపారమునకన్న నాస్వాదనము భిన్నము. రసనా వ్యాపారము కేవలము భోజన క్రియ. మానస వ్యాపార మాస్వాదనము, తదధికము. ఆస్వాదనము రసనా వ్యాపార మొకటి కాదు. ఆస్వాదనము మానస మయిన యవికల వ్యాపారము. కేవలము లోకమున రసనా వ్యాపారానంతరమున నాస్వాద మున్నది. అది యిచట ఔపచారికము. ఈ నాట్య ప్రక్రియలో విభావ వ్యభిచారి భావము లన్నియు శుద్ధ సత్వ రూపములు జ్ఞాన స్వభావములుగా నుండును. అభినయము లను భావములు. అనుభావ రూపములయిన యభినయములను వేరుగా నిర్దేశించుట వాని ప్రాధాన్య పురస్కృతము. భావాభినయములచే సంబద్ధము లనుటలోని భావమిట్లు పరిగ్రాహ్యము. భావ సంభావన మొనరించు

భావకులు హృదయ సంవాద క్రమమున తన్మయీ భావము పొంది ప్రమాతృ భూమినుందురు. అప్పు డచట ప్రతిష్ఠితము లయిన స్థాయి భావము లచింత్య స్వరూపములు. అవి యంతట సాధారణీ కృతము లగును. నిర్విఘ్న ప్రతిపత్తి వశమున నింద్రియాంతర విఘ్న సంభావన మేమాత్రము లేని శుద్ధ సత్వ స్వభావ మయిన మనసుచే నవి యాస్వాద్య మానము లగును. అట్టి మానసాస్వాదన సమయములో స్వ పర వివేక శూన్య మయిన స్వాద చమత్కార ముదయించును. ఆ చమత్కార పారవశ్యమున హృద్యతాతిశయము సంవిచ్చర్వణము కలుగును. ఈ సమయము నందలి యీ సంవేదనము లోక ప్రత్యయముకన్న యోగి ప్రత్యయముకన్న విసదృశము. లౌకిక ప్రత్యయములో నానా విధములగు విఘ్నముల బాహుల్య ముండును. ఇందు విఘ్న ముండదు. యోగి ప్రత్యయమున విషయాస్వాద మేమియు నుండదు. విషయా స్వాదశూన్యత్వమున యోగి ప్రత్యయము పరుషము. ఈ రెండిటికన్న నీ నాట్యరస సంవేదనము విలక్షణాకారము. ఇందు సుఖ దుఃఖాది విచిత్ర వాసనా సంస్కారము లేవికాని హృద్యతాతిశయమునె యాధానించునవి కాగలవు. వాని యను వేధ మట్టిదిగనె యుండును. బుధు లీదృశమగు సంవిచ్చర్వణమున భావాస్వాద మొనరింతురని నాట్య రహస్యము. లౌకికములయిన ప్రత్యయాదు లీసమయమున నెందుకు కొఱగావు. అవి కేవలము పూర్వోపయోగులు. ఇది యిచటి నాట్య రసాస్వాద ప్రక్రియ.

నాట్య రసమనుటలో భావమిది. సముదాయ రూపమగు నాట్యమున రసము లిట్లుండు నని. నాట్యమె రసమని. రససముదాయమె నాట్యము. రసములు నాట్యమునందె కాదు. కావ్యమున గూడ రసములున్నవి. రసము నాట్యాయ మాన మగును. కావ్యార్థ విషయమున ప్రత్యక్ష కల్పముగా సంవేదన ముదయింపగా రసోదయ మగునని యభినవుల యుపాధ్యాయులనిరి. వారు కావ్య కౌతుకము నందిట్లు నిరూపించిరి. "ప్రయోగత్వ మనాపన్నే కావ్యే నాస్వాద సంభవః" ప్రయోగమున రూపము పొందని కావ్యమున నాస్వాదము సంభవింపదు– అని. కాని కావ్యమున భావార్థము లన్నియు స్ఫుట

ముగా ప్రత్యక్షములై యవభాసింప గలవు. వర్ణనా చమత్కారములచే వైశద్యములచే ప్రౌఢ పరీపాకములచే నుద్యానములు కాని కాంతలు కాని చంద్ర చందనాదులు గాని సమ్యక్ అర్పితము లగును. వాని సంభావనాతిశయమున సామాజికులు వాని ప్రత్యక్షాను భూతి నందికొందురు. ఇది కావ్యకౌతుకాభిసంధి. కావ్యమున గూడ రసచర్వణ మున్నదని కొందరి భావము. కావ్యమున గుణాలంకార ముల వలన గల్గు సౌందర్యాతిశయము రసమాస్వాదింప జేయు నందురు.

శ్రీమదభినవు లిట్లనుచున్నారు. "వయంతు బ్రూమః" కావ్యము దశరూపకాత్మకమె. అందు భాష, వృత్తి, కాకువు, నైపథ్యము మొదలగునవి సముచిత గుంభనము కల్వై రసవత్తనాపాదింప గలవు. సర్గబంధాత్మక మయిన కావ్యములో స్త్రీలును సంస్కృతోక్తులు కలవారుగ నుండుట శక్తిరహితుని కావ్యక్రియ యసి యన రాదు. సర్గ బంధౌచిత్యము ననుసరించి యిది స్వమాత్రమున హృద్యమని న్యాయ్యభావనము చేయవచ్చును. అప్పుడనౌచిత్య మేమాత్ర మవభాసింపదు. సందర్భ సముచితము లయిన దశరూపకముల సంధి సంధ్యాది సంఘటనమును సర్గబంధానుగతముగ సంధానించినపుడు దశరూపార్థమయిన నాట్య ముల్లసిల్లును. అది నాట్యతనువు. హృదయ సంవాదము నందలి తారతమ్యము ననుసరించి శ్రోతృ ప్రతిపత్తృ స్ఫురణ ముండును. ఆ స్ఫురణము స్ఫుటము కావచ్చును. అస్ఫుటము కావచ్చును. ఇట్లది యతి విచిత్రముగ నుండును. సహృదయులు కొందరు స్వభావముననె నిర్మల ముకుర హృదయు లగుదురు. వారెన్నడును సంసారోచితము లయిన క్రోధ మోహాభిలాషాదులకు పరవశము లయిన మనసులు కలవారు కాజాలరు. వారల కట్టి దశరూపకాకర్ణన సమయమున గూడ నాట్య లక్షణమయిన రస సంచయము స్ఫుటముగనె యవభాసించును. సాధారణీకృతమయిన రస నాత్మకమయిన చర్వణ వారిసొత్తు. ఆ చర్వణమున రస సంచయమును వారు సాక్షాత్కరించు కొందురు. ఇట్లు కాజాలని వారు ప్రత్యక్షోచిత మయిన యట్టి చర్వణా లాభమునకై నటాది ప్రక్రియ నభిలషింతురు.

వారి వారి క్రోధ శోకాది సంకటమగు హృదయ గ్రంథి భంజనమునకై ముని గీతాది ప్రక్రియ నిర్మించినాడు. "సర్వానుగ్రాహకం శాస్త్రం" అని కదా! న్యాయము. రసములు నాట్యముననె కాని లోకమున లేవన్నది నిశ్చితార్థము. కావ్యమును నాట్యమె. కావ్యమున రస మున్నది. ఆస్వాద మున్నది. కావుననె నటునందు రసము లేదు. "కుత్ర తత్ర్వి?" "విస్మృతిశీలోన బోధ్యతే" రస మెచ్చట నున్నది? మరచి పోవువాని నెట్లు బోధింతుము! రసము దేశ- కాల- ప్రమాతృ- భేదా నియంత్రితమని చెప్పనే చెప్పితిమి. ఇక రసాశ్రయ విషయమున నాశంక యేల?

అయిననటునం దాస్వాదనోపాయమేది? యని యడుగుడు. అవును. నటున కాస్వాదనోపాయ మేమున్నది? ఆతడు కేవలము పాత్రము మాత్రము. పాయసాస్వాదము పాత్రమున కెట్లుండును? పాత్రము పాయసాస్వాదన కుపాయమగును. నటునకు రసభావ యోగము లేదు. ఉన్నచో మరణాదులలో తత్త్వావేశ ముండు నన వలయును. లయాది భంగమును గలుగును. నటునందు రస భావ యోగ మున్నదని తలచుట భ్రమ. రసభావములు వాసనా వేశ నశ మున నటునందుండునని యనుసంధి బలమున నాతడు లయా ద్యను రణ మొనర్చునని కొందరందురు. నటుని యభినివేశ మట్లని పించును. ఆతడు పాత్రలీనుడయి సామాజికులకు తాదాత్మ్యాభిమాన ముత్పాదించును. ఇట్లు నటోపయోగము భావించుట సముచితము. ప్రతిశీర్షము మకుటము చిత్రపుస్తాదికము సర్వము నాట్యములోని యర్థ భాగాభిష్యందము. సర్గ బంధాదికము శబ్దభాగాభిష్యందము. ఈ యంశము హృదయ సంవాది యర్థమును వితతము చేయుటలో స్పష్టము కాగలదు. కొందరిట్లు భావింతురు. అభినయాది సామాగ్రీ మయముగా బహి ర్దృశ్యమానమగు నాట్యము నట ధర్మ కర్మ రూప మని యాశయ పడి నాట్యమువలన రసములు కలుగునని యందురు. నాట్యమె రసమని నిరుక్తమయిన యర్థమె సుశ్లిష్టము. ఇవి నాట్య రసములు స్మృతములని యనుట సంప్రదాయావిచ్ఛేదము సూచిం చును. + + + రసము రత్యాద్యనుకరణ రూపమని యనువారు

భావించునది యొకటి కలదు. శోకము సుఖహేతు వెట్లగునని వారు చోదనము చేయుదురు. నాట్యగతముల కొక విశేషము కలదని పరిహారమును పలుకుదురు. వారిచోద్యము హృదయ గ్రాహి కాదు. ప్రతీయమాన శోకము ప్రత్యేతయగు వాని స్వాత్మలో దుఃఖమాధానించునని నియమమా? శత్రు దుఃఖమున ప్రహర్షమె కలుగును. అన్య దుఃఖమున మధ్యస్థతయె కలుగును. భావపర్యంత మవి వస్తుస్వభావ మాత్రముననె యుండుట శోక తంత్ర మయినందున పై మత మమతము. మా మతమిది· సంవేదనమె యానంద ఘన మాస్వాద్య మగును. సంవేదనము నందు దుఃఖాశంక లేశ మాత్రమేని లేదు. ఆ సంవేదన చిత్రతా కరణమున నెన్నియో సహకరించును. రతి శోకాది వాసనా వ్యాపార మంతయు సంవేదనము చిత్రీకరించును. అభినయాది వ్యాపారము సంవి దుద్బోధనమున రతిశోకా దుల్లాసమున సమర్థము. ఇది రసతత్త్వము. దీని సంశోధనమె యిటుపై జరుగును. చోద్యముఖమున శోధనము సముచితమని ముని సంభావనము. చోద్యమిందు త్రివిధము.

## ర స సం శో ధ న ము

౧. రసములనుండి భావములు నిష్పన్నము లగును.
౨. భావముల వలన రసములు నిష్పన్నము లగును.
3. పరస్పర సంబంధమున రస భావములు నిష్పన్నము లగును.
వీనినె ప్రకారాంతరమున ప్రశ్న త్రయముగా భావింప దగును.
౧. రసముల వలన భావము లుదయించునా?
౨. ఇందు విపర్యయమె యభిమతమా?
3. అన్యోన్య జనకతయె సమ్మతమా?

ఈ మూడు పక్షముల సమీక్షానంతరము తత్త దభిప్రాయ వైచిత్ర్యమున మూడు పక్షములు నెట్లో యంగీకృతము లగును.

౨౩౯. "అత్రాహ —కిం రసేభ్యో భావానా మభినిర్వృత్తిః?
ఉతాహో! భావేభ్యో రసానామితి?
ఉచ్యతే; కేషాంచిన్మతం, పరస్పర సంబంధా దేషామభినిష్పత్తి రితి
తన్న. కస్మాత్? దృశ్యతేహి; భావేభ్యో రసానా మభినిర్వృత్తిః
నతు రసేభ్యో భావానా మభినిర్వృత్తి రితి —"

ఇందు పక్షత్రయ మున్నది. ఆద్య ద్వయము కాదని మూడ
వది స్థాపించుట యిందు గోచరించును. దీని భావ మిది. నర్తకుడు
రసచిత్తుడై ప్రయోగ మారంభించును. భావములు ప్రకటించును.
అట్లు సామాజికులు గుర్తింతురు. కరుణము వలన శోకము కలుగుట
యున్నది. కరుణ రసము శోక భావ ముత్పాదించినట్లె కదా! ఇక నా
శోకమున విభావాద్యుపచిత స్వభావుడయిన వానిలో కరుణ ముప్పతిల్లు
చున్నది. కాన రసమున భావమా? భావమున రసమా? యను సందే
హము కలుగును. కావుననె కాలభేదమున పరస్పరము జన్మ యున్న
దని తృతీయ పక్ష ముత్థిత మగును. ఈ పక్షత్రయోదయములో
వేరొక నిదానము నూహ్యము కా గలదు. నటునందే యపూర్వ
భావమున్నది. రామునందే యది యున్నది. ఆ భావమున నుపచయ
మున్న రసము. కాకున్న భావము. ఈ విధానము యుక్తముగ లేదు.
రస స్వరూప మీ విధమున నుండుట యంగీకృతము కాదు. ఈ చెప్పు
నదియు సంగతము కాదు. అనుకార్యులయిన రామాదులందు
భావము గోచరించును. అనుకర్త రసము సంభావించును. ఇట్టిదిది
లోకప్రకృతి. ఇది నాట్యాచార్యున కభీష్ట మయిన శిక్షారీతి. ఈ రీతి
భావనమున రామనటులందున్న విధానమును సామాజికుడు సంభావిం
చును. అని రసభావములు పరస్పరము జన్మకలవి యగుటయు సంగత
మగునని శ్రీ శంకుకు డనెను. ఇది యుక్తము కాదు. సామాజికు
డనుకార్యానుకర్త్రు విభాగ మేమాత్రము భావింపడు. ఆతని ప్రత్య
యమె వేరు. అది లోకాతిక్రాంతము. రస విషయమున ననుకరణ
వాదము పూర్వమె దూషిత మయినది. కావున నిచటి పక్షత్రయ
మును మొదట మేము నిరూపించిన విధముననె పరిగ్రాహ్యము. రస
ముల వలన భావములు కలుగునా? భావముల వలననె రసములు కలు
గునా? ఆహో! అన్యోన్య జనకత సమ్మతమా? ఈ మూడు పక్ష
ములె యభ్యుపగతములు. విభావాదుల వలన రసనిష్పత్తి యని
భరత సూత్రమున నున్నది. కావుననె ద్వితీయ పక్ష ముత్థానము
పొందినది. లోకమున విభావానుభావము లనునవి యేవియు లేవు
గదా! లోకమున నవి హేతు కార్యావస్థామాత్రముననె యుండును
కదా! విభావాదుల వలన రసనిష్పత్తి నేల యంగీకరించిరి? హేతు

కార్యావస్థా మాత్రములుగ నుండునవియె రసనోపయోగులై విభా వాది రూపమున పరిగణితము లగునని రస ప్రసాదమున విభావాది భావము లుపపన్నములగుట యంగీకరించిన వేరొక యాపత్తి వాటి ల్లును. విభావాది ప్రసాదమున రసమను ప్రాగ్వచనము భావించి రస ప్రసవముగా విభావాది రూపత్వ మంగీకరింప పరస్పరాశ్రయ దోషము కలుగును. ఇతరేత రాశ్రయములు పదార్థ సమర్పకములు సంతర్పక ములు కాజాలవు. ఈ ప్రశ్నోత్తరము కూడ ప్రకృతము భావింపదగి యున్నది. ఇప్పటికిది పక్షత్రయ భావార్థము.

"తన్న" ఇత్యాది గ్రంథము పక్షత్రయ సమాధానాత్మకము. పై చెప్పిన పక్షార్థ ముచితము కాదు. ఏల? భావముల నుండి రసము లభినిర్వృత్తము లగుట లోక గోచర మగుచున్నదే కాని, రసములనుండి భావము లభినిర్వృత్తములగుట గోచరము కాదు. ప్రతీతి పథమున భాసించు ప్రమదాదులు రసాస్వాద మాపాదించుట యిదివరలో నిరూపితము. కావున రసముల వలన భావములు కలుగు ననరాదు. భావ శబ్దార్థమును పర్యాలోచనము చేసినచో నీ యర్థమె విశదము కాగలదు. ఈ విషయమున నీ శ్లోకము చిర ప్రసిద్ధముగా నున్నది.

భా వ రీ తి

౨౪౦. నానాభినయ సంబద్ధా న్భావయంతి రసానిమాన్
యస్మా త్తస్మా దమీభావాః విజ్ఞేయా నాట్యయోక్తృభిః

సహృదయ హృదయంగతము లయిన యీ రసములను నానా భినయములతో సమ్యక్ సుబద్ధములగు వానిని సంపాదించి పెట్టును కావున భావము భావ మగును. నాట్య యోగులిట్లు తెలియ వలెను.

౨౪౧. నానాద్రవ్యైః బహువిధైః వ్యంజనం భావ్యతే యథా
ఏవం భావా భావయంతి రసా నభినయై స్సహ

కేవలము భావ శబ్దమె ప్రవృత్తి నిమిత్త మనుట కాదు. అంతమాత్రమె యయిన నేమియు చెప్పినట్లు కాదు. ఇట్లు ప్రకృత మున యోజనము చేసికొన వలయును. బహు విధములగు నానా ద్రవ్యములచే వ్యంజనము భావిత మగును. "వ్యజ్యతే ఇతి వ్యంజనం" అనుపానాదిక మిచట వ్యంజనము. రసమిచట వ్యంజన మనుట సమ్మ

తము. అట్లే బహువిధాభినయములచే భావములు రసముల భావింప జేయును. కావున రసమెన్నడు భావహీనము కాదు. "న భావ హీనోऽస్తి రసః" రసము భావములనుండి కలుగు ననుపక్షమె సముచితముగ భావనీయము.

ఈ యంశమున చోద్యవాదులు స్వాశయోన్మీలనము చేయవచ్చును. "న భావో రసవర్జితః" భావ మేదేని కాని రసవర్జితముగ నుండనే యుండదు. లోకమున హేతుకార్య వ్యవహారమె కాని విభావాది వ్యవహార మేదియు లేదు. విభావ మనుభావమను భావము లందలి వ్యవహార భావము రస ముఖము. కావున "న భావో రసవర్జితః", చోద్య మిట్లు కలుగగా నికనిది యుత్తర మగును. "పరస్పర కృతా సిద్ధిః తయో రభినయో భవేత్." రస భావముల సిద్ధి పరస్పర కృతము. అభినయ మిట్టిదే యగును. భావమునకు భావత్వము రసాధీన మగును. రసమున రసత్వ నిష్పత్తి భావాధార మగును. సహృదయ సామాజికునకు అభినయమున సాక్షాత్కారము సంపన్నము కాగా హేతు కార్యాదులుగా లోక ప్రసిద్ధము లన్నియు నా సాక్షాత్కారమున నుపయోగించునవై విభావాను భావాది వ్యపదేశము పొందును. కాన పరస్పర కృతమగు సిద్ధి భద్ర భవనముగా సంభావితము కాగలదు. పరస్పరాశ్రయమను దూషణ మిా రూపమున నున్నట్లు గోచరించినది కదా!

౨౪౨. న భావహీనోऽస్తి రసో, న భావో రసవర్జితః<br>
పరస్పర కృతాసిద్ధి స్తయో రభినయో భవేత్

ఇతరేతర సిద్ధి విషయమున నీ దృష్టాంతము చూడుడు!

౨౪౩. వ్యంజనౌషధి సంయోగో యథాన్నం స్వాదుతాం నయేత్<br>
ఏవం భావా రసాశ్చైవ భావయంతి పరస్పరం

వ్యంజనౌషధి సంయోగ మన్నము స్వాదువు చేయునట్లు భావములు రసములు పరస్పరము భావనా భూతములై సిద్ధి కల వగును. వ్యంజన మోషధిని స్వసంబంధమున స్వాదువు రసనీయము చేయును. ఓషధి వ్యంజనమును స్వసంబంధమున స్వాదు వాస్వాద్యము చేయును. దాని స్వాదుత దీని యధీనము. దీని స్వాదుత దాని యధీనము. అట్లే భావ రసము లన్యోన్య భావనము కల వగును. భావములు రసముల

భావింప జేయుట యనగా నిష్పాదింప జేయుట యని భావము. రసములు భావములను భావింప జేయుట యనగా వానిని భావము లనుగా నొనర్చుట భావాది శబ్దములచే వ్యపదేశింప దగిన వానిగా నొనర్చుట యని భావము. "ఏతదుక్తం భవతి" అన్యోన్యాశ్రయ మంతట దోషము కాదు. ఒకచో నొక క్రియలో నన్యోన్యాశ్రయము దోషము. క్రియా భేదమున నది దోషము కాదు. చూడుడు! వ్యంజనాదుల సంబంధ మన్నమున నాస్వాది రసవత్త నాపాదించును. ఆశ్రయ మయిన యన్నము వ్యంజన సుఖయోగ్యత సంధానించును. కేవల మన్నము స్వాదువు కాదు. కేవలము పచ్చడి రుచిరము కాదు. అన్నము పచ్చడి కలిసి స్వాదుత కూర్చును. ఇదియే భావ రస రహస్యము. భావములచే రస్య మానతయు, రసములచే హేత్వాదులకు విభావాది వ్యపదేశ్యతయు సిద్ధ మగుచున్నది. పటోద్దేశమున తంతువులు పటకారణ మనదగి యున్నవి. తంతూద్దేశమున పటము కార్య మగును. వీని యందు పరస్పర సిద్ధి యున్నది. అయిన నది దోషము కాదు. అట్లె ప్రకృతము.

౨౪౪. యథా బీజాద్భవేత్ వృక్షః వృక్షా త్పుష్పం ఫలం యథా
తథా మూలం రసాః సర్వే తేభ్యో భావా వ్యవస్థితాః

బీజమున వృక్షము కలుగును. వృక్షమున పుష్పము ఫలము కలుగును. అట్లె రసము సర్వ మూలము. వాని వలన భావములు వ్యవస్థితము లగుచున్నవను సామాన్యార్థము కల యీ శ్లోకార్థము భావించుట కిది హృది ధార్యము. ఈ చెప్పిన పక్షవాదములలో "భావముల వలన రసముల నిష్పత్తి" యను వాద భావము సమ్మత మయినచో ముని "నహి రసాదృతే కశ్చిదప్యర్థః ప్రవర్తతే" రసము లేక ఏ యర్థమును లేదు." అని యేల యనెను? భావములనె మొదటగా నుద్దేశింప లేదేమి? అని యాశంక కలుగ వచ్చును. అప్పుడీ శ్లోకార్థము సమాధి నిచ్చును. బీజము వృక్షమూలముగా నుండును. అట్లె రసములు మూలములు. ఇట్లని ప్రీతి పూర్వక మయిన వ్యుత్పత్తి యందర కుండును. కావ్య పురస్సరమయిన నట వ్యాపార మంతయు కవిగత సాధారణీ భూత సంవిన్మూలముగా నుండును. కవి యందలి యా సంవిత్ పరమార్థతః రసము. సామాజికుడు భావనా వైశద్య

మున సంవిత్ప్రతీతి వశీకృతు డగును. సంవిద్వశమయిన యాతని యనంతర కాలమున గలుగు నావాపోద్ధార బుద్ధిలో విభావాదులు గోచరించును. కావ్యమున నాట్యమున సామాజిక హృదయమున నిదియే రీతినీతి. కాగా కవిగత మగు రసము మూలముగా గణింప దగిన బీజ స్థానీయము. కవి సామాజిక తుల్యుడె. అందుననె శ్రీ మదానంద వర్ధనుడు "శృంగారీచే త్కవిః కావ్యే జాతం రసమయం జగత్" అనినాడు. కావ్యము వృక్ష స్థానీయము. అభినయాది నట వ్యాపార మంతయు పుష్పాది స్థానీయము. సామాజిక రసాస్వాదము ఫల స్థానీయము. కావున విశ్వము రసమయ మయినది. మూలము రసము విశ్వమంతయు రసమయము. ఇక రసేతర మేది? "నహి రసాదృతే కశ్చిదప్యర్థః ప్రవర్తతే" యనినది యిందులకే. మూలము రసము. రస వివర్త మంతయు రసము. రసము మూలమై యింతటి సృష్టి సర్వస్వ మిచ్చినది. అంతయు రసమయ మయినది. ఇచటి యీ విజ్ఞాన వాదములో సత్కార్య వాదము నేకత్వ దర్శన మంతయు గుర్తించి పెకలింప వచ్చును. కాని ప్రకృత ముపయోగింపని శ్రుతలన సందర్శనము మిథ్యా ప్రయాసము. ఈ ప్రయాస సంశ్రయము మాకు పూర్వశిక్షితము కాదు. అది యట్లుండు గావుత. ఇట కొందరిట్లందురు. భావము బీజము. దాన రసవృక్షము. అది యభినయ కుసుమసుందరము. దాని వలన గలుగు భావ ఫలమును భావుకులు భుజింతురు. అని. ఇది యంతయు ప్రకృత విరుద్ధ వ్యాఖ్య. ఇట్లయిన భావమె యుపక్రమ పర్యవసానములం దుండవలెను. అట్లు లేదు. ముని పలుక లేదు. పూర్వము చెప్పినట్లుగా మూడు పక్షము లభిప్రాయ వైచిత్ర్యమున నభ్యుపగతము లయినట్లు భాసించును.

౧. భావముల వలన రసములు గలుగు ననుట విభావాది సంయోగమున రసనిష్పత్తి యని భరతుడనుటచే సామాజిక హృదయంగతము లయిన రసములు విభావాది సంపత్తి సౌభాగ్యమున రసనీయములై రసము లగుచుండుటయను మొదటి పక్షము సంగతము కావచ్చును.

౨. రసముల వలన భావములు గలుగు ననుట. లోకమున

హేతువులుగా కార్యములుగా నుండునవి యలౌకిక కావ్య శరీర గర్భ ప్రవేశమున భావ్యమాన స్వభావములై విభావానుభావాది వ్యపదేశము పొందు చున్నవి. రస మన్నది యున్నందుననె విభావనాదిక ముపపన్నము. కాన రస పూర్వకము భావమనుటయు సంగత మగును.

3. పరస్పర సిద్ధి యనుట. వ్యంజన మన్నము నన్నము వ్యంజనము నాస్వాద్యము చేయునట్లు రసభావ సిద్ధి యున్నది. రసముండుటచే భావములకు భావ్యమానత కలిగినది. విభావాదుల వలననె రసములకు రస్యమానత కలిగినది. రసము భావాధీనము. భావము రసాధీనము. ఇట్లీ రసభావములు పరస్పర సిద్ధికములు. అయిన నితరేతరాశ్రయ మిచట దోషము కాదు. ఇతరేతరాశ్రయ మేక క్రియలో దోష మగును. ఇచటివి విభిన్న క్రియలు. ఇట్లు పరస్పర సిద్ధి సుసంగతము కాగలదు.

## ఉత్పత్తి వర్ణ దైవతములు

ఇట్లిప్పటి కుద్దిష్ట విభక్త రసములకు పరీక్షా పరిశుద్ధ మయిన సామాన్య లక్షణము నిరూపిత మయినది. విశేష లక్షణ మిక చెప్ప వలయును. రసముల కుత్పత్తి, వర్ణ, దైవత, నిదర్శనము లున్నవి. వాని నిక వ్యాఖ్యానింప వలెను. సామాన్య లక్షణము చెప్పిన పిమ్మట విశేష లక్షణ కథన మావశ్యకము. ఉత్పత్తి వర్ణ దైవతాదులు విశేష లక్షణాంశ పూరకములు. ఇం దుత్పత్తి యనునది యుత్పాదకముల కుత్పాద్యములకు విశేష లక్షణముగా నుండి వేరు బాటు సూచించును. ఉత్పాదకములలో నుత్పాదకత్వ మనునది యుత్పాద కాంతరములకన్న విలక్షణముగా నుండుట. ఉత్పాద్యము లందలి యుత్పాద్యతయు నుత్పాదకముల వలన గలిగిన విశేషము సూచించును. ** శ్వేతాది వర్ణములు వర్ణములు. వర్ణ దేవతల నిరూపణ మాగమానువిద్ధత్వము సూచించును. ఉత్పత్త్యాదులు నిశ్చయ దర్శనములో నుపాయములుగా నుండును. విభావాదుల యోగమున నిందు వైలక్షణ్య ముదయించుట నిదర్శిత మయినది.

## సూచకరసములు

ఆ రసముల యుత్పత్తిలో హేతువులగు సూచకములు నాలుగు రసము లున్నవి. శృంగారము రౌద్రము వీరము బీభత్సము నని. రసములకు సంబంధించిన యుత్పాద్యోత్పాదక ప్రకార మెంత యున్న నది యీ చతుష్టయముననె సంభవించునని నిశ్చిత మగు చున్నది.

౨౪౫. శృంగారాద్ధి భవేద్ధాస్యో రౌద్రాత్తు కరుణోరసః
వీరాచ్చైవాద్భుతోత్పత్తి ర్బీభత్సాచ్చ భయానకః

౨౪౬. శృంగారానుకృతిర్యాతు సహాస్య ఇతి సంజ్ఞితః
రౌద్రస్యాపితు యత్కర్మ సజ్ఞేయః కరుణోరసః

౨౪౭. వీరస్యాపిచ యత్కర్మ సోఽద్భుతః పరికీర్తితః
బీభత్సదర్శనం యచ్చ భవేత్తుతు భయానకః

శృంగారమున హాస్యము కలుగును. రౌద్రమున కరుణ ముద యించును. వీరమున నద్భుత ముత్పన్న మగును. బీభత్సమున భయానకము జనించును. శృంగారానుకరణమునకు హాస్యమని సంజ్ఞ. రౌద్రకర్మ కరుణము. వీరకర్మ యద్భుతము. బీభత్స దర్శ నము భయానక మయినది. ఇందు వివృతి నిట్లు గ్రహింప వలెను. శృంగారము రెండు విధముల హేతు వగును. తదాభాస రూపముగ తదనుకార రూపముగ నది హేతు వగును. శృంగారాభాసమున శృంగారము హేతువగుట కలదు కదా! విభావాభాసమున ననుభావా భాసమున వ్యభిచార్యాభాసమున రత్యాభ్యాసము ప్రతీతము కాగా చర్వణాభాస సారముగా శృంగారాభాసము నిష్పన్న మగుచున్నది. శృంగారాభాసము నందుండు రతి కామనాభిలాష మాత్రముగ నుండును కావున నది వ్యభిచారి భావమాత్రమె కాని స్థాయిభావము కాదు. అది స్థాయికల్పముగ భాసించును. తద్వశమున విభావాదు లాభాసరూపము పొందు చున్నవి. రతి యిట్టిపట్టుల స్థాయ్యాభాస మాత్రమె. సీతను కామించు రావణుని హృదయము "సీత నన్నపే క్షించు చున్నది" అను భావమును స్పృశింపదు. "నేనామెకు శత్రు వును. నన్నామె యుపేక్షించినది" అనెడు భావము నాతని హృద

యను స్పృశించిన రావణాభిమానమె విలీన మగును. "సీత నాయం దనురక్త" అను నిశ్చయ భావ మాతని కుండుటయు ప్రకృతమున నుపయోగము కూర్పదు. కామజ మోహ సారములో నిది యపేక్షి తము కాదు. ఇది యంతయు రంగము చూచి రజతమని భావించుట వంటిది. "శుక్తౌ రూప్యాభాసవత్" రావణు డొకప్పు డిట్లు భావింప వచ్చును. "సీత యను నామ మాకర్షకము. మోహ మంత్రము. విన్నంతనె మనసు సీత లేక క్షణమేని సహింపదు. కామాతురుడ నయిన నాకు సీతా ప్రాప్తి సుఖ మెప్పుడు కలుగునో తెలియదు కదా!" ఈ రావణ వాక్యమున నింతలో రత్యాభాసము నిశ్చయింప వలెను. హాసము స్ఫురించు నన నక్కఱ లేదు. సీత విభావ మనుట రావణుని వయసునకు ప్రకృతికిని విరుద్ధము. చింతా దైన్య మోహాది వ్యభిచారి గణము అశ్రుజాత పరిదేవితా ద్యనుభావ జాతము ననుచి తమై యాభాస రూపము పొందు చున్నది. ఇట్లాభాస రూపమై హాస్యమునకు విభావము కావచ్చును. ఇట్లాభాస ప్రకారము శృంగా రమున నుండుట సూచిత మయినది. ఇట్లే కరుణాది రసముల యాభా సము లందన్నిట హాస్య ముండుట గుర్తింప వలెను. హాస్య విభావ ముగా నుండునది యనౌచిత్య ప్రవృత్తి కృతముగా నుండును. అనౌ చిత్య మేకమాత్ర రస నియతము కాదు. అన్ని రసముల విభావాను భావాదులలో ననౌచిత్య ముండును. వ్యభిచారి భావములందు ననౌ చిత్య వార్త నిట్లే సంభావింప వలెను. కావుననె సంవిత్తత్త్వ నిష్ణు ణులగు చిరంతనులు రసభావ తదాభాస వ్యవహార మంతట ప్రదర్శిం చిరి. మోక్ష హేతువగునది యయినను ఆభాస రూపమయినచో శాంతాభాస గణనము చేయవలెను. బంధువు కానివాని మరణమున శోకమును నిరూపించిన కరుణము హాస్య రూపమగును. ఇదే విధ మున రసము లందంతట నూహ చేసి యాభాస స్వభావము గుర్తింప వలెనని ముని భావము.

ఒకరసము యొక్క ఫలానంతరము ద్వితీయ రస మవశ్యంభావి యగుచున్నది. రౌద్రము చూడుడు. రౌద్రమునకు వధ బంధాదికము ఫలము. వధ బంధాదికము విభావముగా కరుణ మవశ్యము సంభ

వించును. నియమముగా భయానకము కలుగును. శృంగారానంతరము నియమముగా కరుణము వ్యాపించుట తాపస వత్సరాజాది నాటకములందు విశదముగ నున్నది. ఇట్టి పట్టులందలి శోకము బాంధవ్య కృతమని భావించుట సముచితము కాదు. బాంధవ్యము వలన శోకము కలుగునన్న నియమము లేదు. శృంగార ప్రాణములయిన పదముల ప్రయోగించి కవులు కరుణ ప్రలాపములలో సంతత శృంగారమె జీవితముగా నుండుట స్పష్టము చేసినారు. కుమార సంభవములోని రతిప్రలాపములలో శృంగారమె కరుణ జీవితమని స్పష్టము. ఏవం. వీరమున భయానక ముత్పన్న మగును. రసము రసాంతరమును ఫలముగ జేసి ప్రవర్తించుట కలదు. ఈ వీరమె యుదాహరణము. మహాపురుషుల యుత్సాహము జగద్విస్మయ ఫలము ననుసంధించు కొనును. రౌద్ర మట్లుకాదు. అది పర వినాశనమునె ఫలముగ చేసికొని ప్రవర్తించును. కాని కరుణమును ఫలము చేసికొను ననరాదు. విదూషక హాసము సర్వ సామాన్యముగ నాయికా హాసమును ఫలముగ భావించునది యగును. రసము రసాంతరము నాక్షేపించు (వ్యక్తముచేయు) ననుటలో శృంగార ముదాహరణము. శృంగారానుకృతి హాస్యమని ప్రకీర్తితము. హాస్య మేవం విభావక మన్నమాట. పరస్పర ఫలముగా రసాంతరాక్షేప ముండుననుటలో రౌద్ర ముదాహరణము. రౌద్రమున వధ బంధాదికము ఫలాత్మకమయిన కర్మ. ఆ కర్మ వలన కరుణ మున్నది. ఈ రౌద్ర కరుణముల మధ్యలో నత్యంతము వ్యవహితమయిన పరంపర పరాకృతము. వీరఫల మద్భుతమని యనుటచే సమనంతర ఫలముగ రసాంతరాక్షేప ముండుటలో నుదాహరణము చెప్పినట్లయినది. వీరమునకు సమ్యక్ నికట ఫల మద్భుతము. శృంగారమును వీరమున కనంతర ఫలమగును. సహభావమున రసాంతరాక్షేపముండుటలో బీభత్స ముదాహరణము. బీభత్సమునకు సంబంధించిన విభావాది దర్శనమున భయానక మావిర్భవించును. బీభత్స దర్శనము భయానక విభావ మగును. ఈ యుత్పత్తి హేతువులగునవి యన్నియు యథానుకూలముగ పురుషార్థ చతుష్కమున వ్యాపించునవి కాగలవు. త దనుకూల మయిన సౌందర్యాతిశయ ముత్పాదింప గలవు. ఉపరంజకములు కాగలవు.

ఇట్లనుగాములుగా నుండునట్లు రూపకములందు నిబంధించుట సముచితము. రసము లివియె యని పూర్వమంటిమి. రసముల కిట్లు వర్ణ దైవతములు భావింపవలెను.

| రసము | వర్ణము | దైవతము |
|---|---|---|
| శృంగారము | శ్యామ | విష్ణు |
| హాస్యము | సిత | ప్రమథ |
| కరుణము | కపోత | యమ |
| రౌద్రము | రక్త | రుద్ర |
| వీరము | గౌర | మహేంద్ర |
| భయానకము | కృష్ణ | కాలదేవ |
| బీభత్సము | నీల | మహాకాల |
| అద్భుతము | పీత | బ్రహ్మ |

ఇట్లు రసముల కుత్పత్తి వర్ణ దైవతములు నిరూపితములు. చిత్త భావాస్పదము లయిన రసములకు వర్ణ దైవతములు నిరూపించుట సాభిప్రాయము. వర్ణాభిధానము పూజాదులలో ధ్యానములో నుపయోగించును. వేషధారణ మొనరించు నటులకు ముఖరాగ యోజనమున నుపయోగించు ననియు నందురు. శాంతమద్భుతము స్వచ్ఛము పీతముగా నుండునని శాంతవాదుల పాఠము. తత్తద్రససిద్ధిలో నాయా దేవతల పూజించుట సముచిత సంప్రదాయమని సూచించుట దేవతా నిరూపణ భావము. విష్ణువు కామ దేవుడు. ప్రమథులు భగవన్మహాదేవుని గణముల వారు. క్రీడా పరాయణులు. రుద్రుడు త్రైలోక్య సంహారకర్త. మహాకాలనాథుడు బీభత్స దైవతము. అతడు తద్విభావమగు కంకాలము ధరించును. శ్మశానము సేవించును. మహేంద్రుడు త్రైలోక్య రాజు. దేవేంద్రుడు. బ్రహ్మ యచింత్యాద్భుత స్రష్ట. ఈ వర్ణ దైవతాత్మక విధాన మంతయు నాగమ సిద్ధముగా నున్నది.

## లక్షణ నిదర్శనములు

విభావానుభావ వ్యభిచారి సంయుక్తము లయిన రసముల కిక లక్షణ నిదర్శనముల వ్యాఖ్యానింతుము. రసములకు స్థాయిభావముల

గూడ నాభాషింతుము ఇంతవఱకు సర్వరస సాధారణముగ సామాన్య లక్షణ స్వరూపముల నుల్లేఖించితిమి. రసతత్వ వివేచనమున కంత మాత్రము చాలదు విశేష లక్షణము నిరూపింప వలెను. విశేషలక్షణము సజాతీయముల నుండి భేదము సూచించును. విజాతీయ వ్యవచ్ఛేదము లేక సజాతీయత కుదురదు. సామాన్య లక్షణము నిరూపించిన యనంతరము విశేష లక్షణము చెప్పవలయును. విశేష రూపములయిన లక్షణములు నిదర్శనములు ప్రత్యేకముగా నిరూపించుట యావశ్యకము. సామాన్య లక్షణమునకు విశేషలక్షణములు నిదర్శనములుగా నుండును. వానియందు సామాన్య లక్షణము నిర్దిష్ట మగును. యోజిత మగును. స్థాయిభావములను వివేచనముతో నిరూపింతు మనుట లోకోత్తర రీతిచే వానియం దాదరము సూచిత మగును.

లోకమున చిత్తవృత్త్యాత్మకము లయిన భావము లున్నవి. అవి యొకప్పుడు స్థాయిభావము లగును. అవి బహు ప్రకారములగు వ్యవసాయముల నిరూపించును. నానా నిబంధనముల నిర్దేశించును. కర్తవ్య ప్రబంధము ప్రబోధించును. అట్టినవి విశ్రాంత్యేకాయతనములై రూప ప్రతిష్ఠములై యుండుట నుపదేశ విధమున నన్వేషింతుమని భావము. యథాయోగము విభావముల నాహరించు కవి నటులు వానికి రసత్వమాపాదింతురు. రస రసనమునకు కవుల నవ దృష్టి యొకటి సవ్యాపారమగును. పరినిష్ఠితార్థముల విషయీకరించు కొని యున్మేషము పొందు విపశ్చి ద్దృష్టి మరియొకటున్నది. ఈ దృష్టి ద్వయమున విశ్వ మనిశము నిర్వర్ణన మొనరింప వలయును. నటనోపజీవులగు నటులకు నవదృక్కు రాదు. వారిదది రసముల రసింపదు. రసోపయోగి విభావాద్యౌచిత్య మిప్పుడుపదేశించి స్థాయిభావముల రసీకరింతుమని లక్షణ ఫలము ప్రదర్శితమయిన ట్లగును.

## న వ ర స ము లు

### ౧. శృంగారము.

౨౪౮. సుఖప్రాయేష్ట సంపన్న ఋతుమాల్యాది సేవకః
పురుష ప్రమదా యుక్తః శృంగార ఇతి సంజ్ఞితః

౪౯. ఋతుమాల్యాలంకారైః ప్రియజన గాంధర్వ కావ్య సేవాభిః
ఉపవనగమన విహారైః శృంగారరసః సముద్భవతి

౫౦. నయన వదన ప్రసాదైః స్మిత మధుర వచో ధృతి ప్రమోదైశ్చ
మధురైశ్చాంగవిహారైః తస్యాభినయః ప్రయోక్తవ్యః

ఫలీభూతమయిన కామ మశేష హృదయ సంవాది. కామ ప్రధానము శృంగారము. లోకములో శుచిగా మేధ్యముగా నుజ్జ్వలముగా దర్శనీయముగా నుండునది శృంగారముగా నున్నదని శృంగార పదమున నుపమిత మగుట కలదు. సముజ్జ్వల వేషమువాని జూచి యీతడు "శృంగారి" "శృంగారవాన్" అందురు. వేష ముజ్జ్వలముగ లేనప్పుడు శృంగారపద ప్రయోగమున్న నది యుపచరితము. ముఖ్యముగా రత్యాస్వాద మున్నప్పుడె శృంగార శబ్దము ప్రవర్తించును. గోత్ర మనునది పితృ సంతానమును, కులమన్నది మాతృసంతానము చెప్పును. లోకమున గోత్ర కులాచార ప్రరూఢములై నామకరణమను నియమమున నారీ నరుల కాప్తోపదేశ సిద్ధము లయిన నామములు శృంగార భావమునె సూచించు చున్నవి. పురుష సంతానమునకు పితృసంతానానుసారముగా "విష్ణుశర్మ" మొదలగు నామములను, స్త్రీలకు మాతృవంశానుసారమున "కనకప్రభ" "చంద్రప్రభ" మొదలగు నామములను సంకేతముగా నేర్పఱచెదరు. అట్లె రసములకు భావములకు నాట్యాశ్రితము లయిన పదార్థములకును సంప్రదాయాచారోత్పన్నము లాప్తోపదేశ సిద్ధములగు నామముల యేర్పాటున్నది. "శృంగారరసము" అనునది హృద్యోజ్జ్వల వేషాత్మకము. ఆచారసిద్ధమయిన నామము. ఆ శృంగారము స్త్రీ పురుష హేతుక ముత్తమ యువ ప్రకృతిక మగును.

## ఉజ్జ్వలత

ఉజ్జ్వల వేషాత్మకమందే శృంగార పద ప్రయోగ మున్నది. ఇం దతిప్రసంగము లేదు. కేవల మాప్తోపదేశమె యిందు నియామకము కాదు. రతి సమాస్వాద్యమగుచో శృంగార మనుట సముచితము. రత్యాస్వాద మొనరించువాడు రతి బహుమాన పరుని చూచి "వీడు శృంగారి" యందురు. కేవలము తద్వ్యసనమున నుండు

వాఁడు రసనాస్వాద దశాకాలమున శృంగారి యనిపించు కొనినను వానియందా శృంగారిత చిర ముండదు. శాస్త్రనిషిద్ధము, సంప్రదాయానుసారి. యజుగుప్సితము, సంస్ఫుటము, మనోహరము, సమాస్వాదోపయోగి యగునదియె శృంగార శబ్ద వాచ్య మగును. సముజ్జ్వల లోకమున శృంగార పద ముపమానముగ ప్రయుక్త మగుటలో నిది నిదానము. "ఉపమీయతే తదుపయోగితయా తథా మీయతే లక్ష్యతే ఇతి యావత్" ప్రకృతమున కుపయోగించు విధమున నది లక్షిత మగును. శృంగార పద వాచ్యమగు ముఖ్యార్థము లేనప్పుడు శృంగార పద ప్రయోగ ముపచరితమని యననే యంటిమి.

రసాదులకు సంబంధించిన నామము లన్నియు నా శాస్త్ర మర్యాదల గుర్తించిన పెద్దల వ్యవహారమున నిరూఢము లయినవి. ప్రాక్తనులయిన బ్రహ్మాద్యాప్తులు వీని నిర్మించిరి. ఆ నామము లాచార వ్యవహారమున లోకమున సిద్ధము లయినవి. హృద్య సముజ్జ్వల వేషాత్మకత యిందు హేతువు. లోక వ్యవహారములందున్న శబ్దములు లా యా శాస్త్ర సమయ సంకేతముల ననుసరించునవి యయినను వృద్ధ వ్యవహార పరంపరగా లోకమున ప్రసిద్ధములై యుపచార వశమున నితరములందును ప్రయుక్తము లగుట ప్రసిద్ధముగనె యున్నది. చూడుము! "వీడు సాంఖ్య పురుషుడు. ఇంటిలో నేపనియు చేయడు. నా కాతడు పూర్వరంగ మొనరించినాడు. నాకు మేలయినది." ఈ వ్యవహారమున సాంఖ్యపురుష పూర్వరంగ పదము లిట్లు సిద్ధము లయినవి.

## ఉత్తమ యువ ప్రకృతి

శృంగారము స్త్రీ పురుష హేతుక ముత్తమ యువ ప్రకృతిక మనుటలోని భావమిట్లు పరిగ్రాహ్యము. పరస్పరా భిలాష కల స్త్రీ పురుషుల సంభోగాత్మక మయిన లౌకిక రతిని ముందు భావింపవలెను. అందీమె యితని వనిత యని భాసించును. ఆ వనిత యభిలాషమాత్ర సార కామావస్థానవర్తిని. ఇది లౌకిక రతి విశేషము. కావ్యమందలి స్థాయిరూపము దీనికన్న విలక్షణము. ఈ స్థాయి ప్రారంభాది ఫల పర్యంతము వ్యాపించును. పరిపూర్ణ సుఖైక

ఫలముగా భాసించును. ఇది కావ్యరతి. కవి లౌకిక రతి వాసనా
నువిద్ధు డయినను నాట్యానుకూలముగా విభావాదుల నాహరించును.
రత్యాస్వాదమునకు తగిన విధమున ననుభావముల సంధానించును.
ఆస్వాదయిత యగు సహృదయుడును పూర్వ కిక్ష్యలో కొంతగా దీని
యుపయోగము కలవాడగును. ఇకనిది నిరుక్తము. రతి క్రీడా సార్థ
మంతయు పరమార్థముగా కామినీ కాముకులదే. వారియందే సుఖము
ధారా విశ్రాంత మగును. కవికృతమయిన ఋతు మాల్యాది విషయ
సౌందర్యము సంకల్ప సంవేదనాత్మకమై యద్వితీయాన్యోన్య నిమజ్జన
సారముగా మీలన స్వరూపమగు పరమభోగ మిచ్చును. అంతట
సంవిన్మాత్రమె ప్రధానము. తదన్యమగు జడమంతయు భోగ్యము.
ఆధార భేదమున రతి భేద ముండును గావున రసమొకటియె యెట్లగు
నని శంకించుట కేవలము రసతత్వానభిజ్ఞత. రతి యనునది యంతట
నేకరూపము. రతిలో నెచ్చటను సంవిదైక వియోగము రానేరాదు.
కావుననె శృంగార ముత్తమ యువ ప్రకృతి యనుట. యువకు డుత్త
ముడు. యువతి యుత్తమ. ఇట్టి యువ ప్రకృతులె శృంగారాలంబ
నము. ఉత్తమ యువ శబ్దమున వారి సంవేదనము వివక్షితము. ఉత్త
భౌతిక ధర్మము వివక్షితము కాదు. సంవేదనమె యుత్తమ యువత్వ
మనునది యిందలి విశేషము. యువత్వ మవస్థా సూచకముగా వ్యవ
హారములో నున్నది. ఆ యువల సమాస్వాద యోగ్యమగు సంవిత్తు
శృంగార రసీభావము పొందును. అనుత్తమత్వమున సంవి ద్దార్ఢ్యము
సిద్ధింపదు. అయువత్వమున రతి సంపుష్టి కలుగదు. పరస్పరము జీవిత
సర్వస్వాభిమాన రూపముగా నా సంవిత్తు వారి చిత్తవృత్తి వ్యాపించి
స్మృతి సంక్రామ మిచ్చును. వారి వేషాదికము విభావానుభావా
త్మక మగును. రతి స్థాయిని వ్యాపించి వ్యభిచారు లుజ్జ్వలము
లగును.

## శృంగార విభాగము

ఉజ్జ్వలోత్కృష్ట మయిన శృంగారాత్మను విభాగమున వ్యాఖ్యా
నించుట సముచితము. ఈ శృంగారమునకు సంభోగము విప్రలంభమని
రెండధిష్ఠానము లున్నవి. వీనియం దవస్థ శృంగార రూపమున భాసిం

-చును. శృంగారమునకివి రెండు భేదము లన్నమాట. ఈ దశాద్వయ మందును తదాస్థా బంధాత్మకి మయిన రతి యనుగతముగనె యుండును. ఆ రతియొక్క యాస్వాద్యమాన రూపమె శృంగారము. స్నేహరతి యభోగమున విరహమునందు హ్రాసము పొందునని, యిష్ట వస్తువునందలి యుపచిత రసముల ప్రేమ రాశులగునని మేఘకవి పలికి నాడు. కావుననె సంభోగమున విప్రలంభ సంభావనా భీరుత్వ ముండును. విప్రలంభమున కూడ సంభోగ మనోరాజ్యానువేధ ముండును. ఈ చెప్పినది శృంగార శరీరము. అభిలాషేర్ష్యా ప్రవా సాది దశలు వీనియందె యంతర్భవించును. ఆస్థా బంధాత్మిక రతి యున్నప్పుడు అప్పటి భోగమున సంభోగ శృంగారమను వ్యపదేశము కలుగును. కావుననె సాతిశయ చమత్కారము కలుగును. ఉజ్జ్వల వేషము లేకున్న నుత్తమ రతి కలుగ ననుట యసుభాషితము. అను జ్జ్వల వేషమున శృంగార మెట్లు? అంతట నొకటి యనుట వచనాతి భారము.

## సంభోగ శృంగారము

సంభోగ విప్రలంభములలో సంభోగము ఋతువు మాల్యము, అనులేపనము, అలంకారము, ఇష్టజనము, విషయము, వరభవనము, ఉపభోగము, వన గమనము, అనుభవనము, శ్రవణము, దర్శనము, క్రీడ, లీల మొదలగు విభావములచే నుత్పన్న మగును. శృంగారము నందు స్త్రీ పురుషు లిద్దరు పరస్పరము విభావము లగుదురు. ఋతువు మొదలగునవి వారి యుత్తమత్వమున నుపయోగించును. ఉత్తముల కనవసరమున రతి యుదయింపదు. ఋతువనుట వసంతాది ఋతు వులు పరిగ్రాహ్యములు. కామోద్దీపకమగు సమాలంబన మనులేపనము. విదూషకుడు మొదలగు వారిష్టజనముగ నిందుపయోగింతురు. జలావ గాహనాదికమగు లీల యిందు క్రీడ. కేవల మీా చెప్పినవె కాక స్త్రీ పురుషులకు హృద్యము లగునవి శృంగార విభావములె యగును. హృద్యతమ మయిన యీా విషయ సంభార మంతయు పూర్ణముగ నున్నప్పు డుత్తమునకు రతి కలుగును. కావుననె రత్నావల్యాదు లందు హర్మ్య వర్ణనము ఉద్యాన గమనము కామదేవ పూజ వసం

తము సర్వము సంగృహీత మయినది. సముచిత మయిన యీ
సర్వస్వ మంతయు విభావము. ఆలంబన విభావ ముద్దీపన విభావ
మనుట కాల్పనికము కావునను ముని యే విభాగమును చెప్పలేదు.
సర్వము విభావ మనుట యుక్తముగ నున్నది. ఒకే రూపకమున
నుద్యానర్తు మాల్యాదు లన్నియు నుండుట నొకే రస మవభాసిం
చును. ఐశ్వర్య పూర్ణుడగు నాసి కాత్మీయ సమృద్ధి సంభార సంస్కార
వశమున విభావ వర్గము పూర్ణముగనె యుండును, ముక్తకాదులలో
వేరుగా నున్నను రస సంపత్ ఆవిర్భవించును. ఒక్కొకచో ననుత్తముల
కపరిపూర్ణోద్దీపనమున గూడ ముఖ్య సౌభాగ్యము సుసంగతము
కావున చమత్కార ముదయించును. సౌభాగ్యములేకున్న చమత్కా
రము లేదు. కవి వీనిని నిబంధించును. నటు డభినయమున సాక్షాత్కార
కల్పముగ జేయును. అప్పుడు సామాజికునకు వీతవిఘ్న భోగాత్మ
కముగా రస ముదయించును. అవ్యవధానమున రసోదయమె యను
భవ కల్పము. గమన క్రియవలె పర్యంతమున రసనాక్రియ నిష్పన్న
మగుననుట కాదు. ప్రథమావసరముననె రసనా క్రియ కలుగును.
ఇది విభావ సాక్షాత్కారాత్మకము. ప్రథమ కక్ష్యలోనే రసనా
గోచర మనదగిన విభావ సాక్షాత్కారము నయన చాతుర్యా ద్యను
రాగ ప్రక్రియలచే రసనాభిముఖముగ భాసించును. కాన నాయభి
నయము లనుభావములై యాభిముఖ్య నయనమ నుభావనమై రసాస్వా
దమున సమర్థాచరణ ముద్దీపనమై సహృదయుల కవభాసించును.

## శృంగారాభినయము

నయనచాతురీ - భ్రూక్షేప - కటాక్ష సంచార లలిత మధు
రాంగహార వాక్యాద్యనుభావములచే తదభినయమును ప్రయోగింప
వలెనని భరతులు సూచింతురు. ఈ నయన చాతుర్యాదికముచే
కాంతా దృష్టిని గుర్తింప వలెను. భ్రూక్షేపమున నొక తారాకర్మ
లక్షిత మగును. ఇచటి యోజన మిట్లుండును. నయనముల చాతు
ర్యము, భ్రూక్షేపము కల కటాక్షము, సంచరణమున లలిత మంధర
మధుర మనోహరముగ నుండవలయును. అంగముల కర్షణాకర్షణములు
హారణములును స్వకార్య క్రియా కాలమున లలిత సుకుమారములుగ

మధురములుగ భాసింపవలెను. శ్రవణ సుఖకరము లయిన వాక్య ములు నుండవలెను. ఇట్లిందాంగిక వాచికాభినయము లక్షిత మగు చున్నది. ఇంతియె కాక ముఖరాగ పులకాది సాత్త్వికమును పరిగ్రా హ్యము. ఈ నయన చాతుర్యాదిక మనుభావకముగ నుండుటచే తాటస్థ్యము లేదని గుర్తింప వచ్చును. ఈ యభినయము లాభిముఖ్య మిప్పించునవి యగుట స్వాత్మైక విశ్రాంతి లేదనియు గ్రహింప వచ్చును.

## వ్యభిచారి వ్యవస్థ

ఆలస్య ముగ్రతాజుగుప్సా వర్జముగా నితరము లన్నియు నిందు వ్యభిచారి భావము లగును. విభావ సమయముననే రసనీయమై యనుభావావసరమున నవస్థావేశాస్పదమై యుండు రసమునకు వ్యభిచారి భావములు స్వ స్వరూపమును రసనీయముగ చిత్రించు కొనుచు సాతిశయ పరిపోషణము సంపాదింప గలవు. నిర్వేదాదులు సంభోగ శృంగారమున వ్యభిచారులు కాజాలవు. విప్రలంభ కృత శృంగారమును నిర్వేద -గ్లాని -శంకా - అసూయా -శ్రమ -చింతా- ఔత్సుక్య- నిద్రా -సుప్త- స్వప్న -విబోధ- వ్యాధి - ఉన్మాద - అప స్మార- జాడ్య -మరణా ద్యనుభావములచేనభినయింప వలెను. విప్ర లంభమునందు దుఃఖమయము లయిన వ్యభిచారు లున్నవి. కాన సం భోగ శృంగారమున నాలస్యాదివ్యతిరిక్తములగు సుఖమయము లయిన ధృత్యాదులు వ్యభిచారులుగా నుండుట సముచితమని సూచిత మగు చున్నది. ఇందు పరస్పరాం శోపజీవనము జీవితము. కావుననె ముని విప్రలంభము ననుద్భిన్నముగనె నిర్దేశించి నాడు. అందువలననె భగవదనుగ్రహ పవిత్ర వాక్కుకల కాళిదాసు సంభోగవిప్రలం భాత్మక వ్యామిశ్ర రసనా సంపత్తికై రమ్య రచనము సారించినాడు. స్వాప్నాంతర్యాతముగ స్వప్నము నిరూపించి స్వకర్మ పూర్వావస్థా వర్ణమున మొనరించినాడు. – – సంభోగదశలో విభావము సన్నిధిలో నుండగా నిద్రాదులుండవు గావున విబోధము వ్యభిచారిభావముగ నుండును. సంభోగమున నొకప్పుడు రతిశ్రమకృత నిద్రాదు లుండ వచ్చును. కాని వాని నిరూపణము రతిలో చిత్రత నాపాదింపదు.

విప్రలంభమునందు నిద్రాదులు చిత్రతాపాదకములగును. రతిభావనచే నిద్రయు నిద్రాభావనచే రతి భావనయు పరస్పరము జాతపోషణములై వైచిత్రి నాపాదింప గలవు. ఉన్మాదాపస్మార వ్యాధుల యంత్యాత కుత్సితదశను కావ్యమునగాని ప్రయోగమున గాని నిరూపింపదగదు. వానిని నిరూపించినచో నా దశలో స్వజీవిత నింద యుదయించును. దేహోప భోగ సారమయిన రత్యాత్మకాస్థాబంధమును విచ్ఛిన్న మగును. ఒకప్పుడు మరణమును చెప్ప వలసి వచ్చినచో నచిరకాలమున సమాగమము వర్ణింప వలెను. అప్పుడు శోకమున కవస్థితి కలుగదు. "అజరాజు నదీసంగమ తీర్థమున దేహత్యాగమున నప్పుడె యమరత్వము పొంది, మరల నందన వనమున పూర్వావస్థాధిక చతుర యయిన కాంతతో కూడు నెను.—" అని రఘువంశమున నిరూపించు సుకవి కాళిదాసు వాక్య భేదమున గూడ మరణమును జెప్పలేదు. విభావానుభావ సంధానము చూపినాడు. పూర్వావస్థమునె సుతరాం ద్యోతింప చేసినాడు. ఈ చెప్పిన వ్యభిచారి భావములును స్వానుభావములచే ననుభావితములై విప్రలంభము ననుభవింప జేయును. కావుననె విప్రలంభమున నిర్వేదాదు లననుభావములని యనుట. కేవలము విప్రలంభానుభావము చెప్పుటయు విప్రలంభమున విడంబనము. ఇచట నన్నిటికి విరహము ఫలము. విరహమునశృంగారమునకు సుష్ఠుపోషణ ముండును. విరహము వినా శృంగారము ప్రయోగమున గాని కావ్యమునగాని హృద్యము కానేరదు. సంభోగ శృంగారమున గూడ ఏకఘన శర్కరాస్వాద స్థానీయతను పరిహరించుటకై కలహ విప్రలంభము హేతువుగా కవులు వైషమ్యమునో గోత్రస్ఖలిత స్పర్ధనో యితరమునో నిబంధింతురు. కామము వామమని వాత్స్యాయనాదు లనిరి. ఈ వ్యభిచారి భావములు విద్యుదున్మేష నిమేష విధమున ప్రకటమ్ములై తిరోధానము పొంది వైచిత్ర్య మాపాదింప గలవు. వ్యభిచారులు స్థిరములు కావు. స్థాయి భావమును స్థిరము కాదు. అయినను సంస్కార రూపముగా నుండునని, ధారావాహి సజాతీయ రూపముగా నుండునని స్థాయిభావము స్థిరమని యంటిమి. వ్యభిచారిభావములు క్షణకాలమేని యుండవు. స్వకీయ సంస్కారమును స్థాయి సంస్కారముననె ప్రౌఢింప జేయును. అస్థి

పెద్దలు సంభావించిరి. కావున వ్యభిచారులందు వేరువేరుగా కొందరు దాహరణముచూపుట తంత్ర న్యాయానుపాతి కాదు. వ్యభిచారి క్షణ మేని యుండకనందున వెంటవెంటనే విచ్ఛిద్య విచ్ఛిద్య వితరాన్తర ముదయించును. "చలం హి గుణవృత్తం" అని పెద్దలనిరి. ప్రయోగ వైచిత్ర్యమనుసరించి యన్య వైచిత్ర్య సంధాన ముండవచ్చును. వ్యభిచారి యొకటి నిరూపింప మధ్యలో నంతమున నెన్నియేనికలు గును. ఈ విషయ మిక మానెదము గాక.

స్వ రూ ప ప రి శో ధ న ము

వాక్యైక వాక్యమున నవస్థాద్వయ సూత్రితముగా నిరూపిత మయిన శృంగార స్వరూపము నిక పరిశోధింప వలసి యున్నది. ఒక డిట్లనును. "ఈ శృంగారము రతి ప్రభవమేని కరుణాశ్రయ భావము లేల కలుగు చున్నవి?" అని. ఇందిది యందుము. అననే యంటిమి, "శృంగారము సంభోగ విప్రలంభ కృతము" అని. వైశిక శాస్త్ర కారులు శృంగారము దశావస్థ మనిరి. వేశము =వేశ్యావర్గము. త త్సంభోగాత్మకము తత్ప్రయోజన మయిన శాస్త్రము కామసూ త్రము. కామసూత్రము రచించిన మాన్యు లభిలషితాది మరణాంతా వస్థాదశకమున శృంగారము నిరూపించినారు. కాన చింతాదులు కూడ రతివ్యభిచారు లగునని వారంగీకరించినట్లు విశదము. రతి రూపము పరస్పరాస్థా బంధాత్మకముగా నుండగా తదంగము లయిన దశావస్థలు విప్రలంభాంగము లగును. రూపక కర్త లట్లే నిరూపిం చిరి. వ్యభిచారుల కన్న భేదము కానరానందున కరుణము విప్రలంభ మున కన్న నెట్లు భిన్నమని శంకింతురు.

కరుణముశాప – క్లేశ – వినిపతితేష్టజన – విభవనాశ – వధ – బంధములఁ గలుగు నిరపేక్ష స్వభావము. విప్రలంభ కృతమగు శృంగా రము ఔత్సుక్యచింతా సముత్థమయిన సాపేక్ష భావము. కాన కరు ణము వేరు. విప్రలంభము వేరు. శృంగార మిట్లు సర్వ భావ సంయుక్త మగుచున్నది.

అధమ ప్రకృతి యగు వానికి స్థాయి సంయుక్తముగా నుండ నందున విప్రలంభ ముండదు. స్థాయ్యభావమున విభావ సామగ్రీ

వైకల్యము హేతువు. అట్టి వానియందు కరుణమె లబ్ధ ప్రతిష్ఠ
మగును. ఉత్తమ ప్రకృతి యగు వానికి గూడ కరుణమున రతి విప
రీతమగు శోకమె స్థాయి. కరుణము నిరపేక్ష భావము. రతిలో వలె
బంధుజనాది విషయమున నిం దాలంబనాపేక్ష యుండదు. శాపక్లే
శమున వినిపతితుడయిన యిష్టజనుని విభవ నాశము కాని వధబంధ
ములు కాని కరుణ సముత్థాన కారణములు. ఉత్తమ ప్రకృతి యగు
వానికి ప్రతీకార మొనర్ప శక్యము కాని శాప విధానమున శోకము
కలుగును. కాకున్న నుత్సాహ క్రోధాదులె విభావములు కావలసి
వచ్చును. కవికులచక్రవర్తి పురూరవునందు శోకశంక లేకుండుటకై
యూర్వశీ శాపప్రాప్తి సూపలక్షితము కాకుండునట్లు నిబంధించి
నాడు. ఇది విభావ స్థాయి విభేదముగా గుర్తింప వలెను. రతి సంబం
ధము లేని నిర్వేదాదులు నిరపేక్ష శోకమునను కలుగును. కావుననె
కరుణము నిరపేక్ష భావమనుట. ఇది యంతయు ప్రసంగమున కరుణ
స్వరూపాభిధానము. దీని నిట్లు ప్రకృతమున నాయోజనము చేయ
వచ్చును. విప్రలంభ మౌత్సుక్య చింతా సముత్థము. చింతా శబ్ద
మిచట నిఖిల నిర్వేదా ద్యుపలక్షకము. ఔత్సుక్య ప్రధానము లయిన
చింతాదుల వలన విప్రలంభమునకు విజృంభ మున్నది. కాన సాపేక్ష
రతిభావ మున్నచోట ఔత్సుక్య ప్రధానము లయిన చింతాది
భావము లుదయించు చుండును. విప్రలంభమున విభావము కాని
స్థాయి కాని సంభోగ సమయ విభావ స్థాయులకన్న భిన్నము కాదు.
అది యేకఘన స్వభావమె. ఔత్సుక్య మనునది విషయాన్ముఖ్యము.
విషయము నశించినచో నది సంభవింపదు. ఇన్ని విధముల నీ శృంగా
రమును పరీక్షింప నది యేకవిధమని నిశ్చిత మగును. ఈ విశిష్ట
వివరణ ప్రతిపాదితార్థమునే పై కారికలు నిరూపించు చున్నవి.
వాని యర్థ మిట్లు సంగ్రాహ్యము.

శృంగార మనునది సుఖ ప్రాయేష్ట సంపత్తి కలది. ఋతు
మాల్యాది సేవనము కలది. పురుష వనితా యుక్తము నగును. ఋతు
మాల్యాలంకారములచే ప్రియజన గాంధర్వ కావ్య సేవనములచే
నుపవన గమన విహారములచే శృంగార ముద్భవించును. ఆ శృంగారా

-భినయమును నయన వదన ప్రసాదములతో స్మిత మధుర వచో ధృతి ప్రమోదములతో మధురాంగహారములతో ప్రయోగింప వలెను ఇది శృంగార వివేకము.

## శృంగార పద్ధతి

శృంగారము పురుష ప్రమదా యుక్త మనుట సాభిప్రాయము. పురుషుడు భోక్త. సంవేదనాత్మకుడు. భోక్తయె స్థాయిసంవిద్రూపుడు. వ్యభిచారిభావములు భోగ స్వభావములు. కాన రతియె పురుషుడు. "శ్రద్ధాదయోఽయం పురుషః" అని పల్కిరి కదా! ప్రమదయు నిల్లె. కాని భోక్తృత్వమున పురుషునకు ప్రాధాన్య మున్నది. ప్రమదకు భోగ్యత్వమె కలదు. ప్రాధాన్య ముండుట వలన పురుషుడు భోగ్యమున పరతంత్రుడు కాడు. అందుననే నాయికాంతర యోగ మున్నను పురుషునకు శృంగార హానిలేదు. భోగ్యము పరతంత్ర మయినందున నన్య సమ్మేలనములో శృంగార భంగము కలుగునని రసదర్శనము. విషయ సంభార పూర్ణత్వమున గలుగు రతియె సముచితము. నాయికలకు సర్వ సంపన్నత్వమును సావధానముగ కవులు నిరూపించిరి. కాకున్న నుత్తమత్వము కలుగదు. తమ తమ జాతి కులానురూప సంపద లేకపోయినచో రతి పురుషార్థ రూపమున నుపదేశింప దగినదిగా నుండదు. అట్టి రతి ప్రతీతి వైరస్య ముత్పాదించును. కొందరు రసము విషయ సామగ్రీ సంపూర్ణమని భ్రాంతి పొందుదురు. కావ్యార్థీభూత మయిన రసముకన్న భావకుడగు కావ్యార్థ విదునకు భావాంతర ముదయించునని సుఖజనక మగుట కావ్యార్థమె రస మని యనభిజ్ఞు లనుమాటల కర్థము లేదు. విషయ సామగ్రియె రసమని యెన్నడనలేదు. శృంగార విషయమై సూత్రార్థము పరీక్షించి ప్రతిష్ఠిత మొనర్చితిమి. తదర్థము సుఖ గ్రాహ్య మగుటకు సూత్రార్థము వివరించితిమి. కేవలము సూత్రము పరీక్షయె కాక తద్గ్రాహక కారిక నిరూపించితిమి. త దుత్పత్తి త దభినయము త దనుభూతి త ద్భేద వివేకము త దభిన్న స్వభావము శృంగారమున నింతవఱ కిట్లు విశద మొనర్చితిమి. ఇది శృంగార పద్ధతి.

## ౨. హాస్యము.

హాస్యమను రసము హాస స్థాయిభావాత్మకము. ఇచటి యాత్మ శబ్దార్థ మిట్లుండును. శృంగారమందలి రతి యాస్వాదనమను ప్రతీతి కలుగజేసి యా రతి రూపముననె యుండదు. అచటి విభావాదుల సాధారణ్య మట్టిది. హాసములోని యాస్వాదము వికృత వేషాదుల లోకవృత్తమున సామాజికులకు హాసహేతు వగును. విభావ సాధారణ్య ద్వారమున హాస్యైక స్వభావముగనె యుండును. హాసాత్మక రసనా స్వభావముగనె యుండును. హాసమె యచట చర్వణీయ మగును. రతి శోకము లిట్లుండవు. అవి హాస జాతీయములు కావు. రతి శోకములు విలక్షణ సంవి దాస్వాదము కలవై ధారా రూప సుఖ దుఃఖ రూపమున నుండును. నిస్సాధారణాత్మీయత్వ నియమ బలమున నుత్పన్నము లగుట యున్నందుననె ముని వానికి స్థాయిభావ ప్రభవ విశేషము చెప్పినాడు. ఇతరము లందు విభావమున సాధారణ్య సంభావన మున్నందున "తదాత్మక" మని యనవలసి వచ్చినది. హాస్యము వికృత పరవేషాలంకార - ధార్ష్ట్య - లౌల్య - కుహకాసత్ప్రలాప - వ్యంగదర్శన - దోషోదాహరణాది విభావములచే నుత్పన్న మగును. ఇందలి వేషము కేశాది రచన. హార కేయూర కటకాదిక మలంకారము. ఈ రెండును వికృతములుగా నుండవలెను. దేశ కాల వయోఽవస్థా విపరీతములుగ నవి యున్న హాస్యమునకు విభావ మగును. కాన రసము లన్నియు హాస్యమున నంతర్భూతము లగుట సూచితము. విదూషకు డేదేని వికృత వేష విధానమున హాస్యాభాసము రూపించు వాడగును. పరవేషాలంకారము లనుట పరులకు సంబంధించిన వేషా లంకారములని భావము. ఇతరుల వేషాలంకారము లనుకరించి ప్రదర్శించిన హాసము పుట్టింప గలవు. ధార్ష్ట్యము= నిర్లజ్జత. లౌల్యము= విషయములం దనియత ప్రవృత్తి. కుహకము= బాలుర నవ్వించుటకై కక్ష గ్రీవాదుల స్పృశించుట. వ్యంగము= అంగవిలోపము. చట్టిముక్కు మొదలగునది. దోషము = ఆ స్వభావములు లేకపోయిన నున్నట్లుగా భయాదుల నకార్య కరణాదుల వికృత వేషాదుల వర్ణించుట. ఇట్టివన్నియు హాస్యమున విభావములు.

ఓష్ఠ నాసా కపోల స్పందనములచే, దృష్టి వ్యాకోచాకుంచనములచే, స్వేదాస్యరాగ పార్శ్వ గ్రహణాదులచే హాస్యాభినయము ప్రయోగింప వలెను. స్పందనాకుంచనాదు లిందనుభావములు. అవహిత్థ - ఆలస్య - తంద్ర - నిద్ర - స్వప్న - ప్రబోధాసూయాదు లిందు వ్యభిచారి భావములు. ఈ చెప్పిన విభావానుభావ వ్యభిచారులను ప్రకృతి త్రయ భేదమున యథా యోగముగ యోజనము చేయవలెను.

ఆత్మస్థము, పరస్థము. అని హాస్యము రెండు విధములు. తానే హాసించిన యాత్మస్థమని, యితరుని హాసింప జేసిన పరస్థమని భావము. "ఆత్మగతము లయిన వికృత వేషాది విభావములచే విదూషకుడు తానే హాసము కలవాడగును. అది యాతని కాత్మస్థము. ఆతడు వానిచే పట్టపు దేవిని నవ్వించును. అది యామెకు పరస్థము." అని కొందరనుట యసంగతము. ఇట్లే యయిన విభావములకే యాత్మస్థత్వ విభాగము చెప్పినట్లగును. హాసమునకు చెప్పినట్లు కాదు. కించ, స్వామిశోక, మనుజీవులకు శోక మాపాదించుట యున్నది కావున సర్వ రసములందును పరస్థత యుండు ననవలసి వచ్చును. రాజులందు స్వయంభూ రూపమున వ్యక్తమయిన క్రోధము గంభీరుడయిన ప్రభువునకు పరిజనులకు పరస్థము కావలసి వచ్చును. కావున నీ చెప్పనది యుచటి తత్త్వము. ఒకడు నవ్వునప్పుడు వానిని చూచి వేరొకడు తాను విభావములను గాంచక పోయినను నవ్వుట లోకమున గోచరమగుచున్నది. ఒక్కొకచోట విభావాదుల గుర్తించినను గాంభీర్యమున నవ్వక పోవుట యున్నది. అట్లు నవ్వని వారు కూడ పరకీయ హాస మవలోకించి యా క్షణమున హాస విశేషము కలవారగుట లోక స్వభావముగనే యున్నది. ఆమ్ల దాడిమాది. రసాస్వాదము సంక్రమణ స్వభావ మగుట సర్వ ప్రసిద్ధము. ఒకరు దాడిమాస్వాదము చేయునప్పుడు వేరొకరికి దంతోదక వికారము కలుగును. ఇదియె సంక్రమణ స్వభావ తత్త్వము. హాసమును సంక్రమణ స్వభావము. సంక్రమణ శీలునందు సంక్రమించును. ఆత్మస్థ పరస్థ విశేషము నిట్లె గుర్తించుట నిశ్చయించుట సముచితము.

హాస విషయమున నానువంశ్యము లయిన యార్య లివిగో !

౨౫౧. "విపరీతాలంకారైః వికృతాచారాభిధాన వేషైశ్చ
వికృతై రంగవికారైః హసతీతి రసః స్మృతో హాస్యః

౨౫౨. వికృతాచారై ర్వాక్యై రంగవికారైశ్చ వికృత వేషైశ్చ
హాసయతి జనం యస్మా త్తస్మాత్ జ్ఞేయో రసో హాస్యః"

విపరీతాలంకారముచే వికృతాచారములచే వికృత శబ్దములచే వికృత వేషములచే వికృతాంగ వికారములచే లోకము హసించును గావున హాస్యము రసమయినది. వికృతాచారములు వికృతవాక్యములు అంగ వికారములు వికృత వేషములు హాస ముత్పాదింప జేయును. గావున హాస్యము రసమగునని తెలియ వలెను.

౨౫౩. స్త్రీ నీచ ప్రకృతావేవ భూయిష్ఠం దృశ్యతే రసః
షడ్భేదాశ్చాస్య విజ్ఞేయాస్తాంశ్చ వక్ష్యామ్యహం పునః

౨౫౪. స్మిత మథ హసితం విహసిత ముపహసితం చాపహసితమతిహసితం
ద్వౌ ద్వౌ భేదౌ స్యాతా ముత్తమ మధ్య మాధమ ప్రకృతౌ

ఈ హాస్యరసము స్త్రీలలో నధికముగా గోచరించు చున్నది. నీచ ప్రకృతు లందధికముగ భాసించుచున్నది. హాస్యమున కారు భేదము లున్నవి. వాని చెప్పెదము స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితము. అని వాని పేర్లు. ఉత్తమ ప్రకృతి, మధ్యమ ప్రకృతి, అధమ ప్రకృతులలో ని యూరును రెండు రెండు భేదములుగా గోచరించును. అందు స్మిత హసితములు జ్యేష్ఠులకు గలుగును. విహసితోపహసితములు మధ్య ములకు గలుగును. అపహసితాతిహసితము లధములకు గలుగును. జ్యేష్ఠాదులందు రెండు రెండుండు ననుట యథాక్రమముగ విభావ తారతమ్యము ననుసరించిన విధానము తెల్పునని కొందరు భావించిరి. అదియుక్తము కాదు. అట్లే యయిన సింక ననేక భేదములు కలుగ వలసి యుండును. కాన సంక్రమణాభిప్రాయముననె వీని భావించుట సముచితము. స్మిత ముత్తమ ప్రకృతిలో నుండును. అది యుత్తమ ప్రకృతిలో సంక్రమించిన హసిత మగును. ఇట్లె విహసితము సంక్ర మింప నుపహసిత మగును. అపహసితము సంక్రమింప నతిహాసిత మగును. ఇట్లె భావ కథన ముచితము. కావుననె హాసము

త్రవస్థమని మున్నుండనుట సంగత మగును. హాస మారు విధము లగుట వేరువిధమున నుపపన్నము చేసికొన వచ్చును. స్మితములోని యాపత్తి తగ్గినచో హసిత మగును. హసిత మధిక మయిన విహసిత మగును. విహసితము పరస్పర సమీపగతము కాగా నుప హసిత మగును: ఉపహసితము పెదబట్ట నపహసిత మగును. అప హసితము మితిమీరి యతిహసిత మగును. ఇట్లువీనిలో నుపసర్గ భేదమున నర్థభేద మూహ్యము.

> ౨౫౫. ఈషద్వికసితై ర్గండైః కటాక్షైః సౌష్ఠవాన్వితైః
> అలక్షిత ద్విజం ధీర ముత్తమానాం స్మితం భవేత్
>
> ౨౫౬. ఉత్ఫుల్లానన నేత్రంతు గండై ర్వికసితై రథ
> కించి ల్లక్షిత దంతంచ హసితం తద్విధీయతే

ఉత్తములకు సంబంధించిన స్మితహసితముల స్వరూప మిందు న్నది. గండస్థలములు కొంతగా వికసించి యుండుట కటాక్షములు సౌష్ఠవము కలిగియుండుట, పండ్లు కనపడకుండ నుండుట ధీరముగా నుండుటలతో నుత్తముల స్మిత ముండును. హసితమునందు ముఖ నేత్రములు విప్పారి యుత్ఫుల్లములుగా నుండును. గండములు విక సితములై యుండును. దంతములు కొంతగా నుపలక్షితము లగును. ఇది హసిత విధానము.

> ౨౫౭. ఆకుంచితాక్షి గండం యత్ సస్వనం మధురం తథా
> కాలాగతం సాస్యరాగం తద్వైవిహసితం భవేత్.
>
> ౨౫౮. ఉత్ఫుల్ల నాసికం యత్తు జిహ్మ దృష్టి నిరీక్షితం
> నికుంచితాంసక శిర స్తచ్చో పహసితం భవేత్.

ఇందు మధ్యములకు సంబంధించిన విహసితో పహసితము లున్నవి. విహసితము నందు నేత్రములు కపోలములు నాకుంచితములై యుండును. మధురమగు స్వరము కూడియుండును. తత్కాల సమా గతమయిన ముఖరాగ ముండును. ఇట్టి దానిని విహసిత మందురు. ఉపహసితము నందు ముక్కు విప్పారును. కన్నుల చూపు కుంచితమై ముడుచు కొనినట్లు వంకరగా నుండును. భుజములు శిరము వంచు కొని పోవును. ఇది యుపహసిత విధానము.

౨౯౯. అస్థాన హసితం యత్తు సాస్రు నేత్రం తదైవచ
ఉత్కంపితాంసక శిర స్తచ్చా పహసితం భవేత్.

౨౬౦. సంరబ్ధ సాస్రు నేత్రంచ విక్రుష్ట స్వర ముద్ధతం
కరోపగూఢ పార్శ్వంచ తచ్చా తిహసితం భవేత్.

ఇందధమములకు సంబంధించిన యపహసితా తిహసితముల స్వరూప మున్నది. అపహసితము నందలి హాస మస్థాన ప్రవృత్త మగును. కాలముకాని కాలమున ననగా నేడువవలసిన సమయమున హసిత ముండును. కండ్లనిండ నీరుండును. భుజములు శిర ముత్కంప ముతో నుండును. ఇది యపహసిత స్వరూపము. అతిహసితమునందు నేత్రము లశ్రువుల కూడి యుండును. సంరంభముతో నుండును. శ్రవణకటువు నుద్ధతమయిన స్వరముండును. నవ్వు మానవుడు చేతులతో పార్శ్వములపట్టుకొనవలసి వచ్చును. ఇట్టి దతిహసితము. రూపకములందు కార్యోత్పన్నము లయిన హాస్య స్థానములను పరిశీలించి యుత్తమ మధ్య మాధములకు తగినట్లుగా నీ హాస రీతులను విని యోగింప వలెను.

౨౬౧. ఇత్యేషస్వసముత్థ స్తథా పరసముత్థశ్చ విజ్ఞేయః
ద్వివిధః త్రిప్రకృతి గతః త్ర్యవ్యస్థభావో రసో హాస్యః

హాస్య రస మిట్లు స్వ సముత్థముపరసముత్థము నని తెలియ వలయును. అసంక్రాంతము లయిన స్మిత విహసితా పహసితములు పర సముత్థ ములు. సంక్రాంతము లయిన హసితో పహసితా తిహసితములు స్వ సముత్థములు. హసితాది రూపమున సంక్రమణ ముండుటబట్టి యుత్తమ ప్రకృతిలో స్మితాది రూపముగా నుండునని గ్రహించునది. రతి క్రోధ శోకాదులకు సంక్రమణ ముండదని పూర్వమె చెప్పితిమి. వాని యందలి విభావ మొక్క సమయముననె త చ్చిత్తవృత్తి మయ పురుషునందు విభావత్వము పొందును. అంతియె కాని యా విభావము లాతని చిత్తవృత్తి ననుసరించి సంక్రమింపవు. స్వపర సముత్థముగా ద్వివిధ మయిన హాస్య ముత్తమ మధ్యమాధమ ప్రకృతి ననుసరించిన దగుట త్రి ప్రకృతిక మగును. స్మితాది భేదమున త్ర్యవస్థ భావము నగును. ఇది హాస్య రసము.

## 3. కరుణరసము.

అవసర సంప్రాప్త మయిన కరుణ రసము నిక వ్యాఖ్యానింతుము. కరుణమను రసము శోకస్థాయిభావ ప్రభవము. అది శాపక్లేశ వినిపతి తేష్టజన విప్రయోగ విభవనాశ వధ బంధ విద్ర వోపఘాత వ్యసన సంయోగాది విభావములచే గలుగును. అశ్రుపాత పరిదేవన ముఖశోషణ వైవర్ణ్య స్రస్తగాత్రతా నిశ్వాస స్మృతిలోపాద్యనుభాములచే త దభినయమును ప్రయోగింప వలయును. నిర్వేద గ్లాని చింతౌత్సుక్య వేగ భ్రమ మోహ శ్రమ భయ విషాద దైన్య వ్యాధి జడ తోన్మాదా పస్మార త్రాసా లస్య మరణ స్తంభ వేపథు నైవర్ణ్యాశ్రు స్వర భేదాదులు హాస్యమున వ్యభిచారులుగా నుండును.

ఇందును స్థాయిభావ ప్రభవ మనుటను శృంగారము నందువలె గ్రహింప వలెను. శాపము నిందు గ్రహించుటచే ప్రతీకార మొనరింప శక్యము కానివానిని గ్రహింప వచ్చునని సూచితము. శాపక్లేశమున పతితు డయిన యిష్టజనుని విప్రయోగాదులిందు పరిగ్రాహ్యములు. విద్రవ మనునది దేశమునుండి యుచ్చాటనము. అది విప్రయోగమున గూడ నుండును. ఉపఘాత మగ్న్యాదులవలన మరణము. అగ్న్యాది కృతము విద్రవమని చోరాది కృత ముపఘాతమని యనుట యుక్తము కాదు. విభవ నాశాదులు స్వాత్మ గతములై యున్న నుత్తమ ప్రకృతి యగువానికి శోక మాపాదింప నేరవు. మధ్యమాధమ ప్రకృతులకు శోక మాపాదింప గలవు. ఆత్మోపాలంభము దైవోపాలంభ ముపాలంభముగా పరిగ్రాహ్యము. అనుభావము లందలి నిశ్వాస పదమున త దనంతరము గలుగు నూర్ధ్వ శ్వసన రూపమయిన యుచ్ఛ్వాసము కూడ స ముపలక్షిత మగును. స్మృతి లోప పదమున స్తంభ ప్రలయములు లక్షితము లగును. ఇందలి నైవర్ణ్య మశ్రువు స్వర భేదమనునవి బహి రుద్భిన్న స్వభావము లయిన చిత్తవృత్తి స్వరూపములె. వక్త లిట్లందురు. "ఈతని కంఠ మశ్రు పూర్ణము. కంటిలో నీరు కానరాదు." అని. ఈ యశ్రు ప్రభృతులు వ్యభిచారిత్వా భినేయ త్వోపజీవనమునకై మధ్యలో నిర్దిష్టత్వము లయినవి. ఇష్టజనుల విభవ నాశాదికమును విసిగాని

కనిగాని కవులు కరుణ విభావముగా గూర్పవలెనని యిచటి తాత్ప ర్యము. ఈ చెప్పిన యర్థ నిరూపకములుగా నీ యార్య లున్నవి.

> ౨౬౨. "ఇష్టవధ దర్శనాద్వా విప్రియ వచనస్య సంశ్రవా ద్వాపి
> ఏభి ర్భావ విశేషైః కరుణ రసో నామ సంభవతి
>
> ౨౬౩. స స్వన రుదితైః మోహాగమైశ్చ పరిదేవితై ర్విలపితైశ్చ
> అభినేయః కరుణరసో దేహాయాసాభిఘాతైశ్చ"

ఇష్టజనుని వధ దర్శనమున, అప్రియ వచనము వినినందున నిట్టి భావముల కరుణ రసము సంభవించును. సస్వన రుదితములతో మోహము పొందుటలతో ఏడ్పులతో పెడబొబ్బలతో దేహాయాస మొదవించు నభిఘాతములతో నీ కరుణ రసము నభినయింప వలెను. ఇవి యన్నియు బహువచనములతో నిర్దిష్టము లగుటలో నిది తాత్ప ర్యము. ప్రకృతి దేశ కాల దశా హేత్వాది భేదమున నివి యనేక ప్రకారము లగును. వాని నన్నిటి నిచట జ్ఞాపనము చేయుట బహు వచన భావము. మోహ వ్యభిచారి భావమున నితర వ్యభిచారి భావములను గూడ గుర్తింప వచ్చును. పాతన వేష్టనాదికము దేహా యాసము. ఉరస్తాడనాదిక మభిఘాతము. ఈ యనుభావములు యధా సంభవముగా ప్రకృతి భేదము ననుసరించి విభాగింప వలయును.

౪. రౌద్రరసము.

రౌద్రరసము క్రోధ స్థాయిభావాత్మకము. రక్షోదానవోద్ధత మనుష్య ప్రకృతి సంగ్రామ హేతుకము. రౌద్రము క్రోధా ధర్షణా ధిక్షేపా వమానా నృతవచనో పఘాత వాక్పారుష్యా భిద్రోహ మాత్స ర్యాది విభావములచే నుత్పన్న మగును. తాడన పాటన పీడన చ్ఛేదన ప్రహరణాహరణ శస్త్ర సంపాత సంప్రహార రుధిరాకర్షణాది కర్మ లిందుండును. రక్తనయన భ్రుకుటీ కరణా వష్టంభ దంతోష్ఠ పీడన గండస్ఫురణ హస్తాగ్ర నిష్పేషా ద్యనుభావములచే రౌద్రాభి నయమును ప్రయోగింప వలెను.

స్థాయిభావ ప్రభవ మనుట యిందు లేదు. హాస్యములో వలె స్థాయి భావాత్మకత యున్నది. ఇందలి చర్వణ కూడ క్రోధ మయ ముగనె యుండును. అందువలననె క్రోధాత్మకము. ఉద్రిక్తముగా

చంపవలెనని తలచు వా రుద్ధతులు. తద్వేషధారులు నటు లుద్ధతులు. ఉద్ధతుల ప్రకృతి కలవా రుద్ధత ప్రకృతులు. ప్రకృతి యను నది చర్వణోదయ హేతువగు స్వభావము. యుద్ధ హేతుకోద్ధత మానవులయిన భీమసేనాదులందు రుధిర పానాదిక ముండును. రక్షో దానవులు స్వభావ రౌద్రులని కొందరనుట యుక్తము కాదు. భీముడు యుద్ధ నిమిత్తముగా రుధిర పాన మొనర్పలేదు. వేరు నిమిత్తముననె యట్లు చేసినాడు. ఉద్ధత స్వభావు డగుట వలననె యాతడు క్రోధ పరవశుడై యనుచితము కూడ ప్రతిజ్ఞ చేసినాడు. ఆ ప్రతిజ్ఞా నిర్వహణమునకె వేణీకవి నాటకమున భీమునకురాక్షసాధిష్ఠానము నిరూపించినాడు. కావున భీముని వంటి వారందరు స్వభావ క్రోధనులు. వారి ననుకరించు నటులట్టి ప్రకృతి కలవారుగనె నటింతురు. రక్షో దానవోద్ధత మనుష్యులు స్వభావ క్రోధనులు. వారు నుద్దీపన మపేక్షింతురా? అవును. వారు నుద్దీపన మపేక్షింతురు. క్రోధాది విభావములు పర కర్తృకములు. ఆధర్షణము దారాదులను ఖిలీకరించుట. అధిక్షేపము దేశమును జాతిని అభిజనమును విద్యను కర్మలను నిందించుట. అనృత వచన మసత్య కథనము. ఉపఘాతము గ్రహభూతాదు లొనరించు నుపమర్దనము. వాక్పారుష్యము చంపుదునని భయపెట్టుట. అభిద్రోహము చంపవలెనన్న తలంపు. మాత్సర్యము గుణములం దసూయ. రాజ్యాపహరణాదికములును రౌద్రమున విభావము లగును. కవి వీనిని విభావముగా వర్ణింప వీనిచే రౌద్ర ముత్పన్న మగును. తాడనాదులు రౌద్ర కర్మలు. రక్త నయనాదులు రౌద్రాను భావములు. వీని వివేకమునకె వేరుగా జెప్పుట. వీనియందను భావ రూపత్వము సమానమె యయినను విశేషమును తెలియ జెప్పుటకై వేరుగా నిరూపించుట యావశ్యక మగుచున్నది. విశేష మిట్లున్నది. తాడన పాటనాది కర్మలను వచన మాత్రముననె వర్ణింప వలెను. రంగమున ప్రత్యక్షముగ వానిని ప్రదర్శింప రాదు. యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము, నగరోపరోధము ప్రత్యక్షముగ రంగమున ప్రదర్శింప రాదని నిషేధ మున్నది. రక్త నయనాదులను రంగమున ప్రత్యక్షముగ ప్రదర్శింప వచ్చును. రక్షో దానవోద్ధతాదుల ననుకరించి యభినయించునప్పు డుద్దీపనములు లేకున్నను

తచ్చేష్టిత మనుకరించు నప్పుడు నర్మగోష్ఠ్యాదికము కూడ తాడనాది ప్రధానముగనె యుండును. వారి యారంభము సర్వమట్లె యుండునని మునియు నను. ఉద్దీపనములు సంభవించి నప్పుడు రక్త నయనాదికము తాడనాది గ్రస్తమె యగును. తాడన మనునది చప్పట్లుచఱచుట. పాటనము బ్రద్దలు చేయుట. పీడనము మర్దనము. రక్షః ప్రభృతులు నర్మ విధానమున గూడ ప్రహరింతురు. అప్పుడు రక్తము చిమ్ముటయె కాని యధిక ముండదు.

ఈ రౌద్రమునం "దసమ్మోహ ముత్సాహ మావేగ మమర్ష చపలత యుగ్రత గర్వములు వ్యభిచారి భావములు. వికృతేక్షణము స్వేదము వేపథువు రోమాంచము గద్గదాదులు నిందు సంభవించును."

ఉత్సాహ మిా రౌద్రమున వ్యభిచారిగ నుండును. క్రోధమె యిందు ప్రధానముగ రసనీయము కదా! స్వేదాదులిందు బాహ్యములు, ఆభ్యంతర సాత్త్వికము లేక పోయినను విషస్పర్శ జ్వరాదుల వలన నవి కలుగును. క్రోధమున విఘాతుల వలన నవి కలుగుటచే ననైకాంతికము లనియతము లనవలెను. ఆంతరముగా నన్నుద్రిక్తముగా నుండియు నుద్రిక్తములై బాహ్యములగు స్వేదాదులచే వ్యక్తములై వ్యభిచారి రూపముగా నిచట నిరూపితము లయినవి.

## రక్షోరీతి

రక్షోదానవాదులందే రౌద్ర ముండునన్న భావమున నిచట చోదకుని చోద్యమొకటి యున్నది. "రక్షోదానవులకె రౌద్ర రసమంటిరి. ఇతరుల కది లేదా!" యని ఇందిది యుత్తరము ఉన్నది. ఇతరులకును రౌద్రరస మున్నది. కవి నిరూపించిన వారల కందరకున్నది. నటు డనుకరించు వారల కందరకున్నది. కాని యధికార మిందు స్వీకరింతుము. రక్షోదానవాదులు స్వభావసిద్ధముగనె రౌద్రులు. అట్లని నిత్యము పరిజనమున క్రుద్ధు లగుదు రనుకొనగూడదు. వారు స్వభావ రౌద్రము కల వారగుటయె కాదు. అంగ రౌద్రమున గూడ నుందురు. వారు బహుబాహులు. బహు ముఖులు. ప్రోద్ధూత వికీర్ణ పింగల శిరోజులు. రక్త నేత్రముల గిట్టున త్రిప్పు

చురు. భయంకర మయిన నల్లని రూపము కలవారు. లోక ప్రసిద్ధాకారము కన్న వారలకు విపరీత వికృతాకార ముండును. వారు తపమాచరింతురు. కాని యది ఘోరముగ నుండును. పర వినాశ మభిలషించి వారు తప మొనరింతురు. వారు కంటికి కన్పడక పోయినను వారిలో క్రోధాభిసంధి యున్నదనిపించును. వారు రాగులయినను క్రోధకాలమున వలె రక్తనేత్రముల త్రిప్పుచునే యుందురు. కేవలము వారి శరీరమె యిట్లుండుట కాదు. వారి చేష్టిత మేది యయినను రౌద్రాస్వాద జనకముగనె యుండును. వారి స్వభావ చేష్టితము రౌద్రముగనె యుండును. వాగంగాదికము సర్వము రౌద్రముగ నుండును. వారిచిత్తమున వికార ముదయింపక పోయినను వారి విధానము తాడనాది ప్రధానముగనె యుండును. వారి మానస చేష్టిత మప్రత్యక్షము కావున నిందు సూచింపలేదు. వారు శృంగారము సేవించినను ప్రసభముగ బలాత్కరించి సేవింతురు. వారు ప్రమదల కూడినను క్రూరాకారముననె యుందురు. వారి ప్రేమ సల్లాపమును "ఆః! సీతే! పతి గర్వ విభ్రమ హారద్భ్రామ్యద్భ్రు!" పరుషముగ క్రూరముగ నుండును. వారు బ్రతిమలాడుకొనుట కూడ విరసముగనె యుండును. ఇది యంతయు రక్షోదానవుల రీతి.

## ఉద్ధత రీతి

ఉద్ధత మనుష్యులు బహు బాహు ముఖములతో నుండరు. అయినను వారిలో రౌద్రాది వికారము సంగ్రామ సంప్రహారములతో నుండును. అట్లె వా రనుకరింతురు. తామస ప్రకృతులై తత్సదృశముగ గోచరింతురు. కేవలము రక్షో దానవుల కార్యము లుండక పోయినను సంగ్రామ సంప్రహారములు తాడన పాటనాదులు నుండును. బహు బహుత్వాదులు లేకపోయిన నుద్ధతులు క్రోధోచితము లయిన వాగంగ చేష్టితములచే రౌద్ర ప్రకృతు లగుదురు. పరశురామాశ్వత్థామాదులు వీర ప్రధానులు. అయినను కారణ మహిమచే వారల యందలి క్రోధము రౌద్రాస్వాద యోగ్య మయినది. రాక్షసాదులు కూడ తగిన కారణోదయమున క్రోధము పోగొట్టుకొని హాస శోకాదులు కలవా రగుదురు. రక్షో దానవాదులకు కేవలము

రౌద్రరసమె యుండు ననసక్కఱలేదు. హాస్య కరుణాది యోగము కూడ కలదు. రక్షోదానవాదుల దర్శించి నప్పుడు సామాజికుల యాస్వాదము క్రోధాత్మకముగ నుండును. ఆస్వాద మనునది హృదయ సంవాద రూపము కావున తామస ప్రకృతులయిన సామాజికులకే క్రోధమున హృదయ సంవాదము కలుగును. అట్టి సామాజికు లొకవిధముగ దానవ సదృశులు. తన్మయీ భావము పొంది క్రోధ మాస్వాదింతురు. అందరిట్లాస్వాదము పొందరు.

> ౭౬౪. "యుద్ధ ప్రహార ఘాతన వికృత చ్ఛేదన విదారణైశ్చైవ
> సంగ్రామ సంభ్రమాద్యై రేభిః సంజాయతే రౌద్రః
> ౭౬౫. నానా ప్రహరణ మోక్షైః శిరః కబంధ భుజకర్తనైశ్చైవ
> ఏభిశ్చార్థవిశేషై రస్యాభినయః ప్రయోక్తవ్యః
> ౭౬౬. ఇతి రౌద్రరసో దృష్టో రౌద్ర వాగంగ చేష్టితః
> శస్త్ర ప్రహార భూయిష్ఠ ఉగ్ర కర్మ క్రియాత్మకః।"

యుద్ధము ప్రహారములు ఘాతనములు వికృత చ్ఛేదన విదారణములు సంగ్రామ సంభ్రమాదులచే రౌద్రముజనించును. నానావిధప్రహరణములచే శిరః కబంధ భుజములను ఖండించుటలచే, నిట్టి యర్థ విశేషములచే రౌద్రాభినయమును ప్రయోగింపవలెను. రౌద్ర రస మిట్లుండును. రౌద్ర వాగంగ చేష్టితముగ, శస్త్ర ప్రహార బహుళముగ, నుగ్ర కర్మ క్రియాత్మకముగ రౌద్రము కన్పడుచున్నది. ఇందలి యనుభావములు మరణ ప్రాధాన్యమును గూడ సూచించును. ఇంతటి క్రోధాతిశయము వీరములో నుండదు. రౌద్రమునం దుగ్రతా ప్రధానము లయిన శిరఃకర్తనాదులు వాని క్రియాభినీతి ప్రధానముగా నుండునని భరతుడు భావించు చున్నాడు.

౫. వీర రసము

వీరమను రస ముత్తమ ప్రకృతికము. ఉత్సాహాత్మకము. అది యసమ్మోహము, అధ్యవసాయము, నయ బల పరాక్రమ శక్తి ప్రతాప ప్రభావాది విభావములచే నుత్పన్న మగును. స్థైర్య, ధైర్య, శౌర్య, త్యాగ, వైశారద్యా ద్యనుభావములచే వీరాభినయము ప్రయోగింప వలెను. ధృతి, మతి, గర్వ, మావేగ, ముగ్రత,

యమర్ష, స్మృతి, రోమాంచము' ప్రతిబోధము మొదలగునవి వీర మున వ్యభిచారి భావములు.

వీర మిప్పుడు క్రమ ప్రాప్తము. పూర్వము చెప్పిన రౌద్రమున సంగ్రామ సంప్రహార యోగ మున్నది. యుద్ధవీరమున గూడ నది యున్నది. కానివీరమున జిఘాంస యుండదు. ఇది యానంతర్య హేతువు. ఉత్తమ ప్రకృతి యనుట యుత్తముల స్వభావమని చెప్పుట. ఉత్సాహ ముత్తమ స్వభావముకాన వీరరస ముత్తముల రసము. కావ్యమున నాట్యమున ప్రయోగము పొందు వీరరసమునకు ఉత్తమ ప్రకృతి హేతువగును. ఉత్తమ వర్ణ్యుల కంతట ఉత్సాహ మాస్వాద్య మగును. కావుననే ధీరోదాత్తాదులగు నలుగురు నాయకులందు వీరత్వ మనుగతముగా నుండుట ప్రసిద్ధము. ప్రతిమానవు డుత్సాహము కలవాడే యగును. కాని యవిషయమున నుత్సాహ ముప దేశ్య చరితము కాదు. చరిత ముపదేశార్హ మయినప్పుడు వాని యుత్సాహ ముచితావసరముననె యుండును. అసమ్మోహమున నున్నప్పుడే యవసరౌచిత్యము గుర్తింప గలరు. కావుననే యసమ్మోహాది సంపత్తి విభావముగా నుపదిష్ట మయినది. అసమ్మోహమున నిశ్చయ ముండవలెను. అప్పుడే వస్తుతత్త్వాధ్యవసాయము కలుగును. ఇది చక్కని మంత్రశక్తి. రావణాదుల కసద్వస్తువు లందభినివేశ ముండుట యసమ్మోహాధ్యవసాయము కాదు. నయము సంధి విగ్రహాది గుణములను సమ్యక్ ప్రయోగమున కూర్చుట. వినయ మింద్రియ జయము. బలము హస్త్యశ్వ రథ పాదాతము. పరాక్ర మము పరకీయ మండలాదుల నాక్రమించుటకై దండయాత్ర. యుద్ధాదికమున సామర్థ్యముండుట శక్తి. ప్రతాపము శత్రు విషయ మున సంతాపము కలుగ జేయగలడన్న ప్రసిద్ధి. ప్రభావ మనునది, యభిజన ధన మంత్రి సంపత్తి. ఇంక యశః ప్రభృతులను గూడ విభావములుగా పరిగణింప వచ్చును. ఈ చెప్పినవి సంపూర్ణ స్వభావము లయినపుడు విభావము లగును. ఉత్తమున కొకప్పుడొక్కటి యధికముగా నుండునని వేరువేరుగా నుదాహరించుట యుక్తము కాదు. రామాదుల చరితమంతయు నిందుదాహరణము. సచివా

యుక్త సిద్ధులగు వత్సరాజాదులు నాయకులుగా నున్నప్పుడు యథా యోగము ఈ విశేషములు సచివగతములై కూడ విభావము లగు చున్నవి. ఇవి ప్రతినాయక గతములై యున్నను ఉత్సాహ వ్యంజకము లగును. నాయక ప్రతినాయక గతముగా కూర్చునపుడు కవి యథాయోగము వ్యస్త సమస్త భేదకల్పనము చేసికొనుట జాలును. అనుభావములలో స్థైర్యమనునది అచలనము. గాంభీర్య కృతమగు సంవరణము ధైర్యము. శౌర్యము యుద్ధాదిక్రియ. వైశారద్య మనునది సామాద్యుపాయ చతుష్కములో యథావిషయముగ ఒకటి, రెండు, మూడు, నాలుగుగా నియమించుట. వివిధ ధర్మకామాదుల నర్థింప వలయునని తలచి విషాదములేక విస్మయములేక వ్యామోహములేక క్రియాధ్యవసాయము కలవాడై యుండుట యుత్సాహమగును. ఆపదలోగూడ యసంతోషము పొందక మిథ్యాజ్ఞానము విడనాడి తత్త్వ నిశ్చయమున పట్టుదలలో నుండుట యుత్సాహమునకు హేతువగును. రౌద్రమునం దిట్లుకాదు. అది తమఃప్రధానమైనందున యనుచిత బంధాదులుకూడ అందు కలుగ వచ్చును.

౨౬౭. ఉత్సాహాధ్యవసాయాత్ అవిషాదిత్వాత్ అవిస్మయామోహాత్
వివిధా దర్థవిశేషాత్ వీరరసో నామ సంభవతి—

౨౬౮. స్థితి ధైర్య వీర్య గర్వైః ఉత్సాహ పరాక్రమ ప్రభావైశ్చ
వాక్యైశ్చ ఆక్షేపకృతైః వీరరసః సమ్య గభినేయః—

ఉత్సాహము, అధ్యవసాయము, విషాదము లేకుండుట విస్మయ వ్యామోహములు లేకపోవుట. ఇట్టి వివిధ విశేషమున వీరరసము సంభవించును. స్థైర్య, ధైర్య, వీర్య, గర్వములచే, ఉత్సాహ, పరాక్రమ, ప్రభావములచేతను, తిరస్కార వాక్యముల చేతను వీరరస మభినయింప వలెను. ఇందు ఉత్సాహ సమపేక్షితము. బలములేని విషణ్ణ ప్రాయుడగు వానిని ఉత్తేజన మొనర్చుట ఉత్సాహము. "మీ రిట్లుండుడు! మీరు యుద్ధ మొనర్పు" డని సేనాబలమును వ్యాపారింప జేయుటలో భృత్యులకు కర్తవ్యము సూచించి తన లుకుబడిని చెల్లించుట ఇందు అపేక్షితము. వస్త్వంతరములను

సూచించుటకు తత్ప్రధానముగ గంభీర దురవగాహార్థము లయిన వాక్యముల ఆవశ్యకతయు ఇందున్నది.

## ౬. భయానక రసము

భయానక మనెడు రసము భయస్థాయిభావాత్మకము. వికృత రవము, సత్త్వదర్శనము, శివోలూకత్రాసము, ఉద్వేగము, శూన్యాగారము, అరణ్యగమనము, స్వజనవధ, బంధనముల దర్శనము, శ్రవణము, కథనము మొదలగు విభావములచే ఉత్పన్న మగును. ప్రవేపిత కర చరణ నయన, చపల పులక ముఖవైవర్ణ్య స్వరభేదా ద్యనుభావములచే భయానకాభినయము ప్రయోగింప వలెను. స్తంభ, స్వేద, గద్గద, రోమాంచ, వేపథు, స్వరభేద, వైవర్ణ్య, శంకా, మోహ, దైన్య, ఆవేగ, చాపల, జడతా, త్రాస, అపస్మార, మరణాదులు భయానకమున వ్యభిచారులుగా నుండును.

వీరము, భీతాభయ ప్రదాన సారము. వీరానంతరము భయానకము క్రమ ప్రాప్తమైనది. వికృత రస మట్టహాసము. పిశాచముల దర్శనమును సత్త్వ దర్శన మందురు. త్రాసోద్వేగము లితరులందుండునవి. శూన్య భవనము చేరుట, అరణ్యము చేరుట, భయ ముత్పాదించును. స్వజనుల వధ బంధములను ప్రత్యక్షముగ చూచుట ప్రమాణమున వినుట, ఒకప్పు డతిక్రాంత విశేషములను అనుసంధానమొనర్చి స్మరించి తెలియుట, విభావ మగుచున్నది. కంపమాన కరచరణములు భయవ్యంజకము లగును. భయానకములోని పులకము రోమకూపముల ఉన్నతి. స్త్రీ, నీచ, బాలాదులలో భయము గన్పడును. ఉత్తమ, మధ్యమ ప్రకృతులలో భయముండదు. అయిన అట్టివారు కూడ గురువుల వలన, రాజుల వలన, భయము పొందుదురు. అపుడు వారిలో స్వరభేదము, భావ విపర్యయము కలుగును. "అమాత్యులు ప్రభువు లగుదురు. స్వేచ్ఛాచారినైనను నిత్యము భయపడుచునే ఉన్నా"నని యౌగంధరాయణుడే అనినాడు. ఇందు అనుభావములు సుశ్లిష్టములై ఉండవలెను. వానిని చూచి సహజముగ ఈతడు భయపడినాడని గురు రాజాదులుకూడ తలచ వలెను. అస్వాభావికము లైనచో కృతకములుగ నుండి బాగుగా సంగతములు

కావు. బహుతర కాలానువర్తనమున గాని ఆస్వాద్యములు కావు. అపుడు రసత్వము దూరాపేతమగును. స్వాభివికమై అకృతకముగనే ఇవి ఉన్నచో చర్వణములో కాలలవ మేని అపేక్షితము కాదు. వెన్వెంటనే సమాస్వాదము కలుగును. అవయవములు దిగజారి పోవుట, ముఖమున శోషము కలుగుట, అతివేగమున హృదయము స్పందించుట, ఇందుండు విశేషములు.

౨౭౯. వికృతరవ సత్త్వదర్శన సంగ్రామారణ్య శూన్యగృహగమనాత్
గురు నృపయో రపరాధాత్ కృతకశ్చ భయానకో జ్ఞేయః

౨౮౦. గాత్రముఖ దృష్టి భేదై రూరుస్తంభాభి వీక్షణోద్వేగైః
సన్నముఖశోష హృదయస్పందన రోమోద్గమైశ్చ భయమ్

౨౮౧. ఏతత్ స్వభావజం స్యాత్సత్వసముత్థం తథైవ కర్తవ్యమ్
పునరేభిరేవభావైః కృతకం మృదు చేష్టితైః కార్యమ్

౨౮౨. కర చరణ వేపథు స్తంభ గాత్ర సంకోచ హృదయ కంపేన
శుష్కోష్ఠ తాలు కంఠై ర్భయానకో నిత్య మభినేయః.

వికృతధ్వనులు, పిశాచదర్శనము, సంగ్రామ, అరణ్య, శూన్యగృహ గమనము, రాజ గురువులకు అపరాధమొనర్చుట, వీని వలన భయానకము కలుగును. గాత్ర, ముఖ, దృష్టి భేదములచే, ఊరు స్తంభములచే, అభివీక్షణ, ఉద్వేగములచే, ముఖశోష, హృదయ స్పందన, రోమోద్గమములచే భయము నభినయింప వచ్చును. సత్వ సముత్పన్నమగునది స్వభావ జన్యమగు భయము. కృతక భయమును మృదు చేష్టితములచే నొనర్పవలెను. కర చరణ కంపములు, స్తంభ గాత్ర సంకోచ హృదయ కంపములు, శుష్కోష్ఠ తాలు కంఠములు, మొదలగు వానిచే భయానకమును ప్రయోగమున నభినయింప వలెను. ఇందు స్వభావ జన్యమగు భయము రజస్తమః ప్రకృతులు కలిగిన నీచులకు కలుగును. సత్వ గుణ ప్రధానులగు వారలకు సత్వజన్యమగు భయముండును. అది ప్రయత్న కృతము. మృదు చేష్టితములచే నొనర్చునది కృతకము. రాజాదులు కూడ గురువులను దర్శించినపుడు కృతకముగా భయము ప్రదర్శింతురు. మృదువుగా గాత్ర కంపనాదులను ప్రదర్శింతురు. "ఇట్టి కృతకత్వము కేవలము

భయానకమునందే ఉన్నదేమి? అన్నిటి యందును కృతకత్వము రావచ్చునుగదా? ధనార్థిని వేశ్య కృతక రతిని ప్రదర్శించును. ఇట్లే ఇతరములును" అని యొకప్పుడు శంకాతంకము కలుగును. భయము ప్రదర్శింపగా గురువు వినయము కలవాడని గుర్తించును. కృతక శృంగారమున నేమియు పురుషార్థము లేదు. పురుషార్థ విశేషము లభించు విధముననే ప్రవర్తింపవలసి ఉన్నది. ప్రభువగువాడు పరాను గ్రహమునకై కృతకమగు క్రోధ విస్మయాదులను ప్రదర్శింపడు. అట్లాత డొనరించినచో అవి స్థాయిభావములు కావు. కేవలము వ్యభిచారి భావములు మాత్రమగును. కృతకమయిన నకృతకమయినను కర చరణ కంపాదులచే భయానకము నభినయింప వలెనని సూచనము.

## ౭. బీభత్సరసము

బీభత్సమను రసము జుగుప్సాస్థాయి భావాత్మకము. బీభత్సము అహృద్యము, అప్రశస్తము, అప్రియము, అచోక్ష్యము, అనిష్ట శ్రవణదర్శనములు, ఉద్వేజనము, పరికీర్తనము మొదలగు విభావములచే నుత్పన్నమగును. సర్వాంగ సంహార ముఖ వికూణ నోల్లేఖన, నిష్ఠీనోద్వేజనా ద్యనుభావములచేత నభినయము ప్రయోగింపవలెను. అపస్మారము, ఉద్వేగము, ఆవేగము, మోహము, వ్యాధి, మరణము, బీభత్సమున వ్యభిచారి భావములు. ఈ విషయమున పరంపరా ప్రాప్తములగు ఈ ఆర్యలున్నవి.

> ౨౭౩. అనభిమత దర్శనేనచ గంధ రస స్పర్శ శబ్దదోషైశ్చ
> ఉద్వేజనైశ్చ బహుభి ర్బీభత్సరసః సముద్భవతి.
>
> ౨౭౪. ముఖ నేత్ర వికూణనయా నాసా ప్రచ్ఛాదనావనమితాస్యైః
> అవ్యక్త పాద పతనై ర్బీభత్సః సమ్య గభినేయః.

అనిష్టము చూచినందున గంధ రస స్పర్శ శబ్ద దోషములచే నానా విధోద్వేజనములచే బీభత్స రస ముద్భవించును. ముఖనేత్రములను ముడుచు కొనుట, ముక్కు మూసికొనుట, ముఖము వంచుకొనుట, పదముల తడబాటు మొదలగు వానిచే బీభత్సము నభినయింప వలెను. భయానకాంతరము బీభత్సము క్రమప్రాప్త మయినది.

బ్రాహ్మణులకు లశున మిష్టము కానట్లు స్వభావ సిద్ధముగా కొందరి హృదయములకు కొన్ని యిష్టములు కావు. ఆ యీ వస్తువు లప్రియము లగుటలో ధాత్వాది దోషములు హేతువు. శ్లేష్మ బాధితునకు క్షీర మిష్టము కాదు. మలబాధితునకు భోజనేచ్ఛయే పోవును. నిష్ఠీవనము కళ్ళె వెళ్ళ గ్రక్కి ఉమియుట. ఉద్వేజనము గాఢముగా విదలించుకొనుట. దుర్గంధ ప్రవేశమున నాసాప్రచ్ఛాదన ముండును. అవ్యక్త పాద పతనము లనేక విధముల కలుగును. కాలికేదేని రాయి, మేకు, తగిలిన అడుగు దూరము పడును. అస్థి కంకాల వ్యాకులమయిన శ్మశానమున సంచరించునప్పుడు అస్ఫుటముగ నడుగులు వేయుట ఉండును. ఒకప్పు డంగలు చాచి నడచుట, ఒకప్పుడు కొద్దికొద్దిగా అడుగులు వేయుట ఉండును. ఇట్టి వన్నియును భీభత్సాభినయమున కుపయోగించున వగును.

౮ అద్భుత రసము

అద్భుతమను రసము విస్మయ స్థాయి భావాత్మకము. అద్భుతము. దివ్యజన దర్శనము, ఈప్సితార్థ మనోరథ ప్రాప్తి, ఉపవన దేవకులాది గమనము, సభా, విమాన మాయేంద్రజాల సంభావనము, మొదలగు విభావములచే ఉత్పన్న మగును. దాని అభినయమును, నయన విస్తారము, అనిమేష ప్రేక్షణము, రోమాంచము, అశ్రు స్వేద హర్షములు, సాధువాద దాన ప్రబంధము, హాహాకారము, బాహువదన చేలాంగుళి విభ్రమణము మొదలగు అనుభావములచే ప్రయోగింప బడును. స్తంభాశ్రు స్వేద గద్గద రోమాంచ వేగ సంభ్రమ ప్రహర్ష చపల తోన్మాద ధృతి జడతా ప్రలయాదులు వ్యభిచారి భావములు.

రూపకాంతమునం దంతట నద్భుతరసము ప్రయోగింపవలెనని నియమమున్నది. ప్రస్తుత మద్భుతము క్రమప్రాప్త మైనది. దివ్య ప్రాణులు గంధర్వాదులు. ఈప్సితమనునది ప్రాప్తి శక్యమగు పదార్థము. తదితరమగునది మనోరథమని వ్యవస్థ. దేవకుల గమనమును సరస నివేశనాదులు గోచరము లగును. అవి అద్భుత విభావము లగును. విమానాదులు దివ్యరథములు. మాయ యనునది రూప

పరివర్తన క్రియ. ఇంద్రజాలము మంత్ర ద్రవ్య వస్తు యుక్త్యాదులచే సంభవించని వస్తువుల ప్రదర్శించుట. సాధు సాధువని పలుకుట సాధు వాదము. ధనాది దానము నిరంతరము హాహాశబ్ద ప్రయోగము తగిన యనుభావములు. ఈ విషయమున ఈ కారిక లున్నవి.

> ౨౮౫. యత్త్వతిశయార్థ యుక్తం వాక్యం శిల్పంచ కర్మరూపంవా
> తత్సర్వ మద్భుతరసే విభావ రూపంహి విజ్ఞేయం.
>
> ౨౮౬. స్పర్శ గ్రహోల్లుకసనై ర్హాహాకారైశ్చ సాధువాదైశ్చ
> వేపథు గద్గద వచనైః స్వేదాద్యై రభినయస్తస్య.

అతిశయార్థ యుక్తమయిన వాక్యముకాని, శిల్పముకాని, కర్మ రూపముగాని అది సర్వ మద్భుతరసమున విభావ రూపమని తెలియ వలయును. లోక వచనమునకన్న అతిశయముగా నుండు వాక్యము శిల్ప కర్మాదులు సర్వమిందు విభావమగును. స్పర్శగ్రహము, ఉల్లుకసనము, హాహాకారము, సాధువాదము, వేపథు గద్గద వచనములు, స్వేదాదులు నద్భుతాభినయమున కుపయోగించును. స్పర్శగ్రహ శబ్దమున స్పర్శము వలని స్పర్శరూపమగు నభినయమును గుర్తింప వలెను. ఉల్లుకసనము -ఆహ్లాదముతో శరీరము నూర్ధ్వ ప్రవేశమునకు విదలించుట. హాస్యాదులందువలె స్థాయిభావాత్మక వాదమును సాభి ప్రాయముగా గుర్తింపవలెను.

## అవాంతర భేదములు

> ౨౮౭. శృంగారం త్రివిధం విద్యాద్వా జ్నేపథ్య క్రియాత్మకమ్
> అంగ నేపథ్య వాక్యైశ్చ హాస్య రౌద్రౌ త్రిధా స్మృతౌ
>
> ౨౮౮. ధర్మోపఘాతజశ్చైవ తథార్థాపచయో ద్భవః
> తథా శోకకృతశ్చైవ కరుణ స్త్రివిధః స్మృతః
>
> ౨౮౯. దానవీరం ధర్మవీరం యుద్ధవీరం తథైవచ
> రసం వీరమపి ప్రాహ బ్రహ్మా త్రివిధమేవహి
>
> ౨౯౦. వ్యాజాచ్చైవాపరాద్ధాచ్చ విత్రాసితక మేవచ
> పున ర్భయానకంచైవ విద్యాత్ త్రివిధ మేవహి
>
> ౨౯౧. బీభత్సః క్షోభణః శుద్ధ ఉద్వేగీస్యా ద్ద్వితీయకః
> విష్టాక్రిమిభి రుద్వేగీ క్షోభణో రుధిరాదిజః

౭౮౨. దివ్యశ్చానందజశ్చైవ ద్విధా ఖ్యాతోద్భుతో రసః
దివ్యో దర్శనతో దివ్యో హర్షానందజః స్మృతః

ఆయా రసములం దవాంతర భేదము లిందు ప్రదర్శితము లగును. విభావములు ప్రధానములు. ప్రధాన విభావానుగుణముగ ననుభావము లుండును. వాని నింతవరకు నిరూపించుట అయినది. అనుభావము లెట్లానుకూల్యము పొందవలెనో కొంత దిక్సూచన మావశ్యకము. వాఙ్నేపథ్య క్రియాత్మకముగా శృంగారము మూడు విధములు. వాక్య శృంగారము. రాగోద్బోధకములగు వచన రచనలచే ప్రసరించును. నేపథ్య శృంగారము వేష భూషాదుల ఆకర్షణము నుండును. క్రియాత్మక మంగాంగ సంబంధము కలది. హాస్య రౌద్ర రసములు అంగ నేపథ్య వాక్యములచే మూడు విధములు. వాక్య రౌద్రమును స్వభావ రౌద్రమని వ్యవహరింతురు. వాక్యమంతయు స్వభావానుసారిగా ఉండును గదా! కరుణము మూడు విధములు. ధర్మనాశమున కలుగునది; అర్థహాని వలన కలుగునది; శోక కృతముగా కలుగునది అని. వీనిలో మొదటిది ఉత్తములకును కలుగును. అట్టిది శోభన హేతువని ప్రసిద్ధి. ధర్మశబ్దమున అగ్నిష్టోమాది క్రియలను గుర్తించునది. నియమాను సారమున యాగయజనము ప్రతినాయకగతముగా నున్నచో విభావము కాగలదు. దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరమని వీర రసముగూడ త్రివిధ మగుటను బ్రహ్మయె చెప్పినాడు. భయానకము గూడ త్రివిధ మగును. వ్యాజ భయానకము అపరాద్ధ భయానకము; విత్రాసితక భయానకము అని వాని పేర్లు. వ్యాజమున కలుగునది కృతకము. వ్యాజభయానకములో అనుభావ మార్దవము భాసించును. అపరాద్ధ భయానకము అపరాధ మొనరించు చోరాదులకు సంబంధించినది. స్వభావ సిద్ధముగా భయపడు స్త్రీ బాలాదులు తృణము కదలినను భయపడుదురు. అది విత్రాసితక భయానకము. విశేషముగా భయపడువారు విత్రాసితులు. బాలాదు లట్టివారు. భయానకము అట్టివాని ప్రకృతి ననుసరించి యుండుటచే విత్రాసితక భయానకము గురువు మొదలగు వారలకు అపరాధ మొనరించినందున ఉత్తములగువారు కూడ పరమార్థముగా భయావేగములు పొందుదురని కొందరనుట యుక్తముగ లేదు.

భయమనునది వినాశ శంకాత్మకము. ఉత్తములందు సంభవింపదు. భయము స్త్రీ నీచ ప్రకృతికమని లోకప్రసిద్ధి యున్నది. భీభత్సము శుద్ధము. ఉద్వేగి అని రెండు విధములు. క్షోభ మాపాదించునట్టిది. రుధిరాది జన్యమగునది శుద్ధ భీభత్సము. విష్ఠా క్రిమి కీటకములచే నుద్వేగి భీభత్సము కలుగును. దీని నిట్లు స్పష్టముగా గుర్తించునది. రుధిరాంత్రాది దర్శనమున గలుగు భీభత్సము క్షోభకారి యగుట వలన శుద్ధము. ఇష్టాదులవలన కలుగునది ఉద్వేగి. అది హృదయమును చలింప చేయును. అశుద్ధ విభావక మగునది యశుద్ధము. అభినవోపాధ్యాయుల భట్టశోతు లిట్లనిరి. శుద్ధభీభత్స మిట్లుండును. సంసార నాట్య నాయక రాగములకు ప్రతిపక్షముగా నుండి, మోక్షసాధనమై విభావ విశేషమున గలుగు భీభత్సము శుద్ధము. శోకమున తన శరీరము చూచియు జుగుప్స పడుటను కవులు వర్ణించుచునే యున్నారు. కావున భీభత్సముకూడ నిట్టి విశేషముతోకూడి త్రివిధమగును.ముని భరతుడు రెండు విధములుగా భీభత్సమును చెప్పుట నిట్టిది దుర్లభము కాదని ప్రచురము సూచించుటయే. అద్భుతరసము దివ్యము. ఆనందజన్యమని ద్వివిధము. దివ్యదర్శనమున దివ్యము కలుగును. హర్షమున నానందజన్య ముదయించును. దివ్యాద్భుతమునందు సభా విమానాదులనుభావములుగా నుండును. మనోరథావాప్తిచే కలుగు నానందమున రెండవ యద్భుత ముదయించును. ఇట్లీ విధముగ రసవిషయమున విభావాదులు నిరూపితములైనవి. ఈ నిరూపితములనే గాక నిరూపించని విభావాదులను గూడ నూహించి గుర్తింప వచ్చును.

౯. శాంతరసము

శాంతరసము శమ స్థాయిభావాత్మకము. మోక్షప్రవర్తకము. అది తత్త్వజ్ఞానము, వైరాగ్యము, ఆశయశుద్ధి మొదలగు విభావాదులచే కలుగును. శాంతాభినయమును యమ నియమములు, అధ్యాత్మ ధ్యాన ధారణములు, ఉపాసనము, సర్వభూతదయ, సన్యాసస్వీకారము మొదలగు ననుభావములచే ప్రయోగింప వలెను. నిర్వేద,

స్మృతి, ధృతి, పర్యాశ్రమ, శౌచ, స్తంభ, రోమాంచాదులు శాంత రసమున వ్యభిచారిభావములు.

౨౮౩. మోక్షాధ్యాత్మ సముత్థ స్తత్త్వజ్ఞాన అర్థహేతు సంయుక్తః
నైశ్శ్రేయసోపదిష్టః శాంతరసో నామ సంభవతి

౨౮౪. బుద్ధీంద్రియ, కర్మేంద్రియ, సంరోధా ధ్యాత్మ సంస్థితోపేతః
సర్వప్రాణి సుఖహితః శాంతరసోనామ విజ్ఞేయః

౨౮౫. న యత్ర దుఃఖం, న సుఖం, న ద్వేషో నాపి మత్సరః
సమస్సర్వేషు భూతేషు స శాంతః ప్రథితో రసః

౨౮౬. భావా వికారా రత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతే ర్జాతః పున స్తత్రైవ లీయతే

౨౮౭. స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పున ర్నిమిత్తాపాయేచ శాంతమేవోపలీయతే

మోక్షాధ్యాత్మజన్యము, తత్త్వజ్ఞాన ఫలకమయిన హేతువులు కలది, నిశ్శ్రేయసోపదేశము కూడినది శాంతరసము కలదు. బుద్ధీంద్రియము లను కర్మేంద్రియముల నిగ్రహించి అధ్యాత్మికమగు సంస్థానముతో కూడుకొని సర్వప్రాణి సుఖహితముగా శాంతరసము సర్వప్రసిద్ధ మైనది. అందు దుఃఖము లేదు. సుఖము లేదు. ద్వేషము లేదు. మత్సరము లేదు. సర్వభూతములందది సమము. అట్టిది శాంతరస మని ప్రథిత మగుచున్నది. రత్యాది భావము లన్నియు వికారములు. శాంత మొక్కటియే ప్రకృతి. వికారము ప్రకృతివలన కలుగును. మరల ప్రకృతియందే విలీనమగును. స్వ స్వ నిమిత్తము ననుసరించి శాంతమువలన భావము ప్రవర్తిత మగుచున్నది. నిమిత్తము తొలగి పోగా భావము సర్వము శాంతమునందే విలీన మగుచున్నది.

## శాంతాక్షేపము

నాట్యరసము లెనిమిది అని కొందరనిరి. నవరసములని కొందరు పఠింతురు. నవరసమత మనుసరించి శాంత స్వరూపమిక వ్యాఖ్యానింతము. కొందరు శాంతము లేదందురు. శాంతము ఇత రములం దంతర్భవించు నందురు. వాని వాని జెప్పి శాంతరస సిద్ధాంతము నిరూపించుట సముచితము. శాంతప్రియు లిట్లందురు.




శాంతము శమ స్థాయిభావాత్మకము. తపస్సు యోగి సంపర్కాది విభావములచే అది ఉదయించును. దానిని నిర్వేదభావ రూపములైన అనుభావములచే అభినయింప వలెను. ధృతి మతి ప్రభృతులిందు వ్యభిచారులని ఈ వాదమును కొందరు సహింపలేకున్నారు. శమ శాంతములు పర్యాయములు. భావములు నలుబది తొమ్మది యన్న పరిగణన మున్నది. శాంతమును రసముగా నంగీకరించిన నలుబది తొమ్మిది యన్న సంఖ్యను త్యజింప వలసి యుండును. ముప్పది మూడు వ్యభిచారులు, సాత్త్వికము లెనిమిది. స్థాయి భావము లెనిమిది. మొత్తమీ నలుబది తొమ్మది పరిగణితములు. మరియు నిది సంభావనీయము. ఋతు మాల్యాది విభావములు సమ నంతరముననే కలుగు శృంగారాదులలో ననుప్రసృతము లగుననిరి. తపము, అధ్యయనము మొదలగునవి శాంతమున విభావములు కాజాలవు. తత్త్వజ్ఞానమునకది అనంతర హేతువులు. కామాదులు లేకుండుట కూడ అనుభావము లనజాలము. సర్వ చేష్టలయు పరమ మైన్నదును ప్రయోగ యోగ్యము కాదు. సుప్త మోహాదులు వంటిది కూడ నిశ్వాసోచ్ఛ్వాసములచేత భూశయనాదులచే నింకనిట్టి చేష్టలచే ననుభావములు కావలసి యున్నవి. ధృత్యాదులు వ్యభిచారు లంటిమి. అవిమాత్ర మెట్లు శాంతమున వ్యభిచారులు కాగలుగును? ప్రాప్త విషయముల ననుభవించుట దాని వలన కలిగిన స్థిర చిత్తత, ధృతి స్వరూపము, లభించిన దానితో సంతుష్టి పడుట అనునట్టి ధృతి వ్యభిచారి యగునా? కేవల మకించిత్కరత్వమున తత్త్వ జ్ఞానోపాయము వృత్త్యాదితము కాజాలదు. పరదుఃఖ దుఃఖిత మనస్కులు కొందరున్నారు. వారేమియు నొనరింప జాలరు. వారలందు తత్త్వ జ్ఞానోపాయ మేది? కొందరు సమ్యగ్దర్శనమున సమావస్థను పొందియుందురు. అట్టి నిశ్చలభావముతో వారు సంసారమున సంచరించుచునే యుందురు. ఇక శాంతమన్న రసమెట్లు సంభవించును? శాంతరసము లేనే లేదు.

## శాంతము రసమే.

ఈ విషయమున నీ యంశమును సిద్ధాంతము చేయదలచితిని.

ధర్మార్థ కామములు మూడును పురుషార్థములు గదా! మోక్షమును పురుషార్థము. ఈ మోక్ష పురుషార్థము నానా శాస్త్రములందు నిరూపిత మైనది. స్మృతేతిహాసాదులలో ప్రతిపాదిత మైనది. ఉపాయ ప్రదర్శన పురస్సరముగ వ్యుత్పాదిత మైనది. అంతట సముచిత ప్రాధాన్యము కలిగి యున్నది. ఇది యంతయు సుప్రసిద్ధము. శాంతము రస మేల కాదు? కామాదుల విషయమై సముచితములగు చిత్తవృత్తులు రతి మొదలగు శబ్దవాచ్యములై యున్నవి. అవి కవి నట వ్యాపారమున సమాస్వాద యోగ్యతను పొందుచున్నవి. అట్టి హృదయ సంవాదము పొందిన సామాజికులందు శృంగారాది రసములై యాస్వాద్యములై నవి. అదే విధముగ మోక్షమనెడు పరమ పురుషార్థమునకు దగిన చిత్తవృత్తియు హృదయ సంవాద భాజనమైన సహృదయులకాస్వాద్యమానమై రసత్వము పొందును. ఇందు రసతాసిద్ధి లేదనుటలో యుక్తి గోచరింపదు. అట్టి పరమ పురుషార్థోచితమైన చిత్తవృత్తియె యిందు స్థాయిభావము. దీని స్థాయిభావ విషయమున నీ విషయమును సమీక్షింపవలెను. ఈ స్థాయిభావ మిట్టిది. ఈ నిర్వేదమన్నది ఏమి? నిర్వేదము తత్త్వజ్ఞాన జన్యమని కొందరందురు. దారిద్ర్యాదుల వలన కలుగు నిర్వేద మొకటి ఉన్నది. దానికన్న నిది వేరు కావలయును. తత్త్వజ్ఞానము దారిద్ర్య విలక్షణ మైనందున, తత్త్వ జ్ఞాన ప్రభవ నిర్వేదమును విలక్షణమే యనవలయును. కావుననే స్థాయి భావములను చెప్పి సంచారి భావములను నిరూపింప దలచి తన్మధ్యమున ముని నిర్వేదము పఠించినాడు. అమంగళ ప్రాయమైన నిర్వేదము మాంగళికమని ఇచట నిరూపించినాడేమి? ఇందిది భావమై యుండవచ్చును. నిర్వేద మమంగళ ప్రాయమె యగు గావుత! అయినను వ్యభిచారులలో ప్రథమముగా పరిగణించుట సాభిప్రాయము. ఈ నిర్వేద మొకప్పుడు స్థాయిభావమగును. అట్టి స్థాయితా కథనమునకె యిట్లు ప్రాధాన్యమిచ్చి నిరూపించుట యని త దభిప్రాయము. తత్త్వజ్ఞాన జన్యమైన నిర్వేదము తదన్య స్థాయిభావముల కుపమర్దకము. రత్యాదిభావము లన్నియు భావ వైచిత్ర్యమును సహింపగలవు. ఈ నిర్వేదము నందది లేదు. నిర్వేదము పరమస్థాయి శీలము. ఇది స్థాయ్యంతరముల నన్నిటి నణచి పెట్టును. దారిద్ర్యాదుల వలన

కలిగిన నిర్వేదము శోక ప్రవాహ ప్రసరణ రూపమగు చిత్తవృత్తి విశేషమునకు వ్యభిచారి యగును. కాన తత్త్వజ్ఞాన జన్యమైన నిర్వేదమే శాంతస్థాయి.

## శమము స్థాయి

నిర్వేదము స్థాయి యనినప్పుడు వేరొక పర్యనుయోగమున కవకాశము కలుగుచున్నది. తత్త్వజ్ఞానజన్య నిర్వేదము స్థాయి అని చెప్పుట సమ్మతమైనచో తత్త్వజ్ఞానమే విభావమని అనవలయును కదా ! అట్లనలేదేమి ? వైరాగ్య బీజము విభావ మనెను. అందు విభావత్వ మెట్లున్నది ? తత్త్వ జ్ఞానమునకు వైరాగ్య బీజాదులు ఉపాయములందురు కాబోలు ! అట్లైన నేమి యనినట్లైనది ? నిర్వేద కారణము తత్త్వజ్ఞానము. తత్త్వజ్ఞాన కారణము వైరాగ్యబీజ మని నట్లైనది. కాగా వైరాగ్యాదులందలి విభావత్వావ్యవహారము కారణ కారణముగా నున్నదనవలెను. అట్లనుట అత్యంతమతిప్రసంగము. నిర్వేదము వైరాగ్యరూపము "ఎచ్చట నేదియు నుపాదేయము కాదు." అనెడు జ్ఞానమును కలుగ జేయునది. కల్గి నిర్వేదము తత్త్వ జ్ఞానము నకే యుపాయ మగుచున్నది. విరక్తుడగువాడు తత్త్వజ్ఞానోదయమున కనుకూలముగా ప్రయత్నపడును. తత్త్వజ్ఞానమున మోక్షము కలుగును. అంతియేకాని తత్త్వము తెలిసి నిర్వేదము పొందుట కాదు. "నిర్వేదమున మోక్షము కలుగు" ననుట యుక్తము కాదు. వైరాగ్యమున ప్రకృతి లయము కలుగునని కదా ! పూజ్యులు పలికిరి. తత్త్వ జ్ఞాని యగు వానికి పృథక్తర వైరాగ్య మంతట నుండ వచ్చును. అట్టి వైరాగ్యమె జ్ఞానమునకు పరాకాష్ఠ. కాన తత్త్వజ్ఞానమె స్థాయి కావలెను. వైరాగ్యము తత్త్వజ్ఞాన మాలా పరంపరచే పరిపోషము పొందును. కావున నిర్వేదము స్థాయికాదు. తత్త్వజ్ఞానమె స్థాయి కావలసి యున్నది. తత్త్వజ్ఞానము శమము. శమమె స్థాయి యనుట సముచితముగ నుండును.

"పాదుగుగల గోవని కోడెమాడచే వ్యర్థముగ పితికినాడు" "యువతియని లావణ్యము లేని షండు నాలింగనము చేసికొనినాడు" "వైడూర్య మనుకొని కంచుముక్కనే యాశించినాడు." గుణములు

లేని కృపణు నిన్ను ప్రణమించు మూఢుడేమి గొనెనర్వ లేదు? దీనిలో చిరకాలము భ్రమపడి వంచితుడై స్వీకార్య మేదియు లేదని తెలిసి సమ్యక్ జ్ఞానము పొందిన వాని స్థితి యున్నది. ఇది నిర్వేద మగునా? తత్త్వజ్ఞాన మగునా? సంశయ మక్కరలేదు. ఇది ఖేదరూపమైన నిర్వేదము. ఇది తత్త్వజ్ఞానములోని భావము కాగలదు. అక్షపాద పాదులు విషయ గంధము మిథ్యాజ్ఞాన మూలమనిరి. మిథ్యాజ్ఞానము తత్త్వజ్ఞానమున నశించు ననిరి. ఆ తత్త్వజ్ఞానము వైరాగ్యమునకు కారణమని వారు తలచినట్లే కదా! "దుఃఖ జన్మ ప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానాం, ఉత్తరోత్తరాపాయే తదనంతరాపాయాత్ అప వర్గః."

ఇట్లు వారనినంత మాత్రమున నేమైనది? వైరాగ్యమె నిర్వేదము కాలేదా? అట్లని ఎవరనిరి? వైరాగ్య నిర్వేదములకు భేద మున్నది. రాగాదుల ప్రధ్వంసము వైరాగ్యము. శోక ప్రవాహ ప్రసర రూపమగు చిత్తవృత్తి విశేషము నిర్వేదము. పోనిండు, వైరాగ్యమె నిర్వేదమని తలచుడు! ఈ వైరాగ్య నిర్వేదము స్వకారణ వశమున మధ్య కలుగునదే కాని మొదటినుండి యుండదు. సాధ్య మోక్షమున వైరాగ్యము సూత్ర స్థానీయము కాలేదు. అదియుగాక ఇది తత్త్వజ్ఞాన జన్యమగుట శమమునే చెప్పినట్లైనది. శమమునకే నిర్వేద నామము పెట్టినట్లైనది. మే మనిన శమమె స్థాయి యనెడు భావము పోషించి నట్లైనది. శమ, శాంతములు పర్యాయము లను కొందురు కాబోలు! అట్లు తలచ నక్కరలేదు. హాస హాస్యములు పర్యాయములు కావు. అవి సిద్ధ సాధ్యములు లౌకికాలౌకికములు. సాధారణా సాధారణములు. శమ శాంతములు కూడ నిట్టివె. ఇంతటి వైలక్షణ్య ముండగా శమ శాంతములు పర్యాయము లనరాదు. సముచిత చిత్తవృత్తి హృదయ సంవాదమున సహృదయులలో రసీకరించుట యన్నది శమమున నున్నది. శమ చిత్తవృత్తియె పరపురుషార్థోపచితమై శాంత రసత్వము పొందు ననవలెను.

### రత్యాదులందొకటి స్థాయి

కొందరీ విధముగ భావింతురు. రత్యాది చిత్తవృత్తి విశే

షము రెసిమిది యున్నవి. అవియె తగిన విభావముల గూడి రసీభ
వించును. ఇంకను విభావ విశేష సంశ్రయము కలవై విచిత్రముగా
భాసించును. అట్లు చిత్ర విచిత్రములగు వాని యందొకటి శాంతము
నందు స్థాయి కావచ్చును. వివిక్త సేవనము, శ్రుతము, స్వాత్మ
విషయమైన రతిని పోషించును. అట్టి స్వాత్మరతియె మోక్ష సాధన
మనియు, అట్టి రతియె స్థాయిగా నుండుననియు శాస్త్రకారు లనిరి.
ఆత్మ రతియగు మానవుడు ఆత్మతృప్తుడై ఆత్మ సంతుష్టుడే యగు
నేని అతడాచరింప వలసినది లేదు. అని గీతాగురు వనినాడు. సర్వ
విషయములను వైకృతముగ చూచినపుడు విశ్వ విశ్వమును శోచ్య
ముగ పరిశీలించినపుడు, సాంసారిక వృత్తాంత మంతయు నపకారియని
గుర్తించి నపుడు, అసమ్మోహ ప్రధానమగు సాతిశయ వినయ ముద
యించును. అట్టి వినయము నాశ్రయించిన మానవుడు సర్వలోక
స్పృహణీయమైనను ప్రమదాది బాహ్య విషయ సర్వస్వము సంత
సేవగించు కొనును. సాతిశయమగు వినయ ప్రకర్షమున విస్మయ
పడును. అట్టి వానికి మోక్ష సిద్ధి యున్నది. కావున వీనిలో నన్య
తమ మేదేని స్థాయి కాదగును అని.

## మునిమత విరుద్ధము

కాని ఇది ముని మతము కాదు, భరతుడు దీని సమ్మతింపడు.
ముని భరతుడు విశిష్ట విభాగములను పరిగణించు చున్నాడు. అట్టి
వాని నితరములను పరిగ్రహించు చున్నాడు. దీని నంతను పరిశీ
లింపగా నిది నిశ్చితమగును. అలౌకిక హేతు సామగ్రిచే రత్యాదు
లపవర్గ విషయము లగుట నంగీకరింప వచ్చును గాని వానిలో నొకటి
స్థాయి యగుట కిష్టపడడు. రత్యా ద్యనేకములలో నే యొకటియు
స్థాయి కాలేదు. వాని స్వరూప తత్త్వము పరిశీలింపగా స్థాయిత్వము
సుదృఢ మనలేము. శిథిల ప్రాయముగా గోచరించును. ఉపాయ
భేదమున నేదేనియు స్థాయి కావచ్చు ననుటయు భావ శైథిల్యమునే
సూచించును. రత్యాదులలో నేదేని యొకటి శాంత స్థాయి యనుట
సంగతముగా లేదు.

## అన్నియు కలసి స్థాయి

రత్యాదులన్నియు పానక రసము వలె విభాగము లేనివై సంకీర్ణము లగును. పానకమునందు గుడ మరీచ్యాదు లెన్ని కలసి నను సమాస్వాద సమయములో వేరు వేరుగా గోచరింపవు. అన్నియు వ్యామిశ్రములై ఏక విధమున భాసించును. అట్లే రత్యాదులును. కాన శాంతమునందు విభాగ హీనములైన రత్యాదులన్ని స్థాయి భావములు కావచ్చునని కొందరందురు గాని నిదియు మనోజ్ఞము కాదు. చిత్తవృత్తు లెప్పుడును సమకాలమున కలుగవు. తత్సమయములో తదన్యోదయము విరోధము. అవిభాగమున రత్యాదు లుండు ననుట భావ తత్త్వము కాదు. ఇంతగా వాద గోష్ఠిలో స్థాయి కాదగినది కన్పడుట లేదు. అయినచో నిక శాంత స్థాయి ఏది అని పించును. ఇట మీదట నాయంశమునే వివరింతుము.

## సిద్ధ స్థాయిత

తత్త్వజ్ఞానమె మోక్షసాధనము. కావున మోక్షమున తత్త్వ జ్ఞానమె స్థాయి యగుట సముచితము. తత్త్వజ్ఞాన మనునది ఆత్మ జ్ఞానమె. ఆత్మ యొక్క జ్ఞానము ఆత్మజ్ఞానము. ఇట్లన్నను జ్ఞాన మాత్మేతరమన నక్కర లేదు. ఆత్మగ్రాహ్య మాత్మజ్ఞానము. ఇది ఇంద్రియ జన్య జ్ఞానాదులకన్న వేరు. ఈ యంశ మాకరములందు వితతముగా నున్నది. జ్ఞానానందాది విశుద్ధ ధర్మయుక్తమగు యాత్మయే పరికల్పిత విషయోపభోగము లేనిచో, శాంతమున స్థాయి యగును. ఇది నిత్యస్థాయి. ఇదె సిద్ధస్థాయి భావము. ఇది స్థాయియని వేరుగా వచింప నక్కర లేదు. రత్యాది చిత్తవృత్తులు తత్తత్కార ణాంతర సముదయమున నుత్పన్నము లగును. కారణాంతరముల ప్రళయమున నిరుద్ధము లగును. ఉత్పద్యమానములు నిరుధ్యమాన ములు అగునవి స్థాయి రూపాత్మ భిత్తి నాశ్రయించినవై అపేక్షా కృతముగా స్థాయి భావములని అనుచున్నాము. వానియందు సహజ ముగ స్థాయిత్వము లేదు. తత్త్వజ్ఞాన మనునది సకల భావాంతరము లకును భిత్తిస్థానము. సర్వ స్థాయిలకన్నను స్థాయితమము. రత్యాది చిత్తవృత్తుల నన్నిటిని వ్యభిచారి భావములనుగా నొనర్చును.

కావుననే నిసర్గ సిద్ధముగ సిద్ధస్థాయి భావమని గుర్తింప వలెను. ఇదియే కారణముగ ముని దీనిని వేరుగా గణింప లేదు. వేరుగా పరిగణనము కూడ యుక్తము కాదు. ఖండము, ముండ మున్నచో వాని మధ్యలో గోత్వ మిది మూడవది యని ఎవరును పరిగణింపరు. కాబట్టి నలుబది తొమ్మిది భావములను భరతుడు పరిగణించుట యుక్తమే అగును. తత్త్వజ్ఞానమునకు పృథగ్గణన మెట్లందురు కాబోలు? పృథగాస్వాదమున్నందున సర్వము సంగతమగునని యందుము. రత్యాదిభావములకు తత్త్వ జ్ఞానమునకును భేద మున్నది. రత్యాదులు ఇతర సంపృక్తములు కొంతగా లౌకిక ప్రతీతికవి గోచరము లగును. చిత్తవృత్త్యంతరముల సంబంధమున కలుషము లగును. తత్త్వజ్ఞాన మట్లుకాదు. సమాధితర సమయమున ననుసంధీయమాన మగును గాని వికల్ప రహితముగనే ఉండును. ఇం దేమాత్రము లౌకిక ప్రతీతి లేదు. లోకమున నిది కొంతగా భాసించు గావుత! అయినను ఇతర స్థాయిభావముల పరిగణించునట్లు దీని పరిగణింప నక్కర లేదు. శాంతేతరములైన రసములందు ఈ సిద్ధస్థాయి యుప యోగము లేదు. ఇది ఎన్నటికిని వ్యభిచారి భావముల వలె లక్షణీ యము కాదు. వ్యభిచారిత్వము సంభవింపదు. సామాన్యముగా వ్యభి చారులు వైచిత్ర్య మాపాదించునవియగును. ఇది అట్లు కాదు. శమైక స్వభావక మగునిది శమము అనికూడ వ్యపదేశింప తగును. శమమని నిర్వేదమని దీనినన్నచో భావమని యనరాదు. ఈ నిర్వేదములోక నిర్వేదముకన్న విలక్షణము. దారిద్ర్యాదుల వలన లోక నిర్వేదము కలుగును. తత్త్వజ్ఞానము, శమస్థితి, సర్వమిది యాత్మ స్వరూపము. రత్యాదులనునవి యాత్మ యందలి కాలుష్యోపరాగ విశేషములు. ఇది రత్యాదుల ననుగమించినను అవ్యవధానమున సమాధి బలమున విశుద్ధ రూపముతోడనే యుండును. సమాధినుండి వ్యుత్థిత చిత్తుడైనను ప్రశాంతముగనే ఉండును. తత్త్వజ్ఞాన స్వరూపమైన స్థాయిభావము నకు సర్వవిధ లౌకికాలౌకిక చిత్తవృత్తి కలాపము వ్యభిచారి యగును. యమ నియమాదులు తత్త్వజ్ఞానా నుభావములుగా నున్నవి. అంగో పాంగా భినయములును తత్త్వజ్ఞానమున నున్నవి. వానినే స్వభావా భినయములని నిరూపింప దలచితిమి. అట్టి వన్నియు తత్త్వజ్ఞాన

విషయములే యగును. అభినయముల స్వభావమే అట్టిది. ఈశ్వరా
నుగ్రహాదులు కూడ విభావ రూపమున తత్త్వ జ్ఞానమున కుపష్టంభము
సంపాదింప వచ్చును. నాశోన్ముఖములైన రత్యాదు లింక ఆస్వాద్య
ములు కావు. విప్రలంభమున నౌత్సుక్యము, రౌద్రమున నుగ్రత,
కరుణ, వీర, భయానకాద్భుతములలో నిర్వేద ధృతి త్రాస హర్ష
ములు, వ్యభిచారి భావములు ప్రధానముగా నవభాసించునట్లు రాగ
ప్రతిపక్షమైన జుగుప్సలో రాగాత్మకములు ముఖ్యముగా భాసింపవు.
దయ యను పేరుగల పరోపకార ప్రయత్న రూపమైన నుత్సాహ
మిం దంతరంగముగ నుండును. స్వాత్మ సంతృప్తుడు, పరార్థ ఘటనో
ద్యుక్తుడు కావచ్చును. ఇట్లుత్సాహ మంతరంగముగ నున్నదని,
కొందరు దయావీరమని, ధర్మవీరమని, తత్త్వ జ్ఞానమును వ్యప
దేశించిరి.

ఉత్సాహ మెల్లప్పు డహంకార ప్రాణము. శాంతమున నహం
కార శైథిల్యముండును. విరుద్ధముగా నుండునది రతిలో నిర్వేదము
వలె వ్యభిచారిగా నుండవచ్చును. పరోపకార కరణమున నుత్సా
హమె ప్రకర్షముతో నుండును. ఏ యవస్థయు నుత్సాహ శూన్యముగ
నుండదు. ఇచ్ఛాప్రయత్నములు లేక నేదియు నుండదు. స్వాత్మో
ద్దేశమున నుండు తత్త్వజ్ఞానికి కర్తవ్యాంతర మేమియు మిగులదు.
శాంత హృదయులు కొందరు పరోపకారమునకై శరీర సర్వస్వ మర్పిం
తురు. అది శాంత విరోధికాదు. అకృత కృత్యులకు 'ఆత్మానం
గోపాయేత్' అని శరీర రక్షణ ముపదిష్ట మగుచున్నది. సన్యాసులకు
శరీర రక్షాది తాత్పర్యమె ఉండదు. చతుర్వర్గ సాధకత్వమే దేహ
రక్షణమున నిదానము. కృతకృత్యుడగు తత్త్వజ్ఞాని, వీతరాగి సన్యాసి,
జలాగ్ని శ్వభ్రములలో దుముక వచ్చుననియే ఉన్నది. అట్టి
వాడెట్లైన శరీరము త్యజింప వచ్చును. అట్టి శరీరము పరార్థమె
త్యజింప బడునేని సర్వము సంపన్న మైనట్లే. దేహాత్మ మానవులకు
దేహమె సర్వస్వము. ధర్మాదులు నిర్దేశింపక పరార్థమై త్యాగమట్టి
వారలకు సంభవింపదు. యుద్ధమందును పర పరాజయమునకై ప్రవ
ర్తించుటయె కాని శరీర త్యాగమునకై యుద్యమింపరు. శుభతర

మగు దేహాంతరము సంపాదింప వలెననియే కొందరు భృగుపతన మొనరింతురు. స్వార్థ ముద్దేశింపక కేవలము పరార్థ సంపత్తికై ప్రయత్నించుట, దేహత్యాగ పర్యంత ముపదేశ మిచ్చుట, ఆత్మ జ్ఞానము లేని వారలకు కుదరనే కుదరదు. తత్త్వ జ్ఞానులగు వారు ఏ ఆశ్రమ మందున్నను ముక్తి భాజను లగుదురని స్మార్త వచన మున్నది. తత్త్వజ్ఞాన నిష్ఠుడు గృహస్థుడును ముక్తు డగునట! బోధి సత్త్వులు కొందరున్నారు. పరార్థమై ప్రయత్నించుటయె వారి ధర్మము. పరోపకారమె ఫలమని భావింతురు. ఇట్టి అభిసంధి వారలకు దృఢ మున్నది. అందుననే వారలకు తదుచిత దేహమే కలుగును. పరోపకారమున త్రివర్గ సంపత్తియే ప్రధానమని భావించు వారు అల్పు లుందురు. అర్థ కామోత్తర మైన సర్వ చరితము సకల లోక హృదయ సంవాదమున సుందర ప్రయోజనముగ నాటకమున నుంచవలెనని లక్షణకారు లనిరి. తత్త్వజ్ఞానమునకు తగిన బీజ సంస్కారములచే భావితులగు వారు ఇందు హృదయ సంవాదము పొందగలరు. కాన శాంత మున్నదని అంగీకరింప వలెను. చిరంతనుల పుస్తకములందు శమ స్థాయి భావాత్మకమైన శాంత మనెడు రసమును భరతుడు లక్షణ పురస్సరముగ నిరూపించుట గోచర మగుచున్నది. ఇదియు నిచట ముఖ్యముగ పరిగ్రాహ్యము. సర్వరసములు సమాస్వాదమున శాంత ప్రాయముగనే ఉన్నవి. విషయ వ్యావృత్తి వలన కలుగునదియే కాదు. రసమునకు సంబంధించిన పర్యంతాస్వాదము సర్వము శాంత స్వరూపముగనే ఉండుట రస విమల కతి గోహితము; శాంతముత్కృష్ట సర్వశ్లాఘముతో నున్నది. ఇతరములు సంస్కారాంతర ములతో నుండును. ఇది యట్లుకాదు. సర్వ రసములకిది ప్రకృతి. సామాన్యముగా నుండు దానిని వేరుగా పరిగణించక పోవుట లోకమునగూడ విశ్రుతము. శాంతస్థాయి సామాన్యాత్మక మగుట వేరుగా పరిగణితము కాలేదు. వివేచకులగు వారు సామాన్యమును విశేషములతో కలియ గలపరు. సామాజికాస్వాదము వివేచకత్వము నవలంబించి యుండును. శాంతమును వారి ప్రతీతిలో విషయమై యుండును. కాన శృంగారాదులకన్న నిది పృథగ్భాతము.

## శ్రీ సిద్ధాంత శాస్త్రము

ఇతి హాసములలో, పురాణములలో, శబ్దకోశములలో రసములు తొమ్మిది అనియే ప్రతీతి యున్నది. శ్రీమత్సిద్ధాంత శాస్త్రము లందును శాంతమును నిరూపించినారు. 'అష్టానా మిహ దేహానాం శృంగారాదీన్ ప్రదర్శయేత్, మధ్యేచ దేవదేవస్య శాంతం రూపం ప్రకల్పయేత్.' ఎనిమిది మంది దేవులకు శృంగారాదు లెనిమిది రసములను నిరూపింప వలెను. అష్టదేవుల మధ్యలో దేవ దేవునకు శాంతరూపము కల్పింప వలెను, అని సిద్ధాంత శాస్త్రము చెప్పినది. శాంతమునందు వైరాగ్య సంసార భీరుత్వాదులు విభావములు. వైరాగ్యాదులు నిరూపింప శాంతము సుజ్ఞాత మగును. మోక్ష శాస్త్ర చింతాదు లనుభావములు. నిర్వేద, మతి, ధృతి, స్మృత్యాదులు వ్యభిచారి భావములు. భక్తి శ్రద్ధ లనునవి ఈశ్వర ప్రణిధాన విషయముగనే ఉండును. వానిని వేరు రసములని అన నక్కరలేదు. ఈ నిరూపణ సముచితముగ ఈ సంగ్రహ కారికను భావింప వచ్చును.

౧౮౮. మోక్షాధ్యాత్మ నిమిత్తః తత్త్వజ్ఞానార్థ హేతు సంయుక్తః
నిశ్శ్రేయసధర్మయుతః శాంతరసోనామ విజ్ఞేయః

ఈ కారికలో మూడు విశేషము లున్నవి. మూడింటిలో విభావ స్థాయ్యనుభావ యోగము నిదర్శిత మైనది. తమతమ నిమిత్త మను సరించి శాంతము వలన భావము కలుగునని, నిమిత్తము తొలిగిపోగా, శాంతము నందే భావము లయించునని భరతుడనుట భావగర్భముగా నున్నది. శాంతము సర్వప్రకృతి యని చెప్పినట్లైనది.

శాంతాస్వాద మీ విధముగా నుండును. ఉత్సాహ రత్యాదు లన్నియు నుపరాగము సంపాదించును. ఆత్మ స్వరూపమునందు వాని వలన నొక యుపరంజనము కలుగు చున్నది. ఉపరక్తమైన ఆత్మ స్వరూపమె వానియం దనుభూత మగును. దారమున దూరదూర ముగా రత్నములను కూర్చినపుడు రత్నాంతరాళమందు సితతరముగా సూత్రము నిర్భాసించును. రత్యాదు లుపరంజకముగా నున్నప్పుడు వానియం దాత్మ స్వరూప మట్లే సిత సూత్రమువలె గోచరించును. రత్యాదు లేవియు నుపరంజకములుగా లేకపోయినను ఆత్మ భావము

వలె శాంతము భాసించును. ఇట్లు భాసమానమగు నిది సకల దుఃఖ జాల హీనమై పరోన్ముఖత్వ మిచ్చునదై పరమానంద లాభమున సంవిదేకరూపమై విభాత మగును. ప్రయోగ ప్రబంధముల మహిమచే సాధారణ రూపమున నిర్భాసించి అంతర్ముఖా వస్థాభేద మున లోకో త్తరానంద మిచ్చి సంవిన్మయమగు హృదయ సంవాద మగును. ఇది దీని తత్త్వాస్వాద ప్రక్రియ.

ఇట్లే రసములు తొమ్మిదియే. ఇవియే పుమర్థో పయోగులు. రంజనాధిక్య ముండుటను బట్టి ఇవియే ఉపదేశింప దగినవి. వీని కతిరిక్తముగా రసాంతరములు సంభవింపవు. ఆర్ద్రతా స్థాయికముగా స్నేహము రసమని కొంద రందురు. గంధ స్థాయికముగా లౌల్య రసమని కొంద రందురు. ఇట్లే భక్తియు రసమను వారునున్నారు. ఇట్లనుట రసహృదయము కాదు. ఇవన్నియు రత్యుత్సాహాదులందే పర్యవసించును. లక్షణ లక్షితముగ నవ రసాఖ్యాన మింతవరకు జరిగినది. ఇటుపై భావలక్షణ మపేక్షితము. రసలక్షణ మున్నగాని భావాది లక్షణము పూర్ణము గాదు. రస లక్షణమును భావ విభా వాదులు నిరూపించిన గాని పూర్ణము కానేరదు. సర్వము రసము కేంద్రీకరించు కొనినవి యగుట చాక్యైక వాక్యమున నిఖిలము రస లక్షణమే యగును.

## భా వ చ క్ర ము

ఇప్పు డిక భావముల వ్యాఖ్యానింతుము. ఈ మాట యిది వరలో ననినదే. మఱల చెప్పు టేల? "పూర్వపు క్రమము ననుసరించి విభావాదులను జెప్పవలయును. కాని ప్రధానము లగుట స్థాయివ్యభి చారుల రూపింప వలెను. అందునను మఱల నిట్లనుట". అని కొంద అనుకొందురు. ఇది యట్లుకాదు. "వయం తు బ్రూమః" మేమిట్లం దుము. భావశబ్దమున చిత్తవృత్తివిశేషములె వివక్షితములు. ఆ భావ ములకు యోగ్యతావశమున యథాయోగముగా స్థాయి సంచారి విభావానురూపత సంభవించును. బాహ్యములయిన ఋతుమాల్యాది విభావములు, బాష్పాదు లయిన యనుభావములు భావశబ్దమున వ్యపదేశింప దగవు. స్థాయి వ్యభిచారి సాత్వికములె భావములు.

విభావానుభావములకు ప్రాసంగికముగా లక్షణము చెప్పెదము– "విభావానుభావములు కూడ సంవిత్స్వభావమున నిమజ్జనోన్మజ్జనము పొందుట యున్నదని సంవిదాత్మకములె యని భావించిన, విశ్వమంతయు భావమయమె యగును. అప్పు డభినయధర్మి మొదలగు వానిని వేరుగాచెప్పుట కుదురదు. కాన స్థాయి వ్యభిచారి సాత్త్వికములె భావములనుట యుక్తిసంగతము. భావములు చిత్తవృత్త్యాత్మకములు. భావపదమున రెండు వ్యుత్పత్తులు సంభావితములు కావచ్చును. "భవతీతి భావః" అని యొకటి. "భావయతీతిభావః" అని రెండు. రతిభావ మని యనినప్పుడు రతిప్రాదుర్భావములో ప్రకర్షగతి భాసించును. మొదటి భవనము పిమ్మట నుండదు. అప్పటి దా యనంతర ముండదు. వీనిలో తరతమభావముండును. ఇట్టి చిత్తవృత్త్యాత్మకము లయిన భావములు పరిమితకాలభావులై గోచరించును. ఇది మొదటిరీతి ననుసరింప లభించెడి తాత్పర్యము. భావింపజేయు నను రెండవవ్యుత్పత్తి చూడ నిది లభించును. "భావయంతి, ఆస్వాదనం కుర్వంతి, హృదయం వ్యాప్నువంతి" "భావింప జేయును. ఆస్వాదన మాపాదించును. హృదయము వ్యాపించును". అని. భావపదమున ని ట్లనుద్భిన్నార్థము లున్నవి. అనుద్భినోద్భేదమున భావ భావమును విశదము చేయుట యుక్తము.

౨౮౯. "భావా ఇతి కస్మాత్ ? కిం భవంతీతి భావాః ?
కిం వా భావయంతీతి భావాః ? — "

భావము అని యనుట యేల ? ఉద్భవనముననె యవి భావములా ? భావింప చేయుచున్నవి కావున భావము లగుచున్నవా ? అయినచో నవి వేనిని భావింప జేయును ? వేనివ్యాపించును ? ఏమియాచరించును ? ఇట్లు భావవిషయమున ప్రశ్న కలుగును. ఇందిది సమాధానము. వాగంగసత్త్వోపేతము లయిన కావ్యార్థములను భావింప జేయునవి కావున భావము లని యనదగును. కావ్యము కవనీయము. అందు పదార్థవాక్యార్థములు రసములందే పర్యవసానము పొందును. కావ్యమున ప్రధానము లగుట యసాధారణము లగుట రసములు కావ్యార్థము లగుచున్నవి. ప్రధానముగా నర్థింపబడునవి యగుట రసము లర్థములు. అర్థశబ్ద మిం దభిధేయవాచి కాదు. రసాదులు స్వశబ్దాభిధేయ

ములు కావని ధ్వనికారాదులు నిరూపించిరి. తద్వివరణమయిన సహృదయాలోకలోచనమందు నిది వివృతమయినది. కావ్యార్థములగు రసముల నివి భావింపజేయును. ఆస్వాద్యమగు లౌకికార్థమంతయు స్థాయివ్యభిచారికలాపముననె నివృత్తమగును. మొదట స్థాయి యవభాసించును. అనంతరము సర్వసాధారణభావమున నాస్వాద ముదయించును. మొదట గోచరించియు నుత్తరభూమి నందికొని యాస్వాదమునకు భావకము నిష్పాదకము నగును. వాగంగసత్త్వములు సంబంధించియున్న కావ్యార్థములను భావములు భావింపచేయును. ఆహార్య మంతగా ముఖ్యము కానందున నిందు జేరలేదు. వాచికాదులె యంతరంగములు, కావ్యము వలన గూడ రసాస్వాదము కలుగును కదా! కావ్యమున నాహార్యమునకు పూర్ణత లేదు. అందుననె యిందది యుపాత్తము కాలేదు. చిత్తవృత్తులలౌకికములు. వాచికాద్యభినయ ప్రక్రియారూఢములై లౌకికదశలో నాస్వాద్యము కాని స్వాత్మస్వరూపము నిప్పు డావిష్కరింపజేయును.

భావపదము భూ ధాతు నిష్పన్నము. భావితము వాసితము కృతము మూడు సమానార్థములు. లోకమున గూడ నిది ప్రసిద్ధము. “ఈ గంధమున రసమున నిది సర్వము భావితము”. అని. ఇది యంతయు వ్యాప్త్యర్థము. కస్తూరికాగంధము వ్యాపించినది. గుణము నకు సంక్రాంతి లేనందున కస్తూరిగంధము వేరొక గంధమును కలుగ జేయదు. ఆ గంధసదృశ మయిన గంధాంతరము నచట కలుగదు. గంధాదులు యావద్ద్రవ్యభావులు. కేవలము కస్తూరికాద్రవ్యమె రూప దేశ చైతన్యాక్రమణ స్వభావము కలదై వస్త్రాదికమున గూడ నట్టి ప్రతిపత్తి కలుగజేయును. అట్లె ప్రకృతమున గూడ భావింపవలెను. మొదటి దశలో వాచికాద్యభినయములు దేశ కాల విశేష గతములు గనె భాసించును. కాని సాధారణీభావము పొందినవై మృగమదామోద విధానమున సామాజికులను వ్యాపించును. అప్పుడు సామాజికాత్మలను స్వచిత్తవృత్తి వ్యాపన ద్వారమున భావింపజేయును. కాన నివి భావములు. ఈ విషయమున వ్యుత్ప

త్త్యంతరమును దర్శించు ప్రాక్తన వ్యుత్పత్తిగ్రాహకము లయిన శ్లోకములు గలవు.

> ౨౯౦. "విభావైరాహృతో యోఽర్థో హ్యనుభావైస్తు గమ్యతే
> వాగంగసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః
> ౨౯౧. వాగంగముఖరాగేణ సత్త్వేనాభినయేన చ
> కవేరంతర్గతం భావం భావయన్భావ ఉచ్యతే
> ౨౯౨. నానాభినయసంబద్ధాన్భావయంతి రసానిమాన్
> యస్మాత్తస్మాదమీ భావా విజ్ఞేయా నాట్యయోక్తృభిః"

విభావ మనునది విషయము. వానిచే నిష్పాదిత మగు నర్థము వాగంగసత్త్వాభినయరూపము లయిన యనుభావములచే గమ్యమాన మగును. దానికే భావమని సంజ్ఞ. వాగంగసత్త్వాభినయము లను భావములు. స్వాభినయసంహితము లయిన వ్యభిచారిభావములను గూడ నిచట కొందరు సంభావించుచు వ్యభిచారిభావములచే భావము మిశ్రీకృత మగు ననుచున్నారు. వ్యభిచారులకును వ్యభిచారు లుండును. నిర్వేదమున చింత వ్యభిచారి. శ్రమమునకు నిర్వేదము వ్యభిచారి అని వారి భావము. ఇట్లనుట యుక్తము కాదు. స్థాయి భావమునకు వ్యభిచారిత కలుగ వచ్చును. కాని వ్యభిచారిభావము లకు స్థాయిత రాదు. వ్యభిచారులకును స్థాయిభావత్వముకలుగు నేని మూలవ్యభిచారి యాస్వాదమున రసాంతరమును కలుగ వలసి యుండును. వ్యభిచారిభావమునకు వ్యభిచారిభావముండు ననుట కన్న ముఖ్యమయిన స్థాయిభావమునకె యన్నియు వ్యభిచారు లనుట యుక్తముగా నుండును. విభావనిర్ణీత మనుభావములచే గమ్య మగు నని భావనిర్వచనము చేయుట లోకానుసారిగా నున్నది. కవి నట శిక్షోపయోగిగా నున్నది. ఇదివరలో పలికిన రెండువ్యుత్పత్తులు సామాజికాభిప్రాయము ననుసరించినవి. ఇదియె శ్లోకద్వయమున వ్యక్త మగును. వాగంగముఖరాగమున సత్త్వమున నభినయమున కవి యంతర్గత మగు భావమును భావింప జేయునది భావమగును. నానాభినయసంబద్ధము లగు రసముల సామాజికులను భావింప జేయు నవి యగుటచే భావవ్యవహారము కలుగునని నాట్యప్రయోక్తలు గుర్తింప వలెను. వర్ణనానిపుణు డగు కవి యనాది ప్రాక్తన

సంస్కార ప్రతిభానమయ మగు భావము కలవాడై యుండును. అది లౌకికవిషయజన్యము కాదు. దేశకాలాదిభేద మందుండదు. అది సర్వసాధారణీభావమున సమాస్వాదయోగ్యము. అట్టిదానిని సమాస్వాదయోగ్యముగ జేయునదియె భావము. భావము చిత్తవృత్తిలక్షణమని చెప్పితిమి. వాగంగముఖరాగ మనుచోట ముఖరాగము వైవర్ణ్యరూప మయిన సాత్త్వికము. సత్త్వము చిత్తైకాగ్రత. తజ్జనితము సాత్త్వికము. వైవర్ణ్యాత్మక మయిన ముఖరాగము సాత్త్వికాంతర్గత మయినను ప్రాధాన్యమున పునరుక్త మయినది. శుభాభినయమంగోపాంగయుక్తముగా నున్నను ముఖరాగము లేకపోయినచో శోభాన్వితముగా నుండ దందురు. అందుననె ముఖరాగము సూచిత మయినది. ఈ భావములు సామాజికుల విశిష్టచిత్తవృత్తులను రసనయోగ్యముల నొనరింప గలవు. అట్లు వారి మానసములు భావితములగును. భావములు వారికి తగిన యుద్బోధ మీయగలవు. సామాజికు లెల్లప్పుడు సర్వభావములను బుద్ధివిషయములనుగా జేసికొనజాలరు. ఈ భావము లాస్వాద్యము లనువారి బుద్ధివిషయములను జేయగలవు. నానాభినయసహితములగు రసములను భావింపజేయుననుట, అభినయములుకూడ బుద్ధిగోచరము లగునని భావము. భావములు స్వగతయోగ్యరూపమున రసములను రసనయోగ్యములుగ నొనరించుటయె యధివాసనాత్మక మయిన భావన. నిర్వేదోపరక్త మగు రతి యౌత్సుక్యోపరక్త మగునట్లు అలౌకికాస్వాదవిషయములగు స్థాయిభావములను భావము లధివాసింప జేయగలవు.

ఇది రసప్రకరణ మగుట చిత్తవృత్త్యుద్భవహేతు వయిన విషయము విభావార్థ మని విజ్ఞాత మయినది. అయినను విభావ మనుటలో ప్రవృత్తినిమిత్తము తెలియవలసి యున్నది. విభావమని యనుటేల? ఋతుమాల్యాదులు విభావశబ్దమున వ్యపదిష్టము లగుటలో హేతువేమి? ఇదిగో చెప్పెదము. విభావ మనునది విజ్ఞానార్థము. విభావము, కారణము, నిమిత్తము, హేతువు అనునివి పర్యాయములు. వాగంగసత్త్వాభినయము దీనిచే విభావిత మగును గావున నిది విభావ మగుచున్నది. "విభావ్యతే ఇతి విభావః", విభావితము విజ్ఞాతము

అనునవి సమానార్థకములు. స్థాయిభావములకు వ్యభిచారిభావముల కును వాగాద్యభినయము లున్నవి. వాగాద్యభినయసహితము లయిన స్థాయివ్యభిచారిభావములు వీనిచే విశిష్టస్వరూపమున విజ్ఞాతము లగును. అందుచే నివి విభావము లగుచున్నవి. అభినయము లనేక కారణముల వలన గలుగుట ప్రసిద్ధముగ నున్నది. చూడుడు. హాసము హర్షాదుల వలన గలుగును. ఘర్మము, ధూమము, రోగము మొదలగు వానివలన బాష్ప ముదయించును. ఆ బాష్పము వలన ఘర్మాదులలో నేది గోచరమగును? ఘర్మమె గోచరించునా? ధూమమె గోచరించునా? ఇట్టి సందేహమున విభావము సహకారి. విభావము ఝుడితి నిశ్చయము గోచరింప జేయును.

౨౯౩. బహవోఽర్థా విభావ్యంతే వాగంగాభినయాశ్రయాః
అనేన యస్మాత్తేనాయంవిభావ ఇతి సంజ్ఞితః

వాగంగాభినయముల కాశ్రయము లయిన నానావిధ రసభావార్థ ములు బాగుగా దీనిచే విభావితము లగును గావున నిది "విభావ" సంజ్ఞ కల దయినదని పరంపరాగత మయిన శ్లోకమును గలదు.

## అనుభావము

అనుభావ మనునది యేమి? చేష్టాదుల ననుభావము లని యేల యనవలెను? ఇందిది యుత్తరము. వాచికాంగికసాత్త్వికాభినయము దీనిచే ననుభావిత మగును. చిత్తవృత్తిస్వరూపము లయిన భావము లను సూచించునవై వెలువడు వాచికాద్యభినయములు స్పష్టగోచ రము లగుట కివి యుపకరించును.

౨౯౪. వాగంగాభినయేనేహ యతస్త్వర్థోఽనుభావ్యతే
శాఖాంగోపాంగ సంయుక్తస్త్వనుభావస్తతః స్మృతః

అంగోపాంగముల కూడిన యర్థము వాగంగాభినయమున ననుభావిత మగును గావున అనుభావ మని వ్యవహారము కలిగినది. కాగా భావము లిట్లు విభావానుభావసంయుక్తము లని తేలినది. భావము వ్యాఖ్యాత మయినది. విభావానుభావములను జెప్పగా భావస్వరూ పము విశద మగును. భావము సిద్ధస్వరూప మగును. భావముల జెప్పునపుడు విభావానుభావములను జెప్పవలయును. విభావానుభావ

సంయుక్తము లయిన భావముల లక్షణనిదర్శనముల జెప్పుట సముచితము. అందు విభావానుభావములు లోకప్రసిద్ధములు. లోకస్వభావానుగతములు. కాన వానికి లక్షణము చెప్ప నక్కఱలేదు.

౨౮౫. లోకస్వభావసంసిద్ధా లోకయాత్రానుగామినః
అనుభావా విభావాశ్చ జ్ఞేయాస్త్వభినయే బుధైః

అనుభావములు విభావములును లోకస్వభావమున నె సిద్ధము లగుచున్నవి. లోకయాత్ర ననుసరించి యున్నవి. అభినయములం దీ విధాన మిట్లు ప్రసిద్ధమై యున్నదని బుధులు గుర్తింతురు. ఎనిమిది స్థాయిభావములు. ముప్పదిమూఁడు వ్యభిచారి భావములు. ఎనిమిది సాత్త్వికభావములు. ఇట్లు భావములు త్రిభేదములు. ఇవి కావ్యరసాభివ్యక్తి హేతువులు. ఇవి యన్నియు నలుబది తొమ్మిది భావము లున్నవని తెలియ వలెను. వీని వలని సామాన్యగుణయోగమున రసములు నిష్పన్నము లగును.

౨౮౬. యోఽర్థో హృదయసంవాదీ తస్య భావో రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠమివాగ్నినా

సహృదయుల హృదయసంవాదము పొందిన రసోద్భవభావము సర్వము శరీర మంతట ప్రసరించును. శుష్క మయిన కాష్ఠము నగ్ని వ్యాపించిన విధమున భావము శరీరధాతువు లం దంతట ప్రసరించును.

విభావానుభావములు కావ్యార్థము నాశ్రయించి యుండును. వానిచే నీ నలుబదితొమ్మిది భావము లభినిష్పన్నము లగును. ఆ భావములచే నయిన సామాన్యగుణయోగమున రసములు నిష్పన్నము లగును. కాగా స్థాయిభావములె రసత్వము పొందుట యెట్లు కుదురును ? ఇదిగో ! చెప్పెదము. ఈ లోకదృష్టాంతము భావింపుడు ! సామాన్యముగా మానవులంద రేకవిధముగా నుందురు. సమాన లక్షణములతో నుందురు. పాణిపాదోదర శరీరములు తుల్యముగా నుండును. అంగప్రత్యంగములు సమముగా నుండును. ఇట్లు పురుషు లంతట సమానలక్షణములతో నున్నను కులము, శీలము, విద్య, కర్మ, శిల్పములందు విచక్షణు లగుట వలన కొందరు మాత్రమె రాజత్వము పొందుదురు. ఇతరు లల్పబుద్ధులు మఱికొందరు వారలకె యనుచరు

లగుదురు. ఇట్లె ప్రకృతమున గూడ పరిశీలింప వచ్చును. విభావాను భావవ్యభిచారిభావములు స్థాయిభావముల నాశ్రయించి యున్నవి. స్థాయిభావము లనేకముల కాశ్రయములుగా నున్నందున ప్రధానములై స్వామిరూపమున నుండును. తదితరభావములు స్థాయిభావముల కంగములై యుండును. స్థాయీతరభావము లితరస్థానము లందుండు పురుషుల వలె నప్రధానములు కదా! ఇట్లు స్థాయీతరభావములు గుణరూపమున (అప్రధాన) స్థాయిభావముల నాశ్రయించి యుండును. వ్యభిచారిభావములు పరిజనములుగా నుండును. ఇట్లు స్థాయిభావములు సర్వప్రధానభావమున నుండుటచే స్థాయిభావములు రసత్వము పొందుట సూచిత మయినది. ఇందేమి దృష్టాంత మందురో? నరేంద్రుడు బహుజనపరివారములతో గూడి యున్నను ఆ నరేంద్రుడే నరేంద్రఖ్యాతి వహించును. ఎంత గొప్పవా డయినను వేరొక పురుషు డా ప్రఖ్యాతి వహింపజాలడు. అదేవిధముగ విభావానుభావ వ్యభిచారి పరివృత మయిన స్థాయిభావమె రసనామము పొందునది యగును. ఈ విషయము నిట్లు శ్లోకించిరి.

> ౨౯౪. యథా నరాణాం నృపతిః శిష్యాణాం చ యథా గురుః
> ఏవం హి సర్వభావానాం భావః స్థాయీ మహానిహ

సమానలక్షణలక్షితు లయినను నరులందరు నరేంద్రులు కాజాలరు. విశిష్టగుణయుక్తు డొకడు మాత్రము నృపతి యగును. ఆతడు సర్వాధికుడు. శిష్యజను లనేకు లుందురు. వారిలో నొకడు విచక్షణుడు గురు వగును. ఆతడు సర్వాధికుడు. ఇట్లే సర్వభావములలో స్థాయిభావము సర్వాధికముగ నుండును. ఇంతవఱకు రససంజ్ఞ కల వాని లక్షణనిదర్శనములు నిరూపితము లయినవి. ఇక భావసామాన్యలక్షణము చెప్పెదము.

## స్థాయిభావములు

రతి: స్థాయిభావములందు రతి యనునది ప్రమోదాత్మకము. ఋతువు, మాల్యము, అనులేపనము, ఆభరణము, భోజనము, వరభవనము, వీని యనుభవనము, అప్రతికూలత మొదలగు విభావము

లచే నీ రతి యుదయించును. స్మితవదన, మధురకథన, భ్రూక్షేప, కటాక్షాద్యనుభావములచే రతి నభినయింప వలెను.

> ౨౯౮. ఇష్టార్థవిషయప్రాప్త్యా  రతిః  సముపజాయతే
> సౌమ్యత్వాదభినేయా సా వాఙ్మాధుర్యాంగచేష్టితైః

ఇష్టార్థవిషయముల ప్రాప్తిచే రతి జనించును. రతి సౌమ్యస్వభావక మయినందున వాఙ్మాధుర్యమున లలితాంగచేష్టితమున నభినయింప వలెను. అని దీని శ్లోకించిరి. ప్రమోదమాహ్లాదమె దీని స్వరూపము. మధురవచోవిలాసము మనోహరచేష్టితములు రతి నాశ్రయించి యుండుననుట ప్రసిద్ధము.

హా స ము : ఇతరుల చేష్టల ననుకరించుట, కుహకాసంబద్ధ ప్రలాపములు, ఎల్లప్పు డితరుల దోషముల నుద్ఘాటించుట యను పౌరో భాగ్యము, మూర్ఖత మొదలగు విభావములచే హాస ముదయించును. పూర్వము నిర్దేశించిన హసితాద్యనుభావములచే హాసము నభినయింప వలెను. ఈ విషయమున నీ శ్లోక మున్నది.

> ౨౯౯. పరచేష్టానుకరణాద్ధాసః  సముపజాయతే
> స్మితహాసాతిహసితైరభినేయః స పండితైః

పరుల చేష్టలను వికృతముగా ననుకరించుట వలన హాస ముద యించును. స్మితహాసము మొదలగు విధానములచే హాసమును దాని స్వరూపమును గుర్తించిన వారభినయింపవలెను. హాసవిభావాను భావము లిట్లుండు నని యభిజ్ఞులు తెలియ వలెను.

శో క ము : ఇష్టజన వియోగమున, విభవనాశమున, వధ బంధ దుఃఖానుభవనాది విభావములచే శోక ముదయించును. ఇందు అశ్రుపాతము, పరిదేవితము, విలపితము, వైవర్ణ్యము, స్వరభేదము, స్రస్తగాత్రత, భూమిపతనము, సస్వన రుదితము, ఆక్రందితము, దీర్ఘ నిశ్వసితము, జడత్వము, ఉన్మాదము, మోహము, మరణము మొద లగునవి యనుభావములు. వీనిచే శోకమును ప్రయోగింపవలెను. సామాన్యముగా రుదితము మూడువిధముల నుండును. ఆనందజన్యము, ఆర్తిజన్యము, ఈర్ష్యాసముద్భవము నని. విభావగతి ననుసరించి వీని యభినయవిధానము లీ విధమున నుండును.

౧. కపోలములు హర్షాతిశయమున నుత్ఫుల్లములై యుండును. అనుస్మరణమున నపాంగములనుండి యశ్రువులుప్పతిల్లును. శరీర మంతట రోమాంచము కలుగును. ఈఆనందసముద్భవ మయిన రుదితమును పై విధానముల నభినయింప వలెను.

౨. ఆర్తిజన్యమగు రుదిత మీ విధమున నుండును. కన్నీరు సమధికముగా జాలువారును. ఈ రుదితమున కంఠస్వన మతిశయించును. శరీర మస్వస్థముగా నుండును. అనిర్దిష్టములు భావశూన్యము లయిన చేష్టితము లధికముగా నుండును. భూమిపై పడుట పొర్లుట దొర్లుట లుండును. ఇందలి విలపితము సాతిశయము.

3. ఈర్ష్యాకృత మగు రుదిత మీ రీతి నుండును. పెదవులు కపోలములు మాటిమాటికదరును. నిశ్వాసము లుండును. శిరఃకంప ముండును. బొమముడులు చిడిముడిపాటులు కుటిలదృష్టు లుండును. స్త్రీల కీర్ష్యాకృతముగా గలుగు రుదిత మిట్లు చిత్రము గా నుండును.

300. స్త్రీనీచప్రకృతిష్వేష శోకో వ్యసనసంభవః
ధైర్యేణోత్తమమధ్యానాం నీచానాం రుదితేన చ

వ్యసనమున గలుగు శోకము స్త్రీల యందును నీచప్రకృతులందును స్పష్టముగ గోచరించును. ఉత్తమమధ్యమస్వభావమున నుండువారు ధైర్య మవలంబింతురు. నీచస్వభావులగు వారు రుదితమున వ్యధ పడుదురు.

క్రోధము : ఆధర్షణము, ఆకర్షణము, కలహము, వివాదము, ప్రతికూలవిధానము, మొదలగు విభావములచే క్రోధ ముదయించును. దీనిని వికృష్టనాసాపుటములచే, ఉద్వృత్తనయనములచే, ఓష్ఠసందంశనములచే, గండస్ఫురణములచే నింక నిట్టి యనుభావములచే నభినయము ప్రయోగింపవలెను.

30౧. రిపుజో గురుజశ్చైవ ప్రణయప్రభవస్తథా
భృత్యజః కృతకశ్చేతి క్రోధః పంచవిధః స్మృతః

క్రోధ మయిదువిధములు. శత్రువుల వలన గలుగునది. గురుజన్య మగునది. ప్రణయము వలన గలుగునది. భృత్యుల వలన

గలుగునది. అయిదవది కృతకము. శత్రువిషయమున నీవిధముగా నిర్యంత్రణముగా కోపింప దగును. ముఖమును భ్రుకుటీకుటిలముగ భయంకరముగ నొనర్పవలెను. ఓష్ఠపుటముల సందంశింపవలెను. చేతితో చేతిని పట్టుకొని పిసికి కొనవలెను. కోపముపడి తన భుజములను చూచుకొనుచు రోషింప దగును. గురువు విషయమున గలిగిన క్రోధమున కొంచెమవాఙ్ముఖముగ దృష్టిని సారింపవలెను. కొంతగా వెడముఖము పెట్టవలెను. గురువిషయమున గూడ క్రోధము పడవలసి వచ్చినది గదా యని కన్నీరు కలవాడు కావలెను. చెమటను తుడిచికొనుచుండ వలెను. ఉత్కటచేష్టితముల నవ్యక్తముగ నాచరింప వలెను. తన క్రోధచేష్టితములు గురువున కంతగా గోచరము కారాదు. గురువిషయమున గలిగిన రోషము వినయము ననియంత్రితమై యుండవలెను. ప్రణయమున గూడ కోపము కలుగును గదా! ప్రణయము కల ప్రియురాలి విషయమున రోషము కలిగినప్పుడీ విధముగ చేష్టితము లుండును. ప్రియురాలి సమీపమున నల్పతరముగ సంచరింప వలెను. అటునిటు మందగమనమున సాలోచనముగ ప్రవర్తింప వలెను. అపాంగవిక్షేపము లొనర్చుచు కంటినీరు విరజిమ్ముచు విహరింపవలెను. భ్రుకుటీభంగము కలవాడై స్ఫురితోష్ఠుడై ప్రియావిషయమున రోషింప వలెను. పరిజనములందు గలిగిన రోష మీ విధముగా నుండును. భయపెట్టుట, బెదరగొట్టుట, కండ్లురుముట, విస్ఫారిత నేత్రములతో నిశితముగా జూచుట, చూచియు చూడనట్లుగా విరుద్ధవికృతప్రేక్షణముల ప్రసరింపజేయుట, ఇట్లు వివిధదృష్టివిక్షేపములతో నుండియు క్రూరతా రహితముగ పరిజనజన్యమయిన రోష మభినయింప వలెను. ఇక కృతకకోప మీ విధమున నుండును. అవసర మేమాత్రము చూడకనే యకారణముగ కోపప్రవృత్తితో నుండవలెను. తా నాయాస పడినట్లు శ్రమపడినట్లుండి మాటిమాటికి విసుగుకొనవలెను. కృతకకోప మెల్లప్పుడు వీరరసాంతరచారిగ నుండుట యుక్తము. ఈ చెప్పిన విధానముల భావించి యయిదు విధములయిన రోషము నభినయింప వలెను.

ఉత్సాహము: ఉత్సాహ మనునది యుత్తమప్రకృతికము.

అది విషాదము లేకపోవుట. శక్తిధైర్యస్థైర్యశౌర్యాదు లుండుట యను నిట్టి విభావములచే గలుగును. స్థైర్యముతో ధైర్యముతో కూడిన సమారంభమున, త్యాగమున వైశారద్యమున నింక నిట్టి యనుభావవిశేషమున నీ యుత్సాహ మభినయింపవలెను.

౩౦౨. అసమ్మోహాదిభిర్వ్యక్తః వ్యవసాయనయాత్మకః
ఉత్సాహస్త్వభినేయః స్యాదప్రమాదోత్థితాదిభిః

వ్యామోహ మేమాత్రము లేకపోవుట మొదలగు వానిచే నుత్సాహము వ్యక్తము కావలెను. సముచిత మయిన ప్రయత్నశీలునిగ నుండవలెను. నయస్వభావముగ నుండవలెను. ప్రమాదరాహిత్యము సావధానత మొదలగు స్థిరగుణముల సంపదలచే నుత్సాహ మభినయింప వలెను.

భయము : భయభావము స్త్రీ నీచ ప్రకృతికము. దీనియం దీ విభావము లుండును. గురురాజాపరాధములు, శూన్యభవనము, అరణ్యము, పర్వతము, గహనప్రదేశము, గజసర్పదర్శనము, ఇతరులు బెదిరించుట, కాంతారసంచారము, దుర్దినము, చీకటిరాత్రి, చిమ్మ చీకటి, గుడ్లగూబ నక్క తోడేలు మొదలగు రాత్రిసంచార మొనర్చు జంతువుల వికటారావసంరావముల శ్రవణము. ఇంకనిట్టివి. ఈ విభావములచే గలిగిన భయమును వక్ష్యమాణానుభావములచే నభినయింప వలెను. ప్రకంపితహస్తపాదములు, హృదయకంపనము, గాత్రస్తంభము, ముఖశోషణము, జిహ్వాపరిలేహనము, స్వేద వేపథు త్రాసములు, రక్షణ మొనరించువారి నన్వేషించుట, పరుగులెత్తుట, లాగుట పీకికొనుట ఇట్టివన్నియు ననుభావములు. ఇందీ శ్లోకము లున్నవి.

౩౦౩. గురురాజాపరాధేన రౌద్రాణాంచాపి దర్శనాత్
శ్రవణాదపి ఘోరాణాం భయం మోహేన జాయతే

౩౦౪. గాత్రకంపన విత్రాసైః వక్త్రశోషణ సంభ్రమైః
విస్ఫారితేక్షణైః కార్యమభినేయక్రియాగుణైః

౩౦౫. సత్త్వవిత్రాసనోద్భూతం భయముత్పద్యతే నృణాం
త్రస్తాంగాక్షినిమేషైస్తదభినేయం తు నర్తకైః

భయము గుర్వపరాధమున, రాజాపరాధమున గలుగును. రౌద్రా కారము కలవాని దర్శనమున గలుగును. ఘోరము లగువాని శ్రవణ మునను గలుగును. మోహమునను భయము జనించును. ఇట్లు జనిం చిన భయమున నీ విధముగా నభినయింపవలెను. గాత్రకంపనములు బెదరిపోవుట ముఖమెండిపోవుట సంభ్రమము నేత్రములు విప్పారుట యిట్టి యభినేయక్రియాగుణములచే నభినయింపవలెను. క్రూరజంతు వులు విత్రాసపెట్టుట వలన గూడ మానవులు భయపడుదురు. అట్టి భయమును నర్తకులు శిథిలాంగములచే నేత్రనిమీలనములచే నభిన యింప వలెను. గాత్రకంపనాదులు భయమున ననుభావములు.

౩౦౬. కర చరణ హృదయకంపైః ముఖశోషణ వదనలేహన స్తంభైః
సంభ్రాంతవదన వేపథు సంత్రాస కృతైరభి నయోఽన్య

కరచరణకంపములచే హృదయకంపనములచే, ముఖశోషణముచే, వదనలేహనముచే, స్తంభపడుటచే, సంభ్రాంతవదనముచే, వేపథు వుచే, బెదరిపోవుటలచే, నీ భయము నభినయింప వలెను.

జు గు ప్స : జుగుప్స యనునది స్త్రీనీచప్రకృతికము. అది యహృద్యదర్శనమున నట్టివాని శ్రవణమున పరికీర్తనమున నింక నిట్టి విభావములచే గలుగును. సర్వాంగసంకోచము నిష్ఠీవనము (ఉమ్మట) ముఖవికూణనము ఛీత్కార ధూత్కారములు మొదలగు ననుభావము లచే జుగుప్స నభినయింప వలెను. ఈ విషయ మిట్లుపశ్లోకిత మయినది.

౩౦౭. నాసాప్రచ్ఛాదనేనేహ గాత్రసంకోచనేన చ
ఉద్వేజనైః సహృల్లేఖైర్జుగుప్సామభినిర్దిశేత్

ముక్కుమూసికొనుట శరీరము ముడుచుకొనుట ఉద్వేగపడుట ఛీత్కా రము లొనర్చుట యనువానిచే జుగుప్సభావమును నిర్దేశింప వలయును.

వి స్మ య ము : విస్మయభావము మాయేంద్రజాల మానుష్య కర్మాతిశయ చిత్రపుస్త శిల్పవిద్యాశయాది విభావములచే గలుగును. దానిని నయన విస్తారానిమేషప్రేక్షిత భ్రూక్షేప రోమహర్షణ శిరఃకంప సాధువాదాద్యనుభావములచే నభినయించి ప్రయోగింప వలెను. ఈ విషయమున శ్లోకము.

౩౦౮. కర్మాతిశయనిర్వృత్తో విస్మయో హర్షసంభవః
సిద్ధిస్థానే త్వసౌ సాధ్యః ప్రహర్షపులకాదిభిః

విస్మయము హర్షసంభవము. కర్మాతిశయమున గలుగును. ప్రహర్ష పులకాదులచే దీని నభినయించి సాధింపవలెను. ఇట్టి స్థాయిభావములు రససంజ్ఞ కలవని తెలియవలెను.

## వ్య భి చా రి భా వ తం త్ర ము

వ్యభిచారిభావముల నిక వ్యాఖ్యానింతుము. వ్యభిచారిభావము లెవ్వి? వాని నట్లేల యనవలయును? అట్లనుటలోని యభిప్రాయమేమి? ఇందిది సమాధానముగా చెప్పెదము. "వి, అభి" అనునవి రెండు నుపసర్గలు. "చర" యనునది గత్యర్థక మయిన ధాతువు. "వివిధ మాభిముఖ్యేన రసేషు చరంతీతి వ్యభిచారిణః" రసములందు వివిధముగా నాభిముఖ్యమున సంచరించునవి గావున వ్యభిచారు లగును. వాగంగసత్వ సముపేతము లయిన రసములను ప్రయోగమున సహృదయహృదయసంవాదము కలుగు విధమున సహృదయులకు చర్వణా విషయములుగ జేయునవి యగుట వ్యభిచారు లగును. ఇవి యన్నియు చిత్తవృత్తిస్వభావములు. దృష్ట శ్రుతము లగు జగజ్జడపదార్థములు భావసంభావితము లగునప్పుడు స్వస్పందసుందర మయిన యనుభూతి ప్రాదుర్భావ ప్రారంభములో చిత్తవృత్తులందు స్పంద ముదయించును. కించిద్విషయముగా నున్న చిత్తస్పందము వృత్త్యాత్మకమై గూఢముగా నున్న సంస్కారాత్మక మయిన స్మృతి నందుకొనును. స్మృత్యాత్మక మయిన సంభావనముతో ప్రకృతస్పందధారసంవాదము పొందగా భావసంకేతము కలుగును. చిత్తమున క్షణ ముదయించి లయించునది యయినను హృదయ మధివాసితము చేయును. ఇట్లు భావనాత్మక మయిన భావము సహృదయాస్వాదమునం దుండు రసము నభిముఖముగ జేయును. తాను తరంగముసాగరమున వలె రసరూపమున విలీన మగును. ఇట్టి స్వభావ సముపేత మయినందున వీనిని వ్యభిచారిభావము లనవలెను. చిత్తవృత్తిస్వభావము లయిన భావములు తమయంతట తాముండుట స్వరూపప్రతిష్ఠ కాదు. రసాభిముఖముగనె తమ వ్యాపారము సారించును. తదభిముఖముగనె స్వప్రతిష్ఠము లగును. ఇది వీని తంత్రము.

## రససంచారము

వాగంగసత్త్వసముపేతము లయిన రసముల పొందించు విధాన మిట్లుండును. సూర్యుఁడీ దిన మీ నక్షత్రము పొందించు నని లోకమున నొక నిర్ణయ మున్నది. వాని నెట్లు పొందించును? బాహువులతో తీసికొని పోఁడు. స్కంధమున మోసికొని పోఁడు. కాని సూర్యుడీ నక్షత్ర మీ దినము పొందించును. ఈ మాసము పొందించు" నని లోకప్రసిద్ధ మయిన వ్యవహార మున్నది. అట్లే యీ వ్యభిచారిభావములు రసములు ప్రయోగము పొందునట్లు చేయును. వ్యభిచారులుండుటచే రసములు ప్రయోగప్రసారము పొంది యభివ్యక్తములై సచేతసుల కాస్వాద్యము లగును. ఇట్లే వీని గ్రహింప వలెను. అలౌకిక వాచికాద్యభినయ ప్రక్రియారూఢము లగుటచే స్వాత్మ నివి యాస్వాద్యము చేయగలవు. లౌకిక దశలో సమాస్వాదమున కందని స్వాత్మ యపు డాస్వాద్య మగును. స్థాయులు వ్యభిచారు లన్నియు సామాజిక మానసముల వ్యాపించును గదా! లోకమున జనించిన ప్రతిప్రాణియు నిట్టి సంవిత్తివిశేషములతో నవశ్యము కూడి యుండును. ఏ ప్రాణియు చిత్తవృత్తివాసనాశూన్యముగ నుండదు. ఒకని కొక చిత్తవృత్తి యధికము కావచ్చును మఱియొకని కది తక్కువగా నుండ వచ్చును. వేరొకనికి సముచితవిషయ నియంత్రిత మగును. అన్యున కన్యథా యుండును. చిత్తవృత్తులలో నేదియో యొకటి పురుషార్థమున కుపయోగించును. వ్యభిచారిభావములుగా పరిసంఖ్యాతము లగు నివి సముచిత విభావములు లేనప్పుడు జన్మమధ్యలో నెప్పుడు కలుగనె కలుగవు. రసాయనము సేవించిన వాని కెన్నఁడు గ్లాన్యాలస్యశ్రమాదులు కలుగవు. అట్టివాని కెవనికేని కలిగిన విభావ బలముననె కలుగవలయును. అట్లు కలిగినను హేతుప్రక్షయమున క్షీయమాణము లగును. ఏమాత్రము సంస్కారశేషముగా నయిన నుండవు. రత్యాదులం దొక విశేష మున్నది. అవి తమ కర్తవ్యమును సంపాదించి ప్రలీనకల్పము లయినను సంస్కారవిశేషములుగా నుండగలవు. "న హి చైత్ర ఏకస్యాం స్త్రియాం రక్త ఇత్యన్యాసు విరక్తః" చైత్రు డొక వనితపై యనురాగము కలిగి యున్నా డనుట,

అన్యవనితలందు విరక్తుడని యభిప్రాయము కాదు. కాన స్థాయిరూప మగుచి తవృత్తి సూత్రమున, స్యూతములై యుండు వ్యభిచారి భావములు, ఉదయాస్తమయ వైచిత్ర్య శతసహస్రధర్మములతో నుండు స్వాత్మ కభిముఖములై స్థాయిభావములను విచిత్రములనుగా నొనర్చుచు ప్రతిభాసించును. "ఈతడు గ్లాని పొందినాడు." అని యని నప్పుడు " ఎందువలన ? " అని హేతుప్రశ్న కలుగును. అందుననె దాని యస్థాయిత స్పష్ట మగుచున్నది. "రాము డుత్సాహశక్తికల వాడు" "దుష్యంతు డనురక్తుడయినాడు" అనినప్పుడు హేతుప్రశ్న కలుగదు. ఇట్టి స్థలములందు విభావము లుద్బోధకములై స్వరూపోప రంజకత్వమును సంపాదించుననె రత్యుత్సాహాదులం దుచితత్వానుచి తత్వ మాత్ర మాపాదింప గలవు. అంతియే కాని, యా విభావములు లేనందున సర్వథా నిరుపాఖ్యములు కావు. సర్వప్రాణులందును వాసనాస్వరూపమున నవి యుండు ననుట నిరుక్తము. వ్యభిచారి భావము లిట్లు కాదు. తమ విభావాభావమున తమ నామగంధమేని యుండదు.

రసలక్షణసమయముననె స్థాయిస్వరూపము నిరూపిత మయి నను మఱల నిచట నిర్దేశించుటలో నీ యాశయ మున్నది. ఈర త్యాదు లొకప్పుడు వ్యభిచారిభావములును కాగలవని వ్యభిచారిత్వ ఖ్యాపనమె తదాశయము. విభావము లధికముగా నుండుటయె స్థాయి త్వము. అల్పవిభావము లున్న వ్యభిచారిత్వమె. రావణాదులలో నన్యోన్యానురాగము లేదు. కాన రావణాదిరతి వ్యభిచారిభావము. గురువు ప్రియుడు పరిజనము మొదలగు వారియందు యథాయోగము వీరశృంగారాదు లున్నప్పుడు రోషము కల్గినను వ్యభిచారిభావమె యగును. ఇట్లె భావాంతరము లందును గుర్తింప వలెను. శమము విషయములో మాత్ర మొక విశేష మున్నది. శమ మొకప్పు డప్రధా నము కావచ్చును. కాని యది వ్యభిచారిభావము కాజాలదు. అది యన్నిట ప్రకృతిగా నుండును గాన స్థాయితమము. రత్యాదిభావ ములు వానివాని కారణాంతరముల సముదయమున నుత్పద్యమానము లగును. కారణాంతరప్రలయమున నిరుధ్యమానము లగును. ఇట్లగు

-చున్నను కొంతకాలము స్థాయిరూపాత్మభిత్తి నాశ్రయించునవి కావున స్థాయిభావము లగుచున్నవి. తత్వజ్ఞానము సకలభావాంతర ములకు భిత్తిస్థానీయము. సర్వస్థాయిభావముల కన్న స్థాయి తమము. రత్యాది స్థాయిచిత్తవృత్తుల నన్నిటిని తత్వజ్ఞానము వ్యభిచారీక రించును. తత్వజ్ఞానము నిసర్గముగా సిద్ధస్థాయిభావము. ఇకనిటుపై ముప్పదిమూడు వ్యభిచారిభావముల తత్వమావిష్కరింతును.

## వ్య భి చా రు లు

౧. ని ర్వే ద ము : దారిద్ర్యము, వ్యాధి, అవమానము, అధిక్షేపము, ఆకర్షణము, క్రోధము, తాడనము, ఇష్టజనవియోగము, తత్వజ్ఞానము మొదలగు విభావములచే జనించును. స్త్రీ నీచదుర్బలుల నిర్వేదమును రుదిత నిశ్వసితోచ్ఛ్వసిత సంప్రధారణాద్యనుభావము లచే నభినయింప వలెను. చిరకాలము విభ్రమవిప్రలుబ్ధు డుపాదేయ ముల స్వీకరింప లేడు. అట్టివానికొక సమ్యక్ జ్ఞాన ముదయించును. అది నిర్వేద మాపాదించును. తత్వజ్ఞాననిర్వేద మిట్లే యుండును. ఈ నిర్వేద మాత్మస్వభావము కాదు. ఆత్మస్వభావము శాంతస్థాయి యని యంటిమి. ఆశాహతు డయిన జను డంతట నైయర్థ్య మాశం కించును. అన్నిటిని జుగుప్సించును. ఆతని దది యొక నిర్వేదము. అట్టి నిర్వేదము పురుషార్థసిద్ధికి కాజాలదు. రత్యుత్సాహాదుల వలె నత్యంత ముపరంజనమునకు కాజాలదు. హాసవిస్మయాదుల వలె చిత్తచమత్క్రియ నాపాదింపజాలదు. కేవల మన్యముఖప్రేక్షముగా నుండును. ఇట్టిది వ్యభిచారిభావము మాత్రమె. ఈ వ్యభిచారి నిర్వే దము స్వావమాననా రూపముగ నుండును. రుదిత శ్వసితానుపాదే యతాదులచే దీని వర్ణింప వచ్చును.

౩౦౯. "దారిద్ర్యేష్టవియోగాద్యైర్నిర్వేదో నామ జాయతే
సంప్రధారణనిశ్వాసైః తస్య త్వభినయో భవేత్"

దారిద్ర్యమున నిష్టవియోగాదుల వలన నిర్వేద మనునది కలుగును. నిశ్చయనిశ్వాసములతో దాని నభినయింప వలెను. ఈ విషయమున నానువంశ్యము లయిన యీ యార్య లున్నవి.

౩౧౦. "ఇష్టజనస్య వియోగాత్ దారిద్ర్యాత్ వ్యాధితస్తథా దుఃఖాత్
బుద్ధిం పరస్య దృష్ట్వా నిర్వేదో నామ సంభవతి

౩౧౧. "బాష్పపరిప్లుతనయనః పునశ్చ నిశ్వాసదీన ముఖనేత్రః
యోగివ ధ్యానపరో భవతి హి నిర్వేదవాన్ పురుషః"

ఇష్టజనవియోగము వలన దారిద్ర్యము వలన వ్యాధి వలన దుఃఖము-వలన నిర్వేదము సంభవించును. పరుని సమృద్ధి చూచినప్పుడును నిర్వేదము కలుగును. నిర్వేదము కల పురుషుడు బాష్పపరిప్లుతనయనుడు, నిశ్వాసదీనముఖనేత్రుడు, యోగివలె ధ్యానపరుడు నగును. నిరంతరచింతావ్యాకులు డగును. కావున ధ్యాన మొనరించు వాని వలె నగును.

౨. గ్లాని: వ్యాధి, తపోనియమము, ఉపవాసము, మనస్తాపాతిశయము, మదనసేవనము, మద్యసేవనము, అతివ్యాయామము, అధ్వగమనము, క్షుత్పిపాసలు, నిద్రానాశము మొదలగు విభావములచే గ్లాని జనించును. హీనస్వరము కల క్షామవాక్యములు, నయనకపోలోదరముల యుత్క్షేపణము, మందముగా పదముల కదలిక, వేపనము, అనుత్సాహము, శరీరవైవర్ణ్యము, స్వరభేదము మొదలగు ననుభావములచే గ్లాని నభినయించి ప్రయోగింప వలెను. జరాభారమున గ్లాని కలుగును. కలాభ్యాసాదుల వలన కలుగు బలాపచయమునను గ్లాని యగును.

౩౧౨ వాన్త విరిక్త వ్యాధిషు తపసా జరసా చ జాయతే గ్లానిః
కార్శ్యేన సాభినేయా మందభ్రమణేన కంపనేన

౩౧౩. గదితైః క్షామక్షామైః నేత్రవికారైశ్చ దీనసంచారైః
శ్లథభావేనాంగానాం ముహుర్ముహుర్నిర్దిశేద్గ్లానిం

వ్యాధులలో గ్లాని కలుగును. తపసుచే వయసుచే (ముసలితనము) కలుగును. కృశత్వమున, మందభ్రమణమున కంపనమున గ్లాని నయింప వలెను. హీనస్వరము పడినమాటలతో నేత్రవికారములతో దీనదీన సంచారములతో, అవయవములు విశ్లథము లగుటలతో గ్లాని నిట్లు మరల మరల నిర్దేశింప వలెను.

౩. శంక: శంక సందేహాత్మకము. స్త్రీ నీచప్రభవము-చౌర్యము పట్టుకొనుట నృపాపరాధము పాపకర్మాచరణము మొదలగు విభావములచే నిది కలుగును. పరదారాభిషంగము విరుద్ధా

చరణముల వలన నసిష్ట మూహించుటను గూడ శంక జనించును. శంక యొకప్పుడు తనయందే కలుగును. పరునియందును గలుగును. తాను ఇతరుడు నపరాధమును సమముగ నొనర్చిన వారె యయినను రాజాదులు ఇతరునె దండించునప్పుడు శంక స్వగత మగును. ఇతరుడు వికారాకులుడై యున్నప్పుడు దోష మొనరించినాడని యాతని దండింతురు. అప్పుడు శంక పరగతము. ముహుర్ముహురవలోకనమున వస్త్రాచ్ఛాదనమున ముఖశోషణమున జిహ్వోపరిలేహనమున ముఖ నైవర్ణ్య స్వరభేద వేపథువులచే శుష్కోష్ఠ కంఠాయాసములచే నింక నిట్టి యనుభావములచే నభినయము ప్రయోగింప వలెను. అవలోక నమున పార్శ్వవిలోకనమును గూడ గ్రహింప వలెను.

౩౦౪. చౌర్యాదిజనితా శంకా ప్రాయః కార్యా భయానకే
ప్రియవ్యలీకజనితా తథా శృంగారిణీ మతా

సాధారణముగా భయానకరసమందు చౌర్యాదిజన్య మయిన శంక ప్రయోగింప వలెను. ప్రియు డొనరించిన యపరాధమున గలుగు శంక శృంగారయుక్త మగును. ఈ శంకలో నాకారగోపన ముండుటను కొందరు చెప్పుదురు. తగిన చేష్టితముల ద్వారమున దాని గుర్తింప వలెను.

౩౦౫. ద్వివిధా శంకా కార్యా హ్యాత్మసముత్థా చ పరసముత్థా చ
యా తత్రాత్మసముత్థా సా జ్ఞేయా దృష్టిచేష్టాభిః
౩౦౬. కించిత్ప్రవేపితాంగ స్త్వధోముఖో వీక్షతే చ పార్శ్వాని
గురుసజ్జమానజిహ్వః శ్యామాస్యః శంకితః పురుషః

ఆత్మసముత్థము పరసముత్థము నని శంక రెండు విధములు. అందు మొదటిది దృష్టిచేష్టలచే తెలియదగినది. శంకితపురుషుని శరీరము కంపించుచుండును. అధోముఖుడై యాతడు పార్శ్వముల జూచును. నాలుకను బిగబట్టి యుండును. శ్యామవదను డగును.

౪. అసూయ : నానాపరాధ ద్వేషపరైశ్వర్య సౌభాగ్య మేధా విద్యా లీలాది విభావములచే గలుగును. ముహుర్ద్వేషాదుల వలన గలుగు అసహనరూపమున నసూయ యుండును. అసూయ కల వాడు పరిషత్తులో పరుని దోషప్రఖ్యాపనము చేయును. గుణముల నభినందింపడు. ఈర్ష్యతో ననాదరముగ జూచును. విసురుడు

చూపులు ప్రసరింప జేయును. అధోముఖముగ నుండి బొమలు ముడు చుచు తిరస్కరించును. అవమానించును. నిందించును. ఇట్టి వన్నియు నసూయుని యనుభావములు. వీనిచే నసూయ నభినయింప వలెను. ఇం దీ యార్యలు కలవు.

> ౩౧౭. పరసౌభాగ్యైశ్వరతా మేధా లీలా సముచ్ఛ్రయాన్ దృష్ట్వా
> ఉత్పద్యతే హ్యసూయా కృతపరాధో భవేద్యశ్చ
> ౩౧౮. భ్రుకుటీకుటిలోత్కటముఖైః సేర్ష్యాక్రోధ పరివృత్త నేత్రైశ్చ
> గుణనాశనవిద్వేషైః తత్రాభినయః ప్రయోక్తవ్యః

పరునకు సంబంధించిన సౌభాగ్యైశ్వర్య మేధా లీలా వైభవములను జూడగా నసూయ కలుగును. అపరాధ మొనరించిన వాడు నసూయించును. భ్రుకుటి కుటిలము లయిన యుత్కటముఖములచే, సీర్ష్యా సహితములు సక్రోధములు నగు పరివృత్తనేత్రములచే, గుణనాశన విద్వేషములచే నసూయ నభినయింప వలెను.

౫. మ ద ము : మద్య ముపయోగింప మద ముదయించును. మద్యపానమున నానందము కలుగును. సమ్మోహమును కలుగును. ఆనందసమ్మోహ సంగమమె మదము. మద మిది త్రివిధము. ప్రథమమద ముత్తమమధ్యమాధములందు వర్ణిత మగును. ద్వితీయ మదము మధ్యమాధములం దుండును. తృతీయమద మధములందే వర్ణిత మగును.

౧. ఉత్తమగతమద మీ విధమున నుండును. స్వాపము, స్మితము, గానము, కించిదాకులత, బాష్పము, స్ఖలద్గతి, మంజుభాష ణము, రోమాంచము.

౨. మధ్యమగతమదము. హాస్యము, గీతి, ప్రస్తుత, ఆకులపాటు, భుజక్షేపము, తొట్రుపడువంకరనడక మొదలగునవి.

౩. అధమమదము. అస్మరణము, విస్మరణము, ఘూర్ణనముష్క, లద్గ మనము, రుదితము, ఛర్దితము, సన్నకంఠము, నిష్ఠీవనము మొద లగు నవి.

> ౩౨౦. "జ్ఞేయస్తుమదస్త్రివిధః తరుణో మధ్యస్తథావకృష్టశ్చ
> కరణం పంచవిధం స్యాత్ స్యాభినయః ప్రయోక్తవ్యః

౩౨౦. "కశ్చిన్మత్తో గాయతి రోదితి కశ్చిత్తథా హసతి కశ్చిత్
పరుషవచనాభిధాయీ కశ్చిత్కశ్చిత్తథా స్వపితి"

తరుణము మధ్యము అవకృష్టము నని మదము మూడువిధములు. అయిదువిధముల కరణములతో దాని యభినయమును ప్రయోగింపవలెను. మత్తుడొకడు గాన మొనరించును. మరియొక డేడ్చును. వేరొకడు హసించును. మరియొకడు పరుషవచనములు పలుకును. ఒకడు నిద్రించును. గానరోదనహాసపరుషాభిధానస్వాపములు వారివారి ప్రకృతి ననుసరించి యుండును. ఇదియె యిట్లు విశదము కాగలదు.

౩౨౧. ఉత్తమసత్త్వః శేతే హసతి చ గాయతి చ మధ్యమప్రకృతిః
పరుషవచనాభిధాయీ రోదిత్యపి చాధమ ప్రకృతిః

౩౨౨. స్మితవదనమధురరాగో హృష్టతనుః కించిదాకులితవాక్యః
సుకుమారవిష్ఠగతిః తరుణమదస్తూత్తమ ప్రకృతిః

౩౨౩. స్ఖలితాఘూర్ణితనయనః స్రస్తవ్యాకులితబాహువిక్షేపః
కుటిలవ్యావిద్ధగతిః భవతి మదే మధ్యమప్రకృతిః

౩౨౪. నష్టస్మృతిః హతగతిః ఛర్దితహిక్కాకఫైః సుబీభత్సః
గురుసజ్జమానజిహ్వో నిష్ఠీవతి చాధమప్రకృతిః

ఉత్తమసత్త్వుడగు మానవుడు మద్యము త్రావి మత్తుడయినచో శయనించును. మధ్యమప్రకృతి యగువాడు నవ్వును గానించును. అధమప్రకృతికుడు బూతులు దుర్భాషలు పలుకును. ఏడ్చును. ఉత్తమప్రకృతి మానవుడు స్మితవదనముతో నుండును. మధురముగా గానము చేయును. పులకితదేహు డగును. కొంచె మాకులముగా మాటలు పలుకును. సుకుమారముగా తొట్రుపడు నడకతో నుండును. తరుణమదమునం దుత్తముని రీతి యిది. మధ్యమప్రకృతి తొట్రుపడును. గ్రుడ్లు త్రిప్పును. జారుడు జారుడుగా వ్యాకుల వ్యాకులముగా చేతులు భుజము లెగుర వేయును. వంకర వంకరగా జారిపడుచు నడుచును. అధమప్రకృతివాడు సర్వము మఱచిపోవును. నడువలేక చదికిలపడును. డోకికొనును. వెక్కిళ్ళుకలవా డగును. కళ్ళె శ్లేష్మ ముమ్మును, చూచుటకు బీభత్సముగా నుండును. బండ

.జారిన బలువెక్కిన నాలుకకలిగి క్రాచి క్రాచి యుమ్మివేయును. ఉత్తమమధ్యమాధమముల మదమును పై విధమున నభినయింప వలెను.

౩౨౫. రంగే పిబతః కార్యా మదవృద్ధిః నాట్యయోగమాసాద్య
కార్యో మదక్షయో వై యః ఖలు పీత్వా ప్రవిష్టః స్యాత్

౩౨౬. సంత్రాసాత్ శోకాద్వా భయాత్ ప్రహర్షాచ్చ కారణోపగతః
ఉత్క్రమ్యాపి హి కార్యో మదప్రణాశః క్రమాత్ తజ్జ్ఞైః

౩౨౭. ఏభిర్భావవిశేషైః మదో ద్రుతం సంప్రణాశముపయాతి
అభ్యుదయసుఖైర్వాక్యైః యద్వైవ శోకాః క్షయం యాంతి

నాట్యరంగమున ప్రవేశించిన మానవుడు మదమభినయించు నప్పుడు నాట్యయోగము ననుసరించి రంగమున బహిరంగముగ త్రాగుచు మదవృద్ధిని క్రమముగా ప్రదర్శింప వలెను. మద్యము త్రావి రంగము ప్రవేశించునేని క్రమముగా మదక్షయ మభినయింప వలెను. సంత్రాసము శోకము భయము హర్షము మొదలగు కారణముల వశమున మదప్రణాశ మభినయించి నిరూపింప వలెను. అతిశయించిన మద మయినను సంత్రాసాదుల వలన తగ్గి పోగలదు. మదాభిజ్ఞు లట్లే దీని నిరూపింప వలెను. అభ్యుదయకరములు సుఖకరములు నయిన వాక్యములచే శోకములు క్షయము పొందునట్లు సంత్రాసాదిభావవిశేషములచే మదము శీఘ్రముగా క్షయము పొందును.

౬. శ్ర మ ము : శ్రమ మనునది మార్గగమనము వ్యాయామ సేవనము మొదలగు విభావములచే సముత్పన్న మగును. వ్యాయామాదులవలన గలిగిన మనఃశరీరఖేదము శ్రమ మగును. గాత్రపరిమర్దనము సంవాహనము నిట్టూర్పులు ఆవలింతలు మెల్లగా పదములు వేయుట నయన వదన వికూణనములు సీత్కారము మొదలగు ననుభావములచే శ్రమము నభినయించి ప్రయోగింప వలెను. ఇందిది యార్య.

౩౨౮. నృత్తాధ్వవ్యాయామాన్నరస్య సంజాయతే శ్రమో నామ
నిఃశ్వాసఖేదగమనైః తస్యాభినయః ప్రయోక్తవ్యః

నృత్తమువలన మార్గాయాసమున వ్యాయామమున నరునకు శ్రమ మనునది కలుగును. నిశ్వాస ఖేద గమనములచే దాని యభినయము ప్రయోగింప వలెను.

౭. ఆ ల స్య ము : ఖేదము, వ్యాధి, గర్భము, స్వభావము, శ్రమము సౌహిత్యము మొదలగు విభావములచే నాలస్య మనునది కలుగును. ఆలస్యము స్త్రీలకు నీచప్రకృతులకు సంబంధించి యుండును. ఈ యాలస్యము పురుషార్థములం దనాదరస్వరూపము. కొందరు శ్రమాదుల వలన పురుషార్థముల నాదరింపరు. కొందరు స్వభావసిద్ధ మగు మాంద్యమున ననాదరము కలవా రగుదురు. ఈ యాలస్య మును సర్వకర్మవిద్వేషము శయనాసన నిద్రా తంద్రీ సేవనాద్యను భావములచే నభినయింప వలెను.

౩౨౯. ఆలస్యం త్వభినేయం ఖేదోపగతం స్వభావజం చాపి
ఆహార వర్జితానా మారంభాణా మనారంభాత్

ఖేదజన్యము స్వభావజన్య మని యాలస్యము రెండు విధములు. దీని నాహారము లేమిచే కార్యారంభముల నారంభింపమిచే నభినయింప వలెను.

౮. దై న్య ము : దౌర్గత్యము మనస్తాపము మొదలగు విభావము లచే దైన్యము కలుగును. అనోజస్యము దైన్యము. దైన్యమును ధృతి లేక పోవుట, శిరోరోగము, గాత్రగౌరవము, అన్యమనస్కత మృజాపరివర్జనము మొదలగు ననుభావములచే ప్రయోగింప వలెను.

౩౩౦. చింతౌత్సుక్యసముత్థా దుఃఖాద్యా భవతి దీనతా పుంసాం
సర్వమృజాపరిమార్జనజైః వివిధై రభినయస్తస్య

చింత, తహతహల వలన పురుషులకు దీనత కలుగును. దుఃఖమున గూడ కలుగును. మృజాపరిత్యాగ కృతముగా గలుగు వివిధాను భావములచే దైన్యము నభినయించి ప్రయోగింప వలెను.

౯. చిం త : ఐశ్వర్యభ్రంశము ఇష్టద్రవ్యాపహారము దారి ద్ర్యము మొదలగు విభావములచే చింత కలుగును. దారిద్ర్యాదుల వలన గలుగు ధ్యానము చింత. ఈ చింత స్మృతిరూపము కాదు. తదన్యము. గ్రసనమున అదనము(తినుట)వలె, ఖేలనమున గమనము వలె నన్యము. నిశ్వసితోచ్ఛ్వసిత సంతాప ధ్యానాధోముఖ చింతన కృశత్వాదులచే చింత నభినయింప వలెను. వితర్కానంతరము చింత

కలుగ వచ్చును. చింతానంతరమేని వితర్క ముదయించును. వితర్కము కన్న చింత వేరు. ఆర్యు లీ యార్య లనిరి.

౩౩౧. ఐశ్వర్యభ్రంశేష్టద్రవ్యక్షయజా బహుప్రకారా తు
హృదయవితర్కోపగతా చింతా నృణాం సముత్భవతి

౩౩౨. సోచ్ఛ్వాసైః నిశ్వసితైః సంతాపైశ్చైవ హృదయశూన్యతయా
అభినేతవ్యా చింతా మృజావిహీనైరధృత్యా చ

మానవుల కైశ్వర్యభ్రంశమున నిష్టద్రవ్యనాశనమున బహువిధముగా చింత కలుగును. ఇది హృదయవితర్కోపగతము. హృదయమున వితర్క ముండగా చింత యుదయించును. చింతావ్యాకులిత హృదయునకు వితర్కము తలసూపును. ఉచ్ఛ్వాససహితము లయిన నిశ్వాసములతో సంతాపములతో మృజారాహిత్యమున ధృతిలేమిచే హృదయశూన్యత్వమున చింత నభినయింప వలెను. ఇవి చింతానుభావములు.

౧౦. మోహము : దైవోపఘాతము, వ్యసనాభిఘాతము, వ్యాధి భయము, ఆవేగము, పూర్వవైరానుస్మరణము మొదలగు విభావములచే మోహ ముదయించును. ప్రహారము మత్సరము త్రాసనము మొదలగునవియు మోహవిభావములు. వీని వలన చిత్తమునకు గలుగు మూఢత్వమును మోహ మందురు. మోహమునకు ప్రాగవస్థను మోహశబ్దమున వ్యపదేశింతురు. నిశ్చైతన్యము భ్రమణము పతనము ఆఘూర్ణనము అదర్శనము మొదలయిన యనుభావములచే నభినయింప వలెను. నిశ్చైతన్యము సర్వేంద్రియమోహము. వైచిత్త్యము కూడ మోహానుభావము. సుఖజన్యమగు మోహమును కవిప్రసిద్ధముగ నున్నది. ఈ శ్లోక మీ యార్య యీ యర్థమునకె నిరూపకములు.

333. అస్థానే తస్కరాన్దృష్ట్వా త్రాసనైర్వివిధైరపి
తత్ప్రతీకారశూన్యస్య మోహః సముపజాయతే

33౪. వ్యసనాభిఘాతభయపూర్వవైరసంస్మరణరోగజో మోహః
సర్వేంద్రియసమ్మోహాత్ తస్యాభినయః ప్రయోక్తవ్యః

అస్థానమున తస్కరులను జూడగా ప్రతీకార మొనర్పజాలని వానికి మోహము గలుగును. ఎవరేని వివిధముగ త్రాసపెట్టినందు వలనను

మోహము జనించును. వ్యసనమున పరాహతు డయినప్పుడు, భయము పొందినపుడు పూర్వవైరము స్మరించినప్పుడు రోగముకలిగినప్పుడును మోహ ముదయించును. సర్వేంద్రియ సమ్మోహమున దాని యభినయమును ప్రయోగింప వలెను.

౧౧. స్మృ తి : సుఖ దుఃఖ కృతము లయిన భావములను స్మరించుట. స్వాస్థ్యమున, గతరాత్రి నిద్ర లేనందున, సమాన దర్శన స్పర్శన, శ్రవణముల వలన నట్టివాని యభ్యాస ప్రణిధాన చింతాదుల వలనను కలుగును. దానిని భ్రూక్షేపము, శిరః కంపనము, భ్రూ ముఖ సమున్నమనము, శూన్యావలోకనము, అంగుళీ భంగము, మొదలయిన యనుభావములచే నభినయింప వలెను.

33౫. "సుఖ దుఃఖ మతిక్రాంతం తథా మతి విభావితం యథావృత్తం
చిర విస్మృతం స్మరతి యః స్మృతిమానితి వేదితవ్యో ఽసౌ

33౬. స్వాస్థ్యాభ్యాస సముత్థా శ్రుతి దర్శన సంభవా స్మృతి ర్విపుపైః
శిర ఉద్వాహన కంపైః భ్రూక్షేపై శ్చాభినేతవ్యా

గతించిన సుఖ దుఃఖమును మతి విభావిత మయిన యతీత విషయమును చిరకాలముగా మఱచిన దానిని స్మరించినచో స్మృతి కలవాడని యందురు. స్వాస్థ్యాభ్యాసముల వలన నిది కలుగును. శ్రవణ దర్శనములచే నుదయించును. అవి యిందు విభావములు. తలనూపుట, కనుబొమ లెగుర వేయుట వీనిచే దీని నభినయింప వలెను.

౧౨. ధృ తి : శౌర్యము, విజ్ఞానము, శ్రుతి, విభవము, శౌచాచార సంపత్తి, గురుభక్తి, మనోరథ లాభము, క్రీడాసిద్ధి, జ్ఞానము, తపస్సు, మొదలగు విభావములచే ధృతి కలుగును. ధృతి యనునది యాత్మ యందలి సంతోషము. ప్రాప్త విషయ భోగమున నప్రాప్తాతీతోపహత వినష్ట విషయముల నుద్దేశించి శోక తాపములు పొందక పోవుట, మొదలగు వానిచే నవ్యగ్ర భోగము కల్గును. ఇట్లు ధృతిని వర్ణింప వలెను.

33౭. విజ్ఞాన శౌచ విభవ శ్రుతి శక్తి సముద్భవా ధృతిః సద్భిః
భయ శోక విషాదాద్యైః రహితాతు సదా ప్రయోక్తవ్యా

౩౩౮. ప్రాప్తానా ముపభోగః శబ్ద స్పర్శ రూప రస గంధానాం
అప్రాప్తైశ్చ న శోకః యస్యాంహి భవేత్ ధృతి స్సాతు.

విజ్ఞానము, శౌచము, విభవము, వేద శాస్త్రాధ్యయనము, మొదలగు వానిచే ధృతి కలుగును. భయ శోక విషాదాదు లిందుండవు. ప్రాప్త పదార్థముల శబ్ద స్పర్శ రూప రస గంధముల ననుభవించుట యిందు ముఖ్యానుభావము. ధృతి యుండగా లేని వానికై శోక ముండదు. ఉన్న వానితో తుష్టి పడుట దీని స్వరూపము.

౧౩. వ్రీడ: అకార్య కరణాత్మకము, గురువ్యతిక్రమణము, అవమానము, అవజ్ఞానము, ప్రతిజ్ఞను నిర్వహింపక పోవుట, పశ్చాత్తాపము, మొదలగు వాని వలన గలుగు మనస్సంకోచ రూపముగా నుండును. నిగూఢ వదనము, అధో ముఖముగా నుండుట, ఆలోచన నొనర్చుట, భూ విలేఖనము, వస్త్రాంగుళీయక స్పర్శనము, గోళ్లు గిల్లుకొనుట, మొదలయిన యనుభావములచే వ్రీడ నభినయింప వలెను.

౩౩౯. కించి దకార్యం కుర్వన్ వీపం యో దృశ్యతే శుచిభి రన్యైః
పశ్చాత్తాపేన యుతో వ్రీడిత ఇతి వేదితవ్యో సా
౩౪౦. లజ్జా నిగూఢ వదనః భూమిం విలిఖన్ నఖాంశ్చ వినికృన్తన్
వస్త్రాంగులీయకానాం సంస్పర్శం వ్రీలితః కుర్యాత్

ఇత డకార్య మొనరించినాడని శుచిగా నుండు వారు భావించినపుడు పశ్చాత్తాపము పొందిన వాడు వ్రీడితుడని తెలియ వలెను. ఆతడు సిగ్గుచే వదన మెత్తికొనలేడు; భూమిని లిఖించును, నఖములు గిల్లి కొనును, వస్త్రము మెలి వేయును. ఉంగరము త్రిప్పుకొనును. ఇవి యాతని చేష్టలు.

౧౪. చపలత: రాగ ద్వేష మాత్సర్యా మర్షములు, ఈర్ష్యా ప్రతికూల విధానములు మొదలగు విభావములు వలన మనస్సు కుదురుగా నుండక పోవుట చపలత. ఆలోచింపకయే కార్య మొనరించుట వాక్పారుష్యము, బెదిరించుట, వధ బంధ సంప్రహార తాడనాదులు చపలతలో ననుభావములు.

౩౪౧. "అవిమృశ్య తు యః కార్యం పురుషో వధ తాడనం సమారభతే
అవినిశ్చిత కారిత్వాత్ స తు ఖలు చపలో విబోద్ధవ్యః"

పర్యాలోచన మొనరింపక వధ తాడనాది కార్యము లొనరించినపుడు మానవుడు యవినిశ్చిత కారి యగును. గావున చపలుడని తెలియ వలెను.

౧౫. హ ర్ష ము : మనోరథ లాభము, ఇష్ట జన సమాగ మము, మనః పరితోషము, దేవ గురు రాజ భర్తృ ప్రసాదము భోజనాచ్ఛాదన లాభము, ఉపభోగములు, మొదలగు విభావములచే హర్ష ముదయించును. పై వాని వలన గలుగు చేతః ప్రసాదమె హర్షము. నయన వదన ప్రసాదములు ప్రియ భాషణాలింగనములు కంటకిత పులకితములు అస్ర ఖేదాదులు మొదలయిన యనుభావము లచే హర్ష మభినయింప వలెను.

౩౪౨. అప్రాప్యే ప్రాప్యే వా లబ్ధేఽర్థే ప్రియ సమాగమే వాపి
హృదయ మనోరథ లాభే హర్ష స్సంజాయతే పుంసామ్
౩౪౩. నయన వదన ప్రసాద ప్రియ భాషణాలింగనైశ్చ రోమాంచైః
లలితైశ్చాంగ విహారైః స్వేదాద్యై రభినయ స్తస్య

ప్రాప్యాప్రాప్యార్థములు లభించి నపుడు అప్రాప్తము ప్రాప్త మయి నపుడు ద్రవ్యము లభించి నపుడు ప్రియ సమాగమమున హృదయ మనోరథ లాభమున పురుషులకు హర్ష ముదయించును. నయన వదన ప్రసాదములు ప్రియ భాషణములు, ఆలింగనములు, రోమాంచ ములు లలితాంగ విహారములు, స్వేదాదులచే హర్ష మభినయింప వలెను.

౧౬. ఆ వే గ ము : ఉత్పాతము పెనుగాలి వర్షము, అగ్ని, కుంజరోద్భ్రమణము, ప్రియాప్రియ శ్రవణము, ప్రకృతి వ్యసనము, అభిఘాతము మొదలగు విభావములచే కలుగును. ఆవేగమునకు సంభ్రమ మని పేరు. ఉత్పాత కృత మనగా విద్యు దుల్కా నిర్ఘాత ప్రపతన చంద్ర సూర్యోపరాగ కేతు దర్శనములచే కలుగును. సర్వాంగ స్రస్తత, వైమనస్యము, ముఖ వైవర్ణ్యము, విషాదము, విస్మయము మొదలగు వానిచే నుత్పాత కృతావేగ మభినయింప

వలెను. వాత కృతావేగమును అవగుంఠనము, నేత్ర పరిమార్జనము, వస్త్ర సంగ్రహణము, త్వరిత గమనము మొదలగు వానిచే నభిన యింప వలెను. వర్ష కృతావేగమును సర్వాంగ సంపీడనము ప్రధావ నము, ఛన్నాశ్రయ మార్గణము మొదలగు వానిచే నభినయింప వలెను. అగ్ని కృతమును ధూమాకుల నేత్రత, అంగ సంకోచనము, విధూననము, అతిక్రాంతాపక్రాంతములు, మొదలగు వానిచే నభిన యింప వలెను. కుంజరో ద్భ్రమణ కృతమును త్వరితాపసర్పణము, చంచల గమనము, భయ స్తంభ వేపథువులు. పశ్చాదవలోకనము, విస్మయము మొదలగు వానిచే నభినయింప వలెను. ప్రియ శ్రవణ కృతమును అభ్యుత్థానము, ఆలింగనము, వస్త్రాభరణ ప్రదానము, అశ్రు పులకితాదులచే నభినయింప వలెను. అప్రియ శ్రవణము వలని యావేగమును భూమి పతన, విషమ వివర్తన, పరిధావన, విలాప నాక్రందనాదులచే నభినయింప వలెను. ప్రకృతి వ్యసన కృతమును సహసాపసర్పణము, శస్త్ర చర్మ వర్మధారణము గజ తురగ రథారో హణము, సంప్రహారణము మొదలగు వానిచే నభినయింప వలెను. సంభ్రమాత్మక మయిన నీ యావేగ మిట్లష్ట వికల్పములతో నున్నది. ఉత్తమ మధ్యములం దిది స్థైర్యముతో నుండును. నీచుల కపసర్పణ ములతో నుండును. ఆవేగ విభాగములుగా జెప్పిన వానిలో నన్ని టను ఆదిశబ్దమును కలుపుకొన వలెను. కాగా నుత్పాతాదులు, వాతాదులు వర్షాదులు, అగ్న్యాదులు, గజాదులు, ప్రియ శ్రవణా దులు, అప్రియ శ్రవణాదులు ప్రకృతి వ్యసనాదులుగా విభావము లుండునని స్పష్ట మగును. అట్లే విస్మయాదులు, అవ గుంఠనాదులు, ఛత్ర ఛన్న శ్రయణాదులు, ధూమాంధ్యాదులు, త్వరితాపసర్ప ణాదులు, పులకాదులు, విలాపాదులు, సన్నహనాదులుగా నను భావము లుండునని తెలియ దగి యున్నది.

౩౪౪. అప్రియ నివేదనాద్వా సహసా హ్యభిధారితారి వచనేన
శస్త్రాక్షేపాత్ త్రాసా దావేగో నామ సంభవతి

౩౪౫. అప్రియ నివేదనాద్యో విషాద భావాశ్రయోనుభావోస్య
సహసారిదర్శనాచ్చేత్ ప్రహరణ పరిఘట్టనైః కార్యః

అప్రియ నివేదనము వలన నావేగము కలుగును. సహసా శత్రు వచన నిశ్చయమున నావేగము కలుగును. శస్త్రాక్షేపమునను భయమునను ఆవేగము కలుగును. అప్రియ నివేదనమున గలుగు నావేదనమును విషాద భావాశ్రయము లయిన యనుభావములతో యభినయించునది. శత్రు దర్శనము వలన కలుగు దానిని ప్రహరణ పరిఘట్టనములచే ప్రదర్శింప వలెను.

౧౭. జ డ త : ఏ కార్యము నందు గాని ప్రతిపత్తి లేకుండుట. అర్థ పరిజ్ఞానము లేక పోవుట, ఇష్టానిష్ట శ్రవణ దర్శనములచే, వ్యాధ్యాదులచే జడత కలుగును. ఈ జడత నేమియు పలుక కుండుట నూట్లాడించ కుండుట తూష్ణీంభావము, అనిమేష నిరీక్షణము, పరవశత్వము, మొదలగు ననుభావములచే నభినయింప వలెను.

౩౪౮. ఇష్టం వానిష్టం వా సుఖ దుఃఖే వా న వేత్తి యో మోహాత్
తూష్ణీకః పరవశగో భవతి స జడ సంజ్ఞికః పురుషః

జడుడని పేరు పడిన పురుషుడు మోహమున నిష్టమనిష్టము, సుఖ దుఃఖ మేమియు గుర్తింపడు. ఊరకనే యుండును. పరవశు డగును. జడిమ కలిగినపుడు చిత్తమున స్పంద ముండదు. స్పందము లేమి యేమియు గుర్తింపడు. ఇదియే సర్వకార్యాప్రతిపత్తి.

౧౮. గ ర్వ ము : ఐశ్వర్య కుల రూప యౌవన విద్యా బల ధన లాభాది విభావములచే గర్వము కలుగును. గర్వము వలన నితరుల తిరస్కరించును. గర్వమున నీ యనుభావము లుండును. అసూయ, అవజ్ఞ, ఆధర్షణము, సమాధానము చెప్పక పోవుట. భాషింపక పోవుట, తన అవయవముల చూచి కొనుట, విభ్రమము, అపహాసనము. వాక్పారుష్యము, గురువుల నతిక్రమించుట, యధిక్షేప వచనము, శూన్యావలోకనము, విడి పడి పోవుట, మొదలగునవి వానిచే గర్వమును వర్ణింప వచ్చును.

౩౪౭. "విద్యావాప్తేః రూపా దైశ్వర్యాత్ అథవా ధనాగమా ద్వాపి
గర్వః ఖలు నీచానాం దృష్ట్యంగ విచాలనైః కార్యః

విద్యా ప్రాప్తి వలన గర్వము కలుగును. రూపమున నైశ్వర్యమున గలుగును. ధనము వచ్చినను గర్వము వచ్చును. గర్వము నీచ

భావుల భావము. దృష్ట్యంగ విచాలనములచే గర్వ మభినయింప వలెను.

౧౯. విషాదము : కార్య భంగము వలన దైవ వ్యాపత్తి వలన విషాదము కలుగును. ఉపాయము లేనందున ప్రారంభించిన కార్యము భంగ పడినపుడు కలిగిన మనఃపీడ విషాద మగును. ఇందు సహాయాన్వేషణము, ఉపాయ చింతనము, ఉత్సాహ విఘాతము, వైమనస్యము, నిశ్వసితము, మొదలగు ననుభావము లుత్తమ మధ్యముల కుండును. పరిధావనము, ఆలోకనము, ముఖశోషణము, సృక్వ భాగములను నాలుకతో స్పృశించుట, నిద్ర, శ్వసితము, ధ్యానము, మొదలయిన యనుభావము లధమగతముగా నిరూపింప వలెను.

౩౪౮. కార్య నిస్తరణా ద్వా చౌర్యాభిగ్రహణ రాజదోషా ద్వా
దైవాదర్థ విపత్తే ర్భవతి విషాదః నహ పుంసామ్

౩౪౯. వైచిత్త్యో పాయ చింతాభ్యాం కార్య ముత్తమ మధ్యయోః
నిద్రా నిశ్వసిత ధ్యానైః అధమానాం తుయోజయేత్

కార్య భంగము, చౌర్యాభిగ్రహణము, రాజ దోషము, దైవ ప్రాతికూల్యము, దారిద్ర్యము, కార్య విపత్తి, మొదలగు వాని వలన పురుషులకు విషాదము కలుగును. ఉత్తమ మధ్యములకు విచిత్తత యుపాయ చింతనములచే విషాదము కూర్ప వలెను. అధములకు నిద్రా నిశ్వసిత ధ్యానములచే కూర్ప వలెను.

౨౦. ఔత్సుక్యము : ఔత్సుక్య మనునది విలంబమును సహింప లేకపోవుట, ఇష్టానుస్మరణము, ఇష్ట జన వియోగము, ఉద్యాన దర్శనము, మొదలగు విభావములచే కలుగును. దానిని త్వర దీర్ఘ నిశ్వసితము. ఉచ్ఛ్వసితము, కార్శ్యము, మనశ్శూన్యత, దిగవలోకనము, రణరణకత, అధోముఖ విచింతనము, నిద్ర, ఆలస్యము, శయనాభిలాష, మొదలయిన యనుభావములచే నభినయింప వలెను.

౩౫౦. ఇష్టజనస్య వియోగాత్ ఔత్సుక్యం జాయతే హ్యనుస్మృత్యా
చింతా నిద్రా తంద్రీ గాత్ర గురుత్వై రభినయోఽస్య

ఇష్టజన వియోగమున త దనుస్మరణమున నౌత్సుక్యము జనించును. చింతా నిద్రా తంద్రీ గాత్ర గురుత్వములచే దాని యభినయ

ముండును. ఔత్సుక్య మనునది యొక విధమగు చిత్తములోని వేదన. దీనినే తహ తహ యందురు. ఔత్సుక్య ముత్సుకత్వము కలిగి యుండుట కాదు.

౨౧. ని ద్ర : దౌర్బల్యము శ్రమ క్లమ మదాలస్య చింతన ములు, అత్యాహారము స్వభావము మొదలగు విభావములచే కలుగు మనస్సమ్మీలనము నిద్ర యగును. వదన గౌరవము, శరీరావలోక నము, కన్నులు త్రిప్పుట, ఒడలు విరచు కొనుట, మాంద్యము, ఉచ్ఛ్వసితము, సన్న గాత్రత, నేత్ర నిమీలనము, ఆవలించుటలు, మొదలగు ననుభావములచే నిద్ర నభినయింప వలెను.

౩౫౧. ఆలస్యాత్ దౌర్బల్యాత్ క్లమాత్ శ్రమాత్ చింతనాత్ స్వభావాచ్చ
రాత్రౌ జాగరణాదపి నిద్రా పురుషస్య సంభవతి
౩౫౨. తాం ముఖగౌరవ గాత్ర ప్రతిలోలన నయన మీలన జడాద్యైః
జృంభణ గాత్రవిమర్దై అనుభావై రభినయేత్ ప్రాజ్ఞః

ఆలస్యము దౌర్బల్యము క్లమము శ్రమము చింతనము స్వభావము రాత్రి జాగరణముల వలన పురుషునకు నిద్ర సంభవించును. పై హేతువులచే చిత్తమునకు వికసన ముండదు. అది నిమీలనము పొందును. అపుడు నిద్ర కలుగును. నిద్రా భావము ముఖము బరు వుగా నుండుట, అంగ భంగము, నేత్ర మీలనము జడిమ, జృంభ ణము, గాత్ర మర్దనమునను ననుభావములచే నభినయింప వలెను.

౨౨. అ ప స్మా ర ము : దేవ యక్ష నాగ బ్రహ్మ రాక్షస భూత ప్రేత పిశాచ గ్రహణానుస్మరణ ఉచ్ఛిష్ట శూన్యాగార సేవన, అశుచి కాలాంతరాపరిపతన వ్యాధ్యాదు లపస్మారమున విభావములు. గ్రహ భూతాదుల వలన మానవునకు ధాతు వైషమ్యము కలుగును. దానిచే చిత్తము పట్టు దప్పి యావేశము పొందును. అపస్మార మిట్టి యావేశ రూపము. శ్మశాన సంచారమున, నుచ్ఛిష్ట గమనమున, నిట్టి యావేశము కలుగ వచ్చును. స్ఫురిత నిశ్వసితోత్కంపిత ధావన పతన స్వేద స్తంభన వదన ఫేన జిహ్వా లేహనా ద్యనుభావము లచే నపస్మారము నభినయింప వలెను. సామాన్యముగా నీ యపస్మా రము రస భావాభాస ఘట్టములందే సముచిత మగును.

౩౫౩. భూత పిశాచ గ్రహణానుస్మరణోచ్ఛిష్ట శూన్య గృహ గమనాత్
కాలాంతరాతిపాతాత్ అశుచేతశ్చ భవ త్యపస్మారః

౩౫౪. సహసా భూమౌ పతసం ప్రవేపసం వదన ఫేన మోక్షశ్చ
నిస్సంజ్ఞ స్యోత్థానం రూపా ణ్యేతా స్యపస్మారే

అపస్మారము భూత పిశాచ గ్రహణముల వలన భూతాదుల స్మరణ మున నుచ్ఛిష్ట సేవనమున శూన్య భవన ప్రవేశమున కాలాంతరాతి పాతమున నశుచి వలనను కలుగును. వెంటనే భూమిపై పడుట, కంపించి పోవుట, ముఖమున నురుగులు గ్రక్కుట, సంజ్ఞా రహిత ముగా నుండుట, యూరకనే లేచుట యనునవి యపస్మారమున చేష్టల రూపములు.

౨౩. సు ప్త ము : నిద్రాభిభవము సుప్తము. ఇంద్రియ విషయముల ప్రాప్తి, మోహనము, భూ తలమున శయన ప్రసారణాను కర్షణము మొదలగు విభావములచే సుప్తము కలుగును. నిద్రచే కలి గిన తిరస్కారము అని యనుట నిద్రోద్భవమునే సూచించును. నిద్ర యొక్క గాఢావస్థయె సుప్తమగును. ఉచ్ఛ్వాసితము, సన్న గాత్రత, నేత్ర నిమీలనము, సర్వేంద్రియ సమ్మోహనము, పలవరింతలు మొదలయిన యనుభావములచే దీని వర్ణింప వలెను, అభినయింప వలెను. విషయానుభవము వలన గలిగిన యింద్రియ సంతుష్టి సుప్తము నకు హేతు వగు ననుట యింద్రియ మోహన స్థితి సుప్తమునకు కారణ మగు ననుట, సుప్తములోని యాకృతి విశేషములను సూచిం చును.

౩౫౫. నిద్రాభిభవేంద్రియోపరమణ మోహై ర్భవే త్సుప్తం
అక్షి నిమీలోచ్ఛ్వసనైః స్వప్నాయిత జల్పితైః కార్యః

౩౫౬. సోచ్ఛ్వాసైః నిశ్వాసైః మందాక్షి నిమిలనేన నిశ్చేష్టః
సర్వేంద్రియ సమ్మోహాత్ సుప్తం స్వప్నైశ్చ యుంజీత

నిద్ర వలన గలిగిన యభిభవము, యింద్రియ విరమణము, మోహస్థితి మొదలగు వానిచే సుప్తము కలుగును. అక్షి నిమీలనము, ఉచ్ఛ్వ సనము, కలవరింతలు, మొదలగు వానిచే సుప్తాభినయ మొనరింప వలెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు, మెల్లగా నేత్ర నిమీలనములచే

నిశ్చేష్టుడై సర్వేంద్రియ సమ్మోహమున స్వాప్నాయితములచే సుప్త మును ప్రయోగింప వలె ననియు నిరూపించిరి.

౨౮. వి బో ధ ము : ఆహార పరిణామ నిద్రాచ్ఛేద, స్వాప్నాంత తీవ్రశబ్ద స్పర్శ శ్రవణాది విభావములచే విబోధము కలు గును. స్వప్న జల్పనము కూడ ప్రబోధ విభావము. ఆహార పరిణామ మును విభావము, జృంభణము, అక్షి పరిమర్దనము శయ్యా మోక్ష ణము, మొదలగు ననుభావములచే విబోధ మభినయింప వలెను. ఇందొక యార్య యున్నది.

౩౫౭. ఆహార విపరిణామాత్ శబ్ద స్పర్శాదిభిశ్చ సంభూతః
ప్రతిబోధ స్త్వభినేయో జృంభణ వదనాక్షి పరిమర్దైః

ఆహార పరిణామమున ప్రతిబోధము కలుగును. శబ్ద స్పర్శాదులచే గూడ కల్గును. జృంభణములు, ముఖనేత్ర పరిమర్దనములు. దీని నభిన యించు ననుభావములు, భుజక్షేపము, అంగుళి స్ఫోటనము, గ్రీవాంగ వలనము, మొదలగునవి గూడ ప్రబోధానుభావము లగును.

౨౫. అ మ ర్ష ము : విద్య, ఐశ్వర్యము, బలము, అధిక ముగా కలవా రధిక్షేప మొనర్పగా నమర్ష కలుగును. అవమానితు నకు నమర్ష యుదయించును. అమర్ష గలిగినపుడు ప్రతిక్రియ నాచ రింప వలెనని భావ తీవ్రత యుండును. శిరః కంపనము, ప్రస్వేదనము, అధోముఖ చింతనము, ధ్యానము, అధ్యవసాయము, ఉపాయ సహాయా న్వేషణము, మొదలగునవి యమర్ష యనుభావములు.

౩౫౮. అధిక్షిప్తానాం సభామధ్యే విద్యా శౌర్య బలాధికైః
నృణాం ఉత్సాహ సంయోగా దమర్షో నామ జాయతే

౩౫౯. ఉత్సాహాధ్యవసాయాభ్యాం మధోముఖ విచింతనైః
శిరః ప్రకంప స్వేదాద్యైః తం ప్రయుంజీత పండితః

సభా మధ్యమునందు విద్యా శౌర్య బలాధికులచే నధిక్షిప్తు లయిన మానవుల కమర్ష కలుగును. ప్రతి చికీర్షా రూప మయిన యుత్సాహ సంయోగము వలన నమర్ష కలుగును. ఉత్సాహాధ్యవసాయములు, అధోముఖ విచింతనములు, శిరఃకంపము, స్వేదము, వీనిచే పండితు డమర్షను ప్రయోగింప వలెను.

౨౬. అవహిత్థము : ఆకార ప్రచ్ఛాదనాత్మకము. అది లజ్జా భయాపజయ గౌరవ జిహ్మతాది విభావములచే నుత్పన్నమగును. అన్యథా కథనము, అన్యథావలోకనము, కథా భంగము, కృతక ధైర్యము, మొదలగు ననుభావములచే తదభినయమును ప్రయోగింప వలెను.

> ౩౬౦. ధార్ష్ట్యజైహ్మ్యాది సంభూత మవహిత్థం భయాత్మకం
> తచ్చాగణనయా కార్యం నాతి చోత్తర భాషణాత్

ధార్ష్ట్యము, జిహ్మతలచే భయాత్మకమగు నవహిత్థము కలుగును. ఇతరులను లెక్కపెట్టక పోవుట, అధికముగా నుత్తరము పలుకక పోవుట, మొదలగు వానిచే దీని నభినయింప వలెను. భ్రూ వికారము ముఖ రాగము, మొదలగు వాని నిది యాచ్ఛాదన మొనరించును.

౨౭. ఉగ్రత : చౌర్యాభిగ్రహణము రాజాపరాధము. యసత్ప్రలాపము మొదలగునవి దీనిలో విభావములు. వధ బంధన తాడన నిర్భరత్సనాదికములచే నుగ్రత నభినయింప వలెను.

> ౩౬౧. శౌర్యాఽభిగ్రహణ వశాత్ నృపాపరాధాత్ అథోగ్రతా భవతి
> వధ బంధ తాడనాదిభి రనుభావైః అభినయ స్తస్యాః

పైన నిరూపించిన యర్థమె ధారణ యోగ్యముగా కారికలో నున్నది.

౨౮. మతి : నానా శాస్త్ర విచింతనమున కలుగును. ఊహాపోహాదులు మతిలో విభావములు. శిష్యున కుపదేశించి యర్థముల వికల్పించి సంశయముల ఛేదించి దీని నభినయింప వలెను. ఇందీ శ్లోక మున్నది.

> ౩౬౨. నానా శాస్త్రార్థ బోధన మతిః సంజాయతే నృణాం
> శిష్యోపదేశార్థకృతః తస్యా స్త్వభినయో భవేత్

మానవులకు నానా విధములయిన శాస్త్రార్థములను వాని సిద్ధాంతములను సావధానముగా పరిశీలన మొనర్చి నపుడు మతి కలుగును. గ్రహణ ధారణ సమర్థులగు శిష్యుల నధ్యాపనము చేసి, వారల కుపదేశన మొనరించి, సిద్ధాంతార్థము ప్రబోధించుట దీనిలో ననుభావమగును. ఈ యనుభావములచే దాని నభినయించునది.

౨౯. వ్యాధి: వాత పిత్త కఫముల సన్నిపాతమున కలుగు వ్యత్యాసముచే వ్యాధి కలుగును. జ్వరాదులు కొన్ని వ్యాధిలోని విశేషములు. జ్వరము సామాన్యముగా ద్వివిధము. సశీతము, సదాహము నని. అధికముగా చలి పుట్టును. విపరీతముగా విదాహ ముదయించును. ఇందు సశీత వ్యాధి నీవిధముగా నభినయింప వలెను. సర్వాంగములను కంపింప జేయునది. కంపాధిక్యమున లేచిలేచి పడుటలును దీని యనుభావమె. శరీరము ముడుచుకొనుట యగ్ని వేడిమి కావలయునని యభిలషించుట, రోమాంచము ప్రదర్శించుట దవడలు పీకు, నాసా వికూణనము, ముఖ శోషణము, పరిదేవితము మొదలగునవి యన్నియు నిం దనుభావములు. సదాహ జ్వర మీ విధముగ నుండును. అవయవములు నటు నిటు కొట్టుకొనుట, కర చరణములను కదలించుట, నేలపై పడుకొనవలయు నని యభిలాషణము, చల్లని పూత పట్టించు కొనవలయునని కోరిక, చల్లని గాలి నభిలషించుట, యేడ్చుట; ముఖ శోషాధిక్యము, ఇట్టి వన్నియు నిందనుభావములు. ఇతరములయిన వ్యాధులును ముఖ వికూణనము గాత్ర స్తంభము. అవయవముల ప్రస్తత కన్నుమూత, నిశ్వాసము, పెడ బొబ్బలతో వేదన పడుట మొదలగునవి యిందనుభావములు. వానిచే దానిని ట్లభినయించ వలెను.

3౬3. సామాన్యతస్తు వ్యాధీనాం కర్తవ్యో౽భినయో బుధైః
ప్రస్తాంగ గాత్ర విక్షేపైః తథా ముఖ వికూణనైః

తత్వము గుర్తించిన యభిజ్ఞులు సర్వ సమాన్యముగా వ్యాధుల యభినయ మిట్లొనర్ప వలయును. ప్రస్తాంగత, గాత్ర విక్షేపము, ముఖ వికూణనము, మొదలగునవి యన్నియు నిం దనుభావములు.

30. ఉన్మాదము: ఉన్మాదము = పిచ్చియెత్తుట. ఇష్ట జనుల వియోగమున కలుగ వచ్చును. విభవ నాశము వలన జనింప వచ్చును. మితి మీరిన దెబ్బ తగులుట వలన కలుగ వచ్చును. వాత పిత్త శ్లేష్మముల ప్రకోపములచే నుదయింప వచ్చును. ఇవి యన్నియు నిందు విభావములు. అకారణహాసము, అసమయ రోదనము, అసంబద్ధ ప్రలాపము, పెద్ద కేకలు, కూర్చొనుట, చివాలున

లేచుట, హఠాత్తుగా పరుగెత్తుట, నృత్యము చేయుట, పాటలు పాడుట, ఏమేమియో చదువుట, బూడిదలో పొర్లుట, విభూతి రుద్దుకొనుట, దుమ్ము పట్టించుకొని దులుపుట, తీగెలు, విడిచిన వస్తువులు, చిరిగిన చీరెలు, పగిలిన బొచ్చెలు, కుండ మూకుళ్ళు, ఆభరణములని భావించి, తనకవి యుపభోగములని సంభావించి, యనవస్థిత చేష్టితములతో నితరుల చేష్టితముల ననుకరించుటలతో దీని నభినయింపవలెను. ఇందీ యార్యయు తత్వము నిరూపించు చున్నది.

> ౩౬౪. ఇష్టజన విభవనాశా దభిఘాతా ద్వాత పిత్త కఫ కోపాత్
> వివిధాంచిత వికారా దున్మాదో నామ సంభవతి
>
> ౩౬౫. అనిమిత్త రుదిత హసితోపవిష్ట గీత ప్రధావితోత్క్రుష్టైః
> అన్యైశ్చ వికారకృతై రున్మాదం సంప్రయుంజీత

పై నిరూపితార్థములు యార్యా వచనములలో సూచీకృతములై యున్నవి.

౩౧. మ ర ణ ము ; ఇది రెండు విధములు. వ్యాధి వలన కలుగునది, పెద్ద దెబ్బ వలన కలుగునది అని. ఉదరములో ప్రేగులలో పుట్టిన వ్యాధులు, మాంస దోషములు, శూల నొప్పి, ఉన్నదాని నున్నట్లు గ్రహింప లేకపోవుట. విషమత్వము, గండమున మొటిమలు చిదుపగా కలిగిన ప్రమాదములు, విషజ్వరము, మశూచికాది వ్యాధులు, మొదలగువాని వలన కలుగునట్టి మరణము వ్యాధిజన్యము. అభిఘాత జన్య మయిన మరణ మీ విధముగా నుండును. శస్త్రముల వలన గాయ మధిక మగుట, కోడెత్రాచులు కొరుకుట, విషములు మ్రింగుట, క్రూర మృగములు, గజ తురగములు, బాధించుట, పశువుల నుండి, యానసములనుండి ప్రపాతము పొందుట, అట్లాకస్మిక ఘటనమున వినాశము జనించును. వీనికి సంబంధించిన యభినయ విశేషములను చెప్పెదము. వ్యాధి జన్య మయిన మరణమున విషణ్ణ గాత్రత, వ్యాయతాంగ విచేష్టితము, కళ్లుమూసికొని పోవుట, ఎక్కిళ్లు వచ్చుట, దీర్ఘ శ్వాసములు, ఊపిరి తగ్గుటలు, అన్నియు నభినయములు. ఇందు పరిజనమును చూడరు. అవ్యక్తముగా నక్షరముల పల్కుదురు. ఇట్టి యనుభావములచే దీని నభినయింప వలెను.

అభిఘాత జన్యమయిన మరణమున నానా ప్రకారము లయిన యభినయ విశేషము లున్నవి. శస్త్ర క్షతము, అహి దంశము, విష పానము, గజాది వినిపాతము, క్రూర మృగములు నాశన మొనరించుట దీని యభినయములు. శస్త్రక్షతము కలిగినపుడు వెంటనె భూమిపై పడవలయును. కంపించి పోవలయును, కదిలి పోవలయును. ఇట్టివి త దభినయములు. విష వేగమున కార్శ్యము, వేపథు, విదాహము, ఎక్కిళ్ళు నురుగు కక్కుకొనుట, శరీరము దిగజారి పోవుట, జడత, మరణము, ఇవి యన్నియు విషవేగములుగా నున్నవి. ఈ శ్లోకములను చూడుడు.

> ౩౬౬. వ్యాధినా మేకభావోహి మరణాభినయ స్మృతః
> విషణ్ణగాత్రైః నిశ్చేష్టైః ఇంద్రియైశ్చ వివర్జితః

వ్యాధులన్నియు గుమికూడి వచ్చుట మరణాభినయమని ప్రసిద్ధముగా నున్నది. చేష్టలులేని విషణ్ణ గాత్రములు, ఇందుండును. ఇంద్రియముల పరిజ్ఞానము దీనిలో నుండదు. విషవేగము కలిగినపుడు ప్రథమ వేగములో చిక్కిపోవును. రెండవ వేగములో కంపము జనించును. మూడవ సమయమున దాహము, హిక్క నాల్గవది. ఫేనము అయిదవది. స్కంధ భంగ మారవది. ఏడవది జడత. మరణ మష్టమము. ఇట్లే దీని నిరూపించునది. మరణమునందు నానా విధములయిన యవస్థలు జనించును. అందలి భావములను చేష్టితములను గుర్తించి, అభినయ విదులయిన నాట్య బుధులు దీనిని బాగా ప్రయోగింప వలసి యున్నది.

౩౨. త్రా స ము : విద్యు దుత్పాతము, ఉల్కా పతనము, అశని నిపాతము, నిర్ఘాతము, పెద్ద ఉరుములు, మహా జంతువుల ధ్వనులు, ఇట్టి వన్నియు నిందు విభావములు. శరీరము ముడుచుకొనుట, కంపించి పోవుట, మహాకంపము, నిశ్చేష్టతా రూపమయిన స్తంభము, రోమాంచ గద్గద ప్రలాపాదులు అన్నియు నిం దనుభావములు. ఈ యర్థమునే నిరూపించుచు నీ శ్లోక మానువంశ్యముగా వచ్చినది.

> ౩౬౭. మహాభైరవ నాదాద్యైః త్రాసః సముపజాయతే
> త్రస్తాంగాక్షి నిమేషైశ్చ తస్య త్వభినయో భవేత్

గొప్ప గొప్ప విరుద్ధ నాదములచే త్రాసము జనించును. స్రస్తాంగత్వ, అక్షి నిమేషము మొదలగునవి యిం దనుభావములు.

33. వితర్కము : సందేహము, విమర్శము, విప్రతిపత్తి మొదలగునవి యిందు విభావములు. రెండు విధములుగా నాలోచనము చేయుట, ఏ పక్ష మవలంబింపక సందేహించుట, ప్రశ్న నిశ్చయము, ఆలోచనము కప్పి పుచ్చుట, ఆకార గోపనము మొదలగునవి యన్నియు దీని యనుభావములు.

౩౬౮. విచారణాది సంభూతః సందేహాతిశయాత్మకః
వితర్కః సోఽభినేయస్తు శిరో భ్రూక్షేప సంపన్నః

విచారణాదుల వలన కలుగును. సందేహాతిశయమున నుండును. ఇట్టిది వితర్కము. శిరో భ్రూక్షేప కంపనములచే దీని నభినయించు నది. ఇట్లు ముప్పదిమూడు వ్యభిచారి భావములు దేశకాలా వస్థాను రూపముగ ఆత్మగత పరగతాది విభాగమున మధ్యస్థ మయిన రీతిచే నుత్తమ మధ్యమాధములు స్త్రీ పురుషులు తమ తమ ప్రయోగ వశమున వీని నుపపాదించి సామాజిక హృదయ సంవాదము సంపాదింప వలసి యున్నది. ఇంక నిటుపై సాత్విక భావములను యథాను కూలముగ నిరూపించెదము.

## సాత్వికములు

సాత్విక భావములను నిరూపింతు మనుటచే వక్ష్యమాణములే సాత్వికము లని స్పష్ట మయినది. ఇతర భావములు సత్వము లేక యభినీతము లగునా ? వీనినే సాత్వికములని యనుట యేల ? సర్వ భావములకు మూలము సత్వము. సత్వ శాలియె భావముల నభిన యింప గలడు. సత్వ శీలి సామాజికుడె యాస్వాదింప గలడు. అంతట సత్వ సామ్రాజ్య మున్నది ఇతరములు సత్వ సంపన్నములు కావనుట హృదయ తోష మిచ్చునదిగ లేదు. ఇట్టి యాశంక కలుగగా నిది చెప్పవలసి వచ్చు చున్నది. సాత్వికములందే సత్వ మున్నది. ఇందు సత్వ మనునది మనః ప్రభవ మయిన యొక విశేషము. సమాహిత మనస్కత్వ మున్న నే సత్వ ముపపన్న మగును. మనస్సమాధిలో సత్వము జనించునని భావము. రోమాంచాశ్రు వైవర్ణ్యాదులు ఆ

సత్వ స్వభావములు. యథా భావోపగతము లయిన నివి యన్య మన స్సుతో నుండగా నిరూపింప శక్యములు కావు. లోక స్వభావానుకరణ ముండును గావున నాట్యమున సత్వ ముండుట యిష్ట మయినది. నాట్యధర్మి ప్రవృత్తము లయిన సుఖ దుఃఖ కృత భావములన్నియు సత్వ విశుద్ధములు కావలయును. అప్పుడవి యథా స్వరూపములు కాగలవు. రోదనాత్మక మయిన దుఃఖమున దుఃఖితు డభినయింప జాలడు. ప్రహర్షాత్మకమయిన సుఖము నసుఖితు డభినయింప నేరడు. దుఃఖిత సుఖితులు మాత్రమె సమర్థులు కాగలరు. అట్టి వారే యస్ర రోమాంచములను ప్రదర్శింప వలసి యుండును. అందు ననే యివి సాత్వికములని భావ వర్గములో నభివ్యాఖ్యాతము లయినవి. సాత్విక భావము లెనిమిది కలవు.

| | |
|---|---|
| స్తంభము | స్వేదము |
| రోమాంచము | స్వరభేదము |
| వేపథువు | వైవర్ణ్యము |
| అశ్రువు | ప్రలయము |

ప్రాణాత్మక మయిన వస్తు తత్వమునకు సత్వమని పేరు. మనస్సందు మగ్న మగును. అట్టి సత్వమున కలిగిన వగుటచే నివి సాత్విక భావములయినవి. సత్వ గుణ మధికముగా నుండుట వలన సాధుత్వము కలిగి యున్నందునను ప్రాణవస్తువునే సత్వ మందురు. ఇట్లు జనించు భావములివి సాత్విక భావములు. ఇవి యీ విధముగా నాస్వాద్యములగును. రత్యాది సంవేదన రూపము లయిన వృత్తు లన్నియు ప్రాణ భూమిలో ప్రసారము పొందినవై బాహ్యము జడమయిన భౌతిక నేత్ర జలాది విలక్షణములై భాసించును. రత్యాది గతమయిన విభావ సంపదయె ఇందును చర్వణా గోచర మగును. నానానుభావములు వీని నవగమింప జేయును. ఇట్లివి భావ సంజ్ఞికము లయినవి. పృథ్వీ భాగ ప్రధానమయిన ప్రాణము నంటు సంక్రాంత మయిన చిత్తవృత్తి గణము స్తంభ మగును. అపుడు చేతన స్వభావము విష్టబ్ధ మగును. ప్రాణమునకు జల భాగ ప్రాధాన్యము కలుగగా బాష్ప ముదయించును. తేజస్సునకు ప్రాణ నైకట్య మున్నది. ఇందుచే ప్రాణానుగ్రహము తీవ్రముగా నతీవ్రముగా నుండును. ఇట్లు రెండు విధముల

సంబంధమున స్వేదము, వైవర్ణ్యము కలుగును. ప్రాణ మాకాశా నుగ్రహము పొందినచో గత చేతనాత్మక మయిన ప్రళయము కలుగును. వాయు స్వాతంత్ర్యములో ప్రాణమునకు మంద మధ్యోత్కృష్టా వేశము కలుగును. ఈ మూడు రీతులచే రోమాంచము, వేపథువు, స్వరభేదము కలుగును. ఇట్లు సాత్త్విక భావస్థితి యున్నదని భరత విదులు పలుకుదురు. బాహ్యములుగా గోచరించు స్తంభాదులు శరీర ధర్మము లయిన యను భావములు. అవి ఆంతరాలికము లయిన సాత్త్విక భావములను గోచరింప జేయ గలవు. పరమార్థముగా నివి యన్నియు రతి నిర్వేదాది గమకము లనుట స్థిర సిద్ధమయినే యర్థము.

౧. స్తంభము: హర్షము భయము రోగము విస్మయము విషాదము రోషము మొదలగు వాని వలన నిది కలుగును. నిస్సంజ్ఞత, నిష్ప్రకంపత, శూన్య జడాకృతిత్వము, స్కన్న గాత్రత, స్తంభ మభినయించుటలో నుపకరింప గలవు. వీని బుధు డుపయోగించును. కారిక లిట్లున్నవి.

> ౩౬౯. హర్ష భయ రోగ విస్మయ విషాద రోషాది సంభవః స్తంభః
> నిస్సంజ్ఞో నిష్ప్రకంపశ్చ స్థితః శూన్యజడాకృతిః
> స్కన్నగాత్రతయా చైవ స్తంభం త్వభినయేద్బుధః

హర్షాదిపరవశ మయిన మనస్సు ఇంద్రియ ప్రదేశములందు సంచరింపదు. వికల్పపర్యంత మయిన గమనముతో నుండదు. అవికల్పక ములై బహిర్వృత్తిమాత్ర నిష్ఠము లయిన నింద్రియముల కీ స్తంభ మధిష్ఠానము కాదు. కావుననే స్తంభము విష్టబ్ధచేతన స్వరూప మయినది. రత్యాదిగతము లయిన విభావములే గాని ఇతరవిభావ ములు వీనిలో నుండవనుట పునరుక్త మయిన నావశ్యకము. ఈ సాత్త్వికము లన్నియు బాహ్యవిషయ విశేషముల యాభిముఖ్య మపేక్షింపవు. వ్యభిచారిభావములలో గ్లాన్యాలస్యశ్రమమూర్ఛాదులు కొన్ని యాలంబనవిషయశూన్యములే యగును గాని బాహ్యహేతుక ములుగా నుండును. స్తంభాదు లబాహ్య హేతుకములు.

౨. స్వేదము: క్రోధము, భయము, హర్షము, లజ్జ, దుఃఖము, శ్రమము, రోగము, తాపము, ఘాతములు, వ్యాయామ

శ్రమము, ఘర్మము, సంపీడనము, వీని వలన స్వేదము కలుగును. వ్యజన గ్రహణము, చెమట తుడిచి కొనుట, వాతాభిలాషము, మొదలగు వాని నభినయించి స్వేదము ప్రయోగింప వలయును.

3. రోమాంచము: స్పర్శ విశేషము, భయము, శీత వాత సంబంధము, హర్షము, క్రోధము, రోగము, హేతువుగా రోమాంచము కలుగును. దీని నభినయించుటలో గగురుబాటు కలిగినదని కంటకిత రూపముగా, నుల్లుకసన విశేషమున, పులకములచే, తన శరీరమును తాను స్పృశించుటచే, రోమాంచము నభినయింప వచ్చును.

4. స్వరభేదము: భయ, హర్ష, క్రోధ, జరా, రూక్షతా, రోగ, మదములచే స్వరభేదము కలుగును. దీనినే వైస్వర్యమని స్వరసాదమని వ్యవహరించిరి. గద్గద స్వరమున స్వర భేదము నభినయింప వలెను.

5. వేపధువు: శీతబాధ, భయము, హర్షము, రోషము, స్పర్శము, ముసలి తనము, వీని వలన నిది కలుగును. దీనికి కంప మనియు పేరు. వేపన స్ఫురణ కంపనములచే వేపధువు నభినయింప వలెను.

6. వైవర్ణ్యము: శీత క్రోధ భయ, శమ, రోగ, క్లమ, తాపములచే వైవర్ణ్యము కలుగును. వీని నభినయించు నపుడు ముఖ వర్ణ పరావర్తనము, నాడీ పీడనము, ననుసరించుట సముచితము.

7. అశ్రువు: అశ్రువునకే అస్ర మనియు వ్యవహారము. అనిమేష ప్రేక్షణమున శీత రోగముల వలన నిది కలుగును. బాష్పాంబు ప్లుత నేత్రుడై నేత్రములను తుడిచి కొనుచు నశ్రుకణముల విడుచుచు నస్రము నభినయింప వలెను.

8. ప్రళయము: శ్రమ మూర్ఛా మద నిద్రాభిఘాత మోహాదులచే ప్రళయము కలుగును. నిశ్చేష్టుడై, నిష్ప్రకంపుడై, నిట్టూర్పులు వ్యక్తము కాకుండునట్లు భూ పతనమున ప్రళయ మభినయింప వలెను. నిలబడినచో శూన్య జడాకృతియై యుండును.

ఈ నిరూపించిన యనుభావములు ఆ యా రస విశేషములకు సంబంధించిన యనుభావముల కలయిక కలవిగనే యుండును. ఇట్లీ భావము లన్నియు "ఏకోన పంచాశత్" నలుబది తొమ్మిది. ఈ భావ వర్గము స్థాయి వర్గమని వ్యభిచారి వర్గమని సాత్త్విక వర్గమని నిరూపిత మయినది. రస వినియోగములో వీనికొక వ్యవస్థయు కలదు. అది యిక ప్రకృతము ప్రతిపాదనార్హము.

## రస వినియోగము

ఆలస్యము, ఉగ్రత, జుగుప్స విడనాడి మిగిలిన భావము లన్నియు తమ తమ సంజ్ఞా సంకేతములతో శృంగారము నవభాసింప జేయ గలవు. ఆ యా వ్యక్తుల సత్త్వముల ననుసరించి ప్రకృతి విశేషములను బట్టి యెట్టి భావములు సముచితము లగునో వానినే ఆ యా రసములందు నిరూపింప వలెను. స్థాయి సంచారి సత్త్వజము లయిన భావము లన్నియు యథావసర ముపయుక్తము లయినపుడె శృంగారము నుద్దీపింప జేయ గలవు.

౩౮౦. యథావసర మేతేహి స్థాయి సంచారసత్త్వజాః
ఉద్దీపయన్తి శృంగారం రసమాసాద్య సంజ్ఞితమ్

సర్వ భావముల సందోహము కూర్చినచో రస ముల్లసిత మగునను కొనుట పొరపాటు. ఆ యా భావముల నివేశన మందలి సమీహా రీతిని గమనించి సావధానులు కావలయును. గ్లాని శంక అసూయా శ్రమ చపలతా సుప్తము నిద్ర అవహిత్థము హాస్యమున నుండు భావములు. నిర్వేద చింతా దైన్య గ్లాన్యశ్రు జడతా మరణ వ్యాధులు కరుణ రసమునందుండ దగును. గర్వము అసూయ మదోత్సాహములు ఆవేగామర్షములు, క్రోధ చపలతలు ఉగ్రత రౌద్ర సంభూతము లగును. అసమ్మోహము ఉత్సాహము, హర్షావేగములు, అమర్ష మతులు, ఉగ్రతా మదములు రోమాంచ స్వర భేదములు, క్రోధాసూయలు, ధృతి గర్వములు వితర్కము వీరమున కలుగును. వేపథువు, స్వరభేదము, రోమాంచము, గద్గదము, స్తంభము మరణము, స్వేదము, వైవర్ణ్యము, భయానకమున నుండును. అపస్మారము, ఉన్మాదము మదవిషాదములు మృత్యు వ్యాధి భయములు

బీభత్సాశ్రయమున నుండును. స్తంభ, స్వేద, మోహ రోమాంచ విస్మయ మూర్ఛా జడతా హర్షావేగము లద్భుతము నందుండును.

> ౩౨౧. యేచాస్యే సాత్త్వికా భావా నానాభినయ సంశ్రితాః
> రసే ష్వేతేషు సర్వేషు తే జ్ఞేయా నాట్య యోక్తృభిః

నానా విధములగు నభినయములకు సంబంధించినవై రసోద్దీపన సమర్థము లయిన సాత్త్వికములను నాట్య ప్రయోక్తలగు వారు రసములందు ప్రయోగింప వలెను. సాత్త్వికములకు సముచిత మయిన ప్రవేశ మంతట కలదని గుర్తించుట యుక్తము. రస సూత్రము నందు సాత్త్వికము లేకున్నను ప్రాధాన్య మున్నది. ప్రాధాన్య పురస్కృత మయిన విశేషమె సాత్త్వికములకు సర్వ రసములం దర్హస్థాన మిచ్చినది.

> ౩౨౨. న హ్యేకరసజం కావ్యం కించిదస్తి ప్రయోగతః
> భావో వాపి రసోవాపి ప్రవృత్తిర్వృత్తిరేవ వా

> ౩౨౩ బహూనాం సమవేతానాం రూపం యస్య భవేద్బహు
> స మంతవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణో మతాః

> ౩౨౪. దీపయంతః ప్రవర్తంతే యే పునః స్థాయినం రసం
> తే తు సంచారిణో జ్ఞేయాస్తే హి స్థాయిత్వమాగతాః

ప్రయోగ తంత్రము ననుసరించి పరిశీలించినచో నేక రస జన్యమగు కావ్యము లేనట్లు స్పష్టమగును. మొదటి నుండి తుది వఱకు కావ్య మొక రసమునె నిబంధింపదు. అనేక రసముల నిబంధించును. నానా భావముల నిబంధించును. భావము కాని రసము కాని ప్రవృత్తి కాని వృత్తి కాని బహ్వర్థములు సమవేతములై యున్నప్పుడు దేని రూపము విస్తరముగా నుండునో యదియె రస మగును. రసీ భావము పొందదగినది భావ మగును. ఇతర భావము లన్నియు సంచారి భావములు కా గలవు. స్థాయిగా నుండు రసమును దీపింప జేయుచు ప్రవర్తించు సంచారులు కొన్ని స్థాయిత్వముపొందగలవు.

> ౩౨౫. విభావానుభావయుక్తో హ్యంగవస్తుసమాశ్రయః
> సంచారిభిస్తు సంయుక్తః స్థాయ్యేవ తు రసో భవేత్

విభావానుభావములతో గూడుకొని యంగముగా నుండు వస్తుసమాశ్రయము కలదై సంచారి సంయుక్త మయిన స్థాయి భావమె

రస మగును. స్థాయి సంచార్యాకార మాత్రమున నుండును గాని ప్రయోక్తలు సత్త్వాతిరిక్త విధానమునసె స్థాయి ప్రయోగ మొనరింప వలెను. భావ రస ప్రవృత్తి వృత్తు లన్నియు ప్రయత్న ప్రయుక్తములయి విమర్ద విశేషమున రంజనాతిశయ మాపాదింప గలవు. సత్త్వ ప్రయోజితార్థ ప్రయోగమె విరాజిల్లును.

౩౭౬. నానాభావార్థసంపన్నాః స్థాయిసత్త్వాభిచారిణః
పుష్పావకీర్ణాః కర్తవ్యాః కావ్యేషు హి రసా బుధైః

బుధు లొనరించు కావ్య రస యోజనము సుశ్లిష్ట బంధమై యుండును. నానా భావార్థ సంపన్నము లయిన స్థాయి సాత్త్విక వ్యభిచారి భావములు కీర్ణ వికీర్ణములై పుష్ప రమ్యము లగును. నానా విధములగు భావముల ప్రయోజన సంపత్తి యుండు నట్లుగ రసముల నిబంధింప వలెను. కేవల మొక్క రసమె కావ్యమున నుండదు. సర్వ భావములు నుండును. సర్వ స్థాయి భావములు యథా యోగ్యముగా నివిష్టము లగును. సాత్త్వికములు వ్యభిచారులు నిల్లి రమ్య సంబంధ దీపనములై శోభించును. రసములు పుష్పావకీర్ణము లగునట్లు సమీక్షించు బోధ బుధాధీనము. రస భావ వ్యవస్థాన నిదర్శక మయిన యిది సర్వము తెలియుట సహృదయ స్వాత్మసిద్ధి. ఇది రసభారతీ వివేకము.

## నాటక మీమాంస

నాట్యసంగ్రహమున నిరూపితార్థము లన్నియు నేకసంగతము లగుట పరస్పరము సంబంధించియె యుండును. రసభావకల్ప మంతయు దశరూపవికల్పనమున కుపయోగించును. కాగా దశరూపవికల్పనము ప్రసంగప్రాప్తము. దాని నిప్పుడు నామకర్మప్రయోగముల ప్రవర్తింప జేయుట సముచితము. ఇట్లు దీని నిప్పుడు ప్రవర్తింప జేయుట యేల? రసభావాదుల సంకేతించిన సూత్రసారసంగ్రహములో దశరూపమన్న నామమేని శ్రుతి చేరలేదు. కాని దాన నేమి? దశరూపవిధానమున పాఠ్యమును ప్రయోక్తలు యోజనము చేయవలయును. పాఠ్యవినియోగము దశరూపమునందె యగుట దశరూపవర్తన మావశ్యకము. దశరూపవికల్పన మిక వర్ణింతుము. "దశానాం రూపాణాం విభాగః

కల్ప్యతే ఇతి దశరూపవికల్పనం" పదిరూపముల విభాగ మిందు నిరూపిత మగును. కావున నిది దశరూపవికల్పనము. రూప మను నది యర్థమును ప్రత్యక్షీకరించును. తద్వాచక మగుటచే కావ్యము రూప మనదగి యున్నది. దశరూపవికల్పన మనునది పదిరూపముల విభాగకల్పన మని షష్ఠీసమాసమున సంగతము చేసికొనవచ్చును. దశరూపములు కల కావ్యము దశరూపమని బహువ్రీహియు సంగత మగును. ఇందు పదియె భేదములు. అన్యభేదములు సంగతములు కావు. ఇట్లు భేదాంతరాపాకరణము సూచించుటయు సముచితము. ఇట్లు దశరూపవికల్పన పదమును మెత్త పఱచి యేమో వ్యాఖ్యానించుట ప్రయాసమగును గాని కొంత యర్థమం దభ్యాహ్యా మున్నది. ఇకనిది పిండితార్థము. పూర్వ మభినయచతుష్టయము సంకేతించి నప్పుడు వాచికశబ్ద మందలి ప్రకృతి ప్రత్యయార్థమును భావించినచో నీ దశరూపవికల్పనము అందలి వాగ్భాగమునకె విస్తృతవర్ణన మని తెలును. కాగా సూత్రసారసంగ్రహములోని యంశప్రపంచనమె కాని యనిర్దిష్ట మిందు నిరూపిత మగుట లేదని భావము. ఇందు దశరూపవికల్పనము నామోద్దేశమున లక్షణయుక్తముగ నిరూపిత మగును. "ప్రకృష్టః ఉచితో యోగః ప్రయోగః" సముచితమయిన యోగము ప్రయోగము. ఇది పరస్పరసంబంధరూపము. ఇట్టి ప్రయోగానుసారమున గూడ దీని వర్ణింతుము. అందుచే పరస్పర సంబంధ వైచిత్ర్యకృత మయిన భేదము కూడ ఇందు త్రైవిధ్యము కావచ్చును. ప్రకరణ నాటక లక్షణసంబంధమున నాటికావిభాగము రాగలదు. అట్లే లక్షణముల పరస్పరసంకీర్ణతచే కోహలాదు లంగీకరించిన తోటక- సట్టక- రాసకాదులును సంగృహీతము లగును. ఇట్లు నామకర్మప్రయోగముల దశరూపవికల్పనము ప్రకృతము వర్ణిత మగునని యిట్లు భగవతు డాసూత్రించుచున్నాడు.

## దశరూపములు

౩౭౭. వర్ణయిష్యామ్యహం విప్రా దశరూపవికల్పనం
నామతః కర్మతశ్చైవ తథా చైవ ప్రయోగతః

ఇందలి బహుధా రూపవికల్పనము నాట్యశివుని త్రైజసచక్షువు. నాట్యలక్షణమున నివి పది యున్నవి.

నాటకము
అంకము
భాణము
వీథి
డిమము
సప్రకరణము
వ్యాయోగము
సమవకారము
ప్రహసనము
ఈహామృగము

ఇందు రెండవదానికి సప్రకరణ మని పేరు. సహాశబ్దయోగము నాటకమునందువలె నంక ప్రవేశక సంధ్యాది సామ్యము సూచిత మగును. నామార్థము లక్షణమున వ్యాఖ్యాతము కాగలదు. పురాణాదులలో కన్న వీనియందు వైచిత్ర్యయోగ మున్నది. పురాణాదులలో నుపదేశదాయిత యున్నది. కర్మఫలసంబంధ ప్రదర్శన మున్నది. కాని యది యుచ్చావచ మనియత మయిన కవికథాప్రాయము. ఈనాటకాదులందా ఫల ముపదేశము నొకచో ప్రయోజ్యముగ నుండును. ఒకింత సూచ్యముగ నుండును. కొంత యూహ్యముగ నుండును. కొంత యుపేక్ష్యముగ నుండును. సంధ్యాదివ్యవస్థ యుండుటయు సప్రయోజన మగుటయు నితిహాసాదివైలక్షణ్యమని కొందరనుట ఫల్గుప్రాయము. ఈ దశరూపకల్పము రసావేశమును ప్రత్యక్ష మొనర్చును. అట్టి రసావేశమున నిది నిర్వృతిసారము. కాన నిది యితిహాసాదుల కన్న విశిష్టము. సూచ్యాదివిభాగ మితిహాసాదులలో గూడ నుండ వచ్చును. దశరూపము కేవలము పాఠఫల మన నక్కఱ లేదు. ప్రయోగపర్యంత మిది ప్రసరించును. కావ్యముగా మహాసామాన్యరూప మున్నను అవాంతర సామాన్యలక్షణము నిరూపించుటయు సముచితము. సామాన్యలక్షణము విశేషలక్షణ మను పూర్వముగా జెప్పుటయు యుక్తము.

## సామాన్యలక్షణము

కొంద రిట్లందురు. "వృత్తిప్రభవత్వము దశరూపకమునకు సామాన్యలక్షణము. వృత్తులు తదంగములు అభినయములలో కావ్యములలో నుండవు." అని. ఇది యుక్తము కాదు. కావ్యార్థము లందు వృత్తు లుండుట నటుండ నిండు. సంసారము సర్వము వృత్తిచతుష్కమున వ్యాపించి యున్నదని మొదటినుండియు నిరూపించు

చునే యున్నాము. కేవల మభినేయవిషయముననె వృత్తివ్యవహార మంగీకరించుట హృదయగ్రాహి కాదు. అట్లె యయిన వృత్తుల సముత్థాననిరూపణ మంతయు నసంగతమె కావలయును. శ్రీవిష్ణువు నుండి కైశికి యుదయించిన దంటిమి. శ్రీవిష్ణుభగవానున కభినేతృత యేమికలదు? భగవానునందు స్వచేష్టావేశము మాత్రమె మన మూహింతుము. కేవలము ప్రకృతనాటకాది విషయకముగనె వృత్తుల సంకేతించుట రమ్యము కాదు. వృత్తులు వృత్త్యంగములు సర్వకావ్యములందు సంభవించును.

## మా తృ క లు

౩౭౮. సర్వేషామేవ కావ్యానాం మాతృకా వృత్తయః స్మృతాః
అభ్యో వినిసృతం హ్యేతద్దశరూపం ప్రయోగతః

సర్వకావ్యములకు వృత్తులు మాతృక లనుట సామాన్య లక్షణము. కావ్యార్థమె కాదు. విశ్వమంతయు వృత్తివ్యాప్తము. వృత్తులనుండి యీ దశరూపము ప్రయోగమున నుదయించినది. సర్వవిధము లయిన యభినేయము లనభినేయములయిన కావ్యములకు వృత్తులె (చేష్ట) మాతృకలు. కవిహృదయమున నివి వ్యవస్థితములై యుండి కావ్య ముత్పాదింప గలవు. అయిన నివి ప్రయుజ్యమానములై ప్రయోగయోగ్యతను పొందుటచే నా యంశ మభిసంధానించి "వృత్తులనుండి యభినేయకావ్య మభినిష్పన్నము" అని యనుట సంగతము. ప్రత్యక్షభావనాయోగ్యము లయిన నాలుగు వృత్తుల నిరూపణ ముండుట దశరూప సామాన్యలక్షణ మని పర్యవసిత మగును.

కొంద రిట్లనిరి.- ఒక్కొక రూపకమునకు పది పది రూపములు సంభవించును. వీథ్యంగము లంతట సంభవింపగలవు. పరగతవచనముల కనురూపముగా భాషించుట భాణమునం దున్నది కదా! ఆ భాణయోగ మాకాశభాషితమున సంగత మగును. ఇట్లె యితరముల సంగతియు నభ్యూహ్యము. కారికలోని "దశరూప" పదము- "దశరూపాణి యస్య తద్దశరూపం కావ్యం" పదిరూపములు కల కావ్యము- అను నర్థము సూచించును. కాన సకల ప్రబంధము నాటకము కాదు.

ప్రబంధరూప మొక కొంత నాటక మగును. తల్లక్షణాంశబాహుల్య ముండుటచే తద్వ్యపదేశయోగ మున్నది. దశరూప మనుట దశ సంఖ్యా విభాగార్థము కాదు. దశరూపలక్షణయోగమున్న సట్టకాదులు కూడ నిందు సంగృహీతములు కావలెను. వాని త్యాగ ముచితము కాదు'' అని. ఈ యంశమును స్వావసరములందు విస్తరించి పల్కెదము.

## స్వర గ్రామము - కావ్య బంధము

"ప్రయోగయోగ్య చేష్టాప్రతిపాదకత్వమె దశరూప సామాన్య లక్షణ మయినచో నిదియేమి సామాన్యలక్షణము ? చేష్టాతిరిక్త మయిన దేదియు సంభవింపనే సంభవింపదు. కావున విశేషలక్షణము కుదురదు కదా !" ఇట్టి విషయమున నాశంక కలుగ వచ్చును. ఈ యాశంకాశమనముగా విశేషలక్షణావకాశము ప్రదర్శింపవలసి యున్నది. సంగీతతంత్రములో స్వరములు జాతులు శ్రుతులతో గ్రామత్వము పొందుచున్నవి. అట్లె వృత్తిభేదములచే కావ్యబంధ ములు కలుగు నను సామాన్యార్థము నీ కారిక సూచించుచున్నది.

32౯. జాతిభిః శ్రుతిభిశ్చైవ స్వరా గ్రామత్వమాగతాః
యథా తథా వృత్తిభేదైః కావ్యబంధా భవంతి హి

దృష్టాంతసహిత మయిన నిట్టి వచనములలో నొక భావ మున్నది. దృష్టాంతమున ప్రకృతమును ఘటించుచు వ్యుత్పాదనీయ మును వ్యుత్పాదింప జేయవచ్చును. సమానతంత్రసిద్ధముగా నీ యర్థము ప్రసిద్ధము. జాతి యనునది స్వరములలో గ్రహము మొద లగు పది విభాగములతో నుండును. విశిష్టము లయిన స్వరములె తగిన సన్నివేశము పొందినవై రక్తిని అదృష్టాభ్యుదయమును గలుగ జేయును గావున జాతు లనదగి యున్నవి. ఆ సన్నివేశమె జాతి. అది పది విధములు. శ్రుతి స్వరాది సమూహమున జాతి కలుగును. రసప్రతీతి నిది యారంభింప జేయుటచే గూడ నిది జాతి యయినది. సకలరాగముల కిది జన్మహేతు వగుట జాతి యయినది. శ్రుతి= ధ్వనిరక్త మరక్తముగా నుండును. మంద్రాది స్థానభేదమున స్ఫుట ముగా స్ఫురించు నాదమును ధ్వని యందురు. ధ్వనిస్థానము తదంత

కాలము శ్రుతి యని భావము. శ్రుతి యనునది నాదవిశేషము. స్వర కారణము. జాతులు శుద్ధము లేడు విధములు. వికృతములు పదు నొకండు విధములు.

| | | |
|---|---|---|
| షాడ్జి | ఆర్షభి | గాంధారి |
| మధ్యమ | పంచమి | ధైవతి |
| నిషాది | అని శుద్ధజాతులు. | |

౧. షాడ్జి : ఆరు స్థానము లందు పుట్టినది. నాసిక, కంఠము, వక్షము, తాలువు, జిహ్వ, దంతము లారు స్థానములు.

౨. ఆర్షభి : వృషభస్వరముతో సమముగా నుండునది ఋషభసంబంధి యార్షభి.

౩. గాంధారి : నాభినుండి వెలువడిన వాయు వురః కంఠ సమాహతమై గలము శ్రోత్రము చలింప జేయునదై గోవులకు సంతుష్టి నాపాదింప గలదు గావున గాంధార మయినది. ప్రసగీతమున సంతుష్టి పొందు గోవు లీ స్వరమును విని యున్ముఖములు కాగలవు.

౪. మధ్యమ : స్వరసప్తకములో మధ్య నుండు స్వరము. అటు మూ డిటు మూడు స్వరము లుండగా నిది మధ్యలో నుండును. శరీరము లోని మధ్యమస్థానము నుండి జనించుటచే మధ్యమ మయి నది. నాభినుండి వెలువడిన నాద మురఃకంఠసమాహృతమై నాభిని పొంది మరల మధ్యస్థానగత మగును గావున మధ్యమ మయినది.

౫. పంచమి : ఓష్ఠ కంఠ శిరో హృదయ నాభీ దేశము లను పంచప్రదేశము లందు జనించుటచే పంచమి యయినది. పంచస్థానో ద్భవము పంచమము.

౬. ధైవతి : ధీమంతులె దీనిని తెలియగలరు. కావున ధైవ తము. నాదము నాభి దిగువగా సంచరించి మరల నూర్ధ్వగమై ధావన మొనర్చునట్లు కంఠదేశ మేగును గావున ధైవత మయినది.

౭. నిషాది : మనస్సు దీనియందు నిషణ్ణ మగును. స్వరము లిందు నిషణ్ణము లగును. షడ్జాది మనోహర స్వరము లన్నియు నీ స్వరమున కూడు కొనును కావున నిది నిషాద మయినది.

స్వరముల సంవాదముండుట సంగీతశాస్త్రమున గ్రామ మని యందురు. షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాంధారగ్రామ మని గ్రామము మూడువిధములు. కుటుంబములోని వా రేకకుటుంబమున నేకవిధముగా నున్నట్లు స్వరశ్రుతు లీ గ్రామమున కూడి యుండును. షడ్జాది స్వరసముదాయమునె గ్రామ మనుట యుక్తము జాతిశ్రుతులచే స్వరములె గ్రామము లగునట్లుగా –నను దృష్టాంతమున నీ భావము స్పష్ట మగును. గ్రామము లన్నియు స్వరముల సముదాయరూపములు. ఇందేమియు విశేషము లేక పోయినను పర్యాయక్రమమున స్వరముల ప్రవిభాగభేదములచే నొకటి షడ్జ గ్రామ మని వేరొకటి మధ్యమగ్రామ మని వ్యవహారము కలుగుచున్నది. స్వరముల ప్రవిభాగభేదము లనేకరీతుల నున్నవి. అందిప్పుడు వీని నిట్లు పరిగణింప వచ్చును.

౧. స్వరములకు ప్రాథమ్యముండుట.
౨. ప్రాథమ్యము లేకుండుట
౩. స్వరముల ప్రధానత భాసించుట
౪. అప్రాధాన్యమె యవభాసించుట
౫. స్వరము లల్పముగా నుండుట
౬. స్వరముల భూయస్త్వ ముండుట
౭. స్వరముల పూర్ణత్వము గోచరించుట
౮. అపూర్ణత్వము గోచరించుట
౯. స్వరముల యారోహాంత్యత్వము
౧౦. స్వరముల యారోహమధ్యత్వము.

ఇట్లు గ్రామముల భేదము సిద్ధమయినట్లు స్వరస్థానీయము లయిన వృత్తుల ప్రాథమ్యప్రాధాన్యాదిదశకమున రూపకము రూపకాంతరము కన్న భిన్న మగుచున్నది. చూడుడు! చతుఃశ్రుతిక మయిన పంచమస్వరము త్రిశ్రుతికమై వేరొక గ్రామమును కల్పించును. అట్లె యొకటియె వృత్తి శ్రుతిస్థానీయము లయిన యంగములతో నొకప్పుడు సంపూర్ణమై యొక రూపకవిభాగము సూచించును, వేరొకప్పు డంగన్యూనమై యన్యరూపకవిభాగము సూచించును.

ఈ భావవివేకము సూచించుటకే జాతిశ్రుతులు వేరువేరుగా నిరూపితము లయినవి.

## వృత్తివిభాగము – నాటకప్రకరణములు

౩౮౦. గ్రామౌ పూర్ణస్వరౌ ద్వౌ తు యథా వై షడ్జ మధ్యమౌ
సర్వవృత్తి వినిష్పన్నౌ కావ్యబంధౌ తథా త్విమౌ

ఇందిక సంక్షేపముగా వృత్తివిభాగము సూచిత మగును. షడ్జగ్రామము మధ్యమగ్రామము రెండు పూర్ణస్వరములై యున్నట్లు సర్వవృత్తివినిష్పన్నము లయిన యీ రెండు కావ్యబంధములు (నాటకము ప్రకరణము) రమ్యప్రసిద్ధములై యున్నవి. ఈ కారికలోని షడ్జమధ్యమ పదములను కొందరు -షడ్జగ్రామరాగమని, మధ్యమగ్రామరాగమని- భావించి గ్రామ శబ్దమున నీ యర్థమె వ్యపదిష్ట మని యనిరి. జాత్యాశ్రయము లయిన వీనిలో జాతిద్వారమున షాడవౌంశకయోగ షాడవికాంశయోగము కలుగ వచ్చును. అప్పుడు పూర్ణస్వరత్వమె కాక న్యూనస్వరతయు కలుగ వచ్చును. షడ్జమధ్యమగ్రామములె యయినచో పూర్ణస్వరత్వము మూలకథితము సంగతము కాదు. కావున షడ్జగ్రామరాగ మధ్యమగ్రామరాగములను ప్రకృతము వివక్షింప వలెనని వారి యాశయ లేశము.

ఇది యుక్తము కాదు. ఈ కారికలో గ్రామశబ్దమున జాతిసముదాయము నిరూపిత మగుచున్నది. ఏదేని యొక యంశములో న్యూనస్వరతయు నుండవచ్చును. అయినను సముదాయపూర్ణత కెట్టి హానియు లేదు. కావున నిచటి నిగూఢరమ్యార్థము నిట్లు వ్యాఖ్యానించుట హృదయగ్రాహిగా నుండును.

షడ్జ మధ్యమ గ్రామములు రెండును విచిత్ర సన్నివేశములు కలవి. తదాలంబనమున సుందరతమములై సంపూర్ణ స్వర సముదాయమున శోభించును. ఇట్టి వీని విభాగకల్పనమున పూర్ణాపూర్ణాది స్వర భేదము కల జాత్యంశకముల ప్రసూతి యున్నది. ఇట్లే పూర్ణవృత్తి వృత్త్యంగములు కల నాటకప్రకరణముల ననుసరించి వృత్తిన్యూనము లయిన రూపకభేదముల పరికల్పన మున్నది. నాటకము ప్రకరణము

అను రెండును సర్వవృత్తి వినిష్పన్నము లయిన నానాబంధసమా
శ్రయము లయిన విశేషములు.

ఈ రెండును వృత్తిపూర్ణము లయిన రూపకములు కాగా వృత్తిన్యూనము లయిన రూపకములు కొన్ని యున్నవి. వీథి, సమవకారము, ఈహామృగము, ఉత్సృష్టికాంకము, వ్యాయోగము, భాణము, ప్రహసనము, డిమము అను రూపము లెనిమిది కైశికీవృత్తిహీనములుగా నిర్మింప వలెను. దశరూపకములలో నాటకప్రకరణములు వృత్తిపూర్ణము లనినప్పుడు శేషరూపకములు వృత్తిహీనము లని యనవచ్చును; కాని యట్లనక వీథీసమవకారాదినామగ్రహణ మొనర్చుటలో నీ భావమును గ్రహింప వలెను. రూపకము లిన్ని మాత్రమె కాదు. ఇందు చెప్పని రూపకములును సంభవించును. రూపకవిశేషములు కొన్ని యీ విధముగా వీనినుండి కలిగిన వని యీ నిర్దేశ ముదాహరణమాత్రమె యగుచున్నది. వృత్తుల వినియోగవిశేషము వృత్తివికల్పము వృత్తిసముచ్చయము వృత్త్యంగముల వినియోగ వికల్పసముచ్చయములు బహురూపక భేదములను నిర్మింపగలవు. ప్రాక్తనులు కోహలాదులు వీనికి నామములు మాత్రము నిర్మించిరి. ఇందు కొన్ని లక్షణమున సంగృహీత లయినవి. వీనిలో నాటకప్రకరణములు రెండు మాత్రము సర్వవృత్తిపరిపూర్ణము లని నియమము. ఇందు విపర్యయము లేదు. ముద్రారాక్షసనాటకము కైశికీవృత్తిహీనముగా నున్నదని కృత్యారావణనాటక మట్లె యున్నదని, వేణీసంహారనాటకమున సాత్వత్యారభటీమాత్రము గోచరించుచున్నదని కొందరు సూచించిరి.

కొందరిందు నవశ్యము వృత్త్యంతరానుప్రవేశము భావింతురు. అంతట వృత్తులు పరిమితములు కావలయుటయె నియతమయినచో నేదేని రూపక మపూర్ణవృత్తి యయినపుడు విరూపకమె యగును. నాటకము సకలాంగప్రక్రియాపరిపూర్ణ మయినందున ప్రకరణమును ప్రధానము. వినేయు డొకడు ప్రసిద్ధి ననుసరించుట లోకప్రసిద్ధము. కాన సప్రసిద్ధేతివృత్తక మయిన నాటకమున నొకడు వినేయు డగును. వేరొక వినేయుడు ప్రసిద్ధవస్తుక నాటకము చూచి యిదియేమి

యపూర్వమా! యని రూపకాంతరము భావింపగోరును. నాటకాభాసమేని దర్శింప కాంక్షించును. అభినవ వస్తువృత్త కౌతుకపరతంత్రుడై సముత్పాద్యవస్తుక మయిన ప్రకరణము భావించి వినేయుడుకా దలచును. ధర్మార్థకామములలో వినయము=శిక్షణ మభిలషించును. సర్వపురుషార్థము లందును వినయ మభిలషించును. అపవర్గమునను వినయ మతి యగును. ఇది యంతయు తదుపయోగివ్యాపారాశ్రయణముతో నున్నప్పుడు సర్వవ్యాపారాక్షిప్తమై పూర్ణవృత్తిక మయినప్పుడును సంగత మగును. నాటక మొకప్పుడు ద్వివృత్తికము త్రివృత్తికము కావచ్చును. అట్లు కాక రూపాంతరము ననె యున్నచో నది యాభాసప్రాయ మగును. ఒక్కొకచో కైశికీవిహీనత యున్నను శృంగారయోగము సంభవించుట సమవకారమున నుండనె యున్నది.

## కావ్యబంధవికల్పనము

నాటకప్రకరణములు రెండును పూర్ణవృత్తికములు కాగా విశేషము లే నందున భేదమె యుండ దనుకొన గూడదు. వీథ్యాదులన్నియు కైశికీహీనము లయినను వానిలో మిథోవిశేషము వానికి భేదము సంపాదించుచున్నది. అట్లె యిందును భేదకాంశ మున్నది. అది విశేషలక్షణముచే విశదము కాగలదు. ఇక నిటుపై కావ్యబంధవికల్పనము నిరూపించుట సముచితము. కావ్యమున బంధనము పరస్పరాశ్రయ సంబంధమున నేకవాక్యతాకరణ సంబంధ ముండుట. విశేషలక్షణమున దాని వికల్పనము నిరూపిత మగును. నాటకము ప్రకరణము కన్న ప్రధానము. కల్పనావస్తుసంభావనము ప్రసిద్ధ్యుపజీవనముతో నుండును. ఇట్లె యందరి యనుభవము. ఉత్ప్రేక్ష యనునదియు ప్రమాణసమాగతము లయిన వస్తువులందే వ్యాపించును. స్వతంత్ర యోజనామాత్రమున నది యట్లు ప్రసరించును. "షడ్దంతహస్తి యాకాశాన పరుగిడుచున్నది." అనుటలో నిది సంభావ్యము.

## నాటకతత్త్వము

౩౮౧. ప్రఖ్యాతవస్తువిషయం ప్రఖ్యాతోదాత్తనాయకం చైవ
రాజర్షివంశ్యచరితం తథైవ దివ్యాశ్రయోపేతం

౩౮౨. నానావిభూతిభిర్యుత మృద్ధివిలాసాదిభి ర్గుణైశ్చైవ
అంకప్రవేశకాఢ్యం భవతి హి తన్నాటకం నామ
౩౮౩. నృపతీనాం తచ్చరితం నానారసభావ చేష్టితం బహుధా
సుఖదుఃఖోత్పత్తికృతం భవతి హి తన్నాటకం నామ

దశరూపకములలో ముఖ్యమయిన నాటకతత్త్వ మిందు గలదు. తత్త్వప్రకాశమునకై యిందు పదియంశము లున్నవి. తత్త్వ విస్తరము స్పష్టగోచర మగుటకై యీ యర్థసారము గుర్తింప దగును.

౧. వస్తువు ప్రఖ్యాతముగా నుండవలెను.
౨. నాయకుడుదాత్తుడు ప్రసిద్ధుడు కావలెను.
౩. రాజర్షి వంశచరితము వర్ణితము కావలెను.
౪. తదంగముగా దివ్యాశ్రయము కావచ్చును.
౫. నానావిధవిభూతులు కూడి యుండవలెను.
౬. సంపత్సమృద్ధివిలాసాదులు గుణములు నుండవలెను.
౭. అంకములతో ప్రవేశకములతో నుండవలెను.
౮. రాజులచరిత వర్ణన ముండ దగును.
౯. నానారసభావ చేష్టితము లుండ దగును.
౧౦. బహుధా సుఖదుఃఖముల యుత్పత్తి కలది కావలెను.

నాటకము పురాణేతిహాసములందు ప్రమాణప్రసిద్ధ మయిన వస్తుప్రదర్శకముగా నుండుట సముచితము. ప్రఖ్యాతము లయిన భారతాదు లందున్న వస్తువును నాటకము విషయము చేసికొనును. భారతాదులలో గూడ కొంత యప్రసిద్ధవస్తు వుండునని తన్నిరాకరణమునకై ప్రఖ్యాతోదాత్తనాయకముగా నిది యుండుట సముచిత మని శ్రీశంకుకు డనుటను మా యుపాధ్యాయు లంగీకరింపరు. ప్రఖ్యాతవస్తువు విషయముగా నుండుట యను సంశమునవె యిది గతార్థము. త్రివిధప్రసిద్ధిచే వస్తువునకు ప్రసిద్ధత్వము కలుగును. ఈతడు ఈ విధముగా ఈ దేశమున నాచరించె నన్నది తద్రూపము. అట్లు ప్రకర్షముగా ఖ్యాతవస్తువె నాటకమున విషయము. చక్రవర్తి యయినను వత్సరాజు కౌశాంబీవ్యతిరిక్త మయిన విషయమున

కార్యాంతరము లేకుండగనె సంచరించినట్లు నిరంతర నిర్వర్ణనము నైరస్య మాపాదించును. అట్టి యప్పుడు ప్రసిద్ధిఖండితమై ప్రతీతి విఘాతము కలుగును. కాగా రసచర్వణ మన్న కథయే కలుగదు. రాజప్రసిద్ధి యొకటి. విషయప్రసిద్ధి రెండు. ప్రఖ్యాతోదాత్తనాయకత మూడు. ఉదాత్తత వీరరసయోగ్యతా సూచకము. కావున ధీరలలిత ధీరప్రశాంత ధీరోద్ధత ధీరోదాత్తులను నలుగురు నాయకులు సంగృహీతు లగుదురు. ప్రఖ్యాత మయిన వస్తువును ఋషితుల్యు లయిన రాజుల వంశసాధుభావముతో నుండవలెను, దేవచరితము ప్రఖ్యాత మయినను నాటకమున ముఖ్యముగ నిబంధింప దగదు. దేవచరితము వరప్రభావాది బహులముగా నుండుటచే నుపాయోపదేశమునకు యోగ్యము కాదు. దేవచరితము ముఖ్యముగా నిబంధింప దగదు. వరప్రభావముల బహులబలము కల చరితమును నిబంధింప దగదు. ఈ రెండును సముచితోపాయమును నిర్దేశింపవు. ఈ యంశము మూలమున లేదు గాని ఫలబలమున గలిగిన ప్రతిషేధముగా గుర్తింప వలెను. రాజర్షి=ఋషివంటిరాజు. ఆర్షజీవనము కల రాజు. తద్వంశమున సాధుచరితమును వంశ్యచరిత మనవచ్చును. సర్వథా దేవచరిత మవర్ణనీయము కాదు. ఒకప్పుడు దేవచరితము నొకవిధముగ వర్ణింప వచ్చును. పతాకా ప్రకరీ నాయకాది రూపముగా దేవచరితము కూర్పవచ్చును. అట్టి యముఖ్యకథాభాగము దివ్యాశ్రయమున నుండ వచ్చును. ఇట్లుండుటయె యంగీకార్యము. "ఉపేతం ఉపగమః అంగీకరణం" అని యుపేతార్థము. నాగానంద నాటకమున నీ యంశమును భావింపవచ్చును. పూర్ణకరుణా నిర్భర యయిన భగవతి దేవి, మలయవతికి సాక్షాత్కరించినది. అది చూడగా నిట్లు వ్యుత్పత్తి భావుకులకు భాసించును. "నిరంతర భక్తి భావితాంతరంగుల కీ విధముగా దేవతలు ప్రసన్న లగుదురు. కావున దేవతారాధన పురస్సరముగ నుపాయానుష్ఠానము సముచితముగ నొనర్పదగును." అని. ఇట్లు దేవతాచరిత మముఖ్యముగ వర్ణించుటయె యుక్తము. అట్లు కాక దేవతాచరితము ముఖ్యముగనే వర్ణితమగుట యభీష్ట మయినచో విప్రలంభము కరుణ మద్భుతము భయానకము లను రసములకు సముచితముగ గూడ తచ్చరితము

వర్ణ్యమానః మగునేని యా దేవతాచరితము కూడ మానుషచరితము గనె సంపన్న మగును. ఇంకను దేవతల నచిత్తముగ నిబంధించి నట్లగును. ఇది యంతయు ప్రసిద్ధివిఘాతకము. దేవతల కట్టి వాని నిబంధనము ప్రసిద్ధము కాదు. విప్రలంభాదులుః లేకున్న విచిత్రతయె యావిర్భవింపదు. రంజన మంతట విచిత్రతాప్రమాణ మని సచేతః ప్రమాణము. కావుననె దేవచరితమునందు హృదయసంవాదమును దుర్లభము. దేవులకు దుఃఖము లేదు. వా రేకాంతసుఖులు. దుఃఖమె యున్నచో తత్ప్రతీకారోపాయములో వ్యుత్పాదన ముండును. దివ్యనాయిక రాజర్షి చరితములో నుండునేని యవిరుద్ధము గనె తన్నిబంధన మావశ్యకము. కాళిదాసు విక్రమోర్వశీయములో నూర్వశి విక్రమచరితావిరుద్ధముగ నిబద్ధ యయినది. విక్రమ(పురూరవుడు)నాయకచరితముననె యూర్వశీవృత్త మాక్షిప్తమై యవభాసించినది. డిమాదిరూపకములలో దివ్యులు నాయకులయి నప్పుడు నివేదింపవలసిన యభిప్రాయమును నివేదించెదము.

నాటకమున నిబంధనములో నుండు ప్రసిద్ధిత్రయ యుక్తమయిన వస్తు వఫలము కాదు. అట్టిదది తగిన వ్యుత్పత్తిసంధానమునకై సమర్థ మగును. అదియె నానావిభూతి సంయుక్తతచే నిరూపిత మగును. ధర్మార్థకామమోక్ష విభవములు ఫలభూతములై విచిత్రరూపముగా నుండును. అట్టివానితో నాటకము సంయుక్తము కావలెను. అనంతవిభూతు లందును అర్థకామములు సర్వజనాభిలషణీయములు. తద్బాహుల్యమును నాటకములో నిదర్శించుట యుచితమె యగును. అదియె బుద్ధివిలాసాదులచే గూడికొనుటచే సూచితము. బుద్ధి యర్థసమృద్ధి రాజ్యాదిసమృద్ధి. విలాసమున కామము లక్షిత మగును. ఆదిశబ్దము ప్రధానవాచి. అర్థకామ ప్రధానము లయిన ఫలసంపత్తులతో గూడుకొనవలె నని భావము. "రాజు సర్వ రాజ్యమును బ్రాహ్మణుల కిచ్చి వానప్రస్థము గ్రహింపవలెను" అనెడు ఫలమును నిబంధింపరాదు. అట్లు నిబంధించినచో భావుకుల ప్రతీతి విరసీకృత మగును. లోకమంతట బహులముగా నిట్టి ఫలమును చూచి యనుభవించియె యుండును కదా! నాటకములో నంతట గుణము

-లనె నిబంధింప వలెను. అప్రధానభూతము లయిన చేష్టితములను వర్ణింపరాదు. వానిని హేయములుగా భావింపవలెను. ప్రధానము లయిన చేష్టితములె యంతట నుపాదేయములు. ప్రతినాయకగతము లయిన గుణములను వర్ణింపవలసి యున్నప్పుడు వాసి నపాయప్రధానములుగా వర్ణింపవలెను, ప్రతిపక్షనాయకుని గుణములు పూర్వపక్షస్థానీయములై ప్రతిక్షేపార్హములుగా నుండును. తత్ప్రతిక్షేపమున సిద్ధాంతకల్ప మయిన నాయకచరితమునకు సముచిత మయిన నిర్వాహము కలుగును. జనపదకోశాది సంపత్తిసమృద్ధియు గల్గును. కౌముదీమహోత్సవాదులు విలాసములని సంధివిగ్రహాదులు గుణములని వ్యాఖ్యానించుట ముద్రారాక్షసనాటకమునకు సంబంధించిన చాణక్యశాస్త్ర పరిచయవేదనమాత్రఫలక మగును. వస్తుశబ్దమున రాజర్షి వంశ్యచరితశబ్దమున సర్వవిధార్థరాశియు సంగృహీతమె యయినదికదా!

అంకము

ఇంకను నాటకమన్న రూపకము అంకప్రవేశకములతో నుండవలెను. అవాంతరవస్తుసమాప్తిలో విశ్రాంతికై వినివిష్టములగు విచ్ఛేదములె యంకములు. నిమిత్తబలమున నప్రత్యక్షదృష్టము లయిన చేష్టితములను ప్రవేశకము లావేదించును. ఇట్టి యంకప్రవేశకములతో నాటక మాఢ్యము కావలెను. ఇట్లేవంవిధ విశేషవిశిష్ట మగుట వలననె నాటకమను నామము కలిగినది. వ్యుత్పాద్యు లయిన నృపతులకు సంబంధించిన చరిత మిందుండును. నృపచేష్టితము కలయిది నృపులకు ప్రహ్వీభావదాయక మగును. హృదయానుప్రవేశమున రంజన ముల్లాసన మిచ్చి యుపాయవ్యుత్పత్తి పరిఘట్టిత మయిన చేష్టితముచే హృదయమును శరీరమును నర్తింప జేయును. కావుననె యిది నాటక మయినది. నాటకీయార్థము పురాణాద్యుపనిబద్ధ మయినను హృదయభావకమై భావింప జేయుచున్నది. బహుప్రకారము లయిన రసభావచేష్టితము లిందున్నవి. ఇవి సంభావింప జేయగలవు. సంభావసంపాదకములు నటవ్యాపారాత్మకము లయిన యభినయములు ప్రహ్వీభావ మాపాదించి హృద్యతమ రసాస్వాద మనెడు సూచీద్వారప్రవేశమున కర్తవ్యమను సూత్రసమారోహము పొంది,

హృదయ మనెడు రోహణపర్వత ప్రరూఢము లయిన శౌర్యాది-
ధర్మము లనెడు రత్నముల గ్రథించును. రసాస్వాదము కర్తవ్యము-
హృదయరూఢ శౌర్యాదిధర్మగ్రథన మను ప్రక్రియల నభినయద్వార
మున నాటక మాపాదింప గలదు. ఈ యంశ మిదివరలో నిరుక్త
ప్రాయమె. నృపతిచరితమె యాస్వాద్య మగును గాని దేవచరిత
మాస్వాద్యము కాదనుటలో నిది హేతువు. ఉపాయవైచిత్ర్యము-
మొదలుగా గల బహుప్రకారము లయిన సుఖదుఃఖోత్పత్తుల సంపాద
నము నృపతిచరితమునందుండును గాని దేవచరితము నం దుండదు.
అందుననె నైరస్య మాపాదించు ప్రతీతివిఘాతము సంభవించును.
ఇట్టి దానిని నాటకమున నిబంధింపరాదు. కాననే వర్తమానరాజ
చరితము కూడ వర్ణనీయము కాదు. అం దెంతగా నధ్యారోపము
కావించినను విపరీతప్రసిద్ధిచే నది బాధిత మగును. ఎంతటి యారోపా
భ్యాహ మున్న నకించిత్కర మగును. ఈ యంశప్రతిబోధనమునకె
ప్రకర్షద్యోతక మయిన ప్రఖ్యాతగ్రహణము మఱల మఱల జేయవలసి
వచ్చినది. వేదము శాస్త్రము నాటకము కాదు. అందు నియోగము
ననె పురుషుడు ప్రవర్తితు డగును కాని ఫలోత్పత్తిచే ప్రవర్తితుడు
కాడు. ఫలప్రాధాన్య పక్షమున గూడ నచట సందేహ మున్నది.
సందిహాను డెట్లు ప్రవర్తించును! ఇట్లే పురాణాదు లందును గ్రహింప
వలెను. పురాణము పురాణమె. నాటకము కాదు. ఇందలి సుఖ
దుఃఖోత్పత్తి చిరవిలంబితప్రతీతిసిద్ధమై బాధోదయము సహింపనిదై
ప్రత్యఊాయమాణమై భాసించును. ఈ వాక్యమున నిది నిరూపిత
ప్రాయము. సర్వరూపకముల యర్థము హృదయప్రవిష్టమై వినేయు
లను వినీతులను జేయగలదు. కావుననె నాటకశబ్దము సర్వరూపక
సామాన్యవచన మైనది. ఇట్లె నాటకశబ్ద మా యా స్థానము లందు
ప్రయుక్త మయినది. కాగా రాజు లవశ్యవ్యుత్పాద్యులు. వారి
వ్యుత్పత్తి ద్వారమున విశ్వమంతయు వ్యుత్పన్న మగును. కావున
రాజహృదయ సంవాదసంపాదన యోగ్య మయిన రాజచరితప్రదర్శ
నమున ప్రధానముగా ప్రధానార్థమున ప్రజలు వ్యుత్పాదితులు కా
గలరు. అమాత్యాదు లందరు రాజానుయాయులుగ రాజకథాంగ
ముగ నిరూపితు లగుదురు. అమాత్యాదులు ప్రయోగమున నందుకు-

కాని యప్రధానముగ నుందురు. సముద్గకములో గగనము వలె నున్నట్లుందురు. అమాత్యాదులు ప్రయోగమునకు వ్యుత్పాదకులు ప్రయోగము వ్యుత్పాద్యము. యథోచితముగా నాటకప్రయోగము వ్యుత్పాదక వ్యుత్పాద్యభావముచే ప్రధానపురుషార్థమున ప్రధానముగ వినేయులకు వేద్యవేదనమున వ్యుత్పత్తి నాధానించును. కావునవె యిది నాటకప్రఖ్య పొందినది.

శ్రీశంకుకు డిట్లు వ్యాఖ్యానించెను. "నృపతీనాం యచ్చరితం" అనుచోట నున్న "నృపతీనాం" అనెడు షష్ఠీబహువచనమున నీ యర్థము లభించును. విజిగీషువు శత్రువు మధ్యస్థుడు ఉదాసీనుడు మిత్రుడు మిత్రమిత్రుడు అను వారంగరు నృపతులు. వీరి చరితము నిబంధనీయము. ఇది బహువచనార్థము." కొందరిట్లనిరి. "రాజర్షి వంశప్రభవు లయిన రాజులు మొదట నిర్దిష్టులు. ఇచటి నృపతులు చంద్రగుప్త బిందుసారాదులును కావచ్చును." అని. ఈ యర్థ ద్వయము మొదటి యార్య యందే సంగృహీతము. కాన ప్రథమ వ్యాఖ్యాతమె యుక్తార్థము.

ఇచట మరికొందరు మరియొకవిధముగా ననిరి. "దేవులు ధీరోద్ధతులు. నృపతులు ధీరలలితులు. సేనాపతి యమాత్యుడు ధీరోదాత్తులు. బ్రాహ్మణులు వణిజులు ధీరప్రశాంతులు- అనెడు భరతవచనము ననుసరించి పర్యాలోచన మొనర్పగా దేవతలకు నాటకనాయకత్వ ముపపన్నము కాదు. ధీరలలితుడొక్కడె నాటకనాయకుడు కా దగును." అని. ఈ వ్యాఖ్యార్థ మయుక్తము. జనకాదులు కాని రామాదులు కాని ధీరలలితులు కారు. వారు ధీరోదాత్తులు. వారి చరితనిబంధనము నాటకము లం దున్నది. వారు నాయకులుగ నున్నారు. "ధీరోదాత్తం జయతి చరితం రామనామ్నశ్చ విష్ణోః" అని పెద్దలనిరి. రాజులకె ధీరలలిత్వము వర్ణింప వలెను. ఇతరులకు వర్ణింప రాదు. సేనాపత్యమాత్యులకు ధీరోదాత్తత్వమె నిరూపింప వలెను. దేవులకు ధీరోద్ధతత్వమె వర్ణింపవలెను. ద్విజాతులకు ధీర ప్రశాంతత్వమె యుక్తమను భరతపఠిత మున్నదందురు కాబోలును!

అందునను ప్రఖ్యాతోదాత్తనాయక మ్మనుచోట నలుగురు నాయకులు స్వీకృతులని వ్యాఖ్యాత మయినది.

## అం క సం కే త ము

3౮౪. ఆస్యావస్థోపేతం కార్యం ప్రసమీక్ష్య బిందువిస్తారాత్
కర్తవ్యోఽకః సోపి తు గణాన్వితం నాట్యతత్వజ్ఞైః

3౮౫. అంక ఇతి రూఢిశబ్దో భావైశ్చ రసైశ్చ రోహయత్యర్థాన్
నానావిధానసంయుక్తో యస్మా త్తస్మా ద్భవే దంకః

3౮౬. యత్రార్థస్య సమాప్తిః యత్ర చ బీజస్య భవతి సంహారః
కించిదవలగ్నబిందుః సోంక ఇతి సదావగంతవ్యః

ఇంతవర కార్యలు నాటకనిర్వచనము సూచించినవి. ప్రఖ్యాత వస్త్వాదిక మయిన యర్థ మంతట సుప్రసిద్ధము. అంకప్రవేశకము లప్రసిద్ధములు. అం దంకస్వరూపమును సంకేతమును విస్తరముగా నిరూపించుట యావశ్యకము. ఈ కారిక లంకభావ నిరూపకములు. నాటకము నందొక కార్య మున్నది. అది ఫలము. ఆ కార్యమును బిందుకృత మయిన వితతీకరణమున నేకావస్థానురూపముగా నాధికారిక మయిన యితివృత్తమును సంపన్న మొనర్ప వలెను. బిందురూపార్థము ననుసంధాన మొనర్పగా గలిగిన బలము ముఖ్యవస్తువును సుసంగత మొనరించును. ఆధికారికము నట్లు సంపన్నముచేయుగా కథావస్తుస్వభావాత్మకము లయిన ఆరంభ— యత్న— ప్రాప్త్యాశా— నియతాప్తి— ఫలాగమాత్మకము లయిన యవస్థ లవభాసించును. అప్పు డారంభాద్యవస్థా సముపేతముగా పరిపూర్ణముగా సంబంధప్రకర్షమును ప్రసమీక్షించి అంకమును నిర్మాణింప వలెను. ఇందలి భావ మిట్లున్నది. బిందుసూత్రస్యూత మయిన యితివృత్తము ప్రారంభాద్యవస్థాపంచకమున సంచరించునది కాగా ప్రారంభావస్థ పూర్ణత్వము పొందినప్పు డంకచ్ఛేద మొనరింప వలెను. బిందుద్వారమున ననుసంధీయమాన మగు ద్వితీయాంకమును కూర్ప వలెను. ఇది ఆరంభాత్మక మయిన ప్రథమావస్థకు సంబంధించిన యంకవిభాగము. ఇట్లె ప్రయత్నప్రాప్త్యాశా నియతాప్తి ఫలా

గమము లనెడు నాలుగవస్థ లందును నిర్మాణము సముచితము. ఈరీతి ననుసరించి యయిదంకము లుండవలయుట ముఖ్యకల్పము.

ఇ ట్లయిదంకము లుండవలె నన్నట్లయినది. నాటకము పంచాంకన్యూన మగుట కాని పంచాంకాధిక మగుట కాని తగ దన్న నిర్బంధము లేదు. నాట్యతత్త్వజ్ఞులగు వారీ దిశానుసరణమున వేరు విధమున గూడ నిర్మింప వచ్చును. నాటకము ప్రారంభము నుండి తుదివరకు ప్రధానమె యగును. కార్యానుకూల మయిన యవస్థ కుపక్రమ ముపసంహార మను నవస్థాద్వయాపేక్షమున రెండంకములు నితరావస్థల కొక్కొకయంకము ననెడు నియమాంగీకారమున నీ యయిదంకములు సంగతములు. ప్రారంభావస్థ కంకద్వయ మేర్పరచి నచో నితరములకు నాలుగు కాగా మొత్త మారంకములు సిద్ధము లగును. ఉపక్రమమున వలె నుపసంహారమున నంకద్వయము కూర్చి నచో యత్నప్రాప్త్యాశా పతాకల కొక్కొక యంకము కాగా నేడంక ములు కలుగును. అన్ని యవస్థల కుపక్రమోపసంహారావస్థా ద్వయ యోగమున రెండు రెండంకములు కూర్చిన పదియంకములు కలు గును. ప్రాప్త్యాశ కొక యంకమునే కూర్చిన తొమ్మిది యంకములు, యత్నావస్థకు నొకే యంకము కాగా నెనిమిదియంకములు నిష్పన్నము లగును. ఇట్లీ విధ మయిన యంకనిష్పత్తి యితివృత్తములోని యంగాంగిభావ సమీహా విశేషమున కలుగును. అంతట నొకేవిధ మున నుండదు. ఒక యవస్థను ప్రధానమొనరించి నిబంధించినపుడు అవస్థాంతరమున మిశ్రీకరించి నిబంధించినపుడును భిన్నభిన్న భేదము లేర్పడును. ఇట్టి రీతుల యవలంబనముననె నాటిక న్యూనాంక మగు చున్నది. ఈ యంశమంతయు కారికలోని "తు" శబ్దమున "తత్వ" శబ్దమున దర్శిత మగుచున్నది. అవస్థా బిందు కార్య పదము లిందు పారిభాషికములు. వీని స్వరూపము విశదము కాగలదు. నాట్య తత్త్వజ్ఞు లీ విధముగా నన్యథాయోజనము చేయుటలో నంకాభివృద్ధి కలుగుచున్నది. ఈ యభివృద్ధియె గుణాన్వితరీతి.

## అంకనిర్వచనము

అంక మను పదసంకేతము కలుగుటను రెండవ యార్య నియా

షించును. అంకమనునది రూఢి సూచించును. భావములు రసము లర్థములను ప్రరోహింప జేయగలవు. అధిరోహింప జేయగలవు. ఇట్లు నానావిధానయుక్త మగుటచే నంక మంక మయినది. ఇది యార్యాసామాన్యార్థము. ఇక నిది విశేషార్థము. అంకమనునది లక్షణమున రూఢ మగు శబ్దము. ఇది యన్యవ్యవచ్ఛేదము సంపాదించు లక్షణము. నాట్యాత్మక రూపకమున కిది నానాత్వమాపాదించును. అన్యభేదమును గూడ నిరూపించును. ఇతరము లభినేయములు కావు. ఇది యభినేయము. అభినేయమునందలి యేకదేశము రసభావోపలక్షితము లయిన యర్థముల ప్రరోహింప జేయును. హృదయసంవాద సాధారణతాకరణమున స్వసంవేదనమును ప్రత్యక్షమొనర్చి యభిరోహణ మిచ్చును. బీజ మంకురాకారమును ప్రరోహము పొందినట్లు రసాకారోదయ ప్రరోహ ముదయించును. ఈ రసప్రరోహ మభినేయరూపకాంశములచే సంపాదిత మగును. అందుచే నభినేయముల కన్న భేదము కలదగును. అభినేయరూపకమునకు లక్షణ మగును. ఇది యంతయు నంకశబ్దమున కన్వర్థమయిన వ్యాఖ్య.

ఆర్యలోని రూఢిశబ్ద స్థలమున గూఢశబ్దపాఠము నంగీకరించి భట్టలోల్లటాదు లిట్లనిరి. భావములచే రసములచే గూఢము ఛన్నము వ్యాప్తమయిన యర్థము యదృచ్ఛాసిద్ధ మయిన అంకశబ్దమున చెప్పదగి యున్నది. అని. మరికొంద రిట్లనిరి. రూఢి=రోహణము. ఉత్సంగము. ఉత్సంగ మారోహించిన విధమున నారోహణ సంబంధ ముండుటచే నంకవ్యవహారము కలిగినది. ఈ యంశము నాటకాంశము. శృంగారాది రసములచే విభావానుభావ వ్యభిచారిరూపము లయిన యర్థములు, భావపదమున జెప్పదగిన విభావాదులచే యథానుకూలముగా భావాద్యర్థములు హృదయారోపితము లగును. హృదయమా యర్థముల వహించును. ఇట్టి యంకము నానాప్రకారము లయిన యర్థములతో గూడుకొనును అని. ఇట్టి భావముల ప్రకటన మంతయు అజినారూఢ రత్నప్రాయముగ నుండును. మేము నిరూపించిన యర్థమె సంగతము.

## అంకస్వరూపము

మూడవ యార్య స్వరూపము నిరూపించుచున్నది. అర్థసమాప్తి, బీజసంహారము, బిందులగన మున్నచో నంక మని సదావగితి సముచితము. ప్రారంభాద్యవస్థాత్మక మయిన యర్థమునకు పరిసమాప్తి యున్నచో నంక మగును. అవస్థ యంకమున నసమాప్త మయినను బీజార్థసంహరణము యథానుకూలముగా సంధిభేదమున సముచితమై యుండు నేని యప్పుడంకచ్ఛేదము యుక్తమె యగును. బీజసంహారమె బీజసంహరణము. బీజార్థమునకు సంబంధించిన దశావిశేషములు కొన్ని యున్నవి. అవి యన్నియు సంహార పద వాచ్యములు. ఉత్పత్తి యుద్ఘాటన ముద్భేదము గర్భనిర్భేదము ఫలసమానయన మని ముఖప్రతిముఖాదిసంధులలో యథాక్రమముగా నిరూపింపదగిన బీజము యొక్క దశావిశేషములు. ఇవి యన్నియు సంహారములె. అంకవిచ్ఛేదమున్న నర్థవిచ్ఛేద ముండరాదు. తదర్థమై యవలగ్న బిందుకముగా నంకము కూర్పవలెను. బిందు వవలగ్న మగుట యనగా స్పష్టసంబంధము కలదగుట యని భావము. తాపసవత్స రాజములో తృతీయాంకసమాప్తిలో నిట్లున్నది.

"ఆదా మానపరిగ్రహేణ గురుణా దూరం సమారోపితాం
పశ్చాత్తాపభరేణ తానవకృతా నీతాం పరం లాఘవం
ఉత్సంగాంతరవర్తినీ మనుగమా త్సంపిండితాంగీమిమాం
సర్వాంగప్రణయప్రియామివ తరుచ్ఛాయాం సమాలంబతే"

ఇది వత్సరాజవచనము. పరిణయాభ్యుపగమము ననుసంధానము చేయు పద్మావతి ప్రాప్తిసంభవ మనెడు తృతీయావస్థను చతుర్థాంకము ప్రదర్శించుచున్నది. ఇందు బిందు వాయోజిత మయినది.

రమ్యభావస్పందము కల పై పద్యము నీ విధముగా భావింపవచ్చును. దీనిలో మూడువిధము లయిన భావము లున్నవి.

౧. వృక్షచ్ఛాయ యుదయసమయమున నధికప్రమాణము కలిగి యుండుటచే దూరముగా వ్యాపించి పొడవుగా నున్నది. అనంతరము తాప మధిక మొదవించు సమయములో నీడ పొట్టిదై లఘు

రూపము పొందినది. పిమ్మట దగ్గరగా నుత్సంగాంతరమున సంచ
రించినది. అనంతరము ముద్దకట్టిన విధముగ నొకచో గుమికూడి
నది. అనంతరము సర్వాంగప్రణయము పొందినది.

౨. ప్రణయకుపిత ప్రియురాలు మొదట సమధికకోపమున దూర
మేగినది. పిమ్మట పశ్చాత్తాపమున కృశించి తేలికయయినది.
అనంతర మనుసరింపగా నుత్సంగము చేరినది. సర్వావయవ
కుంచిత యయినది. సర్వాంగ ప్రణయప్రియ యయినది.

౩. రూపకమునందు ఫలసిద్ధికై సమర్థ మయిన కార్యావస్థ ప్రథమ
సంధిలో సంధిసంధ్యంగప్రమాణ నియమానుసారమున దూరఫల
జనకముగా నిరూపిత మగును. అనంతరము రెండవసంధిలో ప్రతి
క్షేపకృత మయిన ప్రతిఘటనభరముచే కార్శ్యము పొంది లఘు
స్వభావక మగును. మూడవసంధిలో ననుగమ వశమున సమీప
సంచారము పొందును. చతుర్థసంధిలో సమాహారయుక్తిచే ప్రతి
ఘటనములు పరాహతములు కాగా నేకార్థప్రవణత్వమున
సమూఢీకృత మగును. తుద కయిదవసంధిలో సర్వాంగశోభా
సంబంధము కలదై ఫలాలంబనముతో నుండును.

ఇట్లీ యర్థముల ప్రతిభాన మంతయు నభివ్యంగ్యసారము. ఇట్లు
నాటకీయావస్థాప్రకాశము కల సన్నివేశరమ్యార్థములు ముద్రారాక్ష
సాదులందు సుశ్లిష్టములుగా నున్నవి.

## అంకత్రివిధత

ఇట్లంకస్వరూప మిందు నిరూపిత మయినదని చిరంతనులు
సంభావించిరి. కేవల మిది స్వరూపనిరూపణపరమె యని భావించు
టలో విశేషము కానరాదు. మొదటి కారికలో నిరూపితము కాని
యంశ మిందధిక మేమి లక్షణాభిహిత మయినది? ఆ యర్థమె
రూపాంతరాభిహిత మన్నచో పునరుక్తమె యగును. కాన నిచటి
యర్థతత్త్వము నీ విధముగా గుర్తించుట సముచితము. అంకస్వరూ
పము "అస్త్యావస్థోపేతం" అను మొదటి కారికయందే నిరూపితము.
"అంక ఇతి రూఢిశబ్దః" అను కారికలో నామనిర్వచనము దర్శిత

మయినది. ఈ మూడవ యార్త్య యంకమునకు సంబంధించిన త్రివిధత్వమును సూచించుచున్నది. కోహాలు డిట్లనెను. అంకము మూడు విధములు. చూడ, అంకావతారము, అంకముఖము నని. సూతవందులు బహ్వార్థములతో నర్థోపక్షేపణ మొనరించుట "చూడ" యగును. అంకాంతరమున సంకయోగ "మంకావతార" మగును. స్త్రీ కాని పురుషుడు కాని యంకమునకు సంబంధించిన విశ్లిష్టముఖము నుపక్షిప్తము చేసినచో నది "యంకముఖ" మగును. అని. ఇందొక యర్థ మనభిసంధాన పూర్వకముగనె సంప్రాప్త మగుట యన్న చూడాభేదమె దర్శిత మయినది.

రత్నావలిలో వైతాలికపాఠమున ప్రకృతమున కుపయోగించు నర్థమున్నది. సాగరికానురాగము తత్ప్రత్యభిజ్ఞామూలకమె కదా! అప్పుడు- "అయం స రాజా ఉదయనః"- అని సాగరిక తలచినది. వసంతక్రీడాదికము సర్వము దీనికై నిరూపిత మయినది. ఈ యంశమె శయ్యాచిత్రఫలకాదికృత మయిన రాజానురాగమునకు మూలము కావున చూలిక యనినారు. కాన చూలికాంకము ప్రథమము, ఏ యంకమున సర్వాంకముల బీజసంహారము అనగా సమ్మిలిత మయిన ప్రాప్తి యుండునో యది యవతారాంకము. రత్నావలిలో ద్వితీయాంక మిట్టిదె. అచట "ఇట్టికన్యక కిట్టి వరు నం దభిలాష యుక్తము" అని ప్రకృతమె సర్వము వర్ణిత మయినది.

అనుసంధాన మాత్రప్రాణముగా తదంశమున కుపయోగించు నట్లు వృత్తాంతము నిరూపిత మగునేని శ్లిష్ట మయిన యంకముఖ మగును. రత్నావలిలో తృతీయాంకమున నింద్రజాల వృత్తాంతము నిరూపిత మగుట దీని యుదాహరణము. చూలికాంకమున తదభిసంధానముండదు. ఇందు యౌగంధరాయణాదులకు తదభిసంధాన మున్నది. కాగా నిది యిచటి సంక్షేపార్థము. అంకమున వర్ణింపదగిన వస్తువు రెండువిధములు. ప్రధానము మొదటిది. తదుపయోగి రెండవది. తదుపయోగి వస్తువును నొకచో దైవవశమున నుపయోగించునది యగును. వేరొకచో నభిసంధిబలమున నుపయోగించునది యగును. కాగా నంకార్థము త్రివిధ మయినది. ఈ యసంకార్థ మొకప్పు డొకే

యంకమున మిశ్రభావమున గూడ నిబద్ధ మగుట కలదు. కాన నంక భేదము లయిన చూలికాంకముఖములకు ప్రధానార్థస్పర్శము లేదని గ్రహింప దగును.

౩౮౭. యే నాయకా నిగదితాస్తేషాం ప్రత్యక్షచరిత సంభోగః
నానావస్థోపేతః కార్యస్త్వం కోఽవికృష్టస్తు

ప్రవేశకద్వారమున గూడ ముఖ్యచరితమును సూచ్యనిరూపితము కావచ్చు ననెడు శంకానివారణముగ నీ యర్థము సంభావనీయము. ధీరోదాత్తాదు లయిన విజిగీషు తన్మిత్ర ప్రభృతు లయిన నాయకులు ప్రతినాయకులును నాటకమున నుందురు కదా! వారి చరితము తదుపాయానుష్ఠానము తత్సంభోగ మనగా; సంబంధము ప్రత్యక్షసన్నిహితము కావలెను. సాక్షాద్దృశ్యమానము కావలెను గాని సూచ్యమానము కారాదు. అంక మీ విధముగనె యుండ వలెను. "నయతి ప్రాప్నోతీతి, వృత్తం ఫలం వా నాయకః" వృత్తము ఫలము పొందు నాతడు నాయకు డని భావము. నాయక వ్యుత్పత్తి చరితప్రత్యక్షముగా నుండ వలెను. సంభోగప్రత్యక్షత్వము లేకున్నచో ప్రేక్షకులకు కేవలము వారి క్లేశమె గోచరించును. సామాజికునకు వైరస్య ముదయించును. "ఇంతటి యీ కష్ట మంతయు నేల ?" యనిపించును. సహృదయసామాజికుడు నిస్సుఖుడు కారాదు. అంకము నానాప్రకారావస్థా సముపేతము కావలెను. పతినాయకగతము లయిన నానాప్రకారావస్థలు చరితసంభోగము లుపాదేయములు కావు. అవి యవిషయ ప్రవృత్తములు కావున హేయావస్థలె యగును. నాయకగతములుగా నుండునవి తద్వైపరీత్యమున నుపాదేయావస్థ లగును. ఇట్లి యీ శబ్దార్థమును గుర్తించునది. అంక మవికృష్ట మదీర్ఘముగా నుండుట రమ్యము. దీర్ఘ మయినచో ప్రయోక్తృ ప్రేక్షకులకు ఖేద మొదవించును.

౩౮౮. నాయక దేవీ గురుజన పురోహితామాత్య సార్థవాహానాం
నైకరసాంతరవిహితో హ్యంక ఇతి స వేదితవ్యస్తు.

ఇంతవరకు ప్రధానవర్ణనీయ వృత్తము నిరూపిత మయినది. తదుపయోగి వృత్త దిశాదర్శన మిందు నిరూపిత మగును. అంకమున

నాయకాదులు విచిత్రరసవిశేషయుక్తులు కావలెనని యీవ్యాఖ్యాసారము. నాయకులు ముఖ్యనాయకులు పతాకానాయకులు కావచ్చును. దేవీజనము మహాదేవి దేవి భోగిని స్థాపిత మొదలగువారు. మాతృ పితృ భ్రాత్రాచార్యాదులు గురుజనులు. పురోహితు లమాత్యులు. ఇందు సార్థవాహపదము సేనాపతివాచకము. ఇతివృత్తవశమున వణిక్కుయినను గావచ్చును. అంకము వీరి యర్థాభిధాయకమై సంబంధించినది కావలెను. కావుననె యంకము నైకరసాంతరవిహితము. విచిత్రరస విశేషయుక్తము. దేవీయోగమున శృంగారము నాయకయోగమున వీర మితరయోగమున నితరము నుండవలె నని యభ్యూహించునది. అనేకరసాంకిత మగుట వలనను అంక మను సంజ్ఞ కలిగినది. అంకమున కేవలము చరితసంభోగములె ప్రత్యక్షము లగుట కాక వేరొక రంజనాతిశయమును గలదు.

అంకమునందు క్రోధప్రసాదశోకము లుండును. శాపకృతానర్థ వినాశ ముండును. గర్భసంధి కల యంకములో శంకాభయత్రాసకృతమయిన విద్రవ ముండును. వివాహ ముండును. అద్భుతమునకు సంబంధించిన సంభవాభ్యుపగమములు ఉపక్రమము దర్శనము నిర్వాహము ఇంకనిట్టి రంజక వర్గ మన్నియు నంకమున ప్రత్యక్షము లగును. "అక్షజం జ్ఞానం ప్రతి గతాసీతి ప్రత్యక్షజాని" చక్షుర్గోచరము లగును. కేవల నయనేంద్రియ ప్రత్యక్షమె యిచట ప్రత్యక్ష శబ్దమున సూచిత మయినను అన్యేంద్రియవర్గమునకు ప్రత్యక్షత కలుగుటయు నున్నది. ఒకప్పుడు తత్వప్రత్యక్షమును గలుగును.

## ప్రయోగపరిమితి

అంకప్రయోగమున కాలపరిమాణము కలదు. ఆ పరిమితి సూచనమున కిది యావశ్యకము.

౩౮౯. ఏకదివసప్రవృత్తం కార్యస్త్వంకోర్థబీజ మధికృత్య
ఆవశ్యకకార్యాణా మవిరోధేన ప్రయోగేషు

౩౯౦. ఏకాంకేన కదాచిద్బహూని కార్యాణి యోజయేద్ధీమాన్
ఆవశ్యకావిరోధేన తత్ర కార్యాణి కార్యాణి

౩౯౧. రంగం తు యే ప్రవిష్టాః సర్వేషాం భవతి తత్ర నిష్క్రమః
బీజార్థయుక్తియుక్తం కృత్వా కార్యం యథార్థరసం

అవాంతరప్రయోజనముతో కూడుకొనిన ఉపాయానుష్ఠాన రూప మయిన బీజార్థము సువర్ణనీయముగా సంభావించి యంకమును నిర్మింపవలెను. అంకము నందలి ప్రయోగాత్మకమయిన ప్రకృష్ట వర్తనమును (ప్రవృత్తము) ఏకదినవ్యాప్తి కల్గి యుండునట్లు నిబంధింప వలెను. ఏకదిన మనుట ముహూర్తపంచదశకపరిమితి యని గుర్తించు నది. నిరోధన మొనరింప వలనుపడని యావశ్యకములయిన భోజనా దులకు నియతముగా వలసిన సమయముకాక, తత్సమయావిరుద్ధముగా ప్రయోగసమయమును నిశ్చిత మొనరించి యంకమును నిర్మింపవలెను. ప్రయోగకాల మీ యంశావిరుద్ధముగా నుండుట యుక్తము. ప్రేక్షకు లకు ప్రయోక్తల కావశ్యకము లయిన సంధ్యావందన భోజనాదులః కవిరోధమునవె ప్రయోగముండవలె ననుటను నియతముగా గుర్తింప వలెను. కాన నొకే యంకమున కార్యానేకత్వము నిషిద్ధ మయినది. ఒకానొక సమయము ననుసరించి కార్యానేకత్వ ముండుటయు నభ్యుప గతము. ఏకాంకేన = ఒక యంకముచే, బహూని కార్యాణి= అనేక కార్యముల నొకప్పుడు యోజనము చేయవచ్చును. అట్టిసమయమున గూడ ఆవశ్యకకార్యావిరోధమునవె కార్యములు కార్యములు కావలెను. కొందరీ యార్యను నిషేధపరముగా నిరూపించిరి. ఏకాంకే= ఒకయంకమున, నయోజయేత్ = యోజనము చేయ రా దని వారి భావము. కొందరు "ఏకాంకేన" అని తృతీయగనె సంభా వించి యార్యను విధిపరముగా యోజనము చేసినారు. అవశ్యంభావ మున నొనరింప వలసిన భోజనాదికార్యములు రంగమున ప్రత్యక్షము గనె ప్రదర్శింపవలయునో? అని శకించువాని కిది సంభావనీయము. మూడవ యార్య దీని నిరూపించును. తత్ర= ఆవశ్యకభోజనాదిక మొనరింపవలసి యున్నప్పుడు బీజార్థయుక్తియుక్త మయిన కార్య రసానుకూలకార్య మొనరించి రంగప్రవిష్టులు నిష్క్రమింప వలెను. ఆవశ్యకము లని సంధ్యావందన భోజనాదుల నచటనే యాచరింప రాదు. ఉపక్షిప్తావాంతరకార్య మసమాప్తముగ నున్నచో పాత్ర నిష్క్రమణ ముచితము కాదు. బీజార్థయుక్తియుక్తం= ఉపక్షే

పాత్మక మయిన బీజమున కొక ప్రయోజనముండును కదా! అట్టి బీజప్రయోజనముతో నయిన యుక్తి = సంబంధము నందు సంయుక్తమై యుపాయభూతముగా నున్న కార్యమును ప్రయోజనానుసారి యగు నట్లు విశిష్టరససంపదుపేతముగా నొనరించి తత్పరిసమాప్తిలో యవనికచే తిరోభానరూప మగు నిష్క్రమణమును ప్రదర్శింప వలెను. బీజార్థయుక్తి యనునది ఉద్ఘాటనము ఉద్భేదము గర్భనిర్భేదము ఫలసమానయన మను స్వరూపమున నుండునని కొందరనిరి. అంకమున నితివృత్తనియమ మిట్లున్నది. ఇతివృత్తకాలనియమ మీ విధమున నుండును.

> ౩౯౨. జ్ఞాత్వా దివసావస్థాం క్షణయామముహూర్త లక్షణోపేతాం
> విభజే త్సర్వ మశేషం పృథక్పృథక్కార్య మంకేషు
>
> ౩౯౩. దివసావసానకార్యం యద్యంకే నోపపద్యతే సర్వం
> అంకచ్ఛేదం కృత్వా ప్రవేశకై స్తద్విధాతవ్యం

క్షణ యామ ముహూర్త లక్షణ సముపేత మయిన దివసావస్థను గుర్తించి వేరువేరుగా నా యా యంకములందు సర్వకార్య మశేషముగా నిరూపింప వలెను. "ఈ క్షణమున నీ కార్య మొనరింప వలెను. ఈ సమయమున సంధ్యానుష్ఠాన మొనరింప వలెను." అని తల్లక్షణము గుర్తించియె నిబంధించుట సముచితము. ప్రత్యేకముగా నే కార్యమయినను సర్వవిధముల స్వాత్మపూర్ణమె యగును. అందువనె సర్వము విభజేత్ =విభాగమున ప్రదర్శింప వలెను. దినమును రాత్రిని నాడికానియమమున గాని ఛాయాప్రమాణమున గాని యెనిమిది విధములుగా విభజించి యొక దినమునందలి యుపయోగి చేష్టితము నంకమున నిబంధింప వలెనని తాత్పర్యము.

దివసావసానకార్యము సర్వ మంకమున నుపపన్నము కానప్పుడు అంకచ్ఛేద మొనరించి ప్రవేశకములచే దాని నిరూపింప వలెనని మూలార్థము. మధ్యాహ్నస్నానభోజనాదులు కాని దూరమున జరిగిన దశరథమరణాదుల వంటి కార్యములు కాని నిరూపణీయము లయినప్పు డుపాయ మిందు సూచిత మయినది. దివసావసానకార్య మనుట దివసమందవసానము=సమాప్తి కల కార్య మని భావము.

ఇట్టి సర్వకార్యము నంకమున ప్రత్యక్షముగా ప్రదర్శించుట యుక్తము కాదు. అట్టిది ప్రవేశకప్రదర్శనీయము. అదృష్టార్థమును గూడ హృదయమున ప్రవేశ పెట్ట గలవి కావున ప్రవేశకము లయినవి. ఇచటి ప్రవేశక పదమున చూలిక అంకావతారము అంకముఖము ప్రవేశకము విష్కంభక మనునవి యభిప్రేతములు. కావుననె కోహలు డర్థోపక్షేపకముల నయిదింటిని నిరూపించినాడు. కార్యవశమున దూర దేశగమన మొనరించుట చూపవలసి యున్నప్పు డంకచ్ఛేదమున సంక్షేపముగా ప్రవేశకములచే దాని నిర్దేశింప వలెను.

## ప్ర వే శ క ల క్ష ణ ము

అంకలక్షణ మిట్లు విస్తృతముగా నిరూపిత మయినది. అంకసంధానరూప మగు ప్రవేశకమునకు సామాన్యలక్షణము నిరూపింప వలెను. నాటకమున గాని ప్రకరణమున గాని నాయకుని చరితసంభోగములను సన్నిహితముగా ప్రత్యక్షముగా నుండునట్లు నిరూపింప వలెను. ఏకాంకరూపకమున గూడ అంకము నాయకచరిత ప్రత్యక్షతాశూన్యము కారాదు. అట్లొనరింపరాదు. ఇక నాటకమున ప్రకరణమున చెప్పునది యేమి? అంకమంతట ప్రత్యక్షనేతృచరితము కావలెను. నాటకప్రకరణములందే నాయకచరితసంభోగము లుండునని రూపకాంతరము లందట్టి నియమము లేదని భావింప జనదు. నాటకప్రకరణములె ప్రవేశకాదిసహితము లన్యము లట్లు కాదని తలచుటయు యుక్తము కాదు. ప్రవేశకము పరిజనకథానుబంధముతో నుండును. సూతమాగధులు స్త్రీపురుషపరివారము చేటీకంచుకులు వీరందరు పరిజనపదవాచ్యులు. సూతమాగధులు చూలికాంకమున నుపయోగింతురు. చేటీకంచుకులు ప్రవేశకవిష్కంభకములం దుపయోగింతురు. వీరందరు పరస్పరశ్లిష్ట కథాసంబంధముతో ప్రవేశకము లందుందురు. ప్రవేశక మంకార్థసాధనమున కుపయోగించును. సంధానమున కుపయోగించును. ఈ సర్వార్థనిరూపకముగా నిది యున్నది.

౩౯౪. సన్నిహితనాయకోంకః కర్తవ్యో నాటకే ప్రకరణే వా
పరిజనకథానుబంధః ప్రవేశకో నామ విజ్ఞేయః

నాట్యార్థకథాయోగమున ప్రయోగ మనుసరించి ప్రవేశకాదులను నిరూపించుచున్నది.

## అంక నియమము

> ३८७. ప్రకరణ నాటక విషయే పంచాద్యా దశపరా భవంత్యంకాః
> అంకాంతరసంధిషు చ ప్రవేశకాస్తేషు తావంతః
>
> ३८८. అంకచ్ఛేదం కృత్వా మాసకృతం వర్షసంచితం వాపి
> తత్సర్వం కర్తవ్యం వర్షాదూర్ధ్వం న తు కదాచిత్

పూర్వోపక్షిప్తాంక సంఖ్యానువాద ద్వారమున నిది హృదయసంధార్యము. సంధ్యవస్థానపరిపూర్ణోపనిబద్ధరూపము కల ప్రకరణమున గాని నాటకమున గాని యంకములు పంచాద్యముగా దశావరముగా నుండును. ఉపక్రమోపసంహారములను వితత మొనర్చినప్పుడు పది యంకము లుండును. విస్తరణము మాని సంక్షేపించినచో నైదంకము లుండును. ఇదియె నియమము. నాటకప్రకరణములు పంచాంకన్యూనము లగుట కాని దశాంకాధికము లగుట కాని యుచితము కాదు. అంక మధ్యములందు సంధానస్వరూపము లయిన చిత్రసన్నివేశము లుండును. ఆ చిత్రతాసంపాదనమునకు పంచవిధప్రవేశకములను కూర్పవలెను. అంకాంతరసంధి నిమిత్తముగా ప్రవేశకములను సమీక్షింపవలెను. ప్రవేశకశబ్దము మహాసామాన్యవచనము. అన్నిటి యందిది వర్తించును. మాసకృతము వర్షసంచిత మయిన కార్యము సామాజిక హృదయగతమై యుండునేని యంకచ్ఛేద మొనరించి ప్రవేశక విష్కంభముల నిర్మింప వలెను. సంవత్సరాధిక నిబంధనము రుచిరము కాదు. మాసకృత వర్షసంచితకార్యముల కన్న నల్పకార్య మయినచో నంకముఖ ముచితము. ఇంక నల్పానుసంధేయ మున్నచో చూలిక యుక్తము. అల్పతమానుసంధాన మున్నప్పు డంకావతారము సముచితము.

ఈ విషయమున కొందరి భావము లీ విధముగ నున్నవి. శ్రీరాముడు వనవాస మొనరించి యయోధ్య ప్రవేశించిన పిమ్మట రామానుసంధాన మనుసంధనీయము కాకూడ దను నాశయమున "మాసకృతం వర్షసంచితం" అనుచోట ఒకమాసము రెండుమాస

ములు బహుమాసములని, ఒకవత్సరము రెండువత్సరములు బహు
వత్సరములని సమాస మంగీకరించిరి. ఒకప్పుడు సంవత్సరమున కధిక
ముగా మహాప్రభావు లగువారు చిరాతీత మనుసంధానింతురు. అట్టి
వారి బహుతరకాలమును ప్రవేశకములచే వర్ణింప వలెను. కొందరు
పురుషప్రాయులగు వారలకు సంవత్సరమున కధికముగా ననుసంధాన
ముండదు.

ఈ భావ మీ కల్ప మీ కల్పనము సుసంగతముగా లేదు.
మాసవర్షాదులకు నియతపరిమాణము స్వీకృతమై యున్నది. ద్వివచన
బహువచనాంతముగ సమాసకల్పన మయుక్త మని ప్రాక్తనపరి
భాషలు సూచించు చున్నవి. వర్షాధికానుసంధాననిషేధము ఫల్గు
ఫలమె యగును. ఏకవచనాంతముగనె సమాసము సముచితము.
అయినను రామాయణ భారతాది చరితముల త్యాగప్రసంగము
లేదు. ఇందులకె భరతముని "కార్య" పదము గ్రహించినాడు.
కార్యసంచితము యత్ననిష్పాద్య మగునేని యొక సంవత్సరమని
యచట గణించుట సంప్రదాయమున ప్రసిద్ధముగ నున్నది. సంవత్స
రాధికముగా సంవత్సరము లచట నున్నను అవి యవిద్యమాన కల్ప
ములె యగును. రామచరితమునందు పదునాలుగుసంవత్సరముల
వనవాసము నిరూపింప వలసిన యవసరము కానరాదు. మారీచవధ
సుగ్రీవరాజ్యదానము మొదలగు నవాంతరకార్యములు మూడు
నాలుగు సంవత్సరములకు తగి యున్నవి. కాన సంవత్సరాధిక కాల
నిషేధమున వర్షద్వయము నధికమును నిషేధించుట వలన ఫలము
లేదు. వర్షసహస్రాయుష్కునకు వర్షశతాంతరాలము నందలి చరిత
వ్యాఖ్యానమున గూడ నే దోషమును కలుగదు. కాన పంచాంక
నాటకమున నయిదు కార్యదినము లనుట సంక్షేపము. దశాంకనాటక
మున పదిదినము లనుట విస్తరము.

## అంకచ్ఛేదనియమము

౩౯౭. యః కశ్చిత్కార్యవశాద్గచ్ఛతి పురుషః ప్రకృష్టమధ్వానం
తత్రాప్యంకచ్ఛేదః కర్తవ్యః పూర్వవత్తత్వజ్ఞైః

కార్యవశమున పురుషుడు దూరమార్గ మేగునేని పూర్వము వలె నచట గూడ దశరూపవిదు లంకచ్ఛేద మొనర్ప దగును. కార్య మత్యంత మాయత మయినందున పురుషు డనదగు నాయకు డనేక యోజన వ్యవహిత మగు నధ్వ ప్రతిదినము ప్రయాణించుట విశ్రాంతి శయ్యా మొదలగు నవి రంగమున నెట్లు ప్రదర్శనయోగ్యము లగును? అందుననె కార్యవశమున దూరాధ్వగమన మావశ్యక మయినచో నంకచ్ఛేద ముచిత మగును. డిమాదులలోని నాయకులు దివ్యులు. ఆకాశయానకాదికమున వారలకు సర్వము యుక్తము కాగలదు. అనాయక పురుషు డంకము విచ్ఛిన్నము కాకపూర్వమె నిష్క్ర- మించును. అయినచో దివసావసానకార్య మెట్లుపపన్నము కావలెను? ఆవశ్యకావిరోధమున ననెడి పూర్వవచనమున కన్న నిందు తిలమాత్ర మేని యధికము గోచరింపదు. ఈ భావమున భట్టలోల్లటాదు లీ కారికను పఠింపనే లేదు.

ఉపాధ్యాయు లిట్లనిరి. ఇది నిమిత్తాంతరము కాదు. పూర్వము చెప్పినదియె. అంకములో నుపపన్నము కానిదానిని ప్రవేశకములో జెప్పుట పూర్వకథనమె. అదియె ఇందుదాహరణముగా నార్య దర్శించినది. నాయకునకు దూరాధ్వగమన మన్నది సముచితమె కావచ్చును. అందువలన నీ యంకచ్ఛేదమును పూర్వలక్షణార్థమె యనుట సంగతము. "తత్రాప్యంకచ్ఛేదః" అనుచో "అపి"శబ్ద ముదాహరణాంతరమును సూచించును. ప్రవేశకము అంకార్థసంధాన ప్రయోజనము కలది కావున నిట్టిపట్ల దానికి స్థానము చెప్పుట యుక్తము. అంకాంతరము ననుసరించుటయు నంకమధ్యమున గలుగు నని తద్విషయమునే సూచించుట యగును. పూర్వాంక మయిన పిమ్మట రానున్న యంకము ననుసరించుట దీని విషయము. ప్రత్యం కాంతమునను బిందువుండుట ప్రసిద్ధ మయినందున ప్రవేశకము తదను సంధాన మొనరించును. దానిని చెప్పు వాక్యమునేని పలుకును. సంక్షిప్తముగా ప్రయోజనమును సూచించును. బిందువున కాధిక్య మేని కలుగ జేయును. తద్విస్తారమేని ప్రస్తరించును. ప్రకరణమున నాటకమున నావశ్యకముగా ప్రవేశక ముండును. ఉత్తమప్రకృతి విష

యమున నుపదేశమునకె యది ప్రవర్తించి బహులోపాయమున భూయస్తరావాంతరకార్యమునందు ప్రసరించును. కార్యబాహుళ్యము సంపాదించు నమాత్యాదులకును స్వకార్యనిరూపణమునకై ప్రవేశక మావశ్యకము. ఇతర రూపకములందు కార్యోపదేశము పరిమిత మయినందున ప్రవేశకోపయోగ మంతగా నుండదు. అంకాంతరము ననుసరించినదై బిందురూపార్థముల సంక్షేపార్థము నందిపుచ్చుకొని నాటకప్రకరణములందు ప్రవేశక ముండుననుట పై భావమునె సూచించును. ఇట్టి ప్రవేశకమునకు విష్కంభకము కన్న కొంత భేద మున్నది. ప్రవేశకశబ్ద మతివిశేష శబ్దవాచియు కాగలదు.

> ౩౯౮. నోత్తమమధ్యమపురుషై రాచరితో నాప్యుదాత్త వచనకృతః
> ప్రాకృతభాషాచారః ప్రయోగమాశ్రిత్య కర్తవ్యః

ఉత్తమపురుషుల యాచరణ మిందుండదు. మధ్యముల వ్యవహారము నుండదు. ఉదాత్తవచనము లిం దక్కరలేదు. ప్రాకృతభాషాచారములు ఇందు పర్యాప్తములు. ప్రయోగానుసారమున ప్రవేశకము నిట్లు నిరూపింప తగును. పరిజనులు కొందరుత్తమ మధ్యము లుందురు. అట్టి వారి నివృత్త్యర్థమె ఇందుత్తమాచార నిషేధము. సంస్కృత ముదాత్తవచనము. తన్నిషేధము నూహ్యము. కొందరిట్లనిరి. ఉదాత్తవచన మనునది స్వాత్మకార్యమున విశ్రాంత మయిన వచనము. "భర్తృదారిక నన్నాజ్ఞాపించినది" అని దూతి యనుట ప్రవేశకమున నుండదు. అట్టిది ప్రధానోపయోగియె యగును. అది సూచ్యము కానక్కరలేదు. దృశ్యమె కావచ్చును. ప్రయోనుగానుసారమున సంస్కృతభాషయు సంస్కృతాచారమును విష్కంభమున వలె నిందును కూర్పవచ్చును. ఒక్కొక్కచో ప్రవేశక మొకటి కాలోత్థానగతిగా నుండును. కాలోదయము సూచించునది యగును. "ఈ వసంతసమయమున నన్ను సబహుమాన మాహ్వానించి" అను రత్నావళి లోని పంక్తి ఇట్లు కాలసూచకము. సంరంభకార్యముల నది సూచింప వచ్చును. ప్రవేశక మొకప్పుడు వ్యాఖ్యాత్మక మయిన యర్థము నిరూపించును. ఒకప్పుడు సంరంభ విధానము లోని భావము బోధించును. ఒకప్పుడు కార్యగతిలోని భావము సూచించును.

నురియొకప్పుడు విషయార్థనిరూపక మగును. కాగా ప్రవేశక మయిదు విధముల సూచిత మగుచున్నది.

౧. కాలగతి సూచకము
౨. వ్యాఖ్యార్థ వాచకము
౩. సంరంభార్థ బోధకము
౪. కార్యార్థ నిరూపకము
౫. విషయార్థ ప్రతిపాదకము

ఒక్కొకచో ప్రవేశకము గూఢార్థము వ్యాఖ్యానించి నిరూపించును. తాపసవత్సరాజములో నమాత్యప్రణిధి పద్మావతీగృహమునందు వాసవదత్త నుంచుటలో నిగూఢప్రయోజనమును వ్యాఖ్యానించినాడు. ప్రవేశకము వేరొకచోట నుపాయాన్వేషణ మొనర్చునదిగా నుండును. వాసవదత్త నపహరించి యుజ్జయినికి తీసికొని పోదలచిన వత్సరాజు విషయము అందు ప్రయోజకులయిన యమాత్యాదుల సంరంభమును సూచించునదై యున్నది. ఇది శాలంకాయన వచనములలో స్పష్టము. కార్యనివేదక మయిన ప్రవేశక మాధికారిక కార్యము సూచించును. ఇందు పంచాంగానుష్ఠానమును సూచితము కాగలదు. కర్మల యారంభోపాయము, పురుషద్రవ్యసంపత్తి, దేశ, కాలవిభాగము, వినిపాతప్రతీకారము, కార్యసిద్ధి, అను సంగపంచకమును సూచించును. అట్టి యర్థమును సూచించు ప్రవేశకము తాపసవత్స రాజము, ప్రతిభాచాణక్యము, ముద్రారాక్షసము మొదలగువానిలో కలదు. విషయ నిరూపకాత్మక మయిన ప్రవేశక మంకావతారము నకు సూచకముగా నుండును. తదితివృత్తము బోధించును. తద్విశేషరూపమును సూచించును. నాగానందము ద్వితీయాంకములో చేటిక లిద్దరు మదనావస్థావృత్తాంతమును విశేషముగా వర్ణించుటయు చందనలతాగృహాదులు ప్రదర్శించుటయు నున్నది. ఇట్లనేక విధములుగా ప్రవేశక ప్రయోజనము లున్నవి. ఇప్పటి కిన్నిటి చెప్పుట పరిగణన మేమియు కాదు. ప్రవేశక మనేకార్థ మనుట ప్రవేశ స్వరూప ప్రకటనము. ఈ భావసామగ్రి యంతయు నీ కారిక పరమార్థముగా నున్నది. ఆ కారిక యిది.

౩౯౯. కాలోత్థానగతి రసా వ్యాఖ్యా సంరంభ కార్య విషయాణాం
అర్థాభిధానయుక్తః ప్రవేశకః స్యాదనేకార్థః

ఏవంప్రాయ మయిన యర్థము ప్రవేశకమున ప్రదర్శితమగు నేని యది సంక్షిప్తముగ నుండునా? విస్తరముగ నుండునా? ఈ యార్య నిర్ణయము చెప్పును.

౪౦౦. బహ్వాశ్రయమపి కార్యం ప్రవేశకైః సంక్షిపేచ్చ సంధిషు వా
బహుచూర్ణపదై ర్యుక్తం జనయతి ఖేదం ప్రయోగస్య

కార్యము బహ్వాశ్రయము కావచ్చును. దానిని సంక్షిప్తము చేయుట సముచితము. వచన ప్రతివచనములతో దాని సారించి పొడిగించుట ప్రయోగమున ఖేద మొదవించును. అంకార్థముల సన్నివేశనము నకై సంధిసంధాయకము లయిన ప్రవేశకము లయిదును అంకాశ్రయ మయిన బహువక్తవ్యమును విస్తృతమయినను సంక్షిప్త మొనర్ప వలెను. సంధానమున కుపయోగించు నంతగా వానినచ్చట చెప్ప వలయును. గద్యగతము లయిన ససంస్కృత ప్రాయము లగు నస మస్తపదము లచట ఖేదావహము లగును. కేవల చూర్ణపదప్రయో గము సుందరము కాదు. ప్రవేశకాదులలో నుత్కలికాప్రాయము బహుతరసమాససంకీర్ణము నయిన రచనయు రమ్యము కాదు, అట్టిది యభినయ శాఖాంగములను గ్రోసిపుచ్చును. సమాససంశయమున నర్థ నిశ్చయ మీయదు.

ప్రయోగబాహుల్యమున నంకమున నర్థసమాప్తి కానపుడు వృత్తాంతస్వల్పములు కథాకల్పము లయిన ప్రవేశకములతో నర్థ సమాప్తిని సూచింపవలెను. దివసావసానకార్యము అంకమున నుప పన్నము కాకపోయినపుడు ప్రవేశకమును సూచింప వచ్చునని పూర్వ మనుట నిట్లే సర్దుకొనవలయును. ప్రత్యక్షప్రయోజ్య మయినను ప్రయోగవశమున నంకప్రయోజ్యము కాజాలని కథావస్తువునకు ప్రవేశకమె శరణము. ఇది యంతయు ప్రయోగ బహుతరబహు మానమునె సూచించును. దివసకార్యము లనేకములు కలవు. వానిలో సుందర మగునది, యుపదేశోపయోగి యగునది ప్రయోగపదవిలో నవతరించి ప్రత్యక్షముగ ప్రదర్శిత మగును. మిగిలిన దంతయు ప్రవేశకమున గతార్థ మగును. ఇతివృత్త నిర్వాహము మాత్రమె-

యప్పట దానిఫలము. అందునని యది సంక్షిప్తకథాప్రాయముగ నుండును.

రంగనిషిద్ధములు

౪౦౧. యుద్ధం రాజ్యభ్రంశో మరణం నగరోపరోధనం చైవ
ప్రత్యక్షాణి తు నాంకే ప్రవేశకైస్సంవిధేయాని

యుద్ధము రాజ్యభ్రంశము మరణము పట్టణము ముట్టడించుట అంకమున ప్రత్యక్షముగ చూపరాదు. ప్రవేశకములచే నిరూపింప వలెను. యుద్ధమందు శస్త్రసంపాత బాహుల్య మున్నది. రాజ్యభ్రంశమున పతనములు మరణము లుండును. నగరోపరోధములో యంత్రప్రయోగము సురుంగప్రక్రియ లావశ్యకములు. వీనిని రంగమున చూపజనదు. ఇందు కొంద రిట్లందురు. మరణము రెండు విధములు. ఇతరుల క్రియాసంబంధమున సంపాద్య మగు మరణ మొకవిధము. చక్రముచే దైత్యశిరము ఛేదించుట యిట్టిది. ఇతరసంబంధి క్రియా నిరపేక్షము గనె వ్యాఘ్ర్యాదుల యభిఘాతమున గలుగు మరణము రెండవది. వీనిలో మొదటి మరణమె రంగనిషిద్ధ మగుచున్నది. రెండవది రంగనిషిద్ధము కాదు. కావునని మరణ మిచట కారికలో వేరుగా నిరూపిత మయినది. ఇతరు డొనరించు మరణ మిందు చూపరాదని భావము. ఇతరు డొనరించు మరణము యుద్ధమున సంగృహీతము కాదు. అయుద్ధపూర్వకముగా నశంకితశిరశ్ఛేదము లోకమున నున్నది. అట్టి దిచట తగదు.” అని

ఇట్లను వీరి నిట్లు ప్రశ్నింప వలెను. “ఇట్టి మరణము ప్రయోజ్య మిట్టిది ప్రయోజ్యము కాదు” అను విషయవిభాగములో నిదాన మేమి కలదు? మృతునకు నిష్క్రమణ మెట్లు? అవస్థాన మెట్లు? మరణ మనిషిద్ధ మన్నప్పుడు నాట్యోపయోగి సమస్త ధ్రువాగానాదుల ప్రక్రియలకు విలోపమె కలుగును. సామాజికులకు విరసతా ప్రతిపత్తియు కలుగును. మరణ మంతట సమానము. కాన రంగమున మరణము ప్రయోజ్యము కారాదు. మరణానుభావము ప్రయోజ్యము. “మరణానుభావ వర్ణనమున గలిగెడి విశేష మేమి కలదు? యుద్ధవీరరౌద్రాదులలో గూడ నీ యనుభావవర్ణనమున నేమి

ప్రయోజన మున్నది? తదనుభావముల గుర్తింపక పోయినచో ప్రవేశ కములచే వర్ణించుట యెట్లు?" అని యందురేని మరణమున గూడ నిట్లె యనుట యుక్తము. అంతట సమాధి సమము.

ప్రత్యాపత్తిశూన్య మయిన మరణమును రంగమున ప్రయోగింపరాదు. అట్టిది సర్వవిధ ప్రక్రియా విలోపకము. దాని నిరూపింప రాదు. ప్రత్యాపత్తి—పునర్జీవనము. మఱల బ్రతుకుట యున్నచో మరణము నిరూపింపవచ్చును. కొన్ని నాటకములందు ప్రత్యాపత్తి యున్నది. నాగానందములో జీమూతవాహనుని మరణము నిరూపిత మయినది. అచట పునఃప్రత్యాపత్తి యున్నది. అందు జీమూత వాహనుడు క్షణ మాత్ర మనిశ్చితచేష్టాత్మకుడుగా నిరూపితు డయి నాడు. అట్టి మరణము రంగప్రయోజ్యమె. కాని మరణానుభావ సాక్షాత్కరణములో నదియు నొక విషయముగా నున్నది. మహా సాంపరాయములో వాహినీదలముల సాటోపపరిక్రమణ మవశ్యంభావి. అప్పుడు శస్త్రవర్ణనాదు లుండక తప్పవు. తత్ప్రారంభవిధానములు నావశ్యకము లగును. ఇట్టి పరిక్రమాటోపము ప్రయోజ్యము కావ చ్చును, కాని తన్నిర్వాహ మచట ప్రదర్శనీయము కారాదు. ఈ యంశమె నిషేధకారణమున స్ఫుటీకృత మయినది. నిర్వాహపర్యం తము యుద్ధమె ప్రయోజ్యము కాదు. అచిరప్రత్యాపత్తి లేకపోయి నచో మరణ మప్రయోజ్యము. ఝుడితి ప్రత్యాపత్తిని నిరూపింప వలెను. కాకున్న నట్టిది ప్రత్యక్షప్రయోజ్యము కాకూడదు. ప్రవేశ కములచే దానిని ప్రయోగింపజనును. ప్రవేశకము లని యనుటయుప క్షేపపంచకమధ్యమున నన్యతమమున సూచింప వలెను.

కొంద రిట్లందురు. "వ్యాధిజన్యమరణ మయిన నభిఘాతజ మరణ మయినను రంగమున ప్రయోజ్యము కావచ్చును. మరణము ప్రయోజ్యమనుట తదనుభావములను ప్రయోగింప వచ్చునని భావము. ఇట్టి ప్రయోగమున చనిపోయి మఱల జనించినట్లు నిరూపింప నక్కఱ లేదు. ప్రాణనిష్క్రాంతియు నిరూపింప రాదు. అపునర్జనిప్రకృతి నిష్క్రాంతరహిత ప్రకృతి ప్రతిపాదింప వలెను." అని. సహృదయు

నైరస్య నైమనస్య ప్రదాయి విషయ ప్రసక్తి విస్తరణ ముపకారి కాదు.

మరణాఖ్యానము తద్యత్నము సర్వథా యనాఖ్యేయ మనుట కీ విషయమును నిదర్శకము.

> ౪౦౨. అంకే ప్రవేశకే చ ప్రకరణమాశ్రిత్య నాటకే వాపి
> న వధః కర్తవ్యః స్యాద్యోఽభ్యుదయీ నాయకః ఖ్యాతః

ప్రకరణమున గాని నాటకమున గాని యభ్యుదయి యగు నాయకునకు ప్రత్యక్షముగ గాని వర్ణనమున గాని మరణము వధము నిరూపింపరాదు. అంకమున ప్రత్యక్షముగ నిరూపింప రాదని, ప్రవేశకమునను వర్ణనముచే నిరూపింప రాదని భావము. [ఉత్తరగామచరితము నందు శ్రీరాముడు శంబూకుని ప్రహరణ మొనరించుట ద్వితీయాంకమున నున్నది. శంబూకు డభ్యుదయి కాడు. కాని యది సముచితమా? యనిపించును. శంబూకునకు ప్రత్యాపత్తి యున్నది. అత్యధిక తేజోమయ శరీరమును గలిగినది. వైరాజలోకసిద్ధియు నిదర్శిత మయినది. ఇది యంతయు శ్రీరాముని యుపక్రాంతమహాభ్యుదయ నాయకుని ధర్మైకప్రవణతా సూచకము. ఎట్లయిన నిట్టి వాని భావించియె కతిపయభావములు వెలువడినవి.] ప్రత్యక్షముగా నెవనికేని మరణము ప్రయోజ్య మనుటను కొందరే మాత్ర మంగీకరింప జాలరు. వారి మతమున నిచట "అంకే" యని యనుకగ్రహణ మెందుల కనిపించును. కాగా నిచట "వధ" శబ్దమున మరణము సూచితముకాదు. పరు లొనరించు ఘాతప్రతిఘాతములె యిచట వధ ప్రతిపాద్యములుకాగా అన్యఘాతదానాదికమును ప్రత్యక్షముగా రంగమున ప్రదర్శితము కావచ్చును. అచిరప్రత్యాపత్తి యున్నను సమాశ్వాస మున్నను నాయకఖ్యాతునకు ఘాతదానాదికము ప్రదర్శనీయము కారాదు. ఇచట ఖ్యాతనాయకు డనుట పతాకానాయకాదు లర్థమని కొందరు తలచిరి.

నాయకునకు వధము చూపరాదు. వర్ణింపరాదు. ఆ నాయకున కపసరణమె నిరూపింప వలెను. "అశక్యే సర్వముత్సృజ్య అపగచ్ఛేత్. అదృష్టా హి జీవతః పునరావృత్తిః" అనియు శక్యము

కానప్పుడు సర్వము విడిచి యెటకేనిపోవలయును. పోయిన జీవము రాదు. జీవ మున్నచో మఱల నన్నియు పొందవచ్చును. అని లోక సిద్ధ మయిన న్యాయము. కావున నపసరణ వర్ణనమె ప్రశస్తము. అథవా; నాయకునకు సనిబంధన బంధనాత్మక మయిన గ్రహణ మయినను నిరూపింప వచ్చును. వాసవదత్తాపహారములో (?) వత్స రాజు గ్రహణబంధన మిందు దృష్టాంతము. కిలింజహస్తి ప్రయోగ మున మహాసేన మహారాజు వత్సరాజు నంతఃపురమున సనిబంధనముగ బంధించుట కథాప్రసిద్ధము. నాయకునకు సంధి సంధానమేని సం యోజ్యము కావచ్చును. రాజమండల బలము కల బలవంతుడగు రాజు దండెత్తి యాక్రమించినచో నబలపాలకుడు సంధిపడుట సము చితము. ఇట్లర్థశాస్త్రము నిరూపించినది. కాన సంధి యుక్తము. ఇట్లీ యపసరణ బంధన సంధులు ప్రయోజ్యములు కాగా వీని విషయమున విషయవిభాగమును కూడ గుర్తింపవలసి యున్నది.

౪౦౩. అపసరణ మేవ కార్యం గ్రహణం వా సంధిరేవ వా యోజ్యః
కావ్యశ్లేషై ర్బహువిధై ర్యథారసం నాట్యతత్త్వజ్ఞైః

కావ్యము ప్రధానరసానుసారమున నుండునుగదా ! ఆ కావ్యా ర్థము నందలి బంధనాద్యుపపత్తు లన్నియు కావ్యశ్లేష శబ్దవాచ్య ములు. యథారసముగా కావ్యార్థశ్లేషోపలక్షితము లయిన యపసర ణాది కార్యములను నాట్యతత్త్వజ్ఞులు నిరూపింపవలెను. "కావ్యశ్లేష" స్థానమున "కార్యవిశేష" పాఠమును కొందఱంగీకరించిరి. అదియు మా కవిరుద్ధము కాగలదు. రససముచితముగా కార్యవిశేష సముపల క్షితము లయిన యపసరణ గ్రహణ సంధులను నాట్యవిదులు కూర్ప దగు నని భావము.

## అప్రయోజ్య సంగ్రహము

౪౦౪. స మహాజనపరివారః కర్తవ్యం నాటకం ప్రకరణం వా
యే తత్ర కార్యపురుషా శ్చత్వారః పంచ వా తే స్యుః

ప్రత్యక్షప్రయోజ్యములు కారాని వాని సంగ్రహమును సామాన్యద్వారమున ప్రదర్శించుటకీ యార్య తగియున్నది. నాటక మును గాని ప్రకరణమును గాని మహాజనపరివారముగా నొనర్ప

రాదు. అందు కార్యపురుషు లయిదుగు రుండ దగును. నలుగు రుండ వచ్చును. సంఖ్యారూపమున మహాజనము - అనేకజను లుండ రాదు. మహాజనపరివారము— మహాజనమున పరివరణము. ఆ వస్తువు ననుసరించి యనేకజనుల పరివరణము నాటకమున తగదు. ప్రకరణమున తగదు. 'వా' గ్రహణమున నితరమున గూడ తగదని తాత్పర్యము. దీని భావ మిట్లుండును. కొన్ని కథావస్తువులు బహుతరపురుషసాధ్యములుగా నుండును. సముద్రమున సేతుబంధన మిట్టిది. ఇట్టిది సర్వము ప్రత్యక్షముగ ప్రదర్శనీయము కాకూడదు. "మహాజనపరివారం"— "మహతో జనస్య పరితో వరణం" పితా పుత్ర, శ్వశ్రూ స్నుషా, గురు శిష్యాది మహాజనులకు సభ్యజనులకు పరివరణము—చిత్తసంకోచము సంపాదించు పరిచుంబనాదికము సర్వ మేదయినను ప్రత్యక్షప్రయోజ్యము కా కూడదు. ప్రత్యక్షప్రయోగార్హ మగునదియు కార్యపురుష పంచకముతో గాని పురుషచతుష్కముతో గాని ప్రయోజ్యము కావలెను. ఈ కార్యపురుషులును ప్రకరీ పతాకాది రూపులై యుందురు. తత్పరివారస్వరూపులై యుందురు. పురుషప్రకర్ష మావశ్యక మయినచో పదిమంది రంగప్రవిష్టులగుదురు. ఎనిమిదిమంది ప్రవిష్టు లగుదురు. అంతకధికముగా నున్నచో నభినయచతుష్టయ మవిభావనీయ మగును. దేవయాత్రా పరిదృశ్యమాన జనసమాజము వలె నెవ రుపలక్షితులు కారు. ఇట్లంకమున ప్రవేశకస్వరూపము వితతముగా నిరూపిత మయినది.

## నాటకరూపదర్శనము

౪౦౫. కావ్యం గోపుచ్ఛాగ్రం కర్తవ్యం కార్యబంధ మాసాద్య  
యే చోదాత్తా భావాస్తే సర్వే పృష్ఠతః కార్యాః  
౪౦౬. సర్వేషాం కావ్యానాం నానా రసభావ యుక్తి యుక్తానాం  
నిర్వహణే కర్తవ్యో నిత్యం హి రసోఽద్భుతస్తజ్ఞైః

సర్వసముదాయాత్మక మయిన నాటకరూపదర్శనము ప్రకృత ప్రసంగప్రాప్తము. కార్యబంధ మధిగమించి కావ్యమును గోపుచ్ఛాగ్ర కల్పముగా నిర్మింప వలెను. ఉదాత్తములగు భావముల నన్నిటిని కావ్యపృష్ఠమున యోజనము చేయ వలెను. నానా రసభావ యోగ

యుక్తము లయిన సర్వకావ్యముల నిర్వహణమున నియతముగా నద్భుతరసమును తద్విభావాదులు కూర్పవలెను. ఇది పిండిత మయిన మూలార్థము. కావ్యము గోపుచ్ఛాగ్ర మనుటను క్రమసూత్రాంగ మని కొందరనిరి. కొంద రిట్లనిరి. గోపుచ్ఛమున కొన్ని వెంట్రుకలు హ్రస్వములుగా నుండును. కొన్ని దీర్ఘములుగా నుండును. అట్లే ముఖసంధిలో కొన్ని కార్యములు పరిసమాప్తము లగును. మఱికొన్ని ప్రతిముఖ పర్యంతము ప్రసరించును. కొన్ని యవమర్శావసానములుగా నుండును. ఇతరములు నిర్వహణపర్యవసాయు లగును. రత్నావలిలో ప్రమోదోత్సవము ముఖసంధి యందే నిష్ఠిత మయినది. బాభ్రవ్య వృత్తాంతము ముఖోపక్షిప్తమై నిర్వహణనిష్ఠ పొందినది. ఇట్టి దిది గోపుచ్ఛాగ్రరీతి. ఉదాత్తభావములు సారరూపము లయిన పదార్థములు. అట్టివానిని పర్యంతమున ప్రతిపాదింప వలెను. ఇందిది హేతువు. నాటకాదులన్నిటి యందు నిర్వహణమున నద్భుతరసమును కూర్పవలెను. అట్లయినచో నా కావ్యములు రసభావముల యోగమున పరస్పరసంబద్ధములు యుక్తములు కాగలవు. కాకున్న పరస్పర యోగయుక్తి కుదురదు. ప్రబంధార్థమున నేకవాక్యత ప్రాణము. ఏకవాక్యత లేకున్న ప్రబంధార్థమేమి యుండును? శృంగారమున స్త్రీ రత్నము లభించును. వీరమున పృథివీలాభ మున్నది. రౌద్రమున శత్రుక్షయము కలుగును. కరుణాదులు తన్నివృత్తి సంపాదకములు. ఇట్టి యీ క్రమనియతి చూడగా నిది యవభాసించును, లోకోత్తరా సంభావ్య మనోరథ ప్రాప్తిలో నద్భుత మావశ్యక మగుచున్నది. అసాధారణలాభము ఫలముగా కల్పిత మయినప్పుడు ఫలమేదియో యవశ్య మున్న దన్న సంభావనము కలుగును. క్రియకు ఫలమవశ్య ముండు ననిపించును. కాగా నుపాయవ్యుత్పాదనాయత్తత వలని ప్రయోజన మేమిటె! యనిపించును. ఇట్లు భావింపగా నద్భుతావసానత్వ మొనరింప దగ దనిపించును. "దుష్కర మయిన నుపాయక్రమమున సిద్ధింప గలదని, యుపాయానుసారముననె ప్రవర్తింప వలెనని" వ్యుత్పాద్యజనున కభిప్రాయ ముదయించు టెట్లు? అందుననె కావ్యమందలి నానారసభావముల సంవాదసంబంధమునకై యద్భుతమును నిర్వహణమున నిరూపింప వలెను.

ఇప్పటి కీ విధముగా విధియుక్తముగా విహితముగా సంగ్రహముగా నాటకలక్షణము నిరూపిత మయినది. సంస్కృతలోకమున లక్ష్యము ప్రసిద్ధముగా నున్నది. ఇచట లక్షణము నిరూపిత మయినది. లక్షణబలము ననుసరించి లక్ష్యమును యత్నపురస్సరముగా ప్రసాధింపవలెను. లక్షణముచే శోభాయుక్తముగ జేయవలయును.

## ప్రకరణసమీక్ష

ఇటుపై ప్రకరణలక్షణ మావశ్యకము. లక్షణయుక్తి ననుసరించి ప్రకరణలక్షణము నిరూపింతుము. విషయము లక్షణద్వారమున హృదయాను ప్రవేశము సంపాదించును. లక్షణవివేకమున కది మిక్కిలి యుపకారి.

> ౪౦౭. యత్ర కవిరాత్మశక్త్యావస్తు శరీరం చ నాయకం చైవ
> ఔత్పత్తికం ప్రకురుతే ప్రకరణమితి తద్బుధైః జ్ఞేయం
> ౪౦౮. య దనార్ష మథాహార్యం కావ్యం ప్రకరోత్యభూత గుణ యుక్తం
> ఉత్పన్న బీజ వస్తు ప్రకరణ మితి తదపి విజ్ఞేయం

భేదములతో కూడుకొనిన ప్రకరణ లక్షణము నామనిర్వచన మిందున్నది. కావ్యనిర్మాత యగు కవి యాత్మశక్తి ననుసరించి కావ్యవస్తు వనదగు సాధ్యఫలమును, శరీరమని వ్యవహరింపదగు సాధ్యఫలోపాయ మయిన కావ్యాభిధేయవస్త్వాదికమును నిర్మించునేని యది ప్రకరణ మగునని బుధులు గుర్తింపదగును. కవిప్రతిభా సముత్పన్న వస్తుక మౌత్పత్తికము. ఔత్పత్తిక వస్తు వున్నందున నిది ప్రకరణ మయినది. కతిపయ యువ కవులు వస్తువు సముత్పాద్య మొనరింపరు. ప్రకరణమునిర్మాణింప దలతురు. వా రనుత్పాద్యమును కూర్చిన ప్రకరణము కాదు కద!, వారేమి చేయవలయును ? అనుత్పాద్యాంశమును వా రెచటినుండియు గ్రహింపరాదు. వారొనరింపదగు దానిని రెండవ కారిక దర్శించును. వా రనార్ష వస్తువును పరిగ్రహింప దగును. పురాణాదు లార్షములు. పురాణాది వ్యతిరిక్తములయిన బృహత్కథాదు లనార్షములు. తదుపనిబద్ధములయిన మూలదేవచరితాదులను వారు స్వీకరింప వచ్చును. వారు వారి కావ్యము నాహార్యముగ నేని నిర్మింప వచ్చును. పూర్వకవికావ్యముల నుండి

వస్తు వాహరించుకొని వారు రూపించిన నది యభూత గుణయుక్తము కాగలదు. సముద్రదత్తచేష్టితాదు లిట్టివె. వా రట్లాహరించిన వస్తు వాహార్యము. ఇతరకవులు కూర్చిన వాని నుండి తెచ్చికొనిన కథాంశము కవిత్వము కానేకాదు. అప్పుడచట ప్రకరణమను వాదోయుక్తి సంగత మగునా? అగును. అదియు ప్రకరణ మగును. అందునను యుత్పన్నబీజవస్తుకము ప్రకరణ మని నిర్వచన ముత్తరార్థములో గలదు. ఉత్పన్నము పూర్వసిద్ధప్రసిద్ధ మయిన కావ్యము. అందలి బీజ మందలి వస్తువు కలది యుత్పన్నబీజవస్తు వగును. అదియు నభూతగుణ యుక్తమె. కాన ప్రకరణము కాగలదు. బృహత్కథాదుల లోని ప్రసిద్ధము లయిన గుణము లం దుండును. కావ్యాంతర సుప్రసిద్ధము లయిన గుణము లం దుండును. "ప్రకరోతి తదితి ప్రకరణం" దాని నిదియిట్లు ప్రకర్షయుతము చేసినందున ప్రకరణ మయినది. బృహత్కథాది సిద్ధము లయిన మూలదేవాదుల కథలకు కవి శక్తి యధికావాప మొనరించునేని యది ప్రకరణ మగును. ఇదే విధముగ పూర్వకవి సముత్ప్రేక్షితము లయిన సముద్రదత్తచేష్టితాదుల వర్ణనమున గూడ కవియధికావాపము కూర్చి ప్రకరణ మొనరింపవచ్చు నని తాత్పర్యము. ప్రకరణము నం దితివృత్తము యోజనము చేయుటలో పూర్వము నిరూపించిన నాటకీయముల నతిదేశ ద్వారమున స్మరించుట యుక్తము. నాటకమున వస్తువు శరీరము వృత్తిభేదములు నిరూపితము లయినవి. సలక్షణముగా వాని నన్నిటిని ప్రకరణమున గూడ సర్వసంధులందును సమాయోజనము చేయ వలయును. పూర్వము నాటకలక్షణావసరమున బుద్ధివిలాసాదియుక్త మని నానావిభూతిసంయుక్త మని యింక నింకను నాయకఫలవత్త్వము నిరుక్త మయినది. అంకప్రవేశకాధ్యతయు సూచిత మయినది. నానారసభావచేష్టిత సాహిత్యము సంహిత మయినది. సుఖదుఃఖోత్పత్తికృతత్వ ముల్లిఖిత మయినది. సర్వ మది యిందును సంయోజ్యము. కొందరు; అంకపరిమాణము, అంకాంతరసంధానహేతువు లయిన ప్రవేశకము లందు ప్రయోజ్యము కావలసిన దివసావసానకార్యాదులు నన్నియు ప్రకరణమున గూడ ప్రయోజ్యములని యనిరి. మే మననిది వా రనినది కానరాదు.

## అతిదేశనియమము

౪౯. విప్రవణిక్సచివానాం పురోహితామాత్య సార్థవాహానాం
చరితం యస్నైకవిధం జ్ఞేయం తత్ప్రకరణం నామ
౫౦. నోదాత్తనాయకకృతం న దివ్యచరితం న రాజసంభోగం
బాహ్యజనసంప్రయుక్తం తత్ జ్ఞేయం ప్రకరణంతజ్ఞైః

అతిదేశప్రాప్త మని యతిప్రసంగము కూర్ప జనదు. ఈ యార్యాద్వయ మట్టి యతి ప్రసంగము వారించును. సచివుడు మంత్రి. అమాత్యు డధికృతుడు. సార్థవాహుడు పణ్యముల సమాహర్త. తద్దేశమున క్రయవిక్రయము లొనరించు వణిక్కుల కన్న సార్థవాహు డన్యుడు. ప్రకరణమునందు విప్రవణిక్సచివులయు పురోహితామాత్య సార్థవాహులయు నానారస సంయుక్త మయిన చరితమును నిబంధింప వలెను. నైకరసాంతర విహితత యతిదేశసిద్ధ మనియె సూచితము కాగలదు. ప్రకరణము ప్రఖ్యాతోదాత్తనాయకము కాదు. రెండవ యార్యలో నిది స్పష్టము. ప్రకరణ ముదాత్తనాయక కృతము కారాదు. ఉదాత్త నాయకతా నిషేధమున నాటకవైపరీత్య మర్థ సమాయాత మగునని, నాటకమున దేవవ్యక్తి నాయకుడుగా నుండుట నిషిద్ధమయినది కాన ప్రకరణమున దేవుడు నాయకుడుగా నుండవచ్చు నని యాపాదింతురేమో; యది తగదనియే "న దివ్య చరితం" సూచించును. ప్రకరణము నందు దివ్యచరితము నిబంధింప రాదు. నాటకము దివ్యాశ్రయోపేతమని యంటిమి. దేవవ్యక్తులు ప్రయోజ్యులుగా నం దుండవచ్చును. ఆదేశరహితముగా నాయకు నాశ్రయించి దివ్యుల చరిత మిందు నుండ వచ్చునని ప్రసక్తము కావచ్చును గాని యదియు ప్రకరణమున నిషిద్ధ మగుచున్నది. నాటకములోని దేవులు ప్రధానాశ్రయమున నుందురు. తుల్యయుక్తి ననుసరించి పరిశీలింప దేవుల వలె నప్రధానముగ నయిన రాజప్రవేశ మీ ప్రకరణమున నుండదగునేమో యని యాశంక యుదయింప వచ్చును. కాని యిది నిరాకరింప దగినదె. రాజసంభోగము ప్రకరణ మున నుండదగదు. వారి భోగస్పర్శల కిం దవకాశము లేదు. విప్ర వణిక్సచివాదుల భోగసంభోగముల నిందభ్యూహించి నిబంధింప వలెను. అందునను రాజసంభోగనిషేధమె నిరూపిత మయినది.

ప్రకరణము బాహ్యజనసంప్రయుక్త మగునే కాని కంచుకి మొదలయిన యంతఃపురజను లిందు నియుక్తులు కారాదు. కంచుకిప్రభృతు లంతఃపురోచితులు, తద్వ్యతిరిక్త బాహ్యజనులె చేటదాసాదులు ప్రవేశకాదులం దిం దుందురు. ఎవ రెవ రెట్లెట్టి వా రిందుండ దగు దురో యీ యార్య నిర్దేశించును.

## ప్ర క ర ణ ప రి వా ర ము

౪౧౧. దాస విట శ్రేష్ఠి యుతం వేశస్త్ర్యుపచార కారణోపేతం
మందకుల స్త్రీ చరితం కావ్యం కార్యం ప్రకరణే తు

కంచుకిస్థానమున దాసుడు, విదూషకస్థానమున విటుడు, అమాత్యస్థానమున శ్రేష్ఠి ప్రకరణమున నుండదగు వారు. వేశ్యా వాటమునకు వేశమని పేరు. అందలి యాడివారు వేశవనితలు. వారి యుపచారవిశేషములను వైశికాధికారమున నిరూపింతుము. వేశోప చారము కారణముగా శృంగార ముండును. ప్రకరణము తాదృశ శృంగార సముపేతము కావలెనని తాత్పర్యము. ఇది యిట్టిదయ్యు మందకులస్త్రీ చరిత సముపేతము కావలెను. కులస్త్రీ విషయ మయిన చేష్టితము మందముగనె యుండ వలెను. ఉపాధ్యాయు లిట్లనిరి. మందకులము లందలి స్త్రీల చరితమునె ప్రకరణమున నిరూపింప వలెను. కావున ప్రకరణమున కులాంగనయు మందకులయె యగునని దర్శిత మయినది. పుష్పదూషితక మను ప్రకరణమున నీ భావమె సంభావిత మయినది. అందు సముద్రదత్తుడు అశోకదత్తాది శబ్దాకర్ణన మున శంక కలవాడయినాడు. అట్లాతని కా శంకానిబంధనము దుష్టము కాదు. అది నిర్వహణాంత ముపయోగించు చున్నది. నంద యంతీ నిర్వాసన హేతు వయినది. నందయంతికి గృహాంతరావస్థయు నీ నిమిత్తక మని స్పష్టము. ఇదియె ముఖసంధిలో మూల మయినది. పరపురుషాశంకా సంభావనమున కిదియె హేతువు. దీని నిట్లె యంగీక రింప వలెను. అట్లంగీకరింపక పోయినచో పుత్రుడు సన్నిధానమున లే నప్పుడు కోడలి ప్రవృత్తిననుమానించి యామెను నిర్వాసితను జేయుట (యింటినుండి వెడల గొట్టుట) యు నామె శబరసేనాపతి యింట నుండవలసి వచ్చుటయు నుత్తమప్రకృతుల కంతయు ననుపపన్నమె

కావలసి వచ్చును. రాజోచితోత్తమ ప్రకృతులు కొందరున్నారు. వారి యీ యుత్తమత్వము స్వపరాపేక్షాధీన మయినది కావచ్చును. అట్టి యుత్తమత్వమును వణిజ్మాత్రాదులందు సమారోపించి యం దితరులదూషణ మొనర్చుటచే బ్రహ్మయశము ఖండితము కాదు. స్వామియశమును ఖండితము కాదు. స్వయశమె ఖండితమగును. మిథ్యాయశస్కులు కొంద రితరుల యశమును మిథ్యాకలంకితము చేయుట కుద్యమింతురు. వారు వారి యశమునె కలంకితము చేసికొని నట్లగును. నాయకపద మాత్రమున యశము కలుగదు. దుర్యోధను నకు గలిగిన యశమేమి? కాన శంకాదు లేల? యనిపించును. ప్రక రణము నం దట్టి నాయకు డితరవణిక్కుల కన్న నుత్తము డుండ దగును. అట్టి యాతడె వృత్తాద్యు డగుట సముచితము. ఈ యవాంతరవిషయమిక చాలును.

ఇంతవఱకీ నిరూపణమున ప్రకరణము సప్తవిధ మనినట్లయి నది. ఆ విధము లి ట్లభ్యూహ్యములు.

౧. కవిప్రతిభానుసారమున వస్తుశరీరనాయకుల కూర్చి కల్పనా కథ నిబంధించుట
౨. అనార్షాహార్యముగా నభూతగుణయుక్తముగా నుత్పన్న బీజవస్తుకముగా కూర్చుట
3. నాటకమునందలి వస్తుశరీరవృత్తిభేదముల నతిదేశమున సర్వసంధులందు కూర్చుట
౪. విప్రవణిక్సచివపురోహితామాత్యసార్థవాహుల నానారస చరితనిబంధనము
౫. ఉదాత్తనాయక దివ్యచరిత రాజసంభోగములు లేకుండుట
౬. బాహ్యజన దాస విట శ్రేష్ఠియుత మగుట
౭. వేశోపచారము మందకులస్త్రీచరిత ముండుట.

ఇట్లు ప్రకరణము సప్తవిధము. ఇట్లేని సప్తవిధ మనవచ్చును.

౧. ఉదాత్తనాయకకృతము కాకుండుట
౨. దివ్యచరితము లేకుండుట

౩. రాజసంభోగ రాహిత్యము
౪. బాహ్యజన సంప్రయోగ ముండుట
౫. దాసవిటశ్రేష్ఠియుత మగుట
౬. వేశవనితోపచార ముండుట
౭. మందకులస్త్రీచరిత ముండుట

ఈ సప్తవిధప్రకరణమున ప్రత్యేకము భేదత్రయ మున్నది. కాగా ప్రకరణమున నేకవింశతిభేదములు కలుగును. వాని యభ్యూహా నిదాన మయిన భేదత్రయ మీ యార్యాత్రయములో దర్శిత మగును.

౪౧౨. సచివ శ్రేష్ఠి బ్రాహ్మణ పురోహితామాత్య సార్థవాహానాం
గృహవార్తా యత్ర భవేత్ స తత్ర వేశ్యాంగనా కార్యా
౪౧౩ యది వేశ్యాయువతి యుక్తం స కులస్త్రీసంగమోఽపి స్యాత్
అథ కులజన ప్రయుక్తం స వేశయువతి ర్భవే త్తత్ర
౪౧౪. యది వా కారణయుక్త్యా వేశకులస్త్రీకృతోపచారః స్యాత్
అవికృతభాషాచారం తత్ర తు పాఠ్యం ప్రయోక్తవ్యం

సచివాదులకు సంబంధించిన గార్హస్థ్యసంబంధి వార్త యుండునేని యచట వేశ్యాంగన నాయికగా నుండరాదు. ప్రకరణము వేశయువతి యుక్తమె యగునేని కులస్త్రీసంగమ మచట నుండరాదు. కులజనప్రయుక్త మగునేని వేశయువతి యుండరాదు. గార్హస్థ్యోచిత వార్త యంతయు పురుషార్థసాధక మయిన యితివృత్తముగా నుండును. అందు వేశ్య నాయికగా నిబద్ధ యగునేని యిక పురుషార్థ కథ యేమి? అంతయు నది కామకథ యగును. విటాదులు నాయకులుగా నుందురేని గృహస్థతాచింతనమున నామెయు నాయికగా నిబంధనీయ కావచ్చును. గృహస్థతాచింతావర్ణనము లేకపోయి నచో విప్రాదులకు వలె శ్రేష్ఠిసార్థవాహాదులకును వేశ్యాయోగ మవిరుద్ధమె యగును. కావున నామెయు ప్రదర్శనీయ యని యర్థ సామర్థ్యమున లభించును. అప్పుడచట కులస్త్రీసంగమము కూర్ప రాదు. ఇదియ రెండవ యార్యాసంకేతము. వారవనితయున్న కులస్త్రీ లేదు. కులవనితయున్న వారస్త్రీ యుండరాదు. ఇట్టి యా

భేదద్వయము శ్రేష్ఠిసచివాదివిషయము. విటాదివిషయవ్యవహారము వేశ్యాకులజాసంకీర్ణముగనె యుండుననుట స్పష్టము. కారణయుక్తి ననుసరించి వేశవనితోపచారము కులవనితోపచారము నుండవలసి వచ్చినచో నవికృతభాషాచారముగనె యచట పాత్యమును ప్రయోగింపవలసి యుండును. ప్రకరణమున విటు డున్నప్పుడు వేశస్త్రీ ప్రధానగా నుండదగి యుండుట చెప్పితిమి. అచటగూడ కులవనిత పితృపితామహాదుల యనురోధమున నుండదగును. ఇదియె కులవనిత యుంకుటలోని కారణయుక్తి. అవికృతభాషాచారమున కిది భావము. కులవనిత కవికృత భాషయె యుండవలెను. శౌరసేని కులవనితా భాష. వేశ్యకు సంస్కృతభాష యుండవలెను. ఆచార మనునది కులవనితయందు వినయప్రధానముగ నుండును. వేశ్యలో విపరీతముగ నుండును.

దేవీచంద్రగుప్త రూపకమున నిట్లున్నది. అందు మాధవసేన నుద్దేశించి చంద్రగుప్తు డిట్లనును.

"ఆనందాశ్రు సితేతరోత్పలరుచో రాబధ్నతా నేత్రయోః
ప్రత్యంగేషు వరాననే! పులకిషు స్వేదం సమాతన్వతా
కుర్వాణేన నితంబయో రుపచయం సంపూర్ణయో రప్యసౌ
కేనాప్యస్పృశతాప్యధో నివసన గ్రంథి స్త్వవోచ్ఛ్వాసితః"

"సీలోత్పల కాంతి కల నీ నయనముల నానందాశ్రు వుదయించినది. నీ సపులకాంగముల స్వేదము కలిగినది. నీ సంపూర్ణనితంబములకు నుపచయము వచ్చినది. ఇదియేమే? వరాననా! ఏ స్పర్శ లేకున్నను నీ కోకముడి యుచ్ఛ్వసితమయినదే!" ఇందు నాయికా ప్రవృత్తి వినయముఖ్యముగ నుండమి విశదమె. ఇందు వృత్తాపద్య మేవంవిధమె యయినందున అట్టి నాయికయె యున్నది. పూర్వాంకము లందు నీ రీతియె స్పష్ట మయినది.

౧. వేశవనిత నాయిక యయినచో కులస్త్రీభోగ ముండదు.
౨. కులీనాభోగ మున్నచో వేశవనితోపచార ముండదు.
3. విటాదివిషయమున వేశకులవనితోపచార ముండవచ్చును.

పూర్వోక్తము లయిన సప్తప్రకారముల కీ త్రయసంబంధమున నిరువదియొక్క భేదములు కలుగుట ప్రసిద్ధమె. ప్రకరణమున సామాన్యముగా నాయకోద్దేశమున మధ్యములె యుపయోగులుగా నుందురు. మధ్యమసంభవము బహుళ మగుట వలన బాహుళ్యమున విష్కంభక సంభావన యుండును. అందుచే ప్రకరణ విష్కంభకమును లక్షణ యుక్త మొనరింప వలెను.

## ప్రకరణ విష్కంభము

విష్కంభార్థ మిట్లున్నది. "విష్కంభయతి– ఉపస్తంభయతీతి విష్కంభకః" విష్కంభింప జేయునది కావున విష్కంభ మయినది. విష్కంభము వస్తువును సాధారము చేయును. ప్రతిష్ఠితము చేయును. ఇట్లొనర్చుటనే యుపస్తంభ మనవచ్చును.

౪౧౫. మధ్యమపురుషై ర్నిత్యం యోజ్యో విష్కంభకోఽత్ర తత్త్వజ్ఞైః
సంస్కృత వచనానుగతః సంక్షేపార్థః ప్రవేశకవత్

౪౧౬. శుద్ధః సంకీర్ణో వా ద్వివిధో విష్కంభకోఽపి కర్తవ్యః
మధ్యమపాత్రః శుద్ధః సంకీర్ణో నీచ మధ్య కృతః

౪౧౭. అంకాంతరాల విహితః ప్రవేశకోఽర్థ క్రియాం సమభివీక్ష్య
సంక్షేపాత్సంధీనా మర్థానాం చైవ కర్తవ్యః

తత్త్వజ్ఞు లగువారు విష్కంభకమును మధ్యమపాత్రలచే ప్రయోగింప వలెను. సంస్కృతభాషావచనమున నిది యనుగతము కావలెను. ప్రవేశకము వలె నిదియు సంక్షేపార్థకము. విష్కంభకము శుద్ధమని సంకీర్ణమని రెండు విధములు. కేవల మధ్యమపాత్ర ప్రయుక్త మయినచో శుద్ధవిష్కంభకము. నీచ మధ్య పాత్ర ప్రయుక్తమయినచో సంకీర్ణవిష్కంభకము. అర్థక్రియాకర్తవ్యతనె కర్తవ్యముగా నభిసంధాన మొనర్చుకొని ప్రవేశకవిధముననె సంకీర్ణవిష్కంభకమును సమాయోజన మొనరింపవలెను. మూడవకారికలో నర్థక్రియా స్వరూప మున్నది. సంధుల సంక్షేపము ననుసరించియు నర్థముల సంక్షేపము ననుసరించియు విష్కంభకము నంకమున గాని యంకముల యంతరాలమున గాని కూర్పజనును. ప్రవేశకస్వరూపకథనము లోని యర్థక్రియను చక్కగా సమీక్షించి విష్కంభకమును కూర్పవలెను.




విష్కంభకము నందు సంధుల సంక్షేపానుసంధాన మావశ్యకము. యుద్ధము రాజ్యభ్రంశము మొదలగునవి యన్నియు కావ్యార్థములు. వాని క్రియావస్థానుసంధానము నర్థక్రియాపేక్ష యనవచ్చును. ఇట్టి సమభివీక్షతోడనె విష్కంభకసంయోజన మపేక్షితము.

ఈ విష్కంభకనిర్మితిలో కోహలుని భావ మిట్లున్నది. ముఖాంకమున నిదివిహితము కావచ్చును. అంతరాంతరమునను విహితము కావచ్చును. ఇది యాతని భావము. "మధ్యమపురుషనియోజ్యము నాటకమున ముఖసంధిమాత్రసంచారము విష్కంభకమని, ప్రవేశకము వలె నాటకయోగమున విధానయోగ్య" మని యనెను కద! అంకాంతరాలవిహితమని యిందున్న దేమి? కాగా సంకాంతరానుసారి యగునె! అయిన నేమి? మా భావమున దోషము లేదు. కోహలవచన ముపలక్షణార్థము. ముఖాంకమున నుండవచ్చును. అంతరాంతరముల నుండ వచ్చును. ఇది భావింపుడు! బీజము బిందువును ప్రథమమున నుపక్షిప్తము లగును. అందు పృథగ్జనులకు ప్రవేశము లభింపదు. అది సచివాదులకు గోచరము. ఉదాత్తప్రకృతులు బీజబిందునిర్వాహకులు. ఇట్టి విశిష్టుల యుపక్షేపమున విష్కంభకము నకే యవసర మున్నది. ఒకప్పు డంకాంతరము లందును మంత్రగుప్తత బీజబిందువులందు వలె సమముగనె యుండునేని యట్టి ఘట్టములలో గూడ విష్కంభకప్రవేశ మనివారితమె యగును. మంత్రచింతనములో పృథగ్జనులకు ననుప్రవేశము కార్యవశమున సంభవించినను ప్రథమోపక్షేపములో ప్రవేశక ముండరాదు. ఇట్టి నిర్ణయమె యుక్తము. మధ్యమపాత్రలు ప్రథమోపక్షేప మొనరింప దగుదురు. అప్పుడు శుద్ధవిష్కంభ మగును. పృథగ్జనులకు ప్రసక్తి యున్నచో సంకీర్ణవిష్కంభకమె సముచితము. పృథగ్జనుడు మంత్రచింతనములో ననుప్రవేశము పొందవలసి యున్నదని ప్రథమోపక్షేపమునందు ప్రవేశక మేర్పఱచుట యుక్తము కాదు. విష్కంభక మంకాంతరానుసారి యని యనుట సామాన్యోక్తి. అంకమధ్యమని యనుటచే ప్రస్తావనాంకమధ్యవర్తితయు విష్కంభకమునకు సూచితనిరుక్త మగుచున్నది. ప్రవేశకవిష్కంభక విషయమున లింగవచనము లతంత్ర

ములు కావున స్త్రీల కనుప్రవేశ ముండవచ్చును. సంఖ్యాధిక్యము నుండవచ్చును.

నాటిక

ప్రధాను లయిన రాజప్రాయజనులకు నాటకము సకలపురుషార్థ విషయ మయిన వ్యుత్పత్తిని సంపాదింపగలదు. మధ్యమప్రాయ జనులకు ప్రకరణము పురుషార్థవ్యుత్పాదక మగును. మధ్యమప్రాయ జను లపూర్వకుతూహలము కలవారు కావున నిరువదియొకటి భేదములు ప్రకరణమున నుపపాదించుటచే చిత్రవ్యుత్పత్తి సూచిత మయినది. రూపకముల సామాన్యలక్షణ ప్రస్తావములో పరస్పరము లక్షణ సాంకర్యమున బహుభేదములు సంభవించుట సూచిత మయినది. వానిలో నాటకప్రకరణములు రెండు ప్రధానములు. సర్వరూపక ప్రసరణ కారకములు. ఈ రెండిటి లక్షణసాంకర్యము సూచించినచో సర్వరూపకదర్శనము కలుగును. కాన వీని సంకీర్ణత దర్శనీయ మయినది.

౪౧౮. అనయోశ్చ బంధయోగా దన్యో భేదః ప్రయోక్తృభిః జ్ఞేయః
ప్రఖ్యాతస్త్వితరో వా నాటకయోగే ప్రకరణే వా

నాటకప్రకరణములు లను వీని బంధయోగమున, ఉభయ సంబంధ సంయోగమున వేరొక భేద ముదయించునని ప్రయోక్తలు గుర్తింప వలెను. నాటకయోగము బహుల మయినచో ప్రఖ్యాత మనవచ్చును. ప్రకరణసంబంధ మధిక మయినచో నితర మన వచ్చును. నాటకకావ్యబంధమున నీ సంకీర్ణభేద ముదయించును.

ఉద్దేశక్రమానుసారమున వాని వాని లక్షణముల విస్తరించుట మరల నాయా లక్షణముల పరామర్శించుట యంతయు నిది గౌరవము. అట్లుకాక సంకీర్ణస్వభావక మయిన నాటిక నిచట లక్షణయుక్తముగ నిరూపించుట యుక్తభావము. ఈ యార్యాత్రయ మిందు పర్యాప్తము.

౪౧౯. ప్రకరణ నాటక భేదా దుత్పాద్యం వస్తు నాయకం నృపతిం
అంతఃపుర సంగీతక కన్యా మధికృత్య కర్తవ్యా
౪౨౦. స్త్రీప్రాయా చతురంకా లలితాభినయాత్మికా సువిహితాంగీ
బహునృత్త గీత పాఠ్యా రతిసంభోగాత్మికా చైవ

౪౨౧. రాజోపచారయుక్తా ప్రసాదన క్రోధ దంభ సంయుక్తా
నాయక దేవీ దూతీ సపరిజనా నాటికా జ్ఞేయా

ప్రకరణనాటకములచే నయిన భేదమున నాటిక కలుగునని దూరాన్వయమున గుర్తించునది. నాటికలో నంతయు నాటకలక్షణ ముండదు. అంతయు ప్రకరణలక్షణ ముండదు. ఉభయలక్షణ సంబంధ సాంకర్య ముండును. ఇట్లు లక్షణాన్యత్వమున నాటిక యని వేరుగా పరిగణింపవలసి యున్నది. నాటికలో వస్తు వనదగిన చరిత ముత్పాద్యముగా నుండును. నృపతి యగు నాయకు నిది యవలంబించి యుండును. అంతఃపుర సంగీతక కన్య నుద్దేశించి నాటికను నిర్మింప వలెను. అంతఃపురకన్యను గాని సంగీతశాలాకన్యను గాని పొందదగి నట్లుగా నిశ్చయించి నాటిక నిర్మింప వలెను. నాటిక స్త్రీప్రాయము. స్త్రీలు బహులముగా నుందురు. ఇందు నాల్గంకము లుండును. ఏదేని యొక యవస్థావిశేషమునకు సరసముగా నవస్థాసమావాప మొనరించుట సమంజసముగా నుండు నని భావము. నాటిక లలితాభినయాత్మక మగుటచే కైశికీబంధము రమ్యముగా నుండవలెను. నాల్గువిధము లయిన కైశిక్యంగములు నాటికలో పూర్ణముగా సువిహితములు కావలెను. నానావిధములయిన నృత్తములు గీతములు పాఠ్యములు నాటికలో శోభాసంధాయకము లగును. రతిపురస్సర మయిన సంభోగ మిందు ముఖ్యము. రాజ్యప్రాప్త్యాదిరూప మయిన యాత్మ యిందు ప్రధానఫలముగా నుండును. అందునె రాజగతోపచారము లతో వ్యవహారములతో నిది యుండదగును. అన్యనాయిక నుద్దేశిం చిన వ్యవహార మిందుండును గావున తత్పూర్వనాయికాగతము లయిన క్రోధ ప్రసాద వంచనము లిం దవశ్య ముండును. అన్యకన్యను రాజు వలచినాడని పూర్వనాయిక కోపించుట; యామె కోపించిన దని రాజు బ్రతిమలాడికొని ప్రసన్నను జేయుట, పిమ్మట నామెను వంచ నము చేయుట సర్వ మిందవశ్యంభావి. ఈ పైరీత్యనుసారమున క్రోధ ప్రసాద వంచనముల క్రమ ముచితము. కాని మూలములో ప్రసాదన క్రోధ దంభము లని క్రోధమునకు పశ్చాత్పార ముండుట యార్యాను రోధమున యని గుర్తించునది. ఏ నాయికకు క్రోధము కలుగునో యా నాయిక నింతదనుక చెప్పలేదు. చివరి పాద మీ యంశమునె

నివేదించును. నాయకుని దేవ్యాది నాయిక లిందుందురు. అభిలషిత నాయికాంతరవిషయమున దూతిక లుందురు. పరిజను లుందురు. నాటిక సపరిజన మనుట పరిజనసమృద్ధి సూచిత మగును. ఈ యంశము లున్నచో నాటిక యగునని ప్రయోక్తలు గుర్తింతురు.

ఇందు నిరూపించని సంధిసంధ్యంగములు మొదలగునవి యన్నియు పూర్వనిరూపిత విధమున గుర్తించునది. దేవి కన్యయు ఖ్యాత యని యఖ్యాత యని రెండువిధముల నుందురు. కన్య యంతఃపురకన్య యని, సంగీతకన్య యని ద్వివిధ. నాయకుడు నృపతి యనునంతమాత్రము నాటకోపజీవితము. ప్రఖ్యాతత్వ మపేక్షితము కాదు. ప్రఖ్యాతుడు కావచ్చును. కాకపోవచ్చును. ఇట్టి భేదద్వయమున గూడ భేదము సంభవించును. ప్రకరణాంశసంబంధమున నుత్పాద్యవస్తు వుండునని నాటకలక్షణాంశసంయోగమున నాయకుడు నృపతిగా నుండునని కొందరు కొందరాయోజనము చేసినారు. ఈ నాటికాపద మభినేయరూపకమాత్ర పరము. సౌకుమార్యప్రదర్శనము నకై స్త్రీత్వనిర్దేశ మున్నది. కాన ప్రకరణికయు నుండవచ్చును. సార్థవాహాదులు నాయకు లగుదురు. ప్రకరణిక కైశికీప్రధానముగా నుండును. అనియు కొందరనిరి. ఇట్లిచట నాటికను లక్షిత మొనర్చి నను ప్రకరణనాటకలక్షణములె యిట్లు నిర్దిష్టము లయిన వని గ్రహింప దగును. సంక్షిప్తముగా నీ లక్షణ మేవంవిధమున నిరూపిత మయినది. లక్షణయోగమున నిక సమవకారమును నిరూపింప వలసి యున్నది.

## సమవకారము

ఇప్పుడు సమవకారమును నిరూపించుటేమి? ఉద్దేశక్రమ మిట్లులేదు కదా! నాటకప్రకరణముల యనంతరము వీథి యున్నది. అనంతరము సమవకార మున్నది. ఈ మధ్యలో నాటిక నిరూపిత మయినది. ఉద్దేశక్రమత్యాగమున నేమిఫలము? ఉద్దేశ మిచట పరిగణనీయము కాదేమి? ఉద్దేశక్రమము నాటికానిరూపణమున విచ్ఛిన్న మయినది కదా! నాటకప్రకరణములు ప్రధానములని సంభావించితిరి. వానిలో వ్యుత్పాద్య మధిక మని యంటిరి. వాని

ప్రాథమ్య ముచిత మగుగాపుత. ఉద్దేశక్రమభంగమున వీథి నిరూపింపక సమవకారము నిరూపించు టేల? అనియా శంక.

ఇందిది సమాధి. ఉద్దేశక్రమ మిచట పరిగణనీయము కాదు. కావుననె నాటికచే విచ్ఛిన్న మయినది. నాటకప్రకరణములందు వ్యుత్పాద్యభూయస్త్వ మున్నది. సమవకారమునందు నది యున్నది. సమవకారమును వానివలె త్రివర్గోపాయము ప్రదర్శించును. తత్తద్దేవతాభక్తులు తచ్చరితపురస్సరులై యుందురు. ఆ యా యుపాయము లాదరింతురు. ఇది యిందలి రీతినీతి. ఈ యభిప్రాయముననె దివ్యుఁ డిందు నాయకుడుగా నుండుట నిషిద్ధ మగుచున్నది. దివ్యనాయకుల భూయస్తరచరితమును కాని, కాని దానిని గాని వితతముగా ననుకరణమున ప్రదర్శించుట యున్నది. ఆ వితతవృత్తమధ్యమున సమాపతితము లయిన నిర్వేదాదు లున్నచో ప్రయోగము రంజకముగా నుండును. లేకున్న ప్రయోగ మరంజక మగును. నాటకగతమయిన యంకైకదేశము వలె నిదియు రంజకము కాదు. నాటకాదులలో భూయస్తర మయిన చరిత మనేకాంగములు కల రంజకవర్గము లేకున్న రంజకము కానందున నాటకమున దివ్యనాయకనిషేధము నిరూపితము కాలేదు. అచట పతాకాప్రకరీనాయకులుగా దివ్యులుండుట యంగీకృత మయినది. అందు రాజప్రభృతులు బహుతరఫలానుబంధము కల మహాఫలము సంప్రయాససాధ్య మని వ్యుత్పాదితులు కాగలరు. ఈ సమవకారమున త్రివర్గోపాయమాత్రముననె వ్యుత్పాదితు లగుదు రనుట యిందలి విశేషము. అన్యరూపకము లేకాంకము లయినందున త్రివర్గోపాయములు కలవి కాజాలవు. రూపకములలో డిమమున నాలుగంకము లున్నవి. అయిన నది పశ్చాన్నిర్దిష్ట మయినది. ఇందలి యుపపత్తిని తల్లక్షణమున నిరూపింతుము. కాగా త్రివర్గోపాయ వ్యుత్పాదక మయినందున ననేకాంకము లున్నందున నిట్టి నాటకప్రకరణముల యనంతర మిట్టి సమవకారమును లక్షణలక్షిత మొనరించుట యుక్తమె యగును. "అలం బహునా"

౪౨౨. దేవాసుర బీజ కృతః ప్రఖ్యా తోదాత్తనాయకశ్చైవ
త్ర్యంకస్తథా త్రికపటః త్రివిద్రవః స్యా త్త్రిశృంగారః
ద్వాదశ నాయక బహులో హ్యష్టాదశ నాడికా ప్రమాణశ్చ

సమవకారములో దేవాసురుల ఫలసంపాదనోపాయాత్మక మయిన బీజరచన ముండును. నాయకులు ప్రఖ్యాతు లుదాత్తులుగా నుందురు. దేవాసురులును కొందర ప్రఖ్యాతులు బృహత్కథాదు లందున్నారు. కొందర ప్రఖ్యాతులను స్వయ మభ్యూహించి నిరూపింతురు. తన్నిరాసమునకై ప్రఖ్యాతపద మున్నది. సామాన్యముగా దేవు లుద్ధతులుగా నుందురు. అయినను తమ తమ విధానమున గాంభీర్యప్రధానులుగా నుండవలయు ననుటకై యుదాత్తులుగా నుండుట సూచిత మయినది. భగవత్త్రిపురరిపు ప్రభృతు లిట్లు గాంభీర్యప్రధానులు. బ్రహ్మాదులు ప్రశాంతులు. నరసింహాదు లుద్ధతులు. మూడంకములం దిది పర్యాప్తము కాగలదు. మూడు కపటములు మూడు విద్రవములు మూడు శృంగారములు దీనిలో నుండును. కపట విద్రవ శృంగారము లర్థత్రయము. ప్రత్యేక మివి మూడు మూడు విధము లగును. ప్రత్యంకము నందును విద్రవాదులు మూడు నుండవలెను. "తథా హి;" ఉపాయాంశమున కపటము వ్యాప్తిసంభావనాంశమున విద్రవము, ఫలాంశమున శృంగారము ప్రథమాంకమున నున్నట్లు ద్వితీయ తృతీయాంకములందు నుండవలెను. సమవకారము పండ్రెండు నాయకులతో బహులముగా నుండవలెను. ప్రత్యంకమునను పండ్రెండుగురు నాయకు లుందురని కొందరి భావము. ప్రత్యంకమునను నాయకప్రతినాయకులు తత్సహాయులు నలుగురె యుందురు. సముదాయ దృష్టితో ద్వాదశనాయకు లనుట సంగత మని కొందరి యాశయము. ఈ సమవకారప్రయోగ మష్టాదశ నాడికా ప్రమాణముగా నుండును.

ఇక నిందలి యంకవిధిని నాడికా పరిమాణవిధిని నిరూపింపవలసి యున్నది.

౧. ప్రథమాంకము ద్వాదశనాడీ విహితము. సప్రహసనము సవిద్రవము సకపటము సవీథీకమ్మై కార్యక్రియా సముపేతము కావలెను. సప్రహసన వచనము ప్రథమాంకమున కామశృంగారము ప్రయోగింపవలె ననుటను బోధించును. కామశృంగారమునందె హాస్యము సంగత మగును. కార్యక్రియా సముపేత మనుటయు కామ

శృంగారాత్మకతనె సూచించును. పండ్రెండు గడియలలో సంపాదింపదగిన కపట విద్రవ ప్రహసనాత్మకము లయిన యుపాయములచే కామశృంగారమునె ప్రథమాంకమున నిబంధింపవలెనని తాత్పర్యము.

౨. రెండవయంకము నాల్గునాడికల సమాశ్రయమున నుండ దగును. ఇందలి కపటాద్యుపాయములు ఘటికాచతుష్టయగాములై యుండవలెను.

3. మూడవ యంకము నాడికాద్వయ పరిమితము. వస్తుసమాపన మిందుండును. ఈ యంకమున వస్తువు సర్వము సమాప్తము కావలెను. ఏ యంకమున నయినను వస్తువు రెండునాడికల యంతరమున సంపాద్యములగు నుపాయములచే పరిసమాపిత మగును. అయినను మూడవయంకమున వస్తుసమాప్తిగ్రహణ మిా భావమును సూచించును. బీజాంశమునం దంకత్రయార్థము నుపక్షేపింపవలెను. తదనంతర మంకద్వయమున నన్యోన్యవిశిష్టముగా నవాంతరవాక్యార్థ సమాప్తి విధింప వలెను. మూడవ యంకమున నవాంతరవాక్యార్థము సుశ్లిష్ట మగును. ఈ తృతీయ మా రెండిటితో నిట్లు ప్రతిసంబద్ధ మగును. ఏది యేని కాని మహావాక్యార్థనిర్వాహమున హేతువై సంబంధము కలిగియె యుండును. ఇట్లనుసంధాన సహిత మయిన వాక్యార్థసమాప్తి త్రివర్గసిద్ధి కనుకూల మగు నుపాయ వ్యుత్పత్త్యను గృహీతమై శోభించును. నిరనుసంధాన మయినను విశిష్టపరిసమాప్తి ప్రతిపాదనమున త్రివర్గసిద్ధ్యుపాయమున వ్యుత్పత్త్యనుగృహీత మగుట నిజహృదయసంవాద బలముననె యని హృదయమున ధార్యము.

కాలమునకు సంబంధించిన ముహూర్తార్థము నాడిక యగును. ఇట్టి నాడికాప్రమాణమును యథోక్తవిధానమున నంకములం దాయోజనము చేయవలయును. కాలవిభాగమున క్రియాభిసంపన్న మయిన నాడికాసంజ్ఞ ననుసరించి శాస్త్రోక్తవిధానమున యథాక్రమముగా పరిసమాప్తి నిరూపింపవలెను.

సమవకారమునం దర్థము సంకీర్ణ మవకీర్ణముగ నుండును. ఈ యంశ మిట్లుపపాదించుట యుక్తము.

౯౨౩. అంకోంక స్త్వన్యార్థః కర్తవ్యః కావ్యబంధ మాసాద్య
అర్థం హి సమవకారే హ్యప్రతిసంబంధ మిచ్ఛంతి

కావ్యబంధము ననుసరించి సమవకారమున నంక మంక మన్యార్థముతో నుండునట్లు నిబంధింప వలెను. సమవకారరూపకము నందలి యర్థ మప్రతిసంబంధముతో నుండుట నభిమానింతురు. అంక త్రయమునకు మొత్తము విశిష్టముగా సంబంధ ముండును గాని యంక మంకము పరస్పర మట్లుండదు. అంక మన్యార్థముగా నున్నను కావ్య బంధసమాశ్రయణ మానావశ్యకము. సర్వవస్తువు కావ్యబంధోప శ్లిష్టమై యుండును గదా! కాక పోయినచో సమవకారమున నేకకార్య ముండుననుట యెట్లిఘటితి?. సమవకార మను శబ్దమున వాచ్య మయిన యర్థము అప్రతిసంబద్ధముగనె యుండును. అత్యంత మది సంబద్ధము కాదు. వస్తువు కించిత్సంబద్ధమై యుండును. సమవకార శబ్దము నందలి "సం" శబ్దబలము "అవ" శబ్దబల మీ భావమునె బోధించును. అప్రతిసంబంధ మనుచోట "ప్రతి" శబ్ద మతిశయము చెప్పును గాని యది నిషిద్ధము.

విద్రవము

ఇందు విద్రవత్రయ ముండుట సూచిత మయినది. ఆ త్రయ మిక వక్తవ్యము. "యస్మో విద్రవంతి జనాః స విద్రవః" విద్రవమున జనులు బెదరి పోదురు. అనర్థాత్మక మయిన వస్తువు విద్రవము. ఇది మూడు విధములు.

౧. అచేతన కృత విద్రవము
౨. అన్య కృత విద్రవము
౩. ఉభయ కృత విద్రవము.

జలవాయ్వాదికృత మయిన విద్రవ మచేతనకృతము. గజేంద్ర సంభ్రమకృతము చేతన (అన్య) కృతము. యుద్ధసంభవము నగరోప రోధజము నుభయకృతము. నగరోపరోధమున యుద్ధాగ్నిదానాదు లవశ్యసంపాద్యము లగును.

## క ప ట ము

కపటము వంచన. తదాశ్రయణము తదంగీకరణ మిం చుండును. వంచనము మూడు విధములు.

౧. ఒకప్పు డొకడు స్వబుద్ధితో కపటు డగును. అది వస్తుగత క్రమ విహితము. వస్తు విచట ఫలము. తత్ప్రాప్తిలో వస్తుగత= ఫలసాధకుడు కర్త. ఆతని యుపాయ చింతనాదికము క్రమము. తద్వి హిత మయిన కపటము వస్తుగతక్రమవిహితము. అనపరాద్ధు డయిన నొకడు వంచకునిచే వంచితు డయినచో నిట్టి వాడగును. తన యీప్సితసాధనమునకై యొకడు తన యుపాయచింతనానుకూల ముగా ననపరాద్ధు నొకని వంచన మొనరించుట యని తాత్పర్యము.

౨. పరప్రయుక్త కపటము రెండవది. వంచనీయుడును సాప రాధు డయినచో పరప్రయుక్త వ్యవహారము కలుగును. సాపరాధున కపరాధ మొనర్చుటలో వంచకునకు వంచనేచ్ఛ లేకపోయినచో నీ భేదము సంభవింపదు. వంచనేచ్ఛ లేకపోయినచో వంచనకు సంప త్తియె యుక్తము కాదు.

3. దైవవశ కృత కపటము మూడవది. వంచక వంచనీ యుల కిద్దర కేమియు నభిసంధి దోషము లేనప్పుడు, తుల్యఫలాభిసంధా నము కల యిరువురిలో కాకతాలీయమున నొక డుపచయము కలవా డగుటయు వేరొకడపచయము కలవాడగుటయు సంభవించునేని యీ వంచనము దైవకృతవంచనము. ఆ యిద్దరిలో నెవనికిని సుఖముండదు. ఇతరునకు దుఃఖ ముదయించును. కపట మిట్లు సుఖదుఃఖోత్పత్తి కృతముగా నుండునని తెలియ వచ్చును.

## శృం గా ర ము

శృంగారము మూడు విధములు. ధర్మశృంగార మర్థశృంగా రము కామశృంగారము నని. "శృంగారః కర్తవ్యో ధర్మే చార్థే చ కామే చ" ఇందు "ధర్మే, అర్థే కామే" అను సప్తమీవిభక్తి కార్యత్వమును కారణత్వమును చెప్పును. ధర్మము హేతువుగా నున్న నాయికాలాభమునను ధర్మము సాధ్యముగా నున్న నాయికాలాభము

నను ధర్మశ్శృంగార మగును. ఇట్లే యర్థకామము లందును గుర్తింప దగును.

౪౨౪. యస్మిన్ ధర్మప్రాపక మాత్మహితం భవతి సాధనం బహుధా
వ్రత నియమ తపో యుక్తో జ్ఞేయోఽసౌ ధర్మశృంగారః

౪౨౫. అర్థస్యేచ్ఛా యోగాత్ బహుధా చైవార్థతోఽర్థశృంగారః
స్త్రీ సంప్రయోగవిషయే ష్వర్థార్థా వా రతి ర్యత్ర

౪౨౬. కన్యావిలోభన కృతం ప్రాప్తౌ స్త్రీ పుంసయోస్తు రమ్యం వా
నిభృతం సావేగం వా యస్య భవే త్కామశృంగారః

౧. ధర్మశృంగారము. శృంగారము నిర్దేశించిన స్థలమున తద్విషయముగా నుండు ప్రమదకు వ్యపదేశ మున్నది. వేరు వేరుగా నుండు కార్యముల సంబంధసంధానమునకై శృంగారమును మూడు విధములుగా నిర్దేశింపవలసి యున్నది. అందు ధర్మశృంగారము ధర్మ ప్రాపకము. వ్రతనియమ తపో యుక్తము. ఇందలి సాధన మనేకవిధ మాత్మహితముగా నుండును. వ్రతాదుల యోగమున ధర్మము ప్రాప్యముగా నుండును. అప్పుడు ధర్మప్రార్థనాత్మక మయిన యజ్ఞాదిక మాత్మహిత మాధానించును. అది పత్నీసంబంధకృతముగనె సిద్ధించును. ధర్మపత్ని యున్ననె యజ్ఞధర్మాదు లం దధికార మున్నది. యజ్ఞాదిసాధన మనేక విధముల నున్నది. అది రాజ్య భూ గో సువర్ణాదిభేదమున ననేకవిధములు.

౨. అర్థశృంగారము. ద్రవ్య మందలి యిచ్ఛాసంబంధమున ద్రవ్యనిమిత్తక మయిన విశేషమునను అర్థశృంగార మనేకవిధముల నున్నది. స్త్రీసంప్రయోగ విషయములందు రతియు నర్థార్థమై యుండును. స్త్రీలకు గాని పురుషులకు గాని రతి బహుమానము గోచరించును గాని అదియంతయు ద్రవ్యసిద్ధి కగు సాధనమాత్రము గనె యుండును. అర్థహేతుకముగా రతి యుండును. ఆ రతియు నర్థ ఫలకముగా నుండును. దేవవ్యక్తులందు ద్రవ్యచింతనము లేదు. వారిలో నర్థార్థిత్వ ముండదు. గంధర్వ యక్షాదులలో నర్థార్థిత సంభవించునని కొంద రభ్యూహించిరి. ప్రతివ్యక్తికిని యర్థనీయ ముండును. అర్థనీయ మర్థించియే కార్యప్రసరము పొందుదురు. అట్టి

యర్థము దేవతలో గూడ సంభవింపకపోదు. అని మరికొందరి భావము. ఉపాధ్యాయు లిట్లనిరి. ఒక్కొ-క-చో నాయికానాయకుల యనుప్రాప్తి యన్యగత మయిన నర్థార్థితా రూపముననె యుండును. భగవానుడు భవదేవుడు గిరిరాజపుత్రికపై యనురాగము కలవాడయి నాడు. ఇంద్రాదులు తారకు డాక్రమించిన నిజరాజ్యము నున్మోచింప జేయుటకై యత్నించినారు. ఈ నాయికానాయకుల సంగమనము రాజ్యసమున్మోచనమునకే యయినట్లు కుమారసంభవ నిబంధన మున్నది. అర్థార్థిత్వ మీ రూపమున గూడ నుండును.

౩. కామశృంగారము. నాయకునకు కన్యయందలి విలోభనము. కన్యకు నాయకవిషయమున విలోభనము ఈ యుభయ కృతముగా కామశృంగార మున్నది. పరస్పరానురాగ కృత మని భావము. స్త్రీపురుషు లుద్యానస్థానాదికమును చేరినపుడు నిభృత ముగా నుండును. ప్రచ్ఛాదనపూర్వక మయినచో "ఇదిగో నేనే" యనునట్లు ప్రకటీకృతమగు శృంగారము గోచరించును. అట్టిది కామ ప్రయుక్తము. ఇది రమ్యము సావేగము నగును. ఈ కామశృంగా రము లోని స్త్రీ పరస్త్రీ యగుట వివక్షితము. శక్రున కహల్యాప్రసక్తి ఇట్టిది.

ఇట్టి శృంగార మీ రూపమున సంబంధింపగా కావ్యమున కైశికీ హీనత కలుగునేమో! కైశికీవృత్తిలో నర్మాదులు నాలు గంగము లావశ్యకములు. తదుపరంజకముగా గీతనృత్యవాద్యాదు లపేక్షిత ములు. అవియేవియు నీసమవకారమున నుండవు. కాగా ఇందలి వృత్తి కైశికీహీనయె యగును. ఏవంశృంగార యోగమున నేమి యర్థ మున్నది?

ఉపాధ్యాయు లీ విధముగా ప్రవచించిరి. కామ మున్నంత మాత్రమున కైశికి సంభవింపదు. రౌద్రప్రకృతికులకు కామముండును. కైశికియుండదు. విలాసప్రధానమగు రూపమున్నప్పుడె కైశికి యన వలెను. కేవలచరితము కైశికీస్వరూపమునకు చాలదు. తద్రూపాను ప్రవేశ మున్ననే తద్వ్యవహార ముండును. ఇట్టి వ్యవహార మంతట ప్రాధాన్యకృతమె కాక తప్పదు. అందుచే నిట్టి విషయము లందు

భారత్యాది వృత్త్యంతరాభిధానమె యుక్తముగా నుండును. అరూప కైశికీ వ్యవహార మసంగతము.

ఉష్ణిక్ గాయత్రి మొదలగు బంధకుటిలము లయిన వృత్తములను సమవకారమున కవులు ప్రయోగింపవలెను. బంధకుటిలములనుట సమవృత్త సంబంధ మపేక్షితము కాదని విషమార్ధసమవృత్తములపేక్షితములని ప్రతిబోధించినట్లగును. విషమార్ధసమముల ప్రయోగింప రాదని భట్టోద్భటుడుపదించెను. స్రగ్ధరాది వృత్తములనే ప్రయోగింప వలయును గాని ఆరేడక్షరములు గల యల్పాక్షర వృత్తముల ప్రయోగింప వలదనియు నాతడు వ్యాఖ్యానించెను. ఇప్పటికిట్లు సమవకారసామగ్రి నిరూపిత మయినది. సమవకారమును నాట్యవిదులు నానారససంశ్రయ మొనరించుట సముచితము. శ్రద్ధాలువు లయిన దేవతాభక్తులు తద్దేవ యాత్రాదులలో నా యా దేవ మహోత్సవములలో నీ సమవకార ప్రయోగమున ననుగృహీతులు కాగలరు. నిరనుసంధానహృదయు లయిన స్త్రీ బాల మూర్ఖులును విద్రవాదులు ప్రయోగింపగా నాహృతహృదయు లగుదురు. ఇది యంతయు సమవకార ప్రయోగసిద్ధి.

## రూ ప క రూ ప ము

౪. ఈ హా మృ గ ము. లక్షణ మిక ప్రసంగ ప్రాప్తము. ఈ రూపకము దివ్యు లయిన పురుషుల నాశ్రయించి యుండును. వారిందు నాయకులుగా నుందురు. దివ్యస్త్రీ నిమిత్తముగా యుద్ధమిందు సంప్రాప్తమగును. దివ్యానుప్రవేశ మున్నందున సమవకారమునందు వలె ననంబంధార్థత ప్రసక్తము కాకుండుటకై ఈహామృగము సువిహితవస్తు నిబద్ధ మగును. సంశ్లిష్ట మగు వస్తువుతో సంగత మగును. ఇది విప్రత్యయ మొదవించును. విశ్వాసహేతువు లన్నియు నిందు విగతము లగును. మధ్యమధ్యలో దివ్యవ్యక్తులకును రంగ ప్రవేశ ముండును. ఇది యుద్ధత పురుషప్రాయమై యుండుటలో నిదియె భావము. స్త్రీనిమిత్తక మయిన రోషమున కిందు స్థాన మున్నది. ఈ కావ్యబంధ మంతయు నిశ్లై సంగతము కావలయును. ఈ భావసూచన మీ కారికలో నున్నది.

౪౨౬. దివ్యపురుషాశ్రయకృతో దివ్యస్త్రీ కారణోపగత యుద్ధః
సువిహిత వస్తు నిబద్ధో విప్రత్యయ కారకశ్చైవ

౪౨౭. ఉద్ధత పురుష ప్రాయః స్త్రీరోషగ్రథిత కావ్యబంధశ్చ
స్త్రీ ఖేదనాపహరణావమర్దన ప్రాప్త వస్తు శృంగారః

ఇందు సంక్షోభ మావేగము సర్వము స్త్రీ నిమిత్తముగా నుండును. ఖేదనము అపహరణ మవమర్దనము యథాయోగముగా స్త్రీవిషయములన్యవిషయములునై శృంగారము సూచించును. ఖేదనాదులచే వనితాత్మక మయిన వస్త్వధిష్ఠానము సంప్రాప్త మగును. ఇందవమర్దన మనునది దండనము. సంక్షోభము విద్రవము సంఖేటము స్త్రీకర్షణమున నుపయోగించునవై తుదకు శృంగార పర్యవసానము పొందును. సుసమాహిత కావ్యబంధముగా నీహామృగ ముండుట సముచితము. కావ్యబంధములో వీథ్యంగముల నాయోజింపవలెననియు సూచిత మగును. ఇం దంకపరిమాణము నాయకసంఖ్యా వృత్తి రస విభాగ మంతయు వ్యాయోగమునుండి యతిదేశమున ప్రాప్తించును. అందున్నట్లె యిందుండ వలెను. కాగా నిందంక మొకటియే నుండును. నాయకులు పన్నెండుగురు నుందురు. వ్యాయోగమున నిట్లెయుండును. సమవకారాతిదేశమున వ్యాయోగమున గూడ నిట్టిలాభసిద్ధియె యభ్యూహ్యము. సమవకారాతిదేశమున సర్వసంపత్తియు సుసమాహితము కాగలదు. కాని యొక్క విశేష మిందు వేరుగా గలదు. కేవల మమరవనితాయోగభోగములె ఇందు వర్ణితములు కావలయును. దీనిలో యుద్ధ మవమర్దన ముండును గాని ఇందవి ప్రత్యక్షప్రయోజ్యములు కాకూడదు.

౪౨౮. యత్ర తు వధేప్సితానాం వధో హ్యుదగ్రో భవేద్ధి పురుషాణాం
కించిద్వ్యాజం కృత్వా తేషాం యుద్ధం శమయితవ్యం.

ఇందుద్ధత పురుషు లొకప్పుడు వధేప్సతో ప్రవర్తింతురు. వధ్యవధ మొనరింప జూతురు. ఉదగ్రవధ మొనరింప దలతురు. కాని యా సమయమున నేదేని వ్యాజ మేర్పరచి వారి యుద్ధమును శమింపజేయవలయును. వధ్యులకు పలాయనాదులు ప్రతిపాదించినచో వధశాంత మగును. ఇట్లే కూర్పు యుక్తము. ఈహామృగపదమున కీ

యర్థమున్నది. ఈహా=చేష్ట. మృగమునకు వలె స్త్రీమాత్రార్థమయిన చేష్ట ఇందు వర్ణిత మగును గావున నిది ఈహామృగము.

౫. డి మ ము. ఇందలి వస్తువు ప్రఖ్యాతము. నాయకుడు ప్రఖ్యాతు డుదాత్తుడు. రసము లారు. అంకములు నాలుగు. శృంగారము హాస్య మిందుండవు, శేషసర్వరసములు సంయుక్తములై యుండును. ఇది దీప్తరస కావ్యయోని. నానాభావోపసంపన్నము.

౪౩౦. ప్రఖ్యాత వస్తు విషయః ప్రఖ్యాతోదాత్త నాయకశ్చైవ
షడ్రస లక్షణ యుక్తః చతురంకో వై డిమః కార్యః

డిమము ప్రఖ్యాతవస్తువిషయ మగుట సర్వమితర మంతయు నాటకమునందు వలెనె యుండును. సంధు లసమగ్రములుగానుండుటయు రసము లసమగ్రములుగా నుండుటయు నిందలి విశేషము. శృంగారహాస్యవర్జమై షడ్రససమాయుక్త మగుటచే పర్యాయమున శాంతరసప్రయోగ ముండు ననుకొన రాదు. కావ్యయోని యనదగిన యిందలి కావ్యవస్తువు దీప్తరసముగా నుండును. నిర్ఘాతోల్కాపాతములు చంద్రసూర్యగ్రహణములు నియుద్ధము లాధర్షణములు సంపేటము లిందు బహుళముగా నుండును. ఇది మాయేంద్రజాల బహులము. నానాపుస్తము లుత్థానయోగము లిం దపేక్షితములు. దేవభుజగేంద్ర రాక్షస యక్ష పిశాచములతో నవకీర్ణమై షోడశయనాయక బహులమై డిమ ముండును. డిమము డింబము విద్రవమనునవి పర్యాయములు. తద్యోగ ముండుటచే నిది డిమ మయినది. "డయంత ఇతి డయః ఉద్ధతనాయకాః తేషాం వృత్తిర్యత్ర స డిమ." ఎగురుట గంతులు చిందులు వేయుట డీఙ్ ధాత్వర్థము. తత్సంబంధము కల యుద్ధతనాయకులు దీన సూచితు లగుదురు. వారల వ్యవహార మిందుండును గావున డిమ మయినది. "కార్యో డిమః ప్రయత్నాన్నానాశ్రయభావ సంపన్నః" సప్రయత్నముగా డిమమును నానాశ్రయ భావసంపన్న మొనర్పవలెను. ఇట్లనుటచే సర్వభావయుక్తత వైచిత్ర్యము సూచిత మగుచున్నది.

నాటకానంతరము డిమలక్షణము నిరూపించుట సముచితము. నాటకప్రకరణములందు ప్రవేశకాదు లుండును. ఇందు వాని సంభ

వము లేదు. ప్రవేశకాదిసంభవ నిరాకరణమునకై యీ ప్రకరణము నుండి దీని వేరుపఱచి యిట్లిచట నిరూపింప వలసి వచ్చినది. కాగా డిమము నందు దినచతుష్టయ వృత్తమె ప్రదర్శనీయము. అంకావతారము మాత్రమె యుండును. చూలికాంకముఖములు కూడ యుద్ధాదివర్ణనము నం దీ డిమమున నుపయోగించును. ఇట్లు చూలికాంకముఖాంకావతారముల సముపయోగ ముండగా ప్రవేశక విష్కంభకములు ననిషిద్ధములై యగును. కాని ప్రవేశకము సంభవింప దనవలెను. పరసేతివృత్తవశ వస్తుప్రసర మున్నప్పుడు ప్రవేశక మపేక్షితము కాదు. సమవకారము నందు వలె నంక మంకమునకు పరస్పరము సంబంధము లేనప్పు డక్కఱ లేనప్పుడు ప్రవేశక మక్కఱ లేదు. బహ్వంకక సమవకారములో నీ నీతియె యున్నది. అందుచే నవసరభావము ననుసరించి ప్రకరణోత్కర్ష మభిధానింప వచ్చును. కాగా నాటకానంతరము దీని నభిధానింప వచ్చును. అయినను ప్రకరణమునకు డిమస్పర్థిత లేదు. నాటకప్రకరణముల యంతరాలముననె యీ డిమమును నిరూపించినచో నాటికాదిభేద మభిధానించుటకు ఖ్యాపితము చేయుట కవకాశ ముండదు. నాటికలో స్త్రీప్రధానత యున్నది. నాటికానంతరము త్రిశృంగార సమవకారాభిధానమె న్యాయ్య మగును. తత్ప్రసంగముననె దివ్యపురుషసంబంధ ముండుటచే నీహామృగము నిరూపిత మయినది. తదనంతరము దివ్యపురుషాధికార ముండుటచే నితరరూపకములను రూపించుట సముచితము. రూపకరూప నిరూపణమున మొదట వితతేతివృత్త ముండుటచే ననేకరససంబంధ ముండుటచే నీ డిమము నభిధానించుట యుక్తము. "అలం బహునా". ఇంతవర కిట్లు లక్షణానుగత మయిన డిమలక్షణము నిరూపిత మయినది.

౬. వ్యా యో గ ము. ఇది డిమమునకై శేషభూతము. దివ్యనాయకు లిం దుండరు. కేవల మిం దుదాత్తు లయిన రాజాదులు నాయకులుగా నుందురు. అయిన నమాత్య సేనాపతి ప్రభృతులకు దీప్తరసత్వ ముండును.

౪౩౧. వ్యాయోగస్తు విధిజ్ఞైః కార్యః ప్రఖ్యాత నాయక శరీరః
అల్ప స్త్రీజన యుక్త స్త్వేకాహకృతస్తథా చైవ

౪౩౨. న చ దివ్యనాయకకృతః కార్యో రాజర్షి నాయక నిబద్ధః
యుద్ధ నియుద్ధాధర్షణ సంఘర్ష కృతశ్చ కర్తవ్యః

రూపకరూప విధిజ్ఞు లగువారు వ్యాయోగమున ప్రఖ్యాతనాయకుని స్వరూపనిరూపణ మొనరింపవలెను. నాయకున కిందు ప్రఖ్యాతత్వమె గాని యుదాత్తత యపేక్షితము కాదు. స్త్రీ జను లల్పముగా నుందురు. సమవకారము నందువలె పండ్రెండుగురు నాయకపురుషు లిందుందురు గాని తావదంక పరిమాణ శంక ఇం దతిదేశప్రాప్తము కాదు. ప్రత్యాసత్తి మాత్రమున నది ప్రసక్తమయినను వారించుటయె సముచితము. వ్యాయోగ మేకాహకృతము. ఏకాంకమును ఏకాహ చరితవిషయ మయినందుననే ఏకాంకత న్యాయప్రాప్తము. ప్రఖ్యాత నాయక శబ్దమున నిందు సంగృహీత మేమున్నది ? ఈ యతిప్రసంగము శమింప జేయుటకే "నచ" కారిక యున్నది. ఈ వ్యాయోగము దివ్యదేవులతో నిబద్ధము కాదు. నృపఋషులతో సునిబద్ధము కాదు. అట్టి నాయకు లిందుండనేయుండరు. అయినను యుద్ధనియుద్ధములు సంఘర్షణాధర్షములు దీనిలో నుండును గావున నిది వ్యాయోగ మయినది. యుద్ధప్రాయ వ్యాయామమున పురుషులు నియుద్ధమొనరింతురు గావున వ్యాయోగము వ్యాయోగ మనుట సముచితము. నియుద్ధమనునది బాహుయుద్ధము. సంఘర్ష మనునది శౌర్య విద్యాకుల రూపాది కృత మయిన స్పర్ధ. వ్యాయోగము నేవంవిధముగా కూర్పవలెను. ఇట్టి కూర్పు వలన నిది దీప్తకావ్యరసయోని యగును. కావ్య మోజోగుణయుక్త మయినచో దీప్త మగును. వీరరౌద్రాదులు దీప్తరసములు. దీప్తతయు రసయోనితయు నిందు కారణముగా నుండును.

౭. ఉ త్సృ ష్టి కా ం క ము : రౌద్రానంతరము తత్కర్మ యయిన కరుణము నిరూపించుట యుచితము. రౌద్రకర్మ కరుణము అని యింటిమి కదా ! ఉత్సృష్టికాంకము కరుణప్రధాన మయినందున వ్యాయోగనంతరము నిరూపణార్హ మయినది.

౪౩౩. ప్రఖ్యాత వస్తు విషయ స్త్వప్రఖ్యాతః కదాచిదేవ స్యాత్
దివ్యపురుషైర్వియుక్తః శేషైర్యుక్తో భవే త్పుంభిః

౪౩౪. కరుణరస ప్రాయకృతో నివృత్త యుద్ధోద్ధత ప్రహారశ్చ
స్త్రీ పరిదేవత బహులో నిర్వేదిత భాషిత శ్చైవ
౪౩౫. నానా వ్యాకుల చేష్టః సాత్వత్యారభటి కైశికీ హీనః
కార్యః కార్యవిధిజ్ఞైః సతతో హ్యుత్సృష్టికాంకస్తు

భారతాది యుద్ధమునందు స్త్రీపర్వవృత్తాంతము వలె నిందలి చేష్టితము కరుణబహులముగా నుండును. ప్రఖ్యాతమయిన కరుణాత్మక చరితమె యిందు విషయము. ఒకప్పు డీ యంకము అప్రఖ్యాతమును కావచ్చును. తత్తద్విషయ నిమిత్తముగా ప్రఖ్యాతము కావలయు ననుటయె గాని యఖ్యాతవస్తువునకును స్థాన మున్నది. ఖ్యాతాఖ్యాతముల రెంటిని స్వీకరించుట పరస్పరవిరుద్ధార్థత కలుగును కదా! దానిచే నకించిత్కరత్వమె భాసించునేమో! యని యాశంకింప నక్కర లేదు. దివ్యపురుషు లిందుండరు. తదితర పురుషు లిందు కూడి యుందురు. కరుణరసమె యిందు ప్రచుర మగును. ఇందలి పురుషు లంద రుద్ధతప్రహారు లయినను నివృత్తయుద్ధు లగుదురు. ఇక వారి ప్రహారము లుండవు. యుద్ధములు నుండవు. స్త్రీల పరిదేవన మిందు బహులము. వారు దైవోపాలంభ మొనరింతురు. ఆత్మ నిందించుకొందురు. నిర్విణ్ణ లగుదురు. నిరాశాభాషితములు చేయుదురు. ఇట్లు వారి యనుశోచన ముండును. వారి నిర్వేదితములను వినగనే నిర్వేదము జనించును. వారి యట్టి భాషణముల నాలించి జనులు నిర్విణ్ణు లగుదురు. స్త్రీలిందు నానావ్యాకులచేష్ట లగుదురు. భూమిపై పడుదురు. పొర్లుదురు. ధూళిధూసరిత లగుదురు. సాత్వత్యారభటీ కైశికీ వృత్తు లిందుండవు. భారతియె ఇందలి వృత్తి. కావ్యధర్మ మర్మ విధిజ్ఞులు ఉత్సృష్టికాంకము నిట్లు నిబంధింప వలెను. "ఉత్క్రమణీయా సృష్టిః జీవితం ప్రాణాః యాసాం తాః ఉత్సృష్టికాః శోచ న్త్యస్త్రియః తాభిరంకితః" ఇందు దుఃఖించు స్త్రీలు జీవిత ముత్క్రమింపజేయ తలంతురు. అట్టివారుంటచే నిది యుత్సృష్టికాంక మయినది. వృత్తులచే నిది యుత్సృష్ట మయినందున నీపేరు తగుననియు కొందరనిరి. దీనిలో కరుణరసము బహుళము గావున దేవదేవు లుండరు. దివ్యయోగమున రౌద్రబీభత్సభయానక సంబంధ మున్నను కరుణ ముండదు.

౪౩౬. యద్దివ్యనాయకకృతం కావ్యం సంగ్రామ బంధ వధ యుక్తం
తద్భారతే తు వర్షే కర్తవ్యం కావ్యబంధేషు

దేవతలకు కరుణము లేదంటిరి. వారలకు యుద్ధాదులు ననుచితములే యగునా! అనెడి యాశంకాప్రసంగమున సమవకారాదులలోని దేశ విశేషయోగము నిదర్శించుటకై ఈ యార్య సమర్థము. సంగ్రామ బంధ వధ యుక్త మయిన దివ్యనాయక కావ్యమును భారతవర్షము ననె నిరూపింప వలయును. కావ్యబంధములం దట్లు కర్తవ్యపాలనమె యుక్తముగా నుండును. దివ్యనాయకులు భారతవర్షావతీర్ణులై యుద్ధాదు లొనరించినట్లు ప్రదర్శింప వలెనని భావము. దేవవిహితము లయిన యన్యవర్షము లుండగా భారతమె యేల యిష్టము కావల యును? అన్ని వర్షములును దేశములె. అవి భోగభూములు. హృద్య భూమి యున్నది. శుభగంధ మున్నది. కాంచనస్థలు లున్నవి. ఉపవనముల కేగి జలక్రీడ లొనరించి విహరించుట లున్నవి. కామిను లతో సంచరించుటలు, వారలతో రతిప్రమోదములు, దివ్యపాన ములు, ఇంకను విశేషము లున్నవి. ఇలావృత కురుప్రభృతి వర్షము లలో నివసించు వారలకు దుఃఖ మెన్నడు లేదు. శోక మెప్పుడు కలుగదు. పురాణవాదములలో నిరూపితము లయిన కైలాసాది పర్వతములు వారల యధివాసములు. ఆ యధివాసములందు దేవ వృత్తము నిరూపింప కూడదో! వారల యధివాసము లయిన కైలా సాదులు వారలకు భోగస్థానములు. వారలకు వాని యందు సంభో గమె సముచితము. ఈ భారతవర్షము నందు మాత్రము వారలకు కర్మారంభమె సంభవించును. భారతవర్షమున దివ్యులవతరింప వార లకు దుఃఖ ముదయించును గాని అది యెప్పుడు పూర్ణము కాదు. దుఃఖపూర్ణతలో దేవత్వమె విహిత మగును. వారి యవస్థితియె భగ్న మగును. వారల స్వరూపమె లోపించును. భారతవర్షముననే వారలకు దుఃఖశోకములు వర్ణ్యమాన ప్రయుజ్యమానములు కావ చ్చును. కరుణరసబాహుల్య మున్నందున దివ్యుల కుత్సృష్టికాంక ముతో సంబంధ ముండదు. వారందరు సుఖబాహుల్యము కలవారు. విశోకులయిన వారి సన్నిధానమున సశోకులకును శోకావసరము పరా కృత మగును. గాఢదుఃఖాభిభూతులు ఏవంప్రాయ ప్రయోగదర్శన

మున దుఃఖభారము తగ్గిపోగా సుఖముగా వినేయులు కాగలరు. "దుఃఖీ దుఃఖాధికాన్ పశ్యేత్" అని లోకనీతి. కావుననే నాట్యఫల ప్రసక్తిలో దుఃఖార్దితునకు స్థైర్య ముండుట నిరూపిత మయినది. ఇట్టి దిది యంతయు నుత్సృష్టికాంక ప్రయోగము. అశేషయోగమాత్ర గత మయిన యంకలక్షణ మిట్లు వ్యాఖ్యాత మయినది.

౮. ప్ర హ స న ము : ఇంతవర కిట్లు రంజనప్రధాన కరుణయుక్త మయిన రూపక మభిహిత మయినది. రంజనాప్రధానము హాస్యప్రాయము నగు ప్రహసనము నిక నిరూపింప వలెను. ప్రహస నము రెండు విధములు. శుద్ధప్రహసనము, సంకీర్ణప్రహసనము నని. ద్వివిధప్రహసనమును హాస్యరసప్రధానముగా నుండును. ఈ రెండిటికి వేరువేరుగా విశేషలక్షణము నిరూపింప వలెను.

## శు ద్ధ ప్ర హ స న ము

౪౩౭. భగవత్తాపస విప్రైః అన్యైరపి హాస్యవాస సంబద్ధం
కాపురుష సంప్రయుక్తం పరిహాసాభాషణ ప్రాయం

౪౩౮. అవికృత భాషాచారం విశేషభావోపపన్న చరిత పదం
నియతగతి వస్తువిషయం శుద్ధం జ్ఞేయం ప్రహసనం తు

భగవత్తాపసవిప్రులు యతి వానప్రస్థ గృహస్థులు. అన్యులు శాక్యాదు లయిన జైనబౌద్ధప్రభృతులు. ఇట్టివారితో ప్రహసనము సాగును. హాస్యప్రధానము లయిన వచనములతో నిది కూడుకొనును. ఈ భగవత్తాపసవిప్రాదు లందరు కుత్సితపురుషులై యుందురు. వారి శీల మట్టిదియై ప్రహస్యమానముగ నుండును. కాపురుషసంప్రయోగ మిం దధికము. నవ్వుపుట్టించు వికలసంభాషణములె యిందు ప్రచుర ములు. అయినను వారి భాషాచారములు వికృతములు కావు. అసత్య మశ్లీలమును వారు పలుకుదురు. ఇందలి కథాఖండము లన్నియు విశేషభావములతో వ్యభిచారిభావములతో కూడి యుండును. ఇందు నియతగతిక మయిన వస్తువె విషయముగ నుండును. ఏకప్రకార వస్తువె ముఖ్య మగును. ప్రహసనీయవస్తు వుందు నని తాత్పర్యము. ఇట్లుండు నిది శుద్ధప్రహసనము.

పరిహాసప్రధానము లయిన యాభాషణము లిందు బహులముగా నుండుటచే నిది ప్రహసన మయినది. దుష్ట మయిన యొకని చరితమె ప్రధానముగా ప్రహసిత మగునేని శుద్ధ మగును. వేశ్యాదుల యోగము అనుల్బణము లయిన యాకల్పాదు లున్నచో సంకీర్ణ మగును. తదేకద్వారమున హసనీయ వేశ్యాదిచరితముతో నిది సంకీర్ణ మగుటచే సంకీర్ణ మయినది.

కొంద రిట్లందురు. కొందరి చరితము శిష్టులమధ్యమున సభ్యేతర మగుటచే ప్రహసనార్హ మగును. అట్టిదది యవిశుద్ధ మయినందున సంకీర్ణ మగును. తద్యోగముననె యిదియు రూపక మయినది. కొందరు స్వభావమహసనీయులె. వారి సహజచేష్టావిశేషములు గర్హితములు కావు. భగవత్తాపస విప్రప్రముఖుల చేష్టాచరితవిశేషము లగర్హితములె. అయినను వారొకప్పుడు ప్రహసనీయు లగుదురు. అట్లగుటలో ప్రాకృతపురుషుల సంక్రాంతి దౌరాత్మ్యమె హేతువు. ప్రాకృతవ్యక్తిసంబంధమున వారి చరితము దూష్యమాణ మగును. వారు నవ్వులపాలగుదురు. వారు స్వభావశుద్ధులు. తద్యోగమున రూపకము శుద్ధము.

## సంకీర్ణ ప్రహసనము

౪౩౯. వేశ్యా చేట నపుంసక విట ధూర్తా బంధకీ చ యత్ర స్యుః
అనిభృత వేష పరిచ్ఛద చేష్టిత కరణైస్తు సంకీర్ణం

సర్వజన భోగసంభోగ యోగ్య యయిన వేశ్య, కామినీకాముకులకు సంధానకుశలు డయిన చేటుడు, స్త్రీపుంస స్వభావదూరు డయిన నపుంసకుడు, విటుడు, ధూర్తుడు, అంకుటాలు మొదలగు పరిజనపరివారమున్నచో సంకీర్ణ మగును. అనిభృతము లయిన వేషపరిచ్ఛదములతో నట్టి చేష్టిత కరణములతో నది సంకీర్ణ మగును.

శుద్ధ సంకీర్ణ ప్రహసనము లిట్లున్నవి. ఇందుభయసాధారణ మయిన కవిశిక్షయు గలదు. అది యిది.

౪౪౦. లోకోపచార యుక్తా యా వార్తా యశ్చ దంభ సంయోగః
న ప్రహసనే ప్రయోజ్యో ధూర్తప్రవివాద సంపన్నః

కవి ప్రహసనమునం దీ రీతిగతులను సంధానింప వలెను. వార్త-ప్రసిద్ధి. అది లోకవ్యవహారసిద్ధ మగుటను గుర్తించి కూర్పవలెను. "శాక్యులకు స్త్రీసంపర్కమె ప్రహసనీయ మగును. కాని చౌర్యము ప్రహసనీయము కాదు" అనునట్టి యిట్టి ప్రసిద్ధాంశమును ప్రహసనీయ మొనర్ప వలెను. దంభము డండ మిం దాయోజనము చేయవలెను. ప్రహసనము ధూర్తప్రతివాద సంపన్నముగా నుండ వలెను. ఇట్లనుట యిది యిందలి యధికరణము. కృత్రిమ తాపసాదులు విటాదు లం దరు ధూర్తులు. తద్విషయమున ప్రకృష్టమగు వివాదము దీనిలో నుండును. ఈ వివాదము విరుద్ధముగా నవభాసించు రీతి. ఇది ఫల భూతముగా నిందుండవలెను. ఇట్టిదాని నిందు సంపాద్య మొనరింప వలెను. ఇట్లు ప్రహస్యమాన తథాభూత చరితావలోకమున లోక మొక విధమున వ్యుత్పాదితమై సంస్కృతము కాగలదు. మఱల నట్టి వంచకుల నుపసర్పింపదు. ఈ ప్రహసనము యథాయోగముగా వక్ష్యమాణ వీథ్యంగములతో కూడుకొనినదియై సుశ్లిష్ట మగును. వీథ్యంగసంప్రయోగములో సంఖ్యానియమము లేదు. క్రమనియమ మును లేదు. వానిని యథానుకూలముగ కూర్పవచ్చును.

ప్రహసనమున కంక నియమము నిరూపింప లేదు. శుద్ధ మేకాంక మగునని, సంకీర్ణము వేశ్యాదిచరిత సంఖ్యాబల మున్నం దున ననేకాంకములతో నుండునని ప్రహసనప్రియులు పలికిరి. ఈ ప్రహసన మేకాంకప్రకరణ మధ్యపాతి యయినది. కాన నిది యేకాం కము తోడనె యుండవలయును. ప్రథమసంఖ్య నతిక్రమించుట యేల? శుద్ధసంకీర్ణముల భేదాభావపరిత్యాగమున ప్రమాణమేమి యున్న దనియు గొందరనిరి.

౯. భా ణ ము. ఇక భాణలక్షణ మావశ్యక మవసర ప్రాప్తమును.

౪౪౧. ఆత్మానుభూత శంసీ పరసంశ్రయవర్ణనా విశేషస్తు
 వివిధాశ్రయో హి భాణో విజ్ఞేయస్త్వేకహార్యశ్చ
౪౪౨. పరవచన మాత్మసంస్థం ప్రతివచనై రుత్తరోత్తరగ్రథితైః
 ఆకాశపురుష కథితై రంగవికారై రభినయై శ్చప

౪౪౩. ధూర్త విట సంప్రయోజ్యో నానావస్థాంతరాత్మకశ్చైవ
ఏకాంకో బహుచేష్టః సతతం కార్యో బుధైః ర్భాణః

హాస్యరసోచితు లయిన విటధూర్తాదుల యనుప్రవేశముచే సమానయోగక్షేమ మయిన భాణమును లక్షణయుక్తముగ నిరూపింప వలసి యున్నది. భాణ మేకపాత్ర హారణీయ మగును. అట్లు యది కావ్యార్థమును సామాజిక హృదయమున ప్రవేశపెట్టును. "ఏకముఖే నైవ భాణ్యంతే అప్రవిష్టా అపి పాత్రవిశేషా యత్ర స భాణః" నాట్యరంగమున ప్రవేశింపని పాత్రవిశేషములును ఏకముఖముననె వచనబలమున నంతర్భావ సంభావితు లగుదురు. కావున భాణమని యనుట సభావకముగ నున్నది. ఈ భాణమున రంగమందు ప్రవేశించిన పాత్రవిశేష మాత్మానుభూతము చెప్పును. పరగతమునేని వర్ణించును. అందుననె భాణ మాత్మానుభూతశంసి యని, పరగతవర్ణనా విశేష సంశ్రయమున నుండునని మూల మనినది. భాణము వివిధాశ్రయ మయినను ఏకహార్యము - ఏకపురుషహారణీయ మయినది. పరవచన మభినయించు విధానము రెండవ దానిలో నున్నది. కేవలము పరవచన మభినయించుటయె కాదు. తాను పలికిన ప్రతివచనముల గూడ కలుపుకొని యభినయించును. పరవచన మాత్మసంస్థముగ భావించి, యుత్తరోత్తరము సంగ్రథించిన ప్రతివచనములతో గలియ కలుపుకొని, యాకాశపురుష కథితములతో నంగవికారములతో నభియములతో నొకడు దీని ప్రయోగించును. శూన్యాకాశమునందు పురుషకథితములను భావింప వలెను. అట్టె చూడవలెను. శూన్యము ననె వర్ణింప వలెను. ఒకడు చూచుటను వేరొకడు వినుట భావించి వారి వచనముల నను వదించుచు సామాజికుల నుద్బోధింపవలెను. "భో! బాడబ!" "అరే! ఏమంటివి?" ఇత్యాదులలో కేవలము పరవచనము నభినయించుటయె కాక నానావిధ యోజనా సముపలక్షితము లయిన స్వోక్తప్రతివచనములతో నభినయింపవలెను. రంగమున నిట్లు ప్రవేశించి యభినయించు నాతడు ధూర్తుడేని విటుడేని యగును. నానాప్రకారావస్థావిశేషమున లోకమున నుపయోగించు వ్యవహారలక్షణాత్మకముగా వాచ్యము నాయోజనము చేయ వలయును. కావుననె దీని బహుచేష్ట మొనర్పవలెను. ఇందుండు

లోకవ్యవహారము సకల సామాన్య పృథగ్జనగతమై యుండును. తదుపయోగ్యముగ తదుపభోగ్యముగ నుండును. వేశ్యావిటాది వృత్తాంతాత్మకముగా నిది నిరూపితప్రయుక్తమై బాహుల్యమున పృథగ్జనులకు వ్యుత్పత్తియోని యగును. ఇట్టి యీ రూపకము రాజ పుత్రాదులకు నుపకారి కాగలదు. వారి నట్టివారిని వినేయుల నొనర్చుటకై వంచనారహితముగ శంభలీవృత్తాంతమును సంప్రయోజ్యము కావచ్చును. ఈ భాణ మేకాంకము. ఆగమానుగత మయిన భాణ లక్షణ మీ రీతి నున్నది. నాట్యవిద్బుధులు నిఖిలలక్షణ మీ విధ మున సంభావింప వలసి యున్నది.

## ఇ ద మి హ మీ మాం స్యం

ఇచట నీ విషయము నిట్లు మీమాంసింప వలసి యున్నది. ఈ నిరూపించిన నుత్సృష్టికాంకాదిరూపక భేదములు ఏకరసములుగనే సంభావింప దగియున్నవి. పరిశీలింపగా నాటికాదులు గూడ నిట్లే ఏకరసము లనిపించును. ఈ యంశమును సంభావింపుడు. నాటకమున సర్వరసయోగ్యత యున్నది. ప్రకరణములో గూడ నట్లే సర్వయోగ్యత కలదు. నాటకప్రకరణములలో ధర్మవీర మర్థవీరము ప్రధానముగా నున్నది. పరమార్థముగా సర్వనాయకభేదము లందును వీరత్వమనుగతమై గోచరించుచునే యున్నది. సమవకారములో మాత్రము ప్రారంభములో శృంగార ముండుట యుక్తమె యయినను వీరమె యందును ప్రధాన మగును. రౌద్రరసమేని ముఖ్య మగును. డిమ వ్యాయోగములలో గూడ నిట్లే యూహింప దగి యున్నది. ఈహామృగమునందును రౌద్రప్రాధాన్యమె కలదు. నాటికలో మాత్రము శృంగారమె ముఖ్యముగా నున్నది. ఈ వీరరౌద్రశృంగారములు పుమర్థత్రయమునకు ప్రాణభూతములుగా నున్నవి. ఈ ప్రయోగము లలో శాంతబీభత్సరసములు చివరి పుమర్థమునకు సంబంధించి యుం డును. మోక్షపురుషార్థమునందు సర్వజనుల కధికార ముండదు. అపశ్చిమ జన్ము డయిన యే యొకనికో మోక్షమున నధికార ముండును. నాటకమునందు శాంతబీభత్సములు తత్ఫలప్రధానము లుగా ప్రాధాన్య మవలంబించును గాని యిట్టిది ప్రచురప్రయోగ

ముగా లేదు. పురుషార్థప్రవర ప్రాణితము లయినను శాంతబీభత్స రసములు వీరాదిరసాంతరముల యధ్యావాపముననే యవస్థావ్యవస్థలు కల వగుచున్నవి. పురుషార్థవిషయముగా నుండు రూపకము లన్నియు నిట్లు రసోద్దేశముననె యున్నవి. అయినను రసాంతరప్రయోగము కూడ ముఖ్యరసాంగముగనె యున్నది. అందలి ఇతివృత్తము వితతమై యుండుటయె యిందు హేతువు. కాగా తత్ప్రధాన చేష్టాసంబంధ మావశ్యక మయినందున వృత్తివైచిత్ర్యము కూడ సముచితమె యగుచున్నది. ఉత్సృష్టికాంక ప్రహసన భాణములు కరుణ హాస్య విస్మయ ప్రధానములై రంజకరసముఖ్యము లగుచున్నవి. అందువలననె వాని యందు స్త్రీ బాల మూర్ఖాదు లధికారులుగా నున్నారు. వీనిలో నితివృత్తము వితతముగా నుండదు. తావన్మాత్రేతివృత్తము నందును తగినవైచిత్ర్య మయిన భాసింపదు

ఈ యర్థము నిట్లు సంభావింప వచ్చును. ఉత్సృష్టికాంకము నందు కైశికి ఆరభటి సాత్వతి యను వృత్తిత్రయ ముండదని స్వవచనములో భరతుడు నిషేధించెను. వృత్తిత్రయము లేనప్పుడు భారతీ వృత్తి మాత్రము దీనిలో నెట్లుండునని సందేహింప వలసి యుండును. కరుణమునందు చేష్ట ప్రధానము కాదు. కరుణములో విలాపములు పరిదేవితము లుండును. పరిదేవితాత్మక మయిన భారతీవృత్తి కరుణమున కుపకరణము మాత్రమె యగును. కావున వృత్తిత్రయ ముండదనుటయ కాదు. భారతియు నుండదనియె భావము. కాగా నిక నిందలి వృత్తియేమి? అందువలన నిందు "ఫలసంవిత్తి" యనెడు వృత్తి యున్నదని యంగీకరింప వలెను. కైశిక్యాదివృత్తి చతుష్టయమె కాక "ఫలసంవిత్తి" యనె డయిదవ వృత్తియు కలదు. వాక్చేష్టల ఫలానుభవము ఫలసంవిత్త్యాఖ్య వృత్తిలక్షణము. అది యుత్సృష్టికాంకము నందున్నది. ఈ యంశ మవశ్యాభ్యుపేయము. కాకపోయినచో నొక యాపత్తి వాటిల్లును. మూర్ఛామరణాది భావములలో వాక్చేష్ట లేవియు నుండనందున నిర్వృత్తికతయె కల్గును. మూర్ఛామరణాదు లవృత్తికములె కావలసి యుండును.

ఇంక నీయంశమున భట్టోద్భటుని భావ మొకటి భావింపవలసి

యున్నది. ఇందు పుమర్థకామోద్దేశమున కైశికి నభిధానించినచో ధర్మార్థముల నుద్దేశించియు వృత్తిద్వయ ముండు ననవలెను. కాగా వృత్తిత్రయకథన మిందు యుక్త మగును. ఆ వృత్తిత్రయ మీ రూపమున నుండును.

౧. చేష్టాత్మక మయిన న్యాయవృత్తి
౨. వాగ్రూపమయిన యన్యాయవృత్తి
3. వాక్చేష్టాఫలభూత మయిన ఫలసంవిత్తి వృత్తి

ఇట్లు వృత్తిత్రయమె యుక్తము- అని. ఈ విషయమున నొక స్వప్ర మాణిత వచనప్రసక్తి నాత డభిమానించెను. వాగ్వృత్తి చేష్టావృత్తి యను నీ రెండును పురుషార్థచతుష్టయ సంబంధమున నెనిమిది విధము లగును. ఇట్లష్టమూర్తి యయిన యీ రూపమున న్యాయాన్యాయ వృత్తిసంబంధమున ఫలసంవిత్తి వృత్తి పదునారువిధము లగుచున్నది. ఈ ఫలవృత్తియె రసభేదమున ననేకభేదములు కలదగును. ఆతని సూక్తి యిది.

"ఆద్యే వాక్చేష్టాభ్యాం
పురుషార్థ చతుష్టయేన చాష్టవిధే
షోడశధా ఫలవృత్తిః
తద్ద్వయతోఽనేకధా తు రసభేదాత్"

'న్యాయవృత్తి' యనినప్పు డీ భావమును గుర్తింపవలెను. యుద్ధములందు స్వపరశస్త్రముల పాతన రక్షణ కరణములకై సముచిత మయిన గాత్రవర్తన ముండును. ఆ వర్తన మునకు "న్యాయ" మన్న సంజ్ఞ కలదు. ఈ న్యాయము నాలుగు విధములు. భారతన్యాయము, సాత్వతన్యాయము, వార్షగణ్యన్యాయము, కైశికన్యాయము. అని. ఇవియె భారత్యాదివృత్తుల కాశ్రయము లయినవి. ఈ న్యాయరీతి ననుసరించిన యంగహారములును న్యాయములె యగును. మధుకైటభ సంహారసమయమున శ్రీవిష్ణువు న్యాయరీతుల ననుసరించి యుద్ధ నియుద్ధముల నిర్వహించెను. కావున విష్ణువిధానము లన్నియు న్యాయము లయినవి. నాట్యప్రయోగమున నానాభావ సమన్విత ములై కావ్యసంజ్ఞ ననుసరించి వృత్తిసంజ్ఞ కల వయినవి.

పై వృత్తివిచారాంశమున కొందరిట్లనుచున్నారు. కైశికీ వృత్తిని సాత్వతీవృత్తిలో నంతర్భవింప జేయవచ్చును. అయినను రంజకత్వాతిశయమున వేరుగా పరిగణిత మయినది. స్వరయుక్త మయిన ముఖజాభినయ ముండుటచే గూడ నది పృథగుపాత్తము. ఇంతమాత్రమున నది యన్యాయవృత్తి కాదు. పుమర్థచతుష్కము నకు సంబంధించిన యుపపత్తి యంతయు దానిలో గలదు. ఫలవృత్తి యనునది యెట్టిది? ఫలవృత్తిలో వృత్తిసామాన్యలక్షణ మయిన వ్యాపారరూపత్వము లేకపోయినచో నందు వృత్తిత్వ మెట్లుండును? అదివృత్తి యెట్లగును? అందును వృత్తిసామాన్యలక్షణ మయిన వ్యాపారరూపత్వ మున్నచో వాక్చేష్టాతిరిక్తముగా లోకసిద్ధ మయిన మానసవ్యాపార మేదియు నందు లేనందున సూక్ష్మమయిన వాక్చేష్టాగతవ్యాపారమె యున్నదని యంగీకరింప వలెను. కాగా మూర్ఛామరణాదులలో గూడ ప్రాణాత్మక మయిన కాయిాయ వ్యాపారము సంభవించు నని యంగీకరింప వలెను. కాయిక వ్యాపారానుస్మరణము ననె లయ తాల గానములు ప్రవృత్తము లగుచున్నవి. మూర్ఛాదులలో సంవేదనము కూడ నుండ దనియె యనవలెను కద! వాక్చేష్టలె యుండవని యనుటేల? సంవేదనమె యుండనప్పుడు ఫలవృత్తి మాత్ర మెట్లు సుఘట మగును? కావున నిచట సాత్వతి వృత్తియె యున్నదనుట యుక్తము. కావ్యము వృత్తిమయ మన్న వ్యవహారము బాహుల్యాపేక్షచే సిద్ధమయినది. ఖండాంశ మవృత్తికముగా నున్నను సముదిత మయిన రూపకము వృత్తిమయ మయినందున రూపకసముదాయాపేక్షచే కావ్యము వృత్తిమయ మనవచ్చును. భట్టోద్భటుని మతము ననుసరించు వారు మూర్ఛామరణాదులలో ఆత్మసంవిత్తి (ఫలసంవిత్తి) రూప మయిన యయిదవ వృత్తి నంగీకరించు చున్నారు. భట్టోద్భటమతమునకు శాకలేయమత మని శకలీగర్భమత మని పేరు. ఈ యాత్మసంవిత్తివృత్తి సకలకార్యనివృత్త్యనుమేయము. ఇందు మూర్ఛాకర్మ యనుభావము. ఇది ఫలావచ్ఛిన్న మయిన యాత్మవ్యాపారరూపము. భట్టోద్భటుని యీ ఫలసంవిత్తిని భట్టలోల్లటాదు లంగీకరింపక పరాకరించిరి. భావములకు పరిస్పంద మొక్కటియె వ్యాపారము కాదు. వాచిక కాయిాయ వ్యాపారము-

లును గలవు. ఇట్టి భావముతోడనె భావములకు బాహ్యగ్రహణ స్వభావము నుపపాదించి శకలీగర్భ భావగర్భమును ఖండించిరి. కాన *ఫలవృత్తియను నొకటి వేరుగా లేదు. వృత్తులు కైశిక్యాదులు నాలుగె. అని.

"వయం తు బ్రూమః" మే మిట్లందుము. ఈ యస్థానసంత్రాస మిది యంతయు నేమి? ఈ నాట్యమున సంస్థితి కలదానిని వ్యాతులం దంతర్భవింప జేయుట తగునేని యిదియంతయు నుపపన్నము కావచ్చును. కాని యిది సంగతము కాదు. రంగము వృత్తి కాదు. మృదంగ పణవ వంశాదులే వృత్తికాగలవు? వ్యాపారమె వృత్తి. వృత్తి పుమర్థసాధకము. వ్యాపారము లంతట వర్ణితము లగును. కాన వ్యాపారములె వృత్తులు. "వృత్తయః కావ్యమాతృకాః" కావ్యమున వ్యాపారశూన్య మేదియు వర్ణనీయము కాజాలదు. మదమూర్ఛాదుల వర్ణనములలో గూడ సాత్వతీస్వరూపకమయిన మనోవ్యాపారము సంభవించును. అది వర్ణితము నగును. కరుణాదులలో గూడ మనోదేహవ్యాపార మున్నది. అయినను వాగ్వ్యాపారమె బహులముగా సంభవించును గావున భారతీవృత్తి యుండునని యనిరి. వృత్త్యంతరములకు సంబంధించిన యంగము లపరిపూర్ణములుగా నుండునని వృత్త్యంతరముల నిచట భరతుడు నిషేధించెను. అంతట నన్ని వృత్తులు సంభవించును. అంగపూర్ణతాపూర్ణతలను బట్టి సంభవాసంభవ వ్యవహారము కలుగును. కాయవాఙ్మానసవ్యాపారము వినా, తద్వైచిత్ర్యము వినా, యే వ్యాపారమును సంభవింపనే సంభవింపదని మే మనేక పర్యాయములు ప్రతిపాదించితిమి. కాన కరుణప్రధానరూపకము నందు పరిదేవిత బాహుల్యముండుటను బట్టి భారతీవృత్తి యుండుననుట బాగు.

"శృంగారహాస్యకరుణైరిహ కైశికీస్యాత్" అని కోహలోక్తి యున్నది. అది మునిమతవిరోధ మున్నందున నుపేక్ష్యము. కరుణమున గూడ కైశికియె యుండు ననుట కోహలభావము కాదు. అనుల్బణ చిత్తవృత్తి యున్న స్థలమున కైశికీవృత్తిని చెప్పవలయు నని యాతని యాశయము. ఇట్లె ప్రహసనభాణము లందును వాగ్వ్యాపార

ప్రాధాన్య ముండుటచే భారతీవృత్తి నాభాషింప వచ్చును. మూర్ఛా దులలో వ్యాపారమె లేకపోయినచో వృత్తియే యుండదు. నాట్య మంతయు వృత్తిబ్రహ్మముగా సమర్థనీయము కానక్కర లేదు. "అల మతిప్రసక్త్యా"

౧౦. వీ థి. సర్వాంతమున వీథి యను రూపకమును లక్షణ యుక్త మొనరించుట సముచితము. వీథి సర్వరసమయము. అవితత స్వభావము. సంక్షేపముగా శక్యవ్యుత్పత్తిదాయి. కావున వీథి ప్రధా నము. వీథ్యంగములు నాటికాది భాణాంత సర్వరూపకోపజీవ్యములు. ఇది వీథి;

౪౪౪. వీథీ స్యాదేకాంకా తథైకహార్యా ద్విహార్యా వా
అధమోత్తమ మధ్యాభిర్యుక్తా స్యా త్ప్రకృతిభి స్త్రిభిః

వీథిరూపకమున నొక యంక ముండును. ఏక హార్య మయిన వీథిలో నాకాశపురుషభాషితములు కూడుకొని యుండును. ద్విహార్య మయిన వీథిలో నుక్తిప్రత్యుక్తి విచిత్రత యుండును. అధమోత్తమ మధ్యమప్రకృతు లను మూడు ప్రకృతులతో నిది యుండును. ఇందు పదమూడంగము లున్నవి.

౧. ఉద్ఘాత్యకము ౨. అవలగితము
౩. అవస్పందితము ౪. నాలిక
౫. అసత్ప్రలాపము ౬. వాక్కేలి
౭. ప్రపంచము ౮. మృదవము
౯. అధిబలము ౧౦. ఛలము
౧౧. త్రిగతము ౧౨. వ్యాహారము
౧౩. గండము

ఇట్లివి త్రయోదశాంగము లని యుదాహృతము లయినవి. ఇట్ల నుట యిది యుదాహరణమాత్రమె యని భావము. ఈ యంగముల స్వరూపలక్షణము లిట్లున్నవి. ఇందిది చోద్యము. ఈ వీథ్యంగముల కుక్తివైచిత్ర్య ముండుటయె లక్షణ మయినచో కావ్యలక్షణము లన దగిన భూషణాదుల కన్న వీనికి భేదమేమి కలదు. ఉపమాద్యలంకార ముల కన్న భేదమేమి? అట్లుకాక యితివృత్తోపకరణరూపత్వమె

స్వరూప మయిన సంధ్యంగముల కన్న భేదమేమి యుండును? అట్లును కాక వేరుగా రసోపకరణత యుండునేని వృత్త్యంగము లందే యివి యంతర్భవించును గదా!" అని యిందాశంక్యము కాగా, కొందరిట్లనిరి. వీథ్యంగముల కీ లక్షణవిశేషరూపత్వమె స్వరూపము. కావ్యలక్షణాలంకార సంధ్యంగ వృత్త్యంగ లక్షణముల కన్న వీని లక్షణములు వేరుగా నున్నవి. అది యిది యొకటని యనుట తగదు. వివేచకులు వీథ్యంగములు తద్వ్యతిరిక్తము లనియె భావింతురు. అని.

కాని వీనికొక సామాన్యలక్షణ మున్నది. ప్రశ్నప్రతివచనముల కన్యాభిప్రాయరూప సంబంధమున వైచిత్ర్య మాపాదించుట వీథ్యంగ స్వరూపము. కావుననె వీథ్యంగము లుదాహృతము లని యంటిమి. ఉదాహృత స్వభావత వీని సామాన్య లక్షణము. ఉదాహృతము లనుట ప్రతివచనరూపము లని భావము. కావ్య మేదేని ప్రతివచన శూన్యముగ నుండదు. ప్రతివచనశూన్య మయిన కావ్య ముండదు. కాన వీథ్యంగములు విచిత్రము లని యర్థము లభించును. కావుననె వీథి పంక్తి యనదగును. వీథి యన్యోత్తరసహిష్ణువు కాదు. వీథి విచిత్రోక్తిప్రత్యుక్తిగర్భము. లక్షణాలంకారాదుల కిట్టి యుక్తినియత మయిన రూపము లేదు. ఇందున్నది. ఇది యిందలి విశేషము.

౧. ఉద్ఘాత్యకము. "ఈతడు తలచిన సమాధాన మీయ గలడు. నా మనసులో నున్నది చెప్పునో? చెప్పడో?" అను సందేహము నిమిత్తముగా ప్రష్ట యగునాతడె వైచిత్ర్య మొకటి సంభావించి, ప్రతివక్త కుచిత మయిన ప్రతివచన ముత్తరముగా బలుకు నేని యుద్ఘాత్యక మగును. "ప్రశ్నాత్మకే ఉద్ఘాతే సాధు– ఉద్ఘాత్యకం" ప్రశ్నాత్మక మయిన యుద్ఘాతమున నిది యుక్త మయిన దగుటచే నిది యుద్ఘాత్యక మయినది.

> ౪౪౫. పదాని త్వగతార్థాని యే నరాః పున రాదరాత్
> యోజయంతి పదై రన్యైః తదుద్ఘాత్యక ముచ్యతే

అగతార్థము లయిన పదములను, ఆదరముగా నడిగిన ప్రశ్న రూపము లగువానిని సుధీనరు లుత్తరరూపము లయిన పర్యాయ పదాంతరములతో యోజన మొనరించినచో నది యుద్ఘాత్యక

మగును. ఉద్ఘాత్య ముత్తరపదసమూహాత్మకముగా నుండుననని తాత్ప ర్యము. పాండవానంద మను రూపకములో నిట్లున్నది.

కా భూషా బలినాం? క్షమా, పరిభవః కోఽయం? సకుల్యైః; కృతః కిం దుఃఖం? పరసంశ్రయో, జగతి కః శ్లాఘ్యః? య ఆశ్రీయతే కో మృత్యుః? వ్యసనం, శుచం జహాతి కే? యైర్నిర్జితాః శత్రవః కైర్విజ్ఞాతమిదం? విరాటనగరే ఛన్నస్థితైః పాండవైః

బలము కలవారల కాభరణ మేమి? క్షమ. పరిభవ మేది? తన వంశము వారొనరించినది. దుఃఖమేది? ఇతరుల నాశ్రయించుట. లోకమున శ్లాఘింపదగిన వాడెవడు? ఆశ్రయదాత. మృత్యువేది? వ్యసనము. శోకములేని వారెవరు? శత్రువుల జయించినవారు. దీని నెవరు గుర్తించిరి? విరాటనగరమున గూఢముగా నున్న పాండవులు. దీనిలో పై యంశము సంగతము కాగలదు.

౨. అ వ ల గి త ము. ప్రశ్నసమాధానముగా నున్న యుత్తర మన్యానుసంధానపూర్వకముగా నున్నను తదన్యకార్యము సిద్ధించునేని యన్యకార్యావలగనమున నది యవలగిత మగును. దీని లక్షణ మిట్లున్నది.

౪౪౬. యత్రాస్యస్మిన్ సమావేశ్య కార్య మన్య త్ప్రసాధ్యతే
తచ్చావలగితం నామ విజ్ఞేయం నాట్యయోక్తృభిః

ప్రకృతకార్యసమావేశమున నన్యకార్యప్రసాధన మున్నచో నవలగిత మగును. నాట్యయోక్త లిట్లు దీని నంగీకరించిరి. రత్నా వలిలో నిది సంగతము. "నీ కండ్ల కానందముగ నున్నదా?" యని విదూషకుడు రాజు నడిగినాడు. "ఆనందముగ నుండకేమి?" అని రాజని సాగరికను తానుచూచినప్పటి విశేషమును వసంతకుని ప్రత్యా యనమునకై నిర్దేశించినను అన్యకార్యసిద్ధియు నిందున్నది. రాజునకు సాగరికయందు దాస్థాబంధజీవిత మున్నది. అదియె శృంగారాఖ్య మయిన ముఖ్యకార్యము. తత్సాధనమిం దవలగ్నమై యున్నది.

౩. అ వ స్పం ది త ము. దైవసముత్థితముగా నేదేని యొక యర్థ మబుద్ధిపూర్వకముగా నాక్షిప్తము కాగా, కౌశలానుసారమున

దాని ప్రచ్ఛాదనమునకై యన్యార్థము నిరూపిత మయినచో నది యవస్పందిత మగును. చక్షుస్పందనాదుల వలె నంతర్గతసూచనీయ మిందు సంభవించును గావున నిది యవస్పందిత మయినది.

౪౪౭. ఆక్షిప్తేఽర్థే తు కస్మింశ్చిత్ శుభాశుభ సముత్థితే
కౌశలా దుచ్యతేఽన్యోఽర్థః తదవస్పందితం భవేత్

శుభాశుభము దైవము. దైవికముగా నొక యర్థ మాక్షిప్త మయినప్పుడు దాని కప్పిపుచ్చెడి యన్యార్థ ముత్తరముగా నవభాసింప జేసినచో నవస్పందిత మగును. వేణీసంహారములో నిది యిట్లున్నది.

సత్పక్షా మధురగిరః ప్రసాధితాశా మదోద్ధతారంభాః
నిపతంతి ధార్తరాష్ట్రాః కాలవశా న్మేదినీ పృష్ఠే

ప్రస్తావనాప్రసక్తిలో ఋతువర్ణనముగా నిది యున్నది. దీని భావ మిట్లుండును. ధార్తరాష్ట్రము లనదగిన హంసవిశేషములు మంచి పక్షములు మధురస్వనములు కలవై దిశల నలంకరించి యుద్ధతసమారంభములు కలవై కాలప్రభావమున భూమిపై ప్రసరించుచున్నవి. ఇట్లిందు ప్రకృతమునకు సంబంధించిన యర్థ మవభాసించుచుండగా నబుద్ధిపూర్వకముగా నర్థాంతరమును ప్రతిభాసించు చున్నది. దైవ వశమున నాయాత మయిన యర్థ మిట్లున్నది. ధృతరాష్ట్రుని యాత్మజు లయిన దుర్యోధనాదులు సత్పక్షమున నమధురవాక్కులతో నున్నారు. ప్రకృష్టముగా దిశల నన్నిటి నాధిసహితములను జేసినారు. మదోద్ధతితో నున్నారు. కాలవశమున భూమిపై పడి పోవుచున్నారు. "ప్రతిహత మమంగలం" అని యిం దుత్తర మున్నది. మఱల నచట సూత్రధారుడు "శరత్సమయవర్ణనముగా ధార్తరాష్ట్రహంసలు నభస్తలమునుండి ప్రసరించుటను వ్యపదేశించితిని. ఇం దమంగల మనుట యేమి? ఇట్లనుటచే నా హృదయము శంకిత మయినట్లయినది" అనుట యంతయు నవస్పందితత్వమునె సూచించు చున్నది.

౮. నా లి క. హాస్యయుక్త మయిన ప్రహేలికావచనము నాలిక యని నాట్యవిదు లనిరి. ప్రహేలిక యనునది పరవితారణ

మొనరించు సమాధానము. అందునసె యది హాస్యయుక్తము కావ లెను. నాలిక సవ్యాజముగా నుండును. "ప్రకర్షేణ హేలికా ప్రహేలికా" ప్రకర్షముగా నర్మాదిక్రీడారూప మయిన పరవంచన మొన రించు రీతి యున్నందున ప్రహేలిక యయినది.

౪౪౭. హాస్యోపగతార్థ ప్రహేలికా నాలికేతి విజ్ఞేయా

అను నాలికాలక్షణములో పై భావము స్పష్టము. రత్నా వలిలో సుసంగతా సాగరికా సంభాషణమున నిది సుసంగతము. సుసంగత:- "నీవెందులకు (ఎవరికొఱకు) వచ్చితివో యది (యాతడు) యిచటనే యుండెను కదా!" సాగరిక:- "సఖి! నేనెవరి కొఱకు వచ్చితినే!" అది యేమమ్మా! చిత్రఫలకమునకై వచ్చితివి" ఈ భంగిగా గర్భగత మయిన వస్తువు సమాచ్ఛాదిత మయినది. సుసం గతావచనములో ప్రతారణము గోచరించుచునె యున్నది.

౫. అసత్ప్రలాపము. విద్వాంసు డొకడు మూర్ఖజనుల సమూహములో నొక వాక్యము పలుకును. ఆ వాక్యము హితకరము ప్రియంకరము నగును. గ్రహించువారు మాత్రము దాని ప్రియవచన మగనె భావింతురు కాని హితవచనముగ భావింపరు. అప్పుడావచన మసత్ప్రలాప మగును. "హితం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్" అనిన విధమున హితప్రియ వచనమె యుక్తము. కేవలహితము కేవల ప్రియ మంతగా రుచిరము కాదు. "హితం మనోహారి చ దుర్లభం వచః" అసాధుభూత వస్తు ప్రలాప ముండుటచే నిది యసత్ప్రలాప మయినది.

౪౪౮. మూర్ఖ జన సన్నికర్షే హితమపి యత్రప్రభాషతే విద్వాన్
న చ గృహ్యతేఽస్య వచనం విజ్ఞేయోఽసత్ప్రలాపోఽసౌ

మూర్ఖజనసన్నికర్షమున విద్వాంసుడు హిత మాభాషించినను ఆతని వచనము నట్లు గ్రహింప నప్పు డది యసత్ప్రలాపము. మూర్ఖు నుద్దేశించిన యుత్తరప్రాయ మయిన విద్వద్వచనము హితరూపముగ నున్నను శబ్దబలమున ప్రియరూపము నగును. కాని మూర్ఖులు దాని ప్రియాంశముననె గుర్తింతురు. హితాంశమున గ్రహింపరు. ఉభ యాంశమున గ్రహించుట యుచితము. తథాభూత భంగీభూత ద్వయా-

శ్రయణము వచనమును సిద్ధాకరించును. వారు కేవలము ప్రియాంశ మునె గుర్తింపగా తాత్కాలికకోపము రక్షితము కాగలదు. యథార్థాభిధాయిత యుండుటచే కాలాంతరసంభావ్యము నగును. ఉదాహరణ మిట్లుండును. వ్యసని రాజపుత్రు డొకడు "కిం సుఖం ?" యని ప్రశ్నింప తత్సమాధానముగా నీ యుత్తరవచన మున్నది. "సర్వవిధముల జూదరి మద్యపాయి యగువాని కర్థ సుఖ సమృద్ధి కరగతముగ నుండును." అను భావముకల;

"సర్వథా యోఽక్షవిజయీ సురాసేవన తత్పరః
తస్యార్థానాం సుఖానాం చ సమృద్ధిః కరగామినీ"
పద్యములో నసత్ప్రలాప మున్నది.

౬. వాక్కేలి. రెండిటి కొక్కటియె ప్రతివచన మున్న వాక్కేలి యగును. రెండనుట అనేకముల కుపలక్షణము. అనేక ప్రశ్నల కొక్కటియె ప్రతివచన ముండుట వాక్కేలి యయినది. కాగా సర్వప్రశ్నోత్తరవర్గ మిందు సూచిత స్వీకృత మగును. లక్షణ వచన మిట్లున్నది.

౪౩౦. ఏక ద్వి ప్రతివచనా వాక్కేలీ స్యాత్ప్రయోగేఽస్మిన్

"ఏకం ద్వయోః ప్రతివచన మస్యాం" నాట్యప్రయోగము నందలి వాక్కేలిలో రెండంశముల కొక ప్రతివచనమె యుండును.

"నదీనాం మేఘవిగమే కా శోభా ప్రతిభాసతే ?
బాహ్యాభ్యంతరా విజేతవ్యాః కే నామ? కృతినారయః"

మేఘాలు పోగా నదుల శోభ యెట్టిది ? కృతి యగువాడు బాహ్యాభ్యంతరముల నెవరి జయింప నలయును ? ఈ రెండు ప్రశ్నల కును ప్రతివచనముగా "అరయః" అని యిందున్నది. అరయ రయము లేక పోవుట యని ప్రథమ ప్రశ్న ప్రతివచనము. అరయ:- శత్రువులు. బాహ్యాంభ్యంతర శత్రువులు జయింప వలసిన వారని ద్వితీయ ప్రతివచనము. ఇది వాక్కేలి.

౭. ప్రపంచము. అసత్యాప్రాయ మయిన పరస్పర వస్తురూప వచనము ప్రపంచము.

౪౩౦. అసద్భూతం వచనం సంస్తవ యుక్తం ద్వయోః పరస్పరం యత్తు
వికస్య చార్థహేతోః స హాస్యజననః ప్రపంచః స్యాత్

ఇద్దరిలో పరస్పర మసత్య ప్రాయ మయిన సంస్తవవచనము ప్రపంచ మగును. ఒకానొక ప్రయోజనమున్నకై యిది యిట్లు ప్రసక్త మగును. ప్రపంచము హాస్యముత్పాదించునదై యుండును. రత్నావలిలో నిట్లున్నది. రాజు: –"సుసంగతా! నే నిచట నున్నానని నీ వెట్లు తెలిసి కొంటివి?" సుసంగత: –"మీరే కాదు. చిత్రఫలకము కూడ తెలిసినది." ఇత్యాది భాషణములలో నాభరణదాన పర్యంతము ప్రపంచ మున్నది. సాగరికాసుసంగతలు రాజవిదూషకులు పరస్పరము సంబంధము కలవారని దేవికి అసత్యము చెప్పి నివేదించుట యున్నది. ఈ ప్రఘట్టముననె సంస్తవ మున్నది. హాస్యమును పరిహాసరూపముగ గలదు. రాజునకు సాగరికాసంగమాత్మక మయిన ప్రయోజనము సిద్ధింప జేయుటలో నిది యుపకరించును.

౮. మృదవము. గుణములకు దోషత్వము దోషములకు గుణత్వము నిరూపించుట మృదవము.

౪౩౧. యత్కారణా ద్గుణానాం దోషీకరణం భవే ద్వివాద కృతం
దోషగుణీకరణం వా తన్మృదవం నామ విజ్ఞేయం

కథాప్రసక్తిలో గలిగిన వివాదము హేతువుగా గుణములకు దోషీకరణము దోషములకు గుణీకరణ ముండుట మృదవ మగును. ఇట్లొకదాని వేరొకదానిగా జేయుట యొకవిధ మయిన స్వభావము. వేణిలో; "ద్రోణుని శిరమును శునకము కాక మేని ద్రుపదతనయుడేని పరామృశింపనీ!" యను ప్రసక్తిలో దోషమును గుణీకరించుట యున్నది. కర్ణుడు వివాద మాకర్ణించిన పిమ్మట ప్రతిజ్ఞాత పరిపాలన మొనరించుట గుణమును దోషీకరించుట యగును. ఇదియు వివాద కృతమె. మృదవ మనునది పరపక్షమర్దనమున స్వపక్షమును రక్షించును. "మర్దనం మృత్ అవతి మృదవం"

౯. అధిబలము:– పరుని వచనము తన వచనమును పరస్పరము అర్థవిశేష లాభమునకై ఉత్తరోత్తర మధికాధికముగా ప్రవృత్త మగుట కధిబల మని పేరు. ఉక్తిప్రత్యుక్తిక్రమ మనుస

రించు నపుడు పరస్పరము ప్రజ్ఞానోపజీవనబలమున స్వపక్షమునందు సుఘటిత మగు నధిబలసంబంధమున నిది యధిబల మయినది.

౪౫౨. పరవచన మాత్మన శ్చోత్తరోత్తర సముద్భవం ద్వయోర్యత్తు
ఆన్యోన్యార్థ విశేషక మధిబల మితి తద్బుధై ర్జేయం

పరాత్మవచనములు పరస్పరవిశేషము ప్రతిపాదించుటకై ఉత్తరోత్తరము లతిశయితము లగునేని యధిబలమని నాట్యబుధు లనిరి. నాగానందములో నిట్లున్నది. జీమూతవాహనుడు, విదూషకుడును సంభాషించునపు డుక్తిక్రమమున జీమూతవాహనుడు స్వపక్షమునకు ద్రఢిమను సంపాదించెను. అందుననె "శరీరమాదిగా సర్వమును పరార్థమునకె ప్రతిపాలించు చున్నాను" అని యాతడనెను.

౧౦. ఛ ల ము. ప్రయోజనాంతరము నుద్దేశించి పలికిన యొకని వచనము ఒకనికి హాస్యమును, వేరొకనికి రోషమును కలుగ జేసినచో 'ఛల' మగును.

౪౫౩. "అన్యార్థమేవ వాక్యం ఛల మభిసంధాన హాస్య రోషకరం"

వాక్య మన్యార్థముగ నున్నను పట్టుదలను హాస్యమును రోషమును కలుగ జేయునేని ఛల మగుచున్నది. "నేను నివారించినను నీవు వింటివి కావు. భ్రమర మున్న పద్మము నాఘ్రాణించితివి. ప్రియురాలి యధరము గంటు కలదయినచో నెవనికి రోషము కలుగదమ్మా! ఇక నంతయు సహింపుము." ఇది యొక సఖివచనము. తన చెలియపై ఆమె భర్తకు విశ్వాస ముత్పాదింప చేయవలెననెడు ప్రయోజనము నుద్దేశించి యిట్లు పలికినది. దీని విని ఆమె పతి "తుమ్మెద వలన నీ గంటయినదిలె" అనుకొనును కాని యన్యథా తలచడు. తన చెలియచెలియలు నిది యొక ఛల మని గుర్తింతురు. విదగ్ధజను లది విని హాసన్ముఖు లగుదురు. సవతి కది చెవిములికియై రోష ముత్పాదించును. ఇట్లన్యాన్యుల కన్యాన్యార్థముల నిది కలుగ జేసినది.

౧౧. త్రి గ త ము. శబ్దసారూప్య బలమున ప్రశ్నప్రతివచన స్వభావములుగా బహుభావములు యుక్తినిరూపితము లయినచో నది త్రిగత మగును. హాస్య మున్నను లేకున్నను త్రిగతము సంగతము.

౪౫౩. శ్రుతిసారూప్యా ద్యస్మిన్ బహవోఽర్థా యుక్తిభి ర్నియుజ్యంతే
యద్ధాస్య మహాస్యం వా తత్త్రిగతం నామ విజ్ఞేయం

శ్రుతిసారూప్యమె శబ్దసారూప్యము. ఇందలి శబ్దములు సమానముగా నున్నందున నానాభావభావనమున కవకాశ మున్నది. యుక్తియోగ మున బహ్వర్థము లచట భాసింప వచ్చును. కాకువు మొదలగు స్వర విశేషము లుపపత్తిరూపముగా సహకరించునవి కాగలవు. త్రిగత శబ్దములోని త్రి శబ్ద మనేకముల కుపలక్షణము. "అనేకం అర్థం గతం త్రిగతం" వాక్యమునందు అనేకప్రశ్నసాధారణముగా ముఖ్య మయిన యుత్తర ముండును. ఇందు ప్రశ్నయె ప్రతివచనముగా నుండును. విక్రమోర్వశీయములో నూర్వశీ వియోగి పురూరవుడు కామావస్థాను భూతి వివశుడై చేతనముల నచేతనముల నూర్వశి నడుగును. అందిది కలదు.

సర్వ క్షితిభృతాం నాథ ! దృష్టా సర్వాంగ సుందరీ
రామా రమ్యా వనాంతేఽస్మిన్ త్వయా విరహితా మయా

"పర్వతప్రభూ! ఈ రమ్యవనాంతములో నన్ను విడచిన నా సర్వాంగసుందరి కనపడెనా!" ఇట్టిది విక్రముని ప్రశ్న. ఆతని గంభీర స్వరోదీరిత మది పర్వత దరీ ప్రసారితమై ప్రతిశ్రుత్క స్వభావమున నట్లె వెలువడినది. దానిని విక్రముడు వినినాడు. తనకు పర్వత ముత్తర మిచ్చినట్లు భావించినాడు. కాన నీ స్వరూపశబ్దమె సాకాంక్ష కాకు ప్రయోగమున గూడ తథాస్థిత మయ్యు నతథాస్థితముగా నున్నది. ప్రతిబింబము లోని వామదక్షిణ వైపరీత్యము వలె నిదియు సంభావనీయము. ఇందలి కాకువు నిరాకాంక్షముగా నున్నది. పర్వతోత్తరముగా నుండు భావ మీ రీతి నుండును. సర్వరాజనాథా! ఈ రమ్యవనాంతములో నీ విరహిత సర్వాంగసుందరిని నేను చూచి తిని." ఇట్లు విక్రముడు భావించి క్షణమాత్రతుష్టుడయినాడు. అనం తర మది తనమాటయె యనుకొని యన్య మనుసరించినాడు. ఇది హాస్యప్రాయార్థమును స్ఫురింప జేయు చున్నది. ఇట్లే హాస్యేతరాంశ మున గూడ నుదాహరించు కొన వచ్చును.

౧౨. వ్యా హా ర ము:- భవిష్యదర్థము ప్రత్యక్షకల్పము కాగా తదనుకూల మయిన వచనవిశేషము వ్యాహార మగును. ఇందు హాస్యలేశ మవభాసించును.

౪౫౪. "ప్రత్యక్షవృత్తిరుక్తో వ్యాహారో హాస్యలేశార్థః"

హాస్యలేశార్థక మయిన ప్రత్యక్షవృత్తి వ్యాహార మగునని సూత్రము. ఇందలి ప్రత్యక్ష శబ్దమున భావిప్రత్యక్షమునే భావింప వలయును. భావిప్రత్యక్షార్థము నందు దైవవశమున వృత్తి యుండు నేని వ్యాహార మగును. వివిధార్థాభినయ మిందుండును. రత్నావళిలో లతాదర్శనమున సాగరికాభావన మొనరించు వత్సరాజభావనము లక్ష్యము కాగలదు.

౧౩. గం డ ము: -తత్త్వజ్ఞు లగువారు గండము నిట్లు నిరూపించిరి. సంభ్రమాత్మక మయిన యాకారమున నొక యావేగము కలుగును. ఆ యావేగ మా గండములో నుండును. వివాదయుక్త మయిన విశేషము నుండును. అపవాదకృతము కూడుకొనును. అసమాప్తవచనములలో నాక్షేపము లుండును. దీని లక్షణ మిట్లున్నది.

౪౫౪. సంరంభ సంభ్రమ యుతం వివాదయుతం తథాపవాద కృతం
బహువచనాక్షేపకృతం గండం ప్రవదన్తి తత్త్వజ్ఞాః.

సంరంభ మనునది యాకృతివిశేషము. దానివలని యావేగములు గండములో నున్నవి. విరుద్ధ మొకడు యాచరించినచో దాని యపవదనమె ముఖ్యముగా తలచినవాని వచనము లుండును. బహువచన మనుట ఈపదసమాప్త వచనము. దాని వలని యాక్షేపము లిచట కలవు. ఈ యసమాప్తవచనము పూర్వవచన ప్రతివచనముగా భాసించును. కోహలుడు నిట్లె సంభావించినాడు. సంబద్ధవచనముల కంతములో సంబంధమె యుండదు. సంబంధ మున్నట్లె గోచరించును. అట్టిది గండము. వేణిలో దుర్యోధనుడు భానుమతి దగ్గరగా నున్నాడు. "నీ జఘన మధిష్ఠించుటకు తగిన నా యూరు" వనునంతలో కంచుకి వచ్చి "భగ్నం భగ్నం" అనినాడు. ఊరురూపార్థము పూర్వవిశ్రాంత మయినను భగ్న పదముతో సంబంధయోగ్య మయినది. ఇట్లే విధముగా వీథి పదమూడంగలతో నున్నది. వీథిలో సర్వ

రసప్రసక్తి యున్నది. పర్యాయమున రసములు ప్రధానములు కావచ్చును. నాయకు డుత్తముడు మధ్యము డధముడు కావచ్చును. కోహాలుడు నిట్లె తలచెను.

అధమప్రకృతి నాయకు డగుటను కొందరు అంగీకరింపరు. అదియె ధ్రువమేని ప్రహసనములో భాణములో వారేమందురో! హాస్యరసము ప్రధానముగా నుండునేని నాయకు డధముడే యగును. నాయకు డన కథాశరీర ఫలముతో ప్రధానముగా సంబంధించు వ్యక్తి అని భావము. అధము డట్లు కథాభాజనుడు కాకున్నను అధమత్వ ముండనే యుండును. అధముడు పరివారరూపముగా ననుప్రవేశము పొందుట యనివారితమె యగుచున్నది.

ఇట్లీవిధముగా లక్షణలక్షితముగ దశరూప విధాన మంతయు నిరూపిత మయినది. లక్షణములు మాత్రమె దశసంఖ్యాకములు. ఉదాహరణముల గణన చేయుట యెట్లు? ఈ రూపకము లన్నియు నెట్లెట్లు పుమర్థోపయోగు లగుచున్నవో నిజ నిజ లక్షణావసరముననే నిరూపిత మయినది. అందుచే పౌనరుక్త్య మాశ్రయించుట లేదు. ఇక దశరూప శరీర గత మయిన సంధి సంధాన విధి విధానములను నిరూపింప వలసి యున్నది.

## దశరూపశరీరము

దశరూపవిధానము పూర్వము లక్షణానుసారమున నిరూపిత మయినది. ఇక దాని శరీర విధాన సంధి విధి లక్షణము ప్రతిజ్ఞాత మయినది. తన్నిరూపణ మవసరప్రాప్తము. దశరూపక శరీర మితి వృత్తాత్మకము. విధాన మనునది స్వరూప రూప ప్రకారాత్మకము. ముఖ ప్రతిముఖాదులు రూపకసంధులు. సంధ్యంగ స్వభావము లన్నియు విధులు. వాని నన్నిటిని లక్షణకథన పురస్సరముగ నిరూపింప వలసి యున్నది. వీనిలో మొదట శరీరమును సలక్షణముగ జెప్ప వలయును. ఈ యుపక్రమము తన్నిరూపణపరము.

## ఇతివృత్తము

౪౫౫. ఇతివృత్తం తు నాట్యస్య శరీరం పరికీర్తితం
పంచభిః సంధిభిః తస్య విభాగః సంప్రకల్పితః

ఇతివృత్తము నాట్యశరీరము. అయిదు సంధు లితివృత్తవిభాగ మాపాదించును. కావ్యమును కావ్యముగా జెప్పుట కుదురదు. కావ్య శరీరాత్మలను జెప్పిన గాని కావ్య మభిధేయము కా జాలదు. అందు వృత్తము మాత్రమె శరీరము. ఆ వృత్తము నటనీయము కాగా నభి నేయరూప మగును. అభినేయతాసిద్ధి వృత్త మందలి యేవంప్రకారత చెప్పును. అప్పుడు వృత్తము తత్సిద్ధిచే నుపస్కృత మగును. కాన నప్పు డా వృత్త మితివృత్త శబ్ద వాచ్య మగును. అట్టి వస్తు వది రూపకశరీరము. రసములు రూపకాత్మ. రసములు శరీరావిర్భావ కములు. శరీరప్రతిపాదకము లగు శబ్దములు వాగాత్మకములై యితి వృత్తార్థముతోడ సమాన యోగ క్షేమములు కల వగును. ఇట్లగు టలో షట్ప్రజ్ఞావిలాసులు కారణషట్క మభిధానింతురు.

౧. వాగారంభము లయిన శబ్దములు రూపకము నందలి యితివృత్తార్థ మును నిర్మాణించి నిరూపింప గలవు. వాక్కు నాట్యతను వనిచి. వాగ్రూపమునసె వృత్తనిర్మాణ మున్నది.

౨. వాక్కు వృత్తార్థతాదాత్మ్యము పొందును. వాగధీనముగా నితి వృత్తము నిష్పన్నము కాగా తదర్థతాదాత్మ్యమునసె వాగాత్మక శబ్దము లవభాసించును.

3. అర్థరూపతాధ్యాసము మూడవది. వాగాత్మకములు వేరుగా గోచరింపవు. కేవల మితివృత్తార్థరూపమునసె గోచరించును. ధర్మములందు భేదము లేకపోవుటయె కాక ధర్మ్యంశము లందును భేదభాన ముండదు.

౪. అర్థైకజ్ఞాన నివేశము నాల్గవది. తదర్థమును గుర్తించు జ్ఞానమునసె వాక్సంపత్తి యనుప్రవిష్ట మగును. శబ్ద మితివృత్తమును నిష్పా దించి దాని జ్ఞానమునసె స్వాత్మను సంక్రమింప జేయును. దాని ప్రవృత్తి కేవలము తదర్థమె యగుట నది యందే చేరును.

౫. అర్థోపరంజకత్వ మయిదవది. నిష్పన్నార్థమున కుపరంజన మన్నది శోభ. అది గీతక్రమాదులచే గల్గును. వాగాత్మకశబ్దము గీతిధర్మ మిచ్చి వృత్తార్థమున కుపరంజన మాపాదించుట యున్నది.

వస్తువృత్తమున రూపరంజన మిచ్చియు వాక్కు పరంజకము కాగలదు.

౬. వాక్యార్థనిమిత్త మయినది. అర్థము నిష్పాదించి స్వరూపవైభవము నిలబెట్టు కొనుచున్నది. స్వారాధనమును స్పష్టము చేయుచున్నది. ఇది యంతయు వాగాత్మశబ్దవిలాసము.

ఇట్లెన్నివితముల గాని వాగాత్మకము లయిన శబ్దములు రూపకేతివృత్తార్థమున నేక యోగక్షేమమున నుండి యుపాదేయతను నిరూపించు చున్నవి. కావుననె "వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషా తనూః స్మృతా." నాట్యమునకు వాక్కు తనువు. వాక్కునందు సావధానముగ యత్న మాధానింప వలెనని పూర్వమె చెప్పితిమి. పూర్వము నాట్యతనువు వాక్కని యనుట, యిచట వృత్తము నాట్యశరీర మనుట యేమియు విరుద్ధము కాదు. ఈ యితివృత్తాత్మక మగు నాట్యశరీరము ప్రకారవైచిత్ర్యమున శోభించును. పంచసంధులచేనా వైచిత్ర్యము కలుగును. సంధు లన్నియు ప్రకార వైచిత్ర్య కల్పనామయములు. కావ్యశరీరములో స్వసామర్థ్యనియతిచే భిన్న భిన్నము లయిన విచిత్రతా ప్రకారములను నిర్మించి తత్కల్పనాసారముగా సంధులు సాక్షాత్కరించును. సంధు లయి దనుట పరంపరా ప్రాప్త మయిన సంప్రదాయమును కథాపారమ్య పరత్వమును విశదము చేయును. పంచసంధు లుండుట వైచిత్ర్యము. అయి దవశ్యముగా నుండవలె నని యాదేశము కాదు. కొన్ని సంధులు తగ్గిన నేమియు హాని లేదు. కొన్ని రూపకములు హీనసంధికము లున్నవి. వాని స్వరూపగౌరవము సుస్థముగనె యున్నది. కొందర రంతట పంచసంధు లుండవలెనని పట్టు పట్టుదురు. ఒకానొక సంధి సంపూర్ణముగా నన్ని సంధ్యంగములు కలది కా సందున నది హీనసంధి యగుటయే కాని మొత్త మన్ని సంధు లుండవలె నందురు. ఒకసంధి వైచిత్ర్యవశమున సంపూర్ణముగా సంధ్యంగకృత శోభ కలది కా వచ్చును. మఱి యొకటి కతిపయసంధ్యంగములతోడనె యుండ వచ్చును. హీనసంధి యయినను పూర్ణసంధి యయినను సంధిసంధాన మావశ్యక మని వారి భావము. ఈ యంశము నంతటిని స్వస్థానమున విస్తరించెదము. ఇతి

వృత్త శబ్దమున "ఇతి—వృత్త" శబ్దద్వయ మున్నది. అందు "ఇతి" శబ్దార్థము ప్రసిద్ధము కాదు. కావుననె పంచసంధులతో శరీరవిభాగ ముండుట వ్యాఖ్యాత మయినది. అంతియె కాని పంచసంధు లనుట సంధినిరూపణపరము కాదు. ఇట్టిది శరీరము. ఇక నిది విధాన శబ్దోప దిష్ట మయిన ప్రకారవైచిత్ర్యము.

## వస్తువిభాగము

౪౫౬. ఇతివృత్తం ద్విధా చైవ బుధస్తు పరికల్పయేత్
ఆధికారికమేకం స్యాత్ ప్రాసంగికమథాపరం

వివేచకపండితు డితివృత్తమును రెండు విధముల ప్రకల్పింప వలెను. ఆధికారిక మొకటి. ప్రాసంగిక మపరము. కావ్యబంధ గత మయిన యితివృత్త మున్న దున్నట్లే యుండగా వివేచకు డయిన బుధకవి ద్విధా పరికల్పనము చేసి కొనవలయును. "ద్విధా చైవ" యని శ్లోకమున 'చ' కారమున్నది. 'చ' కార మొక భావసూచ కము. పూర్వమె స్థితసిద్ధ మయిన యితివృత్తమును సామాన్యముగా రూపకము లందు రెండువిధముల భాగభావనము చేయునది. కల్ప నాత్మక మయిన వృత్తము కల ప్రకరణ మను రూపకము న౦ దితి వృత్తమును ఈ రెండు విధముల ప్రకల్పన మొనర్చుటయు సమ్మతము. భాగద్వయమున నేక మపర మను ప్రసంఖ్యానమును సాభిప్రాయము. నైసర్గికముగా నే యితివృత్తమును ఆధికారిక మని గాని యన్య మని గాని సంకేతము కలది కాదు. కవి ధీశక్తి కథాశరీరము నాధికారికము చేయగా నందలి భాగ మొకటి ప్రాసంగిక మగును. కథారాశి యొకటి. దానినె కవి ద్విధాకరించును. ఇతివృత్త మొకటి ద్విశాఖ మని భావము, ఈ ప్రకారద్వయము వైచిత్ర్య సముపేతము. తన్నిద ర్శన మిక సాగును.

## ఆధికారికము

౪౫౭. యత్కార్యం హి ఫలప్రాప్త్యై సామర్థ్యాత్పరికల్ప్యతే
తదాధికారికం జ్ఞేయం అన్యత్ప్రాసంగికం విదుః

రూపకకావ్యమున ప్రధానముగా నొక ఫలమును సంపాదింప వలెను. ఆ సంపాద్యఫలమున నొక యారంభ మున్నది. అది జ్ఞానేచ్ఛా

ప్రయత్న క్రియారూపము. ఏ ప్రయత్నమున నయినను జ్ఞానేచ్ఛా
క్రియ లుండును. జ్ఞానపూర్వక మయిన యిచ్ఛ, తత్పూర్వక మయిన
యత్న మారంభమున సుసంగతము లయి యుండును. ఇట్టి యారంభ
మునె రూపకకావ్యమున "ఆరంభము" "కార్యము" అందురు.
సామర్థ్యయోగమున ముఖ్యఫలప్రాప్తిచే పరికల్పిత మగు ఆరంభ
మాధికారిక మయిన యితివృత్తము. ఆధికారికము నిట్లు తెలియ
వలయును. అంతట ననుగతమై యుండుట, హృదయానుయాయి
యగుట దీని ప్రయోజనము. ఆధికారికేతర మగు వృత్తము ప్రాసం
గికము. ప్రాసంగిక మందును సర్వత్రానుయాయిత హృదయాను
యాయిత యంతర్లీనమై యుండును. అప్పునితో కార్యపర్యాలోచ
నము, సాధించి తీరవలయు ననెడి యుత్కంఠేచ్ఛ, ఫల మాహరింప
వలెననెడు కాంక్ష యుండును. ఆధికారిక కథావృత్తములో నివి
యుండగా వీని నిష్పత్తిలో శక్త్యంతరములను వ్యాపారింప వలసిన
యావశ్యకత లేదు. ముఖ్యప్రయోజనానుకూల మగు సామర్థ్యమె
వీని నిష్పత్తిసాధనము. ఇట్లె ప్రాసంగికేతివృత్తమున గూడ శక్త్యం
తరవ్యాపార మేమియు నుండదు. ప్రాసంగికమున గూడ వేరుగా
శక్త్యంతరమును వ్యాపారించినచో నదియు నాధికారికమె కావలసి
వచ్చును. ఆదికవి వాల్మీకి కావ్యమున దీనిని సమన్వయించి భావింప
గలము. శ్రీ లంక నుండి శ్రీ సీతను మరల దెచ్చుట ప్రధానఫల
ముగా వివక్షితము. కాగా నిం దవాంతరఘటితము లనేకము లున్నవి.
ప్రతిజ్ఞా నిర్వహణము, జగత్కంటక రావణోద్ధరణము, శరణాగత
విభీషణ రక్షణము మొదలగునవి యందు గలవు. ఇవి యన్నియు
శక్త్యంతర వ్యాపారసాధ్యములు కావు. సీతా ప్రత్యానయమునకై
వ్యాపృత మగు శక్తిప్రసారమె వీని నన్నిటి సాధింప గలదు. కార్య
సాధనమునకు సామాదు లుండ వలెను గదా! తదుపయోగ
సామాద్యుపాయచతుష్టయములో నొక్కొకచో ద్వికము త్రిక మపేక్షి
తము. సామదానము లున్న నొకభేదము. సామదానభేదము లున్న
వేరొక భేదము. ఇట్టి భేద సంపాదనమున నపరిహార్యము లగు విశేష
ములచే నవి సముపనీతము లగునె కాని పృథగ్యత్న మపేక్షితము
కాదు. తాపసవత్సరాజమున నిది భావింపుడు. దానిలో వత్సరాజు

నకు రాజ్యము మరల లభించుట ప్రధానఫలము. వాసవదత్తాసంబంధము పద్మావతీప్రాప్తియు నందు వర్ణిత మయినది. వీనిలో క్రియాంతరోపయోగ మే మాత్రము లేదు. ఇట్లై తత్సమన్వయమును భావింపవలెను. పద్మావతిని పరిణయ మాడుట వాసవదత్తాప్రాప్తిలో నుపాయమె యయినది. పద్మావతీపరిణయము తదుపాయము కాక పోయినచో వత్సరాజునకు పద్మావతీ పరిణయమున ప్రవృత్తియే కలుగదు. పద్మావతీ స్వీకారమున వత్సరాజ ప్రవృత్తి లే కున్న ప్రధానఫలమెట్లు కలుగును ? సర్వప్రాసంగిక మేకరూపమె యగును. "ప్రసక్తిర్హి ప్రసంగః తత ఆగతం ప్రాసంగికం. ప్రసజ్యతే వా ప్రధానఫలనిష్పత్తయే ఇతి ప్రసంగః తత ఆగతమితి" ప్రసక్తికి ప్రసంగ మని పేరు. ప్రసంగమున సంప్రాప్త మగునది ప్రాసంగిక మగునని యొక యుత్పత్తి కలదు. మరియొకటియు గలదు. ప్రధాన ఫల నిష్పత్తికై ప్రసక్త మగుటను ప్రసంగ మన వచ్చును. తత్ప్రసంగ సమాయాతము ప్రాసంగికము. కొందరొకటి యనిరి. ప్రాసంగికము లం దన్నిట శక్త్యంతరయోగ ముండదనుట సరి కాదు. కొన్ని ప్రాసంగికములలో శక్త్యంతరయోగ మున్నది. ఆధికారికమున కయిన వ్యాపారము కన్న వేరొక వ్యాపారము ప్రాసంగికనిష్పత్తి కావశ్యకము. కాగా శక్త్యంతరయోగము కల ప్రాసంగికములు కొన్ని యున్నవి. శక్త్యంతరయోగము లేని ప్రాసంగికములును కొన్ని యున్నవి. ఇట్లు యోగాయోగములచే ప్రాసంగిక మనేకవిధము లగునని యా కొందరి భావము. ఈ భావము నభినవుల యుపాధ్యాయులు శ్రీభట్టతోతు లంగీకరింపరు. భట్టతోత భావమునకు భరతవచనము మూలము. ఇది భరత నిరుక్తి.

## ప్రాసంగికము

> ౪౫౮. కారణా త్ఫలయోగస్య వృత్తం స్యాదాధికారికం
> తస్యోపకరణార్థం తు కీర్త్యతే హ్యానుషంగికం.

కావ్యమున ఫలసిద్ధి కలుగుటలో కారణ మయిన కథావృత్త మాధికారిక మగును. ఆనుషంగిక మను పేరు పడిన ప్రాసంగికము ఆధికారికేతివృత్తమున కుపకరణార్థమై యుండుట నందరు కీర్తింతురు.

కవి నిరూపించు కథావస్తువు వర్ణనోపాయ మారోహించి ఫలసంబంధ మాపాదించును. ఫలసంబంధము కూర్చుటలో దాని కట్టి సమర్థాచరణ మున్నది. కాన నట్టి దాని నాధికారిక మని వ్యపదేశించిరి. కావ్యము నం దిట్టి ఫలయోగ మాపాదించు నితివృత్తాంతర ముండదు. దీని యుపకరణార్థమై యానుషంగిక ముండును. అది యానుషంగిక మయినను ప్రధానోపకరణార్థ మగుటచే ప్రశంసాస్పదమై కీర్తిత మగును. ఫలప్రాప్తిరూప మగు ప్రయోజనమున నాధికారికము సప్రయోజన మగుట తల్లక్షణముగా జెప్పి నట్లయినది. ఫలప్రాప్తి ప్రాసంగికమున గూడ గలదు. ఆధికారికము ప్రాసంగికమె యగునా ? అది యెట్లును కాదు. ప్రాసంగికమున కాధికారికమున కన్న భేద మెట్లు సిద్ధ మయినది ? దానిచే దీని తెలియుట, దీనిచే దాని తెలియుట లంగీకరించిన అన్యోన్యాశ్రయ దోషము వాటిల్లును. కావున ఫలప్రాప్తి స్వరూపమునె విశేషించి నిరూపించుట యావశ్యక మగుచున్నది.

## ఫలప్రాప్తి

౪౫౯. కవేః ప్రయత్నాత్ నేతౄణాం యుక్తానాం విధ్యపాశ్రయాత్
కల్ప్యతే హి ఫలప్రాప్తిః సముత్కర్షాత్ ఫలస్య చ

విధ్యపాశ్రయము కల కావ్యనాయకుల ఫలోత్కర్షము వలని కవిప్రయత్నము సముత్కర్ష ననుసరించు ఫలప్రాప్తి యని ప్రకల్పిత మగుచున్న దని దీని భావసారము. కవి ప్రయత్నమున యుక్తనాయకుల విధ్యపాశ్రయమున ఫలసముత్కర్షమున ఫలప్రాప్తి నిశ్చిత మగును. ప్రాధాన్యము నవలంబించి ఫలప్రాప్తి నిర్ణీత మగును. కావున ఆధికారికము ప్రధాన ఫలప్రాప్తి ప్రయోజన మని సారాంశము. ఫలప్రాప్తి ప్రాధాన్యమున నాధికారికమును నిర్ణయించుటలో వీని గుర్తింప వలెను. కవి కావ్యమున నొక ఫలమును సముత్కర్షసమేత మగునట్లు వివక్షించును, అదియె ప్రధానఫలము. ఇందు కవిపురుషుని యిచ్ఛ యనియంత్రితము కాదు. అది యొకవిధమున నియంత్రణము పొందును. ధీరోదాత్తాది భేదమున నుండు నాయకులలో నొకడు యుక్తత కల వా డగును. అట్టి వాడె యచట సముచితుడు. ఆతని విధి యంతయు కావ్యమున సంపాద్యవస్తువు. తదపాశ్రయ

ప్రయత్నమున కవి ఫలము ప్రధాన మగును. ఏ విధిలో నే నాయ కుడు యుక్తసముచితు డగునో యాతనికి "నే నిది యొనర్ప వలె" ననెడి యభిసంధానము లే కున్నను, ఆతని కర్తవ్యమున ఫల నిరూ పణ మావశ్యక మగుచున్నది. తాపసవత్సరాజ నాటకమున వత్స రాజునకు వర్ణిత మయిన రాజ్యప్రత్యాపత్తి యిట్టిది. రాజ్యప్రత్యా పత్తి వత్సరాజున కభిలషిత సంపత్తిగా లేదు. వత్సరాజామాత్యులె కర్తవ్య మం దభిసంధానముః కలిగి యున్నారు. అయిన నాతడు ఫలభాజను డగు నాయకు డయినాడు. అమాత్యులు సంపాదించిన యభిసంధి ప్రత్యుపాయ పరంపరలు వత్సరాజునకు ఫల మార్జించి పెట్టినవి. కావున సముచిత నాయకుల సంపాద్య వస్తుప్రయత్నము కవిపురుషేచ్ఛను నియంత్రణ మొనర్చు నన వచ్చును. రామాయణ ములో రాముని విషయమున నొక విశేష మున్నది. అందు రాము నకు స్వదారప్రత్యానయన, కంటకోద్ధరణ, భీతాభయవితరణాదులలో నంతట కర్తవ్యతౌచిత్య మున్నది. వత్సరాజున కట్లు లేదు. అయిన నాతనికి రాజ్యప్రత్యానయన ఫలము నిరూపిత మయినది. రామా దుల వైశిష్ట్యానుసారమున నొక వ్యవస్థితలక్షణ ముచితము. అదియె ఫలసముత్కర్ష, రామాది సముచిత నాయక సముత్కర్షమున ఫల సముత్కర్షమున ఫలప్రాప్తి కల్పిత మగును. ఇం దిది నిశ్చితార్థము. కావ్యఫలము స్వాంశమున సమధికోత్కర్ష మవలంబించును. అందే తదౌచిత్యమును కవి కల్పింప వలసి యున్నది. రామాయణమున రావణసంహార మవధిగా సీతాప్రత్యాయనమె సముత్కృష్ట మయి నది. సీతాప్రత్యానయన సంపాదనమునకె యితరము లన్నియు ప్రవ ర్తించినవి. వత్సరాజు సచివాయత్తసిద్ధి యగుటచే యౌగంధరాయ ణాద్యమాత్యు లంతటి వా రయినారు. అందు వారి యభిసంహిత రాజ్యప్రాప్తి ఫలము సముత్కర్ష కల దయినది. అప్పుడు వత్సరా జిట్లుభావించును. "వీరాపాదించిన రాజ్యభారచింత యంతయు నేను తెచ్చిపెట్టు కొనినదే" యని. ఇట్లాచింత యధికాధికముగ హృద యమున విపరివర్తమానమై నాయకునకు సముచిత ఫలసంధాన మొన రించును. ఇట్టి సంధానము కవియత్నమున వివక్షితము కాగా నదియె ముఖ్యసంపాద్యమై ప్రధానఫల మగుచున్నది. ఇట్టి విధమున

పర్యాలోచనము చేయగా కవి వివక్ష యంతట పరమావశ్యకముగ భాసించును. కావుననె విధ్యపాశ్రయ ముండ వలె ననుట. "విధీయతే ఇతి విధిః వ్యుత్పత్తిః" విధి యనుట వ్యుత్పత్తి యని భావము. కావ్యమున నే పురుషార్థవ్యుత్పత్తి నిరూపింప వలసి యున్నదో యా పురుషార్థవ్యుత్పత్తికి తగిన యోగ్యనాయకుని గ్రహించి కవి ప్రవర్తించినచో కవి స్వేచ్ఛగా ప్రవర్తించినట్లు కాదు. కావున నిది సూచిత మయినది. విధ్యపాశ్రయాద్యుక్తు లయిన నాయకుల ఫలోత్కర్ష మను ననుసరించి కవి ప్రయత్న ముండుట యావశ్యకము. అప్పుడు ఫలప్రాప్తి సముత్కర్ష నవలంబించినదై శోభించును. ఆధికారికము స్వప్రయోజన మగుటలో ఫలప్రాప్తి నిర్వచనము నీ విధముగా విశిష్య గుర్తించుట యుక్తము.

౪౬౦. సంసాధ్యే ఫలయోగే తు వ్యాపారః సాధకస్య యః
తస్యానుపూర్వ్యా విజ్ఞేయాః పంచావస్థాః ప్రయోక్తృభిః

కవి ప్రయత్నమున ఫలయోగమును చక్కగా సాధింప వలసి యున్నది. ఫలయోగము సంసాధ్యమై యుండగా నొక వ్యాపారపరిస్పందము వాఙ్మనసగతమై యుండును. ఆ పరిస్పందమున గొన్ని యవస్థలు గలవు. అవి యయిదు. ఈ పంచావస్థలను నాట్యప్రయోక్తలు సావధానముగా నానుపూర్వీక్రమమున గుర్తింప వలెను. ప్రారంభము, ప్రయత్నము, ప్రాప్తిసంభవము, నియతఫలప్రాప్తి, ఫలయోగము నని వరుసగా నా యవస్థ లున్నవి. వీని నుద్దేశక్రమముననె కవులు నిబంధింప వలెను. అంత మాత్రమె కాక నాట్యప్రయోక్తలును సావధానముగా గుర్తింప వలెను. కవి యా యవస్థలు నిబంధనీయము లని భావించి నిబంధింప వలెను. ప్రారంభాదులందు క్రమ మవశ్యంభావి. వరుసగా వాని యన్నిటి నిబంధనము పరమావశ్యకము. ఏదేని విధమున దృశ్యధర్మ మాపాదించుట యుక్తము కాదు. అవస్థాంతరము లన్నియు సంగతములై సంభవించుట లేదని ప్రారంభమె ప్రపంచించుటయు సముచితము కాదు. ప్రారంభ సంభావనము చేయు నాట్యప్రయోక్త (కవి) యుత్తరోత్తరావస్థా ప్రసర మొనర్ప గలడు. సంభార సమారంభముతో నుండు ప్రారంభ మన్యావస్థల ప్రసర మిచ్చును. ప్రారంభము ప్రధా

మము. ఫలయోగము పంచమము. వివక్షితక్రమమును విస్మరింప రాదు. వీని నిక క్రమమున ప్రదర్శించుట సముచితము. వీని లక్షణ మిట్లున్నది.

## పంచావస్థలు

४६౧. ఔత్సుక్యమాత్రబంధస్తు యద్బీజస్య నిబధ్యతే
మహతః ఫలయోగస్య స ఫలారంభ ఇష్యతే
४६౨. అపశ్యతః ఫలప్రాప్తిం వ్యాపారో యః ఫలం ప్రతి
పరం చౌత్సుక్యగమనం స ప్రయత్నః ప్రకీర్తితః
४६3. ఈషత్ప్రాప్తిర్యదా కాచిత్ ఫలస్య పరికల్ప్యతే
భావమాత్రేణ తం ప్రాహుర్విధిజ్ఞాః ప్రాప్తిసంభవం
४६४. నియతాం తు ఫలప్రాప్తిం యదా భావేన పశ్యతి
నియతాం తాం ఫలప్రాప్తిం సుగుణాం పరిచక్షతే
४६५. అభిప్రేతం సమగ్రం చ ప్రతిరూపం క్రియాఫలం
ఇతివృత్తే భవేద్యస్మిన్ ఫలయోగః ప్రకీర్తితః
४६६. సర్వస్యైవ హి కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః
ఏతాస్త్వనుక్రమేణైవ పంచావస్థా భవంతి హి

ఈ శ్లోకములు క్రమముగా నారంభాదుల లక్షణము నిరూపించు చున్నవి.

౧. ఆరంభము. ప్రధానఫలయోగమునకు సంబంధించిన రూపకబీజార్థమునకు ఔత్సుక్యమాత్ర బంధమును ఫలారంభ మందురు. ఫలారంభమె యారంభము. రూపకమున కవిప్రయోక్త వివక్షించు ఫలయోగము గొప్పదిగా మహత్తరముగా నుండ వలెను. అదియె ప్రధానముగ నుండ వలెను. అది రూపకమున సంయుజ్యమానమై తత్తన్నాయకులకు సముచిత మగును. అట్లు యుజ్యమానఫలమునకు తగిన యుపాయసంపత్తి బీజము. ఆ యుపాయసంపద యొక్క యౌత్సుక్యమాత్రము నిబంధించుట చాలును. అదియె యారంభము నిర్దేశించును. ఈ యౌత్సుక్య మనునది తద్విషయ స్మరణోత్కంఠ కనురూపముగ నుండును. "ఈ యుపాయమున నిది సిద్ధించు" నని రూపకపాత్ర సంభావించును. ఆ యౌత్సుక్యబంధ మనునది హృదయ

మందు నిరూఢి. అదియె ప్రారంభము. ఈ ప్రారంభావస్థ రూపక నిర్మాణ నియతి ననుసరించి నాయకున కుండ వచ్చును. అమాత్యున కుండ వచ్చును. నాయిక కుండ వచ్చును. ప్రతినాయకున కుండ వచ్చును. దైవసాధిత మయిన యుపాయ మున్న రూపకమున నిది దైవమునకె నిరూపితమై యుండ వచ్చును. ఇట్టి హృదయనిరూఢి రూప మయిన ప్రారంభము వారి వారి యం దా యా విధమున వ్యవస్థితమై యవభాసించు చున్నది. అభిమత ప్రాప్త్యాదికము దైవ సాధ్యాత్మకముగ నున్న రూపకము లందు పురుషకారము దైవసాహాయ్యము కలదై గోచరించును. ప్రయత్న బహుమానమును గోచరించును. తద్వ్యాప్తి లాభమునకై దేవకృతి ఫలవృత్తిగా భాసించును. రచయిత లట్లే వీని ప్రదర్శించు చున్నారు. ఫలలాభమున కౌత్సుక్యమాత్ర మారంభ మని తాత్పర్యము.

౨. ప్ర య త్న ము. ఫలప్రాప్తి కన్పడ నప్పుడు ఫల ముద్దేశించిన యౌత్సుక్యసహిత వ్యాపారము ప్రయత్న మగును. ఫల యోగమున కనుకూలము లయిన యుపాయము లంతగా భాసింప నందున ఫలానుసంధాత తదుపాయ వ్యతిరేకమున ఫలప్రాప్తిని పరిశీలింప జాలడు. ఫలదర్శన మసంభావిత మనియె యాతడు తలచును. ఇక నాతడు వివేచన మొనరింప యత్నించును. అప్పు డాతనిలో ఫలోద్దేశమున నొక వ్యాపారము కలుగును. ఆ వ్యాపార ముపాయవిషయమున పరమౌత్సుక్యస్వభావముగ నుండును. "ఈ యుపాయము లే కున్న నీ ఫలము సంభవింపదు. కావున నీ యుపాయము నవశ్య మన్వేషింప వలెను." అని యుపాయవిషయ స్మరణేచ్ఛా సంతాన స్వభావముగా నొక ప్రయత్న మాతనిలో నుదయించును. అదియె ప్రయత్న మను ద్వితీయావస్థ.

3. ప్రా ప్తి సం భ వ ము. ఉపాయమాత్రమున ఫలమున నొక ఈషత్ప్రాప్తి యున్నచో నది ప్రాప్తిసంభవ మని విధిజ్ఞు లందురు. భావమాత్రమున నీషత్ప్రాప్తికల్గుట శ్లోకమున నున్నది. "భవత్యస్మాదితి భావః ఉపాయః" భావ మనునది యుపాయము. భావమాత్ర మని యనుటలో నిది భావము. ఉపాయమునకు సహకార్యంతర

యోగము ప్రతిబంధక వారణమును మాత్రపదమున నిశ్చిత మగును. దీని భావ మిది. లభించిన యుపాయమాత్రమున నెప్పుడేని యొక విశిష్ట ఫలప్రాప్తి కొంతగా సంక్లిష్ట మయినచో నది ప్రాప్తిసంభవ మగును. విశిష్ట ఫలప్రాప్తి సంభావనామాత్రమున స్థాపిత మగుటయె కాని నిశ్చిత మగుట కాదు. ఈ ప్రాప్తిసంభవము నందు సంభావనా యోగ్యత్వము అసంభావనావిశిష్టత్వము రెండు నుండును. ఇది ఫలానుసంధాత యొక్క తృతీయావస్థ. ఉపాయాపాయ శంకా సంకుల మయిన ప్రాప్త్యాశ ప్రాప్తిసంభవ మని భావము.

४. నియతఫలప్రాప్తి. ఉపాయసంపత్తిచే ఫలప్రాప్తి నియతముగ గల్గుట భావించి నప్పుడు నియతఫలప్రాప్తి యనవచ్చును. ఫలప్రాప్తి ప్రకర్షముగ నిం దుండును. ఇందు సహకారివర్గ మంతయు ప్రతిబంధక విధ్వంసన మొనర్చి సామగ్రీరూపమున నుండును. అప్పు డా సామగ్రిని ఫలానుసంధాత ముఖ్యోపాయమున నియంత్రితముగ దర్శించును. ఫలావ్యభిచరితముగ సాక్షాత్కరింప జేసికొనును. కాగా నప్పటి యవస్థ నియతఫలప్రాప్తి యను పేర ప్రసిద్ధ మగును. ఇట్టి యీ నియతాప్తి సగుణ మని బహుజ్ఞు లనిరి. సగుణ మనుట యిది గౌణి యవస్థ యని భావము. ఈ నియతాప్తి కర్తృనిష్ఠముగా నుండదు. ఇది యుపచరితమయిన సంభావనాత్మకావస్థ. నియత ఫలప్రాప్తి శబ్దము నియతఫల కర్తృవిషయమె. కావుననె ఫలాను సంధాత దాని నట్లు దర్శించుటయె యిందు ముఖ్యముగ నిర్దిష్ట మయి నది. అభావనియత మయిన నియతాప్తి యని కొంద రిచటి యర్థ మన్యథా పలుకుదురు. వారి భావమున ఫలప్రాప్తి సందేహామయ ముగా నుండునని తాత్పర్యము. నియత మయిన ఫలప్రాప్తి సందిగ్ధ మని యనుట విరుద్ధముగా నున్నది. ఇది యెట్లు సంగత మగునని వారల నడుగ వలసి యున్నది.

౫. ఫలయోగము. అభిప్రేత మయిన సమగ్ర క్రియా ఫలము కథావృత్తమున ప్రతిరూపముగ సంభవించినచో ఫలయోగ మని ప్రకీర్తిత మయినది. కర్త్రవస్థాస్వరూప మయిన యితివృత్తమున నాయకాభిమతఫల ముండును. అది యనుచితము కాక సముచితముగ

నుండును. అది కేవలము నాయకునకె సముచిత మగుట కాదు. ప్రతిరూప ముచితమై యుండును. అది సంభవపూర్ణమై యుండు. క్రియాఫలము. నాయకు డనుసంధానించు క్రియల కిది సమనంతర ఫలముగ నుండును. విధిఫల మగు స్వర్గాదికము వలె నిది కాలాంతర మపేక్షించు నదిగా నుండదు. సమనంతరఫలముగ నుండును. ఈ నాయకుని యవస్థయె ఫలయోగము. ఫల ముత్పన్నమగుట. నాయకావస్థ ఫలయోగ మని యనుటలో నీ భావ మున్నది. ప్రారంభము నుండి సచివాదుల యమాత్యాదుల యవస్థలు వర్ణితము లయినను అవి యన్నియు నాయకుని పొందు నవియె యగును. కావుననె నాటకము లందు స్వరవిధము లయిన నాయకావస్థలను సాక్షాత్తుగా నిబంధించుట యావశ్యకము కాదు. సచివాదిగతముగా ఫలయోగ మున్నను అది నాయకగతమె యగు ననుట యభీష్టము. సచివాది గతము లయిన యవస్థాంతరములు కూడ నాయకవిషయముననె పర్య సానము పొందుటను నాటకకారులు నిరూపించియె యున్నారు. మే మిచట ప్రతిపాదించిన భావమె సముచ్ఛ్రితమై రూపకములందు గోచరించు చున్నది.

మానుషవ్యాపారము ముఖ్యముగా నున్నపు డీ యవస్థ లన్నియు నాయకునకు గాని తత్సచివాదులకు గాని కలుగ వచ్చును. అసదుపాయాపేక్షతో నుండుటచే ప్రతినాయకు నందు నివి యుండ వచ్చును. కొన్ని కొన్ని స్థలము లందు ఫలము దైవాయత్తముగా వర్ణిత మగుట యున్నది. అట్టి పట్టులలో నీ యవస్థ లెవరి యం దనుగతములై యుండు నననది పరిశీలింప వలసి యున్నది. పురుష కారమును మాత్రముని యభిమానించి దైవ మవజ్ఞ చేయు స్వభా వము కల చార్వాకాదుల మతముల నభిమానించు వారి విశేషవృత్త ములు వర్ణనాస్పదములు కా రాదు. దైవ బహుమాన వ్యుత్పత్తిని సంపాదించుటకై పురుష కారము నఫలముగా వర్ణింప వచ్చును. పురుష కారము లే కున్నను, దైవమును సఫలముగా వర్ణించి ప్రదర్శించుట సముచితము. ఒకప్పుడు దైవరహిత మయిన పురుషకారము సఫల ముగా వర్ణిత మగుటయు నున్నది. కావుననె దరిద్రచారుదత్తాది

రూపకములు కొన్ని తద్విషయములుగా నున్నవి. కావున రూపకేతి వృత్తము దైవాయత్తముగా నున్నప్పు డీ యవస్థా పంచక మెట్లు సంగత మగును? ఇట్టి యీ యాశంకను పరిహరించుట కీ యంశ మావశ్యక మగుచున్నది.

౪౮౭. సర్వస్యైవ హి కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః
ఏతా స్త్వనుక్రమేణైవ పంచావస్థా భవంతి హి

ఫలార్థులు రూపకము లం దారంభించిన యే కార్యమున కయిన ననుక్రమమున నీ పంచావస్థలు సంభవించును. దైవసంభూత కార్యమున కయిన నీ యవస్థ లుండును. దైవాయత్తముగా నుండు విషయమున నాయకుడు యతింపక పో వచ్చును. అయిన నచట ఫల ముండును గావున అవశ్య మవస్థాదు లుండ వలెను. ఆ ఫలమున నాయకు డర్థి యగును. ఆ ఫల మాత డందుకొనును. దాని ననుస రించిన ప్రవర్తన ముండి తీరును. నాయకుడు సేవాది నానోపాయా రంభములు లేకపోయినను ఆనంద సంపాదన హృదయుడై యగును. కాకున్న పరతఃప్రాప్త మయినను ఫలము సంగీకరింపక పో వచ్చును. అసంగీకరణమున గూడ నాయకునకు ఫలార్థిత్వ ముండును. అధిక ఫలాంతర సంతోష మేదియో యాతనిలో మెలగు చుండును. దాని ననుసరించియె ప్రసిద్ధ్యాది ఫలాంతరాభిసంధాన ముండ వచ్చును. కావుననె భరతముని "సర్వస్యైవ పంచావస్థాః" యని యుక్తోక్తి వెలయించినాడు.

ఈ నిరూపించిన ఫలారంభాదులలో స్వరూపభేద మున్నది. కాలభేద మున్నది. కొన్ని కాలాభిన్నములుగా కన్పించినను ఏకకా లత్వ ముండదు. కాగా ఫలయోగమును సాధింప వలసి యున్నప్పుడు సాధక(కారణ)వ్యాపార మవస్థారూప మని యనుట యెట్లు సంగత మగును? కాలస్వరూప భేదభిన్నము లేక కారణవ్యాపార మగు టెట్లు? ఇంక నొకటి. ఫలయోగము సాధ్యమై యుండగా కారణావస్థ లయి దంటిరి. ఆ పంచావస్థలు ఫలయోగరూపములె కావు? ఆ యవస్థా స్వభావ మన్యము కాదుకదా! ...ఇట్టి యాశంక లిచట గలుగగా నిది నిరూపింప వలసి యున్నది.

> ౪౭౭. అసాంన్వభావభిన్నానాం పరస్పరసమాగమాత్
> విన్యాస ఏకభావేన ఫలహేతుః ప్రకీర్తితః

ఈ యవస్థ లయిదు స్వభావ కాల భిన్నము లయినను పరస్పర సమాగమమున విన్యాసము కలుగును. అప్పుడది యేకభావమున ఫలహేతు వగుచున్నది. మూలమున స్వభావభేదమె యున్నది. అయినను కాలభేద ముపలక్షిత మగును. స్వభావ భేద మున్నను దిక్కాలభేద మున్నను దండచక్రాదు లేకఫలమును (ఘటాత్మకమును) సంపాదించుట యున్నది. అట్టి వీని కన్యోన్యసంగతిచే నాంతరీయక ముగా నొక విన్యాసము కలుగును. అదియె ఫలహేతువు. దానిచే నాద్యంతముల యవహర్షణ ముదయించును. మొదటి ఫలారంభము చివరి ఫలాగమము రెండు సమాహృతము లగును. నిశ్చితోత్త రోత్తరకార్యము లయిన కారణకారణములకును హేతుత్వ ముండి తీరును. మొదటి ఫలయోగ మొక్కటి యుండ ఫలయోగాంతర మే మనుదాని నిట్లు సమాహితము చేయ వచ్చును. ఫలయోగము లన్నియు సంబంధము పొంది ఫలహేతు వగును. ఈ యంశమె "ఏక భావేన ఫలహేతుః" అని శ్లోకమున నున్నది. ఏకభావ మనునది సంబంధము. "అయం భావః" ఫలోత్పత్త్యవస్థ యొకటి నాయక సంబద్ధమై యుండును. రెండవ ఫలోత్పత్త్యవస్థ "సంసాధ్యే ఫల యోగే" గ్రంథమున సంపాదింప వలసి యున్న ముఖ్యఫలయోగ ముగా సూచిత మయినది. పూర్వావస్థ మధ్యమున్న మూ డవస్థ లతో సంయుక్తమై యోగ్యఫలోత్పత్తిదర్శనముగా నయిదవ యవస్థ యగును. అవస్థ లివి యెంతగా స్వభావాదిభిన్నము లయినను పర స్పరసమాగమమున నపూర్వవిన్యాసము కలవై యేకీభావము పొంది ఫలహేతువుగా ప్రకీర్తితము లగు చున్నది.

> ౪౭౯. ఇతివృత్తం సమాఖ్యాతం ప్రత్యగేవాధికారికం
> తదారంభాది కర్తవ్యం ఫలాంతం చ యథా భవేత్

అవస్థాపంచకము ప్రదర్శిత మయినది. తదను యాయిగా నితి వృత్త మాధికారిక మగుట సమర్థింప వలసి యున్నది. అందుల కిది తగును. మొదట ప్రత్యేకముగా నిరూపిత మయిన యాధికారి కేతి

వృత్తము నారంభాదిఫలాంతము ప్రసరించునట్లుగా నిర్మాణింప వలెను. దాని నట్లు నిర్మించుట కర్తవ్యకార్యము. ఆరంభాది ఫలాంతముగా ప్రసరించు వస్తువు తత్తదవస్థానుయాయిగా నధికృత మగును గావున నాధికారిక మను వ్యపదేశము పొందును. కథావస్తు వితివృత్త శబ్ద వాచ్య మగు న ట్లింతదనుక సమాఖ్యాత మయినది. పంచసంధులచే విభాగ మొనరించుట యితిశబ్దార్థ మని నిరూపితము. అయినను తద్గతవక్తవ్యాంతరోపక్షేపమునకై యిది చెప్పవలసి వచ్చినది.

## సంధిసంబంధము

> ౪౭౦. పూర్ణసంధి చ కర్తవ్యం హీనసంధ్యపి వా పునః
> నియమాత్ పూర్ణసంధి స్యాత్ హీనసంధ్యథ కారణాత్

సామాన్యముగా రూపక మం దంతట పంచసంధు లుండ వలెను. కాన పూర్ణసంధిగా నిర్మింప వలెనని నియమము. హీన సంధిగా కూడ కావ్యము నిర్మాణింప వచ్చునసుట పక్షాంతరము. రూపకము లం దంతట సంధు లయిదున్న నుండ వచ్చును. కా కున్న నంతట తగ్గిన తగ్గ వచ్చునని కొందరు తలంతురేమో యని ముని నియమ మేర్పరచినాడు. పూర్ణసంధిగా నుండుట యనునది రూపక మున నియతవిధి. ఏదేని రూపకమున సంధు లన్నియు నుండక కొన్నియే యుండుట సంభవించినచో నది కారణనిమిత్తముగ గలిగిన రీతి యగును. కావుననె కొన్ని రూపకములు హీనసంధికములుగా నున్నవి. పంచసంధు లుండుట విశేషవిధి యని కొందరు భావించుట నభినవగుప్తోపాధ్యాయు లంగీకరింపరు. వారి భావ మిది. సర్వత్ర యితివృత్తము పంచసంధులతో నుండవలెను. వ్యాపార మెట్టిది గాని ప్రారంభాద్యవస్థాపంచకము లేక సిద్ధింపదు. కాన నవస్థాపంచకము తగ్గింప శక్యము కాదు. ఫలార్థు లారంభించిన కార్యసర్వస్వ మను క్రమమున నవస్థాపంచకముతో నుండుటనె భరతు డాదేశించినాడు. అవస్థాపంచక మనుసరించు సంధిపంచక మంతట నవశ్యంభావి. కావున రూపకము లన్నియు నియమమున నయిదు సంధులతో నుండ వలెను. హీనసంధిత్వ మనునది కారణసాపేక్షము. ఏదేని కారణమున కొన్ని సంధులు తగ్గునే కాని యది రూపకనియతధర్మము కాదు. రూపకము

లందలి కొన్ని వస్తువులలో నుండవలసిన యంగము లన్నియు పూర్ణ ముగ నుండవు. అందుచే హీనసంధిత్వము కలుగును. పూర్ణసంధిగ నుండుటయె భరతుని వ్యపదేశము. "హీనసంధ్యపి వా పునః" యని యనుట రూపకపూర్ణసంధిత్వమునె స్పష్టము చేయును.

అంగములు పూర్ణముగా నుండనపుడు హీనసంధిత్వము కలుగ నందు లెక్కింప దగు విభేదము లిట్లుండును. వీనిని మున్ముందు భర తుడు నిర్దేశించును. వాని సూత్రీకార మిచట సూచిత మగుచున్నది.

४८೧. ఏకలోపే చతుర్థస్య ద్విలోపే త్రిచతుర్థయోః
ద్వితీయత్రిచతుర్థానాం త్రిలోపే లోప ఇష్యతే.

పంచసంధు లుండుట నియమము. ఏవేని లోపించి నపు డీరీతి యుండును. పంచసంధులలో నొకటి లోపించిన చతుర్థసంధిలోప ముచితము, రెండు లోపించునేని మూడవసంధి నాల్గవసంధి లోపిం చును. మూడు సంధులు లోపించునప్పుడు ద్వితీయ తృతీయ చతుర్థ సంధులు లోపించును. ఇట్లే లోప ముండుట యభీష్టము. రూపకము లలో డిమము సమవకార మనునవి నాల్గు సంధులతో నుండును. అం దవమర్శ సంధి లోపించును. వ్యాయోగ మీహామృగము లను రూప కములు త్రిసంధికము లగుట వానిలో గర్భసంధియు విమర్శసంధియు లోపించును. ప్రహసనము, వీథి, అంకము, భాణ మనునవి రెండు సంధులతో నుండును. వానిలో మూడు లోపించును. ప్రతిముఖసంధి, గర్భసంధి, అవమర్శసంధి లోపించును. ఇట్టి భావము యుక్తము. "ద్వితీయ త్రి చతుర్థానాం" అనుచోట "త్రి" శబ్దమున "తృతీయ" మని గుర్తింప వలెను. ఏ రూపకేతివృత్తము నం దైనను సర్వత్ర ఉపక్రమోపసంహారము లవశ్యంభావులు. దృశ్యధర్మార్థ మవగాహ నము చేసికొనిన ప్రేక్షాపూర్వకారులు వితతము బహుఫల మయిన కర్తవ్య మారంభింతురు. వారలకు పంచసంధు లావశ్యకము లగును. ఆర్తిసహిష్ణుత్వమున శంక్యమాన విరుద్ధప్రత్యయముల నపాకరింపగా వారలకు ఫలయోగము సుదృఢ మగును. డిమాదినాయకు లత్యంత ముద్ధతప్రాయు లయినందున నధికముగా వినిపాత మాశంకింపరు. వ్యాయోగాదులలోని నాయకులును తర తమ భావమున ఫలయోగ

ప్రవణు లగుదురు గావున విరుద్ధసన్నిపాతముల నంతగా నాదరింపరు. ప్రహసనాదినాయకు లధర్మప్రాయులు. వారి యితివృత్తము చరిత్ర శరీరము. ఉపక్రమోపసంహారము లందు వారి కథ విశ్రాంత మగును. అంత మాత్రము వారలకు చాలును. అనవమర్శాదులు వారల కక్కఱ లేదు. ఆ కథ లపూర్ణములు. ఇంత వర కిట్లు ఇతివృత్తశబ్దము నందలి 'ఇతి' శబ్దార్థము పంచావస్థలతో వ్యాఖ్యాత మయినది. దాని యర్థము గూడ నిట్లు నిర్వాహిత మయినది. ప్రాసంగికము నం దితి శబ్దార్థమును నిరూపింప వలసి యున్నది.

౪౭౨. ప్రాసంగికే పరార్థత్వాన్న హ్యేష నియమో భవేత్
యద్వృత్తం సంభవేత్తత్ర తద్యోజ్యమవిరోధతః

ప్రాసంగికేతివృత్తము పరార్థము. దాని యం దీ నియమము లేదు. ప్రాసంగికమున నెట్టివృత్తము సంభవించునో యట్టిదానినే విరోధము లేకుండునట్లు పరిశీలించి యోజన మొనర్ప వచ్చును. నియమాను సారమున ఆధికారికవృత్తము పూర్ణసంధి కావలె నన్న నియమ మిం దుండనక్కఱ లేదు. రామకావ్యములో సీతాప్రత్యానయనము ముఖ్యాధికారికము కాగా విభీషణప్రతిష్ఠాపనము ప్రాసంగిక మయినది. విభీషణ ప్రతిష్ఠాపన విషయమున రాముని కౌత్సుక్య బంధాదులను కూర్చినచో నదియె యత్నసంపాద్య మగును. ప్రాసంగిక మయిన యితివృత్తములో యోజ్య మయిన వస్తు వాధికారికమునకు విరుద్ధ ముగా నుండరాదు. ఆధికారికావిరుద్ధముగా ప్రాసంగికమున సంభ వించు వృత్తము ప్రారంభాన్యతమముగా నుండునది ప్రాసంగికమున యోజనార్హము.

పూర్వము నిరూపించిన ఫలయోగమున నుపాయము సంకేతిత మయినది. తత్సహకారివర్గమును నిరూపిత మయినది. తత్ప్రతిబం ధము ప్రతిపాదిత మయినది. తద్విధ్వంసన ముపక్షిప్త మయినది. కాని తత్స్వరూపము స్పష్టముగా విజ్ఞాతము కాలేదు. ఉపాయ సామగ్రీ స్వరూపమును ప్రదర్శింప వలెను. ఇతివృత్తవిషయమున నారంభాదికము లైన పంచావస్థ లున్నట్లుగా బీజాదు లర్థప్రకృతులు

నయి దున్నవి. బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్య మని యర్థ ప్రకృతు లయిదు. వీని నయి దింటిని యథావిధి బాగుగా గుర్తించి యోజనము చేయవలెను. ఆధికారికేతివృత్త ఖండరూపముగా నయిదవస్థ లున్నవి కదా! తత్ప్రకారముననె యర్థప్రకృతులు నున్నవి. అర్థప్రకృతుల నిరూపింపక పోయినచో నుపాయాదుల స్వరూపపరిజ్ఞానము కలుగదు. ప్రారంభాద్యవస్థలను పరమార్థముగ తెలియకున్న ఆధికారికత్వ మవిదిత మగును. "అర్థః ఫలం తస్య ప్రకృతయః ఉపాయాః ఫలహేతవః" అర్థము ఫలము. దాని ప్రకృతు లుపాయములు. అర్థప్రకృతు లనగా ఫలహేతువు లని భావము. "జ్ఞాత్వా యోజ్యా యథావిధి" యథావిధి తెలిసి యోజింప వలె నని భరత వచనము. వాని తెలివిడి యిట్లున్నది.

రూపకాంశములను జడములని చేతనములని ద్వైధాకరింప వచ్చును. జడము రెండు విధములు. ముఖ్యకారణభూతము. గూఢతరము నని. ఇందు మొదటి ముఖ్యకారణభూత మయిన జడము బీజ మని, రెండవది యయిన గూఢతరమగు జడము కార్య మని తెలియ వచ్చును. ఈ కార్యమె యర్థవిషయమున కరణీయము ప్రయోక్తవ్య మని యందురు. చేతనము కూడ రెండు విధములు. ముఖ్య మని యుపకరణభూత మని. ఉపకరణభూతమగు చేతనము మరల రెండు విధములు. స్వార్థసిద్ధిసహిత పరార్థసిద్ధి యుక్తము. స్వార్థసిద్ధి రహిత కేవలపరార్థసిద్ధి యుక్తము నని. వీనిలో ముఖ్యచేతనము బిందువు. ఉపకరణభూత మయిన స్వార్థసిద్ధి సహిత పరార్థసిద్ధి యుక్త మగు చేతనము పతాక. ఉపకరణభూతము కేవలపరార్థసిద్ధియుక్తము నగు చేతనము ప్రకరి. ఇట్టి యీ పంచోపాయములచే పూర్ణ ఫలము నిష్పాదిత మగును. ఇదియె తెలిసిచేయుట. ఈ యర్థప్రకృతుల యుద్దేశోక్తిలో క్రమ మున్నది. అట్లే యుపనిబంధములో గూడ క్రమనియమ మున్నదని గుర్తింప వలెను. ఇందలి విషయప్రక్రియ నీ రూపముగ భావింప వచ్చును.

## అర్థప్రకృతులు — ఫలహేతువులు




౧. ముఖ్యకారణభూత జడము — బీజము

౨. గూఢతర జడము — కార్యము

౩. ముఖ్యచేతనము — బిందువు

౪. స్వార్థసిద్ధి సహిత పరార్థసిద్ధి
యుక్త ముపకరణీభూత చేతనము — పతాక

౫. కేవల పరార్థ సిద్ధియుక్తము
ఉపకరణీభూత చేతనము — ప్రకరి

కొంద రర్థప్రకృతుల యర్థనిర్వచనములో భావభేదము చూచించిరి. "అర్థస్య సమస్త రూపక వాచ్యస్య ప్రకృతయః ప్రకరణాని అవయవార్థఖండా ఇత్యర్థప్రకృతయః" "సంపూర్ణ రూపకమున నిరూపిత మగు నర్థమునకు సంబంధించిన యవయవార్థ ఖండము లర్థప్రకృతు లగును" అని వారి భావము. ఈ వ్యాఖ్యానము ప్రకృతము నంతగా పోషింపదు. ఈ వ్యాఖ్యాన మనుసరింప సంధ్యాదులకు నర్థప్రకృతిత్వమె సిద్ధ మగును. ఇతివృత్తమె సర్వరూపక సముదాయ రూపము. ఇతి వృత్తమున ప్రకృతు లని చెప్పవలసి యుండగా 'అర్థప్రకృతులని 'అర్థ' గ్రహణ మతిరిక్త మగును. ఆ పక్షమున నితివృత్త ప్రకృతు లనుటయె పర్యాప్త మగును గదా! ఇతివృత్తావయవార్థ ఖండము లని యని ప్రారంభాద్యవస్థలతో తుల్యతావర్ణనము వర్ణన మాత్రమె యగును. ఇట్టి యీ వ్యాఖ్యాన మేల? "అలం."

## అర్థప్రకృతులు

౪౭౩. స్వల్పమాత్రం సముత్సృష్టం బహుధా యద్విసర్పతి
ఫలావసానం యచ్చైవ బీజం తత్ పరికీర్తితం

౪౭౪. ప్రయోజనానాం విచ్ఛేదే యదవిచ్ఛేదకారణం
యావత్సమాప్తిర్బంధస్య స బిందుః పరికీర్తితః

౪౭౫. యద్వృత్తం తు పరార్థం స్యాత్ ప్రధానస్యోపకారకం
ప్రధానవచ్చ కల్ప్యేత సా పతాకేతి కీర్తితా

౪౭౬. ఫలం ప్రకల్ప్యతే యస్యాః పరార్థాయైవ కేవలం
అనుబంధవిహీనత్వాత్ ప్రకరీతి వినిర్దిశేత్

౪౭౭. యదాధికారికం వస్తు సమ్యక్ ప్రాజ్ఞైః ప్రయుజ్యతే
తదర్థో యః సమారంభః తత్కార్యం పరికీర్తితం

ఈ శ్లోకపంచకము సందర్భప్రకృతి పంచక ముద్దేశక్రమమున లక్షిత మగును.

౧. బీజము. ప్రథమమున స్వల్పమాత్రముగ సముత్సృష్టమై యనంతరము బహుప్రకారముల ప్రసర్పించునదై ఫలావసానముగా నుండునది బీజ మని పరికీర్తిత మగుచున్నది. బీజాత్మకమయిన వస్తువు ప్రథమమున స్వల్పమాత్రముగ నుండుటచే నా సమయమున గంభీర ప్రయోజన సంవేదనముతో నుండదు. కేవల మకించిత్కరప్రాయముగా నుండును. అట్లై యది శంకిత మగును. అది సంవాదమున గూడినదై యవశ్యము ఫలాంత మగును. మధ్యలో బహుప్రకారముల విసర్పించునది యగుట సర్వథా సిద్ధికై ప్రసరించును. దేశకాలౌచిత్యాపేక్ష కల వాని గూడి, ఫలముగా ప్రవర్తించును. చక్రము లోని యాకుల పొదుపు కొనిన బండికుండ వలె నుండి బహుతరోపాయపరంపరల గలిసి కార్య (ఫల) మునె యపేక్షించునది యగును. అట్టిదది బీజ మని పరికీర్తితము. పరికీర్తిత మనుట "పరితః సమంతాత్ కీర్తితం ప్రసిద్ధం" అంతట ప్రసిద్ధమగునని భావము. ఈ బహుముఖప్రసిద్ధ మయిన బీజము బహుధా భాసించును.

౧. ఒకొ్కకచో బీజ ముపాయమాత్రముగనె యవభాసించును. ఫలమును సాధించుసాధనముగ నుండును.

౨. ఒకచో ఫలమాత్రముగ నుండును.
3. ఒకచో నుపాయ ఫలద్వయ రూపమున నుండును.
౪. ఫలము కూడ నొకచో నుపాదానస్వరూపముననె భాసించును గాన బీజ మట్లె యుండును.
౫. వేరొక స్థలమున హేయవ్యసనముల నివర్తించు రూపమున ఫల ముండును.
౬. మరియొకచోట వ్యసన నివర్తన రూపమున నుపాదాన రూపమున నుభయరూపమున నుండును.
౭. ఇట్టి ఫలమును ఒక్కొకచోట నాయకోద్దేశమున భాసించునది యగును.
౮. మరియొకచోట ప్రతినాయకాశ్రయమున భాసించును. ఇట్లనేక భేదభిన్నమై గోచరించును.

అభిజ్ఞాన శాకుంతల నాటకమున దుష్యంతునకు చక్రవర్తిపుత్ర లాభము మునిజనాశీర్వచనద్వారమున సూచిత మయినది. అట్లు ఫల స్వభావ మందు నిరూపిత మయినది. రూపకము లం దుండు ఫలము కూడ భవిష్యదుపాయ సంబంధమున బీజ మని వ్యవహారము పొందును. యథాయథ మీ విషయ ముదాహరించి తెలియుట యుక్తము. ఆనంత్యమున విస్తరభయమున ప్రతిదిశము లేఖనము కుదురదు.

౨. బిందువు. ప్రయోజన ముపాయానుష్ఠానరీతులచే విచ్ఛేదము పొందినదిగా నున్నను విచ్ఛేదము లేకుండు నట్లు చేయునది బిందు వవిచ్ఛేద కారణము. ప్రబంధసమాప్తిపర్యంత మది యుండును. ప్రబంధఫలము కొన్ని యుపాయానుష్ఠానములచే ప్రయుజ్యమాన మయి ప్రసరించునది యగును. ఫలమున కయిన యుపాయానుష్ఠానములు నితివృత్తవశమున నవశ్యకర్తవ్యము లగును కావున ఫలమునకు విచ్ఛేదము కలుగును. అయినను ఫలానుసంధానాత్మక మయిన సంధి ద్రవ్యజ్ఞానము ప్రధాన నాయకగతముగా నుండును. అదియె బిందువు. జ్ఞానవిచారణము ఫలలాభోపాయము కదా! విచ్ఛిన్నప్రాయ ఫలము నకు ప్రత్యనుసంధానమున నవిచ్ఛేద మాపాదింప వలయును. అ

ట్లవిచ్ఛేద మొనర్పక పోయినచో నేమియు కార్యనిర్వాహము కాదు. అవిచ్ఛేదము సంపాదింప నంతవరకు కార్యము స్తంభించి పోవును. ఏమియు కార్య ముండదు. అది విలీనకల్ప మగును. బీజమె ఫలాంత ముందును గాని బిందువుండ దనుకొన నక్కరలేదు. బిందువునకును ఫలాంతస్థితి యున్నది. ప్రబంధ బధ్యమాన ఫల సమాప్తి వరకు బిందు వుండును. "సమ్యగాప్తిః సమాప్తిః" లెస్సగా సిద్ధించుట సమాప్తి. "ఏతదుక్తం భవతి." బంధము నందలి కార్యానుసంధానము సకలో పాయములకు ప్రతిజాగరణహేతువు. ఈ యనుసంధాన మత్యంత మావశ్యకము. ముఖ్యనాయకుడు ప్రత్యనుసంధానమున కార్యాను సంధాన మొనర్ప వలెను. అట్లొనర్పక పోయినచో జడాజడరూప మయిన సర్వవిధోపాయధర్మమును అనుపాయకల్పమె యగును. ప్రత్యంకము నందును ఫలానుసంధానము నిరూపించిన సర్వోపాయ వర్గము సహకారి కా గలదు. తాపసవత్సరాజ మను నాటకమున వత్సరాజు వాసవదత్తా ప్రేమానుసంధాన మొనర్చుట ప్రత్యంకము నను ప్రదర్శిత మయినది. ఆ ప్రేమానుసంధాన విధానమును సహృద యులు సంభావింప దలంతురు. వారల కీ నివేదన మిచ్చెదము.

"సచివులు నీ సంప్రాప్తి కలుగు నని నన్ను ప్రలోభ పెట్టిరి. పత్య మనుకొని నేను ప్రాణాలు ధరించినాను. ఈ శరీరకమును విడు వనే లేదు. నేను నిఃస్నేహుడనె కదా ! నిన్ననుగమించుటకిది సమ యమె. నాకభిలాష యున్నది. ఇదిగో యిట్లు దుఃఖపడుచున్నాను. ఆ దారుణ సమయంలో నా యీ హృదయము వేయి ముక్కలు కా కూడదా!" ఇది వత్సరాజానుసంధానము. ఆ శోకము కల శ్లోక మిది యీ నాటక షష్ఠాంకములో నున్నది.

త్వత్సంప్రాప్తివిలోభితేన సచివైః ప్రాణా మయా ధారితాః
తన్మత్వాఽత్యజతః శరీరకమిదం నైవాస్తి నిఃస్నేహతా
ఆసన్నోఽవసరస్తవానుగమనే జాతా గతిః కిం త్వయం
ఖేదో యచ్ఛతధా గతం న హృదయం తస్మిన్ క్షణే దారుణే

రూపకము నందలి కార్యసిద్ధి మూడు విధములు. ప్రధానసిద్ధి ఆయత్తసిద్ధి ఉభయసిద్ధి. అని. ప్రధానసిద్ధి యందే యీ బిందు

వున్నది. అయ త్తసిద్ధి రాజ్యప్రాప్తి స్వరూపమున నుండును. అం దమాత్యవర్గ మాచరించిన కార్యానుసంధానమె బిందువు. ఉభయ సిద్ధిలో నుభయకృతముగా నుండును. ప్రధానముగా తలచిన దానినె యనుసంధాన మొనరింతురు గదా ! కావున ప్రధానానుసంధానచేతన వ్యాపారముగ నుండి కారణానుగ్రహమున గూడికొని స్వయముగా పరమకారణస్వభావమై తైలబిందువు వలె సర్వవ్యాపకముగా నుండు నది యగుట బిందు వయినది. బీజ మనునది ముఖసంధినె సంబం ధించి యుండును. అచటనె స్వ స్వరూపమును ప్రవర్తింజేసి యున్మే షము పొందును. బిందువు తదనంతరము ప్రవర్తించి స్వాత్మ నున్మే షింప జేసికొనును. బీజబిందువులు రెండును సమస్తేతివృత్తవ్యాపక ములు. అయినను వీని స్వరూపగత వివేకము విశేషము పై రీతి నుండును.

3. పతాక. పతాకావృత్తము పరార్థమై ప్రధానమున కుప కారక మగును. ప్రధానము వలె క్రియాప్రక్రియాచతుర మగును. అది పతాక యని కీర్తితము. పతాకాసంబంధి వృత్తము సంవిదనుసం ధాన రూపమై పరుని ప్రయోజనసంపత్తికై యగునది యయినను స్వప్రయోజనము సంపాదించునది యగును. అందుననె పతాక ప్రధా నము వలె ప్రకల్పించు ననుట. సచేతనానుసంధానరూప మయిన పతాక సిద్ధిప్రధానమై ప్రధానసిద్ధి కుపకారిణి యగును. సుగ్రీవవిభీష ణాదుల వృత్తము లిట్టివి. శ్రీరామాదుల వలన గలుగు నుపక్రియ వారల కున్నది. వారు రామాదుల కుపకరింతురు. తమకు నుపకా రము సంపాదించి కొందురు. రామాదు లొనరించు ప్రబంధప్రభవ మానము లగు ప్రసిద్ధి ప్రాశస్త్యములను సుగ్రీవవిభీషణాదులు సంపా దింతురు. పతాక యౌచిత్యానౌచిత్య పరిజ్ఞానమున నుపయోగించు నదై పతాక వలె నుపయోగించుటచే నిది పతాక యయినదని చిరం తను లభిమానించిరి.

౪. ప్రకరి. ప్రకరీఫలము కేవలము పరార్థమై ప్రభవిష్ణు వగును. దాని యందే వృత్తానుబంధము నుండదు. ప్రకరిని అను బంధ విహీనముగనె నిర్దేశింప వలెను. కేవలము పరార్థమె సర్వ

మనుష్ఠించునది ప్రకరి. వేణీసంహారమునందు భగవద్వ్యాసు దేవ వృత్తాంతము ప్రకరి. రామాయణమున శబరి ప్రకరి. "ప్రకర్షేణ స్వార్థానపేక్షయా కరోతీతి ప్రకరీ" స్వార్థ మపేక్షింపక ప్రకర్షముగా నితరక్రియ నాచరించునది ప్రకరి యని వ్యుత్పత్తిలభ్యార్థము. ప్రకరికి వేరుగా ఫల ముండదు. అయినను దాని కొక ఫలమని యనుట ఫల కృత్యోపాయానుష్ఠానపర మని గుర్తింప వచ్చును. ప్రకరి స్వాయ ముగ పరాపతిత మగును. పరార్థము యతించును. ఫలసిద్ధి కుపాయ మాచరించును. స్వాయ మంతట విలీనకల్ప మగును.

౫. కార్యము. కథానాయకవ్యక్తులు సమ్యక్ప్రయోగ మొనరించు ఆధికారిక వస్తు సిద్ధికై యర్థ్య మగు సమారంభము కార్య మని ప్రకీర్తితము. కావ్యేతివృత్తమునందు ప్రధాన నాయక పతాకా నాయక ప్రకరీ నాయకు లందరు ప్రాజ్ఞులు. వారు ఫలరూప వస్తువును సంపాదింతురు. అది సంపాద్య మని వా రనుసంధాన మొనరింతురు. అది ఫలము. అది సంపూర్ణత నిచ్చును. పూర్వ పరి గృహీతము ప్రధానము నయిన బీజమను నుపాయమున కది ఫలము. ఆరంభశబ్దవాచ్యము లగు ద్రవ్య క్రియా గుణ ప్రభృతి సర్వార్థము లా ఫలమునకు సహకారులు. కాన నది కార్యము. "చేతనైః కార్యతే ఫలం" చేతనులు ఫలము నిష్పాదింతురు. కాన నది ఫలము. చేతను లొనరించు సమ్యక్ప్రయోగము ఆ చేతనుల ప్రభుమంత్రో త్సాహ శక్తిత్రయ సంపత్తిని సూచించును. జనపద కోశ దుర్గాదిక వ్యాపార వైచిత్ర్యము సామాద్యుపాయవర్గము సర్వ మీ కార్యమున నంతర్భవించును. అందు ప్రథమపరిగృహీత మయిన ప్రధానోపా యము బీజ మని ప్రథమముననె నిరూపితము.

౪౭౮. ఏతేషాం యస్య యేనార్థో యతశ్చ గుణ ఇష్యతే
తత్ప్రధానం తు కర్తవ్యం గుణభూతాన్యతః పరం

౪౭౯. ఏకోఽనేకోపి వా సంధిః పతాకాయాం తు యో భవేత్
ప్రధానార్థానుయాయిత్వాదనుసంధిః ప్రకీర్త్యతే

ఈ శ్లోకార్థములను దెలియుటకు ముందుగా నీ ప్రశ్నభావ ముల గుర్తింప వలెను. అర్థప్రకృతుల యర్థముల భావింపగా నీ

మూడు ప్రశ్నలు గలుగ వచ్చును. వాని సమాధానముగా నీ శ్లోకము లున్నవి.

౧. ప్రారంభాదు లన్నియు నంతట సంభవించును. వాని వలె నీ యర్థప్రకృతు లన్నియు నంతట సంభవించునా? కొన్నియె కొన్ని స్థలములందు గుదురుకొనునా? అయిన నేవి వేనిలో నుండును ?

౨. ప్రారంభాద్యవస్థల నిరూపణమునం దొక యపరిహార్య మయిన క్రమ మున్నది. సంధుల కవస్థలకు నిష్పత్తి సౌభాగ్య మిచ్చు అనుక్రమ మున్నది. అర్థప్రకృతి సంధ్యవస్థలకు క్రమనియతి కలదా? అవి యథాసంఖ్యముగనె సంబద్ధములు కా వలెనా?

౩. క్రమనియమ మన్నది యున్నప్పుడు సంధ్యవస్థలతో సంబంధించు నప్పుడె యా క్రమ మిష్టమా? వాని స్వాత్మగతముగా గూడ నియత మయిన క్రమవ్రత మున్నదా? అవస్థలలో క్రియాక్రమ మున్నట్లు బీజాదులలో నొక కర్తృక్రమము కలదా? అది యెట్టిది?

ఈ శంకాత్రయ మపాకరించుటకై యీ శ్లోకము లావశ్యక ములు. ఈ నిరూపించిన యర్థప్రకృతులలో దీనిచే నెద్దానికి ప్రయోజ నము కలుగునో, యేది యే కారణమున గుణ మయినదో, యట్లది గుణ మగుట యభీష్టమె పరిశీలన మొనర్ప వలెను. ఉపపాదనమున నభీష్టమును ప్రధాన మొనరింప వలెను. తదితరములను గుణీకరింప వలెను. ఒక్కొక వర్గము నొక్కొక విధమున సమాహరించుకొని పంచక వర్గత్రయము దీనిలో పరామృష్ట మయినది. ప్రారంభాదుల వలె నంతట సర్వార్థప్రకృతు లుండవు. ఔచిత్యానుసారమున గొన్నియే యుండును. ఏ నాయకున కే యర్థప్రకృతి విశేషమున ప్రయోజనసంపత్తి యధిక మగునో యా యర్థప్రకృతివిశేషమె యా స్థలమున ప్రధాన మగును. ఇతరార్థప్రకృతు లా స్థలమున నుండును గాని యప్రధానములై యసత్కల్పముగ నుండును. స్వపరాక్రమము ననె యభిమానశీలు రగు ధీరవీరులు పతాకా ప్రకరీ నాయకుల వివ క్షింపరు. సమీక్షింపరు. ఉపేక్షింపక పోవుట యనునది వేరు. బీజ ముండును. బిందు వుండును. కార్యము నుండును. ఈ మూడు నవశ్య ముగా నుండునవి. అనపాయులు. బీజ బిందు కార్యములు లేక

రూపకమె యుండదు. ఇట్లు బీజాదిత్రయ మనపాయి యయినను వీని యందును గుణప్రధానభావ మున్నది. సంధు లవస్థ లర్థప్రకృతు లనువానిలో దేనికి దేనితో సంబంధ ముచితమో యదియె ప్రధాన మగును. అదియె నాటకాదికార్య మగును. ఇక ద్వితీయ శంకా కలంక మక్కర లేదు. "యతశ్చ గుణ ఇష్యతే" దేని వలన గుణ మిష్ట మగునో యని యర్థము. గుణ ముపకారము. దేనివలన నుప కారము వెన్వెంటనె స్పష్ట విశద మగునో యదియె యయి దర్థప్రకృ తులలో ముఖ్య మని తలచ వచ్చును. దాని ప్రధానముగ భావించి బాహుల్యమున నిబంధింప వలెను. ఇతరము నప్రధానముగ నిబంధింప వలె ననుట సిద్ధమె. ప్రధానాయత్తసిద్ధిలో నిబంధించు నప్పుడును ఏ యంశమున నేది యధికముగా నుపకరించునదిగా నవభాసించునో దాని నచట ప్రధానీకరింప వలెను. తాపసవత్సరాజములో దీని సం గతి దర్శింప గలము. అందు వాసవదత్తా లాభ విషయమున బిందువు ప్రధానము. కౌశాంబీ రాజ్య లాభమున పతాక ప్రకరి ప్రధానము లయినవి. అమాత్య వ్యవహారమందు పతాక. రాజునకు రాజ్యసిద్ధి కలుగగా నమాత్యునకును స్వార్థసిద్ధి యున్నదని యమాత్య వ్యవహార మునకు పతాకాత్వమును గొందరు భావించినారు. ఇట్లె సాంకృత్యా యనీ వ్యవహారమున నూహింప వచ్చును. మరి కొందరిట్లనవలసి యందురు. పై కథనములో వత్సరాజొక నాయకుడు ముఖ్యమంత్రి వేరొక నాయకు డని యనిన ట్లయినది. మొట్టమొదటనె నాయకు నకు తావద్రూప మున్నది. కాన పృథఙ్నాయకత్వము సముచితము కాదు. రామాయణాదులందు సుగ్రీవాదు లిట్లు కారు. వారు పృథ గ్రూపులె. వారు వేరుగా స్వార్థసిద్ధి కలవా రగుట యుక్తము. వారు కేవలము సాంప్రతిక కార్యమున రాము నాశ్రయించిరి. పతాకాది రూపత్వమును సుగ్రీవాది ప్రమాణమున నిశ్చయించుట సముచితము. ఇట్లిది వీరి మతము. వీరి మతమున తాపసవత్సరాజమునం దుభయ స్థలములందును బిందువె ప్రధానము. అయి దర్థప్రకృతులలో సంద ర్భౌచిత్యము ననుసరించి యయిదింటికి ప్రాధాన్యము రూపింప వచ్చును. కొన్నిట నాలుగె ప్రధానములు కా వచ్చును. మూడు రెండొకటె ముఖ్య మగుటయు సమ్మతము. ఈ విధముగ విభజించి

పరిశీలించి నిరూపింప వలెను. పతాకాప్రవృత్తునకు ప్రధానధర్మము లన్నియు నతిదిష్టము లగును. కావుననె రూపకము పంచసంధిక మయినది. పతాక సర్వథా పరార్థముగనె ప్రవర్తించును. పతాకలో ప్రధానాతిరేకముగా సంధి యుండు టెట్లు? సూచిత మగుటేమి? అభ్యూహించుట యేమి? నిబంధించుట యేమి కలదు? పతాక యెట్టి పట్టులందుగాని పూర్ణవర్ణనముతో నుండరాదు. పూర్ణవర్ణన మున్నచో పతాకాంతర ముండును. ఆ పతాకయు పూర్ణవర్ణనకము కాగా వేరొక పతాక యావశ్యక మగును. అందును మరియొకటి. ఇట్లనవస్థ వాటిల్లును. పతాకలో సంధి యొకటియె యుండు గావుత. ఇంక ననేకము లుండు గావుత. అవి సంధులని వేరుగా పరిగణనార్హములు కావు. అవి యన్నియు ప్రధానార్థానుయాయులు. ఆ సంధులు అనుసంధులని ప్రకీర్తితము లగును. అనుసంధులుగా నుండు వానిని పృథగ్రూపమున గణింపరు.

లోల్లటాద్యు లోకరీతి తలచు చున్నారు. పతాకానాయకుడు పరార్థము సాధింప వలసి యున్నప్పుడు కావ్యేతివృత్తభాగము లనుసంధు లగును. ఈ యనుసంధు లన్ని సంధు లం దుండును. వానిని ముఖానుసంధి ప్రతిముఖానుసంధి గర్భానుసంధి మొదలగు నామము లతో వ్యపదేశింప వచ్చును. ఇట్లు సర్వకథా భాగము నందును పంచావస్థ లుండు ననుట లోల్లటులకు సమ్మతము. ఇట్లనుసంధి ద్విత్వము చెప్పుటలో ప్రయోజన మేమి యున్నదో మాకు గోచర మగుట లేదు.

౪౮౦. ఆగర్భాదావిమర్శాద్వా పతాకా వినివర్తతే ।
కస్మాత్? యస్మాన్నిబంధోఽస్యాః పరార్థః పరికీర్త్యతే.

స్వఫలసిద్ధికై యతమాను డగు పతాకానాయకున కం దం దవశ్యము పృథగ్గణన ముండ వచ్చునా? అను శంకాప్రశమన మీ పద్యమున నున్నది. ఎట్టి ప్రధానసంధిలో పతాకావృత్తమున కను యాయిత్వ ముండునో నిరూపించుటయు నీ శ్లోక పరమ తాత్పర్యము. పతాకావృత్తము గర్భసంధి నుండి కాని విమర్శసంధి నుండి గాని విని వృత్త మగును. నిర్వహణాంత మది ప్రసరింపదు. పతాక కేవలము

పరార్థమె నిబద్ధ మగునని కదా! పరికీర్తిత మయినది. పతాకేతివృత్త-
మే యర్థ మభివ్యాపించి వినివృత్త మగునో యంతవరకె పతాకా
నాయకునకు స్వఫలసిద్ధి నుపనిబంధింప వలెను. సిద్ధఫలు డాతడు
ప్రధానఫలమున వ్యాపించువాడుగ నున్నను పతాకా శబ్దవాచ్యుడె
యగును. ముఖ్యముగా నాతడు వ్యపదేశింప దగడు. "ప్రధానవచ్చ
కల్ప్యేత" ప్రధాననాయకుని వలె నాతడు ప్రభావి యగుట పూర్వ
మంటిరి కదా! నిర్వహణసంధి పర్యంత ముండి యటనుండి వినివృత్తు
డగుటనె చెప్పుట సమంజసముగ నుండునేమొ! గర్భము నుండి విమ
ర్శము నుండి గాని వినివృత్త మగునని యనుటలో హేతువేమి? యని
"కస్మాత్?" ప్రశ్నార్థము. అటుపై సంతయు నుత్తరము. పతాకా
నాయకుని ఫలము నిర్వహణపర్యంతముననె యొనరించుటయె
యున్నచో; ముఖ్యనాయకఫలము పతాకానాయకఫలము రెండును
నిర్వహణముననె సూచింప వలసి యుండును గావున నవి రెండు తుల్య
కాలము లగును. తుల్యకాలము లగువాని కుపకార్యోపకారకత్వ
ముండదు. పతాకానాయకుని ద్వారా ప్రధానోపకారభావము కల
గదు. పతాకావృత్తమునకు ప్రధానవిమర్శసంధి యందె ప్రకృతోప
యోగ ముండును. అప్పుడె వినిపాతప్రతీకారము కుదురు కొనును.
ప్రాప్తఫలు డయిన పతాకానాయకుడు కృతజ్ఞుడై వినిపాతముల ప్రతీ
కార మొనరించును. అట్లుచట పతాకానాయకుడు స్వార్థమున
ప్రవర్తించిన విధమున పరార్థప్రవృత్తుడు నగును. భృత్యు డొకడు
సంపన్నఫలుడై పరార్థమునకై ప్రయత్నించుట లోకదృష్టమె. జడ
స్థితియు నిట్లె యుండును. స్వార్థము సిద్ధము కాగా పరార్థమున సంబద్ధ
మగును. ఇట్టి పతాక పతాకాస్థానకము. జడ మగునది స్వార్థమున
పరార్థమున ప్రవర్తించినను ప్రత్యేకముగ కార్యానుసంధాన మేమియు
నుండదు. కార్యానుసంధానము లేనప్పుడు జడ మనుట యుక్త
మయినది. రామాయణమున సుగ్రీవాదులకు కొంత కార్యాను
సంధాన మున్నది. సామాన్యముగా నుండు పతాకానాయకుల కన్న
వారిలో కొంత విశేష మున్న దని భావింతుము. అజడమునకు స్వార్థ
మున ననుసంధాన ముండక పోదు. అట్టి పట్ల గూడ పరార్థమున
కార్యానుసంధాన ముండదు. ఇది యిందలి విశేషము. "ప్రధాన

వచ్చ కల్ప్యేత" యని పతాకాలక్షణమున ననుటలో నీ భావము గుప్తమైయున్నవి. ప్రధాననాయకుడు బహుతరేతివృత్తమునందు వ్యాపకత్వమున నుండును. పతాకానాయకుడు పరిమితేతివృత్తమున వ్యాపకత్వము వహించును. ఇది యిందలివిశేషము. ఇంతవఱకు పతాకాప్రవృత్తి లోని యౌచిత్యము సమీక్షిత మయినది.

## పతాకాస్థానకము

పతాకాస్థానక మిప్పుడు ప్రక్రాంత మయినది. అది కతిపయ భేద భిన్నము. సామాన్యలక్షణము ప్రథమమున నిరూపించుట సముచితము. ఇప్పు డది యుపక్రాంత మగును.

౪౮౧. యత్రార్థే చింతితేఽన్యస్మిన్ తల్లింగోఽన్యః ప్రయుజ్యతే
ఆగంతుకేన భావేన పతాకాస్థానకం తు తత్.

ఒకయర్థమును సంచింతనము చేయగా నాగంతుకభావమున చింతితార్థలింగక మయిన యన్యార్థము ప్రయుక్త మయినప్పు డది పతాకాస్థానక మగును. ఇం దర్థ మనునది ప్రయోజనము ఉపాయమును. కర్మవ్యుత్పత్తి వలన ప్రయోజన మని, కరణవ్యుత్పత్తి వలన ఉపాయ మని లభించును. ఒక ప్రయోజనమును చింతన మొనరింపగా ప్రయోజనాంతర రూప మగు నన్యము సంబంధించి యున్నచో పతాకాస్థానక మగును. అట్లె యొక యుపాయము సమాలోచితము కాగా నుపాయాంతరరూప మగు నన్యము సంబంధించి యున్నచో పతాకాస్థానక మగును. "ప్రయుజ్యతే = ప్రకర్షేణ యుజ్యతే సంబధ్యతే" ప్రకర్షముగా సంబంధించి యుండుట యని "ప్రయుజ్యతే" పదార్థము. పతాకాధారముగా నుండును గావున నితివృత్తము కూడ ఉపచారమున పతాకాస్థానక మగును. శ్రీభట్టతోతు లుపాధ్యాయు లిట్లనిరి. పతాక యొక్క-స్థాన మితివృత్తము. అం దర్థము సంపాదిత మగుచున్నను పూర్వపదార్థమున సంక్రమించు చుండును. కాన పతాకాస్థానక మితివృత్తమె యగును. పతాకాస్థానకమున వర్ణింపబడు జడాజడరూపము సర్వము పతాకాసదృశమె యనుట నిరూపిత ప్రాయము. మొదట చింతితార్థమున కన్న నన్యమగు నర్థము ముఖ్యార్థమె లింగమె యగుచు ముఖ్యార్థమును "లింగయతి= విచిత్రయతి"

వైచిత్ర్య సమేత మొనర్చును. అని యనిరి. అన్యార్థమునకు గల పతాకాసాదృశ్యమె యుత్తరార్థమున నిరూపిత మయినది. భావ మనునది భావనము కారణ మగుట. ఆ కారణత్వము స్వరూపకృత మని సహచారికృత మని రెండు విధములు. సహచారికృతమె యాగం తుకము. ఆ సహకారిత్వసామాన్యమున సమర్థచరణస్వభావమున పతాకాసాదృశ్యము సిద్ధ మగునని తాత్పర్యము. ఒకదాని నభిసం ధాన మొనరించు నప్పుడు అన్యసిద్ధి కలుగుట భూషణమె యగును గాని కొందరు దాని దూషణముగ గ్రహింతురు. వారర్థ శబ్దము నుపాయము చెప్పుదానిగా గుర్తింతురు. "కారణత్వ ధర్మాభావ ప్రవృత్తి నిమిత్త ఉపాయః" పూర్వచింతితార్థమునకు లింగరూప ముగా నున్న యన్యార్థము= వేరొక యుపాయము ప్రయుక్తము కావలె నని భావము. కారణత్వధర్మములేకపోవుటలో ప్రవృత్తి నిమిత్త మగునది యుపాయ మని యర్థము. ఈ యంశము నుదాహ రించి తెలియ జెప్పుట సముచితమె. సామాన్యలక్షణము విశేషలక్షణ వ్యాఖ్యానములో శక్యయోజన మగును గావున నచటనే దీని ప్రతిపా దింతుము.

४०३. సహసైవార్థసంపత్తిః గుణవత్త్యుపకారతః
పతాకాస్థానకమిదం ప్రథమం పరికీర్తితం
४०3. వచః సాతిశయం శ్లిష్టం కావ్యబంధనమాశ్రయం
పతాకాస్థానకమిదం ద్వితీయం పరికీర్తితం
४०४. అర్థోపక్షేపణం యత్ర లీనం సవినయం భవేత్
శ్లిష్టప్రత్యుత్తరోపేతం తృతీయం మిద మిష్యతే
४०५. ద్వ్యర్థో వచనవిన్యాసః సుశ్లిష్టః కావ్యయోజితః
ఉపన్యాససుయుక్తశ్చ తచ్చతుర్థ ముదాహృతం

౧. వీనిలో క్రమముగా నాలుగు పతాకాస్థానముల లక్షణము లున్నవి. ఉపకారకము ననుసరించి సముత్కృష్ట మయిన ఫలసంపత్తి వెంటనె యచింతితముగ సంప్రాప్త మయినట్లు వర్ణించినచో మొదటి పతాకాస్థాన మగును. ఇది సాధ్యఫలసంబంధము కలది యగుట ప్రధాన పతాకాస్థానకము. శ్రీహర్షుని రత్నావలి నాటికలో దీని సమన్వయముగ దర్శింప వచ్చును. సాగరిక గళమున పాశము పట్టిం

చుకొని యురిపెట్టు కొనుటకై ప్రయత్నించినది. ఇంతలో వత్సరా జక్కడకు వచ్చి "వాసవదత్త" యని తలంచుచు పాశము విడిపించి నాడు. అప్పటి యామె మాటల వలన వాసవదత్త కా దని సాగరిక యని రాజు తెలిసి "ఆఁ ఏమి? నా ప్రియ సాగరికయేనా? వలదు. సాహసము వలదు" అనినాడు. ఈ ఘట్టమున పతాకాస్థానక మున్నది. వత్సరాజు తలచిన ప్రయోజన మొకటి. తద్వైచిత్ర్యకారి ప్రయోజనాంతర మిచట సంపన్న మయినది. ఇందు దైవయోగ మున్నది, దైవిక మయిన దేశకాలయోగమును గలదు. నాయకు డీ సంబంధములతో నున్నాడు. సచివాదుల యభిసంధిబలమున నిట్టి భేద కల్పనము రాజునకు సంబంధించినది. సాగరికయు తనకు మరణమె సముచిత మని యన్యాభిసంధానముననె పలికినది కావున పతాకా నాయకసాదృశ్యము పొందినది. ఒక ఫలము భావింప వే రొక ఫలము గలుగుట కిది యుదాహరణము. ఒక యుపాయమును చింతింపగా నుపాయాంతరప్రాప్తి సహసా గలుగుట కీ చెప్పునది యుదాహర ణము. నాగానందనాటకమున నాయకు డయిన జీమూతవాహనునకు శంఖచూడుని వధ్యపటము లభింపక పోయినను సరిగా నదే సమయ మున కంచుకి యత్తగా రిచ్చిన వాసోయుగల మర్పించుట ప్రకృత లక్ష్యము. రక్తవస్త్రయుగల మర్థించు వాహనున కుపాయముగా నత్తవారిచ్చిన యుపాయన మగు రక్తవస్త్రయుగలము సహసా సంప్రాప్త మయినది. ఇట్టివె పతాకాస్థానకములు.

ఇందు కొందరి భావ మొక డున్నది. రూపకము చతుష్పతా కాపరమ మని భావించి భావి సంధిచతుష్టయాభిప్రాయమున నాలుగు పతాకాస్థానము లుండవలెనని వారు తలంతురు. పతాకాస్థానముల విషయమై సంఖ్యార్థము సంకేతితము లయిన ప్రథమద్వితీయాది శబ్ద ములను ముఖాది సంధివిషయ ప్రయోగాభిప్రాయమున వ్యాఖ్యా నించు చున్నారు. నాలుగు సంధులందు నాలుగు పతాకాస్థానము లుండుట వారి యభిలాష. వా రి ట్లభిప్రాయ పడుటలో నేమియు యుక్తి గోచరింపదు. చమత్కారమేని యం దవభాసింపదు. వారి భావ మభావరూపము. ఇట్టి సాదృశ్యములు మనసులో పెట్టుకుని

గణన మారంభించిన మరి యొకటియు నున్నది. పంచేంద్రియము లని ప్రసిద్ధి యున్నది కదా! దాని బట్టి పతాకాపంచక గణనము కూడ వారనవలసియె యుండు నని కొందరు ప్రాచీనులె వారిని పరిహసించిరి. కాగా వారి పక్షు ముపహాసపాత్రీకృతమై యుపేక్షింప వలసినదె యయినది. ఇట్టివాని సమీక్షయె వలదు. "ఆస్తాం".

౨. కావ్యబంధము నాశ్రయించిన సాతిశయ శ్లిష్టవచనము రెండవ పతాకాస్థానకము. ప్రకృత వర్ణనీయ కావ్యబంధము నాశ్రయించి యున్న వచనము అతిశయోక్త్యాదులతో గూడుకొనినదై తన్నిమిత్తవశమున సాతిశయ మగును. అది నానార్థము లయిన పదములతో కూడి యున్నప్పుడు ప్రకృతేతర మయిన యప్రకృతమున సముచితముగ సంగత మగును. అట్టి వచనము ప్రకృతోపయోగమున సహకరించునదై యభిసంధానాపేక్షచే రెండవ పతాకాస్థానక మగును. వేరొకచోట నట్టి వచనార్థమె ప్రకృతసహకారినై పతాకాస్థాన మగును. వేరొకచోట తద్వచన ముచ్చారణము చేయు నాతడు సహకారి కావచ్చును. మరియొక స్థలమున దైవాగత మగు యాదృచ్ఛికమె ప్రకృతోపయోగిత్వము పొంది కార్యాభిసంధానమున ద్వితీయ పతాకాస్థాన మగును. రామాభ్యుదయ మను నాటకమున మూడవ యంకములో నీ యంశ మిట్లున్నది. అందు సీత నుద్దేశించి సందేశించు సుగ్రీవు డిట్లనును.

బహునాత్ర కిముక్తేన పారేపి జలధేః స్థితాం
అచిరాదేవ దేవి! త్వామాహరిష్యతి రాఘవః

"దీని భావ మిది. సీతాదేవీ! అధికము చెప్ప నేల? జలధి కావల నున్నను నిన్ను రాఘవు డచిర కాలముననె తీసికొని రాగలడు. జలధి కావల నున్న ననుట యతిశయోక్తి. ఒక ప్రయోజనమున నతిశయోక్త్యాశయముతో సుగ్రీవుడు దీని పలికినాడు. "పారేపి జలధేః" ప్రకృతోపయోగాతిశయము. సీత లంకలో నున్నది కదా! ఇది కావ్యబంధము ననుసరించిన సాతిశయవచనరూప పతాకాస్థానము.

3. అస్ఫుటమై లీనముగా నున్న యర్థోపక్షేపణము శ్లిష్ట ప్రత్యుత్తర సహితమై విశేషనిశ్చయప్రాప్తితో నున్నచో మూడవ

పతాకాస్థానకము. రూపకమున నస్ఫుటముగా నున్న యర్థజాతమును సముచితముగా సూచిత మొనర్పవలసి యున్నది. ఆ సూచనము శ్లిష్ట సంబంధయోగ్య మగు తాత్పర్యాంతర ప్రయుక్త మయిన ప్రత్యుత్త రమున విశదము కా వలయును. అది సవినయముగా నుండుట నాట్య భాష. "సవినయం విశేషేణ నయనేన విశేషనిశ్చయప్రాప్త్యా సహితం" విశిష్ట మయిన భావార్థమును గూర్చునదై విశేషనిశ్చయప్రాప్తితో నుండుట సవినయ మన దగును. లీనార్థజాత మీ విధముగా సంపన్న మయినచో తృతీయ పతాకాస్థానక మగును. ముద్రారాక్షస నాటకమున నిది సంగత మయినది. అందు చాణక్యుడు; "అపి నామ రాక్షసః దురాత్మా గృహ్యేత?" రాక్షసదురాత్ముడు చే జిక్కునా?" అని తలచు నంతలో, సిద్ధార్థకుడు "ఆర్య! గృహీతః" అయ్యా! చే జిక్కె నని యనును. అప్పుడు చాణక్యుడు "హంత! గృహీతో దురాత్మా రాక్షసః" "ఆహా! దురాత్ముడు రాక్షసుడు చే జిక్కినాడు" అని తనలో తలచును. మొదట చాణక్యు డస్ఫుట మయిన రాక్షసగ్రహణార్థ ముపక్షిప్తము చేసినాడు. నగరములోని సందేశము గుర్తించు భావముతో సిద్ధార్థకుడు ప్రయోగించిన ప్రత్యుత్తరము సమయౌచిత్యమున విశేషనిశ్చయ మాపాదించినది. అనంతరము చాణక్యుని వచనమును ప్రకృతసాధ్యమున కుపయోగాంగ మయినది. అందుచే నిది పతాకాస్థానీయము. పతాకాస్థానకము భిన్నవిషయముగా నున్నను రూపక్షతిని పొందదు.

౪. కావ్యయోజిత మయిన వచనవిన్యాసము కాని కథారూపముగ నుండునది గాని శ్లేషవశమున నర్థద్వయము కలదై వస్త్వంతర ముపక్షిప్తము చేసినచో నాల్గవ పతాకాస్థానక మగును. కావ్య ప్రయుక్త మయిన వచనవిన్యాసము సాలంకారత్వ సంపత్త్యాశయమున శోభనము ప్రసాదయుక్తమై శ్లేషవశమున ననేకార్థసంప్రయుక్త మగును. అప్పు డది వస్త్వంతరోపక్షేపములో సమర్థము కా గలదు. అప్పుడు చతుర్థపతాకాస్థానక మందురు. కావ్యరూపతాపత్తి పరమాశయమున ప్రయుక్త మయిన శ్లేషయే ప్రధానవస్త్వంతరము సూచింప గలదు. రెండర్థము లిచ్చు శ్లేష యున్నంత మాత్రమున కావ్యార్థ

సహకారము కలుగదు. ఈ చతుర్థస్థానకము రత్నావళిలో సంగతమై యున్నది. సాగరికాగత మయిన ప్రధానవస్త్వంతరము సూచించుటకచట ద్వ్యర్థవచనవిన్యాస మున్నది.

నాటకమున చతుష్పతాకా పరమముగా కార్య ముండుట సమ్మతము. అది వక్ష్యమాణ సంధిపంచక సంయుక్తమును కావలెను. నాట్యవిషయమున నున్న కార్యసంపత్తి పతాకా చతుష్టయముతో నుండవలయు ననుట పతాకాస్థానకముల యుత్కర్షను సూచించును. కావ్యకార్య మట్లుండుట నాట్యసంపత్తి. కావ్యమున పతాకా నాయకు డొనరింప వలసిన కార్యలేశమున నొక పతాకాస్థానకమె సహకరించి యుపకరించునా? నాల్గు పతాకాస్థానకము లుండవలెనా? యను మీమాంసలో గొందరిట్లనిరి. "నాలుగు సంధులలో నాలుగు పతాకాస్థానములు నలుగురు పతాకానాయకు లుందురు. నాలుగు పతాకాస్థానకములు నాలుగుసంధులలో నలుగురు పతాకానాయకులను యథాక్రమముగా సూచింప గలవు. ముఖసంధిలో ప్రథమ పతాకాస్థానక ముండును. నాల్గవ యవమర్శసంధిలో చతుర్థ పతాకా స్థానక ముండును. అట్లె రెండు మూడులలో రెండవది మూడవది యుండును." అని ఇది యంతయు నసంగతముగ నున్నది. పతాకకు సూచకాంతరములను జెప్పినట్లు, ప్రకరీ కార్య బిందు బీజములకును సూచకాంతరములను జెప్పవలసి యుండును. నియమముగా నలుగురు పతాకా నాయకు లుండవలసి వచ్చును. విమర్శసంధి నుండి పతాకేతివృత్తము వినివృత్త మగుట కుదుర వచ్చును. కాని గర్భసంధి నుండి వినివృత్తము కావలెనని పూర్వము చెప్పినది కుదురదు. చతుష్పతాకాపరమ మనుట యసంగతమె యగును. ముఖ్యనాయకుని విషయములో నితివృత్తసూచకముల లక్షణపురస్సరముగ నిరూపింపక, పతాకానాయకుని విషయమున కథన మసంగతమై యథరోత్తర మాశ్రయించి నట్లగును. ముఖసంధిలో మొదటిది యుండవలెనని ప్రతిముఖసంధిలో రెండవ స్థానక ముండ వలెనని క్రమము చెప్పుటయు న్యాయపరీక్షలో సాక్ష్య మిచ్చుటకు దక్షముగ నున్నట్లు మేము సమీక్షింపము. ఈ యసంగతప్రసంగ మిక చాలును.

ఇతివృత్తము వ్యాఖ్యాత మయినది. దాని భేదద్వయము నిరూపిత మయినది. తత్ప్రసంగము ననుసరించి యాధికారికత్వసిద్ధికై యనువృత్తిస్థానభూతము లయిన పంచావస్థలు ప్రదర్శితము లయినవి. అర్థప్రకృతిపంచకము ప్రపంచిత మయినది. తత్ప్రసంగముననె పతాకాస్థానముల స్థానమును నిదర్శిత మయినది. పంచసంధియుక్త మనుట యితిశబ్దార్థము. ఇక పంచసంధులను జెప్పవలయును. పంచసంధుల విషయమున నిది యుద్దేశవచనము.

సంధిపంచకము

౪౮౬. <u>ముఖం ప్రతిముఖం చైవ గర్భో విమర్శ ఏవ చ</u>
<u>తథా నిర్వహణం చేతి నాటకే పంచ సంధయః</u>

ముఖము ప్రతిముఖము గర్భము విమర్శము నిర్వహణము నని నాటకమున పంచసంధు లుండ వలెను. మూల శ్లోకములో "చ, ఏవ, ఏవ, చ, చ" అను నయిదును సముచ్చయపదములు. ఇవి యన్నిటికి సంబంధించును. అట్లు సంబంధ సమన్వయమున పంచ సంధులు సర్వత్ర యవశ్యంభావు లని ద్యోతిత మగును. ఆ సముచ్చయపదములు నియమవాచకము లగుట క్రమనియమ మున్నది. నాటకము నం దుండవలె ననుట యుపలక్షణము. అభినేయరూపకము లం దంతట నుండవలె నని తాత్పర్యము. రూపకార్థము మహావాక్యార్థరూపము. దానిలో నయి దంశము లున్న వని యవస్థాభేదమున కల్పన చేయవలసి యున్నది. ముఖసంధి యనుటలో నిది. తాత్పర్యవిశేషము. ముఖము స్వతంత్రము. ఇతివృత్తమున సమస్త ప్రయోజన స్వభావము. కావుననె నాయకునకు స్వముఖమున గాని పరద్వారమున గాని ప్రారంభావస్థ యొకటి ప్రథమమున వ్యాఖ్యాత మయినది. తద్రూపసంబంధము కల సర్వార్థరాశి ముఖసంధి యగును. ఉపక్షేప పరికరాది సధ్యంగములు ఆ యర్థరాశి లోని యవాంతర భాగములు. ఇట్లె యితరసంధు లందును గుర్తింప వలెను. కాగా సర్వావయవములు పరస్పరము సంధీయమానములై, యంగములతో గూడ సంధీయమానములై "సంధులు" అగునని సమాఖ్య నిరుక్త మయినది. ఇది సంధుల సామాన్యలక్షణము. ఇక వీని విశేషలక్షణములు.

౪౮౭. యత్ర బీజసముత్పత్తిర్నానార్థ రస సంభవా
కావ్యే శరీరానుగతా తన్ముఖం పరికీర్తితం
౪౮౮. బీజస్యోద్ఘాటనం యత్ర దృష్టనష్టమివ క్వచిత్
ముఖన్యస్తస్య సర్వత్ర తద్వై ప్రతిముఖం స్మృతం
౪౮౯. ఉద్భేదస్తస్య బీజస్య ప్రాప్తిరప్రాప్తిరేవ వా
పునశ్చాన్వేషణం యత్ర స గర్భ ఇతి సంజ్ఞితః
౪౯౦. గర్భనిర్భిన్నబీజార్థో విలోభనకృతోఽథవా
క్రోధవ్యసనజో వాపి స విమర్శ ఇతి స్మృతః
౪౯౧. సమానయనమర్థానాం ముఖాద్యానాం సబీజినాం
నానాభావోత్తరాణాం యద్భవేన్నిర్వహణం హి తత్

౧. ము ఖ సం ధి :- మొదటగా నారంభభావి యగుట ముఖమువలె నుండుటచే ముఖసంధి యయినది. యావత్క్రియా సహిత మయిన యర్థరాశిలో ముఖోపాయ మయిన బీజమునకు సమ్యగుత్పత్తి దీని యం దుండును. ఇది నా నా ర్థ ర స సంభవము. కావ్యము నం దిది శరీరానుగతమై యుండును. ప్రారంభస్వరూప మగు శరీరముతో ననుగత మగును. ప్రసంగసమాయాత మయిన, నానావిధముగా నుండు నట్టి యర్థవశమున గలుగు రససంభూతి యిందుండును. "ఏతదుక్తం భవతి." ప్రారంభోపయోగి యగు నాటకీయార్థరాశి ప్రసక్తానుప్రసక్తిగా నెంతవరకు విచిత్రాస్వాదమున ప్రసరించునో యంతవరకు ముఖసంధి యగును. రూపకైకదేశము తద్విశేషమునె చెప్పును. రత్నావలినాటికలో ప్రథమాంకమున ముఖసంధి యున్నది. వత్సరాజు సాగరికను దర్శించుట సమాత్యుడు ప్రారంభ విషయము చేసికొనినాడు. ఆ యంకమున సమాత్యుని వీరము, ఉదయనుని శృంగారాద్భుతములు, పిమ్మట శృంగార మనునది యంతయు నిది యర్థరాశి. ఇది యంతయు రాజదర్శనమున నుపయోగించును గావున ముఖసంధి యయినది. ఇట్లె ప్రతిసంధి పరిశీలింప వలెను. నానార్థరససంభవ మయిన బీజసముత్పత్తి కావ్యమున శరీరానుగతము కాగా ముఖసంధి యగుటను పై విధమున భావించి తెలియ వచ్చును.

౨. ప్ర తి ము ఖ స ం ధి. ముఖసంధిలో నిరూపిత మయిన బీజ మొకచో దృష్టనష్టముగా నుండగా దాని యుద్ఘాటన మొనర్చుట

ప్రతిముఖసంధి యగునని స్థూలభావము. బీజము దృష్టనష్ట మగుట ననేకు లనేకవిధముల వ్యాఖ్యానించిరి. అందుకొన్ని భావము లి ట్లున్నవి.

౧. బీజమునకు సంబంధించిన ఫలానుగుణ మయిన దశావిశేషము కార్యరూపముగా దృష్టమయినను కారణరూపమున నదృష్టమై యగును గావున దృష్టనష్టరూప మన వచ్చును.

౨. బీజార్థ దశా విశేష ముపాదేయాంశమున దృష్టరూపముగ నుండి హేయాంశమున నష్టరూప మగుట దృష్టనష్ట స్వభావము.

౩. ఫలమయి బీజదశ నాయకేతివృత్తమున దృష్ట మగును. ప్రతి నాయకేతివృత్తమున నదృష్ట మగును. ఇదియె దృష్టనష్ట విధానము.

ఈ వాదము లే మాత్రము సమంజసముగ లేవు. బీజసంబంధి ఫలానుగుణ దశావిశేషము ఏకవిషయముగ లేక పోయినచో ననుసం ధాన సంపత్తియే కుదురదు. కార్యకారణరూపమున హేయోపాదేయ రూపమున నాయకప్రతినాయకరూపమున నున్నప్పు డేకవిషయత్వము లేదు. హేయాదివిషయముగా నున్న నాశముకూడ ప్రారంభవశమున దృష్టముగనె యుండును. పై యర్థభావముల విడనాడి యీ విధముగ దృష్టనష్టరీతిని గుర్తింపవలసి యున్నది. ఇక నిచట నిది యర్థము. బీజము యొక్క యుద్ఘాటన మనునది ఫలానుగుణ మయిన దశావిశే షము. అది దృష్ట మయినను విరోధిసన్నిధి వలన నష్టము వలె నుండును. బీజము పాంసుపిహితము కాగా దాని యంకురము మొలక స్పష్టముగ గోచరము కాదు. అట్లే ప్రకృతమును. వేణీసంహార నాట కమున ద్వితీయాంకము నం దిది సంగతమై గోచరించును. ముఖ సంధిలో నిరూపిత మయిన పాండవాభ్యుదయము భీష్మవధ వలన నుద్ఘాటిత మయినది. దృష్ట మయినది. కాని యభిమన్యువధ వలన నష్టప్రాయ మయినది. విరోధిసాన్నిధ్యమున నిట్లు నష్ట మగుటనె సమన్వయించి గుర్తింప వలెను. దృష్టత ప్రతిముఖసంధిలో నుపయో గించు నని, నష్టత యవమర్శసంధిలో నుపయోగించు నని దృష్టనష్ట రీతులలో నుత్తరోత్తర వికాసతారతమ్య ముండుటను కొంద రూహిం

-చిరి. వారి యూహా భావసారముతో నున్నట్లు తోచదు. పూర్వావస్థ దృష్ట మయినను తరువాత గోచరించు వికాసము ననుసరించి పరిశీలింప నష్టముగనె యుండును. అట్టి దవమర్శముననె నష్ట మనుట యేల? భూమిలో బీజ ముంచిన విధమున ముఖసంధిలో న్యస్త మయిన బీజము ప్రకృతము దృష్టనష్ట మగుట పరిగ్రాహ్యము. రత్నావలిలో ని ట్లున్నది. అమాత్యుడు సాగరికాచేష్టితమును వసంతోత్సవ కామదేవ పూజాదికముచే తిరోహిత మొనర్చుట వలన సాగరికాచేష్టితము నష్ట మయిన విధముగ నున్నది. ఉత్సవాదికము తదాచ్ఛాదక మయినను భూమి బీజమును వలె సాగరికాచేష్టితమును ప్రత్యుద్బోధింప జేయు చున్నది. దృష్టనష్టతుల్యముగా ముఖసంధి న్యస్త మయిన యంశమును ప్రతిముఖసంధిలో నుద్ఘాటింప వలయును. కథాభాగ సమూహమునం దెచట నీ యుద్ఘాటన ముండునో యచట ప్రతిముఖసంధి యగును. "ప్రతిరాభిముఖ్యేన వృత్తిః" అభిముఖముగా వృత్తి యుండుట ప్రతి ముఖసంధి యగును. పరాఙ్ముఖత్వము దృష్టనష్ట కల్పనా నిదర్శనము. రత్నావలిలో;— "నా శరీరము పరవాసదూషిత మయినను ఈ నా డీతని దర్శనమున నభినందింప దగినది" యని సాగరిక యనుట వలన సుసంగత యేర్పరచిన రాజ తత్సమాగమ పర్యంతము ద్వితీయాంక గత మయిన కావ్యము ప్రతిముఖసంధి యగుచున్నది. "స్తోకప్రాయ ముగా బీజ ముద్ఘాటిత మగుట" యని శంకుకాదు లుదాహరించుట నేకదేశలక్షణ మగును. అది చతురశ్రము కాదు. ముఖసంధిలో దృష్టనష్టముగ న్యస్త మయిన బీజార్థమును కథాభాగసమూహము నం దుద్ఘాటనము చేయుట ప్రతిముఖసంధి యని తాత్పర్యము పర్యవసితము.

3. గర్భసంధి. బీజమున కుద్ఘాటనము, ప్రాప్తి యప్రాప్తి యన్వేషణ ముండుట గర్భసంధి. ఉత్పత్తి యుద్ఘాటనము అనెడు దశాద్వయావిష్ట మయిన బీజమున కుద్భేదము=ఫలజననాభిముఖ్యత్వ ముండుట గర్భ మందురు. ప్రాప్తి యప్రాప్తి యన్వేషణము లుద్భేద వివరణము. ప్రాప్తి నాయకవిషయముగా నుండును. అప్రాప్తి ప్రతి నాయకచరితము నందు గోచరించును. అనంతర మన్వేషణ మనునది

యుభయసాధారణము. కొందరీ విధముగ నూహించిరి. నాయక ప్రతినాయకానుసంధానము వీర రౌద్ర విషయమె కావున బహువ్యాపిత సంపాదించుట కిట్లందురు. "ప్రాప్తి యప్రాప్తి యన్వేషణ మని మఱల మఱల గలుగు నేవంవిధావస్థలతో గూడి యుండుట గర్భసంధి యగును" అని. ప్రాప్తిసంభవావస్థ యుండును గాన ఫలమునకు గర్భీభావ ముండును. రత్నావలి ద్వితీయాంకములో నిట్లున్నది. సుసంగత వచనము. "నీ వదక్షిణవు. ప్రభువు స్వయముగా హస్తమున గ్రహించినను కోపము విడచవు కదా!" ఇత్యాది ప్రఘట్టమున ప్రాప్తి యున్నది. తృతీయాంకమున వాసవదత్త ప్రవేశింపగా అప్రాప్తియు నున్నది. "సాగరికావిషయము తెలిసికొనుటకు వెళ్ళిన వసంతకు డాలస్య మొనరించినాడే!" యనుటలో నన్వేషణ మున్నది. పిమ్మట విదూషకుడు వచ్చి "నా నుండి ప్రియవచనము వినగా రాజునకు గలుగు సంతోషము కౌశాంబీ రాజ్య లాభమున గూడ గలుగదు" అనుటలో ప్రాప్తి యున్నది. అనంతరము వాసవదత్తా ప్రత్యభిజ్ఞానము రాగా అప్రాప్తియు నున్నది. మరల సాగరిక సంకేత స్థానమున కేతెంచుటలో నన్వేషణ మున్నది. మరల లతాపాశకరణములో ప్రాప్తి. ఇట్లు గర్భసంధి సంగత మగును. గర్భసంధిలో నప్రాప్త్యంశ మవశ్యంభావి. కాకున్న సంభావనాత్మక మయిన ప్రాప్తి కుదురదు. నిశ్చయాత్మకప్రాప్తియె యుండును. అవమర్శ సంధిలో ప్రాప్తియె ప్రధానము. అప్రాప్త్యంశము తక్కువగా నుండును.

౫ ౪. విమర్శ సంధి. గర్భసంధిలో విశద మయిన బీజార్థము విలోభనకృతముగ నేని క్రోధవ్యసనజముగ నేని భాసించినచో విమర్శ సంధి యగునని సామాన్యార్థము. కొందరు దీనిని విమర్శసంధి యందురు. మరికొంద రవమర్శ మందురు. విమర్శసంధి సందేహాత్మకముగ నుండును. మొదట సంభావనాప్రత్యయ మని యనంతరము సంశయ మని యనుట యుచితము కాదు. తర్కము సంశయనిర్ణయముల కంతరాలమున నుండునని తార్కికు లందురు. విమర్శసం నియతఫలప్రాప్త్యవస్థతో నుండును. కాగా నియతత్వ ముండు- స్థ

మున సందేహ ముండు ననుట సంగతోక్తి కాదు ఇందు కొంద రిట్లందురు. తర్కానంతరము కూడ హేత్వంతరవశమున బాధ ఫల ములు పోగా సంశయము కలుగ వచ్చును. అది యేల కలుగదు? ఈ నాటకప్రక్రియలో గూడ నిమిత్తబలమున ఫలము సంభావిత మయినను బలవద్విఘాతము కలిగినప్పుడు కారణములును బలీయము లయినప్పుడు జనకవిఘాతకములు తుల్యబలములై యగును. అప్పుడు సందేహ ముదయించును. తుల్యబలములు విరోధము కల వయినప్పుడు వికల్పము శాస్త్రసమ్మతము. తుల్యబలములు విరోధము కల వయి నప్పుడు కార్యవైధుర్యము కలుగ జేయును. వ్యాధూనన మొన ర్చును. అట్టివి సంధీయమానములు కాగా స్ఫారఫలదర్శనములో పురుషకారము నే నని తల యెత్తును. కావున సంశయము తప్పని సరి. తర్కానంతరము సంశయము పిమ్మట నిర్ణయ మన్న ప్రక్రియా క్రమమె సముచితతరము. "తథా హి." పురుషకారశీలురె శ్లాఘా పాత్రులు. వారు ప్రాణసందేహ మున్నను నానాస్వభావాత్మకులై యాపదల తరింతురు. సంభావనా సముపేతు లగుదురు. అది యాశ్చ ర్యకారి యగును. కొంత ప్రయత్నోపనిపాతము కలుగ వచ్చును. విధురప్రయత్నతయు నుండవచ్చును. అయినను పురుషకార సముద్య తుడు తన యత్నము మానడు. తుదకు నాశము సైతము విజిగీషా గర్భముగనె భావించి తన యత్నము సాగించును. అట్టివాని యాశ యానురోధముననె ఫలప్రాప్తి నియత మని నియతాప్తిని నిశ్చయించు చున్నారు. "శ్రేయాంసి బహువిఘ్నాని" యని పురుషకారశీలి భావించును. "నేను విఘ్నముల తొలగించు కొందు" నని సాభిమా నముగ ప్రయత్నించును. తన యుద్యోగసూత్రమును సహస్రగుణము చేయును. చూడుడు! రత్నావళిలో సాగరికా బంధనమున గూడ మహామాత్యు డొనరించిన యైంద్రజాలిక వృత్త మంతయు సునిపుణ ముగా సునిబద్ధ మయినది.

కొంద రవమర్శమును విఘ్న మని యనుకొనిరి. గర్భనిర్భిన్న బీజార్థ మనుచోట వ్యాఖ్యానమున "బీజము= బీజఫలము, అర్థము= నివృత్తి" అనిరి. కాగా గర్భసంధిలో స్ఫుటమై ముఖము చూపిన

బీజఫలమునకు నివృత్తియు నచట సంపాదితము కావలెను. అప్పుడు ఫలప్రసూతి నిర్విఘ్న మగును. సప్రాణ మగును. ఆ బీజఫలనివృత్తి యనేకవిధముల గలుగును. ఒకచో క్రోధమున నివృత్త మగును. ఒకచో లోభనిమిత్తమున గలుగును. మరియొకచోట వ్యసనమునను, స్థలాంతరమున శాపాది నిమిత్తమునను ఫలనివృత్తి కలుగును. "విలోభనకృతో౽థవా, క్రోధవ్యసనజో వాపి" "అపి" శబ్దమున విఘ్న నిమిత్తాంతరముల గుర్తింప వలెను. అన్నియు ప్రతిపద శక్యనిర్దేశములు కావు కదా! వాని సర్వసంగ్రహ 'మపి' గ్రాహ్యము. రత్నావలిలో నవమర్శ మిట్లు సంగత మయినది. ఇది చతుర్థాంకము లోని విషయము. వాసవదత్త సాగరికను కారాగారములో నుంచినది. అప్పుడు రాజిట్లు చింతించును. "సాగరికను కంఠమున కౌగిలించుకొని యప్పు డట్లయితిని. ఇప్పు డామె విలుప్త. నా తనువు సాగరికావస్థను భావించి యెట్లో సమాశ్వాసము పొందుచున్నది." ఇందు సాగరికాశ్లేష విఘ్నమున వాసవదత్తాక్రోధము నిమిత్తము. తాపసవత్సరాజములో లోభము నిమిత్త మయినది. ఇట్లె యితరము లంటితరములు సుగ్రహములు అని.

ఈ విఘ్నవాదమును కొందరు సహింపరు. రూపకము లందట్లు సమన్వయమును క్షమింపరు. తాపసవత్సరాజములో లోభనిమిత్తముగా సమన్వయము సహృదయసమ్మతము కాదు. వాసవదత్తాప్రాప్తిలోభము ప్రకృతఫలమున విఘ్నకారి కాదు. ఈ సమన్వయమును సంభావింపుడు. వత్సరాజు పద్మావతిని పరిణయ మాడినాడు. కాని యింకను వాసవదత్త లభింప లేదని ముమూర్షువై మరణాధ్యవసాయమున నున్నాడు. అప్పుడు మంత్రుల రాజ్యప్రాప్తి విలోభ మె నిమిత్త మనుట సముచితము.

వ్యసన మమర్ష నిమిత్తముగా నుండుట శాకుంతలనాటకమున నున్నది. ఇట్లే యనేకము లున్నవి. విద్యాప్రభావము నిమిత్త మగును. దైవము సమయనియమమును నిమిత్తముగ నుండును. విక్రమోర్వశీయములో పుత్రుని వదన మవలోకించి నప్పటి నుండి యూర్వశి స్వర్గగమన నిశ్చయమున నుండుటలో సమయపాలనమె నిమిత్తము.

ఈ విమర్శవిషయమున మఱికొందరి మరియొక విమర్శ యున్నది. వీరు విమర్శపద మావృత్తి చేసిరి. ఇక నిష్టార్థసిద్ధి కిట్లనిరి. గర్భనిర్భిగ్న మయిన బీజార్థఫలము విమర్శరూప కథావయవమున నుండగా నచట విమర్శాదులె కారణము లగును. విమర్శాత్మక కథావయవములో విమర్శకారణముగా గర్భనిర్భిన్న మయిన బీజార్థ ఫల ముండునని భావము. ఈ వ్యాఖ్యానమున దోష మున్నది. విదూర కారణసంపాతాత్మకత యనునది యీ విమర్శసంధి ముఖ్య రూపము. ఆ రూప మీ వ్యాఖ్యానమున నస్పష్టమె యగును.

మరొక రిట్లందురు. లాభయోగ్యత్వము, నాశావస్థ, అన్వేష ణావస్థ యనునవి యథారుచి యుండును. అట్లె గర్భసంధిలో నిరూ పితము లగును. ఈ విమర్శసంధిలో గూడ యథారుచి నిబంధింప వలెను. లాభాత్మక మయిన ప్రాప్త్యవస్థ ప్రతిముఖముననె సుబద్ధ మయినచో నాశాన్వేషణములు రెండును గర్భసంధి యం దుండును. ఒకప్పు డవమర్శమున నాశావస్థ యున్నచో గర్భమున నన్వేషణమె యుండును. గర్భములో నాశాన్వేషణములె యున్నచో నవమర్శ ములో విచారము నిబంధింప వలెను. "నా కిది ప్రాప్తప్రాయమె యయిన నపహృత మయిన దేమి? నే నిం దేమేని విగుణోపాయ మనుష్ఠించితినా? నా కిది ప్రాప్తియోగ్యమె కదా?" ఇట్టి విచారణ మవమర్శములో నుండుట సముచితము. * * * "అవమర్శ మనుట యన్వేషణభూమి. అది యవమృష్టి" అని యుద్భటుడు వ్యాఖ్యా నించుట లక్ష్యవిరుద్ధముగా నున్నది. యుక్తివిరుద్ధము నగును. ప్రారం భాద్యవస్థలను పూర్వము నిరూపించితిమి. ఆ పంచకమున నొక క్రమ నియమ మున్నది. తత్సమర్థన ప్రస్తావ మందలి యుక్తి. ఉద్భట వ్యాఖ్య యీ యుక్తి ననుసరింపదు. ఇట్టి విరుద్ధ మెట్లు స్వీకార్యము? దీని నటుంచెదము. "ఆస్తాం."

శ్రీశంకుకు డిం కొకటి యనెను. "ఇది యంతయు విఫల క్రియ. నన్నెవడో విలోభపెట్టి యిందు ప్రవర్తింప జేసినాడు." ఇట్లు కర్త విమృశించు నేని యది విలోభనకృత విమర్శము. క్రోధమున వ్యసనమున గర్భనిర్భిన్నఫలము వ్యాపద్యమాన మగునపుడు ఫలవ్యా

పత్తి విషయకముగా కర్త విచార మొనరించినచో నది క్రోధవ్యసనజ విమర్శ యని భావింప వచ్చును. అంతట విమర్శనస్వభావమె విమర్శము. ఇట్లెంతగా కార్యవినిపాత మున్నను అనంతరము నిర్వహణ సంధిలో నిబధ్యమానాద్భుతరసమునకు పరిపోషకముగనె యుండును'' అని. ఇట్లను శంకుకులు వేరొకటియు ననవలెను. ''విచారము కేవలము విమర్శయందే కాదు. అది సంధు లన్నిట ననుయాయి. ఈ స్థలమున గూడ నది పూర్వసంప్రాప్తమె. అయిన నిచట పృథగ్విమర్శ యుండును గావున విమర్శసంధిని విమర్శనస్వభావ మంటిమి'' అని. ఎందరెందరో విచారము విమర్శించిరి. ''విచారము వ్యాపత్తి విషయ'' మని యొకరని మా సరణిలోనికె వచ్చిరి. ఇట్టివాని వ్యాఖ్యానించి చెప్పుటేల? విలోభనకృతోదాహరణము వ్యాపత్తి విమర్శ కాదని సర్వ నుసమంజసముగా యథారుచి ప్రకల్పించు కొను వారి కల్పనాప్రసవము లేల? ''అలం''.

గర్భసంధిలో సముద్భేదము పొందిన బీజాంశఫలమును పరామర్శ మొనరించుట విమర్శసంధి యగును. ఇది విలోభనమున క్రోధమున వ్యసనమున నింక నితరమున ననుసంధానము కల దగును. ఇట్లు విమర్శ భావసారము గుర్తించి నిర్వహణ మందు కొనవచ్చును.

౫. నిర్వహణసంధి. బీజవికారావస్థా చతుష్టయముతో గూడుకొనిన ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ లనెడు నాలుగు సంధుల నానాభావసముత్కర్ష కల యర్థముల సమాహార ముండుట నిర్వహణ సంధి యగునని ముఖతాత్పర్యము. ముఖాది చతుస్సంధులకు సంబంధించిన ప్రారంభాద్యర్థములు ప్రసిద్ధములు. అవి క్రమముగా బీజవికారము లనదగిన యవస్థాచతుష్టయ యోగము పొంది యుత్పత్తి యుద్ఘాటన ముచ్ఛేదము గర్భనిర్భేదస్వరూపము కల వగును. అట్టివవి సుఖదుఃఖాత్మకము లయిన హాస శోకక్రోధాది రూపముగా నానావిధము లయిన భావముల సంబంధము పొందుచున్నవి. పొంది భావోత్తరము లగు చున్నవి. అట్టి భావము లన్నియు చమత్కారాస్పదము లగుట వలన ముఖాద్యర్థములు సముత్కర్షము పొందును. అట్టివాని సమానయనము నిర్వహణసంధి. సమానయన మనుట

యర్థరాశిలో సమానీతము లగుట, ఫలనిష్పత్తిలో సమాయోజితము లగుట, ఫలయోగావస్థావ్యాప్తము లగుట యని భావము. కొందరు అవస్థాపంచక నిర్వహణములోని సంధు లన్నియు పృథక్సత్త ననుసరించి యోజితము లగునని యనుట కిష్టపడుదురు. కొందఱకు సంధిలో సంధ్యంతరానుప్రవేశ మభీష్టము. అయినను ప్రాగవస్థ యేకోత్తరావస్థాస్వరూపమున పరిణమించి యుండుటలో హేతువాలోచింపరు. ఆ యవస్థలన్నియు కార్యాత్మకము లగు నందురు. ఇట్టి వీరులకు సాంఖ్యదర్శనము తచ్ఛాయాశ్రయణము సమ్మత మయినందున నొక యవస్థ ఫలసంబధ సంగమనమునకు తగిన యుపకరణసామగ్రి పొందినదై తదేకభావమున నుండు అవస్థాంతరముల కన్నింటికిని ఫలసంగమనము సముచిత మనియె భావించు చున్నారు.

మరి కొంద రీ విషయమున నిట్లు వ్యాఖ్యానించు చున్నారు. ముఖంసధిలోని యర్థోపాయము లన్నియు ప్రధానములు. వాని నవలంబించియె యితరము లుండును. ముఖాద్యములు= ముఖసంధిలో ప్రధానభూతములు. అవి యవలంబ్యమానములు కావున మహౌజసములు. అవియె ఫలసంపత్తిలో సాధకములుగా నుండును. అట్టి వానికి ఫలసంగతిచే సమానయన ముండుట నిర్వహణసంధి యగును. "ముఖాద్యానాం మహౌజసాం" అని వారి పాఠనిశ్చయము. సుఖప్రాప్తి ఫలస్వరూపమున నుండు నప్పుడు ప్రారంభాదు లన్నియు రతిహాసాది బాహుల్యముతో నుండుటయు, దుఃఖహాని ఫలముగా నుండు నపుడు ప్రారంభాదులు క్రోధశోకాది దుఃఖాత్మక భావ బాహుల్య ముండుటయు రూపకరచనా ప్రక్రియ యందురు. ఆ యా భావముల బాహుల్యము సముచిత స్వోచిత వ్యభిచారిభావ సహితముగనె యుండును. రత్నావలిలో దీని యుదాహరణము సంగతము చేయవచ్చును. ఇంద్రజాలిక ప్రవేశము మొదలు సమాప్తిపర్యంత మిట్టి భావమున నిర్వహణసంధి యగును. ఈ సంధ్యాదుల యవస్థారీతి నాయకముఖమున తదమాత్యముఖమున తత్పరివారముఖమున నాయికాదిముఖమున గూడ నుండ వచ్చును. ఏకముఖమునసె నియోజన ముండ నవసరము లేదు. ఈ విషయ మిదివరలో విస్తృతమె యయినను ప్రసంగవశమున పునరుపపాదిత మయినది.

ప్రయోక్తలు నాటకము లందీ సంధులను సావధానముగా కూర్పవలెను. కేవలనాటకమునకె యివి యుండు ననుట కాదు. ప్రకరణమునకీ సంధు లుండును. మిగులు వానికి నివి యుండును. కాని కొంత విశేష మున్నది.

> ౪౯౨. డిమః సమవకారశ్చ చతుస్సంధీ ప్రకీర్తితౌ
> న తయోరవమర్శస్తు కర్తవ్యః కవిభిః సదా
>
> ౪౯౩. వ్యాయోగేహామృగౌ చాపి సదా కార్యౌ త్రిసంధికౌ
> గర్భావమర్శౌ న స్యాతాం తయోర్వృత్తిశ్చ కైశికీ
>
> ౪౯౪. ద్విసంధి తు ప్రహసనం వీథ్యంకో భాణ ఏవ చ
> ముఖనిర్వహణే తత్ర కర్తవ్యే కవిభిః సదా

డిమము సమవకార మనువానిలో నాలుగు సంధులే యుండును. వానిలో నవమర్శసంధిని కవులు కూర్పగాదు. అచట విమర్శసంధి కూర్చుట శక్యము కాదు. వ్యాయోగము ఈహామృగము మూడు సంధులతో నుండును. గర్భావమర్శము లుండవు. వానిలో కైశికీ వృత్తి యుండును. ప్రహసనము, వీథి, అంకము, భాణము రెండు సంధులతో నుండును. వానిలో ముఖసంధి నిర్వహణసంధులను కవులు కూర్పవలెను. వీథీ భాణ ప్రహసనములు కైశికీవృత్తి రహితముగా నుండవలెను. దశరూపకములం దీ విధముగా సంధులను ప్రయోక్తలు గ్రథింప వలెను. ఇతివృత్త శరీరారంభము సంధిపంచకాత్మకముగా నుండగా నీ నిరూపించిన వినియోగప్రకారమున సంధు లుండుటచే దశరూపకభేదము కలిగిన దని భావింప వలదు. లక్ష్యభేదముననె దశరూపభేదము ప్రసిద్ధ మయినది. ఇదియె యుక్తము. ఆవశ్యకమును. డిమ సమవకారములు నాల్గు సంధులతో నుండునవి, వాని యందు భేదము కుదురక పోవలెను. నాటకప్రకరణాదులందును సంధికృత మయిన భేదము కుదురదు. ఈ చెప్పిన సంధుల కన్నిటికిని "అంగకల్ప" మిక తెలియవలసి యున్నది. అంగముల కల్పము కల్పనాప్రకార ముండుట యితివృత్తమున కుపకరించును.

> ౪౯౫. సంధీనాం యాని వృత్తాని ప్రదేశేష్వనుపూర్వశః
> స్వసంపద్గుణయుక్తాని తాన్యంగాన్యుపధారయేత్.

అంగముల సామాన్యలక్షణము ప్రయోజనముఖముగ దర్శింప వలెను. అర్థభాగరాశి సంధి యని నిరూపితము. సంధులకు సంబంధింప దగిన సంవిధాన యోగ్యము లగు వృత్తఖండములు కొన్ని యుండును. వాని నాదిమధ్యాంత భాగ ప్రదేశములం దనుక్రమమున స్వ సంపద్గుణ యుక్తము లగునట్లు నిరూపింప వలెను. వీని క్రమ మను నది ముఖ్యప్రయోజన సంపాదనమున కగు బలముతో గూడి యుండును. ప్రయోజనమునకు దగిన బలసంపత్తితో నుండుటయె సముచితము. లక్షణ నిరూపణ మున్నదికదా! యని తత్ప్రసంగ పరికల్పిత మయిన క్రమమున కూర్చుట తగదు. ఇట్టి యీ యంగములు ప్రదేశప్రవర్తనమున రమణీయము లగును. ఇవి స్వసంపద్గుణ యుక్తము లగుట వివక్షితము. అంగములగు నివి తమ యంగి యగు సంధిసంపత్తిలో నంగభావము మీరి యుండరాదు. సముచిత సంబంధ సంపాదకములై యుండ వలెను. అప్పుడె యవి యంగము లగునని గ్రహింప వలెను. స్వసంపద్గుణ యుక్తతను కొందరిట్లు వ్యాఖ్యానించిరి. "స్వసంపదలు బీజోత్పత్త్యుద్ఘాటనాదికములు. గుణములు శబ్దార్థవైచిత్ర్యములు" రూపకములం దనుసంహితము లగు సంధ్యంగములు బీజోత్పత్తి బీజ సముద్ఘాటనాదికముల కనుకూలములై శబ్దార్థవైచిత్ర్య సహితములై యుండవలయు నని వారి భావము. అంగములకు సంబంధించిన సంపత్తి గుణములతో కూడి యుండుటయు స్వసంపద్గుణయుక్తత యని భావింప వచ్చును.

### ప్రయోజనషట్కము

౪౯౬. ఇష్టస్యార్థస్య రచనా వృత్తాంతస్యానుపక్షయః
రాగప్రాప్తిః ప్రయోగస్య గుణానాం చైవ గూహనం

౪౯౭. ఆశ్చర్యవదభిఖ్యానం ప్రకాశ్యానాం ప్రకాశనం
అంగానాం షడ్విధం హ్యేతత్ దృష్టం శాస్త్రేప్రయోజనం

సంధ్యంగసంఘటనమున శాస్త్రదృష్ట మగు ప్రయోజన మారు విధముల నున్నది.

౧. ఇష్టార్థ రచనము. ఇష్టార్థ మభీష్ట మయిన ప్రయోజనము. అది రసాస్వాదకారి. తాదృశప్రయోజనమును విస్తరింప

జేయుట ప్రథమప్రయోజనము. ఏ యంగ మెట్లుపకరించునదియు తల్లక్షణమున నభివ్యక్తము కాగలదు.

౨. వృత్తాంతానుపక్షయము. ఆరంభించిన వృత్తాంతము విస్తృత మగునట్లు పరిశీలనము. వస్తు వుపక్షీణము కాక క్రమముగా స్ఫుట మగుట ప్రయోజనానుకూల మగుట యంగాంగిభావప్రవణ మగుట మొదలగునవి యీ ప్రయోజనరూపములు. వస్తుస్ఫుటత్వ మావశ్యకము. కాక శలాకాకల్పముగా నుపక్షీణమై యుండరాదు. ఈ వృత్తాంతానుపక్షయాత్మక ప్రయోజనము సర్వసాధారణము.

3. ప్రయోగరాగప్రాప్తి. ప్రయోగ మభినయాత్మకము. అది యితివృత్తానుబంధి. దానిని స్వయముగా గాని పరంపరగా గాని వ్యుత్పత్త్యవస్థాయోగమున రంజనయోగ్య మగునట్లు పరిశీలింప వలెను. ప్రయోగమున కిట్టి యోగ్యతాలాభమె రాగప్రాప్తి.

౪. గుహ్యగూహనము. దీనినె గోప్యగోపన మందురు. ఇతివృత్తము సందన్ని ఖండములు ప్రకాశ్యములు కావు. సంఛాద నీయములు కొన్ని యుండును. సంఛాదనీయార్థ సంఛాదన మావశ్యకము. పౌనరుక్త్యాద్యభ్యాసములందు గుహ్యగోపన మున్న విధముగా నిందును గొన్ని యంగములు గుహ్యాంగగూహన మొనర్ప గలవు. దానిచే నవి యభ్యాహ్యాసారములై సహృదయుల కరుంతుదములు కావు.

౫. ఆశ్చర్యవదభిఖ్యానము. అభిఖ్యాన మితివృత్తము. పునః పునః శ్రుతమగుట చేతనే యితివృత్త మాశ్చర్యకారి యగుట కాదు. సంధ్యంగ సంయోజనమున నపూర్వత వహించి యితివృత్త మాశ్చర్యకారి యగును. ఇట్లు ఆశ్చర్యాభిఖ్యాన మొక ప్రయోజనము.

౬. ప్రకాశ్యార్థప్రకాశనము. రంగప్రయోగ యోగ్యమై ప్రకాశ్యాత్మక మగు వస్తువు వ్యుత్పత్తి నాధానించునదై సాతిశయముగ నుపయోగింప వచ్చును, అందుననె యది ప్రకాశ్యము. ప్రకాశ్య ప్రకాశనము విస్తరణము, సంధ్యంగసాధ్య మగును.

ఈ ప్రయోజనషట్కములో మొదటి ప్రయోజనము చమత్కారకృతము. స్మృతిదృష్ట మయినను ప్రత్యక్షవిశేషసిద్ధ మగును. అది సంధ్యోపాసనాదికము వలె నదృష్టసిద్ధము కాదు. పూర్వరంగాంగముల వలె నుభయరూపమును కాదు. ఇది యంతయు శాస్త్రదృష్ట ప్రయోజనము. ఇచట శాస్త్ర మనునది నాట్యాత్మక మయిన వేదము. నాట్యవేదమున నిట్లు ప్రయోజన మున్నదని భావము. ఈ ప్రయోజనముల కన్నిటికి నంగలక్షణము లం దుదాహరణ సమన్వయము లవభాసింప గలవు.

## సంధ్యంగములు — అంగప్రయోగావశ్యకత

౪౯౮ అంగహీనో నరో యద్వన్నైవారంభక్షమో భవేత్
అంగహీనం తథా కావ్యం న ప్రయోగక్షమం భవేత్

౪౯౯ ఉదాత్తమపి యత్కావ్యం స్యాదంగైః పరివర్జితం
హీనత్వాద్ధి ప్రయోగస్య న సతాం రంజయేన్మనః

౫౦౦ కావ్యం యదపి హీనార్థం సమ్యగంగైః సమన్వితం
దీప్తత్వాత్తు ప్రయోగస్య శోభామేతి న సంశయః

అంగహీన నరుడు కార్యారంభసమర్థుడు కా జాలడు. అంగహీనకావ్యము ప్రయోగక్షమము కాదు. సంధ్యంగసంఘటనము లేక పోయినచో ప్రయోజనము సంపన్నము కాదు. సంపన్న దృష్ట ప్రయోజన మేని ప్రచ్యుతము కావచ్చును. కావ్య ముదాత్తమయి నను సంధ్యంగరహిత మయినచో ప్రయోగహీన మగుట వలన సచేతసుల చేతముల రంజింప జేయజాలదు. కావ్యలక్షణములు కలిగి గుణాలంకృతి యుక్తమయినచో కావ్య ముదాత్త మగును. అట్టి దయిన నంగశూన్య మగుట ప్రయోగహీనమై యయుక్త మగును. అట్టిది సన్మనోరంజన మొనరింప దనుటలో నిది భావము. పరోప కార ప్రవృత్తు లయిన సత్కవులు నటులు సాధుప్రాయులు సామాజికులు నున్నారు. వారల కిది మనోరంజకము కాదు. వా రసంధిక మభినందింపరు. ఏదేని కావ్య మొకప్పుడు హీనార్థము కా వచ్చును. అయిన నదియు సంధ్యంగముల సమ్యక్సమన్వయము కలదయినచో ప్రయోగము దీప్త మగును గావున శోభాసంపాదక మగును. ప్రహస

నప్రాయముగా నుండు వానిలోని కథాఖ్యాయికాదులు స్వల్పప్రయోజనముతో నుండును గావున హీనార్థ మందురు. అట్టిచో గూడ సంగ్రహయుక్తి ప్రయోజకమై రంజనాతిశయ మాధానించును. వ్యుత్పత్త్యతిశయమును గూర్చును. కావున నంతట సంధిప్రదేశము లందు యథాయోగము యథారసము కవి సంధ్యంగములను గూర్చవలెను. సంధ్యంగము లన్నియు సంధులందలి విశేషములు. ఈ యంగము లర్థయోగమున సంహితములై ప్రయోజనావహము లగును. ఇక సంధ్యంగముల సంఖ్యానింతుము.

౧. ముఖసంధి యంగములు. ౧౨

ఉపక్షేపము పరికరము పరిన్యాసము
విలోభనము యుక్తి ప్రాప్తి
సమాధానము విధానము పరిభావన
ఉద్భేదము కరణము భేదము

౨. ప్రతిముఖసంధి యంగములు ౧౩

విలాసము పరిసర్పము విధూతము
తాపనము నర్మ నర్మద్యుతి
ప్రగయణము నిరోధము పర్యుపాసనము
పుష్పము వజ్రము ఉపన్యాసము
వర్ణసంహారము

౩. గర్భసంధి యంగములు. ౧౩

అభూతాహరణము మార్గము రూపము
ఉదాహరణము క్రమము సంగ్రహము
అనుమానము ప్రార్థన-ఆక్షిప్తి తోటకము
అధిబలము ఉద్వేగము విద్రవము

౪. విమర్శసంధి యంగములు ౧౨

అపవాదము సంఫేటము
శక్తి వ్యవసాయము ప్రసంగము

| | | |
|---|---|---|
| ద్యుతి | ఖేదము | నిషేధనము |
| విరోధనము | ఆదానము | ఛాదనము |
| ప్రరోచన | | |

౫. నిర్వహణసంధి యంగములు. ౧౪

| | | |
|---|---|---|
| సంధి | నిరోధము | గ్రథనము |
| నిర్ణయము | పరిభాషణము | ద్యుతి |
| ప్రసాదము | ఆనందము | సమయము |
| ఉపగూహనము | భాషణము | పూర్వవాక్యము |
| కావ్యసంహారము | ప్రశస్తి | |

ముఖసంధిలో పంన్రెండు. ప్రతిముఖ గర్భము లందు పదమూడు, అవమర్శము నందు పంన్రెండు, నిర్వహణమున పదునాలుగు మొత్త మంగము లరువది నాలుగు నియతములై యున్నవి. ఈ సంధ్యంగ సంభావనములో కొందరి మనన మీ విధముగ నున్నది. ఇందలి యవస్థ లన్నిటి యందును ఉపక్రమము ఉపసంహారము మధ్య మని స్థానభేద త్రయ మున్నది. ఉపక్రమాదిత్రికమునందు సూక్ష్మముగా నవస్థాపంచక ముండ వలెను. కాగా పదునైదు దశలు క్రమముగా సంభవింప గలవు. చివరి దశ దశలకు మొదటి పంచ దశ లంగ ములుగా వర్ణితములు కా వలెను. అప్పుడా పది దశ లం దంగి బుద్ధి యుదయించును. నిర్వహణసంధిలో పదునాలు గంగములు ఫల యోగ బలమున నన్నియు నుపపాదితము లగును. ఇతరము లయిన ముఖాదిసంధులలో గొన్ని యంగములు లీనీకృతము లగును. పం న్రెండు భేదములతో నున్న యంగము లచట నుపపన్నములు కాక పోవచ్చును. అని

ఇట్లు భావభావనము సముచితము కాదు. ఇట్లె యయిన నీ క్రమమె యంతట నుండవలయును. ప్రయోజన శంకా షట్క మిట్లు లేదు. ప్రయోజనషట్క మంతయు నసంగతము కావలసి వచ్చును. ఇట్లు నిబంధన సంభావనమున వృత్తాంతానుపక్షయ మనునది యొక్క టియె ప్రయోజన మగును. బీజకరణమున గూడ నియమ నిదాన మనుపపన్నము కాక పోగా రెండు సంధులలో ద్వాదశాంగ నియమ

నము రెండు సంధులలో త్రయోదశాంగ నియమనము కుదురనిదై యాకస్మికపాతిత మయిన విభాగమె యగును. "ఆస్తా మిదం".

బీజార్థసంపాదనమున నీ సంధ్యంగములు సమ్యక్సిద్ధికరములు. కావ్యార్థములను సముచితముగ విభాగించుకొని కవులు వీనిని నిరూపించవలెను. వీని కిక యథాక్రమము లక్షణకథన మావశ్యకము. లక్షణకథనము నందె క్రమవివక్ష కలదు కాని వాని నిబంధనమున క్రమవివక్ష లేదు. ఉద్భటప్రభృతులు సంధులలో నంగముల ఘటనమున క్రమనియమ మభిమానించి పలికిరి. వారి వచనము యుక్త్యాగమ విరుద్ధము. "తథాహి;" ముఖసంధిలో నయిదవ యంగము "యుక్తి" యున్నది. "సంప్రధారణ మర్థానాం యుక్తిరిత్యభిధీయతే" యని తల్లక్షణము. అర్థ సంప్రధారణాత్మక మగునది సంధులలో నంతట నిబంధనయోగ్యము. నివేశ్యము కూర్చి నప్పు డిది సుప్రయోజనమె యగును. యుక్తి ఘటించి నప్పుడు ప్రతీతి వ్యుత్పత్తి క్షతి యేమియు గలుగదు. ఒక్కొక సంధికి గొన్ని నియతములె. అయిన నితరములలో నవి యుండరానివి కావు. ఆ యా సంధులలో నవి యవశ్యంభావు లని ఖ్యాపనము చేయుటయె వాని భావము. ముఖసంధిలో యుక్తి యవశ్య ముండును. సంధ్యంతరాలము లిట్టివి కావు. వాని స్వరూపము విశదము కా గలదు. కొన్ని కొన్ని సంధ్యంగములు స్వరూపబలముననె ప్రతినియతములు కా గలవు. ఉపక్షేప మనునది మొదటి ముఖసంధి యందె యుండ వలయును. వస్తు వుపక్షిప్త మయినప్పుడె యేమేని శక్యక్రియ మగును. అనుపక్షిప్త మయినచో నేమియు జేయ వలను పడదు. చతుష్షష్ట్యంగ సంయుత మని యనుట సంధిసంభవము చెప్పుటయె కాని నియమము కాదు. యథాసంధి నిబంధనమె యుక్తము. ఆ యా సంధుల యౌచిత్యానుసారమున నే యే యంగములు సంగతము లగునో వాని నిబంధనము యుక్త మగును. ఇది యంతయు మే మభిధానించిన నీతిపథోపదేశి.

శరీర సంధిబంధములం దంగనియమ మున్నది. ఇందేల లేదని కొందరు శంకింతురు కాబోలు! శరీరమున నంగనియమ మనునది యొక వ్యవస్థ. అది సర్వాత్మనా సంభవధర్మము కాదు. కొందరకు

కొన్ని యుండ వచ్చును. కొన్ని యుండక పోవచ్చును. వ్యవస్థాత్మక మయిన నియమ మిందును గలదు. శాఖాదులు వృక్షావయవములు. శాఖలు స్కంధమున నుండును. మధ్యలో నుండును. పై పై నుండును. వృక్షాదులలో వలె శరీరము నందు వలె నుపక్షేపాదులచే నవయవవికల్పముగా సంధి సమారబ్ధము కాదు. ఉపక్షిప్తార్థము విస్తృతము కాగా గోచరము కావలసిన యుపాయాదుల సంప్రధారణ ముండును. అదియె యుపక్షేప పరికర పరిన్యాస విలోభన హేతు వగును. కేవలము తావన్మాత్ర మట్లె సంభవించు ననుట యుక్తము కాదు. దీని యనంతర మిది యను నియమము ముని కభిమతముగ గన్పట్టదు. సంధ్యంతరములు సామాదులు, లాస్యాంగములు గేయపదాదులు నిరూపించు నాట్యవేద ముని సంధ్యంగములకు క్రమమును వివక్షించుట లేదు. క్రమమునే తలచినచో సంధ్యంతరములకు లాస్యాంగములకు నివేశస్థలమె యుండదు. సంధిపంచకమయ మగు రూపకము క్రమనియతము కాగా సంధియు తదంగసంహారమున భావితమె యగును. ఇక నీ సామాది గేయపదాదుల కవకాశమేది? సంధ్యంగములను క్రమముగా ప్రయోగింప వలెనని భరతభారతి యేదియు లేదు. అట్టి యంతటి మాటయే కలదో! అది న్యాయాపేత మగును. అన్యథాయోజితమె యగును. ఉద్దేశక్రమమె నిబంధనక్రమ మని యనము. లక్షణము లలంకారములు గుణములు వీథ్యంగములు సంధ్యంతరములు లాస్యాంగములు వృత్తులు తదంగము లిందు దృష్టాంతము కానోపవు. ఈ యంశ మంతయు ప్రత్యేకముగా లక్షణమున స్ఫుటము కా గలదు.

### ముఖసంధ్యంగములు

౫౦౧ కావ్యార్థస్య సముత్పత్తిరుపక్షేప ఇతి స్మృతః
యదుత్పన్నార్థబాహుల్యం జ్ఞేయః పరికరస్తు సః

౫౦౨ తన్నిష్పత్తిః పరిన్యాసో విజ్ఞేయః కవిభిస్సదా
గుణనిర్వర్ణనం చైవ విలోభనమితి స్మృతం

౫౦౩ సంప్రధారణమర్థానాం యుక్తిరిత్యభిధీయతే
సుఖార్థస్యాభిగమనం ప్రాప్తిరిత్యభిసంజ్ఞితా

౫౦౪ బీజార్థస్యోపగమనం సమాధానమితి స్మృతం
సుఖదుఃఖకృతో యోఽర్థస్తద్విధానమితి స్మృతం
౫౦౫ కుతూహలోత్తరావేగో విజ్ఞేయా పరిభావనా
బీజార్థస్య ప్రరోహో యః స ఉద్భేద ఇతి స్మృతః
౫౦౬ ప్రకృతార్థసమారంభః కరణం నామ తద్భవేత్
సంఘాతభేదనార్థో యః స భేద ఇతి కీర్తితః

ప్రస్తావన యనునది రూపకాంగము కాదు. అది నటవృత్త వ్యాప్తము. ఇతివృత్తమున కందు ప్రవేశము లేదు. ప్రస్తావనానంతరము మొదటగా సంధ్యంగసంబంధ ముండును. ప్రతిముఖసంధికి సంబంధించిన యంగముల లక్షణ మీ శ్లోకవర్గమున నున్నది.

౧. ఉపక్షేపము. కావ్యార్థసముత్పత్తి యుపక్షేపము. ఇతివృత్త శరీరాత్మక మయిన యభిధేయము ప్రధానరసమును కావ్యార్థ మగును. ఇట్టి కావ్యార్థమును ప్రయోజనపరముముగా సంక్షిప్తముగా సూచన మొనరించుట ఉపక్షిప్తము చేయుట ఉపక్షేపమగును. వేణీసంహారము నందు భీమసేనుని వచన మిందు సంగతము. "మా కన్ని విధముల విఘాత మాపాదించిన కౌరవులు సపరివారముగా స్వస్థు లగుట యుండునో!"

౨. పరికరము. పూర్వ ముపక్షిప్తమును కొంతగా విస్తరించుట పరికరము. అదియె యుత్పన్నార్థ బాహుల్యము. పూర్వసముత్పన్నార్థమునకు కొంతగా బాహుల్యము నిరూపించుట పరికరమని తెలియ వచ్చును. వేణిలోనే భీముడు; "నాకు బాల్యమునుండి కురువులతో విరోధ మున్నది. అది విరూఢ మయినది. నేను సంధిపడను. సంధి విఘటింతును. ఏదీ! మీరు ఘటింపుడు ? కుదురనిత్తునేమో? " ఈ యర్థములో విస్తృతిసంభావనము సుకరము.

3. పరిన్యాసము. తన్నిష్పత్తి పరిన్యాస మని కవులు సదా గుర్తింప వలెను. పరికరమున కన్నను దీనిలో నిశ్చయాపత్తి యంతట హృదయమున నా యర్థమును విన్యసించును. పరితః=అంతట న్యాస ముండుటచే పరిన్యాస మని సార్థకము. వేణిలో భీమవచన మిట్లున్నది. "గద త్రిప్పి సుయోధనుని తొడలు చూర్ణము చేసి

ఆ రక్తము పూసికొనిన చేతితో నీ కేశములు ముడి వేయుదును.”
భీమనిశ్చితము దీనిలో విశదము.

౪. వి లో భ న ము. గుణనిర్వర్ణనము విలోభనము. వస్తు
వొకటి గుణయుక్త మని శ్లాఘాపాత్ర మగును. శ్లాఘయె విలోభన
హేతువగుట విలోభన మయినది. విక్రమోర్వశిలో నిది సంగతము.
ఊర్వశిని భావించి విక్రము డిట్లు భావించును. “ఈమె సృష్టిలో
చంద్రుడు మదనుడు వసంతుడు ప్రజాపతి యయి యుండును. వేద
జడుడు పురాణముని యీ మనోహర రూప మెట్లు నిర్మింప గలడు?”
ఇందు గుణవద్రూపశ్లాఘ యుక్తముగా విలోభన మయినది. ఈ
యుపక్షేపాదులు నాలుగంగములు సామాన్యముగ ముఖసంధిలో
నుండును. ఈ చెప్పిన పౌర్వాపర్యముననె యుండ నక్కఱ లేదు.
వీని యందానంతర్య నియమము లేదు. సామాది సంధ్యంతరములు
మధ్యలో ననుప్రవేశము పొంద వచ్చును. కావ్యవృత్త ముపక్షీణము
కాకుండు నట్లీ నాలుగు సుఘటితములు కా వలెను. వీని కన్నిటి
కదియె ప్రయోజనము. ఇష్టార్థ రచనయు పరికర ప్రయోజనము
కా దగును.

౫. యు క్తి. అర్థసంప్రధారణము యుక్తి. కార్యార్థముల
పర్యాలోచనానంతర మొక నిశ్చయభావనము యుక్తి కా దగును.
వేణిలో నిట్లున్నది. “ధర్మజసందేశమును మీరు సరిగా గుర్తింప లే”
దని సహదేవు డనగా నప్పుడు భీముడు “క్రోధమున శత్రుకులము నాశ
మొనరించుట మీకు సిగ్గుగా నున్నదా? సభలో భార్యాకేశాకర్ష
ణము సిగ్గుగ లేదా?” ఇం దర్థనిశ్చయాత్మకయుక్తి యున్నది.
ప్రకాశ్యప్రకాశనము కూడ నీ యుక్తిప్రయోజనముగా భావింప
వలెను.

౬. ప్రా ప్తి. సుఖార్థాభిగమనము ప్రాప్తి. సుఖపెట్టు వస్తు
సంప్రాప్తి వర్ణిత మయినప్పుడు ప్రాప్తి నిశ్చయింప వలెను. వేణిలో;
శ్రీకృష్ణుడు పాండవాభిమానమున నున్నాడని సుయోధనుడు బంధిం
చుట కుద్యమించినా డను వార్త రాగా ధర్మజుడు భీముని చూడ

దలచుట ప్రాప్తి యయినది. ఈ యర్థము సంధి విఘటనమున భీముని చేతఃసుఖద మయినది.

౭. సమాధానము. బీజార్థోపగమనము. ప్రధాననాయకానుగతముగా బీజార్థము సమాహిత మయినప్పుడు సమాధానము కాదగును. వేణిలో, యాధిష్ఠిరక్రోధజ్యోతి విజృంభించుచున్న దనుటలో ప్రధాననాయకు డయిన ధర్మరాజు నందు బీజార్థ మనుసంహిత మయినందున సమాధానసమన్వయ మూహించునది.

౮. విధానము. సుఖదుఃఖకృత మయిన యర్థసంవిధానము విధానము. సుఖదుఃఖములు వ్యామిశ్రములై యభిహితము లయినచో విధాన మగును. వేణిలో, భీముడు ద్రౌపదిమాటలలో విధాన మున్నది. "పాంచాలి! కురుకుల క్షయమున కిదిగో బయలుదేరుదునా?" నాథ! అసురసంహారమున కభిముఖు డయిన హరి మంగలము మీకు కలుగును గావుత.! అనపేక్షితశరీరులై సంచరింపకుడు. రిపుబలముల నప్రమత్తముగ సంచరింప వలెను కదా!" ఇందు ద్రౌపదీప్రహర్షము భయము వ్యామిశ్రముగా విహితమై విచిత్రతచే రసబంధుర మయినది. ఈ విధానమున ఇష్టార్థరచనము నిగూహ్యాగూహనము ప్రయోజనము. నాయికాచిత్తములో నిస్త్రింశభావము గోపనీయము. తన్నిగూహన మిందు సిద్ధము. యుక్తివలె నిదియు నితరములందు సంభవించును. ఇట్లె యన్యములం దభ్యూహింప వలెను.

౯. పరిభావన. కుతూహలోత్తరావేగము పరిభావన. కుతూహలము కౌతుకము. కౌతుకముతో గూడిన జిజ్ఞాసాతిశయమున వ్యామిశ్రిత మయిన యావేగము వర్ణిత మయినప్పుడు పరిభావన మగును. వేణిలో; ద్రౌపది సంగ్రామతూర్యనాదము వినినదై "ఏమిది ప్రలయాంతఘనగర్జితముగా సమరదుందుభి మ్రోగుచున్నదే." అనుటలో కుతూహలమిశ్ర మయిన యావేగ మున్నది. ఇట్లుండుటయె కుతూహలోత్తరావేగము.

౧౦. ఉద్భేదము. బీజార్థప్రరోహ ముద్భేదము. వేణిలో "నాథా! మీరు నన్నుసమాశ్వాసింపజేయవలయునుసుమా!" "పరి

భవ లజ్జా వ్యాకుల వదనుని అనిశ్చేషిత కౌరవ్యుని వృకోదరుని నీవు చూడవు" పరిభవము పో గొట్టి సుయోధనాదుల నశింపజేసి నేను నీ దగ్గరకు వచ్చి సమాశ్వాస మొనరింతు నన్న భావము కల పై పంక్తు లలో బీజార్థ ప్రరోహ మూహ్యము. ఇది శత్రుక్షయారంభ మయిన బీజాంకురము. భూమిసంశ్లేషము బీజమున కనుకూల మయినట్లు బీజ ప్రరోహమున కిదియును స్థానానుగుణము. అందున నిది యుద్భే దాంగ మయినది.

౧౧. క ర ణ ము. ప్రకృతార్థసమారంభము కరణము. వేణిలో; "మన మిపుడు విక్రమానురూపముగా నాచరించుటకు బయల్వెడ లుద" మని సహదేవు డనుటలో నిది యున్నది.

౧౨. భే ద ము. రంగమున ప్రవేశించిన పాత్రసంఘాతము నిజ ప్రయోజన ముపక్షేపించి నిష్క్రమణమునకై విడిపడుట భేద మను నంగము. వస్తూపాయాత్మక మయిన భేదము సంధ్యంతరము లం దున్నది. ఇది యంకములం దంతర్గత మగును. పాత్రసంఘాత భేద నమునకై భేదము కీర్తిత మయిన దని లక్షణవాక్యార్థము వేణిలో మొదటి యంకాంతమున భీమవాక్యము "సంగ్రామసాగరములో సంచరించుటకు పాండుపుత్రులు పండితులె" యనుభావము కల పద్యము భేదోదాహరణము కా గలదు. ఇవి ముఖాంగములు ఇటుపై ప్రతిముఖాంగములు నిరూపితము లగును. ప్రతిముఖాంగములుగా నిర్దిష్టము లయిన యంగముల నుద్దేశక్రమమున లక్షణము నిరూ పించెదము.

ప్ర తి ము ఖ స ం ధ్య ం గ ము లు.

౫౦౭. సమీహా రతిభోగార్థా విలాస ఇతి సంజ్ఞితః
దృష్టనష్టానుసరణం పరిసర్ప ఇతి స్మృతః

౫౦౮. కృతస్యానునయస్యాదౌ విధూతం హ్యపరిగ్రహః
అపాయవర్జనం యత్తు తాపనం నామ తద్భవేత్

౫౦౯. క్రీడార్థం విహితం యత్తు హాస్యం నర్మేతి తత్స్మృతం
దోషప్రచ్ఛాదనార్థం తు హాస్యం నర్మద్యుతిః స్మృతా

౫౧౦. ఉత్తరోత్తరవాక్యం తు భవేత్ప్రగయణం పునః
యా తు వ్యసనసంప్రాప్తిః స నిరోధః ప్రకీర్తితః

౫౧౧. క్రుద్ధస్యానునయో యస్తు భవేత్తత్పర్యుపాసనం
విశేషవచనం యత్తు తత్పుష్పమితి సంజ్ఞితం
౫౧౨. ప్రత్యక్షరూక్షం యద్వాక్యం వజ్రం తదభిధీయతే
ఉపపత్తికృతో యోర్థ ఉపన్యాసశ్చ స స్మృతః
౫౧౩. చాతుర్వర్ణ్యోపగమనం వర్ణసంహార ఇష్యతే

౧౩. విలాసము. రతిభోగార్థమగు సమీహా విలాసము. రతిస్వరూపమయిన భావమునకు హేతువుగా నొక భోగముండును. విషయము వనిత పురుషుడు మొదలగు భోగపదార్థార్థమునకుగా నయిన సమీహా విలాసమయినది. కామఫలకము లయిన రూపకములలో ప్రతిముఖము నందె యాస్థాఫలముగా రతిరూపముగా నీ విలాస ముండును. శాకుంతలము నందిది సుసంగతము. రాజు దుష్యంతు డిట్లు చింతించును. "ప్రియ సులభ కాదు. మన మామెను గోచరింప జేసికొనినను తుష్టి వహించును. మదను డసఫలు డయినను పరస్పరకాంక్ష రతి కూర్చును." వేణీసంహారమునందు ద్వితీయాంకములో భానుమతితో దుర్యోధనుని విలాసము దర్శిత మయినది. అది యట్టి సమయమున నాయకున కనుచిత మని చిరంతనులు సహృదయాలోక కారులె యనిరి. రసబంధాపేక్షమున సంధిసంధ్యంగము లుండవలెను గాని కేవలశాస్త్రార్థస్థితి సంపాదనేచ్ఛతో నుండరాదు. రతిభోగార్థవిలాస మని యనుట ప్రమర్థోపయోగి రసగత స్థాయిభావముల కన్నిటికి నుపలక్షణము. కాన వీరప్రధానకము లయిన రూపకములందు ప్రతిముఖమునందె యాస్థాబంధముగా నుత్సాహము వర్ణింపవలెను. "సమ్యగ్విషయా సమీహా చేష్టావిలాసః" సముచితవిషయమునందలి యీహాత్మక మయిన చేష్ట విలాస మగునని భావము. యుక్తచైతన్య మగు రసమె ముఖసంధిలో నుపక్షిప్తము. అదియె ప్రతిముఖము నందు సముచితారంభ సంభావితము కావలెను.

౧४. పరిసర్పము. దృష్టనష్టానుసరణము. కన్పడీ కన్పడక అస్పష్టముగా నున్న యంశము ననుసరించుట. శాకుంతలములో దుష్యంతుడు పాండు సికతమున పదపంక్తి నన్వేషించుచు తిరుగు రీతిలో విలాస మున్నది.

౧౫. వి ధూ త ము. మొదటగా నాచరించిన యనునయము నంగీకరింప కుండుట విధూతము. బ్రతిమలాడుకొను రూపమున నున్న సామవచనమును ప్రథమమున నంగీకరింపక పోయినను అనంతర మంగీకరించుటలో కొంతగా నుపరోధ ముండునని గుర్తింప వలెను. శాకుంతలములో "ఆ రాజంతఃపుర విరహ పర్యుత్సుకుడు. ఆ రాజర్షి నవరోధ పెట్ట నేల?" ఇత్యాది శకుంతలావచనమున నిది సంగతము.

౧౬. తా ప న ము. అపాయదర్శన మనునది తాపన మగును. రత్నావలిలో నిది స్పష్టము. "దుర్లభ నం దనురాగము. లజ్జ యధికము. స్వాతంత్ర్యమా! లేదు. ప్రేమ విషమము కదా! ప్రియసఖి! యిక మరణమె శరణము" ఈ సాగరికావచనము లం దిది సమన్వితము కా గలదు.

౧౭. న ర్మ. క్రీడార్థ మాచరించిన హాస్యము నర్మ యగును. రత్నావలిలో విదూషకుడు; "ఓహో! పాండిత్యగర్వము వహింపకుము. ఈమె నుండి నే నా విషయము తెలిసికొని వ్యాఖ్యానింతును." ఇత్యాదికమునందు క్రీడాపరిహాసాత్మక నర్మ యున్నది.

౧౮. న ర్మ ద్యు తి. దోషప్రచ్ఛాదనమున కగు హాస్యము నర్మద్యుతి యగును. ఒక దోషమును కప్పిపుచ్చుటకు ఒక వచన ముపయుక్తము కాగా నది హాస్య ముత్పాదించును. అప్పుడు నర్మ ద్యోతిత మగును. కాన నిది నర్మద్యుతి. రత్నావలిలో విదూషకుడు తన మౌర్ఖ్యదోషమును కప్పిపుచ్చుకొనుటకు పలికినది రాజునకు హాస్య ముత్పాదించినది. దానిచే నర్మ ద్యోతిత మయినది. అచట రాజ విదూషకుల భాష యిట్లున్నది. "చతుర్వేది బ్రాహ్మణుని వలె బుక్కులు పఠించినదే" "నా కేమియు తెలియ లేదు" "దుర్లభ జనానురాగము ......" "మహాబ్రాహ్మణ! ఇట్టిబుక్కుల తెలియు వాడు వేరొక రెవరున్నారు?" ఇందు విదూషకుడు పలికినది రాజునకు హాస్యజనన మయినది.

౧౯. ప్ర గ య ణ ము. ఉత్తరోత్తరవాక్యము ప్రగయణ మగును. ప్రగయణపదము రూఢిశబ్దము. ప్రాగయణ మనియు కొందరు పఠించిరి. "ప్రాగితి పూర్వవచనం, తతోఽయనం ప్రాప్తిః

-యస్యోత్తరవచనస్య" పూర్వవచనానంతర ముత్తరవచనము ప్రాప్త మగుట, కాగా నుత్తరోత్తరవాక్య మని సారము.

౨౦. నిరోధము. వ్యసనసంప్రాప్తి నిరోధ మగును. ఇచట వ్యసనము ఖేదమాత్రము. అభీష్టోపరోధమున నిరోధము కాగలదు. రత్నావలిలో రాజు "బిగ్గరగా నవ్వి నీవు బెదర గొట్టితివి" అని పలికి నప్పు డభీష్టోపరోధము కలిగినది.

౨౧. పర్యుపాసనము. క్రుద్ధానునయము పర్యుపాసనము. రత్నావలిలో రాజు కోపించినా డని విదూషకుడు "రాజా! కోపింప కుము. ఇది కదలీగృహములో నున్నది" అని యనునయించినాడు. అప్పు డనునీతు డయిన రాజు "మదనతప్త లయిన వనితలు సఖు లెదుట పలికిన పలుకులను శుకసారికలు మరల పలుకగా ధన్యులకు శ్రవణసుఖము కలుగు" నని యనుటలో నీ యంగసమన్వయము విశద మగును.

౨౨. పుష్పము. విశేషవచనము పుష్పము. రత్నావలిలో రాజు చిత్రఫలకమును చూచి భావించుటలో విశేషవచన మున్నది. పుష్పము ప్రేమవికాసి యగునట్లు ప్రకృతమున గూడ రాజవచన ముత్తరోత్తరానురాగ విశేష సూచకమై యనురాగ వికాసము సూచించును.

౨౩. వజ్రము. ప్రత్యక్షరూక్షవాక్యము వజ్రము. రత్నా వలిలో రాజు "నే నిచట నున్నట్లు నీ వెట్లు తెలిసికొంటివి?" సుసం గత :- "చిత్రఫలకము కూడ తెలిసినది. నేనిప్పుడిది యంతయు దేవికి విన్నవించెదను." అనుటలో ప్రత్యక్షమున పారుష్య మున్నది.

౨౪. ఉపన్యాసము. ఉపపత్తి కృత మయిన యర్థ ముప న్యాస మయినది. రత్నావలిలో విదూషకుడు "ఈ గర్భదాసీ యతి ముఖర" యనినపుడు మౌఖర్య ముపపత్తిగా సూచిత మయినది.

౨౫. వర్ణసంహారము. చాతుర్వర్ణ్యోపగమనము వర్ణ సంహార మగును. చాతుర్వర్ణ్యశబ్దమున పాత్ర లుపలక్షితము లగును. పాత్రలు వేరుగా నున్నను ఖేకనము పొందుట వర్ణసంహారము. మా-

యుపాధ్యాయు లిట్లనిరి. వీర ప్రధానరూపకము నందు నాయకప్రతి నాయకులు తత్సచివులు ప్రధానముగా వర్ణింపబడుదురు కావున వారు నలుగురు వర్ణము లనదగుదురు. కామప్రధాన మగు రూపకము నందును నాయకుడు నాయిక తత్సచివులు నలువురు వర్ణములు. ఈ చతుర్వర్ణముల వారి యుపగమనమె వర్ణసంహారము. రత్నావలిలో నాయికానాయక తత్సచివుల యేకీభావము ప్రయోగమున నున్నది. ఇష్టరచన ప్రకాశ్యప్రకాశనము దీని ప్రయోజనములు. బ్రాహ్మణాది వర్ణచతుష్టయ మేలన మని వ్యాఖ్యానించుట యఫల మనాదరణీయము. ఇంతవర కివి ప్రతిముఖసంధి యుద్దేశక్రమమున లక్షణయుక్తము లయిన సంధ్యంగములు. ఇక గర్భసంధి యుద్దేశక్రమమున లక్షణముల జెప్పవలయును.

## గర్భసంధి యంగములు

౫౧౪. కపటాపాశ్రయం వాక్యమభూతాహరణం విదుః
తత్త్వార్థవచనం చైవ మార్గ ఇత్యభిధీయతే

౫౧౫. చిత్రార్థసమవాయే తు వితర్కో రూపమిష్యతే
యత్సాతిశయవద్వాక్యం తదుదాహరణం స్మృతం

౫౧౬. భావతత్త్వోపలబ్ధిస్తు క్రమ ఇత్యభిధీయతే
సామదానాదిసంపన్నః సంగ్రహః పరికీర్తితః

౫౧౭. రూపానురూపగమన మనుమానమితి స్మృతం
రతిహర్షోత్సవానాం తు ప్రార్థనా ప్రార్థనా భవేత్

౫౧౮. గర్భస్యోద్భేదనం యత్స్యాక్షిప్తిరిత్యభిధీయతే
సంరంభవచనం చైవ తోటకం త్వితి సంజ్ఞితం

౫౧౯. కపటేనాతిసంధానం బ్రువతేఽధిబలం బుధాః
భయం నృపారిదస్యూనాముద్వేగః పరికీర్తితః
శంకాభయత్రాసకృతో విద్రవః సముదాహృతః

౨౬. అభూతాహరణము. కపటాపాశ్రయము కల వాక్యము. విదూషకాదులు కపటవచనము పలుకుట. రత్నావలిలో వాసవదత్త చిత్రఫలకమును చూడగా విదూషకుడు పలుకుట. "ఆత్మ చిత్రము వేయుట దుష్కరమని నే ననగా ప్రియవయస్యుడు విజ్ఞానముచూపినాడు" ఇందు విదూషక కాపట్యము స్పష్టము.

౨౭. మార్గము. తత్త్వార్థవచనము. "మహారాణి! ఒకప్పుడు ఘుణాక్షరముగకూడ కావచ్చును" అని కాంచనమాల యనగా వాసవదత్త సమయానుసారముగా పరమార్థోచితవచన మిట్లు పలికినది. "ఓసి! ఋజుకా! ఈతడు వసంతకుడు గదే!" ఇత్యాది వచనము మార్గము వలె ప్రసిద్ధ మగుట పరమార్థమున మార్గ మని వ్యపదేశించిరి. వసంతుడు కపటములు పలుకునని వాసవదత్త యనిన ట్లయినది.

౨౮. రూపము. చిత్రార్థసమవాయము నందలి వితర్కము రూప మగును. విచిత్రార్థముల సంభావనమున సర్వవిషయముగా వితర్క ముండుట. విరుద్ధతర్కము వితర్కము. ఇది యుచిత మిది యనుచిత మను ప్రతియుక్తి పర్యంతము ప్రసరించు తర్క మని భావము. యుక్తి నియతప్రతిపత్తిపర్యంతమె యుండును. యుక్తి వితర్కముల కిదియె విశేషము. రూప మనుట యనియతాకృతి నిరూపిత మగును. విశేషప్రతిపత్తియు నిం దున్నది. రత్నావళిలో రాజిట్లనును –"ప్రసీద! యందునా? యిది నీకు కోపములే కున్న తగదు కదా! ఇక నే నిట్లు చేయనందునా? అయిన సర్వ మంగీకరించి నట్లగును. నా దోషము లే దందునా? నీ విది 'మృషా' యందువు. ఈ యంశములో నేమి పలుకవలెనో నేను తెలియ జాలను గదా! ప్రియా!" ఇందు రాజు విచిత్రార్థములను సంభావనము చేసి యన్నిటిని వితర్కించుట యున్నది.

౨౯. ఉదాహరణము. సాతిశయవాక్యము, లోకప్రసిద్ధ వస్తువుల కన్న సాతిశయముగా జెప్పుటచే సముత్కర్ష కలుగును. "ఉత్కర్ష మాహారతీ త్యుదాహరణం" రత్నావళి యందు తృతీయాంకములో; "మనస్సు ప్రకృతిచంచలము. ఎరికిని లక్షింప రానిది. కాము డెట్లు సర్వబాణములతో విద్ధము చేసినాడో కదా!"

౩౦. క్రమము. భావతత్త్వోపలబ్ధి క్రమము. భావము భావ్యమాన వస్తువు. తద్భావనాతిశయ మున్నప్పు డూహ ననుసరించిన భావనాబలమున పరమార్థోపలబ్ధి యగును. అది క్రమము, భావనాతిశయసమయమున బుద్ధి క్రమించునే గాని ప్రతిహతము

కాదు. రత్నావలిలో రాజు నాయికను భావించి యామె భావవిశేష సంభావనములో నప్రతిహతముగా తన బుద్ధిసంక్రమమున తద్భావ భావనము చేయుటలో క్రమ మున్నది.

౩౧. సంగ్రహము. సామదానాది సంపన్నము. రాజు విదూషకాదుల ద్వారమున సంకేతాదివార్తలను విని కటకాదు లిచ్చుట సంగ్రహ మగును.

౩౨. అనుమానము. రూపానురూపగమనము. ప్రత్యక్షాదులచే నుపలభ్యమానము రూప్యమాన మగును. అట్టి దానిచే తదవినాభావిగా నుండు వ్యాపకరూపజ్ఞానము సంపాదించుట నిశ్చయాత్మక మయిన యూహ. వ్యాప్యవ్యాపకసంబంధ మిం దుండుట గుర్తింప వచ్చును. రత్నావలిలో రాజు విదూషకునకు మార్గ మూహించుచు సహేతుకముగా ననుమానించుటలో ననుమాన మున్నది.

౩౩. ప్రార్థన. రతిహర్షోత్సవముల సంప్రార్థనము ప్రార్థన మగును. సాధ్యఫలసముచిత భావమున ప్రధానముగ సముచిత మయిన భావము నధికముగా నభ్యర్థించుట ప్రార్థన యగును. రత్నావలిలో రాజు సంకేత స్థలము నందుండి నిరీక్షించుచు "ఈ స్మరసంతాప మధికముగా నున్నది. మొదటి కన్న నిప్పుడు ప్రత్యాసన్న సమయమున నధికముగా నున్నది." అని రతిహర్షోత్సవభావనము చేయుటలో నీ యంగ మున్నది.

౩౪. ఆక్షిప్తి. గర్భోద్భేదన మాక్షిప్తి. హృదయాంతః స్థితముగా నున్నట్టిది పునఃప్రతిష్ఠాపిత మయినను విశదమగుట కుద్భేదన మావశ్యకము. అప్పు డేదేని నిమిత్తమున నుద్భేదన మాపాదించుట యాక్షిప్తి యగును. ఆక్షిప్తి యనుట అనపహ్నవనీయ మయిన స్ఫుటతాపత్తి. ఇం దభిప్రాయమున కాక్షేప మనునది బహిఃకర్షణము. రత్నావలిలో రాజు విదూషకుడును వాసవదత్తను సాగరికగా తలచి పలికిన పలుకు లాక్షిప్తి సంగతి కలవని భావింప వచ్చును.

౩౫. తోటకము. సంరంభవచనము. ఆవేగగర్భ మయిన వచనము. ఆవేగము హర్షమున గలుగ వచ్చును. క్రోధమున జనింప

వచ్చును. వేరు విధమున నుదయింప వచ్చును. "భిన్నం...యుక్తోః హృదయం తతస్తోటకం." హృదయభేదన మొనరించునది...త్రోటక మని భావము. ఆవేగమున పలికి నప్పు డంత హృదయ మ్మావిష్కృత మగును. రత్నావలిలో విదూషకుడు, "నిత్యరుష్టా వాసవదత్త మాటలతో కర్ణములను కటూకరించి నది. నీ విప్పుడు మంచిమాట లతో సుఖ పెట్టుము" అని సంరంభమున హర్షకృతావేగమున బలుకు టలో తన యాంతరహృదయ భావము వెలువరించి నట్లయినది.

3౬. అ ధి బ ల ము. కపటమున నతిసంధాన మధిబలము. పరస్పరము మాట పై మాటగా మాటలాడు నప్పుడు వారిలో నొక డధికముగా కర్మసహాయ బుద్ధ్యాదుల నవలంబించును. అతడె రెండవ వాని నతిసంధాన (వంచన) మొనర్ప గలడు. అప్పు డది కర్మాధిబల మగును. రత్నావలిలో సాగరికావేషము ధరించిన వాసవదత్త విదూ షకబుద్ధిదౌర్బల్యమున రాజు నతిసంధానించినది.

3౭. ఉ ద్వే గ ము. నృపారి దస్యూత్థ భయ ముద్వేగము. అరి శబ్ద మిచట వ్యతిరేకమతు లయిన వారల కందర కుపలక్షణము. రత్నావలిలో సంభ్రమము పడిన రాజు వాసవదత్తను గుర్తించి యుద్వేగమున "ఏమి? దేవి వాసవదత్తయా? వయస్యా! ఇదియేమి?" అని యనగా విదూషకుడు "ఇంక నేమి యున్నది. జీవితసంశయము" అనుటలో నిద్దరి యుద్వేగము విశద మయినది.

3౮. వి ద్ర వ ము. భయత్రాసము లోదవించు వస్తువు నాశంకించుట విద్రవ మగును. "విద్రవతి విలీయతే హృదయం యేన" దేనిచే హృదయము విద్రవించి విలీన మగునో యది విద్ర వము. రత్నావలిలో రాజు "ఈ సంఘటనము సహింపక ప్రియ జీవి తము విడుచునేమో? ఉదాత్తప్రేమ స్ఖాలిత్యము సహింప రానిది" అని యనుటలో నాశంక యున్నది. కొందరు "శంకాభయత్రాస ములచే గలుగునది విద్రవ మనిరి. అప్పుడు మూలవచనములోని విశేష్యమేమో యన్వేష్య మగును. వీని సముదాయమె విశేష్య మని శ్రీశంకుకు డనెను. కృత్యారావణ మను నాటకమున నీ యంగ సంగతి యున్నదట. అందు షష్ఠాంకములో మండోదరి "ఆర్యపుత్రా!

రక్షింపుము! రక్షింపుము!" ప్రతీహారి విని "ఏమి! మహారాణి యాక్రందించెనా!" అని తలచి రావణునితో "ప్రభూ! అంతఃపురమున కలకలము పెద్దగా వినవచ్చెడి" అనగానె రావణుడు "అది యేమో గుర్తింపుము!" అని యనుట రావణుని యాశంకను సూచించి ప్రతీహారి త్రాసభయములను స్పష్టము చేయుచున్నది. (కృత్యారావణనాటక మీ నాడు గోచర మగుట లేదు.) ఇట్లివి గర్భసంధిలో నుండ దగిన యంగములు. ఇక అవమర్శసంధిలోని యంగముల లక్షణము.

## అవమర్శ సంధి యంగములు

౫౨౦. దోషప్రఖ్యాపనం యత్తు సోఽపవాద ఇతి స్మృతః
రోషగ్రథితవాక్యం తు సంఫేటః పరికీర్తితః

౫౨౧. గురువ్యతిక్రమో యస్తు న ద్రవః పరికీర్తితః
విరోధిప్రశమో యస్య సా శక్తిః పరికీర్తితా

౫౨౨. వ్యవసాయశ్చ విజ్ఞేయః ప్రతిజ్ఞాహేతుసంభవః
ప్రసంగశ్చైవ విజ్ఞేయో గురుణా పరికీర్తనం

౫౨౩. వాక్యమాధర్షసంయుక్తం ద్యుతిః తజ్జైరుదాహృతా
మనశ్చేష్టావినిష్పన్నః శ్రమః ఖేద ఉదాహృతః

౫౨౪. ఈప్సితార్థప్రతీఘాతః ప్రతిషేధః ప్రకీర్తితః
కార్యాత్యయోపగమనం విరోధనమితి స్మృతం

౫౨౫. బీజకార్యోపగమన మాదానమితి సంజ్ఞితం
అపమానకృతం వాక్యం కార్యార్థం ఛాదనం భవేత్
ప్రరోచనా చ విజ్ఞేయా సంహారార్థప్రదర్శినీ

౩౯. అపవాదము. దోషప్రఖ్యాపన మపవాదము. గుణములను దోషములనుగా నిరూపించుట. రత్నావలిలో సాగరికా వచనానంతరము రాజు "ఓసి! మిథ్యావాదిని! వాసవదత్త పైట యదరగా నే నదరితిని. ఆమె మౌనము పట్టగా ప్రియభాష పలికితిని. మొగము ముటముటలాడగా పాదాల్పైపై పడితిని. ఇట్లు దేవీవిషయములో నాభిజాత్యముతోడి సేవ మాత్రమె. నీ యందె ప్రేమాధిక రసప్రీతి యున్నది సుమా!" యని పలుకుటలో దేవీగుణములను

-పాతిశయ కోపనస్వభావమున నపవదన మొనర్చుట యున్నందున నిది యపవాదము.

౪౦. సం ఫే ట ము. కొందరు దీనిని సంస్ఫోట మందురు. 'స్ఫోట అనాదరే' ధాతువును వారు మనస్కరింతురు. రోషగ్రథిత వాక్యము సంఫేటము. రత్నావలిలో వాసవదత్త సరోషము సహసా వచ్చి "ఆర్యపుత్ర! యుక్తం? సదృశం?..." అనుటలో రోషగ్రథన మున్నది.

౪౧. ద్రవము. గురువ్యతిక్రమము ద్రవము. "ద్రవణం చలనం మార్గాదితి ద్రవః" మార్గము నుండి చలించుట. రత్నావలిలో భర్తృసన్నిధానమున గూడ విదూషకుని సాగరికను బంధించుట ద్రవము. తాపసవత్సరాజములో వాసవదత్త యౌగంధరాయణవచన మతిక్రమించి మరణనిశ్చయము పూనుట.

౪౨. శక్తి. విరోధప్రశమము శక్తి. విరోధియగు కుపితుని ప్రసాదనము శక్తి యగును. కుపితప్రసాదనము బుద్ధివిభవాది శక్తి కార్య మగుటచే నది శక్తి యయినది. రత్నావలిలో "సవ్యాజశపథములు సప్రియవచనములు చిత్తానువర్తనము పాదపతనము సఖీవాక్యములు మొదలగువాని ప్రయోగించి దేవిని స్వభావమునకు తెచ్చికొంటిని. ఆమె దుఃఖపడి బాష్పజలముతోడనె ముఖము ప్రక్షాలించుకొని కోపము విడనాడినది" అనుటలో రాజొనరించిన శక్తికార్యములచే నామె కోపము విడచి ప్రసన్న యయి నందున శక్తి యయినది.

౪౩. వ్యవసాయము. ప్రతిజ్ఞాహేతుసంభవము వ్యవసాయము. ప్రతిజ్ఞాత మంగీకృతము. అంగీకృతార్థహేతువుల ప్రాప్తి సంభవము వ్యవసాయ మయినది. రత్నావలిలో నైంద్రజాలికప్రవేశాదికముగా యౌగంధరాయణు డొనరింప దలచిన యంగీకృత కార్య ప్రాప్తి వ్యవసాయలక్ష్యము.

౪౪. ప్రసంగము. గురువుల పరికీర్తనము. రత్నావలిలో బంధుకులమునుండి వచ్చినాడని యైంద్రజాలికుని వాసవదత్త సమాదరమున సంభావించుటలో గురుపరికీర్తన ముండుట ప్రసంగ మయినది.

౪౫. ద్యు తి. ఆధర్షసంయుక్త మయిన వాక్యము ద్యుతి. ఆధర్షము న్యక్కారము తిరస్కారము తత్సంయుక్తము ద్యుతి. రత్నావలిలో విదూషకు డైంద్రజాలకుని తూలనాడుటలో ద్యుతి యున్నది.

౩౬. ఖే ద ము. మదచేష్టాజన్య మయిన శ్రమము ఖేదము. మానసఖేదము కాయికఖేద మని యిది ద్వివిధము. ఉభయ మిందు నిరూపింప దగినదె. రత్నావలిలో సింహళేశ్వరుని విషయమై కుశలప్రశ్న యడిగినప్పుడు వసుభూతి నిశ్వసించి "నేనేమి చెప్పుదు" ననుట మొదలుగా రత్నావలి సముద్రములో పడుట విని వాసవదత్త దుఃఖపడు వఱకు నిరూపిత మంతయు మానసఖేదము. విక్రమోర్వశీయములో నూర్వశీవియోగమున గిరినదీతీర మందు పురూరవుడు తిరిగి తిరిగి శ్రమించుట శారీరఖేదము. శ్రమోద్వేగ వితర్క లజ్జా ప్రభృతులు పూర్వము వ్యభిచారివర్గమున నిరూపితము లయినవి. అయిన నివి సముచితసమయములో నవశ్యప్రయోజ్యములు. దీనిచే ప్రాగుక్తప్రయోజనార్థసిద్ధి కలుగును. పృథక్ప్రయోజన మున్నందు నని సంధ్యంగము లని వీనిని పరిగణింపవలసి వచ్చినది.

౪౭. ప్ర తి షే ధ ము. ఈప్సితార్థ ప్రతీఘాతము. అభీష్టార్థ సిద్ధి విహత మగుట. రత్నావలీవృత్తాంతము వినగా నీప్సిత మయిన ప్రయోజనము పోయినది. దీనిని బాభ్రవ్యుడు ప్రస్తావించునప్పుడె యంతఃపుర దాహముచే ప్రతిఘాతము కలుగుట వలన ప్రతిషేధ మయినది.

౪౮. వి రో ధ న ము. విరోధన మనియు దీని పేరు. కార్యాత్యయోపగమనము దీని లక్షణము. రత్నావలిలో నంతఃపురము దగ్ధ మగుచున్నదని రాజు వేసట పడునప్పుడు సాగరికాప్రేమ విస్రంభము వినష్టప్రాయ మయినది. అదియె ప్రకృతకార్యమున అత్యయోపగమ నము= వినాశప్రాప్తి.

౪౯. ఆ దా న ము. బీజకార్యోపగమనము. బీజఫలము సమీపము నందుండుట. రత్నావలిలో సాగరిక రాజును మనసులో సంభావించునప్పుడు రాజు "నిన్ను వహ్నిదహింప లేక పోయినాడు.

నీ స్పర్శ సంతాపమును హరించునది యయినది" యనునంతవర
కాదానమున్నది. బీజఫలము సాగరికావత్సరాజ ప్రేమఫలము. అది
యిందు సంప్రాప్తప్రాయము.

౫౦. ఛా ద న ము. అపమానకృత మయిన వాక్యము ఛాద
నము. వాక్యపదమున వాక్యార్థ ములక్షితము. అపమానకరణము
బహుమానమున వర్తించును. కాగా దుష్టార్థము కూడ అపమాన
మున బహుమతీకృతము కాగలదు. అపమానకలంకాపవారణమున
నిది ఛాదన మగును. సముద్దిష్టకార్యార్థమై యపమాన కృతవాక్యా
ర్థము ఛాదన మని పర్యవసితము. రత్నావలిలో సాగరిక "భగవా
నుడు హుతాశనుడు ప్రజ్వలించినాడు. నా సకలదుఃఖముల పోగొట్ట
గలడు" అని పలుకుటలో నపమాన కలంకమును పోగొట్టుకొను నభి
లాష వ్యక్తము.

౫౧. ప్ర రో చ న. సంహారార్థప్రదర్శిని ప్రరోచన యగును.
సంప్రహియమాణార్థదర్శనము. నిర్వాహ్యమాణార్థమును ప్రదర్శించు
నది. "ప్రకర్షేణ రోచతే ఇతి ప్రరోచనా" సాతిశయముగా సిష్ట మగు
నది ప్రరోచన యగును. రత్నావలిలో రాజు "ఈ మండుచున్న
యగ్ని యేమి? అంతఃపుర మల్లె యుండుటేమి? ఈతడు బాభ్రవ్య
డీతడు వసుభూతి యీతడు వయస్యుడు. ఇది యంతయు స్వప్నమా?
మతిభ్రమమా? యింద్రజాలమా?" ఇది యంతయు నిర్వాహ్యమా
ణార్థ దర్శనము. ఈ యంగమును కొందరు యుక్తి యందురు. ఈ
చెప్పిన లక్షణకథనమున నుద్దేశక్రమ త్యాగ మున్నది. అట్లంగలక్షణ
ముల జెప్పుట క్రమనియమము లేదని సూచించుటయె యగును. ఈ
పాఠవిపర్యాసమును కొందరుచూచి యుద్దేశమున నన్యథాపాఠన మొన
ర్చుట గ్రంథకారాశయాపరిజ్ఞానసూచకము. ఈ చెప్పిన విమర్శాంగ
ములలో గొంద రొకదాని పఠింపక ద్వాదశాంగ మవమర్శ మనిరి.
కొంద రిది త్రయోదశాంగ మందురు. అయిన నిది నిర్వహణమున
ప్రసక్త మగుటచే నితివృత్తాంతర్గతముగా గణనము యుక్తము కాదని
త్రయోదశాంగమె యని చతుష్షష్టిసంఖ్యను సమర్థించు చున్నాను.

ఇంతవర కివి యన్నియు నవమర్శాంగములు. ఇక నిర్వహణసంధిలో నుద్దేశక్రమమున నంగలక్షణము మిగిలి యున్నది.

## నిర్వహణ సంధి యంగములు

౫౨౬. ముఖబీజోపగమనం సంధి రిత్యభిధీయతే
కార్యస్యాన్వేషణం యుక్త్యా నిరోధ ఇతి కీర్తితః

౫౨౭, ఉపక్షేపస్తు కార్యాణాం గ్రథనం పరికీర్తితం
అనుభూతార్థకథనం నిర్ణయః సముదాహృతః

౫౨౮. పరివాదకృతం యత్స్యాత్తదాహుః పరిభాషణం
లబ్ధస్యార్థస్య శమనం ద్యుతిమాచక్షతే పునః

౫౨౯. సమాగమస్తథార్థానా మానందః పరికీర్తితః
దుఃఖస్యాపగమో యస్తు సమయః స నిగద్యతే

౫౩౦. శుశ్రూషాద్యుపసంపన్నః ప్రసాదః ప్రీతి రుచ్యతే
అద్భుతస్య తు సంప్రాప్తిః ఉపగూహన మిష్యతే

౫౩౧. సామదానాదిసంపన్నం భాషణం సముదాహృతం
పూర్వవాక్యం తు విజ్ఞేయం యథోక్తార్థప్రదర్శనం

౫౩౨. వరప్రదాన సంప్రాప్తిః కావ్యసంహార ఇష్యతే
నృపదేశప్రశాంతిశ్చ ప్రశస్తి రభిధీయతే

౫౨. సంధి. ముఖబీజోపగమనము సంధి. ముఖసంధిలో నిరూపించిన కార్యానుకూల మయిన బీజార్థము ఫలోన్ముఖమై సంప్రాప్త మగుట సంధి యని భావము. ముఖమున నిరూపిత మయినట్టి దిందు సన్నిహితమై సంధానము పొందుటచే నిది సంధి యయినది. రత్నావలిలో వసుభూతి "బాభ్రవ్య! ఈమె రాజపుత్రిగా నున్నదె!" యనుట ముఖబీజఫలము నికటీభూత మగుట సూచించును.

౫౩. నిరోధము. యుక్తిచే కార్యాన్వేషణము నిరోధ మగును. నాటకీయప్రయోజనమును తగిన యుక్తియోగమున ననుకూలరీతిలో నన్వేషించుట నిరోధ మయినది.

౫౪. గ్రథనము. కార్యముల యుపక్షేపమును గ్రథన మందురు. ప్రథమమున నవిజ్ఞాతములుగా సూచితము లయిన కార్యవిశేషముల నన్నిటి నేకార్థమునం దనుగతము లగునట్లొనరించి పొందు

పుట గ్రథన మని పరికీర్తిత మయినది. యౌగంధరాయణుడు "దేవా! మీకు నివేదింపకనె యొనర్చితిని. క్షమింపుడు!" అనుటలో రత్నావళీ లాభరూప కార్యము నుపక్షేపించుటచే నిది గ్రథన మయి నది. గ్రథనము కొన్ని సన్ని వేశముల సంగ్రథనము.

౫౫. నిర్ణయము. అనుభూతార్థకథనము నిర్ణయము. ప్రమాణ సిద్ధవస్తువును తెలియజెప్పుట యని భావము. రత్నావలి చతుర్థాంకములో వసుభూతి "నీవు రత్నావలి వయిన నిట్టి యవస్థను పొందితివి కదా!" యనుటలో నిది సంగత మగుచున్నది. అప్పుడు సాగరిక వసుభూతిని గుర్తుపట్టి "నీ వమాత్యవసుభూతివా?" అను టయు "అంతయు విభవోపేత మగుగావుత" మని విదూషకు డను నంతవర కిది సమన్విత మగును. వారంద రనుభూతార్థముల నివేదిం చుట స్పష్టము.

౫౬. పరిభాషణము. పరివాదకృతము పరిభాషణము స్వాచరిత కార్యనిందా పురస్సరముగా మాటలాడుట. రత్నావలిలో నిట్లున్నది. సాగరిక "నే నపరాధ మొనర్చితిని. దేవికి నా ముఖము చూపజాలను" అని తాను రాజును ప్రేమించుట సాపరాధకార్యముగ భావించినది. అప్పుడు వాసవదత్త "ఆర్యపుత్ర! నే నీ నృశంసత్వ మున లజ్జపడుచున్నాను. ఆమె బంధనము విడిపింపుడు" అనుటలో తా నొనరించిన బంధన కార్యము నిందాస్పద మని భావించినది. వీరిద్ద రిట్లు పరస్పరాపరాధోద్ఘట్టన వచనములు పలికిరి. ఆ సమయము నను యౌగంధరాయణుడును ప్రవేశించి స్వాపరాధ ముద్ఘట్టిత మొనర్చినాడు. ఇది యంతయు పరివాదకృత పరిభాషణమై పరిభాషణ మయినది.

౫౭. ద్యుతి. లబ్ధార్థశమనము ద్యుతి యనిరి. క్రోధాద్య ములు ప్రశమనీయములు. వానిని పైకి రానీరాదు. కొంతగా నుద్బుద్ధ ప్రాయము లయిన క్రోధాదుల ప్రశమన నిరూపణము ద్యుతి యగును. రత్నావళిలో "దేవా! మీ రిది యవధరింపుడు. సిద్ధులు సింహ ళేశ్వరదుహిత నిట్లాదేశించిరి..."అని చెప్పునప్పుడు వాసవదత్త కలిగిన కోప మణచికొని "ఆర్య! అమాత్యా! రత్నావలిని రాజున్న

కర్పింపవలెనని స్పష్టముగనే యనరాదా ?" యని పలుకుటలో ద్యుతి కూడి యున్నది.

౫౮. ఆ నం ద ము. అర్థసమాగమ మానందము. అర్థిత కార్యసిద్ధి. ప్రకారశతముల ప్రార్థిత మయిన యర్థము లభించుట. అపూర్వయోగముగా సమ్యాగాగమన ముండుట. అది యానంద హేతు వగుట వలన నానంద మగును. "దేవి యనుగ్రహప్రసాదము నెవరు బహుమానన మొనరింపరు ?" అని సాభిలాషముగా ననినప్పుడు రత్నావళీప్రాప్త్యాద్యర్థముల సమ్యాగాగమన మున్నందున నానందము సిద్ధము.

౫౯. స మ య ము. దుఃఖాపగమము. ప్రధాన కార్యప్రతిఘాతముల వలన సంప్రాప్త మయిన దుఃఖము తొలగి పోవుట సమయము. ఇక దుఃఖము తన్నిమిత్తముగా రాదన్న సంకేతము కూడ దీని యందుండును. రత్నావళిలో వాసవదత్త రాజుతో "ఆర్యపుత్ర! ఈమె జ్ఞాతికులము దూర మున్నారు. ఈమె బంధుజనము స్మరింపకుండున ట్లనుష్ఠించుము" అని యనినప్పుడు దుఃఖములు తొలగి పోవుట విశద మయినది.

౬౦. ప్ర సా ద ము. శుశ్రూషాదులచే గలిగిన ప్రీతి ప్రసాద మగును. వాసవదత్త సాగరికను స్వాలంకారములతో నలంకరించి స్వానురూప్యము కల్పించుటలో ప్రసాదాంగము సులగ్న మయినది. కొందరు ద్యుతి పిమ్మట నీ యంగము పఠించిరి.

౬౧. ఉ ప గూ హ న ము. అద్భుతసంప్రాప్తి యుపగూహనము. కార్యప్రతికూలము లయిన యుపఘాతములు దైవికముగనో పౌరుషముగనో నశించి పోగా కార్యసిద్ధ్యనుకూలము లగునవి విస్మయోత్పాదకములుగా నవతరించు నప్పు డద్భుతసన్నివేశము సంప్రాప్త మగును. రత్నావళిలో విదూషకుడు "ఓహో హో! మన మందరము సంపూర్ణ మనోరథుల మయితిమి; ఎట్లు!" అని యనుచు విస్మయవివశుడై నృత్య మొనరించుట యుపగూహనమునకు లక్ష్యము.

౬౨. భాషణము. సామదానాది సంపన్నము భాషణమని యనిరి. "సామదానాది సంపన్నః సంగ్రహః పరికీర్తితః" యను ౩౧ వ సంధ్యంగము సంగ్రహ మనునది సామదానాదిసంపన్నమె. అయిన నిచట నిది భాషణమను నామాంతరమున నున్నను ఈ స్థానమున దీని నవశ్యము ప్రయోగింప వలెనని నిరూపించుటకై శబ్దాంతరమున పునరుపాత్త మయినది. "దేవి! నీవు దేవి వనుట సముచితము. దేవీ శబ్దమును నీవు ధరించుట యుక్తము." అను వసుభూతి భాషణమున సామసామ్యము సంగతముగా నున్నది. నాగానందనాటకములో జీమూతవాహనునకు గౌరీదేవి విద్యాధరచక్రవర్తిత్వ మనుగ్రహించుట సామదానము. "సామదానాది" యనుచో నున్న యాది పదమున భేదదండాద్యుపాయాంతరములును సంగ్రాహ్యము లనిరి. కాని నిర్వహణములోని సానందఘట్టములో భేదదండముల విధి యుచితము కాదని స్పష్టపదముననే గోచరించును. గర్భసంధిలోని సామాద్యుపాయముల యనువదనమాత్ర మిచట వివక్షితము. "ఇది యిట్లు సంప్రాప్త మయినది. ఇట్టి దీ భాషణాంగ" మనుట చాలును.

౬౩. పూర్వవాక్యము. యథోక్తార్థప్రకాశనము పూర్వ వాక్యము. ఆద్యుపాయము లన్నియు సఫలములు కాగా క్రమసార్థక్యము భావించుచు ఫలప్రకాశన మొనర్చుట యని భావము. రత్నావలిలో బాభ్రవ్యుడు సఫలపరిశ్రముడ నయితి నని భావించుటలో నిది కలదు.

౬౪. కావ్యసంహారము. వరప్రదాన సంప్రాప్తి కావ్య సంహారమయినది. "దేవా! ఇంక నేమి ప్రియ మాహరింప వలెనో సూచింపుడు" అని రత్నావలిలో యౌగంధరాయణు డనుట కావ్య సంహారము.

ప్రశస్తి. నృపదేశప్రశాంతి ప్రశస్తి యయినది. రూపకాంత మున భరతవాక్యము నందీ యంగసమన్వయము విశదము.

సంధ్యంగసమీక్ష

ఈ నిరూపితము లన్నియు చతుష్షష్ట్యంగములు. వీనిని నాట కమున సంధిసంబంధానుకూలముగ నిరూపింప వలెను. రసభావముల

గుర్తించుకొనుచు కావ్యకుశలు రయిన కవులు వీనిని నిబంధింప వలెను. సంభావానుసారమున నంగములు ద్వి త్రి యోగమున సంమిశ్రణ మొనరించియు వీనిని నిబంధింప వచ్చును. ఈ యర్థ మిట్లుపపాదిత మగుచున్నది.

౫౩౩ యథాసంధి తు కర్తవ్యాన్యేతాన్యంగాని నాటకే
కవిభిః కావ్యకుశలైః రసభావమపేక్ష్య తు
౫౩౪ సంమిశ్రాణి కదాచిత్తు ద్వి త్రి యోగేన వా పునః
జ్ఞాత్వా కార్యమవస్థాంచ కార్యాణ్యంగాని సంధిషు.

ఏ సంధి యే యంగమున సముచితమో దేని విన్యాసము యుత్తము కాగలుగునో పరిశీలించి కవి సంధానింప వలెను. ఈ యోగ్యతను కవియే తెలియగలడు. ఒక్కొక్క పద్యము చెప్పినాతడు పదిపద్దెము లల్లు ముక్తకకవి దీని గుర్తింప లేరు. ప్రబంధ యోజన సమర్థు డగు కవియె సంధ్యంగ సంయోజన యోగ్యత తెలియగలడు. కవికి గల ప్రబంధనిర్మాణకౌశల మెట్టిదో తెలియుట యావశ్యకము. అది కేవలము రసభావాపేక్షము. రసభావాపేక్షయె కౌశలము. రసమె ప్రీతి సాధానించి వ్యుత్పత్తి నిచ్చును. నాట్యాత్మక శాస్త్ర మిట్లు ప్రీతివ్యుత్పత్తిప్రదము. అరోచకులు కొందరుందురు. వారు దధి శర్కరా పయః ప్రభృతులనె రుచిరముగ స్వీకరింతురు. రోగము పట్టినను కటుకౌషధము పుచ్చుకొనరు. రోగము పోవలెను. కాని చేదుమందు త్రాగరు. అప్పుడు రుచిత దధి పయః ప్రభృతి రసాంతర మధ్యయోజిత మయిన మందు వారందు కొందరు. ఆమందు పయోధారలతో నంతఃప్రవిష్టమై వ్యాధి పోగొట్టును. పుష్టి నిచ్చును. అట్లె; పుమర్థోపాయము హృదయానుప్రవేశము పొందజాలనపుడు సుందర తదుచిత రససంక్రమణమున నంతఃప్రవేశము పొంది వినేయజనునకు సంపాద్యవస్తువున కల్పపాదప కల్పన మునకై ప్రకల్పించును. రససంక్రాతి విభావాదిరూపముననె కలుగును గాని యన్యథా కలుగ నేరదని స్పష్టముగనె నిరూపించితిమి.

## రసపరతంత్రత

ఈ నిరూపితాంగముల నిబంధనమున ప్రసక్తి యున్నది. వివక్షితరసభావాదుల పూర్ణీభావమున కుపయోగించు నవి సంధ్యంగ

ములుగా సంఖ్యాత లిఖితము లయినవి. కవి యేకరసావహిత మనస్కుడయినచో నా యంగములు యత్నాంతర నిరపేక్షముగా సహామహమికమున సముచితభావమున బంధశయ్య ననువర్తించునవి యగును. ఇతివృత్తావిచ్ఛేదమును రసమునకె పోషకము. కాకున్న వృత్తవిచ్ఛేదములో స్థాయ్యాదులు త్రుటితము లగును. అప్పుడిక రసవార్త యేముండును? కాన విభావాదిపరికరముగా నున్న యీ యంగచక్ర మంతయు రసాంగమె యగుచున్నది. వేణిలో "లాక్షాగృహానల" యను పద్యములోని యుపక్షేపము వీరరౌద్రములకు విభావాంశపూరకము. "ప్రవృద్ధం యద్వైరం" అను శ్లోకములోని పరికరము వీరవ్యభిచారి యయిన క్రోధము రౌద్రస్థాయియై ప్రత్యుజ్జీవిత మగుచున్నది. "చంచద్భుజ" పద్యములోని పరిన్యాస మను భావాంశమును పోషించుచున్నది. ద్రౌపది దేవతానుగ్రహ మభిలషించుటలోని విలోభనము ననుభావాంశ పోష మిచ్చుచున్నది. కాన హర్ష మతి స్మృతి ప్రభృతి వ్యభిచారిపోషకములుగ గూడ నంగము లుండును. ఇది యంతయు సంధానధుర్య మయిన రసప్రక్రియ. ఇట్లి సర్వ మూహించునది.

## అవస్థాపరతంత్రత

సంధ్యంగములు సంధిపరతంత్రములు కావలెనుగాని రసపరతంత్రము లగుటేమి? ఇది యెటునుండివచ్చినది? అని శంకింపవలదు. సంధు లవస్థాపరతంత్రములు. ప్రారంభమను పేరు గల దశావిశేషమున కుపయోగించు కథాఖండలకమె ముఖసంధి యని యంటిమి. ఇట్లి యితరము లందును గ్రాహ్యము. అవస్థలని యనుట కూడ అన్యకృతివిశేష మనుసరించిన మాట. కార్యసర్వస్వము రసభావాపేక్షమున వ్యవస్థిత మగుచున్నది. కార్యము రసప్రవాహ జనన పర్యంత వ్యాపనమున కృతార్థతాసంపత్తి కలదగును. కావుననే కార్యాపేక్షావస్థానము సంధులకు సూచిత మయినది. సంధు లవస్థాపరతంత్రములు. అవస్థానము రసభావాపేక్షము. ఇట్లు సర్వము రసాపేక్ష మయినది.

## అంగసంమిశ్రణము

ఈ యంగముల నిరూపణ మొకప్పుడు సంమిశ్రముగ గూడ

సుండవచ్చును. సంధ్యంతరోక్తము సంధ్యంతరముననూ సంభవించును. యుక్తి ముఖములో నున్నది. గర్భమున నుపనిబద్ధ మయినది. ఇది వేణీసంహారములో వితర్క వ్యభిచారి పోషకభావమున నున్నది. సందర్భానుకూలతను బట్టి యొక్కొక యంగము రెండు మూడు పర్యాయములు ప్రయుక్తము కావచ్చును. రత్నావలిలో ప్రతిముఖ సంధిలో విలాసము అసకృదుపనిబద్ధమై ప్రధానశృంగారమును సముద్దీపింప జేసినది. వేణిలో సంఫేట విద్రవములు పునఃప్రదర్శితములై వీర రౌద్రముల కుద్దీపనమునే సంపాదించుచున్నవి. రెండు మూడు పర్యాయముల కన్న నధికముగా నిరూపించినచో నా పౌనఃపున్యమున నైరస్యము కలుగును. కావుననే భరతుడు ద్విత్రి యోగమునే సూచించెను. రెండు సంధ్యంగములచే సంపాదితము కావలయునది యొక యంగప్రయోగముననె యుపపన్న మగునపు డన్యమేల? అట్లే మూడంగములు సంపాదించు దానిని ఒకే యంగము సంపాదించు నప్పు డన్యము లేల? ఇట్లవస్థానుసారమున సంధులలో నంగసంధాన మొనరింప వలెను. ఇంతవరకిది సంధ్యంగ కథ.

## సంధ్యంతరములు

ఈ నిరూపిత సంధుల విశేషములు కొన్ని యున్నవి. అవి సంధ్యంతరము లిరువది యొకటి కలవు. కొందరిట్లు సంభావించిరి. అంతరము = ఛిద్రము. సంధి యనుట తదంగమాత్రమె వివక్షితము. సంధ్యంగచ్ఛిద్రమున నుండునవి సంధ్యంతరములు. సంధ్యంగ ముండు చోటున నుండునవి. సంధ్యంగస్థానమున నుండునవి. కావునని సంధ్యంతరములు సంధ్యంగసంబంధమున నుండు నని భావము. ఈ సంధ్యంతరములు సంధ్యంగశేషరూపములు కావు. అర్థప్రయోజన యోగమున నుండునవి. సంధ్యంగముల విశేషకములు. "తదర్థ విశేష సంబద్ధం హి తదంగం భవతి" తదర్థ విశేషమునకు సంబంధించి యుండునది తదంగ మగునని సూక్తి కదా.

అన్యుల మనన మీ విధమున నున్నది. ఉపక్షేపాదు లన్నియు సామాన్యరూపము లయిన యంగములు. ఈ సంధ్యంతరములు తద్విశేషము లయిన యవాంతర భేదములు. ఉపక్షేప మనునది సామాది

విశేషముల కన్న భిన్నము. వేణీసంహారములో నుపక్షేపము క్రోధాత్మకముగ నున్నది. కామాభ్యుదయమునందు భయాత్మక ముఖ్యుపక్షేపము కలదు. ప్రతిమానిరుద్ధమం దుపక్షేపము స్వప్నరూపము. ఉదాత్తరాఘవము నందు హేత్వవధారణాత్మకము. ఇట్లే యితర సంధ్యంగము లందును సమీక్షింప వలెను అని.

ఈ సరణి సంధ్యంగ సంధ్యంతరము లన్నియు విభావానుభావ వ్యభిచారి స్వరూపములు. తదతిరిక్తముగా జగమున ప్రయోగములో నేదియు నుండదు. కవులకు మార్గప్రదర్శనమునకై యిరువది యొకటి సంధ్యంతరములు ప్రయోగమున సముజ్వలత నాపాదించి యుపయోగించు నవి యగునని యుపలక్షణముగా నిదర్శితము లయినవి.

| | | |
|---|---|---|
| ౧ సామము | ౨ భేదము | ౩ దండము |
| ౪ ప్రదానము | ౫ వధము | ౬ ప్రత్యుత్పన్నమతిత |
| ౭ గోత్రస్ఖలితము | ౮ సాహసము | ౯ భయము |
| ౧౦ హ్రీ | ౧౧ మాయ | ౧౨ క్రోధము |
| ౧౩ ఓజస్సు | ౧౪ సంవరణము | ౧౫ భ్రాంతి |
| ౧౬ హేత్వవధారణము | ౧౭ దూత | ౧౮ లేఖ |
| ౧౯ స్వప్నము | ౨౦ చిత్రము | ౨౧ మదము |

ఈ యిరువది యొకటి సంధ్యంతరములు. ఇందు సామాదులు వీరమున నుజ్జ్వలతా హేతువులు. రౌద్రమున వధము. ప్రత్యుత్పన్నమతిత్వము మతిలక్షణము వ్యభిచారి భావరూపము. సర్వస్థలము లందును గోత్రస్ఖలన మీర్ష్యావిప్రలంభమున నుపయోగించును. సాహసము శృంగారవీరాదులం దుపకారి. హాస్యాదులందు చాపల ముపకారి. ఓజము= తేజస్సు. సంవరణము= అవహిత్థము. చిత్ర మనునది విస్మయము కావచ్చును. శిల్పవిశేషము కావచ్చును. ఇవి యన్నియు సర్వనాటకము లందును సులభములు; స్వయముగా సుజ్ఞానములు. నామసంకేతమునను తెలియ శక్యములు కాగలవు. వాని యుదాహరణ పరివర్తనమున విస్తర మేలని ఇట్లే విధముగా నితివృత్తనిరూపణమున నాంతరీయకముగా సంభవించు సంధులు సంధ్యంగములు సంధ్యంతరములు నిదర్శితము లయినవి. ఇవి యన్నియు

నాత్మ యయిన రసమున నుపయోగించు నవి యయినను ముఖ్యముగా నితివృత్తాత్మక మయిన శరీరాంశమున కూడి యుండును. అట్లే యవి నిరూపితము లయినవి.

## లా స్యాం గ ము లు

లాస్యవిధి లోని యంగములు నాటకమున నుపయోగించు నవి కొన్ని కలవు. వాని నుపక్రమించి చెప్పవలయును. నాట్యవేద సమారంభములో కైశికీయోజన మొకటి యాసూత్రిత మయినది. కైశికీ రచనకు వలయు ద్రవ్యసంపదయు సూచిత మయినది. నాట్య మా కైశికీ ప్రసాదముననె శాస్త్రేతిహాసాదులకన్న విలక్షణమై సర్వజనా హారణీయతాస్పదమై యుద్ధుర కంధర మయినది. అట్టి కైశికీస్వరూప మావిర్భవింపజేయు లాస్యాంగములు ఆత్మభూతము లయిన రసభావ భాగాభినివేశమున శోభాస్పదము లగుచున్నవి. అభినేయకావ్యవిషయమున కవిప్రయోక్తలు సర్వథా యోజనము చేయవలయును.

౹౩౹ అన్యాన్యపి లాస్యవిధా వంగాని తు నాటకోపయోగిని
అస్మాద్వినిసృతాని తు భాణ ఇవైకప్రయోజ్యాని.

## లా స్య ప్ర యో గ ము

లాస్యవిధి లోని యంగము లివి నాటకోపయోగులని యనుట అభినేయమాత్ర మంతయు సంగృహీతము. నాటకమునందే కాక తదితరము లన్నిటి యందు నివి సంగతములు కావచ్చును. ఇటుపై నిరూపించు లాస్యాంగములు నాటకోపయోగులు నగునని తాత్పర్యము. నాటకములో నుపయోగించు నీ లాస్యాంగములు కేవలమందే కాక నాటకమునుండి వినిసృతములై భాణమునందు వలె నేక ప్రయోజ్యము లగును. భాణమున నేకపాత్రప్రయోగమె యుండును. కాగా లాస్యాంగములు నాటకమున తదితరములందు రూపకేతరవిభాగములందును ప్రయోగయోగ్యము లని భావము. అనేకస్థలములందు ప్రయోజ్యములగు లాస్యాంగములందు భేదము లేదు. అంగము లందు భేదము లేదని యంగి యయిన లాస్యమున గూడ భేదము లేదని భావింప రాదు. అనుకారాభినేయరూప మయిన నాటకమున లాస్యప్రయోగము వేరు. నాటకవినిసృతమై బహిర్భా

తమై యేకపాత్రహార్య మగు లాస్యప్రయోగము వేరు. నాటక ప్రయోగము నందును భాణప్రయోగము నందును నాట్యరూపత యున్నది. ఏకహార్యలాస్యమున నాట్యరూపత లేదు. బహిర్బాహ్యత లాస్య ప్రయోగమున నాట్యరూపమున కన్న వైలక్షణ్య మున్నది. ఈ యంశ మిదివరలో విశదముగ నిరూపిత మయినది.

| | |
|---|---|
| ౧ గేయపదము | ౨ స్థితపాఠ్యము |
| ౩ ఆసీనము | ౪ పుష్పగండిక |
| ౫ ప్రచ్ఛేదకము | ౬ త్రిమూఢము |
| ౭ సైంధవము | ౮ ద్విమూఢకము |
| ౯ ఉత్తమోత్తమకము | ౧౦ ఉక్తప్రత్యుక్తము |

లాస్యమునం దీ పది యంగములు కలవు. ఈ యంగనిర్దేశము దశవిధమును లాస్యనిరూపణావసరమున వితతముగా నిర్దిష్టము కాగ లదు. లాస్యాంగముల సంపూర్ణరూప మచట సుసంగతము, ప్రకృతము నాట్యోపయోగితను నిరూపించుటకై సామాన్యాకారమున స్వరూప సంకేతము ప్రదర్శిత మగును. ఏదేని వైచిత్ర్యము లోకగోచరము కాకపోయినను వక్ష్యమాణ లాస్యాంగముల నుండి గుర్తించి రంజనావైచిత్ర్యమునకై కవిప్రయోక్తలు నాట్యమున నిబంధింప వలయు నని యుద్బోధ మిచట పరిగ్రాహ్యము. అంతట లోకదృష్టమె గ్రాహ్యమను భావగ్రహ ముండరాదు. భావసారముగా సుందరతాస్పదములై యుండు శాస్త్రపరిష్కృత కలాప్రచురపథము లందలి వైచిత్ర్యాంశములను గ్రహింప వలెను. ఇదియె యిచటి తాత్పర్యము.

కొందరి ట్లిచట వ్యాఖ్యానింతురు. "రసభావచతురక్రియ మయిన లాస్యాంగయోజన మిచట నిరూపిత మగును. తథాహి :— గేయపదమునందు నిదర్శనము దర్శించిరి. "అంతట మలయవతి వీణావాదన మొనరించుచు చేటితో ప్రవేశించును. అప్పుడు మలయవతి గౌరీదేవినుద్దేశించి "ఉత్ఫుల్ల కమల కేసర" యని గాన మొనరించును. కాన నిది యంతయు లాస్యాంగ యోజనమే యని. ఇది పదాశయము కాదు. ఇతరవ్యాపారముల వలె దేవతాపరితోష రూప

మును నిరూపణార్హ్వము. ఒకానొక గేయము జప్యసహస్ర తుల్యము. గేయమిశ్ర మయిన జప్యము కోటిఫల సాధన మని పురాణవాక్యబల మున్నది. తదనుసారమున మలయవతి కా వీణావాదన పురస్సర మయిన గేయ మవశ్యకర్తవ్యముగ నభిసంహిత మయినది. ఇది దేవీ పరితోషఫలకమె కాని లాస్యార్థము కాదు. ఇందు లాస్యాంగత్వ మును లేదు. ఒక్కొకచో లాస్యాంగతాఛాయ యుండవచ్చును. "చేటిక లిద్దరు గాన మొనరించుచు ప్రవేశించుచున్నారు." అను రత్నావలీ ప్రసంగములో పరిభ్రమణాదికము వలె లౌకికవృత్తము ననుసరించి వసంతోత్సవ ప్రమోదాభ్యుదయావసరకృతముగా వారి ప్రవేశమును సంగతము చేసికొనవలెను. ప్రయోజనోద్దేశమున నట్టి వాని నాచరించు నప్పుడును నాట్యాంగ మయినను వేరుగా నుపదే శింప వలసిన యావశ్యకత రాదు. అశ్వమేధయాగ మనుకరింప వలసి వచ్చినప్పుడు యజ్ఞాంగజ్ఞాన మావశ్యక మగును గావున యజ్ఞాంగ ముల నవశ్య ముపదేశింప వలయును. నాట్యము నందుపయోగింపని వస్తు వే మాత్ర ముండను. "న హి తాదృగ్వస్తు మాత్రమప్యస్తి యన్నాట్యే నోపయుజ్యతే" కావున లాస్యము నందలి యంగముల ననుసరించి యుపజీవ్యము కావలసిన విషయమున లౌకికాంశమె రంజ నోపయోగి యగునని ముని లాస్యాంగముగా వివక్షించెను. కాకున్న నిచట గేయపదాదుల స్వరూపలక్షణముల జెప్పవలసిన యావశ్యకత కాని, వీనిలక్షణ మభిధానింతు నని చెప్పకపోవుటయు కాని సర్వము విశృంఖల మగును.

## లాస్యాంగ వివేకము

నాట్యమున కుపయోగించు నంతటి యంశముల విశదీకరణ ముతో లాస్యాంగముల స్వరూపవివేకము ప్రదర్శింప వలసి యున్నది.

### ౧ గేయపదము

౫౩౬. ఆసనేషూపవిష్టైః యత్తంత్రీ భాండోపబృంహితం
గాయనై ర్గీయతే శుష్కం తద్గేయపద ముచ్యతే

ఆసనములం దుపవిష్టు లయిన గాయనులు వివిధవాద్యసహిత ముగా శుష్కముగా గాన మొనరించినచో గేయపద మగును.

ఈ గేయపదము కావ్యమునందు గాని ప్రయోగమునందు గాని సంగత మగును. శుష్కమని యనుట ననుకరణీయమగుటచే శూన్యముగా నుండునది యని భావము. ఈ గేయపద నిర్వాహణమునకు గాయనులె రంగమున రావలెను. రూపకపాత్ర లట్లు చేయరాదు. ఆసనోపవిష్టులు కావలయు ననుటయు స్వస్థులె గానింప వలెనని తాత్పర్యము. నేపథ్యమున గాన మొనరించుట తగదు. కవిప్రయోగాయాత మయిన యావేశవిశేషమును జృంభింపజేయుగాన మావశ్యకము. ఆసీనపాఠ్య మను లాస్యాంగమున తంత్రీ భాండ సముపబృంహణ ముండదు. ఇందుండును. గేయమున కిది స్థాన మగుట నిది గేయపదము. కాగా ధ్రువాగాన పంచక మిందుండును గాని యంతరాంతరాలాప స్వర రహితముగ నుండును. కావుననె ప్రయోగయోగ్య మగును. ఇట్టి కావ్యప్రయోగము గేయపదమగును. ప్రయోగమునందు సంగతమయిన గేయపదము సామాజిక రంజక మగును గావున తన్మాత్రాంశ మిచట లాస్యాంగము నుండి సంగృహీతమై యుపజీవిత మయినది. ఈ గేయపదమునందు గాన సమయమున త్ర్యశ్ర చతురశ్రాది తాళసంపత్తి యుండవలయు ననుట సముచితము కాదు. ప్రియగుణాన్విత మయిన గేయమును సాంగోపాంగవిధానమున గాయని గానమొనరించుట గేయపద మగునని యొక నిర్వాచనము గలదు.

## ౨. స్థిత పాఠ్య ము

౫౩౮. ప్రాకృతం యద్వియుక్తా తు పఠేదాత్తరసం స్థితా
మదనానలతప్తాంగీ స్థితపాఠ్యం తదుచ్యతే

మదనానలతప్తాంగి యయిన వియుక్త వనిత నిలబడి యుండి యాత్తరసమయిన ప్రాకృతభాషాపాఠ్యము పఠించునేని యది స్థితపాఠ్యమగును. లాస్యమున గూడ దేవతా నరపతి రంజన ప్రాయ మయిన పాఠ్య ముండును. వారి వారి చిత్త గ్రహణ మచట మధ్యలో గూడ వైచిత్ర్యమునకై పాఠ్యమున సంపాదింప దగును. నిలబడియుండియు నుపవిష్టురాలి వలె పాఠ్యపఠన మొనరించుట యలౌకికరంజనాంగముగ నగును. తన్మూలమున గలుగు చిత్రత్వము నీ యంగ ముపజీవింప

జేయును. వియోగతప్తయయ్యు ప్రాకృతభాషాలక్షణయుక్తము రసో
పయోగి స్థాయిరసగ్రహణ పూర్వకముగ పఠించుట పర్యాలోచింపగా
లౌకికలాస్యాంగమున స్థితపాఠ్య ముపజీవ్యమాన మగుట సూచితము.
వియుక్త సమాప్తరసము పఠించుట యనునది రసావేశోపలక్షణము.
క్రోధావిష్టుడు సంస్కృతమున గూడ పఠించి స్థితపాఠ్యము పఠింపనగును.
ఇందును తాలగతిని సంభావించుట పూర్వాంగమునందు వలె
యుక్తము కాదు.

## 3. ఆసీనము

౫౩౮. అసీనమాస్యతే యత్ర సర్వాతోద్య వివర్జితం
అప్రసారితగాత్రం చ చింతా శోక సమన్వితం

సర్వాతోద్యరహితముగా నప్రసారిత గాత్రముగా చింతాశోక
సమన్వితముగా నూరక కూర్చొని యుండుట కాసీన మని పేరు. ఆసీ
నమె యాసీనపాఠ్యము. ఆసీనపాఠ్యము ననుసరించిన యుపజీవ్యాంశ
మీ లక్షణములలో నున్నది. అత్యంతశోకావేశ మున్నప్పు డభిన
యము లుండవు. అభినయాదిశూన్యముగా నున్నప్పు డా యంశ
మఃపరంజకగుణముగా నుండును. చతుర్విధాతోద్యరహిత మయినను
అతిసుకుమార మయిన కాకలీప్రాయమగు ప్రమదాగీతమాత్రావ
శేషముగా నుండి చిత్తగ్రాహి యగును. ఇది యాసీనాంగము.
ఇందాసనాంశ మాసీనపాఠ్యమున నుపజీవిత మగును. ఇది కరుణాదులం
దంతట నుపయోగించును. రంజన మాపాదించును. ఇది చింతాశో
కాదిసమన్విత మని యనుటచే నధఃశయనము ధ్యానము అధోముఖా
ద్యనుభావములతో నుండును. ధ్యానశిలాపాది చింతాశోకానుభావ
ములలో వాద్యవిధానముల యుపయోగము లేదు. వాని నసలు
ప్రయోగింపరాదు. ఆసీన మశబ్దముగనె యుండును. అప్రసారితగాత్ర
మనుట సర్వాభినయశూన్య మని భావము "సుప్రసారితగాత్ర" మని
కొందరు పాఠము పఠించిరి. సౌష్ఠవముగా నంగప్రదర్శనమున వేరు
యత్న ముండదు గావున ప్రస్తగాత్రత ననుసరించియు నభినయ
శూన్యతనె నిశ్చయింప వలయును.

## ౮. పుష్పగండిక

౪౩౯. వృత్తాని వివిధాని స్యుర్గేయం గానే చ సంశ్రితం
చేష్టాభిశ్చాశ్రయః పుంసాం యత్ర సా పుష్పగండికా

పుష్పగండిక మను లాస్యాంగమున లభించు నుపజీవ్యాంశ మీా లక్షణమున నున్నది. వివిధవృత్తము లుండుట, గేయము గానమున సంశ్రిత మగుట పురుషచేష్టల కాశ్రయముగా నుండుట, పుష్పగండికాస్వరూపము. తతము సుషిర మవనద్ధ మను వాద్యములలో మొదట తతవాద్య మనంతరము సుషిరము మిశ్రితము కావలెను. అనంతర మవనద్ధమిశ్రణాకృత మయిన విచిత్రభావ మూపాదింపవలెను. పాత్రల సుకుమార ప్రయోగ మభినేయమున రంజకమై యలౌకిక విచిత్రత సంధానించును. గాన నృత్త గీతగత వైచిత్ర్య యోగమున మాలాసాదృశ్యమును బట్టి పుష్పగండిక యనుట సంగత మగును. స్త్రీలు పురుషుల చేష్టాశ్రయమున పర్యాయప్రయోగ మాశ్రయింప వలెను. నారి నరవేషము ధరించి సఖీవినోదమునకై లలితమగు సంస్కృతము పఠించుట పుష్పగండికా స్వరూపముగా కొందరు భావించుచున్నారు. వివిధ మయిన నృత్తము ఆతోద్యసంయుత మయిన గీతములతో స్త్రీలు పుంచేష్టలతో నుండుటయు పుష్పగండికాస్వరూపమున కూర్పదగును.

## ౯. ప్రచ్ఛేదకము

౪౪౦. ప్రచ్ఛేదకః స విజ్ఞేయో యత్ర చంద్రాతపాహతాః
స్త్రియః ప్రియేషు సజ్జంతే హ్యపి విప్రియకారిషు

చంద్రాతపాహత లయిన వనితలు విప్రియ మొనరించిన ప్రియుల విషయమున సంసక్త లయినట్లు నిరూపించిన ప్రచ్ఛేదక మగును. ప్రచ్ఛేదకాంగకృత మయిన యీా విశేష మీా విచిత్రత ప్రకృతోపయోగి. లాస్యవిధానమునం దిది విస్పష్ట మగును. ప్రియవిరహా విధూన యయిన యువతి జ్యోత్స్నాసంచార మొనర్చుచు ఛాయాదృశ్యమున కాంతుని స్మరించి సంభావించి వార్తాతిరేకమున ప్రియసంసక్త యయినచో నొక ప్రచ్ఛేదక మగును. అట్లే పానగోష్ఠీసమయము నందలి రూపభావనమున మదిరా ప్రతిబిం

బితస్వభావునిగా ప్రియుని భావించి సక్త యగుట మరొక ప్రచ్ఛేద కము. అట్లె జలమున ప్రసాధనమున దర్పణమున బింబిత ప్రియభావ భావముతో సంసక్త యగుట మరొక ప్రచ్ఛేదకము. జలక్రీడాసమయ మున జలమునందు ప్రసాధనసమయమున దర్పణమునందు పానగోష్ఠీ సమయమున పానమునందును ఈ ప్రతిఫలిత తత్తదాకృతి దర్శ నమున గూడ కాంత ప్రహర్ష మనుభవింప గలదు. ఈ విచిత్రతను భావించి కవులు కావ్యములందు స్త్రీలకు ప్రతిబింబన సంజాత హర్షము ప్రణయకోప ప్రసాదనసమర్థ మగునట్లు వర్ణించిరి. "ప్రణయ ప్రకుపిత గౌరీ చరణాగ్ర లగ్న ప్రతిబింబు డయిన రుద్రుడు నఖదర్పణము లందు సంక్రాంతస్వరూపుడై యేకాదశ తనుధారి యయినాడు." ఈ చెప్పిన ప్రచ్ఛేదకములందు జ్యోత్స్న యధికముగా నుపకరించును. ప్రసాధన లీలావిశేషములు స్వాధీనభర్తృకకు సముచిత మయిన సంభోగవిశేషముల సంప్రాప్తి సూచించును. ఇది యిచటి విశేషము. లోకవృత్త మనుసరించి చూచిన సర్వదా సంపూర్ణ చంద్రోదయ ముండదు. ప్రయోగమునందు సర్వకాలములందును సంపూర్ణ చంద్రో దయము లభించును. అది సంభావనాగర్భ మగుటచే రసోపయోగి యగును. అట్టి కాలవిశేషమునే ప్రచ్ఛేదక సదృశములందు స్వీకరింప వలెను. రత్నావలిలో చంద్రోదయ మనేకపర్యాయములు వర్ణిత మయినది. ఇట్లు రసోపయోగి యగు నలౌకిక కాలవిశేష గ్రహణము ప్రచ్ఛేదకము ననుసరించి యుపజీవిత మగుచున్నది. మా యుపా ధ్యాయపాదు లీ విధముగ సెలవిచ్చిరి.

> యద్యత్రాస్తి తత్రాస్య కవిర్వర్ణన మర్హతి
> యన్నాసంభవి తత్రాస్య తద్వర్ణ్యం సౌమనస్యదం
> దేశోఽద్రిదంతురో ద్యార్వా తటిత్కుండలమండితా
> ఈదృక్ స్యాదథవా న స్యాత్కిం కదాచన కుత్రచిత్

అది యున్నచోట దాని వర్ణించుట కవిసంకల్పము కాదు. అది సంభ వించనప్పుడు దాని వర్ణించుటయె సౌమనస్య మందించును. అద్రి దంతురమయినదేశముగాని తటిత్కుండలమండిత మయిన గగనశ్రీ

గాని యొకప్పు డిట్లు కాని యన్యవిధమున గాని యుండవచ్చును. ఉండకపోవచ్చును. అదిసర్వము కవిసంభావనావిషయ మగును.

౬. త్రి మూ ఢ క ము

౫౪౧. అనిష్ఠురశ్లక్ష్ణపదం సమవృత్తై రలంకృతం
నాట్యం పురుషభావాఢ్యం త్రిమూఢక మితి స్మృతం

దీని లక్షణము నుండి గ్రహింప దగిన యుపయోగిభాగ మీ విధముగ నుండును. పురుషభావాఢ్య మయిన నాట్యము అనిష్ఠుర శ్లక్ష్ణ పదమై సమవృత్తాలంకృతమై యున్నచో త్రిమూఢక మగును. త్రిమూఢక లాస్యాంగములో నాయకుడు వ్యలీక మొనరించు వాడు కాగా నొకతె విషణ్ణయై ద్వేషించును. అభినవనాయిక యొకతె ప్రథమ ప్రణయ మగుట లజ్జాబంధమున నుండి వ్యథిత యగును. ఇట్లుమూావుర మోహా మిందుండును. ఇందు నాయకుని మాట లవశ్య మనిష్ఠురములుగనె యుండును. అందు రసోపయోగి గుణాలంకా రాంశమును స్వీకరింప వలెను. రసోపయోగ్యంశము లేక మాధు ర్యాజః ప్రభృతి గుణగణ మేదియు నుండదు. తదంశావేశ మున్నచో పలికిన దంతయు కావ్య మగును. కేవల మాంశికచ్ఛాయ వలన పూర్ణత యుండమి యుపయోగ మంతగా గలుగదు. కాగా నలౌకిక మయిన యీ వైచిత్ర్యము సర్వము రసోపయోగమున గుణ మాపా దించును. సమవృత్తము లుండవలయు ననుటచే నృత్త కృత విచిత్రత సూచితము. విశేషకృత మయిన వైచిత్ర్యమున నాట్యము నందు సౌందర్యము కలుగును. గుణము లుండగా నుండు శోభ యవి లే నప్పుడుండదు. నాట్య సౌందర్యాధానములో గుణప్రభావము దీనిచే ప్రదర్శితము కాగలదు.

౭. సై ంధ వ క ము

౫౪౨. పాత్రం విభ్రష్టసంకేతం సువ్యక్తకరణాన్వితం
ప్రాకృతై ర్వచనైర్యుక్తం విదుః సైంధవకం బుధాః

ఈ యంగములో నుపజీవ్యాంగ మింతగా నున్నది. సంకేతము విభ్రష్టము కాగా నొకపాత్ర ప్రాకృతవచనములతో సువ్యక్త కరణా న్వితముగ వ్యవహరించుట సైంధవక మగును. సింధుదేశ భాషాత్ర

యము సైంధవకము. ఇతర ప్రాకృతభాషోపకరణములతో గాక సైంధవభాషాశ్రయణము రంజనాధిక్యమున రసోపయోగి యగును. రంజనోపయోగముగా నటౌకికార్థ మీ లాస్యాంగమున స్వీకృత మగును. శృంగారరసమున ప్రాకృతభాష సాతిశయముగ నుపయో గించు నని రాజశేఖరుడు కర్పూరమంజరీ సట్టకమును ప్రాకృతమయ ముగా నిర్మించినాడు. కాన తత్తద్రసోపయోగ తారతమ్యమున నొక్కొక దానిలో నొక్కొక వైచిత్ర్యము ప్రధాన మగుట యున్నది. పాఠ్యరహిత మయిన నాట్యము రూపవాద్యాది సంయుక్త మగుట సైంధవమనియు నాట్యకోవిదు లనిరి. రూపకపాత్రలు ప్రాకృత వచనములతో నుందురు కావున ప్రభ్రష్టసంకేతు లగుదురు. రసోచిత సంకేత మంతయు భ్రష్టాత్మక మగును. అయినను వీణావాద్యాది కరణముల క్రియలతో గూడి రసవ్యక్తి నిదాన మగును. ఇట్టిదిది సైంధవకము. దశరూపకమున భాషాకృత మయిన వైచిత్ర్యమున భరతు డిందె సూచించినాడు.

## ౮. ద్వి మూ ఢ క ము

> ౫౪౩. ముఖప్రతిముఖోపేతం చతురశ్ర పదక్రమం
> శ్లిష్టభావరసోపేతం వైచిత్ర్యార్థం ద్విమూఢకే

దీనిలో ముఖ ప్రతిముఖ సహితము చతురశ్ర పదక్రమము శ్లిష్ట భావరసోపేత మయిన వైచిత్ర్యార్థ ముండును. లాస్యాశ్రయ మయిన కావ్యమున నిద్దర కనగా నాయకునకు నాయికకు వ్యామోహము వర్ణిత మయినచో ద్విమూఢక మగును. ఇద్దరి నాయికల మోహమున్న నిదియె యగును. ఒకే తాలము నాలుగు పాదముల కూడుకొని యా వృత్త మగుట యున్నది. అంగాంగపరిక్రమములోని తాలానుసరణము చతుర్ముఖములందు గతి పరిసమాపనముతో నుండుట యావశ్యకము. ఇందుం డిద్దరు పరస్పర మెదురుగా నుండి గతిపరిక్రమము కలవా రగు దురు. లోకము నందలి గతులలో నిట్లు తాలానుసరణము కల గతిక్రమ ముండదు. అయినను నటసామాజిక వర్గములవారి సాన్నిధ్యమున లాస్యాంగ మిట్లుండుట యానందస్వభావ మగును. కాన రసాంశేత రాంగముగ నుండియు రసోపయోగిగా నిందు సుగృహీత మయినది.

ముఖ ప్రతిముఖసంపత్తి యిందొక రమణీయత నాపాదించును. సామాజికులకు ముఖ మభిముఖముగా మొదట నుండుట, యనంత రము ప్రతిముఖ విధానమున నితరదిశలందు లాస్యాంగము నయించి ప్రవర్తించుట, గీతకాంగముగా ముఖ ప్రతిముఖ రీతి ననుసరించుట ద్విమూఢకములోని వైచిత్రి. చతురశ్రానుకూలముగా దిశాచతుష్ట యము క్రమించుచు పదక్రమణ మనుసరింప రంజనము కలుగును. ఇట్టి క్రమణమున వైచిత్ర్యము ప్రయోజనము. ఈ విచిత్రతచే సర్వ సామ్యలక్షణ మగు శ్లిష్టభావమున నుదయించు చిత్తవృత్తి సంఘ ట్టము రసముల యుపగతి స్ఫుటత్వ మిచ్చును.

గీతకాంగకము లయిన ముఖ ప్రతిముఖ విధానములతో సంగ సౌష్ఠవమున రసభావములతో నాయికాద్వయ రచనాశోభ యుండుట శ్రీశంకుకాదులు తలచిరి. కాని యది పరీక్ష కాగదు. ముఖ ప్రతి ముఖములు తన్నామసంధు లనుట సమీచీనసమీక్ష కాదు. ఈ యర్థ ముపయోగి కాదు. అస్మదుపాధ్యాయమతమె యనవద్య మని యావేదించితిమి.

౮. ఉ త్త మో త్త మ క ము

౫౪౪. ఉత్తమోత్తమకం విద్యాదనేక రస సంశ్రయం
విచిత్రైః శ్లోకబంధైశ్చ హేలా హావ విచిత్రితం

దీని నాట్యోపజీవన మిట్లుండును. ఉత్తమోత్తమక మనేక రసస్రంశయము. విచిత్రశ్లోకబంధములతో గూడి యుండును. హేలా హావ విచిత్రితమై యుండును. హేలాహావాది చేష్టాలంకారముఖ ముగా లోకమున గలుగు చిత్తవృత్తిపరితోషము దీనిలో నుపజీవిత మగును.*

---

*"న హి భగవదహతారన్య రామస్య కులకులత్ర ముపేక్ష్యం పరాభవఖలీకారశ్చ న సోఢవ్యః. క్షత్రియేణ చ లోక కంటకాభ్యుద్ధరణం కర్తవ్యం" ఇతి శాస్త్రార్థపరిపాలనం ముక్త్వా రావణహృత సీతానమానయనాద్యుచితం నిమిత్తం, పరమార్థతో న తు యథాప్రతిరూపం వర్ణ్యతే తథాన్య తృతీయ త్రేతావతీర్ణస్య (రామస్య)

కావ్యమునకు కావ్యభాగమున కుపరంజనమిచ్చు విధాన మున, వినేయులకు హృదయసంవాద మాపాదించు రీతి, నీ వైచిత్ర్యాం శము నాట్యమున లాస్యాంగముగా సముపగత మయిన ప్రసాదము. లాస్యాంగములె యుత్తమములు. అందునిది యుత్తమము. సర్వ మిందు రసపర్యాయము. రసపర్యవసాయి. ఉత్తమోత్తమము సంజ్ఞయై యుత్తమోత్తమక మయినది. ఇది యనేక రససంశ్రయ మనుట యసాధారణ మయిన రసమున కాశ్రయ మనినట్లయినది. స్థాయిసమా కలనమున బహుత్వము నూతనత్వమును ఘటనావైచిత్ర్య మాపాదిం పగలదు. విచిత్రశ్లోకబంధము లుండవలె ననుట వలన నీ యర్థము లభించును. శ్లోకమున కూర్చుట శ్లోకబంధము. శ్లోకఘటనా విధాన

---

సంభావ్యతే రామాయణేఽపి మునినా తథావర్ణిత
మితిచేత్! కిమతః? వేదేపి హి తథావర్ణ్యతాం
న వయమతో బిభీమః. న హి భాగః కావ్యం యశ్చ
యశ్చ రసాభినిష్యందీ వర్ణ్య ఇత్యుక్త మసకృత్”

అభినవగుప్తుని యీ వచనసారము నిట్లు భావించునది. “భగవదవతారుడయినను రామునకు కులకలత్ర ముపేక్షింప దగినది కాదు. పరాభవము సహింప దగినది కాదు. క్షత్రియుడు లోకకంటకముల పెకలింప వలయును. ఇట్టి దిది శాస్త్రార్థపరపాలనము. దీని విడిచి రావణుడు హరించిన సీతను మరల తీసికొని వచ్చుట యుచితనిమిత్తము కావచ్చును గాని పరమార్థముగా రామునంతటి వానికి ప్రతిరూపము కాదు. అప్రతి రూపముగనే కొందరు వర్ణించిరి. అయ్యది మూడవ త్రేతిలో నవతరించిన రామునకు సంభావిత మనుకొనవలెను. వాల్మీకిముని రామాయణమునను యట్లు వర్ణించి నాడనుట యేటి సమాధి? అట్టికీతి వేదమునను వర్ణితమయినను మే మంతమాత్రమున భయపడు వారము కాము. రసాభినిష్యంది భాగము వర్ణించినను కావ్య మని మే మెన్ని పర్యా యములో చెప్పితిమి!” —అభినవ భావములోని వైశిత్య మిట్లున్నది. రసనిష్యంది కాజాలని సన్నివేశము నభినవు డంగీకరింపడు. అది యాతని సాహితీవ్రతము. అది వాని నాట్యతపము. అవతారమహనీయుని రాముని కావ్యమున వర్ణించునప్పుడు దివ్యతా సముచితము లయిన ప్రభావభావములతో వర్ణింప వలెను. కేవల మాన వౌచిత్య మనుసరించి నిరూపించుట యుక్తము కాదు. దివ్య మాచిత్యము వేరుగా నెట్లుండునో ముని భరతుడె నిరూపించెను. వాని యనుసరణము శ్రేయము. రామా దుల విషయమై నిరూపణమున రచయిత యెంతగనో సావధానుడు కావలెను. సిద్ధ రసప్రఖ్యము లయిన రామాయణాదుల విషయమున స్వేచ్ఛాయోజనము”ను సహృద యాలోక రచయిత నిషేధించినాడు కదా’.

ములు వివిధములు విచిత్రములు పరమార్థతాభూతములు. ఒకప్పు డొకచో సంభవమాత్రమున వర్ణితములు నై యుండవలెను. ఇంకను హేలాహావములచే విశేషముగా దీప్తత కలిగి భూషిత మయినప్పుడు సాత్వికాద్యనుభావవర్గ మంతయు నాదీపమున నుండుట విశద మగును. శృంగారాకార సంయుత మయిన యక్షి భ్రూ వికారాదులు గ్రీవారేచకములు లలితాభినయాత్మకములుగా నుండుట హావహేలావిశేషములందు గుర్తింప వచ్చును.

## ౧౦. ఉ క్త ప్ర త్యు క్త ము

౫౪౫. కోప ప్రసాద జనితం సాధిక్షేప పదాశ్రయం
ఉక్తప్రత్యుక్తమేవం స్యాచ్చిత్రగీతార్థ యోజితం

కోపప్రసాదజన్యము సాధిక్షేపపదాశ్రయము చిత్రగీతార్థయోజిత మగునది యుక్తప్రత్యుక్త మగును. నాట్యోపయోగి యంశ మిందిట్లుపజీవిత మగును. లక్షణశ్లోకములోని ప్రథమార్థమున భావి లక్షణ మేకదేశముగా సూచితము. ద్వితీయార్థమున పూర్వసమాకృష్ట మయిన వైచిత్ర్యభాగము నాట్యోపయోగిగా నిర్దిష్టము. ఇక నీ యర్థము సంభావ్యము. కోపప్రసాదజన్యము సాధిక్షేపపదాశ్రయముగా నుం డుక్తవచనము ప్రత్యుక్త మగును. చిత్రగీత మనదగిన ధ్రువాగానకావ్యము లోని యర్థము నాట్యాంశమున సంయోజనము పొందగా నుక్తప్రత్యుక్తములోని వైచిత్ర్యము లాస్యాంగమున స్వీకృత మగును. భిన్నములుగా నుండు వాచ్యఖండలకములు రసావేశ మహిమాతిశయముననె సమన్వయము పొందును. ఈ ఖండముల నీ విధముగనె సంధానింప గలము.

"బాలే! నాథ! విముంచ మానిని రుషం రోషాన్మయా కిం కృతం?
ఖేదోఽస్మాసు, నమేఽపరాధ్యతి భవాన్ సర్వేఽపరాధా మయి
తత్కిం రోదిషి గద్గదేన వచసా; కస్యాగ్రతో రుద్యతే,
నన్వేతన్మమ, కాతవాస్మి? దయితా, నాస్మీత్యతో రుద్యతే.

నాయకాపరాధమున వ్యాకుల యయిన యొక ముగ్ధాధీర యిందలి నాయిక. ప్రియునితో సంభాషించుట యిం దున్నది. వరుసగా దీని యర్థ మిట్లు భావనీయము. "బాలా!" "ఏమి నాథా!,"

"మానిని! రోషము విడచవే!" "రోషము వచ్చి నే నేమి చేసితిని!" "నాకు ఖేదముగా నున్నదే" "నాకు మీ రేమియు నపకరింప లేదు. అన్ని యపరాధములు నాలోనె యున్నవి" "అయితే గద్గముగా నేడ్చెద వేల!" "నేనెవరి యెదుట నేడ్చితిని!" "ఇదిగో! నా యెదుటనే కదా!" "నీకు నే నెవరు!" "నీవుదయితవు గదే!" "కాదనే యేడ్చుచున్నాను"—

వీని కేకార్థ సమన్వయము రసావేశముననె గలుగును. కోప ప్రసాదాక్షేపముల గూడిన యుక్తప్రత్యుక్తము లిందు రమ్యముగ గలవు. ఇట్లె ద్విపదికా గీతార్థము లున్న స్థలము లందును కావ్యార్థము రసావేశమున నభినీయమాన సుందరమై యభినయార్థ సమావేశము పొందును. ఇట్టిది లోకపరిదృష్టము కాదు. అయిన నుపరంజనమునకై సాతిశయముగా నుపయోగించును. ఈ విచిత్రోపరంజనమంతయు రసావేశ వైవశ్య ప్రసాదము కల యుక్తప్రత్యుక్త లాస్యాంగముగ నుపజీవిత మగుచున్నది.

ధ్రువాగానములం దొక యభినయము స్థానకార్యముగ నాట్య నిరూపణమున నున్నది. అయినను కవి తాదృక్కార్య మొనరింప వలెనని ప్రయోక్త తాదృగ్గీతము యోజింప వలెనని శిక్షణ బోధనమునకై యిది నిరూపితమయినది. "ఈ యంగ మెటనుండి యుపజీవితమొ!" యనెడు శంకాశమనమునకై దీని రూపకాంగముగా చెప్ప వలసి వచ్చినది. సామాన్యాభినయములో నొక యభినయముగా నిది యున్నది. ఈ లాస్యాంగమున కోపప్రసాదజనితత్వము చెప్పుటచే "చిత్తవృత్త్యావేశస్థాన మీ యంగమునకు నివేశవిషయము" అని సూచిత మయినది. ఉక్తప్రత్యుక్త మహిమచే నాకాశభాషితాత్మక మయిన యలౌకికస్వరూపమును గూడ స్వీకరింపవచ్చును. ఆకాశభాషిత సహచరము లయిన స్వగతజనాంతి కాపవారితకములు నుపలక్షితములు కాగలవు. లోకమున నిట్టి వెక్కడ సంభవింపవని నాట్యమున గూడ ప్రయోగగానము ప్రతిషేధింపరాదు. ఒకప్పుడు శ్రోతకు కాకతాళీయవశమున స్వచిత్తవృత్తితో నర్థసంవాద ముదయింపవచ్చును. బాణభట్టారకుని హర్షచరితములో భగవతి సర

స్వాతి "యపరవక్త్రి" గీత మాకర్ణించి నప్పటి సంవాదసౌందర్యము సంభావనీయము. ఏతాదృశములు లోకమున నత్యంత మసంభావిత ములు కావు. లోకమున లేవని నాట్యమునందును ప్రత్యక్షకల్పము కానందున ప్రతీతియె యుండ దన్నచో నాట్యరూపతయె భ్రంశము పొందును. లోకసంభవాసంభవము లిం దకించిత్కరములు.

## చిత్రపదము — భావికము

౫౪౮. యత్ర ప్రియాకృతిం దృష్ట్వా వినోదయతి మానసం
మదనానలతప్తాంగీ తచ్చిత్రపద ముచ్యతే

౫౪౯. దృష్ట్వా స్వప్నే ప్రియా యత్ర మదనానలతాపితా
కరోతి వివిధాన్ భావాంస్తద్వై భావిక ముచ్యతే

కొందరు చిత్రపదమని భావికమని రెండంగములు పఠించిరి. వాని లక్షణమిట్లు పలికిరి. వాని భావమిది. చిత్రపదము. మదనానలపరితప్త యొకర్తుక ప్రియాకృతి చూచి మానసము వినోదపెట్టుకొనుట చిత్రపదము. భావికము. మదనానల పరితాపిత యొకతె స్వప్నమున ప్రియుని చూచి వివిధభావముల నుండుట భావికము. ఈ యధికప్రసంగము తగదు. లాస్యము దశాంగమని దశవిధమని ప్రసిద్ధి. తద్విరోధము సముచితము కాదు. ఈ ద్వయమున కుపయోగ మేనియు లేదు. అలౌకికమయిన కైశికీవృత్తి కుపయోగించువైచిత్ర్యము రసాంశమున సర్వవిధముల నుపకారి యగునది లాస్యాంగద్వారమున గలుగునని యది సర్వము నిరూపితదశాంగములచే సంగృహీత మని స్పష్టము. వైచిత్ర్యస్వీకార్య మీ దశకమున సంపాదిత మయినది. వైచిత్ర్య మనునది ప్రధాన మగు చిత్తవృత్త్యనువర్తనాంశమున విభావాద్యంశమున నుపరంజకభావమున నుండవచ్చును. అందు చిత్తవృత్త్యంశమున నుత్తమోత్తమక మున్నది. విభావాద్యంశగతముగా ప్రచ్ఛేదకము వలని వైచిత్ర్య మున్నది. కాక్వాద్యంశమునందు సైంధవకము వలన గలుగు వైచిత్ర్య మున్నది. లక్షణ గుణాద్యంశములో వైచిత్ర్యమునకు స్థితపాఠ్యము చాలును. అనువృత్తాంశమున త్రిమూఢము విచిత్రత కూర్చును. ఆహార్యము నందు నుపరంజక గీతాతోద్యయోజనము నందును పుష్పగండిక పర్యాప్తము. సాత్త్విక

సంపత్తిలో నాసీనపాఠ్యకృత వైచిత్ర్య మావిర్భవించును. ఉపరంజక భావమున ధ్రువాగానభాగమున సర్వాతోద్య యోగమున గేయపదమున వైచిత్ర్యము కలుగు చున్నది. ఉక్తప్రత్యుక్తలాస్యాంగమున గలుగు వైచిత్ర్యము గీతార్థానుగతముగా పాత్రము కరుణార్థము వాచిక మభినయించుటలో కూడుకొని యున్నది. స్వరతాలానుసరణమున నుండు ద్విమూఢకము వలన నాంగిక వైచిత్ర్యమును గలుగు చున్నది. వ్యభిచార్యంశములోని వైచిత్ర్య ముత్తమోత్తమకము వలన గలుగు చున్నది. కాగా వీని కతిరిక్తముగా నేయంశమును లేదు. కావున లాస్యాంగములు పదియని నిశ్చయించుటయె యుక్తము. వాగ్భాగ ముపరంజక మయిన నల్పము. స్వరసమయిన తద్వైచిత్ర్యమును ముని యధికముగనె నిరూపించినాడు. అలౌకిక మయిన వైచిత్ర్యాంశము రసమున సమతిశయితముగా నుపయోగించు ననుట మునికి సమ్మతము. నాట్యము రసాత్మక మనుటయె భరతునకు సమ్మతము. "అలౌకిక వైచిత్ర్యసారో హి రసః" మా భట్టతోతు లిట్లే యనిరి.

"లక్షణాలంకృతిగుణా దోషాః శబ్దప్రవృత్తయః
వృత్తిసంధ్యంగ సంరంభః సంభారో యః కవేః కిల
అన్యోన్యస్యానుకూల్యేన సంభూయైవ సముత్థితైః
ఘటిత్యేవ రసా యత్ర వ్యజ్యంతే హ్లాదిభిర్గుణైః
వృత్తైః సరలబంధైర్యత్ స్నిగ్ధైః చూర్ణపదైరపి
అశ్లిష్టహృద్యఘటనం భాషయా సుప్రసిద్ధయా
యచ్ఛేద్యకావ్యమాత్రం సద్రసభావానుభావకం
సామాన్యాభినయే ప్రోక్తం వాచ్యాభినయసంజ్ఞయా
ఏవంప్రకారం యత్కించిద్వస్తుజాతం కథార్పితం
అనూనాధిక సామగ్రీ పరిణామోన్మిషద్రసం
రసపోషాయ తజ్జాతం లోకాత్ నాట్యజగత్ స్వయం
ప్రతిభాయాః ప్రగల్భాయాః సర్వస్వం కవివేధసః"

లక్షణము లలంకారములు గుణములు దోషములు శబ్దప్రవృత్తులు వృత్తులు సంధ్యంగములు వీని సంరంభమంతయు కవి సంభా

రము. ఇవి యన్నియు నన్యోన్యానుకూల్యమున సంగతములై సముల్ల
సితము లయినచో రసము లక్లిష్టముగ వ్యక్తము లగును. వృత్తముల
సరలబంధము, చూర్ణపదముల స్నిగ్ధత, భాషలోని సుప్రసిద్ధత,
యశ్లిష్టహృద్యముగా ఘటనము పొందినప్పుడు తాదృశ మేదేని
కావ్యమాత్రమై రసభావముల కనుభావక మగును. ఇదియంతయు
వాచ్యాభినయ మనుపేర సామాన్యాభినయమందు సూచితమె. కథా
శ్రిత మయిన యేవంప్రకార మే వస్తుజాత మయినను సముచిత
సామగ్రీ సంపత్పరిణామమున రస మున్మిషింప జేయును. నాట్యజగ
మంతయు రసపోషమునకె స్వాయ మవతరించినది. అందు కవివేధసుని
ప్రగల్భప్రతిభాసర్వస్వము సాక్షాత్కరించును." ప్రగల్భప్రతిభ
యంతట సంభావనాప్రాణనముతో నుండును. అది లోకమున సంభ
వించిన సంభవించు గావుత. కాని యదియె పరమార్థము కాదు.
కవివాణి లోకోత్తర సంభార సంయుక్తమై సాధారణతాప్రాణ
మగుట హఠాత్తుగా రసమయి యగును. ఇది భట్టతాత్పర్యము.
ఇది భరతభావము. ఇది య భి న వ భా వ ము.

## అ భి నే య కా వ్య ని ర్మి తి

ప్రయోగాభిజ్ఞులు లాస్యాంగముల స్పష్టలక్షణమును లాస్య
విధానమున తెలియ వచ్చును. లాస్యాంగములలోని యుపజీవన
మిచ్చు భాగములు మాత్రమె యిందు విచిత్రతా దర్శనమునకై
ప్రదర్శితము లయినవి. ప్రసంగము పరాహతము కాకుండుటకై
లాస్యాంగముల సమగ్రరూపము నిచట నుల్లేఖింపము. కవుల సుఖ
గ్రహణమునకై దశరూపక లక్షణము రాశీకరించి నిరూపించుట సము
చితము.

౫౪౮. పంచసంధి చతర్వృత్తి చతుష్షష్ట్యంగ సంయుతం
షట్త్రింశల్లక్షణోపేతం గుణాలంకార భూషితం

౫౪౯. మహారసం మహాభోగ ముదాత్తవచనాన్వితం
మహాపురుషసంచారం సాధ్వాచారజనప్రియం

౫౫౦. సుశ్లిష్టసంధి సంయోగం సుప్రయోగం సుఖాశ్రయం
మృదుశబ్దాభిధానం చ కవిః కుర్యాత్తు నాటకం

సుకవి యభినేయకావ్యము నీ విధముగా నిర్మింప వలెను. ఇందు నాటక మనునది సర్వాభినేయ కావ్యమాత్రోపలక్షణము. అయిదు సంధులు సంభవించునేని కూర్పవలెను. కొన్నిటిలో నయిదు కుదురవు. అందుచే పంచసంధి యనుట సంభవార్థకము. నాలుగు వృత్తులు కైశిక్యాదులు. అరువదినాలుగు సంధ్యంగములు సుసంగత ములుగా నుండవలెను. కావ్యలక్షణములు ముప్పదియారుండవలెను. గుణాలంకార భూషితము కావలెను. మహారసము= పురుషార్థోప యోగులగు రసము లుండుట; "మహాన్తో రసాః యత్ర." మహా భోగము= రంజనాప్రధాన మయిన రస ముండుట యని భావము. "ఆభోగ" మని కొందరిభావము. మహారసము మహాభోగ మనుటలో నీ భావము సూచితము కాగలదు. రస మొక్కటి. అది మహారసము. శృంగారాదు లవాంతర కాల్పనిక స్వరూపములు. ఈ యంశము నిరూపితచరము. కావ్యము పార్యంతిక మహాప్రతీతిలో మహారస సముచితము లయిన విభావాదివిశిష్టతలు కలది కావలెను. అప్పుడట్టి కావ్యము సహృదయసామాజికులకు మహాభోగ మగును. అభినేయ ముదాత్తవచనాన్వితమగుచో శ్లేషప్రసాదాది గుణాభోగముల స్వీక రించును. మహాపురుష సంచారము సాధ్వాచారజనప్రియ మగుట యుదాత్తతానిదానము. సుశ్లిష్టసంధిసంయోగముగా నుండుటచే సంధ్యంతరములును సమానీతము లగును. సుప్రయోగ మనుట లాస్యాంగసూచకము. సుఖాశ్రయ మనుట ఛందోవృత్తవైచిత్ర్యము సూచితము. కావ్యమున వివక్షితార్థము మృదు శబ్దములచే నభి హితము కావలెను. కాగా మాధుర్య ప్రసాదార్థవ్యక్తిగుణముల ప్రకర్షము సూచిత మయినది. కవి నాటకము నిట్లు నిర్మింపవలెను. ఇట్లు నాటకము నిర్మించునాతడె కవి.

౫౫౧ అవస్థా యా తు లోకస్య సుఖదుఃఖసముద్భవా
నానాపురుషసంచారా నాటకేఽసా విధీయతే

లోకమునకు సంబంధించిన సుఖదుఃఖ సముద్భూత మయిన యవస్థ నానాపురుషసంచారము కలదై నాటకమున నిబద్ధ మగును. నానాపురుషులం దా యవస్థ యేకభావానుప్రవేశము కలదై సంచా

రము పొందును. రసాత్మక మయిన యనుప్రవేశమున సంచారము కలదగును గాన నా యవస్థ రసరూపత్వము పొందున దగును. నాటకమున విధీయమాన మగుట సంపాద్యమాన మగుట సర్వము రసరూపతానయన ముద్బోధించును. నాటకము నందుపనిబద్ధము లగునవి యన్నియు రసావస్థానములగుట మొదట నిరూపితమె. జ్ఞానము శిల్పము విద్యకల కర్మయోగము సర్వము నాట్యము నందున్నది. ఇందు లేనిది లేదు. నానావస్థాంతరాత్మక మయిన లోకస్వభావ మంగాద్యభినయయుక్తమై నాట్యమగు ననుటయు నిరూపిత మయినది. దేవతలు ఋషులు రాజులు మేధావులు వీరందరి పూర్వవృత్తానుచరితమె నాటక మగును. పూర్వవృత్తానుచరితము నాటకశబ్దార్థ మెట్లగునను కొందురు కాబోలు. ఇదిగో!

> ౫౫౨. యస్మాత్స్వభావం సంత్యజ్య సాంగోపాంగ గతిక్రమైః
> ప్రయుజ్యతే జ్ఞాయతే చ తస్మాద్వై నాటకం స్మృతం.
> ౫౫౩. సర్వభావైః సర్వరసైః సర్వకర్మప్రవృత్తిభిః
> నానావస్థాంతరోపేతం నాటకం సంవిధీయతే.

ప్రయోక్తలు ప్రయోగసమయమున లోకసిద్ధమయిన స్వభావమును విడనాడి సాంగోపాంగము లయిన గతిక్రమములతో ప్రయోగము నిర్వహింతురు గాన నిది నాటక మయినది. “నట నతౌ” అని ధాతువు. తదర్థము నమనము. స్వభావత్యాగమున ప్రహ్వీభావముతో నుండుట నాటకపదార్థమున గోచర మగును. సర్వభావములతో సర్వరసములతో సర్వకర్మప్రవృత్తులతో నానావస్థాంతర సముపేతముగా నాటకసంవిధాన మున్నది. ఇట్టి దీని నిర్మాణమునకె కవి యతించిన కవి యగును. లోకస్వభావము చూచి నరుల బలాబలములు గుర్తించి వారి యంగ రంగ భోగ రాగములు తెలిసి యుక్త లుక్తులు పట్టి నాటకమును నిర్మింప వలెను,

> ౫౫౪ భవిష్యతి యుగే ప్రాయో భవిష్యంత్యబుధా నరాః
> యే చాపి హి భవిష్యంతి తే యత్నశ్రుతబుద్ధయః

౫౫౫ కర్మశిల్పాని శాస్త్రాణి విచక్షణబలాని చ
సర్వాణ్యేతాని నశ్యంతి యథా లోకః ప్రణశ్యతి.
౫౫౬ తదేవం లోకభాషాణాం ప్రసమీక్ష్య బలాబలం
మృదుశబ్దం సుఖార్థం చ కవిః కుర్యాత్తు నాటకం

రానున్న కాలమున మానవు లందరు సామాన్యముగా నబుధు లగుదురు. వారును యత్నశ్రుతబుద్ధులు. యత్నమున విందురు బుద్ధులు సంపాదింతురు. కర్మలు శిల్పములు శాస్త్రములు పరిశీలనములు బలములు సర్వవిశేషములు నష్టప్రాయము లగును. అప్పుడు లోకమె నష్ట మగును. కాన నా సమయమున లోకభాషల బలాబల రీతుల గుర్తించి కవి మృదుశబ్దముగా సుఖార్థముగా నాటకమును నిర్మింపవలెను. త్రేతలోని యీ మాట ద్వాపర కలియుగ విశేషములను సూచించు చున్నది. ఆ యుగములందు కర్మశిల్పాదులె నశించు ననుట కాదు. ఈ వచనము సమస్తనాట్యాంగోపలక్షణము. అప్పుడు కవి నిర్మింపవలయు ననుట కవిపర మయిన యుపదేశము. కాని నటులు ప్రయోగింతురు. సహృదయులు తెలియుదురు గావున వారలకును స్వభావపరిత్యాగపురస్సర మయిన నమనము సంభావనాకృత మయిన యౌచిత్యానుసారమున చెప్పదగియె యున్నది.

౫౫౭. చేక్రీడితాద్యైశ్శబ్దైస్తు కావ్యబంధా భవంతి యే
వేశ్యా ఇవ న తే భాంతి కమండలుధరైర్ద్విజైః

చేక్రీడితము మొదలయిన వైయాకరణ గ్రామ్య శబ్దములతో కావ్యబంధము లుండునేని కమండలువులు ధరించిన ద్విజులతో వేశ్య లున్నట్లు రమణీయముగా నుండవు రసభావోచితము లయిన శబ్దముల సంపత్తి యుండవలయు ననుట యిందలి యుపదేశము. ఇప్పటికీ నిరూపించిన దంతయు దశరూపవిధానము. కవిప్రయోక్తలనుసరింప దగిన విశేషములు సవిశేషముగా నిరూపితము లయినవి. ఈయుక్త సంవిధానసమీక్ష కథావిస్తృతికి రసభావఘటన మును పయోగించు ననుట పునరుక్త మయిన నావశ్యక మగుచున్నది.

## వృత్తివివేకము

వృత్తిభేదమున కావ్యభేదము కలుగును. వృత్తులేవో తెలియ లేదు. వాని యవధారణ మావశ్యకము. కాయవాఙ్మానసముల చేష్టలె వైచిత్ర్యసహితములై వృత్తు లగును. కాని యా చేష్టలు సమస్తజీవలోకమున వ్యాపించినవై యిదంప్రథమముగా ప్రవర్తించి నవి కాక చిరకాలముగా ప్రవర్తించుచున్నవై ప్రవాహరూపమున ప్రస రించుచున్నవి. అయిన నవి విశిష్టహృదయావేశమున గూడుకొనిన వయినచో వృత్తు లగును. నాట్యోపకారు లగును. ఆవేశము తార తమ్యస్వరూపమున నుండుటచే లౌకిక మలౌకిక మని రెండువిధములు. అందు లౌకికావేశము సుఖదుఃఖముల తారతమ్యకృతముగా నుండునే. కాని రసాగమమున సమాస్వాద్యము కాదు. రసమీమాంసలో నీ యంశము విపులముగనె విశదీకృత మయినది. అలౌకికావేశ మావే శమె కాదు. కవికి వలె సామాజికునకు వలె ననావేశ మయిన నావేశ మయముగనుండును. ఒకానొక సముచితావసరమున హృదయసం వాదసరసమై భాసించు నదియె సాధారణ్యస్థితిలో చమత్కార గోచర వ్యాపారవిశేషముగా రసోపకరణము కాగలదు. అట్టి విధా నము కృతయుగారంభమున భగవానుడు వాసుదేవునకు సంబంధించి రమ్య మయినది. సకలసిద్ధికై వాసుదేవు డొనరింప వలసిన కర్తవ్య మేదియు లేదు. లోకానుగ్రహమె భగవానుని కార్యలీల. లోక సాధారణభావమున నాత డావేశమయుడుగా భాసించుటయె కాని యాత డనావేశుడు. మొదట భగవానుడె యట్టివాడు. ఈ వృత్తి విషయమున పూర్వసృష్టిగత మయిన వ్యాపారమును గుర్తింప వలెను. ప్రలయ మహారజనీ ప్రస్తావముతో దీని నిరూపింప వలసి యున్నది. అప్పుడే కదా ప్రపంచ మంతయు ప్రభ్రష్ట మయినది. అచ్యుతభగ వాను డీ జగమేకార్ణవ మొనరించి నాగపర్యంకమున శయనించి యుండగా వీర్యబలమున మత్తు లయిన మధుకైటభు లను నిద్ద రసు రులు వచ్చి యుద్ధ మొనరింప వలెనని యనిరి. బాహువు లప్పళిం చుచు భూత భావన ప్రభువును జాను ముష్టి ఘాతముల బాదిచి యుద్ధ మొనరించిరి. సముద్రము కంపించు నట్లు నానాధిక్షేపములతో పరుష

వచనములతో తూలనాడిరి. వారట్లు పలుకుచుండగా విని వ్యథపడి బ్రహ్మ యిట్లనెను. "కిమిదం భారతీవృత్తిః వాగ్భిరేవ ప్రవర్తతే" ఏమిది? కేవలము మాటలతో భారతీవృత్తి సాగినదే! ఉత్తరోత్తర మతిశయించి నదే! మితి మీరినదే! వాసుదేవా! ఇక వీరి వధింపుము!" ఈ బ్రహ్మవచనము విని మధుసూదను డిట్లనెను.

౨౨౮. కార్యహేతోర్మయా బ్రహ్మన్! భారతీయం వినిర్మితా
వదతాం వాక్యభూయిష్ఠా భారతీయం భవిష్యతి

"బ్రహ్మ! ఒక కార్యమునకై నే నీ భారతిని నిర్మించితిని. ఇక నిది కవుల వాక్యరచనాతిశయము కలదై "భారతి" కాగలదు. వీరి నిక వధించెదను." ఈ సందర్భములో నీ యంశమును గుర్తింప వలెను. కృతయుగములో నీ వృత్తివ్యవహారము వెలువడినది. త్రేతాయుగములో నిది యన్యుని పొందలేదు. ఆదికవి వాల్మీకి యట్టివాడని ప్రవాద మున్నది. ప్రలయానంతరము కృతయుగము రానున్నప్పుడా సంధ్యవసరమున నద్దుతగిలిన వారి దర్పము పోగొట్టి విఘ్నముల దూరీకరించి సమారభించు సృష్టిసంపత్తిలో "కొంతకాలమునకు వాల్మీకిముని ప్రాదుర్భవింప గలడు అను సాధారణ్యాశయమున నె విష్ణుదేవుడు వృత్తిస్రష్ట యయినాడు. ఆతడె వృత్తినిర్మాత యని యిందు నిర్దిష్ట మయినది. మధుకైటభులు వృత్తినిర్మాతలు కారు. వారు లౌకికావేశపరులు. ఉద్రిక్తతమ మయిన తమోగుణము కలవారు. వారి స్వాంత మట్లు తమస్సంతానిత మయినది. వా రవిద్యామయు లయినారు. ఆనందసార మనునది విద్యావకాశవశమున హృదయ కమలము వికసింపగా పరిమలరూపమున నుండును. అది రసోపయోగి. అందు వ్యాపారావేశము లేదు. అట్టి దది దైత్యులందు సంభవింపదు. భగవానునందె సంభవించును. నటునివలె ననావేశదర్శను డగుట వలన భగవానుడె వృత్తిప్రవర్తయిత, మధుకైటభులు కారని గుర్తించిన బ్రహ్మ "కిమిదం భారతీవృత్తిః వాగ్భిరేవ ప్రవర్తతే" యని నాడు. బ్రహ్మ యిట్లనినా డనుటచే నాత డప్పుడు ప్రేక్షకత్వము వహించినా డని భావము. ఈ వృత్తులకు సామాజికహృదయము లందె విశ్రాంతిప్రాధాన్య మున్నది. రసచర్వణ సామాజికనిష్ఠము కదా! వృత్తులకు నాట్యోపయోగము కార్యద్వారముననె కలుగును.

వాచికప్రాధాన్య మున్నప్పుడు భారతీవృత్తి భారతీశబ్దమున వాక్కు నిర్దిష్ట మగును.

యుద్ధమార్గవిశారదు లయిన మధుకైటభ దైత్యులిద్దరు శుద్ధా వికృతాంగములతో యుద్ధ మొనరించిరి. అంగహారణములతో గూడు కొనిన యంగవిక్షేపములను వారు ప్రయోగించిరె కాని వా రుత్ప్రే క్షించిన వైచిత్ర్యమేమియు నందు లేదు. వారట్లు యుద్ధ మొనరించు నప్పుడు.

౫౫౯. భూమిసంయోగ సంస్థానైః పదన్యాసై ర్హరే స్తదా
అతిభారోఽభవద్భూమేః భారతీ తత్ర నిర్మితా

శ్రీవిష్ణు పాదవిన్యాసములచే భూమి కతిభారము కలిగినది. విష్ణుపదములు భూమిసంయోగమున ఉద్ఘట్టితసంకుచితాదిరూపమున సంస్థానము కలవైనవి. అట్టి పాదవిన్యాసములచే నతిభారము కలిగినది. అ తి భా ర మని యక్షరసామ్యమున గూడ భారతీనిర్వచనము సూచితము. ఇందు నటవ్యాపార మున్నను అంతరవికల్పాత్మకము లయిన వాక్కుల సంజల్ప బాహుల్య మున్నప్పుడె భారతీవృత్తి యగునని సూచితము. వాసుదేవుని నానాపదవిన్యాస సమ సమయమున వాగ్వ్యాపార మయిన భారతీవృత్తి నిర్మిత మయినది.

౫౬౦ వల్గితైః శార్ఙ్గధనుష స్తీవ్రై ర్దీప్తతరై రథ
సత్త్వాధికై రసంభ్రాంతైః సాత్త్వతీ తత్ర నిర్మితా

శ్రీవాసుదేవుని తీవ్ర దీప్తతర వల్గితములచే సాత్త్వతీవృత్తి నిర్మిత మయినది. అప్పటి యా వల్గితముల సంభ్రాంతములు సత్త్వాధికములు. మనోవ్యాపారాధిక్య మున్ననె సాత్త్వతీవృత్తి కలుగును. సత్త్వసత్త్వరూప మున్న వారలకె యిది కలుగును. ఈ యుద్ధసమయము లోని సత్త్వము పరచ్ఛిద్రాన్వేషణమునకు తగిన యుపాయములతో గూడిన యొకానొక లాఘవప్రక్రియ. ఇం దప్రతితాన మయిన వైచిత్ర్య ముండును. తదుత్ప్రేక్షిత మయిన ప్రకాశ ముండును. ఇట్టి సత్త్వాధికవల్గనములె సాత్త్వతిని నిర్మించినవి.

౫౬౧ విచిత్రై రంగహారైస్తు దేవో లీలాసమన్వితైః
బబంధ యచ్ఛిఖాపాశం కైశికీ తత్ర నిర్మితా

వాసుదేవుడు డప్పుడు లీలాసమన్వితము లయిన విచిత్రాంగ హారముల ప్రదర్శించెను. ఆ యంగహారము లందె శిఖాపాశము బంధించెను. అప్పుడు కైశికి నిర్మిత మయినది. వాసుదేవుడు స్వయముత్ప్రేక్షించిన వైచిత్ర్య మొకటి యిం దున్నది. అదిలేక యుద్ధవిశారదు లగు దైత్యుల నిర్జించు టెట్లు? వారిద్ద రేకాగమానుసంధానమున సంబుద్ధి సంబోధన సంబంధము కలవారై యుద్ధమొనరించుచున్నారు. జయమెవ్వరికో? పరాజయ మెవ్వరికో? అందువనె విష్ణువు పట్టబంధము బంధించినారు. శృంగారస్థానము లయిన లక్ష్మీసంభోగాదుల నాత డప్పుడుస్మరించెను. లీలతో విలాసముతో కేశపాశము బంధించుచు నుదాసీనముగ నుండెను. అప్పటి లీలారచనమె కైశికీ నిర్మితి హేతు వయినది.

౫౬౨ సంరంభావేగ బహులై ర్నానాచారీ సముత్థితైః
నియుద్ధకరణై శ్చిత్రైః ఉత్పన్నారభటీ తతః

విష్ణువు దైత్యులతో నియుద్ధ మారంభించినాడు. నియుద్ధమునకు సముచితము లయిన చిత్రవిచిత్రము లగు కరణములు ప్రయోగించినాడు. అవి యన్నియు నానావిధచారీమండలముల కలయికతో సముత్థితము లయినవి. వానిలో సంరంభ మావేగము బహులముగా నున్నది. సామాన్యముగ నిశ్శంకముగ ప్రవర్తించువారు చారీమండల గతులలో దిగబడిపోవుదురు. వారిని సుఖముగా జయింప వచ్చును. అట్టి చారీగతిలో కాని కరణప్రయోగములో గాని వాసుదేవునకు పరిశ్రమాపనయమును సంపన్న మగును. దైత్యు లావిష్టులు. విష్ణువనావిష్టదేవుడు. ఇప్పటి చిత్ర నియుద్ధ కరణములతో నారభటి యుత్పన్న మయినది.

౫౬౩ యాం యాం దేవస్సమాచష్టే క్రియాం వృత్తిషు సంస్థితాం
తాం తదర్థానుగై ర్లక్ష్యైః ద్రుహిణః ప్రత్యపూజయత్.

శ్రీవాసుదేవదేవు డే యే క్రియను వృత్తిసంగత మగునట్లు స్వసమారంభమున సూచించెనో యా యా వృత్తిసంస్థిత మయిన క్రియను బ్రహ్మ తదర్థానుగతము లయిన విధానములచే పరిపూజనము చేసెను. నాలు గివి యిట్లు వృత్తులయినవి. క్రియాసర్వస్వ మంతయు

వృత్తిచతుష్టయ వ్యాప్త మగును. వాఙ్మనఃకాయచేష్టల కతిరిక్తముగా నే కర్మయు నుండదు. క్రియాశూన్య మయిన యంశ మెచట లేదు. మూర్ఛామోహ మరణాదులలో గూడ సూక్ష్మ ప్రాణ పరిస్పందాను లచే సంచిత పరిస్పందమును సంభావింప గలము. మృతు డగువాడు త్రామపాషాణకల్పుడు. మృతవృత్తి కథనమున స్వ పర మేమియు నుండదు. తదన్యుల శోకాదివిభావనము చక్కగ ప్రతిపాదించినచో కావ్యాంగము కాగలదు. అట్టి దది కరుణరసాక్రాంతమై కావ్యమున వ్యావర్ణనీయ మగును. కార్యసందర్భము సర్వము రసభావపర్యవసిత మగును. రసభావములు చేతనములందే యుండును. చేతనులలో వ్యాపారత్రయ శూన్యముగా నే కావ్యాంశ ముండదు. వృత్తిచతుష్ట యము వ్యాపారత్రయానుగతముగా నున్నది. వాచికముభారతి. సాత్త్వి కము సాత్త్వతి. కాయికము కైశికి యారభటి. లలిత లీలా విలాస కాయక్రియ కైశికి యయినది. సముద్ధత గతిక కాయక్రియ యారభటి యయినది. ఇట్లు వృత్తులు నాలుగె యగుచుండగా గొందరు భరతాభిప్రాయమును హృదయసంవాదమున గుర్తింపజాలక పంచ వృత్తులని రెండే వృత్తులని యనిరి. ఆ పండితసహృదయమ్మన్యులు పరికల్పించిన ప్రవాదముల పరిశీలింప నక్కఱలేదు. ఇది యిదివరలో నిదర్శితప్రాయ మయిన నిపుడు ప్రదర్శిత మయినది.

మధు కైటభ దైత్యు లిద్దరు నిహతు లయిరి. అప్పుడు బ్రహ్మ శత్రుసూదను డయిన వాసుదేవ నారాయణుని చేరి యిట్లనెను. బ్రహ్మ భక్త్యావేశవృత్తి కలవాడు. కవియు నట్లె కావలెను. రసా ధిష్ఠత్వమె కవి ముఖ్యరూపము. అతని విస్తారణాత్మక మయిన వర్ణనా సంపదయు రసనిష్ఠమె కావలెను. బ్రహ్మ వాక్కిది.

౫౬౩. అహో! విచిత్రై ర్విషమైః స్ఫుటైః సలలితై రపి
అంగహారైః కృతం దేవ! త్వయా దానవనాశనం

౫౬౪. తస్మాదయం హి లోకస్య నియుద్ధసమయక్రమః
సర్వశాస్త్రవిమోక్షేషు "న్యాయ" సంజ్ఞో భవిష్యతి

దేవా! లలితాంగహారములతో దానవనాశన మొనర్చితివే! నీ ప్రదర్శితాంగహారములందు విచిత్రత యున్నది. విషమత్వ

మున్నది. స్ఫుటత్వ మున్నది. అవి సలలితములు. ఇక నిట్టిపై మీా యీా మల్లయుద్ధరీతి సర్వవిధశస్త్ర విమోక్షములం దనుగత మగును. అందిది "న్యాయము" అనెడు సంజ్ఞ కలది కాగలదు. మీారు ప్రదర్శించిన యీా యంగహారములు ప్రసిద్ధ శస్త్రాగమములందు గోచరింపవు. ఇందలి ప్రకారములు శస్త్రశాస్త్ర కోవిదుల కగమ్య ములు. ఇవి యద్భుతములు. సర్వలక్షణ ప్రసిద్ధము లయినను చిత్ర ములు స్వార్థోత్ప్రేక్షిత వైచిత్ర్యము కలవి. ఇవి యన్నియు లోచన గోచరములై యతిరమ్యములుగా నున్నవగుట సలలితము లయినవి. దేవా! ఈ నియుద్ధ సమయ క్రమములు నీవె యావిష్కరించితివి. భవదుపజ్ఞాతము లయిన వైచిత్ర్యములతో నివి యుపబృంహితములై యున్నవి. వైచిత్ర్యమున్నను శస్త్రాగమపరిత్యాగము లేదు. "నియుద్ధ క్రమః= క్రమః పరిక్రమణం క్రమో వా శత్రు విక్రమణ యోగేపి గతాగతస్య నిభృతం శస్త్రాదిశూన్యం యుద్ధం నియుద్ధం మల్లయుద్ధం." శత్రువు విక్రమించునప్పుడు గతాగతములకు సంబంధించిన శస్త్రాది శూన్యమగు నిభృత మయిన యుద్ధమును నియుద్ధ మందురు. ఇదియె మల్లయుద్ధము. ఇందలి పరిక్రమణము క్రమము నియుద్ధక్రమము. ఈ విశిష్టత ప్రకృతము కేవలము మల్లయుద్ధగతముగా నున్నను నానా వైచిత్ర్య సంబంధమున సర్వవిధ శస్త్రాస్త్రయుద్ధములలో నుపయోగింప గలదు.

౫౬౫. న్యాయాశ్రితై రంగహారైః న్యాయాచ్చైవ సముత్థితైః
యస్మాద్యుద్ధా నివర్తంతే తస్మాన్న్యాయాః ప్రకీర్తితాః

సాంకేతిక మయిన న్యాయ పదమున కిందు స్వరూపకథన మున్నది. ఆంగికాభినయ నిరూపణములో న్యాయ శబ్ద నిర్వచనము నిరూపితమె. అయినను ప్రకృతస్మృతి కిట్లు నిరూపింతుము. ఆ యా క్రియలకు సముచితము లయిన యంగముల సమకాలముననె ప్రచరింప జేయుట నృత్తమాతృక యందురు. రెండుగాని మూడుగాని నాలుగు గాని నృత్తమాతృకలు పరస్పరము సంసక్తములై యుండునట్లుగా నేకక్రియగా నాచరించినచో కరణ మందురు. కరణముల యత్రుటిత ప్రయోగ మంగహారము. ఇట్లి యుద్ధాదులలో నృత్తమాతృకా స్థానమునందు స్థానకాది క్రియావిశేషములను సంకేతించిరి. వానికి

న్యాయ సంజ్ఞ ప్రసిద్ధ మైనది. అంగసముచిత క్రియ న్యాయశబ్ద మున గుర్తింప వలెను. పరభంగముతో నాత్మరక్షణముతో నియుద్ధ మున నెదుర్కొను మల్లుర క్రియావిశేషము "న్యాయము" అన దగును. కాగా న్యాయమున నుదయించిన న్యాయాశ్రితము లయిన యంగహారములచే యుద్ధములు ప్రవర్తించును గాన న్యాయమను వ్యవహారము ప్రవర్తిత మయిన దని శ్లోకభావము. చారీగతులలో నిది జనించినది. నానాచారులు కిది యాశ్రయ మయినది. కాన నిది న్యాయ మయినది. వేదకుక్షి నిక్షిప్త మయిన యిది చారీసమాకుల మయిన యస్త్రజాతమున గూడ ప్రయుక్త మయినది. నాట్యప్రయోగము లందును నానా భావసమన్వితములు కావ్యబంధసమాశ్రయము లయిన వృత్తులుగా నిరూపితము లయినవి. ఇట్లు వృత్తుల స్వరూప పరిచయము సూచిత మయినది. ఈ వృత్తుల కిక నాట్యము ననుస రించిన యవతరణ విధానమును వ్యాఖ్యానింప వలయును.

> ౫౬౬. చరితై ర్యస్య దేవస్య జప్యం యద్వ్యాదృశం కృతం
> ఋషిభి స్తాదృశీ వృత్తిః కృతా పాఠ్యాది సంయుతా
>
> ౫౬౭. నాట్యవేద సముత్పన్నా వాగంగాభినయాత్మికా
> మయా కావ్యక్రియాహేతోః ప్రక్షిప్తా ద్రుహిణాజ్ఞయా
>
> ౫౬౮. ఋగ్వేదాద్భారతీ క్షిప్తా యజుర్వేదాచ్చ సాత్వతీ
> కైశికీ సామవేదాచ్చ శేషా చాథర్వణాదపి

భగవద్విశ్వచరితములు నాట్యగర్భాధేయములుగా నున్నవి. బ్రహ్మ వీని నన్నిటిని భావించి పూర్వము తదుపలక్షితముగా స్తోత్ర కావ్యరూప మగు జప్యము నిర్మించినాడు. అది భావాదిచేష్టాప్రధా నమై వెలసినది. బ్రహ్మపుత్రులు ఋషులు బ్రహ్మజప్యము ననుసరించి పాఠ్యాదులతో కూడి యుండునట్లుగా నా వృత్తి ననుసరించిరి. పాఠ్య ప్రధానము భారతి. అభినయప్రధానము సాత్వతి, అనుభావాదుల వలన నావేశమయముగా రసప్రధానముగా నుండునది యారభటి, కైశికి గీతవాద్యాద్యుపరంజక ప్రధానము. నాట్యవేదోత్పత్తి నిరూ పణావసరములో వేదచతుష్టయమునుండి సంక్రమించిన విశేషముల నిరూపించితిమి. ఇట్లు బ్రహ్మసంప్రదాయమున వెలసిన నాట్యవేదో త్పన్నము వాగంగాభినయాత్మక మయిన యీ వృత్తిని బ్రహ్మ

యాజ్ఞానుసారమున కావ్యక్రియార్థమై కూర్చితిని. (కర్త భరతుడు.) కావ్యరూపతాపాదనము కావ్యక్రియ. అభినేయకావ్యముల కనభినేయ కావ్యములకు వైలక్షణ్యము సంపాదించుటకై యివి ప్రక్షిప్తము లయినవి. (ప్రకర్షేణ క్షిప్తాః) భగవద్వ్యాసుదేవుడు నంశావతారరూపుడు. దురాచరితములు దైత్యు లొనర్తురని సంభావించి వారి వ్యయమున కవతరించిన యవ్యయోదయమూర్తి. ఈ వృత్తు లెట్లు వచ్చినవి? ఈ యాశంకాసమాధిగా నిది సంభావ్యము. ఋగ్వేదమునుండి భారతి, యజుర్వేదమునుండి సాత్వతి, సామవేదమునుండి కైశికి, యాథర్వణమునుండి శేషము సర్వము సంగృహీత మయినది. పరమేశ్వరుడు ఛందోమయుడు కదా! ఛందోమయ వాసుదేవస్వరూపము నుండి వృత్తిప్రకాశము సంగృహీత మయినది.

## భారతీవృత్తి

౨౬౯. యా వాక్ప్రధానా పురుషప్రయోజ్యా స్త్రీవర్జితా సంస్కృత పాఠ్యయుక్తా
స్వనామధేయైః భరతైః ప్రయుక్తా సా భారతీ నామ భవేత్తు వృత్తిః

ఈ సంకేతితము లయిన వృత్తులు లక్ష్యమునందు పరస్పర సంకీర్ణరూపములై బహురూపములుగా నున్నవి ఇట్లున్నప్పు డొకటి ప్రధానమై యుండవలెను. అప్పుడితరము లప్రధానముగ నవభాసింపగలవు. ఈ వివేకము ప్రదర్శించుట కీ యుత్తరగ్రంథ మావశ్యకము. వాఙ్మనఃకాయచేష్టాంశములలో నే చేష్టాంశము కాని పరస్పర మసంకీర్ణముగ నుండదు. కాయచేష్టలు సూక్ష్మమానసచేష్టలతో సూక్ష్మ వాచికచేష్టలతో వ్యాప్తములై యుండును. శబ్దానుగమరహితముగా నెట్టి ప్రత్యయమును లోకమున నుండదు. "న సోస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే" మానస వాచిక చేష్టలు కూడ నవశ్యము సూక్ష్మముగా కాయపరిస్పందముతో మందప్రాణ వ్యాపారరూపముతో నుండునే కాని తదతిరిక్తముగా నుండవు. ఈ యంశమునె కొంద రనిరి. "దేహి యర్థక్రియ లన్నిటిలో వాక్కన్నిటి నీహా విషయముగ చేయును. వాక్కుత్క్రమించినచో దేహి విసంజ్ఞు డగును. కాష్ఠ కుడ్యముల వలె నగును." అర్థక్రియాసు వాక్సర్వాన్సమీహాతి దేహినః "తదుత్క్రాంతౌ విసంజ్ఞోయం దృశ్యతే కాష్ఠకుడ్యవత్."

నాట్యము నందలి పరిస్పంద మేదేని రసోపయోగి లాలిత్యభాగ శూన్యముగ నుండదు. కాన వృత్తు లన్నియు నన్యోన్యసంయుతములు. కేవలము ఒకచో నొకటి కొంత యధిక మగుటచే ప్రధానముగా నట్టి వ్యపదేశము ప్రవర్తిత మయినది.

భారతీప్రాధాన్య మీా విధముగ నుండును. భారతి వాక్ప్రధానము. పురుషులచే ప్రయోగింపదగినది. స్త్రీవర్జితము. కైశికి లోని ప్రాధాన్యము స్త్రీకృతము. భారతి సంస్కృతపాఠ్యయుక్తము. కైశికిలో ప్రాకృతపాఠ్య లాలిత్య మున్నది. ఈ భారతిని భరతసంతానమగుట భరతహితు లయిన నటులు భరతుని ద్వారమున వంశకరనామధేయము కలవారు ప్రయోగించిరి కావున భారతీవృత్తి యయినది. ఈ భారతీభేదములు నాలుగు గలవు. అవి దీని కంగములు. కాని ప్రకారములు కావు. వీనిలో భారతీవృత్త్యంశ మున్నది. వీథి ప్రహసన మనునవి రూపకభేదము లగును గాని రూపకమున కంగములు కావు. నాట్యమున కంగ మగు ననుట నాట్యము సముదాయరూప మని చెప్పిన ట్లగును.

౧ ప్రరోచన — 3 వీథి

౨ ఆముఖము — ౪ ప్రహసనము

క్రమముగా నీ నాలుగంశముల స్వరూపలక్షణ మిట్లుండును.

> ౫౪౦. జయాభ్యుదయినీ చైవ మంగల్యా విజయావహా
> సర్వపాపప్రశమనీ పూర్వరంగే ప్రరోచనా
>
> ౫౪౧. నటీ విదూషకో నాపి పారిపార్శ్వక ఏవ వా
> సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
>
> ౫౪౨. చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థై ర్వీథ్యంగై రన్యథాపి వా
> ఆముఖం తత్తు విజ్ఞేయం బుధైః ప్రస్తావనాపి వా

ఈ నాల్గింటిలో వీథీప్రహసనముల స్వరూప మిచట చెప్పనక్కరలేదు. ప్రరోచన యాముఖ మిచట లక్షిత మగును. పూర్వరంగాంగముగా నిదివరలో నిరూపిత మయిన ప్రరోచన ప్రకృతభారత్యంగముగనె సంభావనీయము. ప్రరోచన జయ మిచ్చునది. మంగలసంపాదకము. విజయావహము. సర్వపాపముల బోగొట్టును. కావ్యోపక్షేపము

సూచించునదై హేతుయుక్తుల నాశ్రయించి సిద్ధప్రాయముగ విష
యము సూచించునది ప్రరోచన.

నటిగాని విదూషకుడుగాని పారిపార్శ్వకుడుగాని సూత్రధారు
నితో గూడి సంలాప మొనరింతురు. అప్పుడు వారు ప్రయోగించు
చిత్రవాక్యములచే స్వకార్యము సూచిత మగును. స్పష్టము లగు
నుక్తిప్రత్యుక్తులచే నయిన సూచిత మగును. ఇట్టి దిది యాముఖము.
దీనినే ప్రస్తావన యందురు. ఆముఖమును ప్రవర్తింప జేయుటలో
నటీ విదూషక పారిపార్శ్వక సూత్రధారుల సంఘాత ముండును.
కార్యావసరమును బట్టి నలుగురు ముగ్గు రిద్ద రుందురు. కాని యన్నిట
సూత్రధారుని యావశ్యకత యున్నది. సూత్రధారాదుల స్వకార్య
మిట నటవ్యాపారము. నటవ్యాపార నిరూపకము లయినను వారి
చిత్రవాక్యములు శ్లిష్టములై వక్రోక్తిసహితములై ప్రత్యుక్తిప్రాయ
ములుగా నుండును. భావిరూపక కార్యానుకూలముగా విషయము
ననుసరించునవి యగును. ఇట్టి యీ వృత్త్యంశమున కిచట నాముఖ
మని పేరు. ముఖసంధి ప్రారంభమునకు పూర్వమె యిది యుండునని
భావము. ఇందు ప్రారంభ మీషన్ముఖముగా నుండును గావున
నాముఖ మనియు భావింప దగును. దీనినే ప్రస్తావన యందురు. దీనిచే
కథాంశము ప్రస్తావిత మగును గావున నట్లు ననవచ్చును. ఒకప్పుడు
పూర్వరంగవిధి కార్యాభిముఖముగా సమానీత మగును. కార్యా
రంభమేని పూర్వరంగాభిముఖముగా నున్నీత మగును. పూర్వరంగ
మున స్థాపకుడును సూత్రధారతుల్య గుణాకారుడై ప్రయోగించునపు
డిది కవికృతాముఖ మగును.

పూర్వరంగప్రసంగములో నొక ప్రస్తావన యున్నది. అదియు
భారతీభేదమె. ఈ ద్వైవిధ్యాభిధాన ప్రయాస మేల? అని కొంద
రాశంకింతురు. వేణీప్రస్తావనలో సూత్రధారుడు "క్రుద్ధభీము డిటు
వచ్చుచున్నాడు. ఈతని యెదుట యుండుట యుక్తము కాదు"
అనుట యాతని సత్త్వావేశమువలననె సంగతము. ఆసత్త్వావేశము ప్రకా
శింపజేయుటకై సామాజికులకు సాక్షాత్కారకల్ప మయిన యధ్యవ
సాయసంపత్తి నిచ్చుటకై సమర్థ మగునని భావింప వలెను. ఒకడో

కడు శిశుసంత్రాస మునకై యొకానొక యాకృతి ననుసరించి భయ పడని వాడయినను త్రాస సంరంభ గర్భముగా "వీడుగో! రాక్షసుడు వచ్చె" నను సత్వశుద్ధితో నన్నిటి నాచరించుట భావనిర్ణయములో నిరూపితములు.

ఆముఖమున కయిదంగము లున్నవి. ఇవి భేదములు

౧ ఉద్ఘాత్యకము, ౨ కథోద్ఘాతము
౩ ప్రయోగాతిశయము ౪ ప్రవృత్తకము
౫ అవలగితము.

ఉద్ఘాత్యకావలగితముల స్వరూపమిదివరలో నిరూపితము. మిగులువాని స్వరూపము వ్యాఖ్యానింప వలెను.

౫౬౩. సూత్రధారస్య వాక్యం వా యత్ర వాక్యార్థమేవ వా
గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతః స కీర్తితః
౫౬౪. ప్రయోగే తు ప్రయోగం తు సూత్రధారః ప్రయోజయేత్
తతశ్చ ప్రవిశేత్పాత్రం ప్రయోగాతిశయో హి సః.

ప్రస్తావనాంగము లయిదు. వీని నొకేసారి ప్రయోగింప ప్రస్తావన ప్రయుక్త మగునని తలచరాదు. ఇది ముని యభిమతము కాదు. వీనిలో నొకదాని సుశ్లిష్టముగా యోజనము చేసి యర్థయుక్తులతో పాత్రగ్రంథములతో నసంబంధముగా నాముఖమును నిర్వహించుటయె భరతసమ్మతము. పూర్వము నిరూపించిన ప్రస్తావనములో నెన్నియో వీథ్యంగము లున్నవి. ఆముఖ సామాన్య లక్షణములో గూడ వీథ్యంగముల ప్రసక్తి యున్నది. ఉద్ఘాత్యకావలగితములకు పూర్వమె లక్షణము నిర్ణీత మయినది. రాదగు కావ్యార్థప్రస్తావనములో వీనికి కొంత ప్రవేశముఖ్యత యున్నట్లు భావింప వచ్చును.

సూత్రధారుని వాక్యమును గాని వాక్యార్థమును గాని స్వీకరించి పాత్రము ప్రవేశించునేని కథోద్ఘాత మందురు. రత్నావలిలో సూత్రధారుడు పలికిన "ద్వీపా దన్యస్మాత్" అను వాక్యమును గ్రహించి యౌగంధరాయణుడు ప్రవేశించుట కథోద్ఘాత మయినది. వాక్యార్థమును స్వీకరించి ప్రవేశించుటను పరిశీలించు కొనునది. "కథా కావ్యార్థరూపా, ఉద్ఘ్యమేవ హన్యతే గమ్యతే తత్రేతి కథోద్ఘాతః"

కావ్యార్థరూప మయిన కథ మొదటనే గమనమున గోచరించుటచే నిది కథోద్ఘాతము.

ప్రస్తావనాత్మక ప్రయోగమందు నాట్యాత్మక మయిన భావిత ప్రయోగమును సూత్రధారుడు ప్రయోగింపగా పాత్రప్రవేశ మున్నచో ప్రయోగాతిశయ మగును.. సూత్రధారుడే ప్రయోగమున ప్రయోగ మును కూర్చుట, ఒకే పెట్టెకు సంబంధించిన రెండు మూతల నొక పర్యాయమె తెఱచుటగా భావింప వచ్చును. ఇట్లు ప్రయోగద్వయ శ్లేషణ మున్నందున ప్రయోగాతిశయ మగును. విక్రమోర్వశీయ ములో, "ఆకసమున కురరీశబ్దము వలె నున్నదే!" తెలిసినదిలే! కైలాసమునుండి వచ్చు నూర్వశి నర్ధమార్గమున దానవులు బందీక రింప అప్సరఃకన్యలు కరుణాక్రందనము చేయుచున్నారు" అనుటలో ప్రయోగాతిశయము సంగతము.

౫౭౫. కాలప్రవృత్తి మాశ్రిత్య వర్ణనా యా ప్రయుజ్యతే
తదాశ్రయాచ్చ పాత్రస్య ప్రవేశ స్తత్ప్రవృత్తకం

ఒకానొక కాలప్రవృత్తి ననుసరించి సూత్రధారు డేదేని వస్తువు వర్ణించి నప్పుడు తదాశ్రయమున పాత్రప్రవేశ ముండునేని యది ప్రవృత్తక మగును. కాలప్రవృత్తిననుసరించిన స్వార్థ మం దుండుటచే నది ప్రవృత్తకము. వేణిలో సూత్రధారుడు శరద్వర్ణన ప్రస్తావమున ధార్తరాష్ట్ర హంస వర్ణన మొనరింప నదే వస్తువు ననుసరించి యంకపాత్ర ప్రవేశించుట ప్రవృత్తక మయినది.

౫౭౬. ఏషామన్యతమం శ్లిష్టం యోజయిత్వార్థయుక్తిభిః
పాత్రగ్రంథై రసంబంధం ప్రకుర్యాదాముఖం తతః

ఈ పంచాంగములలో వస్తుభావానుకూలముగా సుశ్లిష్టముగా నుండు దానిని అర్థయోగ మనుసరించి యోజనము చేయవలెను. ఇం దంగద్వయము సంభవించినను కూర్పవచ్చును. అందు నిషేధము లేదు. ఈ యాముఖము పాత్రగ్రంథములచే నసంబంధముగ నుండ వలెను. బహుపాత్ర లుండనక్కఱ లేదు. ఆముఖ మల్పపాత్రముగా నున్నను గ్రంథబహులముగా నుండుట తథారూపముగా నుండును.

ఈ యాముఖ మిట్లు వివిధాశ్రయము. ఇక లక్షణయుక్త మయిన సాత్వతీవిధానము నిరూపించెదము.

## సాత్వతీ వృత్తి

౩౭౭. యా సాత్వతేనేహ గుణేన యుక్తా
న్యాయేన వృత్తేన సమన్వితా చ
హర్షోత్కటా సంహృత శోకభావా
సా సాత్వతీ నామ భవేత్తు వృత్తిః

౩౭౮. వాగంగాభినయవతీ సత్త్వోత్థాన వచన ప్రకరణేషు
సత్త్వాధికారయుక్తా విజ్ఞేయా సాత్వతీ వృత్తిః
వీరాద్భుత రౌద్రరసా నిరస్త శృంగార కరుణ నిర్వేదా
ఉద్ధత పురుషప్రాయా పరస్పరాధర్షణ కృతా చ

సాత్వతీ వృత్తిలో సాత్వత గుణ మున్నది. సాత్వతగుణము మానసవ్యాపారము. సత్సత్వము ప్రకాశస్వభావము. అదియున్న మనస్సు సతత్వము. దాన గలుగునది సాత్వతము. ఇందు న్యాయ వృత్తము కూడి యున్నది. ఇదిహర్షోత్కటము. శోకభావము దీనిలో సంహృత మగును. సాత్వతిలో వాగంగాభినయము లున్నవి. సత్వా ధార మయిన వచనము కల కావ్యఖండములందు వాగంగాభినయము లుండు ననుట సత్వాధికారమె సూచితము. సాత్వికాభినయ మధిక మని భావము. సత్వాధిక్యక్రియతో సాత్వతీవృత్తి యుండునని భావము. సాత్వతిలో వీరాద్భుత రౌద్ర రసములె ముఖ్యములు. ఇందు శృంగార కరుణ నిర్వేదములు నిరస్తములు. సాత్వతి యుద్ధత పురుష బహుళమై పరస్పర మాధర్షణముతో గూడి యుండును.

శృంగారమునందు మనస్సు విషయనిమగ్న మగును. కరుణము నందు కాందిశీక మగును. నిర్వేదమున మూఢ మగును. కొంతగా మానసవ్యాపారము శృంగారాదులలో నున్నను క్రోధవిస్మయోత్సా హము లందు వలె సాతిశయముగా పరిస్ఫురింపదు. ఉద్ధతపురుషుల యాధర్షణ మనునది మాటలచే తిరస్కరించుట. నాట్యతత్వజ్ఞు లీ సాత్వతీ వృత్తిలో నాలుగు భేదములు పరిగణించిరి.

౧ ఉత్థాపకము ౨. పరివర్తకము
౩. సంలాపకము ౪. సంఘాత్యము

ఇక వీని స్వరూపలక్షణములు నిరూపితము లగును.

౫౭౯. అహముత్థాస్యామి తం తావద్దర్శయాత్మనః శక్తిం
ఇతి సంఘర్షసముత్థః తద్జ్ఞైరుత్థాపకో జ్ఞేయః

౫౮౦. ఉత్థానసమారబ్ధా నర్థా నుత్సృజ్య యోఽర్థయోగ వశాత్
అన్యానర్థాన్ భజతే న చాపి పరివర్తకో జ్ఞేయః

౫౮౧. సాధర్షజో నిరాధర్షజోఽపి వా రాగవచన సంయుక్తః
సాధిక్షేపాలాపో జ్ఞేయః సంలాపకః సోఽపి

౫౮౨. మంత్రార్థ వాక్య శక్త్యా దైవవశా దాత్మదోషయోగాద్వా
సంఘాత భేదజనన స్తద్జ్ఞైః సంఘాత్యకో జ్ఞేయః

౧. ఉత్థాపకము. ఒకానొక మానస పరిస్పంద ముత్థాపింప జేయును. కాననది యుత్థాపకము. తత్సూచక మయిన వ్యాపారక్రమము కూడ నుపచారమున నుత్థాపకమె యగును. "ఇదిగో! నే నుద్యమింతును. నీ శక్తి యేమో చూపుము" అను నట్లు సంఘర్ష జన్యమగు విధాన ముత్థాపక మని తద్విదు లనిరి. వేణిలో భీముడు "హా హా! హా! మీరందరు వినుడు! ఒక పశువు పాంచాల రాజపుత్రీ కేశముల పట్టినాడు. కురురాజుల యెదుట నామె పరిధానము కూడ నపహరించినాడు. వాని రొమ్ము రక్తము త్రావెద నంటిని. వా డీనాడు నా పాలిట పడినాడు. కౌరవులారా! మీ రెవ రేని సామర్థ్య మున్న రక్షింపుడు" పలుకుటలో ఉత్థాపక మున్నది. న్యాయ మున్నది. ఇది సాత్వతి యంగము.

౨. పరివర్తకము. శత్రూత్థానములో సమారంభము పొందిన కార్యవిశేషములను విడనాడి ప్రయోజన వశమున నితరార్థములను సేవించుట పరివర్తక మగును. వేణిలో భీముడు "సహదేవా! పొమ్ము! అన్నగారి ననుసరింపుము. నే నస్త్రాగారము ప్రవేశించి యాయుధసహాయుడ నయ్యెదను." "ఇది యాయుధాగారము కాదు. ఆర్యా! ఇది పాంచాలీచతుశ్శాలము" "ఏమీ! ఆయుధాగారము

కాదా? ద్రౌపదీ చతుశ్శాలమా? కానిమ్ము! నే నామెతో నాలో చింప వలెను." అనుటలో నస్త్రాగార ప్రవేశము పరిత్యజించిన భీముని పాంచాలీదర్శనాత్మక మయిన కార్యాంతర సంపాదక మగు మానస వ్యాపారము కార్యము మార్చినది. పరివర్తక మను పద ముపచారారూఢము. ఈ పరివర్తకము నిర్దిష్టవస్తువిషయముగా, స్పష్టనిరూపణము కల త్రిహాస్యసంయుతముగా, సంఘర్షవిశేషకృతముగా మూడు విధముల నుండుటను కొందర రభిమానింతురు.

3. సం లా ప క ము. ఆధర్షజన్య మయినను కాకున్నను రాగవచన సంయుక్త మగు సాధిక్షేపాలాపము సంలాపక మగునని యనిరి. ఆధర్షణసహితవాక్యము సాధర్షము. తద్విరహితము నిరాధర్షము. ఖలీకారకవచనమున గాని యితరమున గాని యున్న వచము అధిక్షేపముగా నభిభావకముగా మానసకర్మను సంబంధించి యున్నచో సంలాపక శబ్దవాచ్య మగును. "వేణిలో; —పృథాసూను డశ్వత్థామను చంపెనని స్పష్టముగా పలికి తుదకు "గజమును" అని సత్యవచనుడు (ధర్మరాజు) పలికెను" —అను స్థలమునందు "సత్య వచను" డనుట యీ సంలాపకస్వరూపమును నిరూపించును. ధర్మాధర్మసముత్థము రాగదోషసంయుక్త మయిన సాధిక్షేపవచనము సంలాపక మను వారి భావమున నిది సంగత మగును.

౪. సం ఘా త్య క ము. కార్యపర్యాలోచనరూప మయిన మంత్రణమునకు సముచిత మయిన వాక్యశక్తిచే దైవవశమున గాని యాత్మదోషమున గాని సంఘాతభేద మాపాదించుట యున్నచో సంఘాత్యక మగు నని పెద్ద లనిరి. యుద్ధమునందు సంఘాతమునకు భేదమును గలుగ జేయునది సంఘాత్యక మగును. "సమ్యక్ ఘాత్యః శత్రువర్గః" శత్రువర్గము సమ్యక్ హత మగుటను బట్టి సంఘాత్యక మనవచ్చును. సామాన్యుపాయబలము ననుసరించి యితరుడు సంఘాతభేద మొనరించినను సంఘాత్యక మగును. వేణిలో ధర్మరాజు భీముని సామముచే భేదించినాడు. శిఖండిని పురస్కరించుకొని యుద్ధ మొనరింప వలసి వచ్చినది. సుతుడు హతు డయిన శస్త్రము త్యజించెద నని ద్రోణు డనుట దైవవశమున సంపన్నము. కర్ణునితో కలహించి

యశ్వత్థామ శస్త్రత్యాగ మొనరించుట స్వకటకములో గలిగిన యాత్మదోషము. ఆత్మదోష మున్న స్థలములందు సత్వాధిక్య మప రాధి. పరుల దెబ్బ వేయవలయు ననెడి యాశయమున నితరులు ప్రయోగించిన నానాకపటసంశ్రయము లగు కూటములు కూడి యుండుట కూటసంఘాత మగును. ఇట్లు చతుర్విధ మయిన యిది సాత్వతీవృత్తి. ఇక వీనికన్న విలక్షణస్వభావక మయిన కైశికి నిరూ పింప వలెను.

## కైశికీవృత్తి

౫౮౩. యా శ్లక్ష్ణనైపథ్య విశేష చిత్రా స్త్రీసంయుతా యా బహునృత్తగీతా
కామోపభోగప్రభవోపచారా తాం కైశికీం వృత్తి ముదాహరంతి

శ్లక్ష్ణము సుకుమారము, నైపథ్యవిశేషము వస్త్రమాల్యాది కము. కైశికివృత్తి యందు సుకుమారము లయిన వస్త్రమాల్యాది నైపథ్యము లుండవలయును. సుకుమారము లగు నట్టివె హృదయ సంక్రాంతము లగును. అట్టి వస్త్రాదులచే చిత్రముగా నుండును. బహువిపుల మయిన గీతము నృత్త ముండుట దీని ధర్మము. కైశికి స్త్రీసంయుతము కావున లలితనృత్తగీతము లావశ్యకములు. కైశికి కామోపభోగ ప్రభవోపచారము. కామోపభోగము రతి. తత్ప్రభ వము శృంగారము. శృంగారబహులము లయిన వ్యవహారములు కైశి కిలో నధికముగా నుండును. ఈ యర్థమునె కొందరిట్లును భావించిరి. బహు వాద్య నృత్త గీతము శృంగారాభినయ చిత్రనైపథ్యము మాల్యాలంకారసంయుతము ప్రశస్తవేషము కాంతము చిత్రము లగు పదవాక్యబంధములచే, హసిత రుదిత రోషాదులచే నలంకృతము స్త్రీపురుష కామయుక్తము కైశికీవృత్తి యని గుర్తింప వలెను. ఈ కైశికి లోనాలు గంగములు గలవు.

| | |
|---|---|
| ౧ నర్మ | ౨ నర్మస్ఫుంజము |
| 3 నర్మస్ఫోటము | ౪ నర్మగర్భము |

ఈ నాలుగు నర్మోపపదముల తోడనె యుండును. వీని యందన్నిట నర్మయె శృంగారస్థాపకము. వీని స్వరూపము లిట్లున్నవి.

౫౮౪. ఆస్థాపిత శృంగారం విశుద్ధకరణం నివృత్తవీరరసం
హాస్యప్రవచనబహులం నర్మ త్రివిధం విజానీయాత్

౫౮౫. ఈర్ష్యాక్రోధప్రాయం సోపాలంభకరణానువిద్ధం చ
ఆత్మోపక్షేపకృతం సవిప్రలంభం స్మృతం నర్మ

౫౮౬. నవసంగమ సంభోగే రతిసముదయ వేషవాక్య సంయుక్తః
జ్ఞేయో నర్మస్ఫుంజో హ్యవసానభయాత్మకశ్చైవ

౫౮౭. వివిధానాం భావానాం లవైర్లవై ర్భూషితో బహువిశేషైః
అసమగ్రాక్షిప్తరసో నర్మస్ఫోటస్తు విజ్ఞేయః

౫౮౮. విజ్ఞాన రూపశోభా ధనాదిభిర్నాయకో గుణైర్యత్ర
ప్రచ్ఛన్నం వ్యవహరతే కార్యవశాన్నర్మగర్భోఽసౌ

౧. న ర్మ. నర్మ మూడు విధములు. హాస్యప్రవచన బహుల మని యనుటచే హాసప్రధానత యుండునని యది సామాన్యలక్షణ మని స్పష్టము. ఆస్థాపితశృంగార మనునది యిందలి నొకటి విధము. శృంగారవిధానము దీనిలో కూడి యుండును. కేవలము విశుద్ధకరణ ముగా నుండుట రెండవది. హాస్యశృంగారానుబంధి కరణము లిందు సంగతము లగును. వీరరసము లే కుండుట మూడవది. ఈ త్రివిధము కూడ హాస్యప్రవచన బహులముగనె యుండును. ఇందలి హాస మీర్ష్యను సూచించుట కుపాత్త మగును. ఇతరవ్యక్తి నుపాలంభించుట కుపాదీయమాన మగును. పరహృదయ మాక్షేపించుట కేని సముపాత్త మగును. ఇట్టిది త్రివిధముగా నుండును. ఆత్మోపక్షేపకృతం= తన చిత్తమునకు గాని పరకీయ చిత్తమునకు గాని యుపక్షేపము. ఇది యాత్మసమీపకరణము. కాగా దీని నిట్లు సంభావింప వలెను. ఈర్ష్యాక్రోధప్రాయము, ఉపాలంభములతో గూడిన కరణముల కల యిక కలది, విప్రలంభసహితముగ నుండునది నర్మ యగునని. రత్నా వళిలో వాసవదత్త చిత్రఫలకము నుద్దేశించి పరిహాసముగా "రాజ సమీపమున వేరొక భార్యను చిత్రించిరి. ఇది కూడ వసంతకుని తెలివి తేట యేనా" అనుటలో నామె యీర్ష్యాదులు వ్యక్తము లగును. వేరొక స్థలమున రత్నావలిలో "శీతాంశురుర్ముఖ" మాదిగా నాయికా వర్ణనము వినిన వాసవదత్త యటురాగా వెంటనే రాజు "ప్రియా! వాసవదత్తా!" యనినాడు. "ఆర్యపుత్ర! అట్లందు రేమి" యని వాసవ

దత్త సోపాలంభముగ సహాసముగ ననును. ఇందుపాలంభ మున్నది. మూడవదియు రత్నావలిలో సుసంగత "నీవెట్టి కామదేవుని చిత్రించితివో నేనట్టి రతినె చిత్రించితిని. ఓ యమ్మ! అసలు బయటపెట్టవమ్మా!" ఇందు సాగరికాహృదయభావమును బహిరంగపరచుటకు సుసంగత నర్మ ప్రయోగించినది.

౨. నర్మస్ఫంజము. నర్మస్ఫింజ మనియు దీని వ్యవహారము. దీనిలో సంభోగము వర్ణిత మగును కాని యది నవసంగమ మాత్రముగనె యుండును. సంగమ ముత్తకలయిక. సంగమమాత్ర మెట్లు సంభోగ మగునని యనుకొందు రేమో! యది రతిసముదయ వేషవాక్య సంయుక్తముగా నుండును. రతిసముదయము అన్యోన్యాస్థా బంధరూప మయిన యనురాగము. దాని స్ఫుటత్వము సముదయము. తదనుకూల మయిన వేషమున వాక్యమున నిది సంబద్ధమై యుండును. ఇట్టిదిది యవసాన భయాత్మకము. అవసానము నందతిభయము పూర్వనాయికా కృతముగా సంప్రాప్త మగును. రత్నావలిలో నుదయనుడు సాగరికల వ్యవహారము దీని కనుకూలముగ నున్నది. "నర్మణః స్ఫంజో విఘ్నః" నర్మకు విఘ్న ముదయించుట.

౩. నర్మస్ఫోటము. భయ హాస హర్ష త్రాస రోషాది వివిధ భావములకు సంబంధించిన లవాంశ రూపములుగా నున్న బహు విశేషములతో కూడియుండుట, అసమగ్రాక్షిప్తరసముగా నుండుట నర్మస్ఫోట మగును. భయాదులు లవలవముగనె యుండును గావున వానికి స్థాయిత్వము రాదు. అందుచే భయానక హాస్య రౌద్రాది రసతాపత్తి సంభవింపదు. శృంగార ముపక్రాంతముగ రూఢమై యుండును. రత్నావలిలో సుసంగత— "ఎవరికొఱకై నీ విక్కడకు వచ్చినావో యాత డిచ్చటనే యున్నా" డని యనుటలో హాసలవ మున్నది కాని హాస్యరసము లేదు. "సఖి! నేనెవరికొఱ కిచటికి వచ్చినానె?" యని యప్పుడు సాగరిక యనుటలో రౌద్రలవ మున్నది. అదియు రౌద్రరసము కాదు. ఇట్లే యంతట భావనీయము. నర్మపదమున శృంగార ముపలక్షిత మగును. అట్టి శృంగారమునకు

స్ఫోట=వైచిత్ర్యము చమత్కారోల్లాససకృత మయిన స్ఫుటత్వ ముండుట నర్మస్ఫోట యయినది.

౪. న ర్మ గ ర్భ ము. విజ్ఞానము రూపము శోభ ధనము మొదలగు గుణములతో గూడిన నాయకుడు కార్యవశమున ప్రచ్ఛన్న ముగా వ్యవహరించునేని యది నర్మగర్భ మగును. ఈ విజ్ఞానాదు లన్నియు శృంగారోపయోగులుగా నుండుననియె యిచట పరిగ్రాహ్య ములు. నవకన్యానవసమాగమ సిద్ధికై నాయకుడు ప్రచ్ఛన్నముగా నుండుట వలన నిది నర్మగర్భము. విజ్ఞానాదులు నర్మమున కుపయో గించునవియై గర్భీకృతము లయినట్లు ప్రచ్ఛన్నముగా నిందుండును. నాయకుడు ప్రచ్ఛన్నరూపుడై సంకేతస్థానము గురించి వెళ్లుట నుదా హరణముగా గుర్తింప వచ్చును. నాట్యప్రయోగములం దీ నర్మగర్భ మును మరొకవిధముగా గూడ నిర్వచించుదురు. పూర్వ మున్న నాయకు డభిభూతుడై విషణ్ణు డగునేని, అధవా; విపన్ను డగునేని యా స్థానమున నన్యనాయకు డవతరించినచో నదియు నర్మగర్భ మగును. విపన్న విషణ్ణనాయకుల స్థానమున నన్యప్రవేశము నర్మగర్భ ముగా పరిగణించుటలో నంతగా నౌచిత్య మవభాసింపదు. ఇట్టి దీ కైశికి చతుర్విధ.

## ఆ ర భ టీ వృ త్తి

ఆరభటి యుద్ధతరసముతో నుండును. దీ_ప్తరసము లయిన రౌద్రాదు లుద్ధత రసములు.

> ౫౮౯. ఆరభటప్రాయగుణా తథైవ బహుకపటవంచనోపేతా
> దంభానృతవచనవతీ త్వారభటీ నామ విజ్ఞేయా

క్రోధావేగాదు లారభటుల గుణములు తద్బాహుల్యముతో నారభటి యుండును. బహువిధములగు కపటములతో గూడిన వంచన మిందు ముఖ్యము. సమవకారరూపలక్షణములో కపటత్రయ మున్నది. దంభవచనము లనృతవచనము లిందుండును. కపటయోగ మున్నందు ననె దంభప్రాధాన్య మసత్యవచనసంభవము సంగత మగును. "అవ పాతములు ప్లుతములు లంఘితములు ఛేద్యము లుండును. మాయా కృత మయిన యింద్రజాల ముండును. నిత్యము చిత్రయుద్ధము

లిందుండును. ఇట్టి దిది యారభటి'' యనియు కొందరి భావము. "పాడ్గుణ్యసమారంభము కల్గినదై హతాతిసంధానములు విద్రవములు కూడినదై లాభాలాభార్థములతో నుండునది యారభటి యనియు నన్యు లనిరి. భావములందు భేదమంతగా లేదు. ఈ యారభటి యందును నాలుగంగములు కలవు.

౧ సంక్షిప్తము ౨ అవపాతము
3 వస్తూత్థాపనము ౪ సంఫేటము

యథాక్రమము వీని లక్షణవచనము లిట్లున్నవి.

౫౯౦. అన్వర్థశిల్పయుక్తో బహుపుస్తోత్థాన చిత్ర నేపథ్యః
సంక్షిప్తవస్తువిషయో జ్ఞేయః సంక్షిప్తకో నామ
౫౯౧. భయహర్షసముత్థానం విద్రవ వినిపాత సంభ్రమాచరణం
క్షిప్రప్రవేశనిర్గమ మవపాత మిమం విజానీయాత్
౫౯౨. సర్వరస సమాస కృతం సవిద్రవాశ్రయం వాపి
నాట్యం విభావ్యతే యత్తత్ వస్తూత్థాపనం జ్ఞేయం
౫౯3. సంరంభ సంప్రయుక్తో బహుయుద్ధ నియుద్ధ కపటనిర్భేదః
శస్త్రప్రహారబహులః సంఫేటో నామ విజ్ఞేయః

౧. సంక్షిప్తకము. సంజ్ఞచే సముపక్షిప్తము లయిన వస్తువులను విషయముగా జేసికొన్నచో సంక్షిప్తక మగును. ఆ వస్తువు లేవి? అవి యివి. సంక్షిప్తక మన్వర్థ శిల్ప యుక్తము. అను+అర్థ=అన్వర్థప్రయోజనానుగతము లయిన కుశలశిల్ప విరచితము లగు నర్థములు కలిగి యుండునది. నానావిధములగు పుస్తోత్థానములు చిత్రనేపథ్యములు కలది. పుస్తోత్థాన మనుట పుస్తముల ప్రకటత్వము. నాట్యమున నిర్మించు శైలయానవిమానములు చర్మవర్మధ్వజములు మొదలగునవి పుస్తశబ్దవాచ్యములు. వీని విశేషములు మున్ముందు ప్రస్తుతము లగును. పైవిధమున సంక్షిప్తము లయిన విషయములు కలది సంక్షిప్తక మగును. రామాభ్యుదయ నాటకములో మాయా శిరో నిక్షేపము చిత్రనేపథ్యము.

౨. అవపాతము. భయహర్ష సముత్థానము కలది. రంగ పాత్రల ప్రవేశనిర్గమములు భయాతిశయమున హర్షాతిశయముననను

వేగముగ జరుగును. నాక్యాదికృత మయిన విద్రవము వలన విని పాతము వలనను సంభ్రమాచరణ ముండును. ఆవేగప్రధానము లయిన చేష్ట లుండును. ఇట్టి దిది యవపాతము. "అవపంతి అస్మిన్ పాత్రాణి" పాత్ర లిందు సంభ్రమము పడుదురు. కృత్యారావణము షష్ఠాంకములో ఖడ్గహస్తుడై గాయపడిన పురుషుడు ప్రవేశించినప్పట నుండి నిష్క్రమించువఱకు యవపాత మున్నది. ఒకచో భయమున ప్రవేశనిర్గమములు శీఘ్రముగ నుండును. వేరొకచో హర్షముననుండును.

3. వ స్తూ త్థా ప న ము. బహువస్తువులు నానాప్రయోజనములు. ఆ నానాప్రయోజనముల యుత్థాపనము ప్రసంగాగత మయిన నిబంధనము. ఇట్టి విశేష మున్న కార్యమును వస్తూత్థాపన మందురు. సర్వరస సంక్షేపము కల విద్రవావిద్రవముల కాశ్రయ మయిన నాట్యము విభావిత మగునేని వస్తూత్థాపన మందురు. సర్వరసపదముచే స్థాయిభావములను వ్యభిచారిభావముల నుపలక్షింప వలెను. ఒకచో నగ్న్యాద్యుపద్రవములతో కూడియుండును. ఒకచో నట్లుండదు. కృత్యారావణములో, అంగదుడు తరుముకొని రాగా మందోదరికి భయము, అంగదున కుత్సాహము వర్ణిత మయినది. రావణుని జూచి యంగదుడు "పీడె సురుల జయించెనట" యనుటలో పరిహాస మున్నది. రావణున కప్పు డతిక్రోధము వర్ణిత మయినది. "మా తండ్రి వాలి వీని పిల్లని పట్టినట్లు చంకలో పట్టి బిగబట్టి" యని యంగదు డనుటలో జుగుప్సా హాస విస్మయము లున్నవి. రావణుడు విధ్వంసన మాచరించుటలో శోక మున్నది. ఇది యంతయు విద్రవాశ్రయ మయిన వస్తూత్థాపనము. తద్విపరీతము కూడ కృత్యారావణ ద్వితీయాంకముననె కలదు. నేపథ్యమున కలకలము గలుగగా రావణుడు సీతతో "ఏమి? లోకపాలుర నాక్రందింతువా!" యనుటలో భావివస్తు సముత్థాపన మున్నది. కృత్యారావణమునందే ఋషు లిట్లందురు. "దురాత్ముడా! నీవు తీసికొనిపోవునది సీతనుగాదు. నీ వినాశమునకై కృత్యను నీతో తీసికొనిపోవుచున్నావు" ఇట్టి వాని లో విద్రవాశ్రయము కాని నాట్యవిభావన మున్నది. ఇచట నిట్టి వస్తూత్థాపనమునె యూహించునది.

౪. సంఫేటము. సంరంభవచనములతో గూడి యుండునది. నానావిధ యుద్ధ నియుద్ధములు కపటములు వీని నిర్భేదముతో నుండునది. శస్త్రప్రహారబహుళ మగునది సంఫేట మగును. కృత్యారావణములో జటాయు యుద్ధాదికము సర్వము సంఫేటమున కుదాహరణ మగును. ఈ నాలుగు వృత్తు లీ విధముగా నాట్యసంశ్రయములై యున్నవి. వీనికి సముచితమయిన రసప్రయోగ మున్నది.

౫౯౪. హాస్యశృంగారబహులా కైశికీ పరిచక్షితా
సాత్వతీ చాపి విజ్ఞేయా వీరాద్భుతశమాశ్రయా
౫౯౫. రౌద్రే భయానకే చైవ విజ్ఞేయారభటీ బుధైః
బీభత్సే కరుణే చైవ భారతీ సంప్రకీర్తితా.

కైశికీవృత్తిలో హాస్యము శృంగారము బహులముగా నుండును. సాత్వతి వీరాద్భుత శమాశ్రయము. శమాశ్రయ మనుట శాంతరసమును పరిగ్రహింప వలెనని శాంతవాదు లందురు. రౌద్రమునందు భయానకము నందును ఆరభటీవృత్తి సముచితము. బీభత్సమునందును కరుణమునందును భారతీవృత్తి యుక్తము.

ఇంతవర కిది వృత్తుల కథ. కథాకథనరూపముగా వృత్తిచరిత నిరూపణావిర్భావములో నుదాత్తత సంక్లిష్ట మయినది. ఆవేశమయ మయిన చిత్తవృత్తిలో వృత్తు లుదయింపవు. ఆవేశమయముగా నున్నను అనావేశమయముగా నుండుటయె సముచిత మయిన నాట్య వృత్తి విన్యాసము. వృత్త్యంత మయిన యీ వాగంగసత్వప్రభవాభినయము యథాగతముగ నిరూపిత మయినది.

## ఆహార్యము

ఆహార్య మిప్పుడు ప్రసంగప్రాప్తము. "అన్నిటి యనంతరమె దీని నిరూపించుట సముచిత మయినది. వాగాద్యభినయముల కన్న నిది బహిరంగము." అని కొంద రందురు కాని యది మనోహరి కాదు. ఆహార్యమునకు ప్రాధాన్య మున్నది. ఇది సర్వాభినయముల కనుగ్రాహకము. ఇది సర్వోపజీవ్యము. ఈ యంశమును విశదము చేయుటకె ప్రఖ్యాపన మొనర్చుటకె సర్వానంతర కథనమని గుర్తింప

వలెను. "ప్రయోగః సర్వోయ మాహార్యాభినయే స్థితః" నాట్య ప్రయోగ మంతయు నాహార్యనిష్ఠమై యున్నదని భరతభావము. వాగంగసత్వాత్మక మయిన ప్రయోగ మంతయు నాహార్యాభినయాధీనము.

౫౮౬. నానావస్థాః ప్రకృతయః పూర్వం నైపథ్యసాధితాః
అంగాదిభి రభివ్యక్తి ముపగచ్ఛంత్యయత్నతః

పై నిరూపితాంశమున నిదిగో యుపపత్తి. నానావిధము లయిన రతిశోకాద్యవస్థ లన్నియు, నానాశ్రయభూతము లయిన ధీరోదాత్తాదు లుత్తమాధమప్రముఖము లయిన ప్రకృతు లన్నియు మొదట యత్నమున నైపథ్యముచే ప్రకాశితము లయినప్పుడె యనంతరము లుపపన్నము లగును. నైపథ్యసాధనానంతర మయత్నముగా నంగాద్యభినయములచే నవి యభివ్యక్తి పొందగలవు. అవస్థాప్రకృతు లన్నియు విభక్తములై భాసించును. అనుభావవిషయముగా విభాగము పొందును. నామోపపత్తిని పొందును. దేశకాలాదివిభాగమును గూడ సమర్పించునవి యగును. చక్కగా నవి పరిస్ఫుటత్వము పొందగలవు. ఆహార్య మనునది సమస్తాభినయ ప్రయోగ చిత్రమునకు భిత్తి వంటిది. సమస్తాభినయము లుపశాంతము లయినను నైపథ్య విశేషదర్శనమున విశేష మూగుడుట నిశ్చితము కాగలదు. రంగాభినయ మొనరించు పాత్రకు పూర్వావస్థకన్న నవస్థాంతరము కలిగినప్పు డాహార్యేతరాభినయము లందు పరివర్తన మున్నది. ఆహార్యమునం దట్లు పరివర్తనము లేదు. కాన "అట్టి వాని కిట్టి యవస్థ కలిగిన" దని స్థాయిసూత్రానుస్మృతి ప్రవణత్వమున నాహార్యము రసవిషయమున నంతరంగ మసియె స్పష్టగోచర మగును. వేణిలో నశ్వత్థామ యుద్ధవీరరస సంపన్నుపేతుడు. అట్టి వానికిని ద్రోణ మరణమున నిట్టిశోకము కలిగినదని గుర్తింతుము. వీరోచితవేషము శోకోచిత వేషమని యాహార్యమున పరివర్తన మభీష్ట మయినచో నశ్వత్థామ యుద్ధసముచిత సముజ్జ్వల ధర్మపరిగ్రహాముతో నున్నవాడు శోకసమయము రాగానె వాస నన్నిటిని విడిచి శోకయోగ్యాహార్యముతో నుండవలె ననియు కాంక్షింప వలసి యుండును. "అలం"

## నైపథ్యవిధి

౫౯౭. ఆహార్యాభినయో నామ జ్ఞేయో నేపథ్యజో విధిః
తత్ర కార్యః ప్రయత్నస్తు నాట్యస్య శుభమిచ్ఛతా

ఆహార్యాభినయ మనునది నేపథ్యజన్య మయిన విధి. నాట్య శుభ మభిలషించు వారందు ప్రయత్న మధికముగ స్వీకరింప వలెను. నైపథ్యవిధి నైపథ్యాలంకారము. నాట్యశుభము నాట్యసిద్ధి. నైపథ్య సిద్ధి కాము లాహార్యమున యత్న మొనరింప వలయును. నైపథ్యము నాట్యమున కొక యలంకారము. నాట్యమందలి నైపథ్యము నాలుగు విధములు. వాని పేరు లివిగో!

౧ పుస్తము ౨ అలంకారము
౩ అంగరచన ౪ సంజీవము

## పుస్త నైపథ్యము

ఇందు పుస్తమను మొదటిది నానారూప ప్రమాణానుసారముగ మూడు విధములుగా నున్నది.

౧ సంధిమము ౨ వ్యాజిమము ౩ వేష్టిమము

సంధానము= సంధ కూర్పు. సంధానమున నిర్వృత్త మగునది సంధిమము. దలాదులరూపము కలిగి యుండునట్లు చేయుట సంధిమము. వ్యాజము= సూత్రాకర్షణాదిరూప మయిన క్షేపము. ఇట్టి వ్యాజమున నిర్వృత్త మగునది వ్యాజిమము. వేష్టిమము ౹వేలాడున ట్లొనర్చినది. పైన లక్క-పూసి మైనము పట్టించి కూర్చుట వేష్టము. వేష్టముచే నగునది వేష్టిమము.

౫౯౮. కిలింజ చర్మ వస్త్రాద్యైః యద్రూపం క్రియతే బుధైః
సంధిమో నామ విజ్ఞేయః పుస్తో నాటకసంశ్రయః

౫౯౯. వ్యాజిమో నామ విజ్ఞేయో యంత్రేణ క్రియతే తు యః
వేష్ట్యతే చైవ యద్రూపం వేష్టిమః స తు సంజ్ఞితః

౬౦౦. శైలయానవిమానాని చర్మవస్త్రధ్వజా నగాః
యే క్రియంతే హి నాట్యే తు స పుస్త ఇతి సంజ్ఞితః

కిలింజచర్మ వస్త్రాదులచే నిర్మితరూపమును సంధిమ మందురు. భూర్జ వేణు దలాదికమునకు కిలింజ మని పేరు. నాటకసంశ్రయము పుస్తము. సూత్రాదిప్రయోగమున యంత్రాదికముచే నొనర్చినది వ్యాజిమము. వేష్టనముచే రూప మాపాదించిన నది వేష్టిమ మగును. శైలయానవిమానములు చర్మవర్మధ్వజములు నగములు నాట్యమున నిర్మించుట పుస్త మనెడు సంజ్ఞ కల దగును. సంధిమ వ్యాజిమ వేష్టిమములు పుస్తభేదము లని యంటిమి. సంధి వ్యాజ వేష్టములచే సిద్ధ మగుట వీని భావము. సంధ్యాదిపదముల కట్టి యర్థమున "ఇమప్" ప్రత్యయమును శబ్దవిదులు స్మరింతురు. ఈ త్రివిధపుస్తము నాట్యోపయోగి.

## అ ల ం కా ర ము

> ౬౦౧. అలంకారస్తు విజ్ఞేయో మాల్యాభరణవాససాం
> నానావిధః సమాయోగోఽప్యంగోపాంగవిధిః స్మృతః

నాట్యనైపథ్యములో రెండవది యలంకారము. మాల్యములు ఆభరణములు వస్త్రములకు సంబంధించిన నానావిధసమాయోగ మలంకార మగును. సమాయోగ మనునది యోజనము. ఈ నానా సమాయోగ మంగోపాంగవిధి కలదిగా నుండును. శిరోహస్తాద్యంగము లందును లలాటాంగుల్యాద్యుపాంగము లందు నీ సమాయోగము నిర్మిత మగును. ఈ యలంకారసమాయోగమున మాల్యవిధాన మయిదు విధములు.

౧ వేష్టిమము
౨ వితతము
౩ సంఘాత్యము
౪ గ్రంథిమము
౫ ప్రాలంబితము

తృణముల వేష్టనముచే నిర్మిత మగునది వేష్టిమము. బహుమాలల వేష్టనము వలన గూడ వేష్టిమము సిద్ధము కావచ్చును. వితత మనునది బాగుగా చుట్టిన మాల లన్యోన్యము మేలనము పొంది మాలాసమూహాత్మకముగా నున్నప్పుడు తెలియదగినది. వస్త్రధారణ విధానమున కూర్పు పొందినదియు వితతము కావచ్చును. సంఘాత్యము గుండ్రముగా నుండునది. దారములు బయటికి కన్పడ కుండునట్లు

ఛిద్రాంతఃప్రక్షిప్త సూత్రముగా నుండు వృత్త మాల్యము కూడ సంఘాత్యమె యగును. బహుపుష్పగుచ్ఛములతో కూర్పు పొందిన దియు సంఘాత్య మగును. గ్రంథిమము గ్రంథులతో సుందరముగా నుంభిత మయిన మాల్యము. ప్రాలంబితము వాలుగా వ్రేలాడి యుండునట్లు నిర్మిత మయిన మాల్యము. ఇట్లు మాల్య మయిదు విధ ములు.

## ఆభరణము

ఆభరణాత్మక మయిన యలంకారము నాట్యమున నాలుగు విధములుగా నున్నది.

| | |
|---|---|
| ౧. ఆవేధ్యము | ౨. బంధనీయము |
| 3. ప్రక్షేప్యము | ౪. ఆరోప్యము |

౬౦౨. ఆవేధ్యం కుండలాదీహ యత్ స్యాత్ శ్రవణభూషణం
శ్రోణీసూత్రాంగదే ముక్తా బంధనీయాని సర్వదా

౬౦3. ప్రక్షేప్యం నూపురం విద్యాద్వస్త్రాభరణమేవ చ
ఆరోప్యం హేమసూత్రాది హారాశ్చ వివిధాశ్రయాః

శ్రవణభూషణముగా నుండు కుండలాదికముల కావేధ్య మని పేరు. ముక్కు చెవులు కుట్టి తగిలింప దగిన యాభరణము లావేధ్య ములు. రశనామణులు కల మొలనూలు భుజకీర్తు లనదగు నంగద ములు ముత్తెములతో కూర్చిన దండకడియములు బంధనీయాభరణ ములు. నూపురములు వస్త్రాభరణము ప్రక్షేప్యము లనదగి యున్నవి. లతాసంఖ్యాదిభేదమున బహుభేదములు కలవై వివిధాశ్రయము లయిన హేమసూత్రములు హారము లారోప్యాభరణము లగును.

౬౦౪. భూషణానాం వికల్పం హి పురుష స్త్రీ సమాశ్రయం
నానావిధం ప్రవక్ష్యామి దేశజాతిసముద్భవం.

భూషణము లనేక వికల్పములతో నున్నవి. పురుషాశ్రయ ములు స్త్రీసమాశ్రయములు వేరు వేరుగా నున్నవి. ఇందు నా యా దేశసముత్పన్నములు ఆ యా జాతిసముద్భవము లయిన నానావిధము లున్నవి. వీనిని సామాన్యముగ నయిన దెలియుట యావశ్యకము.

౧ చూడామణి – శిరోభూషణము, శిరోమధ్యమున
౨ మకుటము – లలాటోర్ధ్వమున ధార్యము.
౩ కుండలము – కర్ణాభరణము. చెవిచివర
౪ మోచకము – కర్ణశష్కులీ మధ్య రంధ్రమున ధార్యము
౫ కీల – ఉత్తరకర్ణిక యని పేరు. ఊర్ధ్వరంధ్రమున
౬ ముక్తావలి – కంఠభూషణము.
౭ హర్షకము – సర్పాదిరూపము సముద్గకము కర్ణాభరణము
౮ సూత్రకము – గుచ్ఛ గ్రీవాసూత్ర మని ప్రసిద్ధి. కంఠభూషణము
౯ వేతిక – అంగుళ్యాభరణము. సూక్ష్మ కటక రూపము
౧౦ అంగులిముద్ర – పక్షిపద్మాద్యాకారము– ఉంగరము.
౧౧ హస్తలి – బాహునాలీ విభూషణము.
౧౨ వలయము – కంకణము.
౧౩ రుచకము – మణిబంధ భూషణము. ఊర్ధ్వభాగమున
౧౪ చూలిక – అగ్రబాహువునందు. నికుంచక మని పేరు
౧౫ కేయూరము – మోచేతికి పై భూషణము
౧౬ అంగదము – కేయూరములకును పైభాగమున
౧౭ త్రిసరము – వక్షోభూషణము. మూడు ముత్యాలపేటలు
౧౮ హారము – సువర్ణాదిరచితము– వక్షమున
౧౯ మాల – పుష్పాదిరూపము
౨౦ తలకము – కటివిభూషణము. నాభికి దిగువ
౨౧ సూత్రకము – తలకమునకు క్రింద భాగమున ధార్యము

సామాన్యముగా నాభరణముల నామసంకేతము లీ విధముగ నున్నవి. వీనిని జాతి వయోవస్థా భేదమున ధరింప వలె ననుట ప్రసిద్ధము.

౯౦౫. అయం పురుషనిర్యోగః కార్య స్త్వాభరణాశ్రయః
దేవానాం పార్థివానాం చ పునర్వక్ష్యామి యోషితాం

ఆభరణాశ్రయ మయిన యీ విధానము నిర్యోగము. పురుషుల యౌచిత్యానుసరణమున భావింప దగినట్లుగా నిర్దిష్టము. సర్వపురుషు లీ

విధమున నే యాభరణభూషితులు కావలయు నని భావింపరాదు. దేవతలకు పార్థివులకు స్త్రీలకు నియత మయిన విధాన మున్నది. ఆ విధానము దిఙ్మాత్రముగా నిర్దేశింతుము.

౧ శిఖాపాశము – కేశపాశవేష్టనము

శిఖావ్యాలము – సర్పాకృతి గ్రంధి నిబద్ధము, మధ్యలో కర్ణిక

పిండీపత్రము – } శిఖావ్యాలమె దలసంధానముగా చిత్రరచనలు వర్తులపత్రములు కలిగియుండుట.

చూడామణి – శిరోమధ్యమున నుండునది.

౨ మకరిక – ఆ మణి పిమ్మట నుండునది. మకరపత్రము.

ముక్తాజాలము – } లలాటాంత ముండునది తోరణము జాలికాది రూపమున నుండుట ప్రసిద్ధము.

శీర్షజోలకం – } విచిత్రమగు శిరోభూషణము సర్వశిరమున సువర్ణ ముక్తామణిచిత్రితము. డోలాప్రాయశీర్షక భూషణము

కండకము –

శిఖపత్రము – నెమలిపింఛాకారము విచిత్రవర్ణమణిరచిత మయిన కర్ణావతంసకము.

౧౦ వేణీపుచ్ఛము – జటాబంధరచన జడచివరిరచన

దోరకము – వేణీరచనలో వ్రేలాడురీతి

లలాటతిలకము – } నానాశిల్పప్రయోజిత మయిన ముఖతిలకము. బొమముడిపై గుత్తివలె కుసుమాకృతిగా నుండునది.

కర్ణిక – కర్ణాభరణము. చెవి తమ్మె కుండునది

కర్ణవలయము – చెవికాడపోగు.

౧౨ పత్రకర్ణిక – తమ్మెకతికియుండు రచనావిశేషము

కుండలము – వ్రేలాడునది. నాగకుండలరీతి.

కర్ణముద్ర – చెవి గూబ వఱకుండునదిట.

కర్ణోత్కీలకము - చెవిపుడక. చెవికాడ. పోగు
దంతపత్రము - నానారత్నవిచిత్రితముగా నుండు దువ్వెనలు.

౨౦ కర్ణపూరము - కర్ణము లందలి భూషణములు
తిలకము - కపోలములపై చుక్కలు
పత్రలేఖ - గండఫలకములపై మకరికా పత్రరచనలు
త్రివళి - వక్షోవిభూషణము
నేత్రరంజనము - కజ్జలాదికము

౨౫ అధరరంజనము - } అధరమునకు రాగ మిచ్చునది. పల్లవ కాంతి పగడపురంగు తాంబూలరాగము
దంతరాగము - నాల్గుదంతములకు రంగు వేయుట
ముక్తావలి - వక్షోభూషణము. కంఠభూషణము
వ్యాలపంక్తి - సర్పాకృతికల కంఠభూషణము
మంజరి - గుత్తులు గుంపులు కలది

౩౦ రత్నమాలిక - రత్నములు వ్రేలాడునది
రత్నావలి - విరివిగా రత్నములుకలది
సూత్రకము - ,,
ద్విసరము - రెండు పేటల హారములు
త్రిసరము - మూడు పేటలుగా నుండునది

౩౫ చతుస్సరకము - నాలుగు పేటలుగా నుండునది
శృంఖలిక - కంఠవిభూషణము. గొలుసుగా నుండునది
అంగదము - బాహుమూల విభూషణము
వలయము - మణిబంధవిభూషణము నగును
మణిజాలము - } వక్షోభూషణము. నానాశిల్పకృతము లయిన హారములు. స్తనవిభూషణమును

౪౦ ఖర్జూరకము - బాహునాళీ విభూషణము
సోచ్ఛ్రితికము - ,,
కలాపి - బాహునాళీ విభూషణములు

కటకము – ముంజేతి యాభరణవిశేషము
శంఖము – ,, ,,
౭౫ హస్తపత్రము ,, ,,
పూరకము – ,, ,,
ముద్ర – అంగులీ విభూషణము
అంగులీయకము – ,,
తలకము – ముక్తాజాలములతో నుండునది. మధ్యాలంకారము
౫౦ మేఖల శ్రోణీవిభూషణము. ఎనిమిది వరుసలు
కాంచిక – ,, ఒక పేటతో నుండునది
రశన – ,, పదునారు పేటలు కలది
కలాపము – ,, } ఇరువది యయిదు పేటలు ముప్పది రెండు, అరువదినాలుగు, నూటయెనుమిది యిందలి భేదములు
నూపురము – పాదాలంకారము. మోకాలి క్రిందనుండునది
౫౫ కింకిణీకము – చిరుగజ్జెలు కల భూష
ఘంటిక – గంటలు కలది. పెద్దగజ్జెలు కలది
రత్నజాలకము – ప్రపదభాగముల కాచ్ఛాదకము
కటకము – సఘోషముగా నున్న గుల్ఫోపరి భూషణము
పాదపత్రం – జంఘ లందుండునది.
౬౦ అంగులీయకం – కాలివ్రేళ్ళ కుండునది. మట్టియ
అంగుష్ఠతిలకము – విచిత్రరచనాకృతము. పాదభూషణము
అలక్తకరాగము – పాదాలంకారము. లత్తుకతో నిర్మించునది

అలక్తకరాగము నానాభక్తి (రచన) నివేశితమై యుండును. అశోకపల్లవచ్ఛాయగా నుండును. స్వాభావికశోభతో నుండును. పైన నిరూపించిన వానిలో దంతాధరరాగ వైచిత్ర్య మున్నప్పుడు వనితయొక్క సవిభ్రాంతనిరీక్షితముతో కూడుకొనిన స్మిత మతి హృద్యమై విలాసరూపముగ నుండును. దంతరాగమున శుక్లత కూర్చుట కలదు. ముగ్ధ లయిన సుందరకన్యల దంతములు ముత్యాల

శోభ కలవై శోభనముగా నుండును. ఎర్రని దంతములును పద్మ పల్లవరంజనము కలవై శోభించును. అధరము పల్లవప్రభతో నున్న శోభించును. అప్పటి దంతాధరనేత్రరంజనము కల వనితల సవిభ్రాంతనిరీక్షితము రమ్యవిలాసము కదా! స్త్రీ శ్రోణీవిభూషణము లనేకవిధముల నున్నవి. ఇవి వయోరూపావస్థావిశేషముల బట్టి భిన్నములుగా నున్నవి. అన్నియు సమానార్థకములు కావు. వీని స్వరూప భేద మిట్లున్నది.

## శ్రోణీ భూష

౬౦౬. ఏకయష్టి ర్భవేత్కాంచీ మేఖలా త్వష్టయష్టికా
ద్విరష్టయష్టి రశనా కలాపః పంచవింశకః

౬౦౭. ద్వాత్రింశచ్చ చతుష్షష్టిః శతమష్టోత్తరం తథా
ముక్తాహారా భవంత్యేతే దేవ పార్థివ యోషితాం

దేవస్త్రీలకు రాజస్త్రీలకు నీ శ్రోణీభూష లుండును. వీనిలో కాంచి యనునది ఏకయష్టి. ఒకే వరుసతో నుండునది. కేసరదామ కాంచి ధరించిన పార్వతిని కాళిదాసు వర్ణించినాడు. మేఖల యనునది యష్టయష్టి. ఎనిమిది వరుస లుండులు. రశన షోడశ యష్టికము. రతి మన్మధునకు రశనాబంధములు కూర్చినది. కలాపము పంచవింశకము. ఇరువది యయిదు గుణము లుండును. దేవి పార్వతి ముక్తా కలాపీకృత సిందువార యయినది. ఈ కలాపములు ముప్పదిరెండు చతుఃషష్టి యష్టోత్తరశత మన్న సూత్రసంఖ్యానములతో నున్నవి. సామాన్యముగా వీనిని మొలనూలు లనుట కాని వస్త్రోపరిభాగము లందే యివి ధార్యములు. వీనిలో మణులు కింకిణులు చిరుగజ్జెలు కూర్తురు. కాళిదాసు పుష్పములు గ్రథించినాడు.

## భూషానియమము

౬౦౮. ఏతద్విభూషణం నార్యా ఆకేశా దానఖాదపి
యథాభావరసావస్థం విజ్ఞేయం ద్విజసత్తమాః

౬౦౯. ఆగమశ్చ ప్రమాణం చ రూపనిర్వర్ణనం తథా
విశ్వకర్మమతాత్కార్యం సుబుద్ధ్యాపి ప్రయోక్తృభిః

౬౧౦. న హి శక్యం సువర్ణేన ముక్తాభి ర్మణిభి స్తథా
స్వాధీనమితి రుచ్యైవ కర్తుమంగస్య భూషణం
విభాగతోఽభిప్రయుక్త మంగశోభాకరం భవేత్

కేశాది నఖాంత మిూ చెప్పిన దంతయు నారీవిభూషణము. శిఖాపాశము శిఖావ్యాలము మొదలుగా నల క్తకరాగ పర్యంత మబలాలంకారములు. యథాభావము యథారసము యథావస్థము యథాస్వభావము విభూషణధారణ ముచితముగా నుండును. విశ్వకర్మ మతము ననుసరించి ప్రయోక్తలు స్వకీయబుద్ధి సుబుద్ధి విశేషము ననుసరించియు నాగమప్రమాణ రూపములను నిర్ణయించుకొన వలయును. ఏ యాభరణమున కే యుపాదానము రూపము సముచితమని విశ్వకర్మ నిర్ణయించునో తద్విధానమనుసరించుట యుక్తము. ప్రమాణ మంగుల్యాదులం దుండును. రూపము స్వభావాను సారమున నిర్ణయింప దగినది. అన్నిటిలో విశ్వకర్మనిర్ణయమె యక్కర లేదు. లోకప్రసిద్ధరీతి ననుసరించుయు సుబుద్ధిచే నూహింప వచ్చును. బంగార మున్నదని ముక్తామణి యున్నదని మణు లున్నవని తనకొక నిశ్చయ మున్నదని తన యభిరుచి ననుసరించి భూషణము రచనము చేయుట స్వాధీన మగునది కాదు. ఆ యా విభాగానుసారమున ప్రయుక్తమయిన భూషణమె శోభాకర మగును. స్థానాంతరము నందున్న రత్నసంయుత భూషణమె శోభించును. రత్నభూషకు స్థానాంతరముననె శోభ. అంతట నది శోభింపదు. అట్లే ప్రకృతవిభాగము.

## భూషావివేకము

౬౧౧. న తు నాట్యప్రయోగే తు కర్తవ్యం భూషణం గురు
ఖేదం జనయతే తద్ధి నవ్యాయత విచేష్టనాత్

౬౧౨. గురుభావావసన్నస్య స్వేదో మూర్ఛా చ జాయతే
గుర్వాభరణసంపన్నో హి చేష్టాం న కురుతే పునః

౬౧౩. తస్మాత్తనుత్వచకృతం సౌవర్ణం భూషణం భవేత్
రత్నవ జ్జతు బద్ధం వా న ఖేదజననం భవేత్

నాట్యప్రయోగములో బరు వయిన భూషణ ముంచరాదు. అటు నిటు కదలికలచే నది ఖేద ముత్పాదించును. బరువు వలన

నటునకు బాధ కలుగును. అప్పుడు చెమట పట్టును. మూర్ఛ వచ్చును. ఆభరణములు భారముగ నున్నప్పుడు నటుడు చేష్ట లొనరింపలేడు. కావున పలచ పలచని రేకులతో సువర్ణభూషణ మొనరించుట మంచిది. లక్కలో పొదిపిన రత్న మాభరణముగా ఖేదము కలుగ జేయదు. ప్రేక్షకులకు సువర్ణభావము రత్నభావము కలుగ జేయుటయె ముఖ్యము. అప్పుడు దృశ్యతాకృతముగా సహృదయ ప్రేక్షకు లందు భావన సమావిర్భావము పొంది నాట్యధర్మ మాపాదింప గలదు.

> ౬౧౪. స్వేచ్ఛయా భూషణవిధి ర్దివ్యానా ముపదిశ్యతే
> యత్నభావవినిష్పన్నం మానుషాణాం విభూషణం
> ౬౧౫. దివ్యానాం భూషణవిధి ర్య ఏష పరికీర్తితః
> మానుషాణాం చ కర్తవ్యో నానాదేశసమాశ్రయః

దివ్యులగు వారికి భూషణవిధి స్వేచ్ఛానుసారముగా నుండును. వా రిచ్ఛానుసారి భూషణములను మానసముగనె సృజింప గలరు. "దివ్యానాం మానసీ సృష్టిః" అని యిదివరలో నిరూపితము. దివ్యులె నాట్యప్రయోగ మొనరించు నప్పు డీ విధాన మిచ్ఛానుసారి. మానవుల కట్లు గాదు. మానవుల విభూషణము యత్నభావ వినిష్పన్నము. సయత్నముగ సనియమముగ వారి భూషణముల నిర్మింప వలెను. కాకున్న లోకాసంభావ్యత భాసించును. సమాస్వాద ముదయింపదు. ఆ యా స్థాన సంకేత నియమములతో నిరూపించిన యీ భూషణము లీ విధమునసె నియతస్థాన నియమముతో నుండవలెను. మానవుల కీ భూషణవిధియె పరికీర్తిత మయినను నానా దేశసమాశ్రయముగా నది యుండవలెను. ఒక్కొక్క దేశమున నొక్కొక్క భూషణ మొక్కొక్క నియమముతో నుండును కదా! ఆ నియతిని గుర్తింప వలెనని భావము.

## దివ్యావిభక్తి

> ౬౧౬. భూషణైశ్చాపి వేషైశ్చ నానావస్థా సమాశ్రయైః
> దివ్యాంగనానాం కర్తవ్యా విభక్తిః స్వ స్వ భూమిజా.

నాట్యప్రయోగ సమయమున దివ్యాంగన లొక్కొక్క భూమిక ధరింతురు. ఆ యా పాత్రభూమికానుసారముగా తమ తమ నివాస

భూమి సహజముగా విభాగమును నిర్ణయింప వలెను. రంగప్రయోగ ములో వారి వారి భావ రస సమాశ్రయము లయిన వేషభూషణము లచే విభాగము గుర్తింప వలెను. విద్యాధరాంగనలకు యక్షవనితలకు అప్సరఃకన్యలకు నాగస్త్రీలకు ఋషి దైవత కన్యలకు సంబంధించిన వేషములు వేరు వేరుగా నుండును. అవి యన్నియు నానారూపమున నుండును. అట్లే సిద్ధవనితలు గంధర్వకాంతలు రాక్షసస్త్రీలు అసుర భామలు దివ్యాంగనలు నరనారీమణులు మొదలగు వారి శిఖండక రచనము నందును భేద వివేక మావశ్యకము. విద్యాధర వనితలకు శిఖాబంధమును శిఖండముగా గూర్పవలెను. ముక్తాప్రధానము లయిన భూషణములు వారలకు ముఖ్యములు. యక్షిణీస్త్రీలకు అప్సరఃకన్య లకు రత్నవిభూషణము లావశ్యకములు. వార లందరకు వేషము సమానమె కాని యక్షిణులకు శిఖ ముఖ్యముగా ప్రత్యేకముగా నుండును.

## నా గ స్త్రీ భూ ష ణ ము

౬౧౭. దివ్యానామివ కర్తవ్యం నాగస్త్రీణాం విభుషణం
ముక్తామణి లతా ప్రాయాః ఫణాస్తాంతుసాం కేవలాః

విభూషణరచన దివ్యస్త్రీలకు నాగస్త్రీలకు సమానము. నాగ స్త్రీ లకు పడగలు మాత్రము ముక్తామణి లతాప్రాయముగా నుండవలెను. "స్వర్గాదప్యతిరమ్యాణి పాతాలాని" యని సూక్తి. నాగవనితలు దివ్యవనితల వలె భోగాసక్తలు. దివ్యవనితలకు వలెనె భోగాసక్తి సూచకము లయిన విభూషణములు భోగలోక భోగకాంతలకును సముచితములుగా నుండును.

## ము ని క న్యా వే ష ము

౬౧౮. కార్యం తు మునికన్యానా మేకవేణీ ధరం శిరః
న చాపి భూషణవిధిః తాసాం వేషో వనోచితః

మునికన్యకలకు శిర మేకవేణీరూపముగ నుండవలెను. వారలకు నాగరభూషణవిధు లుచితములు కావు. వారి వేషము వనోచితము గనె యుండవలెను. తీగెల వలయములు, పుష్పముల మాలలు పల్లవావతంసము మొదలగునవి మునికన్యాసముచితవేషములు. సిద్ధవని

తలకు ముక్తామరకత ప్రాయ మయిన మండనము మనోహరము. వారలకు పీతవస్త్రధారణము రమ్యముగ నుండును. గంధర్వకాంతల యాభరణములు పద్మరాగమణులతో నుండవలెను. వీణాహ స్తము కౌసుంభవసనము గంధర్వమనోహరము. రాక్షససుందరీమణులకు విభూషణము లింద్రనీలరచితములు. వారల కొక చిన్న తెల్ల పను కోర యేర్పఱచుట రమ్యయుగ నుండును. నల్లని పరిధానము వారల కందము. దేవవనితలు వైడూర్య ముక్తాభరణముల ధరింతురు. చిలుకపచ్చ రంగుచీరలను సింగారింతురు. ఒకప్పుడు పుష్యరాగ మణులు ఒకప్పుడు పడగపు భూషలు ధరింతురు.

౬౧౯. దివ్య వానర నారీణాం కార్యో నీలపరిచ్ఛదః
ఏవం శృంగారిణః కార్యా వేషా దివ్యాంగనాశ్రయాః

దివ్యస్త్రీలకు వానరవనితలకును నీలపు రంగు వస్త్రపరిధాన మేర్పఱచ వలెను. దివ్యాంగనల సంశ్రయమున శోభించు శృంగారి వేషములను సావధానముఃగా నిరీక్షించి కూర్పవలెను. దేవవనితలకు గూడ నవస్థాంతర సంబంధమున శుద్ధవేషములు నిబంధించుటయు సముచితముగనె యుండును. దివ్యవనిత స్వాధీనపతికగా నున్నప్పటి వేషమున కన్న వాసకసజ్జికగా నున్నప్పటి వేషము భిన్నముగా నుం డును. ఇట్లె యితరావస్థ లందును గ్రాహ్యము.

మా ను షీ వే ష ము

౬౨౦. మానుషీణాం తు కర్తవ్యా నానాదేశ సముద్భవాః
వేషా స్త్వాభరణోపేతా స్తాంశ్చ సమ్య జ్నిబోధత.

మానవస్త్రీల కా యా దేశము లందలి సంప్రదాయముల నను సరించిన యాభరణములతో గూడిన వేషములను రచింప వలెను. ఆ యా దేశ సముత్పన్న మయిన రూ యాచారము వేష మాభరణము భావాస్వాదమున కుచిత పథము. అట్టిది సముద్వేగ మీాయదు. వారి వారి వేషాభరణసంయోగముల నీ విధముగా గుర్తింప వచ్చును.

ఆవంతి – సాలక కుంతలముగా నుండు తలకట్టు
గౌడి – అలకలు, శిఖాపాశము– వేణిక యొకటి
ఆభీరి – రెండు జడలు. అవగుంఠనము నీలాంబరము

పూర్వస్త్రీ - ఎత్తుగా కూర్చిన శిఖండక రచన
ఉత్తరస్త్రీ - సమున్నద్ధ శిఖండము. మేలి ముసుగు
దక్షిణ - ఆవర్తలలాటము. కుంభిపతకములు కలది.

వీరిలో గణిక లయిన వారివేషము మండన విచ్ఛిత్తి ననుసరించి యుండును. గణికల కొకే వేష మను నియమము లేదు. స్నిగ్ధరసికుల స్నేహానుసారమున వారి యలంకార ముండును.

### దేశావస్థావిధి

౬౨౧. దేశ జాతి విధానేన శేషాణామపి కారయేత్
వేషం తథా చాభరణం నానావస్థాంతరాశ్రయం

౬౨౨. అదేశయుక్తో వేషో హి న శోభాం జనయిష్యతి
మేఖలోరసి బద్ధా తు హాస్యం నముపపాదయేత్

౬౨౩. తథా ప్రోషితకాంతాసు వ్యసనాభిహతాసు చ
వేషో వై మలినః కార్య ఏకవేణీధరం శిరః

౬౨౪. విప్రలంభే తు నార్యాస్తు శుద్ధో వేషో భవేదిహ
నాట్యాభరణసంయుక్తో న చాపి మృజయాన్వితః

౬౨౫. ఏవం స్త్రీణాం భవేద్వేషో దేశావస్థానముద్భవః

కొన్ని కొన్ని దేశాచారములె యిచ్చట నిరూపితము లయినను మిగిలిన యా యా దేశవిధానమున, జాతివిధానమున నందరకును వేషభూషాది విశేషముల నభ్యూహించి గుర్తింప వలెను. కేశరచనాదికము వేషము. అది హృదయము వ్యాపించి హృద్యమగును. శిఖావ్యాలాదు లాభరణములు. "ఆసమంతాత్ భ్రియతే పోష్యతే కాంతిః" కాంతి యంతట పోషిత మగును గావున నాభరణ మనుట సంగతము. వేషాభరణాదులలో క్షురకర్మ పరిచ్ఛదము కూడ నున్నవి. అలకాదియోజనము క్షురకర్మ. అలకలు సముచిత యోజనమున సముచితస్థానమున కుంచితములు కాగా కుంతల శోభ కల వగును. ఏవమాదిక మయిన యోజనమునకు క్షురకర్మ యని పేరు. పరిచ్ఛద మనునది విచిత్రవస్త్రప్రయోగము. ఇవి యన్నియు నానావిధము లయిన రతిశోకాద్యవస్థాశ్రయములై హృదయగ్రాహులగును. నాట్యమునకు సంబంధించిన నైపథ్యరచనము నందలి యాగ

మము నీరీతి చక్కగా గుర్తించి ప్రయోగించుట సముచిత విధాన మని భరతోపదేశము. ఆ యా దేశయోగ సంబంధ సముచితము కాని వేషము శోభాసంపాదకము కాదు. ఉరమున మేఖల ధరించిన నెవరు పరిహసింపరు? ఆభరణమె యయిన నస్థానబద్ధ మయినచో హాస ముత్పాదించును. కావున ప్రోషితకాంతల విషయమున వ్యస నాభిభూత లయిన వనితల విషయమున మలినవేషమునె కూర్ప వల యును. వారి శిరము సంస్కారశోభలతో నుండరాదు. ఏకవేణీధర ముగా శిర ముండుటయె యౌచిత్య మాపాదించును. స్త్రీకి విప్ర లంభసమయమున శుద్ధవేషమె యుండ వలయును. అప్పు డాభర ణము లంతగా నుండ రాదు. మాంగల్యాభరణములు మాత్ర మప్పుట విహితములు. మనోహరాభరణము లారోపింప రాదు. ఆ వేషము మృజాన్వితమును గారాదు. స్త్రీలకు దేశావస్థా సముచిత మయిన వేషమె రమ్యతను కూర్చును. ఆంధ్రాది దేశములను రతి శోకాద్యవస్థలను గుర్తించి తదౌచిత్యానుసారమున వేషము స్త్రీల కాపాదింప వలెను.

## పురుషవేషము

> ౬౨౬. పురుషాణాం పునశ్చైవ వేషాన్వక్ష్యామి తత్వతః
> తత్రాంగరచనా పూర్వం కర్తవ్యా నాట్యయోక్తృభిః
> తతః పరంప్రయోక్తవ్యా వేషా దేశసముద్భవాః

పురుషులకును తత్త్వానుసారమున నుండదగు వేషములను నిరూ పింపవలసి యున్నది. నాట్యప్రయోక్తలు ముందుగా పురుషులందు అంగరచన యేర్పాటు చేయవలయును. అంగనలకు రూపమును పరివర్తింప జేయవలసి యున్నప్పుడు వేరొక రూపసంపాదనాత్మక విధానమున వర్ణవర్తన మావశ్యకమె కాని పురుషులకు వలె యంగ రచన యావశ్యకము కాదు. పురుషులకు ప్రథమమున నంగరచన యొనరించి యనంతరము దేశసముద్భవము లయిన వేషములను కూర్పవలెను. అంగవర్తన మాపాదించుటకు వలయు విధాననిర్దేశ మావశ్యకము.

## అంగవర్తనము — వర్ణవిధి

౬౨౬. సితో నీలశ్చ పీతశ్చ చతుర్థో రక్త ఏవ చ
ఏతే స్వభావజా వర్ణా యైః కార్యం త్వంగవర్తనం
సంయోగజాః పునశ్చాన్యే ఉపవర్ణా భవంతి హి

సిత నీల పీత రక్తము లను నాలుగు స్వభావసిద్ధము లయిన వర్ణములు. ఇతరములు సంయోగజము లయిన వర్ణములు. వర్ణద్వయ సబంధముచే నవి కలుగును. మరికొన్ని యుపవర్ణములు. బహువర్ణముల మిశ్రణమున గలుగునవి. స్వభావజము లయిన వర్ణములచే నంగ వర్తన మొనరింప వలెను. సంయోగజము లయిన వర్ణము లీ విధముగ నుండును. వాని పేర్లిట్లున్నవి.

౧ కారండవము — సిత నీల సమాయోగమున గలుగును
౨ పాండువర్ణము — సిత పీత సమాయోగము
3 పద్మవర్ణము — సిత రక్త సమాయోగము
౪ హరితవర్ణము — పీత నీల ,,
౫ కషాయవర్ణము — నీల రక్త ,,
౬ గౌరవర్ణము — రక్త పీత ,,

త్రి చతుర్వర్ణ సంయుక్తము లయిన భేదము లనేకము లున్నవి.

౬౨౮. బలస్థో యో భవేద్వర్ణో తస్య భాగో భవే త్తతః
దుర్బలస్య చ భాగౌ ద్వౌ నీలం ముక్త్వాప్రదాపయేత్

౬౨౯. నీలస్యైకో భవేద్భాగ శ్చత్వారోఽన్యే తు వర్ణకే
బలవా న్సర్వవర్ణానాం నీల ఏవ ప్రకీర్తితః

౬౩౦. ఏవం వర్ణవిధిం జ్ఞాత్వా నానాసంయోగ సంశ్రయం
తతః కుర్యాద్యథాయోగ మంగానాం వర్తనం బుధః

కొన్ని వర్ణములకు బల మున్నది. కొన్ని దుర్బలములు. బలస్థమయిన వర్ణమనుట ఇతరముల నది యభిభవింప గలదని భావము. బలస్థ మయిన వర్ణ మొకభాగము దుర్బలవర్ణమునకు సంబంధించిన రెండు భాగములను మేలనము చేయవలయును. ఈ కలయికలో నీల వర్ణమును విడువ వలయును. నీలవర్ణభాగ మొకటి యుండగా నా

వర్ణకమున నితర వర్ణభాగములు నాలుగు కలుప వలయును. నీలవర్ణ విషయమున నిట్టి భాగవిధియె సముచితము. వర్ణము లన్నిటిలో నీల వర్ణ మన్నిటి కన్న బలీయము. ఇది యంతయు నానాసంయోగ సంశ్రయ మయిన వర్ణవిధి. ఈ వర్ణవిధిని బాగుగా దెలిసిన యనంత రమె తద్విదు డయిన వాడంగముల వర్తనము నాచరింప వలెను. వర్తన మనునది యీ వర్ణవిధానము లోని పరిభాషాపదము.

వర్ణ వర్తనము

౬౩౧. వర్తనంచ్ఛాదనం రూపం స్వవేషపరివర్జితం
నాట్యధర్మప్రవృత్తం తు జ్ఞేయం తత్ప్రకృతిస్థితం

౬౩౨. స్వవర్ణ మాత్మనశ్ఛాద్యం వర్ణకై ర్వేషసంశ్రయైః
అకృతి స్తస్య కర్తవ్యా యస్య ప్రకృతి రాస్థితా

వర్తనము ఛాదనము రూపము మూడును సమార్థకము లయిన పర్యాయపదములు. నాట్యధర్మమున ప్రవర్తించిన యీ వర్తనము స్వవేషమును విడిచి ప్రకృతిస్థిత మగును. దేవమానుషాదిస్వభావమె యిచట ప్రకృతి. ఆ దేవాదుల ప్రకృతి స్వభావవిభాగమున నుండునని భావము. వేషసంశ్రయను లయిన వర్ణకములచే నాత్మీయ మయిన వర్ణమును ఛాదన మొనర్ప వలెను. పాత్రధారణమున నెవరి ప్రకృతి సమాస్థిత మయినదో వారి యాకృతినె వర్ణకములచే సంపాదింప వలెను.

పరభావసిద్ధి

౬౩౩. యథా జంతుః స్వభావం స్వం పరిత్యజ్యాన్యదైహికం
తత్స్వభావం హి భజతే దేహాంతర ముపాశ్రితః

౬౩౪. వేషేణ వర్ణకైశ్చైవ చ్ఛాదితః పురుష స్తథా
పరభావం ప్రకురుతే యస్య వేషం సమాశ్రితః

ఇంతటి వర్తన మాపాదింపగా గలుగు ప్రయోజన మిందున్నది. జీవాత్మ స్వస్వభావమును విడనాడి యన్యదేహమునకు సంబంధించిన స్వభావమును దేహాంతరము ననుసరించి పొందుచున్నాడు. మొదట జీవాత్మ శుద్ధ నిర్మలానంత చిదానంద ప్రకాశుడు. ఆ ప్రకాశాత్మ జీవుని స్వభావము స్వాతంత్ర్యరూపము. అది యనపాయి. అయినను

జీవుడు స్వ స్వాతంత్ర్య స్వభావాత్మక స్వరూపమును విడనాడి స్వ వ్యతిరిక్తమగు దైహికస్వభావమును పొందుచున్నాడు. అందు శరీరకరణోచితమయిన వ్యవహారమును పొందుచున్నాడు. పరిశీలింపగా నాదేహాంతరము గూడ జీవుని దేహవిశేష మనియె భాసించును. అట్టి దేహాంతరమును "ఉపాశ్రితః" "ఉప సమీపే ఆ సమంతాత్ శ్రితః అతి నైకట్యేన తదాత్మవృత్త్యా ప్రతిపన్నః" ఉపాశ్రితపదమున "ఉప+ఆ+శ్రితః" యని మూడంశము లున్నవి. అత్యంత సమీపమున స్వాత్మవృత్తిరూపమున నన్యదేహము నాశ్రయించు నని భావము. "ఏ త దుక్తం భవతి". పరమాత్మకు స్వచైతన్యప్రకాశము స్వరూపము. దాని విడువక యే దేహకంచుక సముచిత మయిన చిత్తవృత్తి రూపిత మయినట్లుగా స్వరూపమును దర్శింప జేయును. అట్లె; నటుడును స్వాత్మావష్టంభమును విడువక యే స్థానసముచితముగా లయ తాలాద్యనుసరణాద్యాయోగమున, దేహస్థానీయముగా నున్న వర్తనాది వేష పరివర్తనమున తదుచిత స్వభావాలింగితముగ స్వాత్మను సామాజికులకు సాక్షాత్కరింప జేయును. ప్రేక్షక పక్షమున నటాభిమాన ముండదు. వారి యందు రామాభిమానమె యుండునట్లు దర్శింప జేయును. ఈ యాశయముననె యచట నచట ప్రతీతిని వ్యాఖ్యానించి నిరూపించితిమి.

### జీ వా జీ వ ధ ర్మ ము

౬౩౫. దేవ దానవ గంధర్వ యక్ష రాక్షస పన్నగాః
ప్రాణిసంజ్ఞాః స్మృతా హ్యేతే జీవబంధాశ్చ యేఽపరే

౬౩౬. శైల ప్రాసాద యంత్రాణి చర్మ వర్మ ధ్వజాస్తథా
నానాప్రహరణాద్యాశ్చ తేఽప్రాణిన ఇతి స్మృతాః

౬౩౭. అథవా కరణోపేతా భవంత్యేతే శరీరిణః
వేష భాషాశ్రయోపేతా నాట్యధర్మ మవేక్ష్య తు.

ఆహార్యము నందు భేదద్వయ మున్నది. ఒకటి సజీవము. మరియొకటి యజీవము. ఇందు మొదట సజీవాహార్య భేద మున్నది. దేవ దానవ గంధర్వ యక్ష రాక్షస పన్నగులు జీవబంధము కలయితరులును ప్రాణిసంజ్ఞతో జెప్పదగి యున్నారు. స్త్రీ నదీ సముద్ర

వాహనములు నానాశస్త్రములును అప్రాణు లన్న సంజ్ఞతో వ్యవహ రింప దగినవి. శైల ప్రాసాద యంత్రములు చర్మ వర్మ ధ్వజములు నానా ప్రహరణాదులు నప్రాణులని వ్యవహారము. శైలప్రాసాదాదులు నిర్జీవములుగా ప్రస్తుతములై పరిగణితము లయినను నాట్యధర్మము ననుసరించిన యవస్థావిశేషములలో సజీవముగా గూడ పరిగణ నార్హము లగును. ఇవియే సముచిత కారణ సముపేతములై శరీరము కలవగును. నాట్యధర్మానుసారమున దేశీభాషాశ్రయోపేతము లగును. నాట్యధర్మము నం దజీవ వ్యవహార మల్లె నిలబడదు. అందు సజీవరూపాపాదనము సిద్ధ మగును. అజీవము లజీవములుగా నాట్యమున నాస్వాద్యములు కావు. అజీవములందు జీవధర్మా రోపము కలుగును. చిత్తధర్మ మాపాదిత మగును. అప్పుడె యవి చిత్తమున కాస్వాద్యము లగును. జడము చేతనీకృత మగుట నాట్య తంత్రము.

## అంగరచన – వర్ణసంపత్తి

వర్ణముల విధిని తెలిసికొని వయసును ప్రకృతిని గుర్తించి దేశ మును జాతిని వయస్సు ననుసరించి యుండు అంగరచన మొనరింప వలెను. ఎవ రే రంగుతో నుందురో తెలిసిన పిమ్మటనె యంగరచన మాచరింప వలెను. ఈ దిగువ కొందరి వర్ణసంపత్తి ప్రదర్శిత మగును.

దేవతలు – గౌరవర్ణము
యక్షులు – ,,
అప్సరసలు – ,,
రుద్రుడు – తపనీయకాంతి – బంగారు వర్ణము
సూర్యుడు – ,, ,,
బ్రహ్మ – ,, ,,
కుమారుడు – ,, ,,
చంద్రుడు – శ్వేతవర్ణము
బృహస్పతి – ,,
శుక్రుడు – ,,
వరుణుడు – శ్వేతవర్ణము
ఇంద్రుడు – ,,
సముద్రుడు – ,,
హిమవంతుడు – ,,
గంగ – శ్వేతవర్ణము
అంగారకుడు – రక్తవర్ణము
బుధుడు – పీతవర్ణము
అగ్ని – ,,
నారాయణుడు – శ్యామవర్ణము
నరుడు – ,,
వాసుకి – శ్యామవర్ణము

| | |
|---|---|
| దైత్యులు - అసితవర్ణము | పిశాచులు - అసితవర్ణము |
| దానవులు - ,, | జలము - ,, |
| రాక్షసులు - ,, | ఆకాశము - ,, |
| గుహ్యకులు - ,, | పర్వతము - ,, |

ఈ గణములో జల మాకాశ మని చెప్పుట తదధిష్ఠాన దేవత వివక్షిత మగును. ఆరు ద్వీపము లందున్న పురుషులు నాట్యసంబంధమున కరగించిన కనకకాంతి కలవారుగా నున్నట్లు నిబంధింప వలెను. జంబూద్వీపము లోని భారతవర్షమున నరులు నానావర్ణములతో నుందురు. ఉత్తరకురు భూ భాగము లందలి వారు కనకప్రభతో నుందురు. భద్రాశ్వపురుషులు శ్వేతవర్ణులు, కేతుమాలమున నరులు నీలదేహులు. ఇతరవర్షము లందలి వారు గౌరవర్ణులు, భూత గంధర్వ యక్ష పన్నగులు విద్యాధరులు నానావర్ణములతో నుందురు. పితరులు నరులతో సమానులు, భూతవ్యవహార్యులు వామనులుగా నుందురు. వికృతాననములతో నుందురు. వరాహ మేష మహిష మృగముల వక్త్రములతో నుందురు.

## భారతవర్ణవిధి

భారతవర్షము నం దుండువారి వర్ణవిశేషముల నిట్లు గుర్తింప వలెను. రాజులు పద్మవర్ణులు గౌరవర్ణులు శ్యామవర్ణులు. సుఖితులయిన మానవులు గౌరవర్ణముతో నుండునట్లు నిరూపింప వలెను. నిందితకర్మ నాచరించు కుకర్ములు గ్రహగ్రస్తులు వ్యాధిబాధితులు తప మొనరించు వారు శరీరక్లేశ బహుల మయిన కర్మల నాచరించు వారు కుజాతులు బదరప్రభతో నుందురు. ఋషులును బదరకాంతితో నున్నట్లు కూర్పవలెను. తపసు నందున్న ఋషులు బదరకాంతి కలవా రయినను అసితకాంతితో నున్నట్లు భావింప వలెను.

౬౩౮. కారణవ్యపదేశేన తథా చాత్మేచ్ఛయా పునః
వర్ణప్రత్రప్రకర్తవ్యో దేశ జాతి వశానుగః

౬౩౯. దేశం కర్మ చ జాతిం చ పృథివ్యుద్దేశసంశ్రయం
విజ్ఞాయ వర్తనా కార్యా పురుషాణాం ప్రయోగతః

సకారణముగా రంగులో మార్పు కలిగింప వచ్చును. దేహ ముకు కారు నలు పున్నప్పుడు వర్ణవర్తనము క్లేశబహులక్రియ. అప్పుడా కారణ వ్యపదేశమున వర్ణము మారవచ్చును. ఒకప్పుడు కవి బుద్ధ్యనుసారమున రంగు మార్పవచ్చును. ఎంతటి వర్ణపరివర్తనము కాని దేశజాతి వశానుగతముగనె యుండవలెను. ఈ పృధివిలో నానా సముద్దేశము లున్నవి. తత్తన్నియమమున దేశమును కర్మను జాతిని తెలిసికొని ప్రయోగవిధ్యనుసారమున పురుషులకు వర్ణవర్తన మాచరించుట యుక్తము.

౬౪౦. కిరాత బర్బరాంధ్రాశ్చ ద్రవిడాః కాశి కోసలాః
పులిందా దాక్షిణాత్యాశ్చ ప్రాయేణ త్వసితాః స్మృతాః

కిరాతులు బర్బరు లాంధ్రులు ద్రవిడులు కాశి కోసల వాసులు పులిందులు దాక్షిణాత్యులును సామాన్యముగా నసితవర్ణము కలవారుగా నుందురు. కవి కారణేచ్ఛావశమున వీరిలో గొందరిని సితగౌరవర్ణములు కలవారినిగా నిరూపింప వచ్చును. శక యవన పహ్లావ బాహ్లికాదు లుత్తరదిగాశ్రయులు సామాన్యముగ గౌరవర్ణము తోడనె యుందురు. వీరి యం దసితవర్ణులు నుండవచ్చును. పాంచాలురు శౌరసేనులు మాహిషవాసు లుత్కలులు మాగధు లంగ వంగ కలింగ నివాసులు శ్యామవర్ణమున నుండునట్లు నిబంధింప వలెను.

౬౪౧. బ్రాహ్మణాః క్షత్రియాశ్చైవ గౌరాః కార్యాస్తథైవ హి
వైశ్యాః శూద్రాస్తథాచైవ శ్యామాః కార్యాస్తు వర్ణతః

బ్రాహ్మణులు క్షత్రియులు గౌరవర్ణులుగను వైశ్యులు శూద్రులు శ్యామవర్ణులుగను నిబంధింప వలెను. ఇట్లు వేరువేరుగా వర్ణసంకేతము నిదర్శిత మయినది. ఈ వర్ణసంకేతము కొంత కొంత మారవచ్చును. ఆ యా మార్పులను పూర్వము తెల్పిన విధమున సహేతుకముగ నొనరించుట సముచితము. ఈ వర్ణవిధాన మంతయు ముఖములకే కాదు. ముఖముల కుపాంగముల కంగములకు సంబంధించి యుండును.

## శ్మ శ్రు క ర్మ

ఈ ముఖాంగోపాంగవర్తన విధానమును యథాన్యాయముగ నాచరించి దేశ కాల వయోఽనురూపముగా శ్మశ్రుకర్మ నాచరింప వలెను. ఈ శ్మశ్రుకర్మ నాలుగు విధములు. ఆ విధము లిట్లున్నవి.

౧ శుద్ధము ౨ విచిత్రము

3 శ్యామము ౪ రోమశము

మెత్తగా నున్నగా క్షురకర్మ విధానమున రోమము లే మాత్రము లే కుండు నట్లు చేయుట శుద్ధము. సర్వవిధాన నసితముగా నుండుట శ్యామము. ప్రథమమున క్షురకర్మ యోజిత మయినను ప్రకృతము ననుసరించి శ్యామవర్ణము యోజనము చేయుట యుక్తము. విచిత్ర మనునది క్షురకర్మ కర్త్రికా కర్మల వలన విచిత్రసన్నివేశ మేర్పఱచుట. ఉత్పాదనకర్మచే గూడ విచిత్రసన్నివేశము కూర్పవచ్చును. రోమశమనునది యథోత్పన్నము లయిన రోమములతో నుండుట. ఈ చతుర్విధముల నున్న శ్మశ్రుకర్మయు నానావస్థాంతరాత్మకముగా నుండును. ఎ వ రె వ రి కె ట్లె ట్లు శ్మశ్రురచన మొనరింపవలెనో తెలియవలయును గదా!

౬౪౨. శుద్ధం తు లింగినాం కార్యం తథామాత్యపురోధసాం
మధ్యస్థా యే చ పురుషా యే చ దీక్షాం సమాశ్రితాః

౬౪3. దివ్యా యే పురుషాః కేచిత్సిద్ధవిద్యాధరాదయః
పార్థివాశ్చ కుమారాశ్చ యే చ రాజోపజీవినః

౬౪౪. శృంగారిణశ్చ యే మర్త్యా యౌవనోన్మాదినశ్చ యే
తేషాం విచిత్రం కర్తవ్యం శ్మశ్రు నాట్యప్రయోక్తృభిః

౬౪౫. అనిస్తీర్ణప్రతిజ్ఞానాం దుఃఖితానాం తపస్వినాం
వ్యసనాభిహతానాం చ శ్యామం శ్మశ్రు ప్రయోజయేత్

౬౪౬. ఋషీణాం తాపసానాం చ యే చ దీర్ఘవ్రతా నరాః
తథా చ చీరబద్ధానాం రోమశం శ్మశ్రు కీర్తితం

వీనిలో నాలుగు విధము లయిన శ్మశ్రుకర్మ నిర్దిష్ట మయినది. ఈ దిగువ సూచితు లయిన వారలకు శుద్ధశ్మశ్రుకర్మ రచనము సముచితము. లింగి యని చెప్పదగిన బ్రహ్మచారి వానప్రస్థుడు మొదలగు

వారు అమాత్యులు పురోహితులు ఉత్తము లధములు కాని మధ్యస్థ పురుషులును దీక్ష ననుసరించి యున్నవారును బాగుగా క్షురకర్మ చేయించుకొని శుద్ధరూపముగా నుండవలెను. ఈ దిగువ నిర్దిష్టులు విచిత్ర శ్మశ్రువులతో నుందురు. కొందరు దివ్యపురుషులు సిద్ధవిద్యాధరాదులు భూపాలకు లగు పార్థివులు కుమారులు రాజుల ననుసరించి జీవించు వారు శృంగారజీవనమున నుండు మానవులు యౌవనోన్మాదముతో నుండువారు విచిత్రశ్మశ్రురచనలతో నుండునట్లుగా నాట్య ప్రయోక్తలు నిబంధింప వలెను. ఈ దిగువవారికి శ్యామశ్మశ్రుకర్మ యుండును. ప్రతిజ్ఞ నిర్వహించు కొనజాలక పోయినవారు దుఃఖితులు తాపసులు వ్యసనాభిభూతులు మాసిన గడ్డములు మీసములు గలిగి శ్యామశ్మశ్రువులతో నున్నట్లు నిరూపింపవలెను. ఈ నిరూపితులకు రోమశ శ్మశ్రు వుండును. ఋషులు తాపసులు దీర్ఘవ్రతు లయిన వారు చీరబద్ధులు నారచీరలతో నుండువారు రోమశ శ్మశ్రువులు. ఇట్లు శ్మశ్రుకర్మ నానాప్రకారమున నున్నది. ప్రయోక్తలు దీని సావధానముగా గుర్తింప వలెను.

## వేషరచన.

నానా ప్రయోగ జన్యము లయిన వేషముల నిక నిరూపింప వలెను. వేషము త్రివిధము. శుద్ధము- విచిత్రము- మలినము. ప్రయోక్తల కార్యానుసారమున నీ వేషముల నియమము లీ విధమున నున్నవి.

౬౪౭. దేవాభిగమనే చైవ మంగలే నియమస్థితే
తిథినక్షత్రయోగే చ వివాహకరణే తథా

౬౪౮. ధర్మప్రవృత్తం యత్కర్మ స్త్రియో వా పురుషస్య వా
వేషస్తేషాం భవేచ్ఛుద్ధో యే చ ప్రాయత్నికా నరాః

౬౪౯. దేవ దానవ యక్షాణాం గంధర్వోరగరక్షసాం
నృపాణాం కర్కశానాం చ చిత్రో వేష ఉదాహృతః

౬౫౦. వృద్ధానాం బ్రాహ్మణానాం చ శ్రేష్ఠ్యమాత్య పురోధసాం
వణిజానాం కాంచుకీయానాం తథా చైవ తపస్వినాం

౬౩౧. విప్ర క్షత్రియ వైశ్యానాం స్థానీయా యే చ మానవాః
శుద్ధో వస్త్రవిధిస్తేషాం కర్తవ్యో నాటకాశ్రయః

౬౩౨. ఉన్మత్తానాం ప్రమత్తానా మధ్వగానాం తథైవ చ
వ్యసనోపహతానాం చ మలినో వేష ఉచ్యతే

వీనిలో మొదటి రెండు శ్లోకములు శుద్ధవేషవిధానమును నిరూపించును. మూడవ శ్లోకము చిత్రవేష నిరూపకము. నాలు గయిదు శ్లోకములు మరల శుద్ధవస్త్ర నిరూపకములు. చివరి శ్లోకము మలిన వేషవిధిని తెల్పును. వీని భావార్థ మీ రీతి నున్నది. దేవాభిగమనములో మాంగలిక కార్య విశేషములో నియమవ్రతావలంబనములో తిథి వార నక్షత్ర విశేష యోగములో వివాహ సమయములో నింక నిర్దిష్టము లయిన విధానములలో స్త్రీకి కాని పురుషునకు గాని ధర్మ ప్రవృత్తమయిన కర్మ నాచరింప వలసి యున్నప్పుడు శుద్ధవేషము యుక్తముగా నుండును. అట్టి ప్రాయత్నిక నరులకును శుద్ధవేషమె విహితము. ఆ యా కార్యము లందలి ప్రయత్నములందు వినీతులై యుండు వినీత మానవులు ప్రాయత్నిక నరు లగుదురు. దేవ దానవ యక్షులకు గంధర్వోరగ రాక్షసులకు రాజులకు కర్కశచిత్తులకు కాముకులకు చిత్రవేషము సముచితము. వారి వారి భావ రాగావస్థానుసారమున వేషమున చిత్రత కలుగును. వృద్ధులకు బ్రాహ్మణులకు శ్రేష్ఠిజనులకు అమాత్యవరులకు పురోహితులకు వాణిజ్యతంత్రులకు కాంచుకీయవ్యక్తులకు తపస్వులకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు తమ తమ స్థానగౌరవము కల వారలకును నాటకాశ్రయముగా శుద్ధవస్త్ర విధిని కూర్పవలెను. ఉన్మత్తులకు మదమత్తులకు మార్గవిహారు లయిన బాటసారులకు వ్యసనబాధితులకు మలినవేషము యుక్తముగా నుండును.

నాట్యతత్త్వజ్ఞుడగు నాతడు శుద్ధవేషము నందు పరిశుభ్రవస్త్రముల నూర్ధ్వాంబరములను కూర్పవలెను. చిత్రవేషము నందు రక్తవిచిత్రము లగు వస్త్రములను కూర్ప వలెను. మలినవేషము నందు మలినవస్త్రములను కూర్పవలెను. శుద్ధాది వేషములలో నాకృతి ననుసరించిన పరిణామాదిక ముండును. అట్టిదె రూపసంపదయు నుండును.

ఈ విశేషముల నన్నిటిని నాట్యవిదుడు గుర్తించి యోజనము చేయుట యాహార్యమున శోభాసంపాదక మగును.

మునులు జైనసాధువులు బౌద్ధసన్యాసులు యతులు పాశుపత వ్రతులు మొదలగు వారి విషయమున లోకస్వభావానుసారముగ వ్రతానుగ మయిన వేషమును రచింప వలెను. తాపసులకు వితతముగా నుండని స్థూలవృక్ష త్వచములను యోజింప వలెను. పరివ్రాజకులకు మునులకు బౌద్ధులకు కాషాయవసన ముండుట యుక్తము. పాశుపతవ్రతులలో నానాచిత్రవసనములు నుండును. కుజాతి జాతులకు యథార్థ్యముగా వస్త్ర ముండును. రాజాంతఃపుర కక్ష్యలలో నియుక్తు లయిన నరులకు, నంతఃపుర ప్రవేశమున వినియుక్తు లయిన వారలకు కాషాయవర్ణము కల కంచుక పటము లుండవలెను. "అవస్థాంతరతశ్చైవం నృణాం వేషో భవేదథ" మానవుల కవస్థా భేదము ననుసరించి వేష ముండుట సర్వ సంప్రతిపన్నము. అందుననె శూర వీరులకు సాంగ్రామిక మయిన వేషము పరికీర్తిత మయినది. సంగ్రామ సహజ వేష మిట్లుండును.

౬౫౩. విచిత్రశస్త్రకవచో బద్ధతూణో ధనుర్ధరః
చిత్రో వేషస్తు కర్తవ్యో నృపాణాం నిత్యమేవ చ

నృపాలకులకు నిత్యము వేషము విచిత్రశస్త్రములు కవచము కలిగి యుండును. బద్ధతూణము ధనుర్ధర మయిన వేషము చిత్రవేషముగా నిర్మింప వలెను. ఇది సాంగ్రామిక వేషము. * * నక్షత్రోత్పాతముల శాంతి కగు మంగలవిధానము లందును నైమిత్తిక శ్రాద్ధము లందును దేవార్చనాదు లందును నాగరక సన్నివేశము లందును కేవల శుద్ధవేషమె యుండును.

ఏవమేష భవేద్వేషో దేశ జాతి వయోనుగః
ఉత్తమాధమమధ్యానాం స్త్రీణాం నృణా మథాపి చ

ఉత్తమాధమ మధ్యమ స్వభావమున నుండు స్త్రీలకు గాని పురుషులకు గాని నాటకాశ్రయ ప్రయోగము నందిట్లు వస్త్రవిధి నాచరింప వలెను. శుద్ధవేష మని సామాన్యాకారమున నిర్దేశించుట యంతయు నా యా దేశ జాతి ప్రకృత్యవస్థా రూప స్వభావాది

విశేషముల పరిశీలన పూర్వకముగా నాట్యవిదుడు సముచిత సంభావనముతో నొనరింప దగిన కార్యకౌశలమును నిర్దేశించును. "వేషో దేశజాతివయోనుగః" యను సూక్తి భావార్థ మిట్లె యున్నది. ఇంతటి యీ వస్త్రవిధి శుభకర్మలలో గాని తదన్యములలో గాని యిట్లు నానావిధము లయిన చిత్తభావావస్థల ననుసరించియె యుండు ననుట సర్వదా సంస్మరణీయము. తదతిక్రమములో నే సముజ్జ్వల వేషము కాని సముజ్జ్వలమె కాదు. సముచితమె కాదు. తదనుసరణములో సర్వము సంగతము సుందరము నగును.

## ప్రతిశిరము మకుటము

౬౫౪. తథా ప్రతిశిరశ్చాపి కర్తవ్యం నాటకాశ్రయం
దివ్యానాం మానుషాణాం చ దేశ జాతి వయః శ్రితం

ప్రతిశిరో రచన మిక నిరూపణీయము. "ప్రకృతిరూపం శిరః ప్రతిశిరః" ప్రకృత్యనురూపముగా నొనర్చు శిరమును ప్రతిశిర మని యందురు. దివ్యపురుషులకు మానుషులకు జాతి దేశ వయస్సహజము లయిన విశేషానుసారమున శిరోరచన చేయవలయును. నాటకాశ్రయ మయిన యీ రచన వారి వారి విశిష్టతను వెంటనె భాసింప జేయును. ప్రతిశిరము ప్రతిశీర్ష మను నామముతో నున్నది. ప్రతిశీర్ష విధానములు నానారూపములుగా నున్నవి. దివ్యపార్థివసంశ్రయ మయిన యీ ప్రతిశీర్షము మకుటవిధాన మయినది. దివ్య పార్థివ ప్రయోగములో మకుటము లేల నిర్మితములు కావలెను?

౬౫౫. కేశానాం ఛేదనం దృష్టం వేదవాదే యథాశ్రుతి
భద్రీకృతస్య వా యజ్ఞే శిరసశ్ఛాదనేచ్ఛయా
౬౫౬. కేశానామప్యదీర్ఘత్వాత్ స్మృతం ముకుటధారణం

వేదవాదము నందు కేశచ్ఛేదన మున్నది. శ్రుత్యనుసారమున దీక్ష ననుసరింప వలసిన వారు క్షురకర్మ చేయించు కొనవలెను. యజ్ఞమునందు భద్రముగా శిర మాచ్ఛాదనము చేసికొని ప్రవర్తింప వలెను. "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరంతి" ఎర్రని తలచుట్టులతో (పాగా) ఋత్విక్కులు సంచరింతురు. ఆయుష్కర్మగా వపనము చేయించుకొనిన పిమ్మట కేశములు దీర్ఘముగా నుండ నందున మకుట

ధారణ మావశ్యకముగా విహిత మయినది. ఈ ముకుట ధారణము దివ్యపార్థివ ప్రయోగమునం దీ విధముగా సంప్రదాయాగత మయినది. ఇట్లు సిద్ధ మయిన మకుటవిధానము త్రివిధము. దివ్యపార్థివ సంశ్రయముగా మకుటము మూడు విధములు కాగా వాని పేర్లు.

౧. పార్శ్వగత మయిన మకుటము.

౨. మస్తకశోభ కల మకుటము.

3. కిరీట రూపమున నున్న మకుటము.

దేవ గంధర్వ యక్ష రక్షః పన్నగులకు పార్శ్వమాలితో నుండు మకుటముల నేర్పఱచ వలయును. అవియు ననేకవిధములుగా నున్నవి. ఉత్తమ మానవులకు దివ్యులకు కిరీటయుత మకుటములు కూర్పవలెను. మధ్యములకు సామాన్య మయిన వేష్టనము చాలును. కనిష్ఠులకు తల నంటికొని యుండు మాలిరచనమె యుక్తము. వారు సామాన్యముగా శీర్ష మాలితో నుండుటయు కలదు. వారికి పాగా లక్కఱ లేదు. నరాధిపుల మస్తకమున మకుటము లేర్పరుప వలయును. సిద్ధ విద్యాధర చారణులకు నాట్యప్రయోక్తలు కేశములనె ముడులుగాకూర్చి మకుటముల రచింప వలెను. అప్పుడు వారు గ్రంథిమ కేశమకుటు లగుదురు. రక్షో దానవ దైత్యులకు పింగ కేశములు పింగలనేత్రములు హరితవర్ణము లయిన శ్మశ్రువులు మకుటాస్యము లేర్పరుప వలెను. వారిలో నుత్తము లగు వారలకు పార్శ్వమాలి మకుటములుకూర్పదగును.

సేనాపతికి యువరాజునకు మహామాత్రుల కర్ధమకుట యోజనము యుక్తము. అమాత్య కంచుకి శ్రేష్ఠి పురోధసులకు జల్తారు పట్టవేష్టనము కల ప్రతిశీర్షములు కూర్పవలెను. పిశాచోన్మత్త భూతగణములకు సాధకులకు తాపసులకు ప్రతిజ్ఞ నిస్తరింపని వారలకు శిరము లంబకేశముగా నుండవలెను. బౌద్ధులకు శ్రోత్రియులకు జైన సాధువులకు పరివ్రాజకులకు దీక్షాయుక్తులకు యజ్ఞదీక్షాన్వితులకు శిరోముండనము కర్తవ్యము. బ్రహ్మచారులకు వ్రతానుగత మయిన శిర ముండును. ముండన మేని యుండును. కుంచిత కేశము లేని యుండును. లంబకేశముగా నయిన శిర మేర్పరుప వచ్చును. అఱతయు వారలకు

ప్రతానుగతము. ప్రతములకు సంకేతితమయిన శిరఃకర్మను వారను
సరింతురు. ధూర్తులు రాత్ర్యుపజీవనులు శృంగారచిత్తులు నగరపురు
షులు కుంచితమూర్ధజులై యుందురు. బాలురకు త్రిఖండభూషిత
మయిన శిరము సుందరము. త్రిఖండములు చూలికలు జులపాలు కా
వచ్చును. మునిశిరము జటామకుట బద్ధము. చేటులకు త్రిశిఖమేని
ముండమేని యుండును. విదూషకుని శిరము బట్టతల. అతడు ఖలతి.
కాకున్న కాకపద మేని యాతని శిరమునకు శోభ. కాకపద మనుట
కాకపక్షముల వలె నాతనికి కేశవిచ్ఛేదన మొనర్ప వలెను.

౬౫౭. శేషాణా మర్థయోగేన దేశ జాతి సమాశ్రయం
శిరః ప్రయోక్తృభిః కార్యం నానావస్థాంతరాశ్రయం

మిగిలిన వారల కందరకు కార్యావసరము ననుసరించి నానా
వస్థాంతరాశ్రయ మయిన దేశ జాతి సమాశ్రయ మగు శిరఃకర్మను
ప్రయోక్తలు గుర్తించి యేర్పఱుప వలెను.

## బుద్ధియోగము

౬౫౮. భూషణై ర్వర్ణకైః వస్త్రైః మాల్యైశ్చైవ యథావిధి
ఏవం నానాప్రకారైస్తు బుద్ధ్యా వేషాన్ ప్రకల్పయేత్

అవస్థారూపానుగుణము లయిన నానాప్రకారము లగు భూష
ణములచే వర్ణకములచే వస్త్రములచే మాల్యములచే యథావిధాన
ముగా వేషముల రచింప వలెను. అంతట బుద్ధియోగము ముఖ్యము.
నాట్యాయిత మయిన బుద్ధిస్పందము ననుసరించి సర్వరచన మొనర్ప
దగును. ఒకొక్కప్పు డొక్కొక విధముగా స్వస్పంద సుందర మయిన
బుద్ధ్యున్మేషము కలుగును. అందును సంస్కారసంయుత మయిన బలము
నిదానము. దాని ననుసరించిన బుద్ధ్యున్మేషము నుపయోగించుకొన
వలయును.

## ప్రకృతిసంభవము

౬౫౯. పూర్వం తు ప్రకృతిం స్థాప్య ప్రయోగ గుణ సంభవాం
స్త్రీణాం వా పురుషాణాం వాప్యవస్థాం ప్రాప్య తాదృశీం

౬౬౦. సర్వే భావాశ్చ దివ్యానాం కార్యా మానుషసంశ్రయాః
తేషాం చానిమిషత్వాది నైవ కార్యం ప్రయోక్తృభిః

> ౬౬౧. ఇహ భావరసాశ్చైవ దృష్టిభిః సంప్రతిష్ఠితాః
> దృష్ట్యైవ స్థాపితో హ్యర్థః పశ్చాదంగైర్విభావ్యతే
> ఏవం జ్ఞేయాంగరచనా నానాప్రకృతిసంభవా

ప్రయోగ గుణ సంభూతి కల ప్రకృతిని ముందుగా నిశ్చయించుకొన వలెను. స్త్రీలకు గాని పురుషులకు గాని మొదటగా నట్టి యవస్థ ననుసరించియె ప్రకృతి యుండును. దివ్యులకు సంబంధించిన సర్వభావములు మానుష సంశ్రయములుగా చేయవచ్చును. నాట్యప్రయోక్తలు దివ్యులకు సంధింబంచిన దేవాసాధారణము లయిన యనిమిషత్వాదులను మాత్రము మానుషాశ్రయముగా నిబంధింప వలదు. ఈ నాట్యప్రక్రియలో భావములు రసము లన్నియు దృష్టివిధానములచే ప్రతిష్ఠితము లగును. అర్థగుణ మంతయు దృష్టిస్థాపిత మయున యనంతరమె యది యంగరచనా విధానములచే విభావితము కాగలదు. నానాప్రకృతి సంభవ మయిన యంగరచన సర్వ మీ విధముగా నుండుటను సావధానముగా గుర్తించు మనది.

## స జీ వ ప్ర యో గ ము

ఇదివరలో సజీవ మజీవ మని విభాగము నిర్దేశించితిమి. అందు సజీవవిధానము లక్షణముతో నిరూపింప వలసి యున్నది. రంగమున ప్రాణుల ప్రవేశము సజీవమను సంజ్ఞతో నున్నది. "యః ప్రాణినాం ప్రవేశో నై సజీవ ఇతి సంజ్ఞితః" సజీవప్రవేశము మూడు విధములు. చతుష్పదము ద్విపదము అపదము నని, చేతనసంచలనమున రంగశోభ నిచ్చి సహృదయుల రంజింప జేయుట కీ విధాన ముపకరించును.

> ౬౬౨. ఉరగానపదా న్విద్యా ద్ద్విపదాన్ ఖగమానుషాన్
> గ్రామ్యా అరణ్యాః పశవో విజ్ఞేయాః స్యుశ్చతుష్పదాః
> ౬౬౩. యే తే తు యుద్ధసంపేటై రుపరోధై స్తథైవ చ
> నానాప్రహరణోపేతాః ప్రయోజ్యా నాటకే బుధైః

సర్పము లపదములు. వానికి పాదములు లేవు. పక్షులు మానవులు ద్విపదులు. గ్రామారణ్యము లం దుండు పశువులు చతుష్పదములు. నాటకప్రయోగమునందు యుద్ధసంఫేటములతో నగరోపరోధ విధానములతో సజీవప్రయోగ మొనరింప వచ్చును. యుద్ధోపరోధము

లందు సజీవవ్యక్తులకు నానాప్రహరణముల సంబంధ ముండవలెను. ఆ యాయుధము లన్నియు యుద్ధముల కుపయోగించు వాని యాకార ములతో నుండవలయును. నాగాస్త్ర మిచ్చినచో సర్పాకృతి కలదాని కూర్పవలెను. అట్లే నృసింహాస్త్రమునందు నృసింహాకృతి యుండుట సమ్మతము.

## నాట్యోపకరణములు

పురుషుల ప్రమాణానుసారమున నాయా యాయుధము లుండుట యపేక్షితము. నాట్యోపయోగు లగు నాయుధముల వర్తనము నీ విధముగా గుర్తింప వలెను. ఈ వర్తన విధాన మంతయు పుస్తప్రమాణానుసారముగ యుక్త్యనుసారముగనె యుండును.

౧ భిండి – పండ్రెండు జేనెల (తాలముల) ప్రమాణము
కుంతము – దశతాలములు
శతఘ్ని – ఎనిమిది తాలముల ప్రమాణము
శూలము – ,, ,,
౫ తోమరము – ,, ,,
శక్తి – ,, ,,
ధనువు – రెండు హస్తముల యాయామము
శరము – నాలుగు జానలు
గద – ,, ,,
౧౦ వజ్రము – నాలుగు జానలు
అసి – ఇరువది నాలు గంగులములు
చక్రము – ద్వాదశాంగులకము
ప్రాసము – ఆరంగులములు
పట్టసము – ,,
౧౫ దండము – ఇరువది యంగులములు
కంపణము – ,,
సబలము – షోడశాంగులవిస్తీర్ణము
ఖేటకము – ముప్పది యంగులములు ప్రమాణము

౧౯ జర్జరము - ౨౦ దండకాష్ఠము - ౨౧ ప్రతిశీర్షకము
౨౨ ఛత్రము - ౨౩ చామరము - ౨౪ ధ్వజము
౨౫ భృంగారము

ఈ యుపకరణములు సామాన్యాకారముగ నిర్దిష్టము లయినవి. వీనిలో చక్రము ఖడ్గాది యుద్ధములలో నపవారణముగా నుండును. జర్జర దండకాష్ఠములకు వేరుగా స్వరూప నిర్వచన మున్నది. ప్రతిశీర్షము పుస్తకృత మయిన శీర్షము. అట్టలు మొదలగు వానితో నిర్మించిన శిరము, ఛత్ర చామర ధ్వజములు ప్రసిద్ధములు, భృంగార మనునది కూజావంటిది. ఒకవాద్యముగా నుపయోగించునది, కొన్ని యాయుధములకు ప్రమాణము నిర్దేశించుటలో "తాల" శబ్ద మున్నది. అది మాన (కొలత) వాచక మయిన పదము. చాచిన యంగుష్ఠము నడిమి వ్రేళులకు నడిమి నున్న భాగము తాలసంజ్ఞ కలది యని నృత్త్యవిదు లందురు. "అంతరాలం యదత్ర స్యాత్ ప్రసృతాంగుష్ఠమధ్యయోః, తదత్ర తాలసంజ్ఞం స్యాదితి నృత్త్యవిదో విదుః"

౬౬౪. యత్కించిన్మానుషే లోకే ద్రవ్యం పుంసాం ప్రయోజకం
యచ్చోపకరణం సర్వం నాట్యే తత్సంప్రకీర్తితం
౬౬౫. యద్యస్య విషయప్రాప్తం తేనోహ్యం తస్య లక్షణం

మానవలోకములో మానవులకు ప్రయోజకము లయిన వస్తువు లేవేవి కలవో యవి యన్నియు నీ నాట్యమున నుపకరణములుగా నుండునని యభ్యూహింప వలెను. కేవల మూహాసారము తగదు. ఊహ్యము ననుసరించియు పరిపూర్ణలక్షణము గుర్తింప వలెను. ఉపజీవ్య పూర్ణలక్షణము గుర్తించిన సర్వ మవగత మగును. ఖడ్గలక్షణము పూర్ణముగా గుర్తింప నది యుపజీవ్య మని తెలియగా దాని లోహాది నిర్మితత్వ మవశ్యము గోచర మగును. కావున నాట్యమున నుపయోగించు నూహాపోహముల ననుసరించి నాట్యోపకరణముల నిశ్చయించు నది.

## జ ర్జ ర ల క్ష ణ ము

జర్జర దండకాష్ఠముల స్వరూపలక్షణముల గుర్తింతము. మాహేంద్ర ధ్వజ విషయమున విశ్వకర్మ నిర్దేశించిన లక్షణముల

నాధారము చేసికొని దారుకర్మ ప్రక్రియను బట్టి జర్జరమును నిష్పాదింప వలెను. జర్జర మొక వృక్ష ప్రకృతికము కావలెను. స్వయంప్రరోహ మయినను సముచితము. వృక్షయోని ప్రరోహముల కన్నను వేణువె శ్రేష్ఠము. మహేంద్రధ్వజమునకు విశ్వకర్మ యనేకభేదములను జెప్పినాడు. ఈ లక్షణము భావింపుడు.

౬౬౬. శ్వేతభూమ్యాం తు యో జాతః పుష్యనక్షత్రజస్తథా
సంగ్రాహ్యో వై భవేద్వేణుర్జర్జరార్థే ప్రయత్నతః

౬౬౭. ప్రమాణమంగులానాం దు శతమష్టోత్తరం భవేత్
పంచపర్వా చతుర్గ్రంధిః తాలమాత్రస్తథైవ చ

౬౬౮. స్థూలగ్రంధిర్న కర్తవ్యో నశాఖీ న చ కీటవాన్
న కృమిక్షతపర్వా చ న హీనశ్చాన్యవేణుభిః

శ్వేతభూమిలో పుట్టిన వేణువును జర్జరమునకై సప్రయత్నముగా పుష్యనక్షత్రజాతముగా సంగ్రహింప వలెను. నూటయెనిమిది యంగులములు దాని ప్రమాణము. అయిదు పర్వములు నాలుగు గ్రంధులు నుండవలెను. గ్రంధి గ్రంధి యంతరాలము తాలమాత్రము. జానెడు. లావు కణుపు లుండరాదు. కొమ్మలు రెమ్మ లుండరాదు. కీటము లుండరాదు. పర్వములను క్రిములు తొలిచి కొట్టివేయ రాదు. అన్యవేణు సంఘర్ష మున్నదై హీనముగ నుండునది కారాదు. ఇతర వేణువుల యొత్తిడి యున్నచో నవయవముల పూర్ణత రాదు. అట్టిది జర్జర మగుట యిష్టము కాదు. జర్జర సంపాదనమునకై యత్నించు నాతడు వెదురు దరి చేరి మధు సర్పిస్సర్షపములచే సేచన మొనర్ప వలెను. మాల్యధూపము లీయ వలెను. ఇట్లు వేణు వుపాసించిన పిమ్మట జర్జరార్థమై గ్రహించునది. మాహేంద్ర ధ్వజమని విహితము లయిన విధి క్రమములు ప్రకృత జర్జరమునకు నేర్పఱచ వలెను. పుష్యవేణు సమాశ్రయ మయిన విధి యున్నది. క్రమ మున్నది. పుష్యవేణు వనుట వేణువు లోని విశేషము.

## పుష్యవేణువు

౬౬౯. భవేద్యో దీర్ఘపర్వా తు తనుపత్రస్తథైవ చ
పర్వాగ్రతండులశ్చైవ పుష్యవేణుః స కీర్తితః

ఇట్టిదిది పుష్యవేణువు. ఇందు పర్వములు దీర్ఘములు. పత్ర ములు తక్కువ. పర్వాగ్రమునందు వర్తులముగా నుండును. పర్వాగ్ర తండులత దీని లక్షణము. (వెదురు బియ్యము. బియ్యము కల వెదురు లోకప్రసిద్ధి) పుష్యవేణువు గట్టిగా బరువుగా సారయుతముగా నుండు నందురు. ఈ చెప్పిన దంతయు జర్జరమునకు సంబంధించిన ప్రమాణా నుసారి విధి.

## దండకాష్ఠము

ఇక దండకాష్ఠ మున్నది. అది విదూషకుడు ధరించును. ఆత డప్పుడు దండకాష్ఠ మెత్తుటలు రూపకము లందు ప్రసిద్ధము. కపిత్థ–బిల్వ–వంశముల నుండి దండకాష్ఠము నిర్మింతురు. దండకాష్ఠము త్రిభాగవక్రముగా నుండవలెను. సర్వమిది లక్షణాన్వితరీతి. నాట్యోప కరణము లన్నియు లక్షణసంయుతములై కావలెను. సురూపములు విరూపము లరూపములు సలక్షణములై యగును. అలక్షణము నాట్య కోశమున లేదు. ఇది లక్షణము.

౬౭౦. కీటై ర్నోపహతం యచ్చ వ్యాధినా న చ పీడితం
మందశాఖం భవేద్యచ్చ దండకాష్ఠం తు తద్భవేత్

కీటోపహతము కారాదు. వ్యాధిపీడితము కాకూడదు. పురు గులు తొలచరాదు. శాఖలు స్వల్పముగా నుండవలెను. అట్టిదె దండకాష్ఠము కాదగును. ఇట్టి లక్షణసముపేతము లయిన జర్జర దండకాష్ఠములై యుక్తములు. ఈ లక్షణహీనము జర్జరము కాని దండకాష్ఠము కాని తగదు. అట్టి వాని స్వీకరించిన నాట్యమున నుప చయము లేదు. అపచయమె కలుగును. ఆ యపచయ మేని యల్ప ముగా నుండదు. ఇది నిశ్చయము.

## ప్రతిశీర్షము

శీర్షవిభాగ మొక దున్నది. దీని ప్రతిశీర్ష మన వచ్చును. నాట్యమున మాయాశిరములు ప్రదర్శింపవలసి యున్నప్పుడు ద్విశిరః త్రిశిరః ప్రదర్శనము లందు నిది యుపకారి. ఒకప్పుడు నిజశిర మాచ్ఛాదించుట శిరోంతరము ప్రదర్శించుట యుండును. అప్పుడు శీర్షవిభాగ మపేక్షితము. కేవల మిట్టి ప్రతిశిరములై కాదు. ప్రతి

పాదములు ప్రతిహస్తములు నిట్టివి కలవు. వాని యందు నిదె కల్పము. శీర్షవిభాగమునకై ప్రయత్నపడి ఘటి (కిటి) నిర్మాణింప వలెను. ముప్పది రెండంగులములు దాని ప్రమాణనిర్దేశము. బిల్వ కల్కముతో ఘటి నిర్మాణింపవలెను భద్రముగా దాని సిద్ధపఱచ వలెను. పాకమునకు దెచ్చిన మారేడుగుజ్జును మారేడురసమును కూర్చి ఊకతో బూడిదతో ప్రతిశీర్షకము నిర్మాణింప వలెను. చెట్టు బెర డిం దుపయోగించును. మారేడు బద్దలతో కూర్చి గుడ్డలు కూరి కూర్చి ఛిద్రములు లేకుండునట్లు ఊకపొడి భస్మములతో పూడ్చ వలెను. ఇది యంతయు ఘటీసంయోజనము. ఇది లావుగా నుండ రాదు. వంగి పోరాదు. చిన్నది కారాదు. పొడవు కారాదు. స్థూల మయిన బరువగును. ఆనత మయిన పేలవ మగును. ఇట్టి దీని, నెండలో నెండబెట్టి బాగుగా తడియారిన పిమ్మట నవయవచ్ఛిద్రో త్పాదనమునకై యథావిధి విహితకర్మ ననుసరించి ఛేద్య మొనరిం తురు. మంచి తీక్ష్ణశస్త్రముతో నర్థమర్థముగా విభజింప వలెను. స్వ స్వ ప్రమాణ నిర్దేశానుసారమున లలాటకోణము లేర్పఱచ వలెను. లలాట మర్ధాంగుల మేర్పఱచునది, ఛేద్యము షడంగులము కూర్చు నది. ఛేద్య మర్ధార్ధాంగులముగా నుండవలెను. కటములందు రెండంగులము లుండును. కటాంతమున కర్ణనాలమునకు ఛేద్యము మూడంగులములు. కర్ణవివరము మూడంగులములు. అవటు వన దగిన కర్ణశష్కులి పం డ్రెండంగులములతో సమముగా నుండవలెను. ఇది యంతయు ఘటీచ్ఛేద్యము నందలి విహిత విధానము.

౬౩౧. తస్యోపరిగతాః కార్యా ముకుటా బహుశిల్పజాః
నానారత్నప్రతిచ్ఛన్నా బహురూపోపశోభితాః

ఈ విహితప్రతిశీర్షమున కుపరిగతముగా బహుశిల్పజము లయిన ముకుటములు నిర్మింప వలెను. నానారత్నములతో కూర్పుపొంది యుండునట్లు బహురూప శోభితము లగునట్లు ముకుటములు నిర్మింప వలెను. ఇట్టి వన్నియు వివిధాశ్రయములు.

## ఉపకరణసృష్టి

౬౩౨. తథోపకరణానీహ నాట్యయోగకృతాని వై
బహుప్రకారయుక్తాని కుర్వీత ప్రకృతిం ప్రతి

౬౭౩. యత్కించిదస్మిన్ లోకే తు చరాచరసమన్వితే
విహితం కర్మ శిల్పం వా తత్తూపకరణం స్మృతం
౬౭౪. యద్యన్య విషయం ప్రాప్తం తత్తదేవాభిగచ్ఛతి
నాస్త్యంతః పురుషాణాం హి నాట్యోపకరణాశ్రయే
౬౭౫. యద్యేనోత్పాదితం కర్మ శిల్పయోగక్రియాపి వా
తస్య తేన కృతా సృష్టిః ప్రమాణం లక్షణం తథా
౬౭౬. యా కాష్ఠయంత్రభూయిష్ఠా కృతా సృష్టిర్మహాత్మనా
న సాస్మాకం నాట్యయోగే, కస్మాత్? ఖేదావహా హి సా

ఆ యా ప్రకృతివిశేషము ననుసరించి నాట్యోపకరణములను నిర్మింప వలెను. అవి యన్నియు నాట్యయోగ కృతములై యుండుట బహుప్రకారములతో నుండుట యావశ్యకము. చరాచర సమన్విత మయిన యీ లోకమున విహిత మగు నే కర్మ కాని శిల్పము కాని నాట్యోపకరణమె యగును. కర్మశిల్పము లందు విహితత్వ మనునది యావశ్యకము. అదియె లక్షణయుక్తత. నాట్యోపకరణముల స్వభావాశ్రయ మయిన విషయమునం దంతమనునది యుండదు. పురుషబుద్ధులు బహుభావములై యనంతముగా నుపకరణవిషయముల నిర్మింపగలవు. పురుషబుద్ధిలో నేది విషయమగునో యది సర్వము విషయ మగును. నాట్యధీకు లట్లె వాని గుర్తింతురు. ఎవ రే కర్మ నుత్పాదింతురో యది వారి సృష్టి. దాని ప్రమాణము లక్షణము వారె నిర్దేశింప గలరు. ఇట్టిదె శిల్పయోగక్రియయు. ఏవ రే శిల్ప ముత్పాదింతురో యది వారి సృష్టి. తత్ప్రమాణము తల్లక్షణము తదధీనము. మహాత్ముడు విశ్వకర్మ కాష్ఠయంత్ర భూయిష్ఠముగా సృష్టి యొనర్చినాడు. తన సృష్టి కొక పరాకాష్ఠ చూపినాడు. ఆతని నిరతిశయకృషి మహాత్తరము. అతని దర్శనము నాట్యభూమి. కాని యీ నాట్యయోగమున మా కది యక్కర లేదు. మహాత్మసృష్టి యేల స్వీకార్యము కాదందురు. కాబోలు! అది మనకు ఖేదావహము. అంతట వానిని మన మెట్లు చేయుదుము?

భా వా శ్ర య త

౬౭౭. యద్ద్రవ్యం జీవలోకే తు జీవలక్షణ లక్షితం
తస్యానుకృతిసంస్థానం నాట్యోపకరణం భవేత్

౬౭౮. ప్రాసాదగృహయానాని నానాప్రహరణాని చ
న శక్యం తాని వై కర్తుం యథోక్తానీహ లక్షణైః
౬౭౯. లోకధర్మీ భవేత్త్వన్యా నాట్యధర్మీ తథాపరా
స్వభావో లోకధర్మీ తు విభావో నాట్యమేవ హి

ఈ జీవలోకమునందు జీవలక్షణలక్షిత మయిన ద్రవ్యము ననుకరించి తగిన యవయవసంస్థాన ముండునటుల కూర్చినచో నాట్యోపకరణ మగును. ప్రాసాదములు కాని గృహములు కాని యానములు కాని నానావిధములగు ప్రహరణములు కాని లక్షణసహితములై యున్నప్పుడు వాని నిర్మించుట శక్యక్రియ కాదు. లోకధర్మి యొకటి యున్నది. నాట్యధర్మి మరి యొకటి యున్నది. స్వభావ మంతయు లోకధర్మి. నాట్యధర్మి యంతయు విభావాత్మకము. భావనామాత్ర సారము. లోకగత మంతయు భావగత మయినచో సమాస్వాద్య మగు స్వాత్మసంవేదనములో విభావమై భాసించును గావున నాట్యధర్మి యగును. నాట్యధర్మి స్వభావముతో నుండదగు నాట్యోపకరణము లత్యంతము లోకస్వభావానుసారులుగా నుండవలె నన్న గ్రహము తగదు. విభావితము సర్వము నాట్యమున నుపకరణము కాగలదు.

## ఉ ప క ర ణ ని ర్మా ణ ము

నాట్యోపకరణములను కేవల మినుముతో జేయ దగదు. ఇతరలోహముల గూడి సారమయముగను నుండరాదు. అట్లుండు నాట్యోపకరణము గురు వగునని ఖేదకర మగునని నాట్యాభిజ్ఞు లనిరి. కాష్ఠములతో జతుకాష్ఠములతో చర్మములతో వస్త్రములతో లక్క పుడకలతో వెదురుబద్దలతో లఘుకర్మలుగా నాట్యోపకరణముల నిర్మింప దగును. ఇట్లు నిర్మించినచో లాఘవమున క్రియ లన్నియు సంపన్నము లగును. చర్మవర్మధ్వజములు శైలప్రాసాదములు దేవతా గృహములు హయవారణయానములు విమానములు గృహములు మొదలగు సర్వవిధము లయిన నాట్యోపకరణములును మొదట వేణుదలములతో నిర్మింప దగును. భావసమాశ్రయము లయిన కృతు లన్నియు నిట్లుండ వచ్చును. అట్లు వేణుదల నిర్మితములను వస్త్రము

-లచే నాచ్ఛాదించి వర్ణసంయోజనము చేసి సారూప్యము రాబట్టునది. వస్త్రములు తగినన్ని యనుకూలముగా లభింపక పోయినచో వస్త్రము లచే నొనరింపదగు క్రియను తాలపత్రములచే నొనర్పవచ్చును. శ్లక్ష్ణ ములుగా నుండు కిలింజములచే నిర్మింపవచ్చును. ఇట్లు తృణ వేణు దలాదులచే జతుభాండక్రియలచే నానారూపము లయిన ప్రహరణము లను నిర్మింప దగును. నాటకమునం దిట్లు చేయుట యుక్తము.

౬౮౦. ప్రతిపాదం ప్రతిశిరః ప్రతిహస్తం ప్రతిత్వచం
తృణైః కిలింజైర్భాండైర్వా సారూప్యాణి తు కారయేత్

౬౮౧. యద్యస్య సదృశం రూపం సారూప్య గుణ సంభవం
మృణ్మయం తత్తు కృత్స్నం తు నానారూపం తు కారయేత్

చర్మకాష్ఠములతో తృణవేణుదలములతో జతుభాండములతో ప్రతిశీర్షములను నానారూపములుగా నిర్మించుట నిర్దిష్ట మయినది. ప్రతిశీర్షములను నిర్మించిన విధముననే ప్రతిపాదములను ప్రతిహస్తము లను ప్రతిచర్మములను తృణకిలింజభాండములతో రూపసరూపము లనుగా జేయదగును. భాండము లనుట యలాబు దలాదులని భావము. భాండ మసార మయిన లఘుదారువు. బెండు. "భేండ"ముకా వచ్చును. ఎయ్యదెద్దానికి సారూప్యమున గుణసంభూతి కలదై సదృశ రూపముతో నుండునో యా విశేషము గుర్తించి యా రూపమును నానారూపముగా మృణ్మయముగా సమగ్రముగా నిర్మింప వచ్చును. సొరకాయ డిప్పలు, వస్త్రములు, మైనము, లత్తుక, యభ్రదలము మొదలగు వానితో నవిసి చెట్టు మారేడు చెట్టు శణముల నుండి సంపాదించిన యంశములతో వివిధనాగములను నిర్మింప వలెను. ఇట్లె భాండ వస్త్ర మధూచ్ఛిష్టములతో నానాకుసుమజాతులను వివిధ ఫలములను నిర్మింప వచ్చును. ఈ ద్రవ్యములతో బాటుగా నీలీరాగ మభ్రపత్రములతో కూర్చి మణులగూడ నిర్మించునది. రత్నములుగ నిర్మించిన కృత్రిమమణుల కుపాశ్రయముగ నెండిన బెండు కూర్ప వలెను. పూర్వము నిరూపించిన వివిధము లయిన మకుటములు దివ్య ములు కాని మానవములు కాని యిట్లె చేయునది. ఆ మకుటము లభ్రపత్రసముజ్జ్వలములై మణివ్యాలశోభితములై యుండును ఇవి

యిట్లే యుండు ననుటలో నియమ మేమి? నాట్యప్రయోగము నిర్వ
హించు నాచార్యుని బుద్ధియె యిందు ప్రమాణము. ఆతడు భరతుని
వలె చిరంతనబుద్ధి. ప్రత్యుత్పన్నమతియు కావలెను కదా!

## ఆ చా ర్య బు ద్ధి

౬౮౨. స శాస్త్రప్రభవం కర్మ తేషాం హి సముదాహృతం
ఆచార్యబుద్ధ్యా కర్తవ్య మూహాపోహప్రయోజితం

ఈ చెప్పిన వాని విషయమున వాని నిర్మాణమున నియత
ముగా నొక శాస్త్రజన్య మయిన కర్మయోగ మనునది లేదు. అట్టి
దానిని మే మిందు జెప్పుట లేదు. సర్వమాచార్యుడు స్వబుద్ధితో
నూహించి పరిశీలించి చేయును. అంతయు నాతని యూహాపోహ
ప్రయోజిత మగును. అట్లె సాధిత మగును. సామాన్యముగా నిది
యంతయు మానవక్రియా యోగము. మానవులకు దీని నిట్లు నిర్దే
శించితిమి. మానవు లందరు నాట్యవిధానములం దీ రీతుల ననుసరిం
తురు గావుత! మానవు లల్పబలులు. అల్పశక్తులు. అపశక్తులు.
వాగంగచేష్టితములు వారిలో యథాసంగతములుగా నుండక పోవ
చ్చును. రాను రాను పోను పోను మానవు లల్పబలు లగుదురు.
కావునను వారికి తగునట్లు చెప్పితిని. సర్వకాంచన విభవములతో
మానవులుండ జాలరు. వారి మకుటములు కాని భూషణములు కాని
సర్వవిధరత్నములతో నుండజాలవు. ఒకప్పు డెవరేని పట్టుదల గలిగి
నాట్యాహార్యములందు శ్రద్ధపట్ట వచ్చును. వారు రత్నసువర్ణముల
నాయోజనము చేయవచ్చును. కాని నాట్యరహస్య మొకటి యున్నది.

౬౮౩. యుద్ధే నియుద్ధే నృత్తే వా వృష్టివ్యాపారకర్మణి
గురుభావావసన్నస్య స్వేదో మూర్ఛా చ జాయతే
౬౮౪. స్వేదమూర్ఛాక్లమార్తస్య ప్రయోగస్తు వినశ్యతి
ప్రాణాత్యయః కదాచిచ్చ భవేద్వ్యాయతచేష్టయా
౬౮౫. తస్మాత్తామ్రమయైః పత్రైరభ్రకైః రంజితై రపి
భేండైరపి మధూచ్ఛిష్టైః కార్యాణ్యాభరణాని తు

యుద్ధము, నియుద్ధము మొదలగు వాని యందు సువర్ణరత్న
ములు కల మకుటములు భూషణములు యుక్తములు కావు. నృత్తము

నందును తగవు. వస్త్రాసమయ వ్యాపారమున గూడ యుక్తములు కావు. అట్టియప్పు డట్టివాని ధారణము ఖేదావహ మగును. భార మగా తోచును. ఆ గురుభావముచే నటులు శ్రమపడుదురు. స్వేదము పుట్టును. మూర్ఛ కలుగును. స్వేదమూర్ఛాక్లమార్తు లయినచో ప్రయోగము సరిగా నుండదు. అది చెడి పోవును. ఒక ప్పుడు చేష్టాతిశయమున ప్రాణాత్యయ మేని కలుగ వచ్చును. తామ్ర పత్రములు అభ్రకములు భేండములు లత్తుకలు మైనములు కూర్చి రంజన మొనర్చి యాభరణముల నిర్మింప వలయును. దీనివలన నటు లకు శ్రమ యుండదు. బాధ కలుగదు. ప్రయోగము చెడదు.

౭౮౬. ఏవం లోకోపచారేణ స్వబుద్ధివిభవేన చ
నాట్యోపకరణానీహ బుధః సమ్యక్ప్రయోజయేత్

౭౮౭. న భేద్యం నైవ చ ఛేద్యం న ప్రహర్తవ్యమేవ చ
రంగే ప్రహరణైః కార్యం సంజ్ఞామాత్రం తు కారయేత్

౭౮౮. అథవా యోగశిక్షాభిః విద్యామాయాకృతేన వా
శస్త్రమోక్షః ప్రకర్తవ్యో రంగమధ్యే ప్రయోక్తృభిః

లోకమర్యాద ననుసరించి స్వబుద్ధివిభవమును బట్టి బుధు డీ విధముగా నాట్యోపకరణముల నిట్లు ప్రయోగించునది. భేద్యము కాని ఛేద్యము కాని రంగమున నుండరాదు. రంగమున ప్రహార మొనరింపరాదు. ప్రహ ములు తన్నుటలు కొట్టుటలు మొదలగునవి సంజ్ఞామాత్రముగనె యుండవలెను. ఇది యంతయు సామాన్యప్రయోగ నటులకు సంబం ధించిన విధానము. సుప్రభావు లయిన ప్రయోక్త లనుసరింపదగినది మరియొకటి కలదు. యోగశిక్షారీతులతో విద్యా మాయా రీతులతో రంగమధ్యమున ప్రయోక్తలు శస్త్రమోక్ష మొనరింప వచ్చును. ఇంత మాత్ర మిప్పుడు నిరూపించితిమి. ఇంకను నానాప్రకారములు కలవు. అనేకాయుధాభరణములు కలవు. . వాని నన్నిటి నిట నిరూ పింప లేదు. వానిని లోకము ననుసరించి గ్రహించునది.

ఇప్పటి కిది యంతయు నాహార్యాభినయము. దీని నిప్పటి కింతగా సంగ్రహముగా చెప్పితిమి. హస్తలాఘవాదివిద్యలు చక్షుర్బంధాది

(కనుకట్టువిద్య) విధానములు నాహార్యాభినయమున యథాసంభవ ముగా ప్రాతిభము కల ప్రయోక్త లనుసరింతురు. అభినయవిధానమున వక్తవ్యశేష మున్నది. అది సామాన్యాభినయాత్మకము. ఇక దాని విస్తరింప వలసి యున్నది.

సామాన్యాభినయ చిత్రాభినయ స్వరూపము లంతరాకృతిలో నభినయమునకు రూప మందించు ఆంగికాభినయధర్మముల నపేక్షించును. నృత్తహస్తములు, గతిప్రచారములు, కరణాంగహారములు, పిండేరేచకములు పూర్వనిరూపితము లన్నియు నాంగికార్థవివేక సాపేక్షములు. అట్లే రసభారతిలో, భావచక్రములో, నాటకమీమాంసలో, దశరూపశరీరములో, లాస్యాంగములలో, నభినేయకావ్యమున, వృత్తివివేకమున నంతట ఆంగికాభినయ ధర్మ మర్మ పరిజ్ఞానము పరమావశ్యకము. అభినయచతుష్టయము పరస్పరసంబంధశోభాస్పదము. అందునవె విషయవివేకము లన్నియు ప్రకీర్ణసంకీర్ణములై యుండును. ఖండలకార్థముల పరిజ్ఞాన మఖండార్థమహార్థముల సమన్వయగతికి సహాకరింప గలదు.

యస్య సంకల్పమాత్రేణ విశ్వమహార్యమద్భుతం
తం మానసమహామూర్తిం వందే గిరిసుతామపి